# అమ్మ

*(Translation to Maxim Gorky's 'Mother')*

అనువాదకులు :

శ్రీ క్రొవ్విడి లింగరాజు

దేశికవితా మండలి

గవర్నరుపేట : బెజవాడ

111

# సమర్పణము

అమ్మవలె మానవ స్వాతంత్ర్యం కోసం అఖండమైన కష్టనష్టాలకోర్చినట్టియు, తమ భర్తలను, పుత్రులను దేశసేవ కర్పించినట్టియు వీరమాతలకు

—అనువాదకుడు.

IV

# అనువాదకుని మనవి

'అమ్మ' తృతీయ ముద్రణాన్ని ఆంధ్రలోకాని కర్పించ గలిగినందుకు సంతోషిస్తున్నాను. ఆదర్శ గ్రంథమండలి వారిచే మొదట ప్రచురణమైన కొద్ది దినాలకే 'అమ్మ' నిర్బంధము పాలుకావలసివచ్చింది. చిరకాలము చెరసాలలోనుండి కాంగ్రెస్ మంత్రివర్గము పుణ్యమా యని బయటపడింది. 'అమ్మ' చెర సాలలో నున్నను ఆంధ్రుల ఆదరణను అమితముగా అనుభ వించింది. ఎందరో శ్రమజీవులయందు ఆశాజ్యోతిని వెలిగిం చింది. చెరసాలయందున్నప్పుడే ఇట్టి ఆదరణనుపొందిన 'అమ్మ' నేడు మరింత ఆప్యాయంగా ఆంధ్రలోకము ఆదరిస్తుందని నమ్ముతున్నాను.

—— క్రొవ్విడి లింగరాజు

# V

# తొలిపలుకు

20 వ శతాబ్దం ప్రారంభంలో ప్రపంచాన్నంతటినీ ఆశ్చర్యపరచింది రష్యా. మానవసౌఖ్యం కోసం పాటుపడే విషయాలన్నిటిలోనూ రష్యా మన్ని మించిపోయింది. ప్రపంచంలో యెన్నడూ యెక్కడా యెరుగనటువంటి మహత్తరమైన జీవితనాటకం అక్కడ జరిగింది............మానవసౌఖ్యం కోసం, స్వేచ్ఛకోసం అనేకదేశాల్లో అనేకమంది అనేక సాహసకృత్యాలు చేశారు. గొప్పగొప్ప త్యాగం చేశారు. ఎన్నో కష్టాలను భరించారు. కాని రష్యాదేశంలోని స్త్రీ-పురుషులు ప్రజాస్వామిక ప్రభుత్వంకోసం పడినన్ని పాట్లు, చేసినన్ని సాహసకార్యాలు మరెవ్వరూ చేసివుండరు.

రష్యాలో అంతా పెద్దెత్తే. అర్ధరాత్రి సమావేశాలు, రహస్యపు టాలోచనలు, ఎత్తుపైయెత్తులు, చీకటి దెబ్బలు, గూఢచారుల దొంగెత్తులు, హింసింపబడిన మానవహృదయాలు, ప్రతీకారదీక్షలు, రక్తప్రవాహాలు—ఈ మొదలైన వుద్రేకాలన్నీకూడా చాలా హెచ్చుగానూ, స్పష్టంగానూ, కనిపిస్తాయి. భూతద్దంలో చూస్తే ప్రాణిమాత్రమైన వస్తువులు సహితం ఎంత స్పష్టంగా కనిపిస్తాయో అంతస్పష్టంగా కనిపిస్తాయి.

దీనికి చాలావరకు కారణం జాతియొక్క విశేషం. దానికితోడు దేశం శీతోష్ణస్థితి. రష్యాలో చలికాలంలో మనుష్యులు ముద్దకట్టుకుపోయే చలి. వేసవికాలంలో నిప్పులు కురుస్తాయి. ఈ అత్యధిక శీతోష్ణస్థితి రష్యను ప్రజలకి బాగా ఢక్కామొక్కీయితినే శక్తి నిచ్చివుండాలి. దానికిసాయం ఆ దేశంలోని నిరంకుశ ప్రభుత్వం. పుట్టినప్పటినుంచి చచ్చేవరకు జనం గుండెలమీద కూచుని నానా బాధలూ పెట్టింది ప్రభుత్వం. అందుచేత మనుష్యులశక్తి అపారంగా వృద్ధిపొంది వుండాలి.

రష్యాలో మనుష్యుల మేశక్తిచూచినా విపరీతమే. అత్యుద్రేకులు, శాంతవంతులు, మిక్కిలి దుర్మార్గులు, మిక్కిలి దయాహృదయులు, అతి స్వార్థపరులు, అతి స్వార్థత్యాగులు. ఎక్కువగా అసహ్యించుకుంటారు; ఎక్కువగా ప్రేమిస్తారు. అతి అవివేకులు; అతి జ్ఞానవంతులు, అతి నిదానస్థులు; అతి చురుకైనవాళ్ళు. ఎక్కువగా నిరంకుశత్వాన్ని భరిస్తారు; ఎక్కువ స్వాతంత్ర్యప్రియులు. చాలా మోటు; చాలా సున్నితం. ఇంకేదేశంలోను ఇల్లాంటి విపరీతమైన ద్వంద్వాతిశయాలు వుండవు. అన్నిటికన్నకూడా ముఖ్యం వాళ్ళకొకక బుద్ధిపుట్టిందా అంటే గట్టిగా పట్టుకుంటుంది. వాళ్ళుచేసే అద్భుతకార్యాలచేసి ప్రపంచమంతా నివ్వెరపడడానికిదే రహస్యం.

మానవుల స్వభావాలను వాళ్ళ మనో ప్రకృతులను చక్కగా చిత్రించ గలిగిన వ్రాయసకాడు మాక్సిం గోర్కీ. ఆయన రచనలలోకల్లా (Mother) మాతృ దేవి, ఉత్తమోత్తమమైనది. అజ్ఞానంలో పడుండే అమాయక ప్రజలనుగురించి వ్రాయాలనొస్తే సామాన్యపు వ్రాతకాడెవడైనా సరే ఊరికే గుచ్చెత్తుతాడు. కాని అంతకన్న పసందుగా వ్రాయలేడు. ఈ విషయం ఇటీవల బయటుదేరిన రచనల వల్ల స్పష్టపవుతూనే వుంది. ఒక్కగోర్కీ మాత్రమే జనసామాన్యమును గూర్చి యెంతో చిత్రముగా చిత్రించగలిగిన నిపుణుడు. జీవితంలో యేదైనా ఒక విషయాన్ని గురించి వ్రాయాలంటే ఆయన ఆ విషయాన్ని పలువిధాలుగా పరీక్షించి మరీ వ్రాస్తాడు. అతి సామాన్యంగా కనపడే చిన్నచిన్న విషయా లనుకూడా ఆయనెంతో చక్కగా కథలో కలుపుతాడు. ముసలమ్మ అమ్మే పులుసు రుచి, మనుష్యుల కాళ్ళకంటుకునేమంచు, స్త్రీల తలపైపట్టే సునుమంచు, కట్టెలు కొట్టడం, రైతులాడుకునే మోటుసంభాషణలు, పోలీసుల అమానుషదృష్టులు మొదలైన చిన్నచిన్న హంశాలన్నీ చక్కగా ఔచిత్య దోషం లేకుండా చిత్రించాడు. ఎంతటి ఆశ్చర్యకరమైన పనులనుగూర్చి వింటున్నప్పుడైనా చలింపని హృదయాలు, యీయన వ్రాసే సామాన్యవిషయాలను ఆయా సందర్భాల్లో చదువు తూంటే చలించక మానవు.

కారణ మేమిటంటే, ఇదివరకు మనకు రష్యాసంగతి యేమీ తెలియక పోయినా గోర్కీ మహాశయుడు రష్యాప్రజల నిజమైనజీవిత పరిస్థితులను మన మనస్సుకెక్కించాడు. ఏదో చదివి, అగమ్యంగా ఆలోచించుకోవడానికి తావు లేకుండా నిజమైన జీవితాన్ని మనకండ్ల యెదుటపెట్టేశాడు. ఎటువంటి కవి అయినా వీట్ని వర్ణించలేడు. చిత్రకారుడు చిత్రించలేడు. అతి సాధారణమైన శైలిలో మామూలు సంభాషణలలో రైతుల గుడిసెలు, వాళ్ళదౌర్భాగ్యం, చాలా అధ్వాన్న స్థితిలోకూడా వాళ్ళ హృదయాలలో కలిగే చలనం, చరించి రగెత్తడం, ఆశతో బాధపడడం, మొదలైన భావాలన్నిటిని మన హృదయంలో ప్రతిఫలించేటట్లుచేసే అమృతమైన కౌశలం గోర్కీ సొమ్ము. నిజంగా చిత్రకళయొక్క పరమోద్దేశ్య మింకేముంది ?

రష్యాదేశపు జీవిత నాటకానికల్లా గొప్పది జారు ప్రభుత్వ ప్రతిఘటనము. ఈ పోరాటమెంతోకాలం జరిగింది. నూరు సంవత్సరాలపాటు ఎందరెందరినో జైళ్ళకంపింది. ఉరిస్తంభాలెక్కించింది. అనేకమందిని హింసపాల్జేసింది. సైబీరియా ప్రవాసం పంపింది. రాజ్యపాలకులకు హడలెత్తించింది. 70 సంవత్స రాలు యెనిమిది లక్షలమంది రాజకీయ నిర్బంధితులు సైబీరియాకు పంపబడ్డారండే, గోర్కీ మహాశయుడు మనకు తెలియచెప్పిన ఈ మహోద్యమముయొక్క విస్తీర్ణం, శక్తి, యెంతటిదో మనమే ఊహించుకోవచ్చును. స్వాతంత్ర్యంకోసం మానవుడు జరిపిన ప్రయత్నాలేవీ దీనికి సరిరావు. జాతీయ యుద్యమంకోసం 50 సంవత్సరాలు పోరాడిన ఇటలీకూడ దీనికి లోకువే.

ప్రతి సంవత్సరం ప్రవాసమునకు పంపబడిన వాళ్ళ స్థానాలనూ, ఛంపబడ్డ వాళ్ళ స్థానాలనూ వేలకొద్దీ కొత్తకొత్త జనం తమ ప్రాణాల నర్పించడానికీ, అష్టకష్టాలూ పడడానికీ సిద్ధమైవచ్చారు. ఒక్కసారి అమగెట్టాలందే ప్రభుత్వం వాళ్ళనాహుతి చేసుకొనేవరకు విశ్రాంతి యెరుగకుండా పనిచేసేవాళ్ళు. కత్తి కటారులు చేత్తోపుచ్చుకొని స్వాతంత్ర్యంకోసం నువ్వా నేనా అని యుద్ధంలోకివెళ్ళి ఒక దెబ్బకొట్టి ఒక దెబ్బపడి జయమో చావో పొందడం కొంతసులువే. అందులో కొంత కీర్తివుంది. అల్లాంటప్పుడు రక్తం వుడుకెత్తిపోయి ముందువచ్చే ప్రమాదం సంగతేమీ తెలియదు. అంతేకాకుండా ఆ త్యాగాన్ని ప్రపంచం కీర్తిస్తుంది. కాని రహస్యంగా జిత్తులమారి హంతకులతో చడీచప్పుడూ లేకుండా తికమకలుపడూడు వుండడం, నిరంతరం ప్రాణానికి మోసంవచ్చే పరిస్థితిలో జీవించడం, అపజయం కలుగుతుందనీ ఊరూపేరూ లేకుండా చచ్చిపోవాలిసొస్తుందనీ తెలిసికూడా వెనుక చూపులేకుండా వుండడం చాలా ఉన్నతమైన వీరత్వం. పాశ్చాత్య దేశాల్లో స్వాతంత్ర్యోపాసకుల కెప్పుడూ ఇల్లాంటి వీరత్వాన్ని చూపించవలసిన అవసరం కలుగలేదు.

ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా, వైజ్ఞానికంగా కూడా రష్యా రోజు రోజుకీ ప్రపంచంయొక్క దృష్టి నాకర్షిస్తోంది. "నన్ను ముట్టుకోకు నామాలకాకే" అని మూలకూర్చునేవాళ్ళు సహితం, రష్యానుగురించి ఆలోచించక తప్పడంలేదు. పూర్వకాలపు రష్యాయొక్క స్థితిగతులు తెలుసుకుంటేనే కాని నేటి రష్యా స్థితిగతులు తెలియవు. రష్యా మహాసంఘర్షణను గురించి ఇంత విస్పష్టంగానూ, నిష్పక్షపాతంగానూ, హృదయానికి నాటేటట్లుగానూ చెప్పగలిగిన గొప్ప సమర్థుడు గోర్కీ. చరిత్రకారుడుగాని తత్వశాస్త్రజ్ఞుడుకాని పెద్ద చాటభారతాలు వ్రాసికూడ చెయ్యలేని పనిని ఈయన కొన్ని అధ్యాయాల వ్రాతవల్ల చేయగలిగాడు. ఈయన రచన మూలమున రష్యా మంచి వెలుగులో కొచ్చింది. జీవితం వున్నదున్నట్లుగా తెలుపడమే గోర్కీ ఆదర్శం. రష్యను నవలాకారులంతా అంతే. జీవితం యెల్లా ఉండాలో యెల్లావుండేదో చిత్రించడం వాళ్ళపనికాదు. అస్వాభావికమైన మనుష్యుల్నీ, అస్వాభావికమైన జీవితాన్ని గురించీ అద్భుతంగా వ్రాయడమనేది వాళ్ళు సహించరు. కథాభాగంలో కొంత కల్పనఉంటేచాలు. ఇగతా విషయాల్లో సామాన్య మానవస్వభావాలు ప్రతిఫలిస్తూనే వుండాలి. కథలలో వచ్చే మనుష్యుల బుద్ధులు, భావాలు, పరస్పర విరుద్ధమైన చేష్టలు, అసంబద్ధమైన పనులు, ఈ మొదలైన విషయాల్లో సామాన్య మానవజీవితంలో వుండే లోపాలోపాలు కనబడాలి. అందరిని ఒకేమాదిరి అద్భుతమైనట్టి మహావీరులుగానూ, సత్పురుషులుగానూ చిత్రించడమూ, లేకపోతే అందరినీ ఘోరపిశాచాలుగా చిత్రించడమూ, చాల అస్వాభావికమనీ, నవలారచనకు విరుద్ధమనీ రష్యను రచయితల అభిప్రాయము. అందుచేతనే మన పాశ్చాత్యదేశాల్లో తయారయ్యే మాదిరి కల్పనా కథలు వాళ్ళు తయారు

చేయరు. రష్యాలో వాటిని భరించలేరు కూడాను. రాక్షసుల్ని గురించీ, దేవతల్ని గురించీ అసంభవమైన కథలుచెప్పరు. ఏమీ లోపము లంటూలేనిమహానుభావులను కల్పించి, వాళ్ళలోపాటు దేవతాస్త్రీలవంటి అందకత్తెలను కల్పించి, వాళ్ళకు మానవ మాత్రుల కళ్ళబడ నటువంటి అపురూపపు దుస్తులనంటగట్టి చివరకి ఆస్త్రీపురుషులకు ఏదో మీటనొక్కితే జరిగేటట్లు అస్వాభావికమైన సంబంధం కలుపడం వాళ్ళెరు గరు. ఇల్లాంటి స్త్రీ పురుషులు ప్రపంచంలో వుండడం అసంభవమనీ, వాళ్ళని పుస్తకాల్నిండా యెక్కించడం అనవసరమనీ రష్యను నవలాకారుల అభిప్రాయం.

గోర్కీయొక్క చాకచక్యాన్ని పూర్తిగా గ్రహించాలంటే రష్యను రచయి తలకూ యితరులకూ వుండే యీ ముఖ్యమైనతేడాను తెలుసుకోవాలి. ఆయనపుస్త కాల్లో వచ్చేజనం సందర్భంలేకుండా అనేక అభిప్రాయాలు విసిరేస్తూవుంటారు. సామాన్యంగా మనుష్యులలో తొంభైతొమ్మిదిపాళ్ళు అల్లాగే మాట్లాడుకుంటూ ఉండడమే దానికి కారణం. ఆయన పుస్తకాల్లోని పాత్రలు అసంబద్ధమైన పనులు చేస్తూ ఉంటారు. అర్ధాంతంగా ఆవేశం కనుపరుస్తారు. తర్వాత చల్లబడతారు. యాదాలాపంగా ప్రయాణ మవుతూవుంటారు. ఆగిపోతూ వుంటారు. అంతా అనాలోచితంగా ప్రారబ్ధానికి దాసులై వుంటారు. జీవితంలో నిజంగా ఇల్లా జరు గుతూ వుండడమే యిందుకు కారణము. రష్యాదేశాన్ని పాలించి హడలగొట్టే నిర్జీవమైన రాజ్యాంగయంత్రం మనకళ్ళకు గట్టినట్లు చిత్రించాడు. గోర్కీనల్లగా మొద్దులావుండే ఈ యంత్రాన్ని మనకు చూపించడమేకాదు; దానివల్ల కలిగే భయంచేత మనంకూడా కంపించేటట్లు చేశాడు.

ఆయన ఈభయంకరమైన యంత్రం తయారుచేసిన సరుకు రకరకాలను చక్కగా మనకు చూపించాడు. మనిషి పశువైపోయాడు. తన దౌర్భాగ్యావస్థనుండి తప్పించుకోడానికి మార్గం లేక తప్పతాగి అతి ఓర్మితో చాకిరీచేసే భార్యను చావ గొడ్తాడు. ఒక యువకుడు ఒక పుస్తకంవల్ల ప్రపంచంలో స్వాతంత్ర్య ప్రియులు చేసిన ఘనకార్యాల సంగతి తెలుసుకుని తనదేశంలో కోట్లకొద్దీ జనుల ప్రాణాలను పీల్చి పిప్పిచేసిన రాక్షస రాజ్యాంగవిధానం మీద తిరుగబడి మహా సమరంలో పడిపోతాడు. గొప్ప కుటుంబంలోమనిషి, చదువుకున్నవాడు. సామాన్యంగా ముందు వెనుకలు ఆలోచించుకుంటేకాని అడుగెయ్యనివాడు. సాహసంచేసి విప్లవ కారులలో చేరేడు. ధనికుల కుటుంబములోని పడుచు యీమహోద్యమంలో పడి కష్టనష్టం లెక్కపెట్టకుండా తనకప్పచెప్పిన పని చేస్తుంది. దరిద్రంలోపడి కొట్టుమిట్టపుతున్న రైతుకూడా వుద్యమ మహాత్మ్యంవల్ల వున్నతస్థితికి రాగలుగు తాడు. క్షయరోగంచేత బాధపడుతూ కాస్సేపటికో కాస్సేపటికో చచ్చిపోయే మనిషి ప్రాణంపోయేదాకా వుద్యమంకోసమే తంటాలు పడతాడు. మంచి వయస్సులోనున్న యువతీయువకులు ఒకళ్ళ నొకళ్ళు హృదయపూర్వకంగా ప్రేమించుకుంటారు. కాని స్వాతంత్ర్యోద్యమాని కేమి ఆటంకం వస్తుందో

ననేకారణంవల్ల పెళ్ళిసంగతి తలపెట్టడు. ఒకమంచి విద్యావంతుడున్నాడు. అతనికి పుస్తకాలన్నీ శాంతంగామార్చి చదువుకోవడమన్నా, సంగీతమన్నా చాలా ప్రియం. కాని, స్వాతంత్ర్యోద్యమాని కవి అడ్డొస్తాయి కనుక వాటిని వదిలేశాడు. అతని అప్పు చిన్నప్పటినుంచీ అతి సుకుమారంగా పెరిగినస్త్రీ. యెన్నెన్నో సాహసకృత్యాలు చేస్తుంది. మారుపేరులతో బ్రతుకుతుంది. ఖైదీలను తప్పిస్తుంది.

(అధ్యాయం 23)

ఇల్లాంటి స్త్రీపురుషులను గురించి చదవడమే చాలా యెక్కువ సంగతి. అల్లాంటప్పుడు వాళ్ళని చూడడం, వాళ్ళతో పరిచయ చేసుకోవడం, వాళ్ళు చెపుతూంటే వినడం, వాళ్ళు పనిచేస్తుంటే చూడడం, ప్రపంచంలోకల్లా దారుణమైనటువంటివన్నీ, బలవత్తరమైనటువంటివన్నీ నిరంకుశత్వాన్ని తిరగద్రోయడానికి వాళ్ళుచేసే ప్రయత్నాలను చూస్తూవుండడం యెంతగొప్ప విషయమో వేరుగా చెప్పనక్కరేలేదు. ఇదే గోర్కీ మనకు కలుగజేసిన గొప్ప సావకాశం. ఆయన వ్రాతలు చదువుతూవుంటే మనం రష్యాను ప్రత్యక్షంగా యెరుగున్నట్లు, బోల్షివిజంయొక్క తత్త్వం మనకు వాగా తెలిసినట్లు అనిపిస్తుంది.

ఈనవలలో ఒక ముసలమ్మ ప్రధానపాత్ర. ఆమెనుగురించే ఇందులోని వివిధఅంగములు చక్కగా కల్పింపబడ్డాయి. ఈ విప్లవోద్యమం సంగతి తెలిసేటప్పటికి ఆమె చాలా ముసలిది. ఈవిషయ మామెకు తెలిసిన రాత్రిదాకా ఆమె రష్యాలో కోటానుకోట్లుగానున్న అధాగ్యులలో ఒక్కతెమాత్రమే. యేరోజు కారోజు త్రాగుబోతైనభర్త చావగొడుతుంటే, కిం అనకుండా భరించి మరునాడు అల్లాంటిదెబ్బలు లేగులకుండావుంటే చాలు దేవుడాఅని కోరుకుంటూ కాలం గడిపింది. చూడండి! గోర్కీ నిజంగా ఆమెను రష్యాదేశ మంతటికి చిహ్నముగా సృష్టించాడు. విప్లవం సంగతి మొట్టమొదట వినేసరికి ఆమెభయంచేర అదిరిపడింది. చక్రవర్తిమీద, భగవంతునిమీద శాశ్వతంగా తమపీకెలమీద కూచోమని భగవంతుడు సృష్టించిన చక్రవర్తిమీద తిరుగుబాటేమిటి? కాని క్రమంగా ఉద్యమంయొక్క ఆశయాలను చూస్తుంది. చూచి ఆమోదిస్తుంది. ఉద్యమంలో పనిచేయాలనుకుంటుంది. చివరికి యెంతో చాకచక్యం, జిత్తులమారితనం కావలసిన పనులెన్నో చేస్తుంది. పోలీసువాళ్ళతో మాట్లాడడానికి మారువేషాలేసింది. గూఢచారుల ముఖాలను మభ్యపరచింది. ఇల్లు సోదాచేస్తుంటే, యేమీ తెలియనట్లు పడుంది. విప్లవసంబంధమైన కాగితాల్ని పంచిపెట్టడానికి మంచులోనూ అడుసులోనూపడి మైళ్ళకుమైళ్ళు నడిచింది. ఈ మహోద్యమానికి తనకెంతో అపురూపమైన యేకైకపుత్రుని సమర్పించింది. చివరికి స్వాతంత్ర్యమంత్రం జపిస్తూ, తనే నిరంకుశ రథచక్రములక్రింపడి ప్రాణాలర్పించింది. (ఆఖరు అధ్యాయం)

.... .... ....

బోల్షివిజంఅంటే ఇక మనం తెల్లబోనవసరంలేదు. కాని అటువంటి దారుణ నిరంకుశత్వానికి ఇంతతక్కువ ప్రతీకారం జరుగడమే మనమాశ్చర్య పడవలసిన విషయం. మహా దుర్మార్గమైన నిరంకుశత్వంవల్ల ఎడతెరిపిలేని బాధలు పడిపడి చివరికి అధికారంలో కొచ్చినతర్వాతకూడా రష్యను ప్రజలు యేమి విశేషమైన దారుణాలు చెయ్యకపోవడం చాలా ఆశ్చర్యమే అల్లాంటివేవీ లేకుండా ఆచరణ యోగ్యం కాని పిచ్చిపిచ్చి రాజ్యాంగాన్ని నిర్మించడానికి ప్రయత్నించడం వాళ్ళ చిత్రమైన నైజాన్ని తెలియచేస్తోంది. అసలు రష్యాదేశస్థులు చిత్రమైన మనుష్యులు. గోర్కీ వాళ్ళపాలిట సరియైన తత్వవేత్త. భాష్యకారుడు. చిత్రకారుడు. నవలాకారుడు. ఈ మహాకల్పనలలో ఆయనను చక్కగా పరిశీలించవచ్చును.

— చార్లెస్ ఎడ్వర్డ్ రస్సెల్.

# అనువాదకుని విజ్ఞప్తి

స్వతంత్ర రచనకన్నా అనువాదం చాలా కష్టం. అందులోనూ టాల్‌స్టాయి, గోర్కీ-వంటి తత్త్వవేత్తల ఉత్తమరచనలను తెలుగు చెయ్యడం మరీ కష్టం. గోర్కీ భాష అపూర్వమైనది. ఒక చిన్నవాక్యంలో మహత్తరమైనభావం యిమిడి వుంటుంది. అదీకాకుండా చదువుకొనేవాళ్ళు, స్వతంత్రరచనను మామూలు కొలత బద్దతోనే కొలుస్తారు. కాని అనువాదాన్ని అసలు రచననుబట్టి కొలుస్తారు. అందు చేతనే విఖ్యాతులైనవాళ్ళ గ్రంథాన్ని అనువదించాలంటే యెంతో సమర్థత, సాహసం వుండాలి. ఇల్లాంటి ఉత్తమమైన కల్పనను తెలుగు సోదరులుకూడా చదువుకోవాలనే కోరికే, నన్నీ సాహసానికి పురిగొల్పింది. దానికితోడు నే నీ పని చేయడానికి తగినంత విశ్రాంతి దొరికింది. అనువాదం మంచీ చెడ్డలు పాఠకులే నిర్ణయించాలి.

అసలు కల్పనలోని పేర్లను నేను యేమీ మార్చలేదు పేర్లు మారిస్తే రష్యాదేశపు స్థితిగతుల కతకవు. ప్రసిద్ధులైన నవలాకారుల నవలల ననుసరించు నప్పుడు పేర్ల నేమీ మార్చకూడదనే నా అభిప్రాయం.

అలవాటంతగా లేకపోయినా పుస్తకమంతా వాడుక భాషలోనే వ్రాశాను. ప్రపంచంలోవుండే ధనధాన్యాలను అనుభవించడాని కందరికీ హక్కున్నట్లే విజ్ఞానాన్నీ, వికాసాన్నీ పొందడానికికూడా అందరికీ హక్కుంది; కాబట్టి సామాన్యమైన వాడుకభాషలోనే వ్రాయడం న్యాయమని తోచింది.

రష్యనుపేర్లు మనకి సులువుగా నోరు తిరగక పోవడంవల్ల జ్ఞాపకముండడం కష్టమని గ్రంథాంతమున పుస్తకంలో వచ్చే మనుష్యులు, వాళ్ళ సంబంధాలు టూకీగా వ్రాశాను.

నన్నీ అనువాదం చెయ్యమని ప్రోత్సహించిన మిత్రులందరికీ నమస్కారాలు. ప్రకాశకులకు అనేక వందనాలు.

— — అనువాదకుడు

# మాక్సిమ్ గోర్కీ

## (జీవిత సంగ్రహం)

సుప్రసిద్ధుడైన రష్యన్ నవలాకారుడు మాక్సిమ్‌గోర్కీ 1868 సం॥లో జన్మించాడు. బాల్యమున కొంతకాలము ఒక చెప్పులుకుట్టే షాపులో పనిచేశాడు. తర్వాత తాపీపని నేర్చుకున్నాడు. అందులోనూ గిట్టుబాటుకాకపోతే ఒక ఓడలో వంటకుర్రాడుగా కుదిరేడు. అప్పటికి అతనికి 12 సంవత్సరములు మాత్రమే. అక్కడ మూడు సంవత్సరాలు పనిచేసిన తర్వాత రొట్టెల దుకాణంలో చేరాడు. 1886 సం॥లో నాటక కంపెనీలో ప్రవేశించాడు. 1887 సం॥లో వీధుల్లో తిరిగి పండ్లమ్మేవాడు. ఇన్ని తంటాలుపడినా పొట్టగడవక పోవడంచేత కాబోలు 1888 సం॥లో ఆత్మహత్య చేసుకొనేందుకు ప్రయత్నించాడు. కాని సాధ్యం కాలేదు. 1890 సం॥లో ఒక ప్లీడరు దగ్గర గుమాస్తాగా చేరేడు. అదీ అంతంతే అవడంచేత 1892 సం॥లో రయిల్వే కర్మాగారంలో కూలిపనికి కుదిరేడు. 10 సంవత్సరాల వయసొచ్చినప్పటినుండి ఈ రీతిగా పొట్టచేత్తో పుచ్చుకుని రకరకాల పనులన్నీ చూచేడు. చివరకి వర్కుషాపు కూలీ అయినాడు. అప్పుడే అయన ప్రథమమున తన కథను ప్రచురించాడు. దానిలో ఆయనఖ్యాతి బయటకొచ్చింది. చిన్న కథలు వ్రాయడంలో నిపుణుడనే పేరుపడింది. దానితో ఆయనకు వృత్తికూడా స్థిరపడింది. క్రమంగాఆరితేరిన వ్రాతకాడయినాడు. రష్యాలోకెల్ల గొప్పరచయితల్లోకల్లా ముఖ్యుడైనాడు. ఆయనవ్రాసిన నవలలోకెల్ల (Mother) "మాతృదేవి" ముఖ్యమైనది, ప్రసిద్ధికెక్కినది. "కేడెన్సు," "బైస్టాండర్," "మాగ్నెటు" మొదలైన అనేక నవలలను అనేక కథలను వ్రాసియున్నాడు. చాలాకాలం "నవయాజీన్" (నవజీవన్) అనే పత్రికకు సంపాదకుడుగా వున్నాడు.

రష్యాదేశములోని నిరంకుశ ప్రభుత్వమును త్రోసివేయుటకు జరిగిన దీర్ఘ పోరాటములో గోర్కీకూడా పనిచేసినాడు. తన కథలవల్లను గ్రంథములవలనను ప్రజలలో గొప్ప ప్రచారంచేసినాడు. 1905 వ సంవత్సరంలో పీటర్సుబర్గులో గొప్ప గలాటా జరిగింది. చాలామంది ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఆసందర్భంలో గోర్కీకికూడా శిక్షపడింది. 1917 సం॥రంలో జరిగిన మహావిప్లవమునందుకూడ గోర్కీ పాల్గొనినాడు. కాని చివర రోజుల్లో విప్లవం సాగించడంలో నాయకుడగు లెనిన్‌కూ ఈయనకూ అభిప్రాయ భేదాలొచ్చి తటస్థంగా వున్నాడు. గోర్కీ సహజంగా తత్వవేత్త. రక్తపాతమన్నా ప్రతీకారమన్నా ఆయనకు గిట్టదు. కొంచెం తాపీగా అడుగేద్దామనే రకంలోమనిషి. లెనిన్‌కు వారి విప్లవనాయకులకు

ఈ పద్ధతి నచ్చలేదు. అందువల్ల ఈయన తటస్థంగా వున్నాడు. 1917 అక్టోబరు నెలలో పదిరోజులపాటు విప్లవం తీవ్ర స్వరూపందార్చి ప్రపంచమంతను గజగజ లాడించినది. బోల్షివిక్కులు రాజ్యాధికారమును పొందుట కదే ప్రారంభము. అప్పుడు రష్యాలోని అన్నిపక్షములవారును యేకమైనారు. గోర్కీ అట్టేకమైన వారిలో ముఖ్యుడు. సోవియటు ప్రభుత్వనిర్మాణ కార్యక్రమమునకు ఆయనెంతో తోడ్పడినాడు. ఈ మధ్యనే సోవియటు ప్రభుత్వము ఆయనసేవకు కృతజ్ఞతా సూచకంగా ఒక మేజోళ్ళ కర్మాగారమును ఆయనపేరిట నిర్మించారు. ఆయనింకను జీవించి యున్నాడు. (ఈ ముద్రణనాటికి లేడు) ఇటీవలాయన కథలనేకములు ప్రచురింపబడినవి. రస్సెల్ వ్రాసిన ప్రవేశికను చదివిన తర్వాత ఆయన రచనపద్ధతినిగురించి, ప్రాశస్త్యమును గురించి వేరుగా తెలుపనక్కరలేదు. రష్యా మహావిప్లవమునందు అనేకసంవత్సరములు పనిచేసి, అందు పాల్గొనిన వీరులనుగూర్చి, విప్లవముయొక్క పాటుపోటుల తత్వమునుగూర్చి బాగా గ్రహించినవాడగుటచేతనే, 'అమ్మ' (Mother) వంటి ఉత్తమ కల్పనను ఆయన రచింపగలిగేడు.

— అనువాదకుడు



## ౧

తెల్లవారడం తరువాయి కుయ్యిమని ఫ్యాక్టరీ కూత పడుతుంది. దానితో కూలీపేటల్లోవుండే పనివాళ్ళంతా ఉలికిపడి లేస్తారు. లేచి ఎక్కడకక్కడ తొందరగా కాలకృత్యాలు తీర్చుకొని ఒక్కొక్కళ్లే వీధులలో పడతారు. కడుపు నిండా కూడుంటే కంటినిండా కునుకుంటుంది. అది లేకపోతే ఇదీ లేదు. కూలీలకు కూడూ లేదు. కునుకూలేదు. రాత్రి చాలినంత నిద్ర లేకపోవడంచేత అతి బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ, కళ్ళు నలుపుకుంటూ ఈడుపుకాళ్ళతో ఫ్యాక్టరీకి పోతూవుంటారు. రోడ్డంతాబురద వడంచేత బట్టలనిండా బురదమరకలే! పని ఎక్కువై ప్రాణం విసగటంచేత ఒకళ్ళనొకళ్ళు వెక్కిరించుకుంటూ, తిట్టుకుంటూ పోవడం మామూలు. ఇది దరిద్రానికి ముఖ్యలక్షణం. ఫ్యాకరీ ఆవిరి గొట్టాలు "బుజ్" మని ఈ నిర్భాగ్యులకు స్వాగతగీతాలు పాడుతాయి. ఫ్యాక్టరీ పొగగొట్టా (చిమ్ని) లలోంచి గుప్ గుప్ మని పొగ మేఘాలు బయలుదేరి పేటంతా ఆవరించాయి. ఈ నిర్భాగ్యులకివే చలువ పందిళ్ళు. ఇది ప్రొద్దుట పంతు.

దినమంతా ఫ్యాక్టరీలో చాకిరీచేస్తారు. సాయంత్రం ప్రొద్దుగూకడంతోటే దివాలా మొఖాలు వ్రేలాడవేసుకుని కూలీలంతా ఫ్యాక్టరీలోంచి బయటపడతారు. ఇంజను డ్రైవరు కాలిపోయిన బూడిదను తోసిపారేసినట్లు - చెరుకుగానుగ రసం తాగేసి పిప్పిని బయట పారేసినట్లు ఫ్యాక్టరీ అధికారులు ఈకూలీలను గెంటేసి తాళం వేసేస్తారు. పసిజారిన మొగాల్తో, క్రూడాయులు కంపుకొట్టుకుంటూ, బురదరోడ్డుమీద పడి కూలీలు కొంపలకు చేరుకుంటారు. ఎంత కష్టపడినా తిరుగు ఒళ్ళు చురుకుగా సాగుతాయి. అల్లాగే కూలీలుకూడా చాకిరీతో అలసటచెందినా కొంపకు చేరుకోవడం కనుక అదోవిధమైన వెర్రి సంతోషంతో నవ్వుతూ, త్రుళ్ళుతూ గూళ్ళకి చేరుకుంటారు. ఏరోజుకారోజే రోజు గడిచిందికదా అనే ధీమా ఇక ఈరోజుకు పనిలేదుకదా అనే నిశ్చింత. ఉన్నమట్టుకు తిని పడుకోవచ్చునుగదా! ఎక్కడికక్కడికే సంతృప్తి.

పగలంతా ఫ్యాక్టరీలో గడచిపోతుంది. మిషను ఒంట్లోవుండే సారంలో కొంత పీల్చేస్తుంది. అప్పటికా రోజు సరి. ఆయుర్దాయంలో ఒకరోజు తగ్గిపోయిందన్నమాటే. ఏమయితేనేమి? కష్టపడితేనేంగాక? ఏదో గిట్టినమట్టుకు రాత్రై కారికి సారాదుకాణానికెళ్ళి రెండు డ్రాములేసుకుంటే ఉండేమజా వేరే చెప్పాలా? ఆ మజా కూలీలకే తెలుస్తుంది.

శలవొస్తే ఆరోజు కూలీలకు స్వర్గమే. ఫ్యాక్టరీ కుయ్యిమని తెల్లవారేసరికి వొంత్రపెట్టదుకదా! అది మొదటిసౌఖ్యం. గుండెల్లో ఏమీ అదటులేకుండా పది

గంటలదాకా పడుకోవచ్చు. తీరికగాలేచి దంపతులు ఉన్నంతలో మంచిదుస్తులు సింగారించుకొని చర్చికెడతారు. చర్చినుండి తిరిగొచ్చి రోజూకన్న అపురూపమైన పదార్థాలతో విందారగిస్తారు. సారాయిసంగతి చెప్పనక్కరలేదు. కూరలో ఉప్పులేకపోతే రుచేలేదు. కూలీల విందులో సారాలేకపోతే మజాయేలేదు. శక్తికి మించిన పనిచేస్తూ ఆకలికి తగినంత ఆహారం దొరకనివాళ్ళకి క్రమంగా ఆకలి మందగించిపోతుంది. ఎప్పుడైనా ఒకప్పుడు ఆరగించాలిసొచ్చినప్పుడు సారాఉంటే కాని ఆహారపదార్థం లోపలికిపోదు. సాయంత్రం పనీపాటా లేక వీథులలో తిరుగాడుతూ ఉంటారు. అసలు త్రాణలేకపోయినా ఒకళ్ళకంటె ఒకళ్ళు షోకుగా ఉండాలని డాబుగా సింగారించుకుంటారు. చిన్నచిన్న ముఠాలుగాచేరి ఫాక్టరీ మేనేజరును గురించో, లేక ఏమిషను చక్రాన్నిగురించో బాతాఖానీ కొట్టుకుంటారు. అపుడపుడు తమకు జరిగే అన్యాయాలను గురించి ఆలోచించుకొని నిస్పృహతో పండ్లు కొరుక్కుంటారు. చీకటిపడడంతోపే మస్తుగాతాగి ఇంటికి చేరుకుని ఏదో వంక పెట్టి పెళ్ళాలతో పేచీపడడం, వాళ్ళకి పిడికిటిపోటులు ప్రసాదించడం సామాన్యంగా జరుగుతూ ఉండేతంతు. ఇంక పైలాపచ్చీసుగాఉన్న యువకులు యువతులు స్నేహితులింటిలోనో లేకపోతే ఏ సారాషాపులోనో చేరి త్రాగి తందనాలు త్రొక్కుతూ అసభ్యమైన ఆటపాటలతో కాలక్షేపంచేస్తూ ఉంటారు.

మస్తుగా సారా ఎక్కితే శరీరంలో ఒక విధమైన ఉషారు బయలుదేరుతుంది. ఆ ఉషారుకు ఉపసంహారం ఒకళ్ళనొకళ్ళు తిట్టుకోవడం, కొట్టుకోవడం. ఈ సరాగాలు చిలికిచిలికి గాలి వానవుతాయి. అప్పుడప్పుడీ త్రాగుబోతు సరసాలు, హత్యలుగా పరిణమించడంకూడా కద్దు. ఇలాంటి జీవితం ఫాక్టరీ పనివాళ్ళకు తాత ముత్తాతలనుండి వారసత్వంగా సంక్రమించింది. పుట్టినప్పటినుండి వాళ్ళీ జీవితాని కలవాటైపోయారు. ఇందులోఉండే హీనత్వం వాళ్ళకేమీ తెలియనే తెలియదు.

కాస్త పిన్నవయస్సులోతలిదండ్రులచాటునఉండేకూలీబాలలపురోజున తప్ప త్రాగి ఒకళ్ళనొకళ్ళు తన్నుకుని స్పృహతప్పి నేలమీదపడి పొర్లాడుతూ ఉంటే తల్లో తండ్రో పోయి వాళ్ళని చేతులమీద తీసుకురావలసొస్తూ ఉండేది. త్రాగుబోతు తనం మాన్పించడానికి తలిదండ్రులు వాళ్ళ కప్పుడపుడు తడపిడ లగ్గం చేస్తూనే ఉండేవాళ్ళు. కాని ప్రయోజనం మాత్రం సున్న. వాళ్ళ తప్పుమాత్రం ఏముంది? ప్రస్తుతం వాళ్ళకి బుద్ధిచెప్పే తలిదండ్రులు వాళ్ళకాలంలో అలాగే త్రాగి తందనాలు తొక్కి చీవాట్లు చెప్పుదెబ్బలు తిన్నవాళ్ళే. అలాంటి పెద్దవాళ్ళ చెప్పుచేతల్లో పెరుగుతూఉంటే పిల్లలకు వేరే గుణాలబ్బుతాయా? వాస్తవానికి ఈ పెద్దవాళ్ళుకూడా పిల్లవాళ్ల త్రాగుబోతుతనాన్ని ఎక్కువ దోషంగా పరిగణించేవాళ్ళుకాదు. ఊరికే మాటవరుసకి విధిలేక మందలిస్తూ ఉండేవారు. నిర్భాగ్యులైన కూలీల సంతానానికి కులాసాపుట్టించే దీ సారా ఒక్కటే అని వాళ్ల నమ్మకం.

కాబట్టి ఈలాంటి పెద్దల మందలింపులు లక్ష్యపెట్టకుండా పిల్లలు యథాప్రకారంగా తమ విషాదంతు సాగిస్తూనే ఉంటారు.

అప్పుడప్పుడు పొరుగూరి ఫాక్టరీలో పనిచేసి మారి ఈ ఊరి ఫాక్టరీలో చేరతాడు. క్రొత్తవింత కనుక కొన్నాళ్లు అంతా అతనిచుట్టు చేరి ఇతర ఊళ్ళ ఫాక్టరీల సంగతి వింటాడు. అక్కడమాత్రం క్రొత్త ఏముంది? ఇదేతంతాయె.

ఒక్కొక్కప్పుడు ఎవరైనా ఒక కొత్తమనిషి వచ్చి ఎన్నడూ విననటు వంటి ఏదో వింతసంగతులు చెవినిబడేస్తాడు. దానితో కూలిపేటంతా ఉడుకెత్తి పోతుంది. ఈ ఉడుకుకు ఉపశాంతి మజాఅయిన సారాయం. దానితో అన్నీ చల్ల బడిపోతాయి.

కూలీజనం మొత్తంమీద సనాతనధర్మిష్టులు. ఎవరైనా ఏదైనా కొత్త పంథా చూపించినా వాళ్లబుర్రకెక్కదు. చిరకాలంనుంచి చాకిరీ కలవాటైపోయారు. అది సృష్టికర్త రాసిన రాతనీ, దాన్ని తప్పించడం అసంభవమనీ వాళ్లవిశ్వాసం. తెగించి ఏదైనా కొత్తదారి తొక్కితే పడుతున్న కష్టానికి పదిరెట్లెక్కువ పడా లేమోనని భయం. నిరాశతో, నిస్పృహతో తమ పూర్వులు నడిచిన మార్గాన్నే నడుస్తూ ఉంటారు. గాడిద బరువు మొయ్యడానికి, కూలీలు చాకిరి చెయ్యడానికి విశేషం తేడాలేదు. అలాంటి బతుకే బతికి ఏ ఏభయి సంవత్సరాలో వచ్చేసరికి ప్రాణాలు విడిచేస్తారు.

* * * *

ఈలాంటి నిర్భాగ్యజీవనం చేసేవాళ్ళలో "మైకేల్ వాసప్" ఒకడు. చేయెత్తు మనిషి. బలమైనదేహం. మోటుతనం ఎక్కువ. చిన్నికళ్ళు. పెద్దగడ్డం. చూస్తేనే అనుమానంకలిగే ముఖం. ఫాక్టరీలో తాళాలు చెయ్యడం అతని పని. ఈ పనిలో గట్టివాడు. కాని మనుష్యులతో మర్యాదగా మాట్లాడడం మాత్రం అతని జన్మలో యెరుగడు. మేస్త్రీని ధిక్కరించడంవల్ల సంపాదన ఎదుగూబొదుగూలేదు. పనికి తగిన ఆయివేజు ముట్టడంలేదు. ఊరందరిలోను బలవంతుడు. దానికితోడు శుద్ధపేచీకోరు. తెల్లవారి లేస్తే ఎవరితోనో ఒకరితో దెబ్బలాడితేకాని అతనికి రోజు గడువదు. అందుచేత ఊరందరికి అతడంటే అసహ్యం లోపల భయం కూడాను. అతన్ని కొట్టడానికెందరో ఎన్నోసార్లు ప్రయత్నించారు కాని ప్రయో జనం లేకపోయింది! తన మీది కెవరైనా కొట్టడానికి వస్తూఉంటే 'వాసప్' ఏ ఇనుప ఊచనో, లాఠీకర్రనో చేత్తోపట్టుకుని పల్కకుండా నిలబడేవాడు. ఆ భయం కర స్వరూపాన్నిచూచి భయపడి శత్రువులు దగ్గరకు రాకుండానే పరారై పోయే వాళ్ళు. అందులోనూ జ్యోతుల్లాంటి అతని గుడ్లుచూచి, జనం దెయ్యమో భూతమో అని భయపడి పోయేవారు.

కుక్కల కొడుకుల్లారా! పొండి! అని వాసప్ పళ్ళు పటపటకొరికే సరికి ఎక్కడివాళ్ళక్కడ లోలోపల తిట్టుకుంటూ మాయమైపోయేవాళ్ళు. "వాసప్"

విశేషంగా మాటాడేవాడు కాడు. కాని నోరు విప్పితేమాత్రం "కుక్కల కొడకా" అనే ఊతపదం రావలసిందే. ఫాక్టరీ యజమానిని గురించి మాటాడినా అదేమాట. పోలీసువాళ్ళ సంగతొచ్చినా అదేపదం. ఆఖరుకు పెళ్ళాంతో మాటాడవలసి వచ్చినా అదే పలుకు.

మైకేలు కొడుకు "పావెల్"కు పదునాల్గేండ్ల వయస్సు. ఒక్కడే కొడుకు. ఒకరోజున ఆ పిల్లవాడు కూర్చునివుంటే మైకేలుకు అతనిజుట్టు పీకాలని బుద్ధి పుట్టింది. ఆ బుద్ధి ఎందుకు పుట్టిందా అని విమర్శించడానికి ఎవరికీ తరమూకాదు. మైకేలు ఆప్రయత్నంలో ఉండగా, పావెల్ ఒక సుత్తిని చేత్తో చూపిస్తూ "నన్ను ముట్టుకోకు; జాగ్రత్త!" అని నిర్భయంగా తండ్రిని బెదిరించాడు.

"ఏమిటీ? ముట్టుకోకూడదూ" అని మైకేలు భూతంలాగా చూస్తూ మీద కొచ్చాడు.

"చాలించింక! ఆ వేషాలు కట్టిపెట్టు! నీ జబర్దస్తీకి లొంగేవాడినికాను" అని పావెల్ సుత్తియూడించాడు.

మైకేల్ నిర్ఘాంతపోయి చేతులు వెనక్కు తీసుకొని "అలాగా! సరే! ఓరీ కుక్కలకొడకా! ఎంతవాడవయావురా?" అని నిట్టూర్పు విడచి వెనక్కి తగ్గాడు.

ఒక క్షణం అయినతర్వాత, భార్యకేసి తిరిగి "ఏయ్! రేపటినుంచి నన్ను డబ్బు దసకం అడగొద్దు * పాషా నీకు కూడు తెచ్చి పెడతాడు. పెద్దవాడయాడు. తెలిసిందా?" అన్నాడు.

ఓహో! అయితే సంపాదించిందంతా నువ్వు తాగేస్తావుకాబోలు! అని ధైర్యంచేసి మైకేలుభార్య అడిగింది.

"ఛీ కుక్కా! ఆ సంగతి నీకెందుకంటా" అని జవాబొచ్చింది.

అప్పటినుండి మూడు సంవత్సరాలు, అంటే చచ్చిపొయ్యేవరకు మైకేలు కొడుకుతో ఎన్నడూ మాటాడలేదు సరిగదా, ఆప్రశంసయినా ఎత్తలేదు. ఆఖరుకు అతనిని కన్నెత్తి చూడనైనాలేదు.

"మైకేలువాసవ్" ఒక కుక్కని పెంచాడు. అదికూడా అతనిలాగా పుష్టిగా అసహ్యంగా ఉండేది. అతనిమాదిరిగానే కజ్జాకి కాలుదువ్వుతూ వుండేది. ఆకుక్క కూడా ప్రొద్దునే మైకేలుతో ఫాక్టరీకెళ్ళేది. అతను సాయంత్రం బయటికొచ్చేదాకా గేటుదగ్గర పడిగాపులుపడి ఉండేది. అతడు సారాదుకాణాని కెడితే అక్కడి క్కూడా వెళ్ళేది. ఒకచోటికన్న మాటేమిటి; మైకేలు ఎక్కడికెడితే అక్కడికే వెంటపడేది. శలవురోజున కుక్కను వెంటబెట్టుకొని సారాదుకాణానికెళ్ళి జోరుగా సారాయెక్కించి ఇంటికొచ్చి, కుక్కను ఒడిలో కూర్చోపెట్టుకొని భోజనం చేస్తూ ఉండేవాడు. తనపళ్ళెంలో రొట్టెను తనచేత్తో దానినోటి కందిచ్చేవాడు. ఈప్రపంచంలో మైకేలు దెబ్బలాడనిదల్లా ఒక్క ఆకుక్కతోటే. భోజనం అయినతర్వాత

---

*పావెల్ ముద్దుపేరు.

పళ్లెములను గిరాచేసి వీపు గోడకాన్చి కూనిరాగాలుతీస్తూ విస్కీపట్టించేవాడు. కొంతసేపటికి విస్కీమత్తు అందుకొనేది. అలాగే గోడవానుకొనో లేకపోతే బల్లమీద ఒరిగో గుర్రుపట్టేవాడు. ఆపడక పడక మళ్ళీ తెల్లవారినతర్వాత ఫాక్టరీ కూత వినిపిస్తేనే లేవడం. ఇది రోజూ జరుగుచుండే మైకేలుదినచర్య. కుక్కకూడా అతని ప్రక్కనే పడుకునేది.

ఒకనాడు మైకేలు మామూలుగానే పగలల్లా ఫాక్టరీలో గడిపి ఇంటికివచ్చి పడుకున్నాడు. తెల్లవారినతర్వాత ఫాక్టరీకూతవిని లేవలేదు. ఆపడక పడక అయిదు రోజులు పడుకున్నాడు. పరుపుమీదపడి అటీదొర్లడం దొర్లాడు. కళ్లుమూసుకుని పళ్ళు పటపటకొరుకుతూ భార్యనిపిల్చి "ఏయి పాషాణం పట్టుకురా! నాకు విషం పెట్టు. తీసుకురా" అని కేకలేశాడు.

భార్య వైద్యుడిని పిలుచుకొచ్చింది. అనువైన చికిత్సలన్నీ చేయించింది. వైద్యుడు ఆసుపత్రికి తీసుకెళ్ళి శస్త్రం చేస్తేనేకాని లాభంలేదన్నాడు.

"పోపో! కుక్కలకొడకా! నేనిక్కడే చస్తాను." అని మైకేలు హుంకారం చేశాడు.

శస్త్ర చికిత్స చేయించుకోమని భార్య ఎన్నోసార్లు బతిమాలింది. ఆఖరు సారి మైకేలు పిడికిలి ఝాడించి "జాగ్రత్త! ఆపనిచేయకు! నేను బ్రతికుంటే నీకే చాలా నష్టం" అన్నాడు.

మర్నాడు ఉదయం మైకేలు మరణించాడు. భార్య, కొడుకు, కుక్క, ఇంకా పేటలోఉండే అతడి త్రాగుబోతు స్నేహితులు స్మశానానికెళ్ళి అంత్యక్రియలు జరిపించారు. భార్య లోపల్లోపల చాలా విచారించింది. కొడుకు 'పావెల్' ఏమీ విచారపడలేదు. మైకేలు శవాన్ని పూడ్చిపెట్టి జనమంతా ఇళ్ళకొచ్చేశారు. కాని ఆ కుక్క మాత్రం చాలా కాలంవరకు ఆ గోరీవద్దనే పడుకుని ఉండేది.

## ౨

తండ్రి మరణించిన రెండు వారములకు ఒకరోజు సాయంకాలము 'పావెల్' తప్పతాగి తూలుతూ ఇంటికొచ్చి తన తండ్రి కూర్చునే బల్లమీద కూలబడ్డాడు. తండ్రిలాగే బల్ల గ్రుద్ది భోజనం తీసుకురమ్మని తల్లిని కేకేశాడు. తల్లి గబగబావచ్చి కొడుకుని కౌగిలించుకుంది. "తే! భోజనం త్వరగా తే!" అని పావెల్ తల్లిని తొందర చేశాడు. ఈ మూర్ఖత్వంచూచి తల్లి తెల్లబోయింది.

"మానాన్న గొట్ట మెక్కడ? నేను తాగాలి తీసుకురా" అని తల్లికి ఆజ్ఞాపించాడు. పావెల్ ఇదివర కెన్నడూ సారా తాగలేదు. ఇదేమొదటిసారి. సారా చాలా నిస్సత్తువ చేసింది. ప్రపంచం అంతా గిర్రున తిరుగుతున్నట్టు కన్పడింది. దావురుమని ఏడ్వాలనుకున్నాడు. కాని ఏడ్పు బలవంతముగా ఆపుకున్నాడు. 'ఎందుకిల్లా

తాగి చెడిపోతావురా నాయనా!అని అతిప్రేమతో తల్లి మందలించింది. ఆ మందలింపులు చురుక్కుమని సూలాల్లాగుచ్చుకున్నాయి. ఈ అవస్థలో పావెల్‌ను మంచంమీద పడుకోబెట్టి తల్లి శైత్యోపచారాలుచేసింది. అప్పటి కాతనికి స్పృహ వచ్చింది. దేహం అంతా బరువెక్కినట్లయింది. నోరంతా వెగటుగావుంది. అంతా త్రాగినట్లే తానూ త్రాగితే తనకెందు కిట్లా జబ్బు చెయ్యాలాయని ఆలోచించాడు. బహుశా తనకింకా తాగే ఈడు రాలేదు కాబోలనుకున్నాడు.

ఇంతలో తల్లిదగ్గరకొచ్చి వీపు తట్టింది. "నాయనా! ఇప్పటినుంచీ తాగడం ఆరంభిస్తే నీవిక సంసారం ఏమినిరవాకం చేస్తావు? నా కేమి కూడెడతావు? అని అతి దీనంగా అడిగింది.

"అంతా తాగుతున్నారు. నేనూతాగేను" అన్నాడు పావెల్.

తల్లి నిట్టూర్పువిడిచింది. నిజమే, అంతా తాగుతూనే ఉన్నారు. కూలీలు కులాసాగా ఆనందించడానికి సారాదుకాణం తప్ప వేరేస్థలం లేదనే సంగతి ఆమెకు తెలిసిన విషయమే. చివరకు తెగించి "నాయనా! నువ్వుతాగవద్దు. మీ నాన్న తాగి తాగి నా బతుకింత దుస్థితికి తెచ్చాడు. నువ్వుకూడా తాగితే యిక గతేమిటి! నన్నుచూచైనా కొంచెం జాలివహించి ఈ తాగుడు మానేద్దూ!" అని చెప్పింది. రాళ్ళుకూడాకరిగే దీనస్వరంతో కొడుకును బతిమాలింది. ఆమె దీనాలాపము పావెల్‌కు చాలాసంతాపమును కలుగచేసింది. తనతండ్రి తాగివచ్చి తల్లిని చావమోదుతూఉండే ఘోరదృశ్యాలు అతనికి జ్ఞప్తికొచ్చాయి. తల్లి అతి ఓర్మితో తండ్రి పెట్టిన బాధలన్నిటినీ భరించినసంగతి జ్ఞాపకం చేసుకున్నాడు.

* * * *

"పావెల్" తల్లి పొడుగాటి మనుష్యులలోనే లెక్క. చిరకాలము నుండి పడుతూవుండే దెబ్బలతో నడుమువంగిపోయింది. దేహం అంతా వాతలమయం. వృద్ధాప్యంవల్ల ముఖం ముడతలు పడిపోయింది. కాని ముఖవర్చస్సు మాత్రం తప్పలేదు. కనుముక్కు తీరునుబట్టి మనిషి స్వభావం తెలుసుకోవడం అసంభవం కాదు. ఆమె లక్షణాలుచూస్తే అతి నమ్రస్వభావంకల ఉత్తమ స్త్రీ యని స్పష్టమవుతుంది. ఏ నిమిషాన్ని దెబ్బలు మీద పడతాయో అనే నిరంతర భయంతో బ్రతకడంచేత ఆ బెదురుకూడా ఆమె ముఖంమీద స్పష్టంగా కనబడుతోంది.

"పావెల్" తనతల్లి కండ్లనుండి సంతతధారగా కారుచున్న కన్నీళ్ళు చూచాడు. దుఃఖించవద్దని తల్లిని ప్రార్థించాడు. దాహమేమైనా ఇమ్మని కోరాడు. తల్లి నీళ్ళలో మంచుగెడ్డేసి తీసుకొచ్చింది. దాహం తీసుకొచ్చేటంతలో పావెల్ నిద్రపోయాడు. తల్లి నడుమువంచి అతని ముఖంవేసి తేరిపారచూసింది. చూస్తుంటే మనస్సులో ఒకవిధమైన ఆందోళన బయలుదేరింది. తాగుబోతు జీవితంలో ఉండే అవస్థ ఆమె కళ్ళకు కట్టినట్టు కనుపించింది. మంచినీళ్ళగ్లాసు

బల్లమీదపెట్టి గోడకు తగిలించివున్న క్రీస్తు పటంవైపువచ్చి మోకాళ్ళపై నిలబడి తలవాల్చి నిశ్శబ్దంగా ప్రార్థనచేసింది.

*　　*　　*　　*

ఈ సంగతి జరిగిన తర్వాత తల్లీ కొడుకుల జీవితము నెమ్మదిగా సాగి పోయింది.

* "వాసవ్" కుటుంబము సామాన్య కూలీ సంసారాలలో ఒకటి. వాళ్ళ ఇల్లు గ్రామం చివర పల్లపుపేటలో ఉంది. ఇల్లంటే పెద్ద విశాలమైన భవనంకాదు. ఒక చిన్న వంటగది. దాని ప్రక్కనే తల్లికొక చిన్నగది. కొడుకునకు మాత్రం కాస్త పెద్దగది. అంతాచూస్తే జానెడుకొంప. సామానుకూడా అంతంతమాత్రమే. చిన్నమంచం, ఒకబల్ల, దానిమీద ఒక అద్దం, రెండు మూడు కుర్చీలు, గుడ్డలు దాచుకొనే ట్రంకుపెట్టి తప్ప పావెల్ గదిలో వేరేమీ సామానులేదు.

పావెల్కూడా పేటలోనున్న ఇతర యువకులవలెనే జీవయాత్ర గడపడా నికి ప్రయత్నించేవాడు. అందరిలాగా క్రొత్తరకం షర్టులు ధరించి, రంగురంగుల నెక్టైలు బిగించి, పెద్ద బూట్సు తగిలించుకొని, చేత్తో బెత్తంపుచ్చుకొని, షోకుగా తిరుగుతూ ఉండేవాడు. నృత్యం చేయడం, విందులలో విలాసంగా కాలక్షేపం చేయడంకూడా నేర్చుకున్నాడు: పై వేషభాషల్లో ఇతర యువకులకు పావెల్కు ఏమీ తేడా లేదు. శలవొచ్చిందంటే తాగి తూలుతూ ఇంటికొచ్చేవాడు. కాని సారా అతని శరీరతత్వానికి పడలేదు. తాగినప్పుడల్లా గుండెల్లో మంట పుట్టేది. తలనొప్పితో బాధపడేవాడు. ఒకవిధమైన నిస్పృహ కలిగేది.

పావెల్కు ఈ జీవితమంటే విసుగుపుట్టింది. జీవితంలో ఏదైనా మార్పు వుంటే బాగుంటుందేమోనని అనుకునేవాడు. అప్పుడప్పుడు మాటవరుసగా యీ సంగతి తల్లికి చెపుతూ ఉండేవాడు.

*　　*　　*　　*

పావెల్ ఫాక్టరీలో కష్టపడి పనిచేసేవాడు. జరిమానాలు గిరిమానాలు లేకుండా మాటా మంతీ పడకుండా కాలం తర్లించుకునేవాడు. అతడి విశాల నేత్రాల్లో ఒకరకమైన అసంతృప్తి నాట్యమాడుతుండేది. అతని జీవిత విధానంలో కూడా మార్పు కలిగింది. పార్టీలకు పోయి విలాసంగా కాలక్షేపంచేయడం మానే శాడు. త్రాగుడు వదలిపెట్టేశాడు. శలవురోజుల్లో ఎక్కడికెళ్ళేవాడో తెలియదు. కాని ఇంటికిమాత్రం వెనుకటిలాగు తాగి తూల్తూ రాకుండా స్పృహతోనే వస్తు న్నాడు. అతన్నిచూస్తే తల్లికి అతడేదో విషయాన్నిగురించి దీర్ఘంగా ఆలోచిస్తు న్నట్లు కనబడేది. అతని కండ్లలో ఒక నూతనమైన తేజస్సు, నిగ్రహం, కార్య దీక్ష కనుపించాయి. మొత్తంమీద జీవితమంతా మారిపోయినట్లు తల్లి

* వాసవ్ పావెల్ ఇంటిపేరు.

గ్రహించింది. అందరిలాగునా కాకుండా తనకొడుకు రాగకుండా ఉన్నందులకు తల్లి సంతోషించేది. కాని ఎట్లా పరిణమిస్తుందో అనే అదటుమాత్రం మనస్సును కల వరపరుస్తూ ఉండేది.

పావెల్ ఎక్కడనుండో పుస్తకాలు తీసుకొచ్చి, రాత్రి చాలాసేపటివరకు తిరగేస్తూ ఉండేవాడు. అప్పుడపుడు వాటిలోనుంచి ఏవో కొన్ని సంగతులు నోటు బుక్కులో వ్రాసుకుంటూ ఉండేవాడు. అతనితల్లికి ఇదంతా ఏదో విడ్డూరంగాకన్ప డింది. మనిషి కొంచెం చిక్కిపోయాడు. ఏదైనా రుగ్మత ప్రవేశించిందేమోనని తల్లి అనుమానపడింది. కాని అల్లాంటిదేమీ లేదని తెలుసుకొని సంతుష్టిచెందింది.

తల్లి కొడుకులు మాటాడుకోవడంకూడా అరుదైపోయింది. పావెల్ ప్రొద్దున్నే టీ త్రాగి పనికి పోయేవాడు. మధ్యాహ్నం ఇంటికొచ్చి ముక్తసరిగా మూడు ముక్కలు* మాటాడి భోజనంచేసి మళ్ళీ పనిలోకి వెళ్ళిపోయేవాడు. సాయంత్రం చీకటిపడ్డాక యింటికొచ్చేవాడు. స్నానంచేసి భోజనంచేసి గదిలో కూర్చుని అర్ధరాత్రివరకూ ఏమిటో చదువుకుంటూ ఉండేవాడు. శలవు దినాల్లో ప్రొద్దున్నేపోయి ఏ అర్ధరాత్రివేళకో కొంపకు చేరుకునేవాడు. పట్టణానికెళ్ళిఉంటా డని తల్లికి తెలుసును. కాని ఎందుకో ఎక్కడికోమాత్రం తెలియదు. అపుడపుడు మాత్రం ఏదో ముక్తసరిగా తల్లితో ప్రసంగిస్తూ ఉండేవాడు. ఈ సూక్ష్మ సంభాష ణలవల్లనే తల్లి తన కొడుకులో గొప్ప మార్పును గుర్తించింది. అతని వేష భాషలలో ఒకవిధమైన నాజూకు కనపడింది.

ఒకరోజున పావెల్ ఒక పటమును తెచ్చి గోడకు తగిలించాడు. ఆ బొమ్మలో ముగ్గురు మనుష్యులు నిర్భయంగా నడుస్తున్నారు. సమాధిలోనుంచి లేచివచ్చిన క్రీస్తుదేవుని పటమని పావెల్ తల్లికి తెలియచెప్పేడు. చర్చికి వెళ్ళక పోయినా క్రీస్తుదేవుడంటే తన కొడుకునకు భక్తి వుందిగదా అని చాలా సంతోషం పొందినది.

క్రమంగా గోడలనిండా రకరకాల బొమ్మలు చేరినాయి. పుస్తకాల బీరువా లతో గది నిండిపోయింది. పుస్తకాలవల్ల గదికి క్రొత్తశోభ కలిగింది.

పావెల్ తల్లిని వెనుకటిలాగ "నువ్వు" అనడం మానేసి "మీరు" అని గౌరవపురస్సరంగా మన్నించడం ప్రారంభించాడు. ఈ మార్పు ఆమెకు చాలా సంతోషం కలుగచేసింది. దీనికంతా మూలం ఏదో విశేషం ఉండితీరాలనుకుంది. కాని కారణం తెలియనందున తల్లికి ఏదో ఒకవిధమైన అదటుపుట్టింది. నలుగురితో పాటు కాకుండా ఈ వింత ఏమిటాయని దిగులుపడింది. ఇంత చిన్నవయస్సులో ఈ వైరాగ్య మేమిటా అని విచారపడింది. తగిన వయస్సు కనుక బహుశా ఏ విలాసవతి ప్రేమపాశాల్లోనైనా తగులుకొని బాధపడుతున్నాడేమోనని అనుమా నించింది. ఈరకం విలాసానికి చేతులోపైసా ఆడాలి! కాని అతడు సంపాదించే డబ్బంతా తనచేతికే ఇవ్వడంచేత ఆ అనుమానానికి తావు లేకపోయింది.

ఈ సంశయం విడిపోకుండానే నెలలు గడిచిపోయాయి. రెండేండ్లపాటు ఈ రహస్యం బయటపడలేదు. ఒకరోజురాత్రి మామూలుగానే పావెల్ భోజనం చేసి తదేకనిష్ఠతో చదువుకుంటూ కూచున్నాడు. అతనితల్లి వంటఇంట్లో పని పూర్తిచేసుకొని దగ్గరగావచ్చి కూచుంది. ఏమైనా పనిమీద వచ్చిందేమోనని పాషా ఆమెకేసి చూశాడు. "ఏమీలేదు. ఊరికేనే వచ్చాను" అని చెప్పి మళ్ళీ వంట ఇంట్లోకి వెళ్ళిపోయింది. చేతులు కాళ్ళు కడుక్కొని ఏమిటో దీర్ఘంగా ఆలోచిస్తూ కాస్సేపట్లో మళ్ళీ పాషావద్దకొచ్చి నిలబడింది. కొంచెంసేపు తటపటాయించి చివరకు "నాయనా! నువ్వు రోజూ అర్ధరాత్రిదాకా మేల్కొని చదువుతూ ఉండే పుస్తకా లేమిటి?" అని అడిగింది.

పాషా చదువుతూ చదువుతూ వున్న పుస్తకాన్ని మూసి ప్రక్కనపెట్టి తల్లిని తనప్రక్కన కూచోపెట్టుకున్నాడు. ఏం చెప్తాడో అని ఆమె లోలోపల దడదడలాడింది. పాషా తలవంచుకుని నెమ్మదిగా చెప్పడం ప్రారంభించాడు.

"అమ్మా! నేను చదివే పుస్తకాలు చదువకూడదని అధికారులు నిషేధించినవి. ఈ పుస్తకాలలో మన కూలినాజనముయొక్క జీవితస్థితిగతులన్నీ ఉన్నవి వున్నట్లుగా వ్రాయబడి యుండడంచేత ఇవి నిషేధింపబడినాయి. ఇవి రహస్యంగా అమ్ముపడ్డాయి. వీటిని చదువుతుండగా అధికారులు చూశారంటే పట్టుకుని జైలులో పెడతారు. చూశావా మన అవస్థ! నిజం తెలుసుకోడానికి ప్రయత్నించేస్తే జైలు కెళ్ళాలిసొస్తుంది.

జైలుమాట వినేసరికి తల్లికి గుండె గుభేలుమంది. ఊపిరాడలేదు. పాషాకేసి దీనంగా చూచింది. అతడేదో కొత్తరష్టాల్లో పడిపోతున్నట్లామెకు కనబడింది. అతడి వాగ్ధోరణిలో ఒకవిధమైన ధృఢత్వం కనబడింది. తన కొడుకే అఘాతంలో పడిపోతాడో అనేభీతి ఆవహించింది.

"అయితే, ఈ పనెందుకు చేస్తావునాయనా?" అంటూ గ్రుడ్లలో నీళ్ళు త్రిప్పుకుంటుంది.

"ఎందుకంటావా; నిజం తెలుసుకోవాలని ఉంది కనుక" అని ఖచ్చితంగా జవాబుచెప్పాడు పాషా. అతడేదో ప్రమాదకరమైన పనిని సంకల్పించియున్నాడనీ తానెంతచెప్పినా వినిపించుకునే స్థితిలో లేడనీ తల్లి గ్రహించింది. నిస్పృహ చెందింది. రాబోయ్యే ప్రమాదాన్ని గురించి తల్చుకుని మాటరొణక్క ఏడ్వడం ఆరంభించింది. పాషా ఓదార్చడం ఆరంభించాడు.

"అమ్మా! నువ్వు కొంచెం ఆలోచించి చూడు. నీ బ్రతుకూ ఒక బ్రతుకేనా? నీకు నలభై ఏళ్ళు పైనబడ్డాయి. ఇంతవరకు ఏమైనా సుఖమనేది ఎలా ఉంటుందో ఎరుగుదువా? ఏరోజు కారోజు మానాన్న నిన్ను చావబాదని రోజు ఉందా? ఫాక్టరీలో గొడ్డులాగున చాకిరి చేసి చేసి విసిగి ఇంటికి వచ్చి, ఆ ఫాక్టరీ మీద ఉండే కసిఅంతా నీమీద తీర్చుకునేవాడు. మా నాన్న ఈఫాక్టరీలో ముప్పయి

సంవత్సరాలు పనిచేశాడు. అతను పని ప్రారంభించినపుడు ఈ ఫ్యాక్టరీఅంతా జానెడు ఎత్తైడుండేది రెండే ఇళ్ళు. కాని ఇప్పుడు చూచేవా ఎంతయిందో? దగ్గర దగ్గరగా నాలుగురెట్లు పెరిగింది. కాని మనకేముంది? సాహేబు సూబా ఎంత ఏలినా ఓడికి కుట్టుపోగులే." కూలీలు చెమటోడ్చి చాకిరి చెయ్యడం, యజమానులు కాలిమీద కాలేసికూర్చుని లాభాలు అనుభవించడం. ఫాక్టరీలు పెరుగుతూ ఉంటాయి. కూలీలు చస్తూ ఉంటారు,

పావెల్ మాటలువిని తల్లి నిశ్చేష్టురాలై పోయింది. ఏదైనా ఒక విషయాన్ని తరుస్తూఉండే సాధకుడు, అందులోఉండే సత్యాన్ని గ్రహించి ఇతరులకు చెప్పవలసివస్తే మహా స్పష్టంగాను, ఉత్సాహజనకంగాను చెప్తాడు. పావెల్‌కూడా ఆ అవస్థలోనే ఉండడంచేత కూలీల జీవితాన్ని గురించి తల్లికి బాగా నచ్చేటట్లు చెప్పాడు. అతని కండ్లలో అపూర్వమైన వెలుగువెలిగింది. కూలీల దురవస్థని గూర్చి అనర్గళంగా ఉపన్యసించాడు. ఈ బాధలన్నిటినీ భరించిన తన తల్లే అన్నిటికి ప్రత్యక్షమైన ప్రమాణం.

పాషా ఉపన్యాసాన్ని తల్లి కండ్లవెంబడి నీరు కారుస్తూనే వింది. అతడు తన జీవితాన్ని గురించి కార్మికుల జీవితాన్ని గురించి చెప్పిన విషయాలన్నీ నిజమేనని నమ్మింది. ఇదివరలో అపుడపుడు ఆమె తన అవస్థకు కారణమేమాయని ఆలోచించేది. చుట్టుప్రక్కలవాళ్ళతోకూడా సంప్రదించేది. కాని ఎవరూ తగిన సమాధానం చెప్పలేకపోయారు. కాని ఇప్పుడు తన కుమారుని ఉపదేశం ఆచిక్కు విడగొట్టింది. కొత్త వెలుతురు కనుపించింది. తన కొడుకింత ప్రయోజకుడై, మంచి యోచనాపరుడై జీవిత సత్యాన్ని తెలుసుకున్నాడు కదా అనే సంతోషం, సంతృప్తికూడా కలిగింది.ముఖ్యంగా పాషా ఆడవాళ్ళ అవస్థగురించి చెప్పేటప్పుడామె పరవశమైపోయింది.

అంతా విని విని కొంచెంసేపు దీర్ఘంగా ఆలోచించింది.

"అయితే నాయనా! నువ్వు చెప్పేదంతా నిజమే. కాని ఈ దురవస్థ తొలగించడానికి కేమిమార్గ?" మని అడిగింది.

"సరి, మార్గాలు తర్వాత ఆలోచించొచ్చు. ముందు మన కూలినాలీజనం అందరూ, తమ దురవస్థను గురించి తెలుసుకోవాలికదా! తెలుసుకున్నాక అప్పటి స్థితిగతులనుబట్టి ఉపాయాలను ఆలోచించవచ్చును."అని పావెల్ జవాబుచెప్పాడు.

ఆమె మాటాడలేకపోయింది. పాషా ముఖంలో ఒక విధమైన తేజస్సు ఆమె కగుపడి లోలోపల సంతోషం కలిగించింది. ఇతరు లందరిపిల్లలు మోస్తరుగా గ్రుడ్డెద్దు చేలోపడినట్లు నిర్భాగ్యజీవనం గడపకుండా, తన కొడుకు పదిమందికీ ఉపకారం జేయడానికి పాటుపడుచున్నాడుగదా అనే గర్వంకూడా కలిగింది. కాని, ఈభావాల పరిణామం చివరికెట్లా ఉంటుందోమాత్రం ఆమె ఊహించలేకపోయింది. ప్రజలు ఇతను చెప్పేమాటలు వినరనీ, చివరకితనొక్కడే ఊరూ

పేరూ లేకుండా నాశనమైపోతాదేమోనని భయపడింది. ఈసంగతి అతనితో చెప్పాలని అనుకుంది. కాని నోఁరాలేదు. ధైర్యం చెయ్యలేకపోయింది. అదీ కాకుండా, తనకొడుకు తనకన్న తెలివైనవాడని నిశ్చయించుకొని మౌనందాల్చింది. అతను చెప్పేమాటలన్నీ శ్రద్ధగా వింది. పావెల్ తాను చెప్పేమాటలన్నీ వృధా పోవడం లేదని గ్రహించి, పనివాళ్ళ కష్టాలనుగురించి, యజమానుల నిరంకుశత్వాన్ని గురించి చెరిగేశాడు. పాషా చెప్పేసంగతులన్ని రోజూ కండ్లఎదుట కనబడుతున్నా, అతడు చెప్పే తరహానుబట్టి తల్లికంతా ఆశ్చర్యంగా కనుపడింది. అతను చెపుతుంటే మధ్యమధ్య మాటకడ్డొచ్చి "నిజమే నాయనా?" అని వింతగా అడిగేది.

పాషా "నేచెప్పేదంతానిజం. ముమ్మాటికి నిజం. ఈరహస్యాలన్నీ బయటపెట్టిన మహానుభావులెందరో ఉన్నారు. వాళ్ళంతా ఇప్పుడెక్కడున్నారో తెలుసునా? జైళ్ళల్లోనూ, సైబీరియా మన్యాల్లోనూ, యమబాధలు పడుతున్నారు. నిరంకుశ రాజ్యంలో నిజంచెప్పితే నిష్ఠురంకాదూ! పాటకపు జనం పాట్లుగురించి ఉన్నదున్నట్లు చెప్పినందుకు అధికారులు వాళ్ళని పశువులులాగ తరిమికొట్టి జైళ్ళల్లో పారేసి నానాహింసా పెడుతున్నారు." అని పావెల్ ఉద్రేకంగా చెప్పాడు.

ఈసంగతి వినేటప్పటికి తల్లిగుడ్లల్లో గిర్రున నీళ్ళుతిరిగేయి. ఇదంతా నిజమా కాదా అనే భ్రాంతికూడా కలిగింది. సత్యంకోసం బాధలుపడుతున్న ఆ మహానుభావులను తలచుకొంటే ఆమెకు లోపల హడలుకలిగింది. దీర్ఘమైన నిశ్వాసం విడిచింది. బహుశా తనకొడుక్కికూడా అలాంటిఅవస్థే పడుతుందేమోనని భయపడింది. ఇక ఆ ఆలోచనలను భరించలేకపోయింది.

"నాయనా! చాలా రాత్రిపోయింది. పడుకో. మళ్ళీ ప్రొద్దున్నే పనిలోకి పోవాలిగా!" అంటూ వీపుతట్టింది.

"అలాగే. పడుకుంటాను. కాని నేను చెప్పినదంతా అవగాహనయినట్లేనా?"

"ఆ!..................కాని నాయనా ఇందంతా నీనాశనానికొచ్చిందోయి!" అని వెక్కి వెక్కి ఏడుస్తూ మాటాడలేక మాటాడలేక చెప్పింది.

పావెల్ ఇటూ అటూ కాస్సేపు పచారుచేస్తూ దీర్ఘంగా ఆలోచించాడు.

"సరే. నేను చేసేపని, నా ఆలోచన పాలోచన అంతా నీకు ఉన్నదున్నట్లు చెప్తాను. తర్వాత నీయిష్టం. కాని అమ్మా! నీకు నామీద ఏమైనా ప్రేమ ఉంటే నాపనికి మాత్రం అడ్డం రావద్దని నాప్రార్థన. నీ కాళ్ళుపట్టుకుని బ్రతిమాలుతున్నాను."

"........ఇస్! ఇదంతా నాకు తెలియకుండాఉంటే బాగుండేది.

పాషా ఆమెచెయ్యిపట్టుకుని ఆత్రంతో ఆమె జవాబుకై నిరీక్షించాడు. అతడు అతిగౌరవంగా "అమ్మా" అనిపిలచి ప్రార్థిస్తుంటే తల్లి ఒళ్ళు ఝల్లుమంది.

"నాయనా! నేనడ్డురాను. కాని జాగ్రత్తగా మాత్రముండు" అని గద్గద స్వరంతో చెప్పింది.

అతి ఆప్యాయంగా అతని శరీరం నిమిరి ఇల్లా అంది. "ఏమి నాయనా ఇల్లా చిక్కిపోతున్నావేం? కానియ్యి. అన్నిటికీ దేవుడే ఉన్నాడు. అతడే నీకు దిక్కు. నేను నీ కేమీ అడ్డురాను. నీయిష్టమొచ్చినట్లు నడుచుకో. కాని ప్రజల తగ్రహామాత్రం గమనించు. ప్రజలు వట్టి పశువులు. కేవలం మూర్ఖులు. ఒకళ్ళను చూస్తే ఒకళ్ళకు గిట్టదు. దురాశ, ఈర్ష్య, హెచ్చు. ఎదుటివాడికి అపకారంచెయ్యడం అంటే సంతోషం. ఊరికే ఎలాసంకోసం మనుష్యుల్ని క్షోభపెట్టడం ఈజనం యొక్క స్వభావం. ప్రజలకు వాళ్ళ లోపాలు చూపించి వాళ్ళని నువ్వు విమర్శ చేస్తే, చివరికి వాళ్ళునిన్నే అసహ్యించుకొని, నిన్ను నానాబాధలు పెడతారు. నాశనం చేస్తారు." పావెల్ తల్లి హితోపదేశాన్ని శ్రద్ధగా ఆలకించాడు.

"అమ్మా! నీవు చెప్పినదానిలో సత్యంలేకపోలేదు. ప్రజలు మూర్ఖులే. కాని ప్రపంచంలో సత్యం, ధర్మం అనేవి ఉన్నాయని తెలుసుకున్నాక ప్రజలు అనుకున్నంత చెడ్డవాళ్ళుకారని నేను గ్రహించాను. ఈ ఆలోచన నాకెల్లా కలిగిందో నేను చెప్పలేను. చిన్నప్పటినుండి భయభక్తులతో మెలిగాను. కొందరి అల్పత్వంచూచి అసహ్యించుకొనేవాడిని. కొందరంటే ఏమోకాని, ఏమీ కారణంలేకుండానే అసహ్యం వేసేది. కాని ఇప్పుడు నాకు ప్రజలంతా ఒక్కమో స్తరుగానే కనుపిస్తున్నారు. అందరిలోను సత్యం కనుపిస్తోంది. అందరి దురవస్థచూచి నా హృదయం క్షోభిస్తోంది. ఇంతకీ ఈ జనసామాన్యంలో ఉండే అధర్మం, అసత్యం, ఇంకా యితర దుర్గుణాలకీ వాళ్ళు బాధ్యులుకారని నా నమ్మకం. సత్యం ఆలాగే మరుగుపడి ఉంటుంది." అంటూ తల్లికి మెల్లగా నచ్చచెప్పాడు.

"తల్లి దీనంగా ఆతని ముఖంకేసి చూపింది". నీలో కలిగిన మార్పు అద్భుతం. ప్రమాదకరం. "ఇంతకూ దేవదేవుడే నిన్ను రక్షించాలి" అని ఆశీర్వదించి తన గదిలో కెళ్ళిపోయింది.

పావెల్ నిద్రపోయాడు. తల్లికి మాత్రం కంటిమీద కూరుకులేదు. తన కొడుకునకు ముందు రాబొయ్యే అవస్థలను తలుచుకుంటే ఆమె హృదయం కుమిలింది. తనగదిలోంచిలేచి పావెల్ గదిలోకివెళ్ళి, నిద్రపోవున్న ఆతని ముఖాన్ని తేరిపారిచూచింది. కండ్లవెంట అశ్రువులు జలజల రాలినాయి. ప్రేమమయమైన ఆ తల్లి హృదయములో ఏమి భావాలుత్పన్నమైనాయో పరమేశ్వరునికే ఎరుక! ఆమె కండ్లకేదృశ్యమగుపడినదో పాఠకులే ఊహించుకోవాలి.

## ౩

తల్లి, కొడుకూ జీవితం శాంతంగా గడిపేస్తున్నారు. కాపురం ఒక యింటోనే అయినా భావాలుమాత్రం వేర్వేరుగా ప్రవహిస్తున్నాయి. ఒకనాడు శలవు రోజున పావెల్ ఎక్కడికో ప్రయాణమైపోతూ తల్లిని పిలిచి "అమ్మా! రేపు శనివారం మన యింటికి కొందరు స్నేహితులొస్తారు" అని చెప్పాడు.

"స్నేహితులా?" ఎవరు నాయనా?

"మన ఊళ్ళోవాళ్ళు కొందరు, పట్టణంనుంచి కొందరూను."

"పట్టణంనుంచా?" అని ఉలికిపడి తల్లి ఏడ్వడం ఆరంభించింది.

"ఏమిటమ్మా ఇది! ఎందుకేడుస్తావు?"

"ఎందుకో నాయనా నాకూ తెలియదు, కాని ఏడుపొస్తోంది."

ఈ మాటలువిని పావెల్ గదిలోకొచ్చాడు. కాస్సేపు లోపల పచారుచేసి తల్లిదగ్గరకొచ్చి "అమ్మా! నీకేమయినా భయమేస్తోందా?" అని అడిగాడు.

"అవును నాకు భయమే. పట్నవాసంనుంచి వచ్చేవాళ్ళ సంగతేమిటో ఎవరెరుగుదురు?

"అబ్బ! ఈ భయమే మన నాశనానికి మూలం. ఈ భయాన్ని ఆధారం చేసుకునే అంతా మనమీద సవారి చేస్తారు. మనం బెదిరిన కొద్ది ఇంకా బెదిరిస్తారు. ఒక్క సంగతి చెప్తాను. జనానికి భయం ఉన్నంతకాలం మనం క్రిమి కీటకాల్లాగా జీవించాలిసిందే. భయాన్ని వదిలెయ్యాలి; ఆ సమయమొచ్చింది. ఏమయినాసరే, శనివారంనాడు వాళ్ళు నా యింటికి రాకతప్పదు"

"నా మీద కోప్పడకు బాబూ! నేను భయపడడంలో కొత్తేముంది! నా బ్రతుకంతా భయమే" అంది తల్లి దీనంగా.

"అమ్మా? క్షమించు. నేనేమి చెయ్యను? వాళ్ళురాకతప్పదు, అనిచెప్పి గుమ్మందాటి వెళ్ళిపోయాడు.

* * * *

శనివారం వచ్చేవరకు మూడురోజులూకూడా తల్లికి మనసు మనసులోలేదు, గుండెలలో ఎంతో బెదురుగా ఉండేది. పట్నవాసంనుంచివచ్చే ఆ స్నేహితులెల్లా ఉంటారో అని ఆమె కనుమానం. వాళ్ళేదో భయంకరంగానూ, అసాధారణంగానూ ఉంటారనుకుంది. తనకొడుకునం దిటీవల కన్పడే మార్పుకు బహుశా ఈ పట్నవాసపు స్నేహితులే కారకులై ఉంటారనుకుంది.

ఆఖరుకు శనివారం వచ్చింది. రాత్రి పావెల్ స్నానంచేసి క్రొత్త బట్టలు కట్టుకొని వీధిలో కెళ్ళడానికి సిద్ధమయ్యాడు, తనకోసమెవరయినావస్తే ఉండమని చెప్పవలసినదిగా తల్లితో చెప్పేడు. ఆ వచ్చేవాళ్ళుకూడా అందరి లాంటి మామూలు మనుష్యులే కనుక ఏమీ కంగారు పడవద్దని తల్లికి ధైర్యం చెప్పేడు.

కాని తల్లికి అటని మాటలేమీ తలకెక్కడంలేదు. కంగారు వలన చెవులు దిబ్బడలు పడిపోయాయి. స్పృహతప్పినంతపనై అలాగే కూలపడిపోయింది.

"నీకంతగా భయమేస్తుంటే ఎక్కడికయినా వెళ్ళిపో" అన్నాడు పావెల్.

ఈ మాటవినేసరికి తల్లికి ఎక్కడలేని కోపంవచ్చింది. తల ఊపి "ఊహు ఎక్కడకి వెళ్లను. ఎక్కడయినా ఒకటే" అంది.

పావెల్ గుమ్మం దాటేడు. అది నవంబరు మాసం. రష్యాలో నవంబరు నెలలో కురిసే మంచు ఇంతా అంతా అని చెప్పడానికి వీలులేదు. నడుస్తుంటే కాళ్ళ క్రింద అంతా మంచే. మనుష్యులు కూడా ముద్దకట్టుకు పోతారా అని పిస్తుంది. అలాంటి మంచులో పావెల్ ఎక్కడకో వెళ్ళేడు. కొంచెం సేపటికి ఇంటిచుట్టు ఎవరో నడుస్తున్నట్లు తల్లికి అనుమానం కలిగింది. అడుగుల చప్పుడు వినబడింది. అనుమానం బలపడింది. ఈలలుకూడా వినబడ్డాయి. ఇంతలో పెద్దటోపీ పెట్టుకొని సన్నంగా రివటలాగుండే యువకుడొకడు, తలుపుతోసుకుని లోపలికొచ్చేడు. వస్తూనే తల్లికి నమస్కారం చేశాడు. "పావెల్ ఇంకా యింటికి రాలేదా?" అని అడిగాడు. తల్లి నమస్కారం అందుకుంది కాని ఏమీ మాటాడలేదు.

ఆ యువకుడు తిన్నగా పావెల్ గదిలోకిపోయి, కంబళి కోటు ప్రక్కనపెట్టి, టోపీ చిలక్కొయ్యకు తగిలించి కాలినంటుకున్న మంచు తుపుతుపుని, బల్లమీద కెక్కి కూచుని ఆప్పుడించాడు. పరాయి కొంప అనే కొత్తలేకుండా, ఇంట్లోమనిషి లాగే ప్రవర్తించాడు; కాసేపటికి, బల్లమీద గెడ్డికంవేసి కూర్చుని, గది ఇటూ అటూ తేరిపారచూస్తూ, ఎదురుగాఉన్న తల్లిని ఈఇల్లు మీస్వంతమా, అద్దెకు పుచ్చుకున్నారా? అని అడిగాడు. తల్లి ముక్తసరిగా అద్దెకు పుచ్చుకున్నామని చెప్పింది. పెదవివిరుస్తూ "అట్టే మంచిఇల్లుకాద"న్నాడు. ఈధోరణి తల్లికికొంచెం కొత్తగా కనుపించింది. అయినా కొడుకు చెప్పినపని చెయ్యకతప్పదు. కనుక 'పావెల్ ఇప్పుడే వస్తానని చెప్పి వెళ్ళేడు. ఇక్కడేవుండండి' అంది.

"అలాగే, చెప్పనక్కరలేదు. ఉంటాను" అన్నాడు ఆ యువకుడు.

ఆ యువకుడితల గుండ్రం. గడ్డం సున్నగా క్షవరం చేసుకున్నాడు. సన్నని మీసంకూడా ఉంది. నీలిచొక్కా, నల్లషరాయి, పెద్దకోటు బూట్సు ధరించాడు. అతనిలో ఏదో ఒక విధమైన ఆకర్షణశక్తి కనుబడుతోంది. మనిషి కొంచెం హాస్యగాడనికూడా మొఖమే చెప్పింది. తల్లి మాట్లాడకుండానే అతని ముఖంకేసి చాలాసేపు చూచింది. ఊరూ, పేరూ వగయిరా వివరాలు అడుగుదామనే ప్రయత్నంలో ఉండగా ఆయువకుడే ఛటాలున ముందుకుజరిగి "నీనొసటిమీద ఆ కన్నమేమిటమ్మా" అని మర్యాదగా అడిగేడు. ఎంతమర్యాదగా అడిగినా అదివరకు ముక్కూమొగము ఎరుగని పరాయిమనిషి, ఇలాంటి ప్రశ్నవేస్తే, ఏలాంటివాళ్ళకయినా ఛర్రుమని కోపం రాకమానదు. ఈ మాటడగడంతోటే తల్లికి కోపంవచ్చింది. మొగం చిట్లించుకొని "దానితో నీకేంపనిలే" అని కరుకుగా జవాబుచెప్పింది.

ఏమమ్మా అంతకోపం! నేనుమరేమీ చెడుద్దేశ్యంతో అడుగలేదు. నాపెంపుడు తల్లికికూడా మొగంమీద ఇలాంటిగాయమే ఉండేది. ఆమెభర్తచెప్పులు కుట్టేవాడు. చెడ్డతాగుబోతు. ఒక రోజున మస్తుగా తాగి భార్యను కొడితే యిలాంటి గాయమే అయింది. నీ నుదిటిమీద గాయంచూస్తే ఆమె జ్ఞాపకానికొచ్చి అడిగేను" అంటూ ఆ అబ్బాయి సమాధానపరిచాడు.

తల్లికి, కల్ల కపటంలేని ఆ యువకుని స్వభావం అర్థమైంది. తన కనవస రంగా అతనిమీద కోపం కలిగినందుకు పశ్చాత్తాపపడింది. అదీకాకుండా, తన కొడుకుకోసం వచ్చిన పరాయి పెద్దమనిషిమీద కోపపడ్డం మర్యాదలోపం అను కుంది. చిరునవ్వునవ్వి "నాయనా! నాకు కోపంలేదు. ఇదివరకు నీకు నాతో ఏమీ పరిచయం లేకపోయినా, ఇంతలోనే ఇలాంటి ప్రశ్న వేసినందుకు నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఈ గాయంకూడా చచ్చి స్వర్గాన ఉన్న నా భర్తవల్ల కలిగిందే. అయితే మీదేదేశం నాయనా? టార్టారుదేశమా ఏమిటి?" అని సర్దుబాటుచేసింది.

"అబ్బే టార్టారు దేశంకాదు"

"నీ ధోరణిచూస్తే రష్యావాడవు కానట్టున్నావే?"

"రష్యావాడినే. అసలైన రష్యా యువకుడను. మాది 'కన్వేవ్' పట్టణం."

"ఇక్కడెన్నాళ్ళనుంచి ఉన్నావు?"

"నేను ఈ గ్రామం ఫాక్టరీలో చేరి నెలయింది. ఇక్కడ నీ కొడుకు, ఇంకా కొందరు స్నేహపాత్రులైన మంచివాళ్ళున్నారు. కాబట్టి కొంతకాలముంటా నిక్కడ" అని ఆ యువకుడు మీసం మెలేసుకుంటూ చెప్పేడు.

ఏ తల్లికైనా తన కొడుకు మంచివాడని ఎవరైనా పొగుడుతూవుంటే పరమ సంతోషంకదా! కనుకనే కాబోలు తనకుమారుని ప్రశంసచేస్తున్న ఆ యువ కునిపై ఆమెకు అనురాగం కలిగింది. దాన్ని తెలుపడానికి హాస్త టీ త్రాగించాలను కుంది. కాని అందరూ వచ్చేదాక వుంటానన్నాడు. ఆ వచ్చేవాళ్ళందరుకూడా ఈతనిలాగే తన కొడుకుని ప్రశంసచేస్తే బాగుండు ననుకుంది.

ఇంతలో తలుపు చప్పుడయింది. అట్టే ఒడ్డూ పొడుగూ కాకుండా ఉన్న ఒక చక్కని పల్లెటూరి పడుచమ్మాయి లోపలికొచ్చింది. చాలా బీద దుస్తులు. తల వెంట్రుకలు తుమ్మెద రెక్కల్లాగు నల్లగాఉన్నా, సంరక్షణలేక చింపిరిగా ఉన్నయి. ఆమె వస్తూనే చిరునవ్వుతో 'ఏమిటి! నాదేనాఆలస్యం' అని ఆ రష్యను యువకుని హెచ్చరించింది; మామూలు మర్యాదతో 'అబ్బే! లేదు. లోపలికి రా" అన్నాడు ఆ యువకుడు; ఆ అమ్మాయి తల్లికేసి చూసి నమస్కారముచేసి, "పావెల్ తల్లిగారు మీరే అనుకుంటాను. నాపేరు "నటాషా". పూర్తిపేరు వాసలీనా. మీపే రేమిటి?"

"పిలోగినీలోనా" అని తల్లి జవాబుచెప్పింది; ఒకళ్ళనొకళ్ళు ఎరుకపరచు కికోవడమైనతరువాత ఆ పిల్ల తనకోటునుతీసి పక్కన పెట్టింది. ఆమె కాలి

మేజోళ్ళు లేవు. మంచులో నడిచి రావడంచేత కాళ్ళూచేతులు కొంకరలు పోతు న్నాయి. ఆ విపరీతమైన మంచులో ఆపిల్ల నడిచిరావడం చూచి తల్లికి ఆశ్చర్యం కలిగింది. జాలికూడా వేసింది ఎన్నో రోజులనుంచి పరిచయమున్నట్లుగా ఆమె యెడల అభిమానం కలిగింది. వెంటనే వంటయింట్లో కెళ్ళి చలిపోవడానికి వేడి వేడి టీ తీసకొచ్చింది. ఆ పిల్ల టీ తాగుతూ బల్లమీద కూర్చొన్న యువకుడు "నకోడా"తో పిచ్చాపాటీ మాటాడింది. తల్లికూడా వాళ్ల బాతాఖానీలో చేరింది.

కొంచెంసేపట్లో, గజదొంగ "డేనియల్" కొడుకు వైసోవికవ్ వచ్చి ముఠాలో చేరాడు. మరికాస్సేపటికి ఫ్యాక్టరీ కాపలాదారుడైన "సోమలో" కొడుకు "యాకబ్", అతనితో ఇంకొక ఉషారైన కుర్రవాడొకడు వచ్చారు. వాళ్ళిద్దరు తల్లికి బాగాగుర్తే.

తల్లి అందరికీ ఫలహారాలు, టీ తయారుచేసి సిద్ధపరచింది. ఇంతలో పావెల్ వచ్చేడు. తయారుగాఉన్న ఫలహారాలుచూచి తనతల్లి ఆతిధ్యమర్యాదకు చాలా సంతోషించి ఆమెను అభినందించాడు. "సారాకూడా తెప్పించాలా?" అని తల్లి అడిగింది.

"అక్కరలేదు" అన్నాడు పావెల్.

సమావేశమైన మిత్రులంతా బల్లచుట్టూ కుర్చీలమీద కూచున్నారు. నటాషా మాత్రం ఒక పుస్తకం చేత్తోపుచ్చుకుని మూలగా దీపందగ్గర కూచుంది. తల్లి గిన్నెలతో టీ తెచ్చి అందరిముందరా పెట్టి, సభికులందరినీ మళ్ళీ ఒకసారి పరీక్షగా చూసింది.

"ఏమినాయనా! వీళ్ళేనా అక్రమపుపనులు చేసేవాళ్ళని నన్నుభయపెట్టింది" అని కొడుకు నడిగింది.

పావెల్ అవునన్నాడు. 'అంతా చిన్నపిల్లలే పాపం!' అనుకుంది తల్లి—

* * * *

సభికులు తమ కార్యక్రమం ప్రారంభించేరు.

"ప్రజలు ఇంత నిర్భాగ్యపుబ్రతుకు బ్రతకడానికి కారణం ఏమిటో తెలుసు కోవాలంటే" అంటూ నటాషా చదువడం ప్రారంభించింది.

"వాళ్ళెందుకంత దరిద్రంగా ఉన్నారు?" అన్నాడు నకోడా.

"వాళ్ళజీవితం ముందుగా ఎలా ప్రారంభమైనదో తెలుసుకోవద్దూ" అంది నటాషా.

అందరికి టీ అందిస్తున్న తల్లినోట్లోంచి అప్రయత్నంగా 'తెలుసుకోండి నాయనా! తెలుసుకోండి' అనేమాటలు జారిపడ్డాయి. అంతా ఆశ్చర్యపోయారు. ఏమిటేమిటని ఆమె నడగడం ప్రారంభించారు.

"అబ్బే! ఏమీలేదు. ఏమిటో నాలో నేనే గొణుక్కున్నాను." అంది తల్లి.

"పావెల్ ! మీ మాటల కడ్డం రావడం లేదు కదా నేను?" అని అడిగింది. అంతాకూడా ఐక్యకంఠంగా 'లేదు లేదు' అన్నారు. నటాషా 'అమ్మా' వాళ్ళు చేతులు చలితో కొంకరలుపోతున్నాయి. ఇంకొక గిన్నెడు వేడివేడి టీ తెచ్చి పెడుదూ?' అని అతి ఆప్యాయంగా అడిగింది.

తల్లి నిముషంలో టీ తెచ్చి యిచ్చింది. నటాషా వేడివేడి టీ త్రాగుతూ అలసట తీర్చుకొని మళ్ళీ పుస్తకం చదువడం మొదలెట్టింది. వాళ్ళ చదువు కేమి భంగం కలుగుతుందో అనే భయంచేత, చప్పుడుకాకుండా ఆతిథ్యమిచ్చింది. పని చేస్తూనే, ఆమె సన్నని గొంతుకతో సంగీతం పాడుతున్నట్లు నటాషా చదువుతూ వుండే సంగతులను ఆలకిస్తోంది. పూర్వకాలంలో మనుష్యులు కొండల్లోను, గుహ ల్లోను, నివసిస్తూ రాళ్ళతోనూ, రప్పలతోనూ జంతువులను చంపి పొట్టపోసు కుంటూ కాలం గడిపిన చరిత్రను నటాషా చదువుతోంటే ఆమె జాగ్రత్తగా ఆలకించింది. ఇందులో ఏమి తప్పుందా అని ఆమె కనుమానం కలిగింది. అడవి మనుష్యులను గురించి చెప్పుకుంటే తప్పేముందని కొడుకు నడుగుదా మనిపించింది. కాని మళ్ళీ ఎందుచేతనో తటాపటాయించింది. ఇతరులకు తెలియ కుండానే అతిథుల నందరిని పరిశీలనగా చూసింది.

'పావెల్' 'నటాషా' ప్రక్కనే కూర్చున్నాడు. అందరిలోనూ అరడే అందగాడు. నటాషా తల వాగావంచి పుస్తకం చదువుతోంది. మధ్య ఎడమచేతితో ముంగురులు వెనక్కి సర్దుకుంటోంది. 'సకోడా' మీసం మెలేస్తూవింటున్నాడు. ఒకడు అతిశ్రద్ధగా వింటున్నట్లు నటిస్తున్నాడు. ఇంకొకడు చిరునవ్వుతో తల ఊపు తున్నాడు. జనసమ్మర్దంచేత గది వెచ్చబడింది. వేడివేడి టీ కూడా దానికి తోడైంది. తల్లికూడా అందరితోపాటు వింటూ కూచుంది. ఆ మిత్రబృందాన్ని చూసేసరికి ఆమెకు తన కాలంనాడు సాయంకాలపు వినోదాలు జ్ఞప్తికొచ్చాయి. అందరు సారా సాపుగా ఎక్కించి సరసాలాడుకొనే రోజులు తలపుకొచ్చాయి. ఆ సందర్భము లోనే తన పెళ్ళి సంగతికూడా జ్ఞాపకానికొచ్చింది. ఒకనాడు సాయంకాలం ఒక చోట వినోదంగా కాలక్షేపం చేస్తుంటే, తనభర్త అమాంతంగా వచ్చి కౌగలించు కొని చీకటి గదిలోకి లాక్కెళ్ళి అతిమోటుగా తన్ను పెళ్ళాడమని అడిగేడు. ఈ మోటు సరసం చాలా విసంగాతోచి కోపం వచ్చింది. కాని అతనిపట్టు భల్లూ కంపట్టు. దున్నపోతులాంటి ఆ మనిషి కౌగిలిలోపడి గిల గిల కొట్టుకోవడమేకాని నోటంబడి మాటరాలేదు. ఆకౌగిలిలోంచి తప్పించుకోవడాని కెంతప్రయత్నించినా లాభంలేకపోయింది. ఇంతలో ఎవరో తలుపు తోశారు. అందుచేత సరసానికి ఆటంకం వచ్చింది. "ఆట్టే వెర్రివెర్రి వేషాలెయ్యకు నాదగ్గర. రేపు పెళ్ళి సంబం ధాలు కుదిర్చే ఏజంటును పంపుతాను. బేరం కుదుర్చు" అని కౌగిలివదలి చక్కా పోయాడు పెళ్ళికొడుకు. ఆవేళకి బ్రతుకు జీవుడా అని బయటపడింది.

మరునాడు ఏజంటు వచ్చాడు. పెళ్ళిఅయింది. తర్వాత సంగతి మనకు

తెలిసిన విషయమే. తన పెళ్ళినాటి ఈ గాథఅంతా ఆమెకు జ్ఞాపకంవచ్చి కళ్ళు మూసుకుని నిట్టూర్పు విడిచింది.

* * * *

నటాషా చదువుతోంది.

"ఇదివరకు జనం ఎల్లా బ్రతికేరో మనకెందుకు? ఇకముందు బ్రతుకు తెరువు చూసుకోవాలి." అంటూ 'వైషోవికవ్' విసుగుకున్నాడు.

"అవునవును. అంతే." అన్నాడింకొకడు

"అదేమన్నమాట ముందుసంగతి ఆలోచించాలంటే వెనుకసంగతి బాగా తెలుసుకోవద్దూ?" అన్నాడు 'శామొలో'.

అవునంటే అవునన్నాడింకొకడు. దానితో చర్చ ప్రారంభమైంది. ఒకళ్ళను మించి ఒకళ్ళు గట్టిగా మాటాడుతున్నారు. తల్లికివంతా అగమ్యగోచరంగా ఉంది. కాని ఒకళ్ళమొఖం మీదా కోపం కనబడడంలేదు. సాధారణంగా ఈలాంటి చర్చ వస్తే బూతులాడుకోవడం కొట్టుకోడం ఇదివరకు తల్లి తన కండ్లారా చూచింది: కాని ఈ చర్చల్లో తప్పుడుమాట లేమీ రాకపోవడం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది. అందరికోసూ అతి తీవ్రంగా చూస్తున్న 'నటాషా' ధోరణి తల్లికి నచ్చింది. వయస్సులో చినదైనా ఆమెకున్నంత బుద్ధి, శాంతం, ఓర్మి పెద్దవాళ్ళకైనా ఉండదు కదా అనుకుంది

"సోదరులారా! తొందరపడకండి. మనమంతా అన్నిటిని సమగ్రంగా తెలుసుకోవాలనే నా అభిప్రాయం. ఈ వాదంలో చాలా సారముంది. మనం పూర్వాపరజ్ఞానం బాగా సంపాదిస్తేనేగాని లాభంలేదు. అప్పుడే ప్రజలు జ్ఞానం అనే వెలుతురును చూడకలుగుతారు. మనం సత్యాసత్యాలను బాగా తరచి గ్రహించాలి. ఎవరైనా ప్రశ్నలువేస్తే సమాధానం చెప్పడానికి సిద్ధంగాఉండాలి" అంటూ నటాషా మెల్లగా చెప్పింది. నకోడా ఆమెమాటాడుతున్నంత సేపు అంగీకార సూచకంగా తలవూపాడు. 'వైషోవికవ్' ఇంకా ఇద్దరు నిలబడ్డారు.

నటాషా మాట్లాడడం మానింది. పావెల్ నిలబడి వైషోవికవ్ మొదలయిన వాళ్ళకేసి తిరిగి మాట్లాడడం ప్రారంభించాడు.

"కడుపుకింత తినడమేనా మనకు కావలసింది? కాదు కాదు. మనంకూడా మనుష్యుల లాగున బ్రతకాలి. మనమూ ప్రజల మనిపించుకోవాలి. మన భుజాల మీదెక్కి, మనకళ్ళు మూస్తూవున్న అధికారులకు, తమరెంత కళ్ళుమూసినా మన కంతా తెలుస్తోందనీ, మనం మూర్ఖులం కామనీ, పశువులం కామనీ; కేవలం జానెడు పొట్టనింపుకోవడమే మా ఆదర్శంకాదనీ, అందరితోపాటు పరువు మర్యాదలతో బ్రతికకోరుతున్నామనీ తెలియపర్చాలి. ప్రతికక్షులు మనలను దాస్యశాసంచేర ఎంత క్రుంగదీసినా ఇంకా తెలివితేటలలోను ఉత్సాహంలోనూ వాళ్ళకన్న మనమే మేలని మనం వాళ్ళకి స్పష్టీకరించాలి."

ఈ మాటలు వినేసరికి తల్లి హృదయం ఉప్పొంగి ఒక విధమైన గర్వం కలిగింది. ఏమి వాగ్ధాటి! అని లోలోపల సంతోషించింది.

"ఉదర పోషణానికి లోటులేనివాళ్లు చాలామంది ఉన్నారు. కాని ఆ రకం మనుష్యులలో మర్యాదగల పెద్దమనుష్యులు మాత్రం సున్న. ఈ రెంటిని సమన్వయము చేయడమే మనం చేయవలసినపని." అన్నాడు నకోడా.

"ఏమిటో! నువ్వా నేనా అనే లడాయి అవబోతుంటే యీ చిల్లర తగాదాలు లెక్కేమిటి?" అన్నాడు వైషోవికవ్.

"లడాయి అవడానికి ముందు ఇటువంటి చిన్నతగాదా లెన్నో కావాలి" అన్నాడు నకోడా.

ఇల్లా మాటాడుతూ ఉంటే అర్ధరాత్రయింది. ముందుగా వైషోవికవ్ అతని ముఠా దారితీశారు. నటాషా తననింటిదాకా దిగబెట్టమని నకోడా నడిగింది. అతడు సరేనన్నాడు. ఆమె తల్లిదగ్గిర శలవు పుచ్చుకోడానికి వంటఇంట్లో కెళ్ళింది.

"ఏమమ్మాయీ! నీ మేజోళ్ళు అంత అల్పంగా ఉన్నాయేమి? ఈ చలి కవే మాగుతాయి? ఊలుతో ఒక జత నేనల్లిపెట్టనా?" అని తల్లి నటాషా నడిగింది.

"అంతకన్నానా! సంతోషమే. కాని ఊలుమేజోళ్ళు గుచ్చుకొంటాయి."

"గుచ్చుకోకుండా మెత్తగావుండేటట్లు ఫసందుగా నేనల్లుతానులే.?"

నటాషా తబ్బిబ్బుపడి తల్లికేసి రెప్పవాల్చకుండా చూసింది.

"ఫరవాలేదు మరోలా అనుకోకు. హృదయపూర్వకంగా నీకు అల్లిఇవ్వాలని నాకు బుద్ధిపుట్టింది" అంది తల్లి. నటాషా తల్లి రెండుచేతులు పట్టుకొని కృతజ్ఞత చూపిస్తూ శలవుతీసుకుంది. నకోడా కొంతదూరంవాకా కూడావెళ్ళి దిగబెట్టేడు.

తల్లి కొడుకులు, అతిధుల నందరిని గుమ్మందాకా సాగనంపి తిరిగి గదిలో కొచ్చారు. పావెల్ "అమ్మా! ఈ వేళ సమావేశం చాలా బాగుంది. చాలా సంతోషం. చాలా రాత్రయింది, పడుకో" అని చిరునవ్వుతో బుజ్జగించాడు. "అవును నీకూ పడుకునే వేళయింది. నేనొక్క నిముషం తాలి పడుకుంటానులే. తల్లి గిన్నెలు, పళ్లెములు సర్దుకుంది. అంతా శాంతంగా నడిచినందుకూ, తన కొడుకు సంతోషించి నందుకూ. ఆమెకూడా సంతోషించింది.

"నాయనా! * పవలూషా! నీవు చేసిన ఏర్పాటంతా బాగానేఉంది. నకోడా చాలమంచివాడునుమా! ఆ నటాషా చాలా చాలా తెలివైన పిల్లే. ఎవరామె? అని పావెల్ నడిగింది తల్లి. "ఉపాధ్యాయిని" అని పచారుచేస్తూ పావెల్ చెప్పాడు. "అయ్యోపాపం; అంత దరిద్రమా! ఒంటినిండా కట్టుకునేందుకు బట్టయైనా లేదే. ఈలాంటి చలికాలంలో పల్చటి అగుడ్డ వేసుకుంటే పాపం జలుబుచెయ్యదూ? అయ్యో!..........ఆమెకెవరైనా బంధువులున్నారా?"

* పావెల్‌కు ఇంకొక ముద్దుపేరు

"మాస్కోలో ఉన్నారు. తండ్రి చాలా ధనవంతుడు. పెద్ద వ్యాపారం చేస్తాడు. డబ్బు తెగసంపాదించాడు. ఈ అమ్మాయి. ఈ ఉద్యమంలో చేరడం వల్ల తండ్రి ఇంట్లోనుంచి గెంటేశాడు. చిన్నప్పుడీమె బహు సుకుమారంగా పెరిగింది. ధనికుల ఇంట్లో పుడితే లోటేముంది ? ఏంకావలిస్తే అదేవస్తుంది. కనుక ఆమె చాల భోగభాగ్యాలను అనుభవించింది ఇప్పుడో ఈ అర్ధరాత్రి కటిక చీకట్లో చేతులూ కాళ్ళూ కొంకర్లుపోయే చలిలో, ఒంటినిండా గుడ్డైనా లేకుండా నాలుగుమైళ్ళు నడచి ఇంటికెడుతోంది."

ఈమాటలు వినేసరికి తల్లి నిశ్చేష్టురాలైపోయింది. కొడుకు ముఖంకేసి తెల్లబోయి చూసింది.

"ఇప్పుడామె కాలినడకను పట్టణం పోతుందా ?"

"ఆ"

"ఆమెకు చీకటి భయంలేదూ ?"

"భయంలేదు, గియంలేదు."

"ఇంత శ్రమపడి ఆమె ఇప్పుడే ఎందుకింటికెళ్ళాలి ? ఇక్కడ పడుకో కూడదూ ? మే మిద్దరం పడుకుందుముకాదూ ? "

"అబ్బే ! అలా పనికిరాదు. రేపు ఉదయం ఆమె ఇక్కడ కనుపించ కూడదు. రాత్రి ఇక్కడి కొచ్చినట్లు ఎవరికీ తెలియనేకూడదు."

ఈ మాట చెప్పేసరికి తల్లికి మళ్ళీ ఆత్రం హెచ్చింది.

"ఇదంతా ఏమిటో నా కర్థమవటంలేదు. ఇందులో ప్రమాదమేముంది ? అపాయమేమిటి ? తప్పేమిటి ? నాయనా ! నీవేమీ చెడ్డపని చేయడంలేదే ? ఏమిటి ?" అంటూ తల్లి ఆదుర్దాపడింది. పావెల్ ఏమీ తొట్రుపాటుపడకుండా సంగతి సందర్భాలు చెప్పేడు.

"అమ్మా ! మేము చేసేపన్లో ఏమీ దోషంలేదు. ఇక ముందుకూడా ఏవిధ మైన దోషం ఉండదు. కాని మా కందరికీ జైలుయోగం తప్పదు. నీకు తెలిసి ఉంటే ఎందుకైనా మంచిది.

ఈ ముక్కలు చెవిని బడేసరికి తల్లి గుండెలు ఝల్లుమన్నాయి. తలగిర్రున తిరగడం మొదలెట్టింది. కడుపులో ఆందోళన పుట్టింది. చేతులు, కాళ్ళు గడగడా వణకడం ఆరంభించినాయి. మాట తొణకలేదు. "భగవంతుడు మిమ్మల్ని రక్షించుగాక !" అని మెల్లని స్వరంతో కొడుకు నాశీర్వదించింది.

"అబ్బే ! నీదగ్గర అబద్ధమాడలేను. మేము జైలుకెళ్ళకుండా తప్పించు కోవడం అసంభవం. పోయి పడుకో. చాలా శ్రమపడ్డావు" అంటూ పావెల్ తల్లికి వందనం చేసేడు.

తల్లి మోకాళ్ళపై నిలబడి క్రీస్తుదేవుని ప్రార్థించింది. ఆమె కండ్లనుండి అశ్రువులు జలజల రాలినాయి. తన కొడుకు చెప్పిన కష్టాలన్నీ కండ్లకు కట్టినట్లు

కనుపించేయి. లేచి వీధి కిటికీనుండి తొంగిచూచింది. దట్టమైన మంచు. అనంతమైన మైదానం. ఆ మంచులో నడువలేక నడువలేక నడుస్తూవున్న ఒక పడుచు ఆమె దృష్టికి గోచరించింది. "ఓ భగవానుడా! దీనులంటే దయలేమా?" అని గొణుక్కుంటూ ప్రక్కమీద వాలింది.

## ౪

కాలచక్రం గిర్రున తిరిగింది. రోజులు, వారాలు గడిచిపోయాయి. ప్రతి శనివారం పావెల్ యింట్లో మిత్రులంతా సమావేశమవుతూ వచ్చారు. ఈ సమావేశాల మూలంగా వాళ్ళ ఉద్యమం బలపడుతూవచ్చింది. ప్రజలలో ఆరోజు కన్న ఆరోజు నూతనమైన కళకాంతులు కనిపిస్తున్నాయి.

ఈ ఉద్యమంలో కొత్తమిత్రులు చేరుతున్నారు. పావెల్ ఇంట్లో సభలు పెద్దవవుతున్నాయి. నటాషా చలిని, మంచును లక్ష్యపెట్టకుండా కష్టపడి ప్రతి శనివారం తప్పకుండా వచ్చేది. ఒకనాడు పావెల్ తల్లి ఆమెకోసం ఊలుతో మేజోళ్లు అల్లి ఇచ్చింది. నటాషా పరమానందభరితురాలై "అమ్మా! నామీద ఏమిదయమ్మా నీకు! చిన్నప్పుడు నీలాంటిదే ఒకదాది ఉండేది. ఒక చిత్రం చూసేవూ? పాపం వాళ్ళు చాలా నికృష్టజీవులు. నిర్భాగ్యులు. కాని వాళ్ళలోవుండే దయాదాక్షిణ్యం, మంచీ, ఇంకొకళ్ళల్లో లేదుసుమా!" అంది ఆలోచనాపూర్వకంగా.

"అబ్బ! నీవెంతదానవు? తల్లిని, తండ్రిని, బంధువులను, ఐశ్వర్యాన్ని విడిచిపెట్టి" అంటూ ఏదో మాటాడ బోయింది తల్లి. కాని మాటరాక ఆమెచెయ్యి పట్టుకుని మొఖం కేసి రెప్పవాల్చకుండా చూసింది. నటాషా చిరునవ్వు నవ్వుతూ ఏదో ఆలోచనలో పడింది.

"నేను నాబంధువుల్ని విడిచిపెట్టడం ఒక గొప్పా? మాతండ్రి శుద్ధమోటు మనిషి. మూర్ఖపు పట్టుదల. మా అన్నయ్యకూడా అచ్చంగా మానాన్న మోస్తరే. పైగా తాగుబోతుకూడాను. మా పెద్దక్కయ్య — పాపం! అన్నివిధాల దురదృష్టవంతురాలు — తనకన్న చాలాపెద్దవాడిని పెళ్ళిచేసుకుంది. అతడికి లెక్కలేనంత ధనంఉంది. కాని శుద్ధమోటదున్నపోతు. పైగా దురాశాపరుడుకూడాను. మా అమ్మ మాత్రం నీలాగే ఎంతో అమాయకురాలు. సత్యకాలంమనిషి. నీలాగే చివాట్లు చెప్పుదెబ్బలూ మహాతింది. అందరికీ గడగడలాడుతూ పిల్లిలా ఉంటుంది. పాపం అప్పుడప్పుడూ నాకు ఆవిడను మాత్రం చూడాలనుంటుంది. ఇంకెవ్వళ్ళ మీద లేదుసుమా!" అంది తలవాల్చుకుని.

తనలాంటి నిర్భాగ్యురాలింకొకతె వుందికదా అనుకొని తల్లి పాపం జాలిపడింది.

నటాషా వంచినతల పైకెత్తి ఒక్క నిట్టూర్పు విడిచింది. రెండుచేతులలో తల్లిభుజం తట్టి అప్రయత్నంగా మాటాడడం ప్రారంభించింది.

"ఓహో ! ఒక్కొక్కప్పుడు నాకు ఎంతో హాయి కలుగుతుంది. పరమానందం కలుగుతుంది. ఆ సుఖం మజా నీకు తెలియాలంటే మేము చేసేపని యెంత అద్భుతమైనదో ఎంత సౌఖ్యకరమైనదో నువ్వు తెలుసుకోవాలి. అప్పుడు దానిహాయి నువ్వూ అనుభవిస్తావు."

"ఆ సంగతులన్నీ తెలుసుకోడానికి నేనుచాలా ముసలిదాని నయ్యాను. పైగా మూర్ఖురాలినికూడాను." అంది తల్లి.

* * * *

శనివారపు సమావేశాల్లో పావెల్ ధోరణి హెచ్చయిపోయింది. ఒక్కొక్క రోజున విసుగు విరామం లేకుండా గంటలకొద్దీ మాటాడేవాడు. తగిన విశ్రాంతి లేకపోవడంచేత రోజుకి రోజూ చిక్కిపోతున్నాడు. అతను నటాషాతో మాటాడే టప్పుడొక విధమైన ప్రేమ ప్రసరిస్తూ ఉండేది. ఈ సంగతి తల్లి కనిపెట్టి నటాషా తనకు కోడలైతే బాగానే ఉంటుంది అని లోపల్లోపల సంతోషించేది.

పావెల్ మిత్రవర్గంలో రష్యను యువకుడైన ఆంద్రినకోడా చాలా చక్కగా మాట్లాడేవాడు. మంచి కుశాగ్రబుద్ధి. ఏపేచీలొచ్చినా లేచి వినడానికెంతో సొంపుగా ఉండేటట్లు వాదించి సర్దేశేవాడు. ఎప్పుడూ పావెల్‌కి ఏను అండ. వైషోవికవ్ ఎప్పుడూ చెప్పులలో కాళ్ళెట్టుకునే ఉండేవాడు. అంనితోపాటే "శామొలో". తగాదాలన్నిటికీ వీళ్ళే మూలం. * యాకవ్ సామెలో మాత్రం పావెల్. నకోదాల పక్షాన్నే ఉండేవాడు.

ఒక్కొక్కప్పుడు పట్టణంనుంచి నటాషాకు బదులు "అలెగ్జే ఇవానిష్" అనే నవయువకుడు వచ్చేవాడు. అతను సులోచనాలు పెట్టుకొని దీర్ఘాలుతీస్తూ చదువుతూవుండేవాడు. మామూలుగా సంసారంలోవుండే చిన్నచిన్న విషయాలను గురించి మాట్లాడేవాడు. కుటుంబజీవనం, పిల్లలు, వర్తకం, వ్యవసాయం, పోలీసులు, తినుబండారాల ధరలు, మొదలైన యావద్విషయాలమీద అతిపేళాకోళంగా మాటాడుతూ కడుపుబ్బేటట్లు నవ్వించేవాడు. ఈవిషయాలలో జరిగే దగా, ప్రజల తెలివితక్కువతనం, కష్టనష్టాలు—అన్నీ అరటిపండువలిచి చేతికిచ్చినట్లు తెలియజేస్తూ ఉండేవాడు. అతడేదో దూరదేశాన్నుంచి, ఈఅమాయిక ప్రజల నుద్ధరించడానికొచ్చినట్లు తల్లికి తోచింది—అతనిమీద ఒకవిధమైన అభిమానం కలిగింది.

పట్నంనుంచి తరుచుగా "శశాంక" అనే యువతికూడా వస్తూవుండేది. ఆమె చక్కని అందకత్తె. పలుచని ముఖం. విశాలమైన కళ్ళు. కాని ఆమెమాటలోనూ నడకలోనూ ఒకమోస్తరు మగతీరుండేది. ఆమె తీవ్రంగామాటాడేటప్పుడు

* పావెల్ ఇంటికొచ్చే సోషలిస్టు సేవకుడు.

కనుబొమలూ, ముక్కూ, అదిరేవి. ఒకరోజున ఆమె సంభాషణలో, మనం సామ్యవాదులం (సోషలిస్టులు) అని ఘంటాపథంగా చెప్పింది. ఈ మాట చెవిని బడడం తల్లికిదే మొదటిసారి. దానితో ఆమెకు గాభరా ఎత్తింది. "శశాంక" బొమలు ముడిచి మరింత గంభీరంగా "ఈ పునఃసృష్టికి మనం మన సర్వశక్తులను ధారపోయాలి. ప్రతిఫలమేమీ మనకుదక్కదనికూడా మనం తెలుసుకోవాలి" అంది.

సోషలిస్టులంటే జారును చంపినవాళ్ళనే తల్లి అభిప్రాయం. ఆమె చిన్నతనంలో ఒకప్పుడు భూస్వాములు తమ చెప్పుచేతల్లో ఉండే కూలీల దాస్యాన్ని పోగొట్టినందుకు జారుచక్రవర్తిమీద కక్షకట్టి, జారు ప్రాణాలను తీసేసేటందుకు శపథం చేసుకోమని దీక్షపట్టేరుట. వాళ్ళని ప్రజలు సోషలిస్టులని పిలిచేవారు. తల్లికీ సంగతి బాగా జ్ఞాపకముంది. అందుచేత ఇపుడు తనకొడుకు, అతని మిత్రులు సోషలిస్టులెల్లా అయ్యారో ఆమె కర్థముకాలేదు.

స్నేహితులంతా వెళ్ళిపోయాక తల్లీకొడుకుల కీసంభాషణ జరిగింది.

"పాషా! నువ్వు సామ్యవాదివా?"

"అవును, అయితే ఏమి?"

"అయ్యో! నాయనా! సోషలిస్టులు చక్రవర్తికి విరోధులుకారూ? వాళ్ళు ఒక చక్రవర్తిని చంపేశారు కూడాను. అవునా?"

"అవును. కాని మేమలాంటి పనులు చేయనక్కరలేదు. అని చిరునవ్వుతో పావెల్ జవాబు చెప్పేసరికి తల్లి మాటలాడక కొడుకువేసి రెప్పవాల్చకుండా చూసింది. తన కొడుకల్లాంటి చెడ్డపని చెయ్యడని నిశ్చయించుకుంది.

రానురాను ఆమెకు 'సోషలిస్టు' అనే మాట పరిపాటైపోయింది. ఆ మాట అంటే భయమే పోయింది. కాని ఏమైనాకాని 'శశాంక' అంటేమాత్రం ఆమెకేదో ఒకవిధమైన భయం కలిగేది.

ఒకరోజున తల్లి అంద్రీ నకోదాతో మాటాడుతూ శశాంక సందర్భంవచ్చి 'ఏమిటా పిల్ల ధోరణి? ఎప్పుడూ చిర్రూ బుర్రూమంటూ. ఎవళ్ళమీదో ఒకళ్ళ మీద అధికారం చలాయిస్తూనే ఉంటుంది' అంది.

నకోదా ఫక్కున నవ్వేడు.

'మావాగా చెప్పేవుకాదూ? పావెల్‌మీద మా మంచి దెబ్బకొట్టేవు! అతనికి కోపంవస్తుంది సుమా!' అని వేళాకోళం ఆరంభించాడు.

పావెల్ తెల్లపోయి "ఆమె చాలా మంచిది" అన్నాడు.

"నిజమే. కాని ఆమెకొక్క సంగతిమాత్రం"..........అని నకోదా చెప్పబోయాడు. ఇద్దరూ చర్చలోకిదిగేరు. తల్లికేమీ యీగొడవ తెలియలేదు. 'శశాంక' పావెల్‌తో కూడా చిర్రుబుర్రుమనడం తల్లిచూచింది. అప్పుడప్పుడు శశాంక పావెల్‌ను గట్టిగా చివాట్లు పెట్టడంకూడాకద్దు. కాని పావెల్ మాత్రం అతి ఓర్మితో,

చిరునవ్వునవ్వుతూ, ఎంతో దయతో ఆమె నాదరించేవాడు. నటాషాతో పోల్చి చూస్తే తల్లికి శశాంక యెడల ఒక విధమైన అయిష్టం ఏర్పడింది.

* * * *

సభలు జోరయినాయి. వారానికొక సభల్లా రెండు సభలైనాయి. ప్రతి సమావేశంలోనూ, పావెల్, నకోడా, శశాంక, నటాషా వగైరాలంతా చెప్పే మాటలు వింటూండే తల్లికి క్రమంగా భయం వదలిపోయింది. అప్పుడప్పుడీ సమావేశాల్లో సంగీతంకూడా ఉండేది. చక్కని పాటలను రంయ్యమని పాడుతూఉండేవారు. ఒకప్పుడు అతిదీనంగానూ, మరొకప్పుడు భక్తిపూరితంగానూ ఉండేవి పాటలు. ఆపాటలు పాడేటప్పుడు వాళ్ళ ముఖంలో మహత్తరమైన తేజస్సూ, శక్తీ నృత్యంచేస్తూ ఉండేవి. ఆపాటలను వీధుల్లోపాడే రోజులొచ్చాయని వాళ్ళల్లో వాళ్ళు అనుకుంటూ ఉండేవారు.

ఒక్కొక్కరోజున ఎప్పుడైనా వార్తాపత్రికలవల్ల, ఇతర దేశాల్లో కూలి నాలి జనానికి ఏమైనా సౌకర్యం కలిగినట్లు తెలిస్తే, ఆరోజున అంతా సంతోషం చేత ఉబ్బి తబ్బిబ్బయి పోయేవారు.

"మన ఫ్రెంచి సోదరులు మహా గట్టివాళ్ళు" అనేవాడొకడు. "ఇటలీ పని వాళ్ళు మరీ ఉద్దండపిండాలు" అని ఇంకొకడు. వాళ్ళపేర జయజయధ్వానాలు చేసే వాళ్ళు. దేశాల్లోఉండే పనివాళ్ళను వీళ్ళెప్పుడూ చూడకపోయినా, ఆఖరికి వాళ్ళ భాష ఒక్క అక్షరమైనా తెలియకపోయినా వాళ్ళయెడల అదొక విధమైన ఐక్య భావం, సానుభూతి కలిగేవి. అన్నిదేశాల్లోని కూలీలు తమ ఎదుట ఉన్నట్లే సంతోషించేవాళ్ళు. ఒకసారి అలాంటి సందర్భంలో నకోడా ఇట్లా ఉపన్యసించాడు:

"సోదరులారా! మనం వాళ్ళకొక సందేశం పంపితే బాగుంటుంది. తమకు చాలా దూరాన్నిఉన్న రష్యాలోకూడా తమ మతమును ఆదర్శమును కూడా విశ్వసించి, అందులకై కష్టపడే కార్మికులున్నారనీ, తమ విజయానికి వాళ్ళుకూడా సంతోషిస్తున్నారనీ, వాళ్ళకి తెలియడం చాలా అవసరం."

మిగిలినవారంతా భేష్ అంటే భేష్ అన్నారు.

ఈ రీతిగా జర్మనీ, స్వీడెన్, బ్రిటను, ఇటలీ మొదలైన దేశాల్లో ఉండే పాటకపుజనం యెడల అపారమైన సానుభూతి, సోదరభావం కనుపరుస్తూ ఉండేవాళ్ళు. వారందరి కష్టాలు తమ కష్టాలుగా భావించి చర్చలు చేస్తూ ఉండేవారు. పావెల్ చిన్నిగదిలో, ఈదేశం ఆదేశం అనే భేదం లేకుండా విశ్వకార్మిక సౌభ్రాతృత్వం కూలి నాలి జనాల్లో పుట్టింది. తమ శక్తిసామర్థ్యాలు ఎంతవరకున్నాయో తెలిసింది. అప్పుడే కొన్ని దేశాల్లో పాటకపుజనం పాలనాధికారం పొందటం చూచి, మానవజీవితాన్ని భావికాలంలో పరిపాలించవలసినది తామే యనే ధీమా కలిగింది.

ఈ భావాల పరిణామం, వైశాల్యంచూచి తల్లి తబ్బిబ్బయ్యేది. ఆమెకు దాని

ఆంతర్యం అర్థంకాలేదు. కాని ఇదంతా చూస్తూవుంటే ఆమెలో ఒక నూతనమైన ధైర్యం, సాహసం, సంతోషం మాత్రం కలిగేయి.

"మీరు మహా చిత్రమైన మనుష్యులులా ఉన్నారే. ఆర్మీనియాలోనూ, ఆస్ట్రియాలోను మరి ఇంకా ఎక్కడెక్కడో ఉన్నవాళ్లంతా మీ సోదరులేఅంటారే: ఈ దేశాల్లో పాటకపుజనం అంతా మీకు మిత్రులా? వాళ్ల కష్టాలకోసం మీరెందు కింత ఆతృతపడడం? వాళ్ళు సుఖపడుతుంటే ఆనందించడానికి మీకేముంది?" అంటూ తల్లి ఒకరోజున నకోడాను అడిగింది.

"తల్లీ! అలాకాదు. అంతా ఒకటే. ఈ ప్రపంచం మనది. అంటే కష్ట పడి జీవనంచేసే కూలి నాలి జనానిదే. మనకొక జాతి, దేశం, మతం అనే నియమం, నిషేధంలేదు. మనకంతా సోదరులే. మనతో చేరనివాళ్ళంతా మనదేశ శత్రువులే. సోదరులు, శత్రువులు తప్ప మరోరకంలేదు మనకి. ప్రపంచంలో కాయకష్టంచేసి బ్రతికేవాళ్ళంతా మన సోదరులు. ధనికులు, వాళ్ళకు తోడుగాఉండే అధికారులు మన శతృవులు. నిజంగా మన పనివాళ్ళయొక్క సంఖ్యాధిక్యం తలుచుకున్నా, మనకున్న అపారమైన శక్తి తలుచుకున్నా హృదయం ఉప్పొంగు తుంది. ఆసంగతి జ్ఞాపకంచేసుకున్నప్పుడల్లా శలవొచ్చినంత సంతోషం వస్తుంది. మనలాగే ఫ్రాన్సు, జర్మనీ, ఆస్ట్రియా మొదలైన దేశాలల్లో ఉండే పనివాళ్ళుకూడా తలుచుకొని సంతోషిస్తారు. మనమంతా ఒక తల్లి బిడ్డలం. ప్రపంచంలో అన్ని దేశాల్లో ఉండే పనివాళ్ళంతా ఒక తల్లిబిడ్డలే. ఈ భావం చాలా అద్భుతమైనది. ఓహో! ఈ మాట తలుచుకుంటే మహా ఆనందం. ఈభావం రోజురోజూ పెరుగు తోంది. ఇంతెందుకు? ఒక్కమాట చెపుతాను విను. ప్రపంచంలో ఎవరైనాసరే, సోషలిష్టంటే చాలు. అతడు ముమ్మాటికి, ఇప్పటికీ ఎప్పటికీకూడ మన సోదరుడే" అంటూ నకోడా దీర్ఘమైన ఉపన్యాస మిచ్చాడు. ఈ కబుర్లన్నీ ఆలకించేటప్పటికి ఆమెకు అమాయకమైన ఆనందం కలిగింది.

ప్రతిరోజూ పావెల్ ఇంటికొచ్చేటప్పుడు పావెల్ ఎవరినో ఒక మిత్రుని వెంటపెట్టుకొచ్చేవాడు. ఇద్దరూ కలిసి ఏమిటో చదువుతూ ఉండేవారు. అప్పు డప్పుడేమో వ్రాస్తూఉండేవారు. స్నానంచేసి విశ్రాంతిగా భోజనం చెయ్యడానికైనా తీరిక ఉండేదిగాదు. పుస్తకాలు చేతుల్లోఉంచుకొనే భోజనం చేసేవారు. ఈ తెరిపి లేని పనేమిటో తల్లికి అర్థమేకాలేదు. అప్పుడప్పుడు పావెల్ "మనమొక పత్రిక పెట్టాలి" అంటూ ఉండేవాడు.

* * * *

మొత్తంమీద బ్రతుకు ఒడుదుడుకుల్లో పడింది. ఏమిటో ఒకమాదిరి హడా వుడిగా ఉండేది. ఒకనాడు వైసోవికప్ నకోడాలో "ఏమర్రోయ్! వాళ్ళు మన గొడవే చెప్పుకొంటున్నారు. మనమిక్కడనుంచి మకాం ఎత్తాలి" అన్నాడు—

"ఎందుకూ ? ఈ పక్షులెప్పుడో ఒకప్పుడు వల్లోపడేవే"—అన్నాడు నకోడా.

* * * *

ఏకారణంచేతనో కాని మొదటినుంచీ తల్లికి అండ్రీ నకోడా అంటే ఒక విధమైన ప్రేమ, అభిమానం. అతడు 'అమ్మా' అని పిలిచినపుడల్లా ఆమె పరవశమైపోయేది. నకోడా ఆమెకు గృహకృత్యంలో కూడా కాస్త సాయపడుతూ ఉండేవాడు. ఏ ఆదివారంనాడైనా, పావెల్ ఊళ్ళో లేకపోతే పుల్లా గర్రా కొట్టి అందిచ్చేవాడు. ఇంటి గుమ్మం పాడైపోతే ఒకనాడు అతడే స్వయంగా బాగు చేశాడు. ఈ పనులవల్లకూడా అతడు తల్లిప్రేమకు పాత్రుడగుతూ వచ్చాడు.

ఇలా ఉండగా ఒకరోజున పావెల్‌కూ తల్లికీ యీ క్రిందిసంభాషణ జరిగింది.

"నాయనా ! నకోడా కూడా మనింటిలోనే మనతోపాటే భోజనం చేస్తూ ఉంటే బాగుంటుందనుకుంటాను. మీరిద్దరు రోజంతా ఒకచోట కలసి ఉండొచ్చు. మీ సంపాదన కలుపుకుంటే ఖర్చు కలిసివస్తుంది కూడాను."

"అవును. కాని నీకు శ్రమకాదూ ?"

"శ్రమకేమిలే. నా బ్రతుకంతా శ్రమే. నాకు బాధ ఎలాగూ తప్పదు. కాని ఇలాంటి మంచి మనిషి కోసం ఎంత బాధైనా పడొచ్చు."

"అయితే నీయిష్టం. అతడంగీకరిస్తే నాకూ సంతోషమే." కొద్ది రోజులకి నకోడా పావెల్ ఇంట్లోనే కాపురం పెట్టాడు.

౫

ఊరిచివరనున్న పావెల్ కొంపమీద అధికారులదృష్టి పడింది. రకరకాలుగా పుకార్లు బయలుదేరినాయి. అధికారులకే కాకుండా జనానికి కూడా ఆయింట్లో ఏమి జరుగుతోందో చూడాలనే నిష్ప్రయోజనమైన ఆదుర్దా కలిగి తొంగిచూస్తూ ఉండేవారు. ఇక పోలీసు గూఢచారుల సంగతివేరే చెప్పనక్కరలేదు.

ఒకరోజున నిలోనా బజారులో పోతూవుంటే సారాదుకాణందారు ఆపుచేసేడు.

"ఏమిటమ్మా నిలోనా ! నీ కొడుక్కింకా పెళ్ళి ప్రయత్నం చెయ్యవేమిటి? ఇల్లాంటి కుర్రాళ్ళను ఊరికే అచ్చోసి వదిలెయ్యకూడదు. ఎంత త్వరగా పెళ్ళి చేస్తే అంతమంచిది. పెళ్ళిచేసిపారేస్తే కఫంలోపడ్డ ఈగలాగ పడుంటాడు. రోజులు మునుపట్లాలేవు. మనిషినికూడా గొడ్డును కనిపెట్టాలిసినట్లు కనిపెట్టే రోజులు వచ్చాయి. రహస్యపుటాలోచనలు బయల్దేరేయి. విపరీతం ఏమిటీ ? యౌవనంలోవుండే కుర్రవాళ్ళంతా చర్చికి రావడం మానేసేరు. సారాదుకాణాలను బహిష్కరించి, రహస్యప్రదేశాలల్లో గుసగుసలాడుతున్నారు. అంత రహస్యమేమిటంట ? బాగా ఆలోచించుకో. నీవున్న స్థితిలో నేనుంటే ఈపాటికి కుర్రాడి

వేదో పిల్లనుచూచి ముడిపెట్టే వాచెనే. నీ ఆరోగ్యం బాగుండిరవా ?" అంటూ సలహా ఇచ్చి చక్కాపోయాడు.

నిలోనా ఇంటిప్రక్కనే 'మేరీకార్సునోవా' అనే కమ్మరి వానిభార్య ఒకామె కాపురముంది. ఆమె ఫాక్టరీలో ఫలహారములు అమ్ముకొని జీవించేది. ఒకనాడామె రహస్యంగా పావెలింటికివచ్చి, తల్లిని పిలిచి "ఇదిగో! నీకొడుకు జాగ్రత్త!" అంది.

"అసలు సంగతేమిటి ?"

"మరేమీలేదు. అతగాడిమీద చాలా చాలా పుకార్లు బయలుదేరినాయి జాగ్రత్త. అతడేదో సంఘం ఏర్పాటు చేస్తున్నాడుటకాదూ ? మరినాకు తెలిసింది కనుక చెప్తున్నాను" అని చెవులోఊది చక్కాపోయింది.

తల్లి ఈ మాటలన్నింటికీ ఊకొట్టేది. ఎప్పటి కప్పుడు కొడుకుతో మాత్రం చెప్పేది. పావెల్, నకోడాలు ఆమాటలన్నీ విని నవ్వుకునేవారు. ఒకనాడు నకోడా, పావెల్, తల్లీ ముగ్గురూ ఇల్లా కబుర్లు చెప్పుకుంటున్నారు :

తల్లి:—నాయనా ! ఇక్కడి పడుచుపిల్లలకు మీమీద చాలా కోపంగా ఉంది.

పావెల్:—ఎందుకూ ?

త:— ఎందుకా ? వాళ్ళు మిమ్మల్ని ప్రేమదృష్టితో చూస్తున్నారు. కాని మీరు వాళ్ళకేసి బొత్తిగా చూడడంలేదట. మీరు కష్టపడి పనిచేసి నాలుగురాళ్ళు సంపాదిస్తున్నారు తాగి తందనాలుతొక్కి అనాలుగురాళ్లు పాడుచేసుకోవడంలేదు. అందుచేత మీరు వాళ్ళకి తగిన భర్తలవుతారని వాళ్ళఆశ. కాని మీరు మాట్లాడరాయె. అదీకాకుండా, మీదగ్గిరకొచ్చే ఆడవాళ్ళశీలం అనుమానాస్పదమని అనుకుంటున్నారు.

పా:—అయితే ?

నకోడా:—(నవ్వుతూ) అమ్మా ! లోకం అంతటిదే. అంధకారంలోవుంటే అనుమానమే. పెళ్ళో పెళ్ళోయని వుబలాటపడే ఆపిల్లలకు పెళ్ళిఅంటే ఏమిటో నువ్వుకాస్త చెప్పలేక పోయావా ? పెళ్ళంటే ఎముకలు విరిగేటట్లు మొగుడిచేత దెబ్బలు తినడమేకాదూ ? ఆపెళ్ళికోసం దిగులుపడొద్దని చెప్పు.

త:—అయ్యో ! వాళ్ళకిమాత్రం ఆసంగతి తెలియదూ ? తెలుసును. ఆబాధలన్నీ ఎరుగుదురు. కాని ఏంచేస్తారు ? వేరే మార్గంలేదు.

పా:—అదేమన్నమాట: వేరేమార్గంలేకేమి ? కొత్తపంథాలో ఆలోచిస్తేసరి.

న:—పోనీ, వాళ్ళలో కొందరినిక్కడికి పిలిచి మనం బోధచేస్తే బాగుంటుందేమో అనుకుంటాను.

పా:—లప్పే ! అంతటితో సరిపోదు.

న:—ప్రయత్నం చెయ్యకూడదూ ?

పావెల్ (కాస్సేపు కండ్లుమూసుకొని ఆలోచించి) 'ఏముంది! జంటలేర్పడ తాయి. కులాసాగా కలిసి తిరుగుతారు. పెళ్ళిళ్ళుచేసుకుంటారు అంతే.' తల్లితన కొడుకుచెప్పిన మాటలను మనసులో ఉంచుకొని ఆలోచించుకోవడం ఆరంభిం చింది. పావెల్ అభిప్రాయాలంటే అంతా గౌరవిస్తారు. పెద్దవాళ్ళుకూడా అతన్నే అనుసరిస్తారు. కాని అతను ముక్కుకి సూటిగా నడిచేమనిషి. అందుచేత అతనిమీద కొందరికి కష్టంగా ఉంటుందేమో ననుకుందితల్లి.

ఒకరోజున వంటయింట్లో తల్లి పడుకుంది. ప్రక్కగదిలో పావెల్. నకోడాలిద్దరూ కూచుని ఏదో చదువుకుంటున్నారు. ఆసందర్భంలో వాళ్ళు మెల్లగా మాటాడుకునే యీమాటలు ఆమెచెవిలో పడ్డాయి.

నకోడా:—నాకు నటాషా అంటే ఇష్టం అనేసంగతి నీకు తెలుసుననుకుంటాను.

పా:—ఆ! తెలుసును.

న:—అవును. (ఇటూ అటూ పచారుచేస్తూ) అయితే ఆమె కీసంగతి తెలుసు నంటావా? నీ అభిప్రాయ మేమిటి?

పా:—తెలుసనుకుంటాను. అందుచేతనే ఆమె మన సమావేశాలకి రావడం మానుకుంది.

న:—మొగమాటం విడిచి ఆమెతో వున్నసంగతంతా నేను చెపితే ..........

పా:—ఏమని?

న:—ఏమనా? యిల్లా నీమీద నాకు..........

పా:—ఎందుకూ చెప్పడం?

న:—ఎందుకంటావా? చూడు. నా అభిప్రాయం ఏమిటంటే ఒక యువకుడు ఒక యువతిని ప్రేమిస్తే ఆసంగతి ఆమెకు చెప్పాలని. లేకపోతే దానిలో అర్థంలేదు. (పావెల్ చేతిలో తెరచియున్న పుస్తకాన్ని ఛటాలున మూసి వేశాడు. కొంచెంసేపు ఇద్దరూ మౌనముద్ర వహించారు.)

న:—సరి. మరేమిటి?

పా:—* ఆంద్రీ! నీ యభిప్రాయమేమిటో స్పష్టంగా తెలియడంలేదు. నువ్వు యేమిచేయదలచుకొన్నావో స్పష్టంగా చెప్పు. ఆమెకు నీమీద ప్రేమలేదనే నా వుద్దేశ్యం. ఒకవేళ మాటవరుసకి వుందనుకుందాము. సరే, మీరిద్దరు పెళ్ళి చేసుకుంటారు. కాని ఏమిసంబంధము? అతకదు. చాకలత్త— మంగలిమామ. ఆమె మంచిబుద్ధిశాలి. శాస్త్రవేత్త. నువ్వు కూలి చేసు కునిబ్రతికే మోటుమనిషివి. ఈఅస్వాభావికమైన సంబంధంవలన సంతానం బయలుదేరుతుందనుకో. ఆ పిల్లల సంరక్షణకోసం నీ వొక్కడవే తంటాలు పడాలి. నీపొట్టపోసికొని, పిల్లలను పోషించి, వాళ్ళ సౌకర్యాల కోసం యాతన పడటంలో నీ బ్రతుకు తెల్లవారుతుంది. మనం పూను

* నకోడా పూర్తిపేరు ఆంద్రి నకోడా. పావెల్ ఆంద్రి అని పిలవడం అలవాటు.

కున్న మహత్కార్యానికి నువ్వూ ఆమెకూడా ఎందుకూ పనికిరాదు........
కనుక ఈ ప్రయత్నం మానుకో. ఆమెను బాధపెట్టకు. ఇదిసర్యాదైనపని.

న :— • అలెగ్జీ ఇవానిష్ ఈ సందర్భంలో ఏమి చెప్పాడో తెలుసునా? మనిషి నాలుగు విధాలా సంపూర్ణమైన జీవితాన్ని అనుభవించాలని చెప్పేడు. జ్ఞాపకం లేదూ?

పా :— అవును జ్ఞాపకముంది. అది మనకోసం చెప్పినదికాదు. నీకు పూర్తిగా జీవితాన్ని అనుభవించడానికి సావకాశ మెక్కడుంది? శాశ్వతంగా ముందు రాబొయ్యే తరాలవారికి సౌఖ్యం కలుగచెయ్యాలంటే ప్రస్తుతం నువ్వు సంపూర్ణమైన త్యాగంచెయ్యాలి.

న :— (మెల్లగా) మానవమాత్రుడికది కష్టమైనమాట.

పా :— అవును. కాని తప్పనిసరి. వేరేమార్గం ఏముంది. ఆలోచించు.

న :—...............హృదయంలో సగభాగం ప్రేమిస్తోంది. మరొకభాగం వద్దంటోంది. ఏమి హృదయం యిది?

(ఈ సంభాషణ వింటూంటే తల్లికి పాపం నకోడామీద జాలేసింది. అంతే కాకుండా తన కొడుకు గతేమిటో అని దుఃఖమూ కలిగింది)

న :— సరి. అయితే ఇంతకూ నన్ను మాట్లాడకూరుకోమంటావు. అంతేనా?

పా :— నకోడా! అదే మంచిపని.

న :— సరే. నువ్వు చెప్పినట్లే చేద్దాం. కాని............... కాని...............
ఇల్లాంటి అవస్థ నీకు సంభవించినప్పుడు, నీకుకూడా చాలా బాధగానే ఉంటుందిసుమా?

పా :— ఎప్పుడోనా? ఎప్పుడో అక్కరలేదు. ఇప్పుడే నేనలాంటి బాధ పడుతున్నాను.

న :— అలాగా?

పా :— అవును.

న :— ఓహో! అబ్బ! చాలకష్టం.

ఈ సంభాషణ విన్న మరునాడు తల్లికి గాబరా యెత్తింది. ఆపుకోలేనంత దుఃఖం వచ్చింది. నకోడాకు కలిగిన ఆశాభంగమునకు విచారపడింది. ఇక తన కొడుకు సంగతి తలుచుకుంటే అసలు కడుపు తరుగుకుపోయింది. తలగడ కన్నీటితో తడిసి ముద్దయిపోయింది.

*　　*　　*　　*

గ్రామంలో సామ్యవాదులు నీలపు సిరాతో వ్రాసిన కరపత్రాలు పంచిపెట్టేరు. ఆవేళ ఏమూలకెళ్ళినా ఆ గొడవే. ఈ కరపత్రాలలో ఫాక్టరీలో జరిగే అన్యా

---

• పావెల్ మిత్రబృందంలో నొకడు. చాలా అనుభవశాలి.

యాలు, రష్యాలో ఇతర ప్రాంతములలో కూలీలలో జరిగిన ప్రబోధము * సెంటు పీటర్సుబర్గులో సమ్మె మొదలైన విషయాలన్నీ విపులంగా వ్రాసివున్నాయి. కూలీల బాగుకోసం అంతా ఏకంకావాలని అందులో హెచ్చరించారు. ఈ కరపత్రాలను చూచి అధికారుల ప్రాపకం సంపాదించి బాగా డబ్బుసంపాదించడం మరిగిన మేస్త్రీలు "విప్లవకారులు ! వెధవలు బయలుదేరారు. పనీపాటలేక ఏడుస్తున్నారు. ఇల్లాంటివాళ్ళను పట్టుకొని కాళ్ళూచేతులూ విరగగొట్టాలి" అని తిడుతూ వుండేవారు. వాళ్ళే ఆ కరపత్రములను అధికారుల దగ్గరికి తీసుకెళ్ళి చూపించేవాళ్ళు.

కష్టపడి పనిచేసి నానాబాధలుపడే యువకులు మాత్రం ఈ కాగితాలకోసం ఎప్పుడూ ఎదురుచూస్తూ వుండేవారు. ఆకాగితం రావడంతోనే గుంపులుగుంపులుగా చేరిచదువుకొని "అంతానిజమే. పూసగుచ్చినట్లు జరిగేవంతా వ్రాసేరు" అంటూ సంతోషించేవారు. మధ్యరకం మనుష్యులు నిస్పృహతో 'బాగానేఉంది. కాని ఏమిలాభం? పనిజరగదు' అంటూ విసుగుకొనేవారు. మొత్తంమీద ఈ కరపత్రాలుమాత్రం మంచి అలజడి కలిగించేయి. ప్రతిసోమవారం వచ్చే ఈకాగితాలెప్పుడైనా ఒక వారం రాకపోతే జనం తహతహ లాడిపోయేవారు. సారాషాపులోను, ఇతర వినోద స్థలాలలోను క్రొత్తమనుష్యులు కనపడేవారు. వాళ్ళు మనుష్యులనందరిని తేరిపారజూస్తూ ఉండేవాళ్ళు. నాలుగురోజులైన తర్వాత మాయమై పోయేవాళ్ళు.

పావెల్ తల్లికి, ఈగడబిడకంతా తన కొడుకే మూలమనే సంగతితెలుసును. పనివాళ్ళంతా అతనిని పూజ్యభావంతో చూడడంచేతా, అతనొక్కడే కాకుండా అతనితోపాటు చాలామంది ఉండడంచేతా మరేమి ప్రమాదం లేదనుకుంది. పైగా చాలా సంతోషించేది. కొడుకు ప్రయోజకుడై పదిమంది నోళ్ళలో పడితే ఏతల్లి సంతోషించదు ? కాని ఈ ప్రయోజకత్వంయొక్క ఫలితం ముందెట్లా పరిణమిస్తుందాయనే ఆలోచన కలిగినప్పుడు మాత్రం తల్లి గుండె నీరయిపోతూ వుండేది. గాభరాపడేది.

ఒకరోజున సాయంత్రం పొరిగింట్లోనున్న 'మేరియా కార్సనోవా' తల్లిని పిలిచి "ఏమమ్మోయి ! నిలోనా ! జాగ్రత్త ! కొంప ముంచుకొస్తోంది. కుర్రవాళ్ళు తిన్నగా ఉండరు. ఈవేళరాత్రి మీయిల్లు, మాజిన్ఇల్లు సోదాచూడడానికి పోలీసువాళ్ళు ఏర్పాటుచేస్తున్నారు. ఈవిషయం నాకు తెలిసింది కనుక ముందుగా చెప్పేను; కాని నేచెప్పినట్లు ఎవరికీకూడా తెలియకూడదుసుమా. నా కొంపమునుగుతుంది. అసలు నేనిక్కడకొచ్చి నీతో మాట్లాడేననే తెలియకూడదు" అని రహస్యంగా చెప్పి వెళ్ళిపోయింది. ఈ సంగతి వినేసరికి తల్లికి మనస్సు మనస్సులోనే లేదు. తలుపు వేసుకొని లోపల గదిలో కుర్చీలో కూలబడింది. అపాయం ముంచుకొస్తోందనే నిశ్చయం తోచింది. తన కొడుక్కి ప్రమాదం రాబోతుంటే

* సెంటుపీటర్సుబర్గు ఒకప్పుడు రష్యా ముఖ్యపట్టణము. ఇప్పుడది 'లెనిన్‌గ్రాడ్' అని పిలువబడుచున్నది.

తాను చేతులు కట్టుకుని ఏడుస్తూ కూచోడం దాగా రేపనుకుంది. వెంటనే కంబళి కప్పుకొని బయలుదేరి మాజిన్ ఇంటికెళ్ళింది. అతడు సుస్తీగా ఉండడంచేత పనిలోకెళ్ళడం మానేసి కిటికీవద్ద కూచుని ఏదో చదువుకుంటున్నాడు. తల్లి ఈ సోదా సమాచారం చెప్పేసరికి అతడు ఉలిక్కిపడి లేచాడు. కొంచం వణకడంకూడా మొదలెట్టాడు.

'మన మిప్పుడేమి చెయ్యాలి' అంది తల్లి. 'కాస్తఉండు భయంలేదులే' అన్నాడు మాజిన్. 'నామాటకేమిలే? నీవే చాలాభయపడుతున్నావే?' అందితల్లి.

'నేనా?' అని మాజిన్ బలవంతంగా చిరునవ్వు తెచ్చుకొని "అవును. నన్ను కొంచెం ఆ భయపిశాచం ఆవహించింది. ఈ సంగతి మనం పావెల్‌కు తెల పాలి. మా చెల్లిని పంపుతానులే. మన్నేమీ కొట్టిచంపరులే నీ విందికెళ్ళు. మరేమీ ఫరవాలేదు" అని చెప్పి తల్లిని సాగనంపేడు.

తల్లి ఇంటికొచ్చింది. పావెల్ గదిలోఉన్న పుస్తకాలన్నీ ఒకచోట సర్దింది. వాటి నన్నిటిని ఎందుకో ముద్దెట్టుకుంది. ఏమీ తోచక ఇల్లంతా తిరిగింది. ఏమూ లయినా ఏబాపరైనా కాగితా లున్నాయేమోనని జాగ్రత్తగా వెతికింది. బొయిలల సందులుకూడా వదిలిపెట్టలేదు. ఈ సంగతి తెలియడంతోనే పావెల్ పరుగెత్తు కొస్తాడనుకుంది. కాని అతను రానేలేదు. విసుగుతో కూచుంది.

కొంతసేపటికి పావెల్, నకోదాలు వచ్చారు. వాళ్ళు వచ్చీరావడంతో తల్లి లేచి "సంగతి తెలిసిందా" అని అడిగింది. "ఆ తెలిసింది. నీ కేమైనా భయ మేస్తోందా?" అని పావెల్ అడిగేడు.

"అబ్బో! భయమేమిటి నాళ్ళు చేతులు వణికిపోతున్నాయి."

"అమ్మా! భయం లేదులే. దానివల్లను ఎవరికీ ఏమీ ఇబ్బందిలేదు. వంట చేసేవా?"

పావెల్, నకోదాలు పక్కున నవ్వుకున్నారు. వాళ్ళు నవ్వుతూంటే తల్లికి కూడా అదుర్దా తగ్గిపోయింది. భయం పోయింది. పావెల్ కొన్ని పుస్తకాలు ఏరితీసి వాటిని దాచడానికి పెరట్లో కెళ్ళేడు. టీ కాచడానికి నకోదా లోపలి కెళ్ళేడు.

"అమ్మా! ఇలాంటి కబుర్లకు ఝడవకు. ఇందులో ఏమిలేదు. శుద్ధ నాటకం. ఇది వాళ్ళకే పరువు తక్కువ. కాని మనకేమీలేదు. పెద్దపెద్ద పోలీసు ఉద్యోగస్థులు వేషాలేసుకుని గుర్రాలమీదవచ్చి కొంపంతా నానాకంగారు చేసి వెదుకుతారు. నేలత్రవ్విచూస్తారు. పరుపులు తిరగేస్తారు. అటకలెక్కిచూస్తారు. అబ్బో! నానా గత్తర చేస్తారు. కాని ఏమి దొరకదు. మొఖాలకి బూజుమాత్రం అంటుకుంటుంది. అందుచేతనే వాళ్ళకి మమ్మల్నిచూస్తే అరికాలిమంట నెత్తి కెక్కుతుంది. ఈ పనంత అసహ్యాపుపని ఇంకొకటిలేదు. ఒకసారి నాగిది అంతా ఇలాగే చేశారు. ఏమి దొరకకపొయ్యేసరికి తెల్లమొగాలేసుకొని వెళ్ళిపోయారు. ఇంకొకసారివచ్చి నన్నుకూడా తీసుకెళ్ళి జైలులోపెట్టారు. అక్కడ నాలుగునెల

లున్నాను. అక్కడకూడా పనిపాటలు లేకుండానే కూచునేవాడిని. అప్పుడప్పుడు సిపాయిలు వచ్చి బయటికితీసి ఏదో ఆఫీసుకి తీసుకెళ్ళేవారు. అక్కడ అడ్డమైన ప్రశ్నలు వేసేవారు. ఒక ప్రశ్న కొక ప్రశ్నకి సంబంధమే ఉండేదికాదు. మళ్ళీ జైలుకే పంపుతూవుండేవారు. ఇల్లాగ అక్కడికీ ఇక్కడికీ తిప్పుతారు. వాళ్ళు శుద్ధ మూర్ఖులు. వాళ్ళకి పనిపాటలు లేవు. జీతంరాళ్ళు పుచ్చుకుంటున్నందుకు ఏదో పని కల్పించుకోవడానికని ఇలాచేస్తారు. చివరికి స్వేచ్ఛగా వదిలేస్తారు. ఇంతే" అంటూ తల్లితో నెమ్మదిగా కబుర్లుచెపుతూ పొయ్యి రాజేశాడు.

తల్లి:— అబ్బాయీ! మహా తమాషాగా మాటాడుతావుకామా?

న:— ఏం తమాషా వుంది?

త:— తమాషాకాదూ? ఎవళ్ళూ నీకు ఏమీ అపకారం చెయ్యనట్లు ఇదంతా ఏమిటో ఆషామాషీ వ్యాపారంలాగ మాటాడుతావేం?

న:— అవును. ఈ మహాప్రపంచంలో అక్రమం జరుగనివాడెవడు? నాకు జరిగిన అన్యాయాలకు అక్రమాలకు అంతులేదు. కాని నిత్యం చచ్చేవాడికి ఏడ్చేవాడెవడు? నాకు కష్టం అలవాటైపోయింది; అంచేతే ఏదైనా అన్యాయం జరిగినా నాకేమీ చీమకుట్టదు. ఏమిచేస్తాం? మన ఇష్టమా? నేను పడే కష్టాలు కొంతవరకు పనికద్దే. అయితేమాత్రం ఏంచేస్తాం? వాటిని తప్పించవాని కెవరితరం? కాబట్టి వాటినిగురించి ఆలోచించుకోకుండా ఉండడమే ఉత్తమం. మునుపు అపుడపుడు బ్రతుకంటే రోత పుట్టేది. కాని ఇప్పుడు నలుగురిని చూస్తే పరిపాటైపోయింది.

ఈ మాటలతో నకోడా తల్లి మనస్సును, ఈ సోదా ఆదుర్దానుండి తప్పించేయి. తల్లి అతని గుండెనిబ్బరానికి చాలా సంతోషించింది.

నకోడా వంగుని గిన్నెలో టీ కలుపుతూ "అమ్మా! సుఖంవస్తే వద్దనను; కాని దానికోసం దేవులాడడం మాత్రం నాచేతకాదు. నాకు తీరికాలేదు. అదే నా పద్ధతి" అన్నాడు. పావెల్ వుస్తకాలు దాచివచ్చి భోజనానికి చేతులూ కాళ్ళూ కడుక్కున్నాడు. చేతులు తుడుచుకుంటూ 'అమ్మా! నీవు మాత్రం జాగ్రత్తగా ఉండాలి. గుమ్మడికాయలదొంగా అంటే భుజాలు తడుముకున్నట్లు వాళ్ళు వచ్చేసరికి భయపడకూడదు. నువ్వు గడగడవణుకుతూ కనుపించావంటే. ఈఇంట్లో ఏదో ఉన్నదని వాళ్ళు మరీ అనుమాన పడతారు. మేమింకా ఏమీ చేయలేదు. ఇంతకూ మేము చేసేపనిలో ఏమీ తప్పులేదని నీకూ తెలుసునుగదా? సత్యం, ధర్మం, మాపక్షన్నే ఉన్నాయని కూడ నీకు తెలుసునుగదా? వీటికోసం మా జన్మంతా ధారపోస్తాం. ఇదే మాతప్పు. ఇందుకోసం మేమెందుకు భయపడాలి?" అంటూ కాస్త ధైర్యం చెప్పేడు.

తల్లి:— పావెల్! నేను జాగ్రత్తగానే ఉంటాను. భయపడను కాని త్వరగావస్తే బాగుండును. ఏదో అయిపోతుంది, అంది.

ఆరోజున పోలీసులు సోదాచూడడానికి రానేలేదు. మరునాటి ఉదయం తల్లి తానుపడ్డ కంగారుకు తానే నవ్వుకుంది.

## ౬

అనుకున్న రోజుకి సరిగా నెలరోజులయిన తర్వాత పోలీసులు సోదాచూడడానికి పావెల్ ఇంటికొచ్చారు. ఆ సమయానికి * నికోలేవై షోవికవ్ అక్కడే ఉన్నాడు. నికోలే, పావెల్, నకోడాలు ముగ్గురూ అర్ధరాత్రిదాకా కూచుని తాము స్థాపించబోయే పత్రికను గురించి ఆలోచించుకుంటున్నారు. తల్లి ఇవతల గదిలో కూచుని కునికిపాట్లు పడుతోంది. నకోడా లేచి ఎందుకో దొడ్డిగుమ్మంలోకి వెళ్ళేడు. అక్కడ అతనికి గుర్రపు కళ్ళెల గణగణలు, డెక్కల టకటకలు, మనుష్యుల గుజగుజలు వినిపించాయి. నకోడా గదిలోకెళ్ళి, పావెల్‌కు ఉప్పం దిచ్చేడు. తల్లికీమాటలు చెవిని పడడంతోనే మంచంమీద పడుకొనే గజగజ లాడింది. పావెల్ లేచివచ్చి తల్లికి ధైర్యంచెప్పి, వీధిగుమ్మం దగ్గిరికెళ్ళాడు. తలుపులు తీసి "ఎవరువారని ?" కేకేశాడు. ఛటాలున ఇద్దరు సార్జంట్లు ప్రత్యక్షమై పావెల్‌ను లోపలికి గెంటి గుమ్మందగ్గిర చెరోపక్కనా నిలబడ్డారు.

"ఎవరా ? మీరు అనుకునేవాళ్ళం కాము" అని సన్నంగా రివటలా ఉండే ఆఫీసరు జవాబు చెపుతూ లోపల ప్రవేశించి తన నల్లటి చిరుమీసాన్ని మెలేస్తూ నిలబడ్డాడు. గ్రామం తలారిని, కమ్మరిపనిచేసే ప్వెరికాల్‌ను, అతని ఇంట్లో కాపురముండే రైతు రైబినునుకూడా మధ్యవర్తుల క్రింద వెంటపెట్టుకొచ్చారు.

"అయ్యా ! ఇదిగో ఈమేనండి అతని తల్లి. ఇడుగో ఇతడే అసలు మనిషి" అని తలారి తల్లిని, పావెల్‌ను ఆఫీసరుకు చూపించాడు.

ఆఫీసరు మీసం దువ్వుకొంటూ "ఓహో ! నువ్వేనా పావెల్ ? అయితే మీ యిల్లు సోదా చూడాలి. ఏయ్ ముసలమ్మా ! లే అక్కడలే" అని అధికారం చలాయించడం మొదలెట్టాడు. ఇల్లు నాలుగు మూలలా కలయచూశాడు.

"ఎవరక్కడ ? ఇంకా ఎవరో ఉన్నారే లోపల ?" అని గర్జించాడు.

నికోలే వైషోవికవ్, నకోడా లిద్దరూ ముందుకువచ్చి నిలబడ్డారు. మధ్యవర్తిగా వచ్చిన రైబిన్‌రైతు దగ్గరకొచ్చి తల్లికి నమస్కారం చేసేడు. సంగతంతా చూస్తూవుంటే తల్లికి గాభరాఎత్తుతోంది. "ఏమిటి మనుష్యులంతా గుర్రుపెట్టి నిద్రపోయే అర్ధరాత్రివేళ ఇల్లా కొంపల్లో దూరి గల్లంతు చెయ్యడమేమిటి ?" అని తనలో తానే విసుక్కుంటూ వితర్కించుతుంది. భయంచేత చేతులుకట్టుకొని

* పావెల్ స్నేహితుడు సోషలిస్టు.

ఒకమూల నిలబడి జరుగుతూండే సంగతులన్నీ చూస్తోంది. దేహం కంపించింది. కళ్ళు తిరిగాయి.

పోలీసులు సోదా ఆరంభించారు. గదిలో వున్న పుస్తకాలన్నీ ఒకటొకటే చేత్తో పుచ్చుకొని ఆఫీసరు గబగబా పేజీలు తిరగేశాడు. కావలసిందేమీ దొరకక పోతే చిత్తుకాగితాల కట్టలను విసిరి పారేసేటట్లు రివ్వున విసిరి పారేసేవాడు.

"ఏమిటా పని ? పుస్తకాలెందుకల్లా విసిరిపారెయ్యడం" అని నికోలే ఆఫీసరును నిక్కచ్చిగా అడిగాడు. ఈ మాటమీద ఆఫీసరుకు కోపం వచ్చి ఏమిచేసి పోతాడో అని తల్లి గడగడలాడింది. ఆఫీసరు గుడ్లెర్రచేసి నికోలే కేసి చూశాడు. మళ్ళీ పేజీలు తిరగెయ్యడం మొదలెట్టాడు.

"ఏయి ! సిపాయి ! నిన్నే. ఆ పుస్తకాలు తియ్యవేం ? అన్నీ సరిగా పెట్టు" అని మళ్ళీ నికోలే దబాయించాడు.

ఆఫీసరు మళ్ళీ రౌద్రంతో చూశాడు. "పుస్తకాలు తియ్యాలి ? తీస్తారు ! తీస్తారు తొందరపడకు" అని హుంకారం చేశాడు.

ఒక సిపాయి నికోలేకేసిచూస్తూ పుస్తకాలన్నీ జాగ్రత్తగా బొత్తులుపేర్చాడు.

ఇంతలో ఆఫీసరు "ఎవరది ? ఏమిటాశబ్దం ? కాస్సేపు ఊరుకోండి. ఎవరో బైబిలు చదువుతున్నట్లున్నారే ?" అని అరిచాడు.

"నేను" అన్నాడు పావెల్.

"ఓహో ! నువ్వా ? ఈ పుస్తకాలన్నీ ఎవరివి ?"

"నావే"

"ఓహో ?" అంటూ ఆఫీసరు నెమ్మదిగా పడకకుర్చీమీద వ్రాలి కాళ్ళు బార సాచాడు. బద్ధకంతో మెటికలు విరిచి మీసాలు దువ్వుకుంటూ నికోలేకేసి తిరిగి నీపేరేనా ఆంద్రినకోడా ? అని అడిగాడు.

"అవును" అంటూ నికోలే ముందుకెళ్ళాడు. నకోడా అతడిచెయ్యి పట్టుకొని వెనక్కిలాగి, "అచ్చే, అతడు చెప్పినమాట సరికాదు. ఆంద్రేనకోడాను నేను. అతను కాడు." అని ఆఫీసరుతో చెప్పేడు.

ఆఫీసరు నికోలేకేసి వ్రేలుచూపించి నోటితో చుకచుక ధ్వనిచేసి "జాగ్రత్త" అని బెదరించేడు. మళ్ళీ కాగితాలు తిరగెయ్యడం ప్రారంభించాడు. ఇంటివెలుపల వాడ్లో కూడా ఎవరో వెదకులాడుతూనే ఉన్నారు.

ఆఫీసరు 'ఏయి నకోడా ! ఇదివరకు రాజకీయ నేరాలకోసం నీమకాం సోదా చేయబడినదా లేదా ?' అని చాల అమర్యాదగా ప్రశ్నవేసేడు.

"ఆ, చూసేరు. ఇదివరకు రాసన్‌లోను, సారవెలోను సోదాఅయింది. కాని అక్కడ సోదా చెయ్యడానికొచ్చిన ఉద్యోగస్తులు మాత్రం నన్ను మర్యాదగా మిష్టర్ నకోడా అని పిల్చేవారు"

ఆఫీసరు నకోడాదెబ్బను గ్రహించేడు. "అయితే, మిష్టర్ నకోడా,

ఈమధ్య ఫాక్టరీలో రాజద్రోహ సంబంధమైన కరపత్రాలను, పుస్తకాలను పంచి పెట్టే తుంటరులెవ్వరో నీకు తెలుసునా ?"

నకోడా చిరునవ్వునవ్వుతూ ఏదో చెప్పబోతున్నాడు. ఇంతలోనే నికోలే అందుకుని "ఇక్కడ తుంటరులను చూడడమిదే మొదటిసారి మాకు."అని ద్వంద్వార్థంగా దెబ్బకొట్టేడు. అంతా తెల్లబోయి నిశ్చేష్టులయినారు. తల్లి భయం వేరుగా చెప్పనక్కరలేదు.

"ఈగాడిద నిక్కడనుంచి గెంటెయ్యండి" అని అతి కోపంతో ఆఫీసరు హుంకరించాడు. ఇద్దరు సిపాయిలు నికోలేను వంట ఇంట్లోకి తీసుకుపోయారు.

"ఉండండి; కోటు తొడుక్కోవాలి." అని నికోలే, సిపాయిలను దబాయించాడు.

ఇంతలో దొడ్లో సోదా చూస్తున్న పోలీసు కమీషనరు లోపలికొచ్చి "ఎంత వెదకినా ఎక్కడా ఏమీ కనబడలేదు" అన్నాడు.

"అవును ఆసంగతి నాకుముందే తెలుసును. ఇక్కడ ఈ విషయాల్లో బాగా ఆరితేరిన పక్కామనిషి ఉన్నాడు."

ఈమాటలన్నీ వింటూంటే తల్లికి ఆఫీసరు యెడల పరమ అసహ్యం తోచింది. ప్రజలంటే యింత నిర్లక్ష్యంతోచూచే ఇతడెవడా అనుకుంది. ఇంత కర్కోటక మనిషిని ఆమె ఎప్పుడూ చూడలేదు. ఇల్లాంటి కటికివాళ్ళతోనే పావెల్ ప్రభృతులు తగాదాపడుతున్నారనే సంగతి తలుచుకునేసరికి ఆమె కెంతో భయంకలిగింది. ఆఫీసరు నకోడాకేసి చూచాడు.

"ఏయ్: మిస్టర్ * ఆంద్రీ ఆనిస్మాఫ్ నకోడా, నేను నిన్ను అరెస్టు చేస్తున్నాను."

"ఎందుకు?"

"ఆసంగతి తర్వాత చెప్తానులే" అని పోలీసు ఆఫీసరు తల్లికేసి తిరిగి "ఏయ్! నిలోనా వాసవ్, నీకు చదువొచ్చునా?" అని అడిగాడు.

"రాదు" అన్నాడు పావెల్.

"నిన్నడగడంలేదు. నువ్వెందుకు జవాబు చెప్తావు?"..........ఏయి! ముసలమ్మా! నీకు వ్రాయడం చదవడం తెలుసునా?" అని ఆఫీసరు గట్టిగా తల్లి నడిగాడు.

ఈధోరణిచూస్తే మరింత చిరాకెత్తింది తల్లికి. కార్తీకమాసంలో తెల్లవారు ఝామున చన్నీళ్ళస్నానం చేసినవాళ్ళు వణికేటట్లు గడగడలాడింది. చివరకు ఎట్లాగో ధైర్యం చిక్కబట్టుకొని "ఏమిటయ్యా, అల్లా అరుస్తావేమిటి? నీవింకా చిన్నవాడివేనే. అశుభం శుభం ఎరుగనట్లున్నావు. ఎప్పుడూ నీకు కష్టం నాటలేదను కుంటాను" అంది.

---

* నకోడా పూర్తిపేరు.

పావెల్, నకోడాలు తల్లిని తొందరపడొద్దని హెచ్చరించారు. ఆమె కొంచెం సర్దుకొని ఆఫీసరుకేసి తిరిగి "ఏమయ్యా! ఇల్లాజనాన్ని ఎందుకయ్యా— ఎత్తుకెడుతున్నారు" అని అడిగింది.

"ఆ సంగతి నీకెందుకు? ఊరుకో" అని ఆఫీసరు తల్లిని కసిరికొట్టి సిపాయి లను పిలిచి నికోలాను తీసుకు రమ్మనమని ఆజ్ఞాపించాడు. తానేదో కాగితాన్ని బిగ్గరగా చదవడం మొదలెట్టేడు. ఇద్దరు సిపాయిలు, చెరొకచేతిని పట్టుకొని నికోలేను తీసుకువచ్చారు.

"టోపీతియ్యి" అని గర్జించాడు ఆఫీసరు. "రెండుచేతులు చెరొకళ్ళు పట్టు కుంటే టోపీతియ్యడ మెట్లాగ?" అన్నాడు గట్టిగా నికోలే. ఆఫీసరు ఒక కాగి తాన్ని బల్లమీద పడేసి దస్కత్తు చేయుండని ఆజ్ఞాపించాడు. అంతా కిక్కురు మన కుండా దస్కత్తు చేసేరు. ఈ చర్యంతాచూస్తే ఆమెకు గుడ్లల్లో నీళ్ళు తిరిగాయి. నిస్సహాయత్వం తోచింది. ఈమధ్య లేదు. కాని నిస్పృహతో ఏడ్వడం ఆమెకు కొత్తగాదు. మొగుడు చావుదెబ్బలు కొడితే ఏంచెయ్యలేక ఏడ్చేది. ఈ వాలకం అంతా చూస్తే ఆమెకు ఆరోజులు జ్ఞప్తికొచ్చాయి.

ఆఫీసరుకు ఆమె ఎంతఏడ్చినా జాలి కలుగలేదు. పైగా అతి పొగరుబోతు తనంగా "ఎందుకేడుస్తావు? ముందుంది ముసళ్ళ పండగ. ఏడ్చేరోజు లింకా ఉన్నాయి. ఏడుపంతా ఇప్పుడే అయిపోతే ముందుకష్టం" అని హేళన చేశాడు.

"బిడ్డలను కన్న తల్లికి ఏడుపుకు కొదవలేదు. నాయనా! నీకు తల్లి అంటూ ఉంటే ఆమెనడుగు. ఆమెకు బాగా తెలుస్తుంది."

ఆఫీసరు గబగబా కాగితాలను తన సంచిలో పడవేసుకున్నాడు. పోలీసు కమీషనరు కేసి తిరిగి 'మీపరగణాలో జనం బాగా తెలివిమీరేరు సుమా!' అన్నాడు. కమీషనరు, 'చిత్తం, శుద్ధ తిరుగుబోతు రకాలండీ' అని చప్పరించేశాడు.

సిపాయిలకు ఖైదీలను తీసుకుపొమ్మని ఆఫీసరు ఆజ్ఞ ఇచ్చాడు. పావెల్, నికోలే, నకోడాలవద్ద శలవు పుచ్చుకున్నాడు. ఒకళ్ళ నొకళ్ళు అభినందించు కున్నారు. నికోలే పావెల్ చేతిని గట్టిగా గుండెలమీద అదుముకొని ఉద్రేకం పొందాడు. నకోడా చిరునవ్వునవ్వి తల్లితో ఏమిటో చెప్పాడు. ఆమె దయా మయుడగు క్రీస్తుదేవుని స్మరించి చేతితో కళ్ళ నద్దుకొని నకోడా నాశీర్వదించింది.

ఆఫీసర్లు, ఖయిదీలుకూడా యింట్లోంచి వెళ్ళిపోయారు. ఈ తంతు అంతా మొదటనుంచి చివరవరకు చూస్తూన్న మధ్యవర్తి రైబిన్ ఆఖరున వెళ్ళాడు. వెడుతూ పావెల్‌ను పరామర్శించి వెళ్ళాడు.

పావెల్ గదిలో పచారుచేశాడు. నికోలే, నకోడాలతోపాటు తన్నుకూడా అరెస్టు చెయ్యకపోవడం ఒక పెద్ద అగౌరవంగా భావించి విచారపడ్డాడు. తల్లితో 'చూశావా అమ్మ! ఎంతపని చేశారో! నన్ను వదలిపెట్టారు' అన్నాడు.

తల్లి సవిచారంగా 'నిన్నుమాత్రముంచుతారా నాయనా ? నువ్వూ వెడతావులే' అంది. చాలా సేపటివరకూ తల్లి ఆగొడవే ఆలోచించుకుంది. ఇప్పుడొచ్చి మనుష్యుల నట్టే తీసుకు పోయారేమో, అనుకుంది. కాని తనకొడుకింటివద్దనే ఉండడంచేత కాస్త మనస్సుకు శాంతిగానే ఉంది. కాని ఆ ఉద్యోగస్తుడు గర్జించడం, దబాయించడం, హేళనచేయడం మాత్రం పదేపదే తలపుకొచ్చి ఆమెకు మహాకష్టం తోచింది. పచారు చేస్తూఉన్న పావెల్ హఠాత్తుగా "సరి అమ్మా ఇక అనుకుని ఏమీలాభములేదు. ఇల్లాంటి అవమానాలకి సంసిద్ధం కావాలసిందే" అన్నాడు.

"ఏం నాయనా: నిజంగా వాళ్ళునిన్ను అవమానపరిచారా ?"

"ఆహా! అవమానంకాదూ ? నన్నుకూడా వాళ్ళతో తీసుకెళ్ళకపోవడం ?" ఈమాట చెప్తూంటే తల్లికి అతని కొలికెల్లో కన్నీటిముత్యాలు కనపడ్డాయి. అతన్ని ఓదార్చే భావంతో.

"అంత తొందరెందుకు నాయనా ? నిన్నుకూడా తీసుకెడతారులే ?" అంది.

"ఆ! తప్పకుండా తీసుకెడతారు" అన్నాడు. తల్లి కొంచెంసేపు మాటాడలేదు. తర్వాత అతి విచారంతో "నాయనా పాషా! నీవెంత కఠినహృదయుడవైనావోయి! మాటవరుసకైనా నాకు చల్లనిమాట చెప్పవుకదా ? నేనే చాలా కష్టంగా మాటాడితే, నువ్వు అంతకన్నా ఘోరంగా మాట్లాడతావు." పావెల్ ఆమెకేసి దీనంగా చూసేడు. దగ్గరగావచ్చి మెల్లగా "అమ్మా నేను నీదగ్గర అబద్ధం చెప్పలేను. నన్నుకూడా ఎప్పుడో ఒకప్పుడిల్లాగే తీసుకుపోతారు. అలాంటి కష్టానికి నీవు అలవాటు కావలసిందే." అన్నాడు.

## ౭

మరునాడు బూకిన్, సోమో, శామొలో మొదలైనవాళ్ళంతా మొత్తం ఎనమండుగురు అరెస్టయినారు. ఆ క్రితంరోజు సాయంత్రమే ఫెద్యా మాజిన్ ఇల్లుకూడా సోదాచూసేరు. ఫెద్యా పొద్దున్నే పరుగెత్తుకుంటూవచ్చి పావెల్‌తో సంగతంతా చెప్పాడు.

"నీకేమైనా భయం వేసిందా ?" అని తల్లి పరామర్శించింది. ఫెద్యా తెల్లబోయాడు. మాట తొణకలేదు.

"ఆఫీసరు కొడతాడేమో ననుకున్నాను. అతని మీసం, గెడ్డం, ఒడ్డూ, పొడుగూ, వేషం గట్రాచూస్తే మహాభయంకరంగా వుంటాడు. అతను హాప్, హూట్ అని అరుస్తూ చిందులుతొక్కి నానాగత్తర చేశాడు. నువ్వు జైలులో కుళ్ళుతూ పడుండాలసుమా అని బెదిరించాడు. నిజంగా నా జన్మలో నేనెవ్వరిచేత

ఒక్క దెబ్బ పడలేదు. నా తలిదండ్రులకు నే నొక్కడినే అవడంవల్ల వాళ్ళు ఒక దెబ్బయినా కొట్టకుండా అతి అపురూపంగా పెంచారు. అంతా, ఎప్పుడో ఒకప్పుడైనా ఒకటీ అరా దెబ్బతినుంటారేమోకాని నేనింతవరకు ఎప్పుడూదెబ్బంటే ఏమిటో యెరుగను" అంటూ ఫెద్యా పళ్ళు పటపట కొరికాడు. కళ్లెర్రచేసి పావెల్ కేసి తిరిగి "నువ్వేమనుకున్నా సరేగాని, యీసారి యెవరైనా నా వొంటిమీద చెయ్యేస్తే నేనూరుకోను. ఏమీచెయ్యలేకపోతే ఆఖరుకు గట్టిగా కరవనైనాకరుస్తా. నన్నాతడు చంపేసినాసరే!" అని అతి రోషంతో చెప్పాడు.

"నువ్వు ఆత్మసంరక్షణలో యేంచేసినా చెయ్యొచ్చునుగాని, నువ్వుమాత్రం అనవసరంగా మీదకెళ్ళకు" అని పావెల్ సలహాచెప్పాడు.

"ఇదిగో చూడు! నువ్వు అర్భకుడవు. నీకు దెబ్బలాట వద్దు జాగ్రత్త!" అని తల్లి మందలించింది.

"ఉహూం, నేను దెబ్బలాడకమానను" అని వెళ్ళిపోయాడు ఫెద్యా.

అతను వెళ్ళిపోయినతర్వాత తల్లి పావెల్‌తో "ఇంత జోరుగా కబుర్లు చెప్పేవాళ్లే ముందు బోల్తాకొడతారు" అంది. పావెల్ మాట్లాడలేదు.

కొంచెంసేపట్లో గ్రామంలోకల్లా మోతుబరిరైతు రైబిన్ తలుపుతోసుకొని లోపలికొచ్చాడు.

"మళ్ళీవచ్చాను. నిన్న పోలీసువాళ్ళు తీసుకువచ్చారు. ఇవ్వాళ నాలంతట నేనేవచ్చాను" అంటూ పావెల్‌ను కరస్పర్శచేశాడు. తల్లికేసితిరిగి "ఏమమ్మోయి! కొంచెం టీ ఇస్తావా?" అని అడిగాడు.

తల్లి టీ తీసుకురావటానికి లోపలికెళ్ళింది. రైబిన్, పావెల్‌లు ఒకళ్ళ ముఖంకేసి ఇంకొకళ్ళు చూచుకుంటూ మాటాడకుండా కూచున్నారు. ఆఖరికి "అదీ సంగతి" అని రైబిన్ ఏమిటో అర్థాంతరంగా ప్రారంభించాడు. "అబ్బాయీ! నీతో ముఖాముఖిని కొన్ని సంగతులు నిర్మొగమాటంగా మాటాడవలెనని వచ్చాను. ఇందులో యేమీదాపరికంలేదు. నేను చాలారోజులుగా నీధోరణి కనిపెడుతున్నాను. ప్రక్క ఇంటివాడినేకాదూ? నీదగ్గరకుజనం రావడం పోవడం చూసేను అవచ్చే వాళ్ళల్లో తాగుబోతుతనం కాని మరో జులాయీ వ్యాపారంగాని లేకపోవడంచూస్తే నాకు చాలా ఆశ్చర్యమైంది. ఆ త్రాగుబోతు పిశాచం అంటుకోకపోతే జనం మహా సుళువుగా తెరిపిని పడతారు."

ఈమాటలు వింటూంటే పావెల్‌కు అతనియందొక విశ్వాసం కుదిరింది. రైబిన్ ఇంకా మాట్లాడుతూనే వున్నాడు. "అంతా నిను గురించే చెప్పుకుంటూ న్నారు. నాలాగే నువ్వుకూడా చర్చికి వెళ్ళవుటకాదూ? అయితే ఈమధ్య బయలు దేరిన కరపత్రాలకు నువ్వేనా కారకుడవు?" అని పావెల్ నడిగాడు.

"అవును. నేనే" అన్నాడు పావెల్. ఇద్దరూ ఒకళ్ళ మొఖంకేసి ఇంకొ కళ్ళు చూచుకున్నారు.

"నువ్వొక్కడవే అన్నమాటేమిటి?" అని తల్లి పావెల్‌మాటను సర్ద బోయింది.

పావెల్, రైబిన్ యిద్దరూకూడా నవ్వుకున్నారు. తనమాట లక్ష్యపెట్టలేదనే ఆగ్రహంతో తల్లి లేచిపోయింది. రైబిన్ మళ్ళీ అందుకున్నాడు:

"ఆ కరపత్రాలున్నాయే, అవి చాలాబాగా వున్నాయి. మంచి చక్కగా ఆలోచించి వ్రాసినవే. ప్రజలను మేలుకొల్పేందుకు బాగా పనికొస్తాయి. అవి మొత్తం పన్నెండుకాదూ?"

"అవును"

"ఇక సోదాసంగతి. అన్నింటికన్నా ఆసమయంలో నిన్ను చూచినప్పటి నుంచీ నీయెడల నాకు ఒక విధమైన అభిమానం యేర్పడింది. నువ్వు, ఆ నకోడా, నికోలే, మీరంతా దొరికిపోయారు. సోదాకొచ్చిన వాళ్ళుకూడా మీధోరణి కనిపెట్టేరు. మహానిర్లక్ష్యంగా వ్యవహరించారు కాదూ మీరు? నకోడా బలేమనిషి. అతడు ఫ్యాక్టరీలో మాటాడుతూవుంటే విన్నాను. చావుకైనా తెగించిన పట్టుదల వుందనుకున్నాను. పావెల్! నేనంటే నీకు నమ్మకం లేదూ?"

"ఉంది."

"సరే, అయితే. చూడు! నాకు నలభై ఏళ్ళున్నాయి. నీకన్న దగ్గర దగ్గరగా రెట్టింపు వయస్సుంది నాకు. నీకన్న ప్రపంచాన్ని ఇరవై రెట్లు చూశాను. మూడేళ్ళు పాదాలు అరిగేటట్లు మిలిటరీలో తిరిగి పనిచేశాను. రెండుసార్లు పెళ్ళి చేసుకున్నాను. నేను కాకసస్‌కూడా వెళ్ళేను" అని రైబిన్ స్వీయచరిత్ర ఆరంభించాడు.

తల్లి యీ సంభాషణ వింది. తన కొడుకువగ్గరకు పెద్దవాళ్ళుకూడా వచ్చి మాటాడడం చూసి లోపల్లోపల సంతోషించింది. టీ తీసుకొచ్చి రైబిన్ కందిచ్చింది. అతడు కృతజ్ఞతతో అందుకుని ఒక గ్రుక్కెడు త్రాగి మళ్ళీ సంభాషణ ఆరంభించాడు.

"అయితే పావెల్! మన జీవితం నడపవలసిన రీతిగా నడవడం లేదంటావు? అంతేనా?"

"అవ్వే! సరిగానే నమస్తోంది. కనుకనే ఇప్పుడు మీ రిక్కడికొచ్చి ఇంత విపులంగా మనసిచ్చి మాటాడడం తటస్థించింది. చెమటవోడ్చి కష్టపడి బ్రతికే మనమంతా ఒకటవుతాం. కొద్దిరోజులకు మన సంఘీభావం అద్భుతంగా ఉంటుంది. ప్రస్తుతం మన బ్రతుకు మరీ అన్యాయంగా వుంది. బహుభారంగా వుంది. కాని, ఈ అన్యాయమే మనలను మేల్కొల్పి, జీవితపరమావధిని గురించి హెచ్చరిస్తోంది. మనం ఇప్పటికి మన స్థితిగతులను గూర్చి ఆలోచించుకుంటున్నామా, లేదా?"

"అవునవును. కాని ఆగు. మనుష్యులలో పూర్తిగా మార్పు కలగాలి.

ఒకవిధంగా పునఃసృష్టి కావాలనే నా అభిప్రాయం. మురికిపట్టి అసహ్యంగా ఉండే మనిషి వున్నాడనుకో, అతనికి స్నానం చేయించి శుభ్రమైన బట్టలు కట్టపెడితే బాగుంటాడు కదా. అల్లాగే హృదయం మలినమైతే, దాన్ని ఎలాగో ఒకలాగున బయటికిదీసి శుభ్రంచెయ్యాలి. అంతేనా? ఏమంటావ్? మనుష్యులను బాగు చెయ్యడాని కేమైనా వేరే మార్గం ఉందంటావా?"

పావెల్ యీ ప్రసంగమంతా విని, దేవుణ్ని గురించి, ప్రభుత్వాన్ని గురించి, ఫాక్టరీని గురించి, చక్రవర్తిని గురించి, ఇంకా ఇతర దేశాల్లో కూలి నాలి జనాన్ని గురించి, వాళ్ళలో బయలుదేరిన విప్లవభావాలను గూర్చి అతి తీవ్రంగాను, కటువుగాను వుండేటట్లు విపులమైన ఉపన్యాసం యిచ్చాడు. రైబిన్ శ్రద్ధగా విన్నాడు. మధ్యమధ్య చిరునవ్వు నవ్వేవాడు. "అయితే" అని ఊతం కూడా యిస్తూవచ్చాడు. ప్రసంగశాత్తు ఒకసారి ఏదో సందర్భంలో అతడు పెదవి విరిచి "అబ్బే! నీవింకా కుర్రాడివి. ప్రజలసంగతి నీకేమి తెలుసును" అని చప్పరించేశాడు.

"వయస్సుతో ఏమిపని? మనం అనుకున్న మాటలలో సత్యం ఎక్కడుందో ఆలోచించుకోవాలి."

"అంటే నీ అభిప్రాయం ప్రకారం మనం దేవుడి విషయంలో కూడా దగా పడ్డామన్న మాటే.......అవును. నాకూ అప్పుడప్పు డల్లాగే తోస్తుంది. మన మతమే మనకు అపాయకర మనిపిస్తుంది."

ఇంతవరకు మాటాడకూరుకున్న తల్లి ఇంక ఊరుకో లేకపోయింది. ఏమన్నా భరించిందికాని తానత్యంత భక్తివిశ్వాసములతో కొలుస్తున్న దేవుడిని గురించి చులకనగా మాటాడుతుంటే ఆగలేకపోయింది.

"పావెల్"! దేవుణ్నిగురించి మాటాడేటప్పుడు కాస్తజాగ్రత్తగాఉండు. నువ్వుచేసే పనులకు ఈ జన్మలోనే ప్రతిఫలం ఉంటుందిసుమా? ఈ వృద్ధాప్యంలో నే నమ్ముకున్న దేవుణ్ని ఇల్లా తీసిపారెయ్యకు." అని దీనంగా పావెల్‌ను వేడుకుంది. పాపం గ్రుడ్లలో నీళ్ళుతిరిగేయి. కడుగుతూవున్న గిన్నెలు చేతిలోనుండి జారిపోయాయి. పావెల్, తల్లి అవస్థచూచేడు.

"అమ్మా నేను చెప్పిన సంగతి నువ్వుసరిగా అర్థంచేసుకోలేదు. నీవు విశ్వసించే పరమదయాళుడైన దేవుడినిగురించి నేను చెప్పలేదు. దేవుడిపేరుచెప్పి మనలను బెదిరించే మతగురువుల దేవుడినిగురించే నేను చెప్పినది. ఈ మతాధిపతులు దేవుడిపేరుచెప్పి తమ చిత్తంవచ్చినట్లు మనమీద జబర్దస్తీ చేస్తారు."

"అవునవును. నువ్వుచెప్పింది నిజమే. ముమ్మాటికీ నిజం." అని బల్లగ్రుద్ది రైబిన్ అందుకున్నాడు. "మతగురువులు దేవుణ్ని కాళ్ళూ చేతులూ విరుగగొట్టి మూలకూచోపెట్టేరు. వాళ్ళలోపంలేకుండా మనకు ఎన్ని కష్టాలు తెచ్చిపెట్టాలో అన్నీ పెట్టేరు. అన్ని విధాలా మనకు శతృత్వం తెచ్చిపెటారు. అమ్మా

ఒక్క సంగతి చూడు. దేవుడు మనిషిని తన ఛాయగా సృష్టించాడు. మనిషి దేవుడులా ఉంటే దేవుడు మనిషిలా ఉంటాడన్నమాట కాదు? కాని మనం మనుష్యులలా ఉన్నామా? శుద్ధ అడవి జంతువులైపోయాము. చర్చిలో ఒక దిష్టిబొమ్మ నొకదానిని మన ఎదుట పెడతారు. నిలోనా! మనం దేవుడ్ని మార్చుకోవాలి. బాగు చేసుకోవాలి. ఆదేవుడ్ని ఈ మతగురువులు అన్యాయం, అసత్యం, అధర్మాలతో అలంకారం చేసేరు. మనఆత్మలను నాశం చేయడంకోసం దయాళువైన దేవుడ్ని వాళ్ళు వికృత స్వరూపునిచేసి పారేసేరు."

నడుమ ఎదురులేకుండా చెప్పిన ఈ మాటలు వింటూఉంటే తల్లికి గాభరా ఎత్తింది. ఆమాటలు వినలేకపోయింది. చెవులు మూసుకొని వంటయింట్లోకి పోయింది. బట్టలు మార్చుకొని మంచంమీద పడుకుని కళ్ళుమూసుకుని ప్రార్థన చేయడం ప్రారంభించింది. ఆమెకు మనస్సు మనస్సులో లేదు; రైబిన్ అంటే ముందు చాలామంచివాడనే అనుకుంది. కాని దేవుడి విషయమై అతని అభిప్రాయాలు విన్నాక ఆమె మనస్సు మారిపోయింది. అతడొక సంఘద్రోహి, రాజద్రోహి అనుకుంది. పావెల్ - రైబిన్ లిద్దరూ గదిలోనే చర్చించుకుంటున్నారు. రైబిన్ మాట్లాడుతున్నాడు.

"పవిత్రస్థలాలు ఖాళీగా ఉండకూడదు. ఎక్కడైతే బాధ ఉంటుందో అదే భగవంతుని నివాసస్థానము. ఒకసంగతి చెపుతాను జాగ్రత్తగా ఆలోచించు. హృదయంలో భగవంతుడున్నంతవరకే బ్రతుకు. పావెల్! మనమొక క్రొత్త మతాన్ని లేవదీయక తప్పదు. చాలా అవసరం అందరికీ అందుబాటులో ఉండే టట్లు దేవుడ్ని నిర్మించాలి. దేవుడంటే అధికారం చెలాయించేవాడు, జబర్దస్తీ చేసేవాడు కాకుండా మానవకోటికి మిత్రుడుగాను, విశ్వాసపాత్రుడుగానూ ఉండాలి."

"ఇప్పుడలాంటి దేవుడున్నాడు. క్రీస్తుగారూ?"

"కొంచెం ఆగు చెప్తాను. క్రీస్తుచాలడు. అతడు చక్రవర్తి అధికారాన్ని అంగీకరించాడు. భగవంతుడు మానవ మాత్రుల అధికారాలను గుర్తించకూడదు. అవి వే సర్వశక్తులకు మూలం. అతడు తన ఆత్మను రెండుగాచీల్చి ఒకటి మానవ శక్తికి రెండవదానిని దైవికశక్తికి అర్పించడు. క్రీస్తు పూర్తిగా దేవదూతమైనచో మానవ విషయములలో జోక్యము కలుగచేసుకొని యుండడు. కాని క్రీస్తు వర్తకమును, పెళ్ళిళ్ళను అంగీకరించాడు. పావెల్, రైబిన్ యీ విషయమై ఒకళ్ళను మించి ఒకళ్ళు చర్చించుకుంటూన్నారు. కాలం గడచిపోతూన్న సంగతి వాళ్ళకు తెలియడమేలేదు. రైబిన్ "దేవుడు అగ్నిహోత్రంలాంటివాడు. అతడు నినీ నిర్మించలేడు; నిర్మించడు. కాని అన్నిటినీ అంటిస్తాడు, వెలుగు చూపిస్తాడు. చర్చీలను అతడు తగులబెట్టేస్తాడు. హృదయమే అతని నివాసస్థానము" అన్నాడు. 'మనస్సో' పావెల్.

"అదే హృదయంలోనూ మనస్సులోనుకూడా అక్కరకు వస్తుంది. తగాదా,

పేచీలకదే మూలం. హృదయం మనస్సు చాలా వేరైపోయినాయి. మనస్సు అంటిరించి పోయింది. మనిషి స్వతఃసిద్ధంగా ఒక ప్రమాణంకాడు. భగవంతుడే అన్నిప్రమాణంగా చేశాడు, భగవంతుడు చేసేవన్నీ గుండ్రంగా ఉంటాయి. సూర్యుడు, చంద్రుడు, భూమి మొదలైనవి, అడ్డదిడ్డాలుగా ఉండేవన్నీ మనుష్యుని పనులే"

లోపల వాళ్ళిద్దరూ మాటాడుతుండగానే తల్లి నిద్రపోయింది. రైబిన్ ఎప్పుడెళ్ళిపోయాడో ఆమెకు తెలియదు.

రైబిన్ తరుచుగా పావెల్ ఇంటికివచ్చి నలుగురితోటి అనేక విషయాలను చర్చచేస్తూవుండేవాడు. ఒకనాడు సందర్భవశంగా అక్కడకువచ్చిన మిత్రులతో ఆతనిట్లా చెప్పాడు:

"ఏమయినాసరే, మనం ఉన్నసంగతి చెప్పాలి. తెలిసినంత తెలియపర్చాలి. ప్రజలకు బంధాలు విడిపోతే తరువాత తమ మంచేదో వాళ్ళకే తెలుస్తుంది. అనవసరంగా వాళ్ళకక్కరలేని సంగతులన్నీచెప్పి బాధపెట్టకూడదు. ఉన్న సంగతి సందర్భాలన్నీ వాళ్ళ చెవినిపడేస్తే, తరువాత సంగతి వాళ్ళే ఆలోచించుకుంటారు. ఒకప్పుడు వాళ్ళు యీ జీవితాన్నే త్రోసిరాజనొచ్చును. ఇంకొకప్పుడు తమకు ప్రతికూలంగావున్న శక్తులనన్నిటిని గ్రహించవచ్చును. ఒక్క సంగతిమాత్రం స్పష్టంగా చెప్పాలి. లాగలేని బరువేస్తే అసలు బండే సాగదు

* * * *

పావెల్, రైబిన్ లిద్దరుమాత్రమే ఉన్నపుడు, అంతూపొంతూలేని చర్చల్లో పడేవారు. ఎంత శ్రద్ధగా ఆలకించినా తల్లికాగొడవ పిసరంతైనా తెలిసేదికాదు. ఇద్దరికీకూడా మతిపోయిందేమోననుకొనేది. కాని కాలక్రమేణ యీ సంభాషణలు వినడం అలవాటైపోయింది. రైబిన్ దైవద్రోహి అనే ద్వేషం పోయింది.

* * * *

వారానికొకసారి తల్లి జైలుదగ్గరకెళ్ళి నకోడాకు పుస్తకాలు, బట్టలు ఇచ్చేది. ఒకనాడు అక్కడి వార్డరులు ఆమెను నకోడాతో కొంచెం మాటాడనిచ్చేరు. ఆ రోజున ఇంటికొచ్చిఅతిసంతోషంగా రైబినూ,పావెలూ కూర్చుండగా ఇట్లాచెప్పింది. "అక్కడకూడా ఇంట్లో ఉన్నట్టుగానే ఉన్నాడు .అందరిలోనూ చనువుగా నవ్వుతూ, త్రుళ్ళుతూ ఉన్నాడు. అందరితోనూ వేళాకోళాలాడుతున్నాడు. అతని ధోరణంతా చూస్తే శలవులో విశ్రాంతి అనుభవిస్తున్నట్టుంది. లోపల ఏమి కష్టమనుభవిస్తున్నాడో తెలియదుకాని పైకి ఏమీ కనబడనియ్యడంలేదు"

"మనిషంటే అల్లాగేవుండాలి" అని రైబిన్ అందుకున్నాడు. "మనకందరికీ వుంది బాధ. మనుష్యులందరూ అసలు బాధల్లో మునిగి తేలుతూనే ఉంటారు. కాని ఊరికే లబలబ మొత్తుకుంటే ప్రయోజనమేంటి? ప్రజలంతా గ్రుడ్డివాళ్ళు కారు. కాని కొందరు మూసుకోవాలనే మూసుకుంటారు కళ్ళు, నువ్వు బుద్ధి తక్కువవాడవైతే అలాంటి వాళ్ళకోసం బాధపడాలి."

౮

పావెల్ పలుకుబడి రోజురోజుకీ హెచ్చయిపోతోంది. పలుకుబడితో పాటు అధికారుల అనుమానంకూడా పెరుగుతూనేవుంది. తరుచు ఎవడో ఒకపని వాడువచ్చి యేదోవిషయమై పావెల్‌తో సలహాచేస్తూనే యుండేవాడు. అతడు బాగా చదువుకున్నవాడని, బుద్ధిమంతుడని పేరుపడిపోయింది. పోలీసులుగాని, ఫాక్టరీ యజమానులుగాని యెవరికైనా యేదైనా అన్యాయంచేస్తే వెంటనే వాళ్ళు పావెల్ సలహాకోసం వచ్చేవాళ్ళు. వయస్సుకి చిన్నవాడైనా అతని కార్యదీక్ష, బుద్ధికుశలత, శ్రద్ధచూచి అంతా అతన్ని మిక్కిలి గౌరవంగా చూచేవారు. ఈరీతిగా ప్రజలకూ పావెల్‌కూ అన్యోన్యం ఎక్కువైపోయింది. ఇంతెందుకు? ఆగ్రామంలోఉండే జనానికంతా అతడు నోట్లో నాలుకన్నమాటే. తన కొడుకు పలుకుబడిచూచి తల్లి చాలా గర్వపడేది ఏతల్లికలాంటి గర్వంకలుగదు? పావెల్ అచట ప్రజల క్షేమాని కవసరమైన పనులన్నిటిలోనూ పూనుకొని పనిచేసేవాడు. వ్యాసాలు వ్రాయడం, ఉపన్యాసాలివ్వడం, సంఘపెద్దలను సమావేశంచేస్తూవుండడం, మొదలైన సత్కార్యాలన్నీ చేస్తూవుండేవాడు. ముఖ్యంగా అతడు ప్రకటించిన 'దరిద్రపుపైసా' అనేకథ చదివినతర్వాత జనానికి అతనిమీద అత్యంతమైన అభిమానం యేర్పడింది.

దానికథ ఏమిటంటే, ఫాక్టరీవెనకాల పెద్దగుంటవుంది. ఆగుంటలో ఎప్పుడూ నీళ్ళు నిలవుండడం, పసరుపట్టి దుర్వాసన రావడం కద్దు. పైగా దోమలుకూడా విపరీతంగా పెరిగిపోయాయి. (దోమలమూలాన్ని మలేరియా జ్వరం వ్యాపించింది.) ఈస్థలం ఫాక్టరీ యజమానులదే. ఫాక్టరీకెంత లాభాలు వస్తున్నా, ఈ గుంట పూడ్చి నీరు మురగకుండా చెయ్యాలనే శ్రద్ధ అధికారులకెప్పుడూ పట్టలేదు.

ఫాక్టరీలోకి క్రొత్త మేనేజరు వచ్చాడు. అతడు ఈపల్లాన్ని పూడ్చే పద్ధతొకటి ఆలోచించాడు. ఒక్కాయకు రెండు దెబ్బలనేటట్లు ఇందులో కాస్త స్వలాభంకూడా సంపాదిద్దామని ఎత్తేశాడు. ఫాక్టరీ పనివాళ్ళందరినీ పిలిచి ఈ మురుగుపోయే ఏర్పాటుచేయడం చాలా అవసరమనీ, అందువల్ల దోమలుతగ్గి ప్రజల ఆరోగ్యం బాగుపడుతుందనీ ఉపన్యాసమిచ్చేడు. చివరకి ఈపనంతా చేయించడానికి ప్రతికూలీయొక్క కూలీలోనుంచి రోజుకొక * కోపెక్ మినహాయించమని ఆర్డరిచ్చాడు. పనివాళ్ళంతా వల్లకాదని విరుగబడ్డారు. గుమస్తాలవద్దనుండి ఈపన్ను వసూలుచెయ్యక ఒక్కకూలీలదగ్గరే వసూలు చెయ్యడంచేత వాళ్ళకి మరింత ఒళ్ళుమండింది.

మేనేజరు ఆర్డరు, నోటీసుబల్లమీద శనివారంనాడు అంటించారు. ఆరోజున

---

* ఇది రష్యాదేశములో నొక చిన్ననాణెము. మనమొక దమ్మిడీగ నెంచవచ్చు.

వండ్లో సుస్తీగా ఉండడంచేత పావెల్ పనిలో కెళ్ళలేదు; ఈ ఆర్డరుసంగతి అతనికి తెలియనేలేదు. ఆ మరునాడు చర్చినుండి తిరిగివస్తూ, 'సిజావ్' అనే ముసలి కమ్మరీ, 'మకోటిన్' అనే ఇంకొక తాళాలు పనిచేసేవాడూ, పావెల్ దగ్గరకొచ్చి సంగతి సందర్భాలన్నీ అతనితో చెప్పారు.

"ముసలివాళ్ళం మేమంతా ఆలోచించాం. కాని మన వాళ్ళల్లోకల్లా కాస్త చదువుకున్నవాడవు, తెలివైనవాడవు నువ్వే. అందుచేత మనవాళ్ళంతా నీతో ఆలోచించమన్నారు. దోమలమీద దండయాత్రకి కూలీలసొమ్ము ఉపయోగించడం న్యాయమని, ఎక్కడైనా వుందీ?" అన్నాడు సిజావ్.

"బాగా ఆలోచించు. వెనుక మూడేళ్ళక్రిందట ఫాక్టరీవాళ్ళు కూలీలకోసం స్నానాలగదులు కట్టిస్తామనిచెప్పి యిల్లాగే కూలి మినహాయించి చందావేశారు. చందాయేమిటి? పన్నే. దాదాపుగా 3800 రూబుల్సు వసూలుచేశారు. నాటికీ నేటికీ స్నానాలగదులు లేనేలేవు సరిగదా, ఆసొమ్ము యేమయిందో అతీగతీలేదు" అన్నాడు 'మాకోటిన్.'

పావెల్ ఒక్క క్షణం ఆలోచించాడు. ఈ వసూలు చాలా దురన్యాయం అని నిర్ధారణ చేశాడు. ఫాక్టరీ మేనేజరు లాభంతీయడానికి యెత్తిన యెత్తని స్పష్టంగా తెలియచెప్పాడు. వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు.

గ్రామంలో వుండే పెద్దపెద్దలంతా కూడా తన కొడుకు దగ్గరకొచ్చి సలహా చేస్తుండడం చూచి తల్లి అపరిమితానందం పొందింది. ఆ సంతోషం పట్టలేక కొడుకుదగ్గరకొచ్చి "ఏమిరా నాయనా! ఇంత పెద్దవాళ్ళకికూడా నీ సలహాయే కావలిసొచ్చిందా?" అని అడిగింది. పావెల్ మాటాడకుండా బల్లదగ్గర కూచుని తలవంచి గబగబా ఏమిటో వ్రాసుకుంటున్నాడు.

వ్రాత ముగిసినతర్వాత తల్లిని పిలిచి "అమ్మా! ఈ కాగితాలు పట్టుకెళ్ళి పట్టణంలో ఫలానచోట ఇచ్చిరమ్మా" అని ప్రార్థించాడు.

"ఇందులో ఏమైనా ప్రమాదం ఉందా?"

"ఆ! ఉంది. మనవాళ్ళకోసం అక్కడొక వార్తాపత్రికను ప్రకటిస్తున్నాము. వచ్చేవారం పత్రికలో మన ఫాక్టరీ పన్నునుగురించిన కథ అచ్చుపడాలి."

"అయితే వెంటనే వెడతాను" అని చెప్పి వెంటనే మంచిబట్టలు కట్టుకుని ప్రయాణమైంది. తన కొడుకే తన కిల్లాంటిపని పురమాయించడం ఇదే మొదటిసారి అవడంచేతనూ, తానుకూడా అతని కేదో కాస్తసాయం చేయగలననే సంతుష్టివల్లనూ చాలా సంతోషపడింది. వీధి గుమ్మంలో కెడుతూ "పాషా! ఈ దొంగతనం అంతా నాకు తెలిసిందిలే! ఆ పేరేమిటి? ఈగర్ ఇవానిష్‌కు కాదు ఇవ్వడం?" అని పాషాను రెట్టించి అడిగింది. అవునన్నాడు.

* * *

కాగిరాలు ఇచ్చి రాత్రి బాగా ప్రొద్దుపోయాక తల్లి యింటికొచ్చింది. చాలా శ్రమ పడింది. కాని చాలా తృప్తిపడింది.

"పాషా! అక్కడ శశాంక కనబడింది సుమా. ఆమె నిన్ను మరీ మరీ అడిగింది. ఈగర్ ఇవానిష్ మహామంచివాడు. ఏమి ఆర్భాటంలేని మనిషి. మహా వేళాకోళంగా మాట్లాడుతాడు. శుద్ధ హాస్యగాడు" అని చెప్పింది.

"నయమే! వాళ్ళంతా నీకు నచ్చినందుకు నాకు సంతోషమే."

"పాషా! వాళ్ళు ఏమాత్రం అట్టహాసం ఎరుగని మనుష్యులు సుమా. అల్లాంటివాళ్ళు చాలా మంచివాళ్ళు. వాళ్ళందరికీ కూడా నువ్వంటే చాలా గౌరవమే" అని తల్లి సంతోషంతో చెప్పింది.

* * * *

సోమవారంనాడు కూడా పావెల్ పనిలోకెళ్ళలేదు. తలనొప్పిచేత బాధ పడ్డాడు. మధ్యాహ్నం భోంచేసేవేళ ఫెద్యామాజిన్ ఫాక్టరీనుండి పరుగులేసుకుంటూ వచ్చేడు.

"లే! లే! ఫాక్టరీ అంతా తిరుగబడింది. వాళ్ళంతా నిన్ను తీసుకురమ్మనమని పంపేరు. సిజావ్, మకోటిన్ ఇద్దరూకూడా నువ్వువస్తే బాగా నచ్చచెపుతావంటున్నారు. అబ్బ! యేమి గలాటా! పద. పద" అని ఒగుర్చుకుంటూ చెప్పాడు.

పావెల్ వెళ్ళడానికి సిద్ధమవుతూ వున్నాడు. "ఆడవాళ్ళు పెద్ద గుంపుగా చేరారు. వాళ్ళు మహా అరుస్తున్నారు" అన్నాడు ఫెద్యా. "అబ్బాయీ! నీ వంట్లో బాగాలేదు. అక్కడున్నవాళ్ళు యేం చేస్తున్నారు? నీతో నేనుకూడా వస్తాను పద" అంది తల్లి. పావెల్ రమ్మనమన్నాడు.

ముగ్గురూ గబగబా అడుగులేసుకుంటూ ఫాక్టరీదగ్గరకెళ్ళేరు. గుమ్మందగ్గిర ఆడకూలీలు గుంపులుగాచేరి కామకొని గోలపెడుతున్నారు. ఈముగ్గురుకూడా గుంపులోపడ్డారు. ఒకమూలగా గోడదగ్గర సిజావ్, మాకొటిన్, వైలావ్ మొదలైన అయిదారుగురు పెద్దమనుష్యులు ఇనుపకమ్ముల గుట్టమీద నిలబడ్డారు. కూలీలంతా వాళ్ళచుట్టూ చేరారు. నాయకులు పనివాళ్ళనందరినీ హుచోమని చేతులు వూపుతూ అరుస్తున్నారు. ఇంతలో "అడుగో పావెల్" అన్నారు ఎవరో. ఇక్కడికి రమ్మనమనండి అనేవాక్కు బయలుదేరింది. పావెల్‌ను ముందుకు త్రోశారు. తల్లి వెనకాల దిగబడిపోయింది.

"కేకలు వెయ్యకండి నిశ్శబ్దం నిశ్శబ్దం" అని నాలుగువైపులనుండీ ధ్వనులు బయలుదేరినాయి.

రైబిన్ మాట్లాడుతున్నాడు.

"సోదరులారా! ఒక కోపెక్‌కోసంకాదు మనపట్టుదల. న్యాయంకోసం.

న్యాయంకోసం మనమంతా కట్టుకట్టాలి. మన కోపెక్ మేనేజరు * రూబులుకన్న విలువైనది. ఎందుచేతనంటే మనం చెమటోడ్చి రక్తంధారపోసి దీనిని సంపాదిస్తున్నాం. మేనేజరు వెండినాణెములోకన్న మన ఈరాగి నాణెంలో మానవరక్తమెక్కువ యిమిడివుంది. ఈకోపెక్‌కన్న మనకు ప్రియమైన వస్తువు ఇంకొకటి ఉంది. అదేసత్యం. దానికొరకే మన పట్టుదల."

ఈమాటలు ప్రజలలో అపరిమితమైన ఉద్రేకం కలుగజేశాయి. బలేఅంటే బలేఅన్నారు. ఆవేశం తాండవమాడుతుంది. పావెల్, సిజావ్, మకోటిన్ మొదలైన పెద్దపెద్ద నాయకులంతా వున్నచోటికి చేరారు. తల్లికూడా నెమ్మదిగా జనాన్ని గెంటుకొని కొడుకు దగ్గరగా చేరింది.

పావెల్ ఒక్కసారి జనాన్నంతటిని కలియచూచాడు. అతని దేహం పొంగింది. ఇనుపకమ్మీల వేదికపై కెక్కేడు. తనశక్తి చూపించవలసిన సమయం వచ్చిందిగదాయని సంతోషపడ్డాడు. అతి ఉత్సాహంగా "సోదరులారా!" అని గర్జించాడు. ఆమాట వినేసరికి జనంలో నిశ్శబ్దం అయిపోయింది. ఉపన్యాసం ప్రారంభించాడు.

"నాయనలారా! చర్చీలను ఫాక్టరీలను నిర్మించేవాళ్ళం మనమే. సంకెళ్ళు చేసేదీ, నాణెముల నచ్చుగుద్దేది మనమే, పిల్లలాడుకునే ఆటవస్తువులు మొదలు ధనికులకు లక్షలు లక్షలు సంపాదించిపెట్టే యంత్రాలవరకూ తయారుచేసేది మనమే. మనుష్యులు పుట్టినప్పటనుంచి గిట్టేవరకు శుభాశుభాలకు కావలసిన చిన్న పెద్ద వస్తువులన్నీ మనచేతిమీద తయారుకావలసినవే. ప్రపంచాన్ని పోషించి రక్షించే జీవనశక్తి మనమే. (వినుడు, వినుడు; అని కేకలు) ఎక్కడా ఎప్పుడూ కూడా చాకిరీకి ముందు మనమే. కాని అనుభవంలో మాత్రం ఆఖరువాళ్ళం. మనకోసం దేవులాడేవాళ్లెవరు ? మన క్షేమం కోరేవాళ్లెవరు? మనలను మనుష్యులుగా గణించే వాళ్లెవ్వరు? నమ్మండి, నమ్మండి, ఎవ్వరూలేరు."

లేరు లేరు అనే కేకలు లేచాయి. ప్రజలలో వేడెక్కుతున్నందుకు పావెల్ సంతోషించాడు. మరింత ఉత్సాహపడ్డాడు. గొంతుక సర్దుకొని అందరికీ అర్థమయ్యే సాధారణభాషలో ఉపన్యాసం సాగనిచ్చేడు.

"సోదరులారా ! మన ప్రాథమిక హక్కులకోసం పోరాడడానికి మనం దృఢమైన నిశ్చయం చేసుకోవాలి. అందరూ ఒక్క కుటుంబంలోని సోదరులలాగు సంచరించాలి. అలాగున కాని మన జీవిత స్థితి బాగుపడదు. అందరికినీ పరమావధియైన లక్ష్యముకొరకై ఐకమత్యమును పెంపొందించాలి.

"అసలు సంగతేమిటో చెప్పరాదూ" అని సభలోనుండి ఎవరో అరిచేరు.

"మధ్య మధ్య పానకంలో పుడకల్లా అడ్డురాకండి ! నోరుమూయ్యండి" అనే కేకలు నాలుగు మూలల్నుంచి లేచాయి. అందరూ పావెల్ ఏమిచెబుతాడో

* రష్యాలో వెండినాణెము. రూపాయివంటిది.

అని అతని ముఖంకేసి చూస్తున్నారు. "పీడెవడో పోషిస్తున్నలాగున్నాడే కాని తెలివితక్కువవాడు మాత్రం కాడు" అని ఎవరో ఒక్కమాట విసిరేశారు. "చాలా ధైర్యంగా మాటాడుతున్నాడు." అని ఒక కుంటివాడు, మాటపారేసి చక్కాపోయాడు.

పావెల్ ఉపన్యాసం సాగనిచ్చేడు.

"కాబట్టి సోదరులారా! మన కూలివల్ల విలాసంగా జీవనంచేసే దురాశాపరుల తంత్రాలను ఎదుర్కుటకు కట్టు కట్టవలసిన సమయం వచ్చింది. ఆత్మసంరక్షణకిదే తరుణం. మనకి మనమే సాయపడాలి కాని ఇంకెవ్వరూ సాయపడేవారు లేరు. మన ప్రతికక్షులను అణగద్రొక్కాలంటే మనమందరం ఒక్క సిద్ధాంతాన్నే అనుసరించాలి. అందరికీ ఒక్కచే, అంతా ఒక్కదానికే. ఇదే మనధర్మం——" పావెల్ వేదిక దిగాడు.

"అతను చెప్పినదంతా నిజం. విన్నారా?" అని మకోటిన్ ఒక్క కేకపెట్టేడు.

"ఇంతకూ మనం మేనేజరును పిలిచి అడగాలి" అన్నాడు పావెల్.

మాట నోటంబడి రావడమే తరువాయిగా జనం అందుకున్నారు. 'మేనేజర్' 'మేనేజర్' అని కొందరు, 'పిలవండి మేనేజర్ని' అని కొందరు 'అతన్ని సమాధానం చెప్పమనండి' అని మరికొందరు అరవడం ఆరంభించారు. కొంత గడబిడయిన తర్వాత మేనేజరును తీసుకురావడానికీ, అతనితో సంప్రదించడానికీ, ప్రతినిధుల నేర్పాటుచేయడానికీ, నిశ్చయించుకున్నారు.

ఈ స్థితిగతులలో తల్లి పావెల్‌ను చూసింది. నిన్నమొన్న కళ్ళు తెరచిన పావెల్ గెడ్డాలు మీసాలు నెరిసిన పెద్దల తోటివాడయినందుకు సంతోషపరవశురాలై పోయింది.

ప్రతినిధుల ఎన్నిక ప్రారంభమైంది. ఎవరంటే ఎవరనుకున్నారు. చివరికి అవవలసిన రాద్ధాంత సిద్ధాంతాలన్నీ అయినతర్వాత మేనేజరుతో మాట్లాడడానికి సిజొవ్, రైబిన్, పావెల్, ముగ్గురునీ ఎన్నుకున్నారు.

మేనేజరు కొరకు కబురు పంపుదామని అనుకునేసరికి అతనే వచ్చాడు. చేయెత్తు పొడుగు మనిషి. బారుగడ్డం. కోలగా ధుమధుమలాడే మొగంతోనే మేనేజరు గుంపు దగ్గరకొచ్చాడు. జనం దారి యిచ్చారు. యజమానులకు సహజమైన అహంకారాన్ని వెదజల్లుతూ ఠీవిగా మేనేజరు ముందుకు తోసుకొచ్చేడు. పూర్వపు అలవాటుకొద్దీ పనివాళ్ళు గౌరవ సూచకంగా టోపీలు తీసి దణ్ణాలు పెట్టేరు. అరడా వందనాలేమీ అందుకోకుండానే అలక్ష్యంగా చరచరా ముందుకు సాగేడు.

మేనేజరును చూసేటప్పటికి భయంచేత కొందరు, భక్తిచేత కొందరు జనం ఖంగారుపడారు. మేనేజరు తల్లిమొఖంకేసి ఒక్కసారి తీవ్రంగా చూసి చక్కా

పోయాడు. గబాగబా యినుపకమ్ముల గట్టుమీదెక్కి యేమీ యెరగనట్లు "ఏమి టిదంతాను ? మీరంతా పనెందుకు మానేశారు ?" అని అడిగాడు.

కొంచెంసేపు యెవ్వరూ మాటాడలేదు.

"మిమ్మల్నే అడుగుతుంట. మాట్లాడరేం ?" అని గ్రుడ్లెర్రచేసి మేనేజరు గర్జించాడు.

పావెల్ ముందుకొచ్చి, సిజావ్. రైబిన్‌లను చూపిస్తూ "ఇదిగో మా ముగ్గురిని మీ కోపెక్ మినహాయింపు ఆర్డరును రద్దు చేయించుటకు మీతో సంప్రదించడానికి ప్రతినిధులుగా సోదరులంతా యెన్నుకొన్నారు." అన్నాడు.

"ఎందుకూ ?" అని మేనేజరు పావెల్‌కేసి కన్నయినా యెత్తకుండా అడిగేడు.

"ఎందుకా ? మీరు విధించిన పన్ను అక్రమం కనుక" అని పావెల్ గట్టిగాచెప్పేడు.

"ఏమిటీ ? గుంటలో మురుగులేకుండా చేయడానికి నేను చేసిన యేర్పాటు బాగాలేదూ ? కూలీలను దోచుకోడానికి నే నీ యెత్తువేశానా ? కూలీల ఆరోగ్యం బాగుచెయ్యడమే నా అభిప్రాయమని గ్రహించలేరూ ?"

"అదే మా అనుమానం. అనుమానమేమిటి ? కాదనే మా నమ్మకం"

"ఏం రైబిన్ ? నీ అభిప్రాయమూ అంతే ?"

"ఆ ! అంతే"

"సిజావ్ ! నువ్వేమంటావు ?"

"నేనూ అంతే అంటాను. మా పైసాలు మా కొదిలిపెడుదురూ ?" అని నవ్వుతో కాస్త రాజీగా సిజావ్ జవాబుచెప్పాడు.

మేనేజరు ఒక్కసారి తలవంచి జనాన్ని పరిశీలనగా చూచాడు. తర్వాత పావెల్‌ను ఎగాదిగాచూచి "ఏమి పావెల్ ! అందరిలోనూ కాస్త తెలివితేటలు గల వాడివినువ్వే. నా స్కీముయొక్క ప్రయోజనాన్ని నువ్వుకూడా గుర్తించలేమూ:" అని అడిగాడు.

"ఫాక్టరీసొమ్ము ఖర్చుపెట్టి పల్లం మెరక చేయిస్తే అప్పుడు సంతోషిస్తాం. మీ మంచి మాకప్పుడు తెలుస్తుంది" అన్నాడు పావెల్.

ఫాక్టరీ ధర్మసత్రంకాదు. అని మేనేజరు పుల్లవిరుపుగా చెప్పి, ఇక లాభం లేదనుకుని తీవ్రంగా "ఏయ్ ! మీరంతా వెంటనే పనిలోకి వెళ్ళండి. ఇదే నా ఆజ్ఞ. తెలిసిందా ? వెడతారా ? వెళ్ళరా ?" అని హుంకరిస్తూ దిగొచ్చేశాడు.

ఒక్క క్షణం యెవ్వరూ మాటాడలేదు.

ఇంతలో జనంలోంచి యెవరో "నువ్వెళ్ళుదూ నీ పనిలోకి" అని కేక వేశాడు. మేనేజరు మరింత అగ్గయిపోయాడు.

"ఇదిగో చూచుకోండి ! పావుగంట టైమిస్తున్నాను. ఈలోగా మీరు పని

ప్రారంభించకపోతే అందరినీకూడా పనిలోనుంచి తప్పించేస్తాను" అని కుండ బద్దలుకొట్టినట్టుగా చెప్పి వెళ్ళిపోయాడు.

జనంలో గడబిడ బయల్దేరింది. "మేనేజరుతో మాటాడండి" అన్నాడొకడు.

"ఇంతేనయ్యా న్యాయం" అన్నాడింకొకడు. కొందరు పావెల్‌కేసి తిరిగి "ఏమయ్యోయ్! నువ్వే మా వకీలువు. ఇక ముందేమిచెయ్యాలో చెప్పు. నీవు బాగానే చెప్పావు. కాని తీరా మేనేజరొచ్చేసరికి అంతా ఒంకాయి పిచ్చికొండయి పోయింది"

"ఏమంటావు?" అని అడగడం ఆరంభించారు. కేకలు, బొబ్బలు, గందరగోళం హెచ్చిపోయింది. పావెల్ కొంచెం శాంతపరచి "సోదరులారా! మేనేజరు కోపెక్ ఉత్తరువు రద్దుచేసుకొనేవరకూ మనం పనిలోకిపోగూడదని నా సలహా" అని గంభీరంగా చెప్పేడు. జనంలో ఉద్రేకం మరీ హెచ్చిపోయింది. తలకొక మాట మాట్లాడారు.

"మనం శుద్ధ మూర్ఖులమని కాబోలు అతని ఉద్దేశం"

"ఏమయినాసరే, మనం జరిపించి తీరాలి"

"సమ్మెకట్టన్నమాట?"

"ఇంతపని ఒక్క కోపెక్‌కోసమా?"

"ఎందుకు కాదు?"

"సమ్మె ఎందుకు కట్టకూడదు?"

"మనలనందరినీ పనిలోంచి గెంటేస్తాడు"

"ఈ పనెవడు చేస్తాడు"

"ఇంకా చేసేవాళ్ళు కావలసినంతమంది ఉన్నారు"

"ఎవ్వరు? ఒంటెత్తు నిర్భాగ్యులా? (Judases)"

"అయితే నేను సంవత్సరానికి 3 రూబులు అరువదియైదు కోపెక్‌లు దోమలకోసం ఇవ్వాలన్నమాట!"

"నువ్వన్నమాటేమిటి? అంతాయివ్వాలి"

ఈమాటలన్నీ వింటూ పావెల్ క్రిందికి దిగొచ్చి తల్లికి సమీపంగా నిలబడ్డాడు. ఎవ్వరూకూడా అతనికేసి చూడడమేలేదు. అంతా జోరుగా అరుస్తూ చర్చ చేస్తున్నారు.

రైబిన్ పావెల్‌దగ్గరకొచ్చి "అబ్బే! వీళ్ళచేత సమ్మె కట్టించడం అసంభవము. ఒక్క పైసాకి ఆశపడలారు. కాని పిరికిపందలు. మహాచేస్తే నీవెంటఉండే జనం మూడువందలమంది వుంటారేమో! అంగీకరించరు. ఒక్క సంగతి చెపుతానువిను. వీళ్ళంతా ఎట్టి చచ్చు దద్దమ్మలు" అంటూ నిరుత్సాహ పరిచాడు.

పావెల్ మాటాడలేదు. అతనిముందర ప్రజలు గందరగోళ పడుతున్నారు.

కొందరు అతనికేసి చూస్తున్నారు. గుండెలాతనికి దడదడ కొట్టుకున్నాయి. తానింతసేపు గొంతుక చించుకున్న శ్రమ నిష్ఫలమైపోయిందా అనుకున్నాడు. ఎవరిమట్టుకు వాళ్ళు తాను సిద్ధముగా నున్నట్లు, మిగతావాళ్లు సిద్ధముగాలేరు కనుక లాభములేదని, నిరుత్సాహంగా మాటాడడం ప్రారంభించారు. అతని ఉపన్యాసాన్ని పొగిడేవాళ్లేకాని అతడు చెప్పినట్లు వినేవాళ్లెవరూ కనిపించలేదు.

పావెల్‌కు ప్రాణం విసిగి తల దిమ్మెత్తింది. శరీరం నీరైపోయింది. సత్యం విజయమొందక మానదనే విశ్వాసంతో అతడెప్పుడూ ఉప్పొంగుతూ ఉండేవాడు. కాని యిప్పుడు వున్నదున్నట్లుగా జనానికి తెలియపరిస్తే, అది నిరుపయోగమవడంతోటే అతని మనస్సు చివుక్కుమంది——

అలసిపోయి కాళ్ళీడ్చుకుంటూ పావెల్ ఇంటికి చేరుకున్నాడు. సిజావ్ రైబిన్‌లు, తల్లికూడా వచ్చారు. రైబిన్ పావెల్‌తో "అబ్బాయీ! నువ్వు చక్కగానే మాట్లాడుతావు కాని, హృదయానికి తగిలేటట్లు వినపడం ఇంతా నీ చేతకాదు" అన్నాడు. "ఎవరిమట్టుకు వాళ్ళే ఆలోచించుకొని వ్యవహరించుకోవలసిన రోజులొచ్చాయి" అని పావెల్ చెప్పాడు.

సిజావ్ తల్లితో వార్తాఖానీ ఆరంభించాడు. "నిలోనా! పెద్దవాళ్ళయిన మనబోంట్లు త్వరగా ఈ లోకాన్ని విడిచి వెళ్ళడం మంచిమాట. రోజులు పూర్తిగా మారిపోయాయి. క్రొత్త తరహా మనుష్యులు బయల్దేరారు. మనం గడపిన జీవితం ఏమి జీవితం? ఎంతసేపూ కడుపు చేత్తోపుచ్చుకుని ఒదిగి పడుండడంతో మన బ్రతుకు తెల్లవారింది. ఈకాలం వాళ్ళున్నారే, వాళ్ళకి బుద్ధి బాగావచ్చింది. మొత్తంమీద వాళ్ళు మనలాంటి వాళ్ళుకాదు. మాటవరుసకి చెపుతాను. చూడు! ఈవేళ మన కుర్రాళ్ళు మేనేజరుతో ఎంత నిర్భయంగాను, సమాన ఫాయీగాను మాట్లాడారో చూశావూ? ఈ రోజులన్నీ చూస్తే నా కొడుకు 'మాతీ' బ్రతికుంటే ఏంచేసేవాడో అనిపిస్తోంది."

తరువాత పావెల్‌కేసి తిరిగి "సోదరా! ఇక నాకు శెలవు. ప్రజలహక్కుల కోసం నీవు నిలబడాలి. భగవంతుడు నీకు తోడ్పడుతాడు" అని ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

"అవునవును. నీలాంటివాళ్ళు చస్తేనే నయం. మీరు మనుష్యులే కాదు. బుద్ధితక్కువవాళ్ళ సంఖ్యను వృద్ధిచేసే జంతువులు" అని రైబిన్ కొంచెంసేపు సిజావ్‌నుగూర్చి సణిగాడు. పిమ్మట పావెల్‌ను పిలిచి "అబ్బాయీ! నువ్వొక్క సంగతి కని పెట్టేవా? నిన్ను ప్రతినిధిగా ఎన్నుకోమన్న వాళ్లెవ్వరో తెలుసునా నీకు? నిన్ను సోషలిష్టని, ఆందోళనాపరుడని హేళనచేసినవాళ్ళే సుమా. నిన్నల్లా ముందుకుతోస్తే ఫాక్టరీవాళ్ళు నిన్ను పనిలోనుంచి తీసేస్తారని, దానితో నీ రోగం చప్పగా కుదుపతుందని, లోపల లోపల సంతోషించే నిర్భాగ్యులు" అని చెప్పాడు. ............"వాళ్ల లెక్కప్రకారం అది సరిగానే ఉండొచ్చు."

"అల్లాగే. కుక్కలు ఒకదానితో ఒకటి కొట్లాడుకున్నట్లే—"

* * * *

ఆ రోజంతా పావెల్‌కు మతి మతిలో లేదు. ముందు ఏం జరుగుతుందో, ఏ ప్రమాదం వచ్చి మీదబడుతుందో అతని కేమీ అవగాహన కాలేదు.

రాత్రి పావెల్ చదువుకుంటున్నాడు. తల్లి గుర్రుపెట్టి నిద్రపోతోంది. పోలీసులు ఇంట్లో ప్రవేశించి పెరట్లోను వాకిట్లోను వెతుకులాడడం ఆరంభించారు. వెనుకటి మాదిరిగానే పోలీసు ఆఫీసరు ధాంధూం చేసుకుంటూ లోపలప్రవేశించాడు. తల్లి కేమీ తోచక కొడుకుమొగంకేసి చూస్తూ నిలబడిపోయింది. పావెల్, పొంగి వస్తూన్న ఉద్రేకాన్ని అతికష్టంతో ఆపుకున్నాడు. ఆఫీసరు ఎంత వేళాకోళంగానూ అమర్యాదగానూమాట్లాడినా, ఓపికపట్టాడు. క్రిందటిసారి సోదాకొచ్చినప్పుడున్నంత భయం తల్లికి యిప్పుడు లేదు. ఈ ఆఫీసర్ల దడబిడలు ఆమె కలవాటైంది. కాకపోతే ఒక్క తేడామాత్రం వుంది. రాత్రిళ్లొచ్చి, కొంపల్లో దూరి అల్లరిపెట్టే ఈ ఆఫీసర్లంటే మునుపటికన్న అసహ్యం మాత్రం ఎక్కువైపోయింది. ఈ అసహ్యం మూలంగా భయం తోచనేలేదు.

ఇంతలో పావెల్ నెమ్మదిగా యేలాగో ఓలాగున తల్లిదగ్గరకొచ్చి "నన్ను అరెస్టుచేస్తారు" అని చెవిలో వూదాడు.

"నాకు తెలిసింది" అని ఆమె తలవాల్చుకుంది. ఆరోజు ఉదయం ఫాక్టరీలో కూలీలకిచ్చిన వుపన్యాసానికి ఆతనిని అరెస్టు చేస్తారని తల్లి గ్రహించింది. అతడు చెప్పిన విషయా లన్నింటిపైనూ అందరూ ఏకీభవించారు. కనుక అందరూ కలసి అతని విడుదలకై పనిచేస్తారనీ, కాబట్టి అట్టేరోజులు జైలులో ఉండనక్కరలేదనీ అనుకుంది.

తల్లి హృదయం నవనీతము లాంటిది. ఒక్కసారి కొడుకును కౌగలించుకొని బావురుమని యేడుద్దామనుకుంది. తల్లి కలాంటి కోరిక పుట్టడంలో వింతేమిటి? కాని దయాదాక్షిణ్యంలేని కర్కోటకుడు ఆఫీసరు, పెద్ద ఘాతంలాగు యెదుర నిలబడి యుండడంచేత ఆమెకా అవకాశంకూడా లేకపోయింది.

పావెల్ ఆమెకేసి ప్రేమార్ద్రదృష్టులను ప్రసరింపచేశాడు. మాట్లాడబోయాడు కాని మాట తొణకలేదు. తల్లి తన బట్టను సర్దుకొని "నాయనా! సుఖంగా వెళ్ళిరా. నీకు కావలసినవన్నీ తీసుకున్నావా?" అని అడిగింది.

"ఆ; అన్నీ వున్నాయి. నువ్వు మరేమీ బెంగపెట్టుకోవద్దు."

"నాయనా! క్రీస్తుదేవుడు నీకు సాయంచేస్తాడు"

౭

పోలీసులు పావెల్‌ను తీసుకుపోయారు. తల్లికి యేమీ తోచక ఇంట్లో ఒక్కతే దిగాలుపడి కూచుంది. తల్లికి కన్నకొడుకుతో ఎడబాటున్న పేరే దుఃఖమేముంటుంది? వెక్కి వెక్కి యేడ్చింది. తన నిస్సహాయస్థితిని తలుచుకొని నిట్టూర్పువిడిచింది. తీర్చుకోలేని కోపంవల్ల పళ్ళు పటపట కొరికింది. తనలోతానే యేమో గొణుక్కుంది. ఎంతసేపయినా ఆమెకింకా పోలీసులొచ్చి గ్రుడ్లెర్రచేసి తనకేసి చూస్తున్నట్లే వుండేది. తల్లి బిడ్డలను వేరుచేసే ఈ అధికారులనుచూస్తే ఆమెకు ఒళ్ళుమంట. అసహ్యం ఎక్కువైపోయాయి—ఏదోబాధ కడుపులో చెయ్యిపెట్టి కలిపేసింది.

తెల్లవారేసమయం; చలి ఎక్కువగాఉంది. తల్లి ఆలాగే కంటిమీద కునుకు లేకుండా కూచుంది. నిద్రలేకపోయినా కలలుమాత్రం వచ్చాయి. ఆమెకళ్ళకు పోలీసులు తిరుగుతున్నట్లు కనిపించింది. వాళ్ళడుగుల చప్పుడు వినుపిస్తూనేవుంది. తననుకూడా పట్టుకుపోతే బాగుండునుకదా అనుకుంది. ఇంతలో ఫాక్టరీకూసింది. రైబిన్ తలుపుతోసుకుని లోపలికొచ్చాడు.

"అబ్బాయిని తీసుకుపోయారుకదూ?" అని తల్లిని పరామర్శించాడు.

"ఆ తీసుకెళ్ళేరు" అని నిట్టూర్పు విడిచింది.

"అంతే అంతే! వాళ్ళతంతేఇంత. నన్నుకూడా సోదాచేశారు సుమా! నఖశిఖపర్యంతం చూసేరు. వాళ్ళ కరువుతీరేటట్లు నన్ను తిట్టుకున్నారు. కాని అంతకుమించి మాత్రం మరేమీ చెయ్యలేదు. అయితే, పావెల్‌ను పట్టుకుపోయారన్నమాటే. ఏముంది? ఫాక్టరీమేనేజరు 'సై' అని కన్నుగీటేడు. పోలీసాయన 'సై' అని అందుకున్నాడు. దానితో ఒకమనిషి ఫైసలా. కొట్టుకెళ్ళేడు. ఇంతలో ఉంది మనబ్రతుకు. వాళ్ళకీ వాళ్ళకీ అన్యోన్యం అండా ఒకటే. ఫాక్టరీవాళ్ళు ప్రజలజేబులు తడుముతూ ఉంటే పోలీసువాళ్లు జనం నోరెత్తకుండా తుపాకీ తయారు చేసి ఉంచుతారు."

"మరి మీరంతా పావెల్‌కు సాయపడాలి. మీ అందరికోసమేకాదూ అతడు జైలుకెళ్ళింది?"

"ఏమిటీ! మేమంతా ఏకమై సాయపడాలంటావా?"

"అవును మీరంతాను."

"అబ్బో! అదెక్కడిమాట! సాగడం అసంభవం. అది చాలా పెద్దకోరికే. మన యజమానులు ఎన్నోవందల సంవత్సరాలనుంచీ మన హృదయాల్లో అవిషం ఎక్కించారు. అందుచేత ఐకమత్యం సులభంకాదు. ముందుహృదయంలోకెక్కిన విషానికి విరుగుడు పెట్టాలి."

ఈ మాటలుచెప్పి రైబిన్ వెళ్ళిపోయాడు. అతి నిర్మొగమాటంగా చెప్పిన అతనిమాటలవల్లతల్లికి విచారం కలిగింది. రోజల్లాఆమెదిగాలుపడేవుంది. పగలంతా పొయ్యిలో నిప్పే వేయలేదు. రాత్రివాగా ప్రొద్దుపోయిన తర్వాత బలవంతాన్ని కొంత్త రొట్టెముక్కను నోట్లో వేసుకుని మంచంమీద వాలింది—ఆట్టేపడుకుంటే ఆమెకు జీవితమంతా నిరర్థకంగా తోచింది. తనలో తనకేఏదో అవమానం తోచింది. ఈ మధ్య తనకొడుకు ప్రయోజకుడైనప్పటినుంచీ ఆమెకు కొత్త కొత్త ఆశలుపుట్టినాయి. పదిమందియువకులు తనయింటికి రావడం, తన కొడుకుతో సలహాచేస్తూ వుండడం, అతడంటే ఎంతోగౌరవించడం, మొదలైన సంగతులన్నీ గమనించడంవల్ల ఆమెకు ఒకవిధమైన గర్వం కలిగింది. ఈ యువకుల్లో వుత్సాహం కలిగించడానికంతా తన కొడుకే కారకుడుగదా యని వుప్పొంగేది. అలాంటి ప్రయోజకుడైన కొడుకు అరెస్టు కావడంతోటే ఆమెకు జీవితమంతా అంధకారమైపోయింది. ఇప్పుడామె యింటికొచ్చేవాళ్ళులేరు. ఆమెతో మాట్లాడే వాళ్ళులేరు. పనివాళ్ళందరికోసం కష్టపడుతున్న పావెల్‌ను పట్టుకుపోతే మనునాడంతా రైబిన్ తప్ప గుమ్మంలో అడుగుపెట్టిన పాపాన్నెవ్వరూ పోలేదు. ఈ ఆలోచనలో పడేసరికి ఆమెకు ప్రపంచం అంతా తల్లక్రిందయి పోతున్నట్లు కనుపించింది.

ఇంతలో ఎవరో మెల్లగా తలుపు తట్టినట్టయింది. తల్లిచటుక్కునలేచి తలుపుతీసింది. 'శామొలో' యింకొక స్నేహితుడ్ని వెంటపెట్టుకుని లోపలి కొచ్చాడు.

"ఏమమ్మా! నీ నిద్ర చెడగొట్టినామా ఏమిటి?" అన్నాడు.

"నిద్రా? నాకళ్ళు మూతేపడలేదు." ఇంతలో శామొలోతోకూడా వచ్చిన మనిషి టోపీతీసి "ఏమమ్మా! నన్నానవాలు పట్టేవా?" అని అడిగాడు.

తల్లి అతనిముఖంకేసి బాగా చూసింది. సంతోషంతో "నువ్వా నాయనా! ఇవానిష్‌యాగర్" అంది.

"అవును. అవును" అని చిరునవ్వు నవ్వుతూ చెప్పేడు.

తల్లి బట్టలు మార్చుకోవడానికి లోపలి కెళ్ళింది. వెడుతుంటే శామొలో 'ఏమమ్మోయి! నీదగ్గరకు పనిమీద వచ్చాం' అన్నాడు.

ఇవానిష్ గదిలోకిపోయి "అమ్మా! • నికోలే ఇవ్వాళ ప్రొద్దున్నే జైల్లోంచి విడుదలై పోయాడు తెలుసునా?" అన్నాడు.

"ఎన్నాళ్ళున్నాడక్కడ?"

"అయిదుమాసాల పదిరోజులు. నకోడాను, పావెల్‌ను చూచివచ్చాడు. ఇద్దరుకూడా నిన్ను చాలా చాలా అడిగారు. పావెర్ నిన్ను కంగారుపడవద్దని కబురంపాడు. జైళ్ళంటే భయపడనక్కరలేదు. దేశసేవకులు అలసిపోయినప్పుడు

• నికోలె ఇవానిష్ పట్టణంలో వుండే సోషలిస్టు సేవకుడు.

విశ్రాంతి తీసుకోవడానికి అధికారులు కట్టించిన ధర్మసత్రాలు జైళ్ళే. సరేకాని అసలుసంగతి చెపుతాను విను. నిన్న యెందరు అరెస్టయినారో తెలుసునా ?"

"అబ్బే ! నాకేమీ తెలియదు. ఏమిటీ ? పావెల్ కాకుండా యింకా కొందరు కూడా అరెస్టయినారేమిటీ ?"

"పావెల్ 49 వ వాడు. ఇంకా పదిమందిదాకా అరెస్టవుతారు. ఈ పెద్ద మనిషి 'శామొలో'కూడా దయచేస్తాడు" అని ఇవానిష్ తల్లి సంశయం తీర్చాడు. ఆమె గుడ్డలు మార్చుకుని వచ్చింది.

"ఇంతమంది నరెస్టుచేస్తే చాలాకాలం వుంచరనుకుంటాను" అని వెర్రి నమ్మకం వెలిబుచ్చింది.

"అల్లాగే.......కాని మనమిప్పు డుపేక్షచేసి ఫాక్టరీలో కాగితాలు పంచి పెట్టడం మానేస్తేమాత్రం వాళ్ళగొంతుక్కి వురిపోసినవాళ్ళమవుతాం. పోలీసులు యీ సావకాశం చూచుకొని బాగా బిగిస్తారు."

"అదెల్లాగ ?"

"ఎలాగేమిటి ? స్పష్టంగా కనిపిస్తూనేవుంది. ఒక్కొక్కప్పుడు పోలీసు వాళ్ళుకూడా సరిగానే ఊహచేస్తారు. మాట వరుసకి చూడు. పావెల్ ఉన్నన్నాళ్ళు ఫాక్టరీలోకి పుస్తకాలొచ్చేవి. కరపత్రాలొచ్చేవి. అతన్ని అరెస్టు చేయడంతోనే పుస్తకాలులేవు, గిస్తకాలులేవు. పత్రికలసలే లేవు. దానర్థమేమిటి ? పావెల్ యీ పుస్తకాలకి మూలమన్నమాట. ఇల్లాగే ఊహచేసి అధికారులు పావెల్ ప్రభృతులను ప్రాణాలతో నమిలిమ్రింగడానికి ప్రయత్నంచేస్తారు. మనుష్యులను పీల్చి పిప్పిచేసి ప్రాణాలు తీయడమంటే వీళ్ళకి మహా సరదా".

"అవునవును. అర్థమైంది. అయ్యో దేవుడా ! ఏమి మార్గమోయి" అని నిస్పృహతో నిట్టూర్పువిడిచింది తల్లి.

"వాళ్ళందరినీ పట్టేశారు. ఈ పనిచేయడానికెవ్వరూ మిగలలేదు ఉద్యమం మాట ఎలావున్నా, పావెల్ ప్రభుతులకోసమైనా, ఏవో తంటాలుపడి పత్రికలను, కరపత్రాలను ఫాక్టరీలోకి పంపాలి" అన్నాడు శామొలో.

"ఒక్కడైనాలేడు. ఒకటవరకమైన పుస్తకాలు, పేపర్లుమాత్రం ఉన్నాయి. నేనే స్వయంగా తయారుచేయించాను. కాని ప్రయోజనమేముంది ? లోపలికెల్లా వెడతాయా అనే ఆలోచన" అన్నాడు ఇవానిష్. "గుమ్మంలో అందరినీ సోదా చూస్తారుగదా !" అన్నాడు శామొలో.

ఈసంభాషణ అంతా తల్లి శ్రద్ధగా వింది. బహుశా వాళ్ళు తనకేదో పని వప్పజెప్పడానికే ఈ మాటలన్నీ చెపుతున్నట్లుగా ఆమెకు తోచింది. తన కొడుక్కి ఉపకారం చేయడానికొక సావకాశం దొరికిందిగదాయని సంతోషంతో "అయితే ఇప్పుడేమి చెయ్యాలి !" అని అడిగింది.

"అమ్మా! ఫాక్టరీలో ఫలహారాలమ్మే మేరీకార్సునోవాతో నీకు బాగా పరిచయముందా?" అని శామొలో అడిగేడు.

"ఆ! బాగానే పరిచయమే."

"అలాగయితే ఆమె తన తినుబండారాల సరుకులతోపాటు మన కాగితాలనుకూడా ఎలాగయినా రహస్యంగా లోపలికి జేరవేస్తుందేమో కనుక్కుంటావా?

"అవసరమైతే డబ్బుకూడా పారేద్దాం" అని ఇవానిష్ అన్నాడు.

తల్లి మూతివిరిగించి లాభంలేదన్నట్లుగా తల ఊపింది. ఒక్కక్షణం ఆలోచించింది.

"అబ్బో! ఆమెవల్లకాదు. ఆమె శుద్ధవాగుడుపిట్ట. నోట్లో నువ్వుగింజ దాగదు. మాట జారిందా అంటే కొంప మునిగిపోతుంది. అందులోనూ నాఇంట్లో నుంచే ఇంకా కాగితాలొస్తున్నాయని అధికారులకు తెలిస్తే ఇంకేమైనాఉందా? అబ్బో! వద్దుబాబూ: వద్దు."

ఇంతలో ఆమెకొక ఉత్సాహం కలిగింది. కొత్త ధైర్యం కలిగింది. నెమ్మదిగా "ఏమైతే అవుతుంది. ఆపని నేనుచేస్తాను. నాకేచెప్పండి. ఆతంటాలేవో నేనే పడతాను. మేరీని బ్రతిమాలుకుని ఆమెదగ్గర పనికి చేరతాను. నేనుకూడా ఏదో కష్టపడి నాపొట్ట నేను పోసుకోవాలిగదా? నాకేమి ఆధారముంది? కనుక నేనే ఫ్యాక్టరీలో ఏవో తినుబండారాల నమ్ముకుంటాను. ఇంతెందుకు? ఎలాగో పని జరిపిస్తాను" అంది.

ఎవరికీ తెలియకుండా తానీపనిచేయగలననే ధైర్యం తల్లికి కలిగింది. పావెలు అరెస్టయినా అతను ఏర్పాటుచేసిన పని ఆగలేదని అధికారులకు తెలియాలి అనుకుంది.

ముగ్గురూ సంతోషపరవశులైపోయారు. బలేవాగుందని ఇవానిష్ యెగిరి గంతేశాడు. ఈ పన్నాగం పారిందంటే జైల్లోకెళ్ళినా హాయిగా నిశ్చింతగాఉంటాను అన్నాడు శామొలో. "మామ్మా! దేవాంశకురాలవుకదా నువ్వు?" అని ఈగర్ తల్లిని బుజ్జగించాడు;

తల్లి చిరునవ్వు నవ్వింది. ఫాక్టరీలో కరపత్రాలు పంచిపెట్టినట్లయితే అధికారులు ఈపనికి పావెల్ కారకుడు కాదని నిర్ణయిస్తారని ఆమె ఆశ. ఆ ఆశ వల్లనే అఖండమైన సంతోషం కలిగింది.

"శ్యామొలో! నువ్వీసారి పావెల్‌ను జైల్లో కలుసుకున్నప్పుడు మీ అమ్మ చాలా దివ్యమైన మనిషని చెప్పు" అన్నాడు ఇవానిష్.

"ఓ! తప్పకుండా ఇంకా సందేహమా?"

"అవసరమైన పనులన్నీ చేస్తానని చెప్పు. ఈ సంగతతనికి తెలియాలి" అని తల్లి శ్యామొలో చేయిపట్టుకుని ఆదుర్దాగా చెప్పింది.

"ఇంతకీ శామొలోవు జైలులో పెట్టారికదా?" అని సంశయం తెలిపాడు ఇవానిష్.

"సరే. పెడితేనే. లేకపోతే చేసేదేముంది?" అంటూ కాస్త నవ్వు కున్నాడు.

"తనవాళ్ళ సంగతి ఆలోచించుకుంటూంటే యెదటివాళ్ళ అవస్థ అర్థం కాదు" అంది తల్లి.

"అవును. అల్లాగే కాని నువ్వు పావెల్ సంగతేమీ అప్పుడే బెంగపెట్టుకో నక్కరలేదు. అతడు జైలులోంచి తిరిగి వచ్చేటప్పటికి మరీ దిట్టమైనవాడవుతాడు. మాకు జైలే విశ్రాంతికీ, చదువుకోడానికీ అనువైన స్థలం. ఇవతల మాకు ఆ అవకాశాలు లేనేలేవు. నేను మూడుసార్లు జైలుకెళ్ళేను. కాని మూడుసార్లు కూడా శరీరానికి సౌఖ్యం లేకపోయినా మనస్సుకు మాత్రం లెక్కలేని విశ్రాంతి వుండేది" అని ఇవానిష్ తల్లిని కాస్త శాంతపరిచాడు

"అయితే నీవల్లా ఒగరుస్తున్నావేం?"

"దానికి వేరే కారణం వుందిలే. దానికేం కాని మామ్మా! ఈ పని నిశ్చయమై పోయినట్టేకాదూ? రేపు కాగితాలు అంపచేస్తాను. మన పని యథాప్రకారముగా సాగిద్దాం. మరి ఇవ్వేళకి శలవు" అని ఇవానిష్ వెళ్ళిపోయాడు. శామొలోవుకూడా నమస్కారంచేసి వెళ్ళిపోయాడు.

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయిన తర్వాత తల్లి కళ్ళుమూసుకొని ప్రార్థనచేయడానికి మోకాళ్లమీద వాలింది. కాని ఆమెకు నోట మాట తోచలేదు. ఈ మధ్య తన కుమారుని మూలంగా పరిచయమైన యువజనులంతా ఆమె కళ్లకు కట్టినట్లు కనుపించారు

మరునాడు ఉదయం తల్లి మేరీకార్సునోవా దగ్గర కెళ్ళింది. మేరీ ఆమె యందు సానుభూతితో గబగబా మాట్లాడడం మొదలెట్టింది,

"మరేమీ విచారపడకమ్మా. అధికారులు అతన్ని తీసికెడితే ప్రమాదమేమీ లేదు. పూర్వం రోజుల్లో దొంగతనాలు చేసేవాళ్ళని జైళ్ళలో పెట్టేవారు. ఇప్పుడందులో నిజం మాట్లాడేవాళ్ల నందరినీ పెడుతున్నారు. పావెల్ ఏమి చెప్పినా అందరికోసం చెప్పేడు. ఆ సంగతందరికి తెలుసును. కనుక విచారించకు. ఈసంగతి తెలియడంతోనే నేనేవచ్చి నిన్ను చూద్దామనుకున్నాను. కాని తీరుబడి కాలేదు. ఎంతసేపూ ఏవో వండడం అమ్మడంతో సరిపోతోంది. చచ్చేదాకా యింతే బ్రతుకు. ఎంత కష్టపడితే యేముంది? ఎప్పుడూ ముష్టిబ్రతుకే. ఒకరికి ధర్మశవం వెళ్ళవలసిందే. పమెరూకలు ఎల్లాగో అల్లాగు చేర్చేసరికి అది కాస్తా ఏ నిర్భాగ్యుడో పుణ్యం కట్టుకుంటాడు. ఆడబ్రతుకు మహా దుర్భరమైంది. అంత కన్న నిర్భాగ్యపు బ్రతుకింకేమీ లేదు. ఒంటరిగా ఉండడం చాలా కష్టం. పోనీ అని ఎవరితోనైనా కాలక్షేపం చేద్దామంటే అది మరీ కష్టంగా ఉంది."

తల్లి తాను వచ్చినపని చెప్పింది. తనను కాస్తవెసుక ఆసరా చేసుకోమని కోరింది. మేరీ మొదట తటపటాయించింది. కాని చివరికి అంగీకారసూచకంగా తలవూపి "సరే, అలాగే కానియ్యి. నువ్వు అనేకసార్లు నన్ను నా భర్తపెట్టే బాధలనుండి తప్పించావు. ఇప్పుడు నేను నీకు యేలోటూ రాకుండా చూస్తాను. నిజానికి నీకందరూ సాయం చేయవలసిందే. ఎందుచేతంటే నీకొడుకు అందరి కోసం జైల్లో మ్రగ్గిపోతున్నాడు. నిజంగా అతడు మహామంచివాడు. నేనన్న మాటేమిటి? అంతా అల్లాగే అనుకుంటున్నారు. ఇపుడందరికీ అతనంటే మహాజాలిగా వుంది. నిజానికి అధికారులకు ఈ నిర్బంధాలవల్ల ఏమీ ప్రయోజనం కలుగదు. చూడు ఫాక్టరీలో ఏమవుతుందో. ఫాక్టరీ అధికారులు కటకట పడిపో తున్నారు. ఒకడిని శిక్షిస్తే అంతా తగ్గిపోతారని వాళ్ళవూహ. కాని ఒకళ్ళకి నొప్పి తగిల్తే పదిమందికీ ఆగ్రహం కలుగుతోంది. పదిమందికి దెబ్బతగిల్తే నూరుమందికి కడుపు మండుతోంది. పనివాళ్ళ విషయాల్లో చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. భరించినన్నాళ్ళు గాడిదల్లాగున ఎంత కష్టమైనా సహిస్తారు. తిరుగబడితే మాత్రం బాంబే. ఫిరంగిగుళ్ళే."

## ౧౦

ఏమినాటి మధ్యాహ్నం తినుబండారపు సరుకుపుచ్చుకుని తల్లి ఫాక్టరీ ఆవరణలోనికి వెళ్ళింది. రెండు గిన్నెలు ముందుపెట్టుకొని కూచుంది. రోజూ అమ్మే మేరీ ఆరోజున రాలేదు. పనివాళ్ళంతా ఆమెను ఆశ్చర్యముతో చూచారు. పావెల్ మీదవుండే అభిమానంకొద్దీ నలుగురూ నాలుగు విధాలుగా పరామర్శించారు.

"వర్తకం ప్రారంభించావా?" అని కొందరు సాదరంగా ప్రశ్నించారు. మరి కొందరు పావెల్ కు తప్పకుండా విడుదలవుతుందిసుమా యనిచెప్పి ఆమెను సంతోషపెట్టడానికి ప్రయత్నించారు. ఇంకా కొందరు పోలీసువాళ్ళనీ, ఎల్లుమేనే జరునూ తిట్టడం మొదలెట్టేరు. అంతా ఒకమోస్తరుగాఉండే సొగసేలేదు. కొందరు పావెల్ ను తిట్టిపోసేవాళ్ళుకూడా లేకపోలేదు. అందులో ఐసేగాల్ఫ్ పళ్ళు పటపటలాడిస్తూ "నేను గవర్నరైతేనా? నీకొడుకును వురితీయించేవాడనే. లేకపోతే యెందుకతడల్లా ప్రజంకంట్లో దుమ్ముకొట్టడం!" అన్నాడు.

ఈ కటువుమాటలు వినేసరికి తల్లిప్రాణం చివుక్కుమంది. అతనిమొఖం కేసి ఒక్కసారిచూచి నిట్టూర్పువిడిచి తలవంచుకొంది. ఫాక్టరీలో జరుగుతున్న అలజడంతా ఆమెకనిపెట్టింది. పనివాళ్ళలో అపరిమితమైన ఉల్సాహం ఆవేశం ఆమె చూచింది. వాళ్ళంతా కారాలు మిరియాలు నూరుతున్నారు. ఫాక్టరీమేనేజర్ల మొఖాల్లో నెత్తురులేదు.

ఇంతలో ఇద్దరుపోలీసులు శామ్యూలోను అలా తీసుకెదుతున్నారు. అతదొక చేతిని జేబులోపెట్టుకొని రెండోచేత్తో క్రాపింగు సరిచేసుకుంటూ నిశ్చింతగా పోతున్నాడు. సుమారు నూరుమంది కూలీలు గుంపుగా వెనకబడ్డారు. జనమంతా పోలీసులను రకరకాలుగా తిట్టడం ఆరంభించారు.

"తస్సాదియ్యా! ఊరేగిస్తున్నారురా"

"వాళ్ళుచేసే మర్యాదలు మనకెవళ్ళు చేస్తారు?

ఈరోజుల్లో దొంగల్ని, దోపిడీవాళ్ళని పట్టుకుంటే వాళ్ళకేమీ గిట్టుబాటవు తున్నట్లులేదు .అంచేత మర్యాదస్తులనందరినీ అరెస్టుచేస్తున్నారు". చేస్తే చేసేరు కాని ఈపాడుపని రాత్రిళ్ళయినా చెయ్యరు! పట్టపగలు పెద్దమనుష్యుల్ని సిగ్గనేది లేకుండా బయటి కీడుస్తారు రాక్షసులు."

ఇలా ప్రజలు వెనకాల వెక్కిరిస్తున్నా పోలీసులు వినుపించుకోకుండా చురుకుగా అడుగేసుకుంటూ ఖైదీని నడిపిస్తున్నారు. నిలోనా ఫలహారపు గిన్నెల ముందు కూర్చుండగా ఈ ఊరేగింపు అల్లావెళ్ళింది. శామ్యూల్ ఆమెకేసిచూచి చిరునవ్వు నవ్వి హెచ్చరించాడు, "ఏమనుకున్నావో భగవద్భక్తుడైన గ్రిగరీని సుమా అరెస్టుచేసి తీసుకెడుతూంట !" అన్నాడు.

తల్లి ఏమీ మాట్లాడలేదు. అతని నమస్కారం అందుకుని ఆశీర్వదించింది. అలాంటి తెలివితేటలుగల యువకులు చీమ చింతాలేకుండా నవ్వుతూ త్రుళ్ళుతూ జైలుకెడుతుంటే బిడ్డల కన్నకడుపవడంచేత తల్లికి జాలికలిగింది. వెనకాలున్న ప్రజలు రకరకాలుగా అధికారులను తిడుతుంటే ఆమె లోపల చాలా సంతోషించింది. తన కొడుకు చేసిన పని ఊరికే పోలేదుకదాయని తృప్తిపొందింది.

* * * *

ఫలహారాలు అమ్మేసిన తర్వాత తల్లి మేరీ ఇంటిపద్ద సాయంకాలం దాకా కాలక్షేపంచేసింది. దాగా చీకటిపడ్డాక కొంపకు చేరుకుంది. ఏమిటో జీవితం కొత్తగా కనుబడింది. ఏమీతోచక కాలు కాలిన పిల్లిలాగున అటూఇటూ పచారు చేసింది. చాలా రాత్రియైనా కరపత్రాలు పట్టుకొచ్చి ఇస్తానన్న ఈగర్ ఇవానిష్ ఇంకా రాలేదు.

అర్ధరాత్రి మంచు జోరుగా కురుస్తోంది. చేతులు కాళ్ళు కొంకర్లు పోయే చలి. ఇలాటప్పుడు నిరాధారస్థితిలోనున్న తల్లి కొడుకునిగూర్చి విచారపడడంలో విశేషమేముంది ? ఇంతలో తలుపు చప్పుడయింది. తల్లి వెంటనే పరుగెత్తికెళ్ళి తలుపుతీసింది. శశాంక లోపలికొచ్చింది. తల్లి ఆమెకేసి ఎగాదిగాచూచి సన్నంగా రివటలాఉండే మనిషి ఇంత లావెక్కిందేమాయని ఆశ్చర్యంతో చూచింది. ఏమీ తోచకుండా ఒంటరిగాఉన్న సమయంలో తోడుదొరికినందుకు సంతోషించింది. కుశలప్రశ్నలయ్యాక వాళ్ళిద్దరూ సంభాషణ ప్రారంభించారు.

తల్లి :—ఏమిటీ ? నిన్నుచూచి ఎన్నాళ్ళయిందీ ? ఇంత కాలం ఎక్కడున్నావు :

శశాంక :— జైలులో నికోలే ఇవానిష్‌తోపాటు నన్నూ జైలులోపెట్టేరు. అతన్నెరుగుదువా ?

త :— ఎరక్కేమి ? ఎరుగుదును. అతను నిన్ననే విడుదలయ్యాడని శంకర్ ఇవానిష్ చెప్పేడు, నీసంగతే నాకు తెలియలేదు. ఎవరూ చెప్పలేదే ?

శ :— చెప్పడానికేముందిలే. అది సరేకాని యీ బట్టలు మార్చేసి యింకోబట్టలు కట్టుకోవాలి.

త :— ఏమి ? అన్నీ తడిసిపోయాయా యేమిటి ?

శ :— కాదు. కరపత్రాలు పట్టుకొచ్చాను.

త :— కరపత్రాలా ? ఏవీ ? ఏవీ ? ఇలా ఇయ్యి.

శశాంక గౌను కొంచెం వదులుచేసి దులిపింది. చెట్టు దులిపితే పండుటాకులు రాలునట్లుగా చిన్నచిన్న కరపత్రాలు రాలేయి. అన్నిటిని నెమ్మదిగా ఏరి కట్టకట్టింది "ఏమా ఇంత లావయినావని ఆశ్చర్యపడుతున్నాను. ఇదా సంగతి ? ఎన్ని కాగితాలు పట్టుకొచ్చావూ ? ఈమంచులో నడిచేవచ్చావా ?" అని శశాంక నడిగింది. శశాంక అవునంది. కాగితాలబరువు వదిలిపోయిన తర్వాత ఆమె యథాప్రకారంగా రివటలా తయారైయింది.

"శశాంకా ! ఏమిటది ? నిన్ననేకాదూ జైలులోనుంచి బయటపడ్డావు ? ఇంతలోనే యింతతొందరా ? కాస్త విశ్రాంతి తీసుకో. అప్పుడే యేమి మునిగిపోయిందని ఈబరువు మోసుకొచ్చావు ?" అని తల్లి ఆమెను మందలించింది.

"ఫరవాలేదులే. మరి ఈపని జరగాలి అది సరేకాని. పావెలు ఎల్లావున్నాడు? అతనేమి విసుకూ కసుగూ లేకుండా వున్నాడా ? అని శశాంక, తల్లిని ఆదుర్దాగా వణకుతూ అడిగింది.

"ఆ. అతని విషయంలో ఆ సంశయంలేదు. అధైర్యమనేది యెరుగనే యెరుగడు. దానికేమిగాని అలా వణుకుతున్నావేమి ? కొంచెంటీ, ఫలహారం తెమ్మంటావా ?" అని అడిగింది.

"ఉంటే దివ్యంగానే వుంటుంది. కాని అర్ధరాత్రివేళ పెద్దదానవు, నిన్ను శ్రమపెట్టడమెందుకూ ? నేనేవెళ్ళి చేసుకుంటానులే" అంది శశాంక.

తల్లికి కోపంవచ్చింది. "ఏమిటీ ! నేను శ్రమపడతానా ? నీకన్నానా ?" అని మందలించి వంటయింట్లోకెళ్ళి ఫలహారం ప్రయత్నం ఆరంభించింది. ప్రక్కనే బల్లమీద శశాంక, రెండుచేతులతోను కణతలు నొక్కుకుని కూచుంది. 'అబ్బ ! నిజానికి నాకు నీరసంగానేవుంది. ఎన్నిజెప్పినా జైలు మనిషిని నీరసపెట్టక మానదు. అక్కడున్న అనర్థాలలోకల్లా అసహ్యమైనది. తప్పనిసరియైన సోమరితనం. దానికన్న బాధకరమైన దింకొకటిలేదు. ఒకవారమా రెండువారాలా ఐదువారాలు. చేయవలసిన పని బయట కావలసినంతుంది. ప్రజలు సంగతిసందర్భాలు తెలుసుకోడానికి తహతహపడుతున్నారు. వాళ్ళకి సంగతిసందర్భాలు తెలియచెప్ప

గల సహుర్దతకూడా మావగ్గరుంది. అన్నీ వున్నాయి కాని యేమి ప్రయోజనం? అంగడిలో అన్నీ వున్నాయి అబ్లుపినోట్లో శనిమాత్రం వుందన్నట్లుగా మేము పశువులలాగ చోనుల్లో పడుండాలసివస్తోంది: అదే అవస్థ. దానితోటే హృదయాలు శల్యాలై పోతున్నాయి.

తల్లి ఇదంతావిని ఒక నిట్టూర్పు విడిచింది. వీళ్ళుపడే యీ శ్రమకంతకీ ప్రతిఫలమిచ్చే వారెవరైనా ఉన్నారా యని ప్రశ్నించుకుంది. దేవుడు అని తానే జవాబు చెప్పుకుంది. కాని మళ్ళీ అనుమానం కలిగి "అయితే, మీకు దేవుడంటే కూడా నమ్మకం లేదుకాదూ?" అని శశాంక నడిగింది.

"లేదు."

"యేమిటీ! భగవంతునిమీద నమ్మకం లేకుండానే యీ పనంతా చేస్తున్నారా?" అని మళ్ళీ అడిగింది.

* * * *

ఇంతలో వాకిట తలుపువగ్గిర యెవరో వచ్చినట్లలికిడైంది. తలుపు తియ్యడానికి తల్లి లేచింది. శశాంక ఆమెను ఆపుచేసి నెమ్మదిగా "ఇదిగో! తలుపుతియ్యకు. ఆ వచ్చిన వాళ్ళు పోలీసులైతే ప్రమాదం. నేను ఈ పుస్తకాల తోటి పొరపాటున ఇంకో ఇంట్లోకెళ్ళేను. అదృష్టవశాత్తూ యింటికి చేరుకున్నా" నని చెప్పింది. ఆ సంగతేమిటో తల్లికితెలియకపోవడంచేత యేమీ మాట్లాడలేదు.

తడిసి ముద్దయిపోయి ఊపిరాడకుండా "ఈగర్" లోపలకొచ్చాడు. వస్తూనే తినడానికి రొట్టె చూచేసరి కాతనికి ప్రాణం లేచివచ్చింది. శశాంకకూడా కనుపించేసరికి ఆశ్చర్యపోయాడు. పిచ్చాపాటీ మాట్లాడుతూ తడిగుడ్డలుతీసేసి పొడిగుడ్డలు కట్టుకున్నాడు. సందర్భవశంగా ఈగర్ శశాంకనుగురించి ఇలా చెప్పాడు.

"అమ్మా! ఈపిల్లసంగతేమనుకున్నావు? నిజంగా పోలీసువాళ్ళకి యీమె యెదురొమ్ముమీద కుంపటే. జైల్లో ఒకమేస్త్రీ ఈమెతో కొంచెం అమర్యాదగా మాట్లాడేసరికి వాడు కాళ్ళబేరానికొచ్చి చెంపలు వాయించుకొనేవరకు నిరశనదీక్ష పట్టింది. ఎనిమిదిరోజులు అన్నహారాలు లేకుండావుంది. చివరికి చచ్చిపోయేటంత స్థితికికూడా వచ్చింది కాని తప్పిపోయింది. ఆమె సాధారణ శక్తిమంతురాలను కున్నావాయేమిటి?"

"ఏమిటీ! అన్నహారాలు మానేసి వుండడమే? సాధ్యమే?" తల్లి తెల్లబోయి అడిగింది.

"మరేమి చెయ్యాలి? వాడిచేత క్షమాపణ చెప్పించవలసొచ్చింది" అని శశాంక తన పట్టుదలను సూచిస్తూ చెప్పింది. "ఒకవేళ ప్రాణంపోతేనో" 'పోతే ఏమి? ఏంచేస్తాం. పోయినాసరే. ఆఖరికి వాడు దవడలు వాయించుకొని కాళ్ళమీద పడవలసొచ్చింది. ఏమైనాసరేకాని. ఎప్పుడూ అమర్యాదను మాత్రం భరించి ఊరుకోకూడదు. దాని అంతు కనుక్కోవలసిందే"

"అవును........కాని బ్రతుకంతా చివాట్లలోనూ, చెప్పుదెబ్బలలోనే గడపిన ఆడవాళ్ళం ఉన్నాంగా ? మనగరేమిటి ?" ఈ సంభాషణ జరుగుతూండగా ఈగర్ టీకోసం తొందరపడ్డాడు. టీ త్రాగుతూ తన తండ్రి రోజూ ఇరవైసార్లు టీ త్రాగే వాడనీ, మూడువందల పైచిల్లర పౌనుల బరువుండేవాడనీ, ఏవో పిచ్చా పాటీ బాతాఖానీ ఆరంభించాడు. సందర్భవశాత్తు పావెల్ తల్లి పుట్టిల్లు, అతని తండ్రి ఊరు ఒకటేనని తెలిసింది. ఇంకా తరుస్తే అతని తండ్రి "ఇవాన్" తల్లికి బాగా పరిచయుడే. ఆసమయంలో ఉండే సంతోషం ఏలాంటిదో వేరేచెప్పాలా ? గ్రామం లోని తమ చిన్ననాటి సంగతులన్నీ చెప్పుకొని వాళ్ళిద్దరూ సంతోషించారు. కాస్సేపటికి శశాంక ఇంటికి ప్రయాణమైంది. తల్లి తెల్లబోయి "అర్ధరాత్రి కెక్కడి కెడతావు ! పట్టణమే ?" అని అడిగింది.

"అవును"

"ఏమి సాహసమమ్మాయి ? ఈ కటికి చీకట్లో వెడతావా ? చలి, వణుకెత్తు తోంది. ఈ రాత్రి కిక్కడుండు. నువ్వూనేనూ ఈ గదిలో పడుకుందాం. ఈగర్ వటమటింట్లో పడుకుంటాడు."

"అచ్చే ! అలా వీలులేదు. నేను యిప్పుడే వెళ్ళిపోవాలి"

ఈగర్ మాటకడ్డొచ్చాడు.

"అమ్మా ! శశాంకను వెళ్ళనియ్యి. మరేమీ ఫరవాలేదు. ఆమె ఇప్పు డిక్కడనుంచి వెళ్ళిపోవాలి. రేపు ప్రొద్దున ఆమె ఇక్కడ ఈ వీధులలో కనబడ కూడదు."

"అయితే ఈచీకట్లో ఆమె యెలా వెడుతుంది ?"

"అల్లాగే"

శశాంక బల్లమీద రొట్టెను తినడం మొదలెట్టింది. నటాషా శశాంక మొద లయిన యువతీమణులకు యీ సాహసం యెక్కడనుంచి వచ్చిందాయని తల్లి ఆశ్చర్యపడింది. వీళ్ళకు భయంలేదుకాబో లనుకుంది. శశాంక బయలుదేరింది. ఈసారి పావెల్‌ను చూచినప్పుడు తా నతనిని చాలా చాలా అడిగేనని తల్లిని చెప్ప మని చెప్పి ఒక్కసారి ఆమెను కౌగలించుకొని వెళ్ళిపోయింది.

శశాంకను గుమ్మందాకా దిగబెట్టివచ్చి తల్లి బల్లమీద కూచుంది. ఈగర్ యేదో ధోరణి సాగించాడు. కాని ఆమె మనసంతా శశాంకమీదే వుంది.

"ఈగర్ ! యీచీకట్లో ఆమె పట్నం చేరగలదా ?"

"అల్లాగే. ఈమధ్య ఆమె చాల అలసిపోయింది. జైలు ఆమె ఆరోగ్యాన్ని ధ్వంసంచేసింది. పూర్వం చాలా దృఢంగా వుండేది. అదీకాకుండా చిన్నప్పటి నుంచి మహాసుకుమారంగా పెరిగిందిలే. మొఖం వాలకంచూస్తే అప్పుడే ఆమెకు క్షయరోగం అంకురించినట్లు కనిపిస్తోంది."

"ఆమె అసలు యెవరేమిటి?"

"అసలా! పెద్ద భూస్వామికూతురు. తండ్రి చాలా ధనవంతుడు. కాని చాలా దుర్మార్గుడు. ఆమె చెప్పేమాటల వరుసచూస్తే—బహుశా నీకూ తెలిసేవుంటుంది, వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకునే తలంపులో ఉన్నట్లు తోస్తోంది."

"ఎవరిద్దరు?"

"శశాంక, పావెల్. కాని పాపం సందర్భపడడంలేదు. ఒకళ్ళు జైలులో వుంటే యింకొకళ్ళు బయటుంటున్నారు" అని ఈగర్ ఫక్కున నవ్వేడు.

"అల్లాగా? ఆసంగతి నాకు తెలియనేతెలియదు. పాషా యెప్పుడూ తన స్వవిషయం నాతో చెప్పడు"అంది తల్లి. ఈసంగతి తెలిసినతర్వాత అప్రయత్నంగా ఆమెకు శశాంకయందు గాఢమైన అభిమానం అంకురించింది.

"అయ్యో! పాపం! నువ్వు ఆమెను ఇంటిదాకా దిగబెట్టి రావలసింది సుమా" అని ఈగర్‌తో అంది. "అబ్బే! అసంభవం! నాకిక్కడ బోలెడంత పనుంది. రేపు ప్రొద్దుననుంచి సాయంత్రందాకా కాళ్ళరిగిపోయేటట్లు తిరుగవలసిన పనుంది. ఉబ్బసంతో యాతనపడే నాలాటివాడికది సుఖమైన పనికాదు" అన్నాడు ఈగర్.

తల్లికి శశాంక అంటే ప్రేమ హెచ్చిందికాని కొడుకుమీద కొంచెం కోపం వచ్చింది. ఇలాంటి సంగతి తన కొడుకు స్వయంగా చెప్పనందుకు కొద్దిగా రోషం వచ్చింది. ఆ రోషాన్ని సంబాళించుకుని, పెదవి కరుచుకుని ఏమిటో కాస్సేపు ఆలోచించి చివరకి ఈగర్‌తో "శశాంక మంచిపిల్లేసుమా" అంది.

ఈగర్ వెంటనే అందుకుని "అవును. సందేహమేముంది? చాలా మంచి పిల్ల. ఇంకా ఆమెలో కొంచెం పూర్వపు శ్రీమంతపు లక్షణాలున్నాయి కాని క్రమంగా అవికూడా పోతున్నాయి. నీధోరణి చూస్తే ఆమెకోసం నువ్వుచాలా విచారపడుతున్నట్లుంది. మాలాటివాళ్ళకోసం విచారించడం ప్రారంభిస్తే ఏళ్ళూ పూళ్ళూ పడతాయి. ఏడవడానికి కన్నీళ్ళుచాలవు. మా జీవితానికొక సాఫైన త్రోవలేదు. మాటవరుసకి చెపుతాను. ఈమధ్య నా స్నేహితుడొకడు *సైబీరియా ప్రవాసమునుండి తిరిగివచ్చాడు. అతడు తిరిగివస్తున్నాడనే సంగతి విని పాపం అతని భార్య, బిడ్డ 'స్మోలెన్' పట్టణందగ్గరి కెదురెళ్ళేరు. తీరా అతడు 'స్మోలెన్' దగ్గర కొచ్చేసరికి అతని భార్యా బిడ్డా మాస్కో జైలుకి చేరారు. భర్త సైబీరియాలో నానా యాతనలు పడి తిరిగి వచ్చేసరికి భార్యవంతొచ్చింది. విప్లవకారులైన తర్వాత పెండ్లిచేసుకోవడంతో ఏమి సుఖం లేదు. భర్తకీ సుఖంలేదు. భార్యకీ సుఖంలేదు. అవల్లాఉండగా విప్లవసంఘానికి గూడా ఉపద్రవం కలుగుతుంది. నాకూ భార్య ఉండేది. మహాదొడ్డ యిల్లాలు. అయిదేళ్ళు నాతో ఇలాగే అవస్థలుపడిపడి స్వర్గస్తురాలయింది"అని అతి సుఖవుగా

* రాజకీయశిక్షితులను ప్రవాసమంపెడి చోటు. ఆసియా యూరపులమధ్య నున్నది. అండమాను దీవుల వంటిది.

ఏమీ విచారం ఆవేశం లేకుండా ఉపన్యాసం ఇస్తూ ఒక గిన్నె టీ తాగేసేడు. ఖైదులోనూ, సైబీరియాలోనూ తన అనుభవాలను, పడిన బాధలను చెప్పుకు పెట్టేడు. సైబీరియాలో ఆకలివేళ, అధికారుల దుర్మార్గంవల్ల ఎంతమంది ఎట్లా చచ్చిపోయారో చెప్పేడు అసంగతులన్నీ చెపుతుంటే తల్లి నిశ్చేష్టురాలైంది. ఆబాధల సంగతి చెపుతూ ఈమనిషి లొటుకూ జెటుకూ లేకుండా ఎలా ఉన్నాడా అని ఆమె కాశ్చర్యం కలిగింది.

ఈగర్ మాట తప్పించాడు. అసలు పనికి వుపక్రమించాడు. ఫ్యాక్టరీలోకి కరపత్రాలు అందచేసే మార్గమేమిటని తల్లినడిగేడు. ఏమిచెయ్యాలో అంతా వివరంగా చెప్పేరాడు. తరువాత తన గ్రామంలోని పూర్వీకాలపు కబుర్లు చెప్పుకుంటూ కొంతసేపు కాలక్షేపం చేసేడు. తల్లి అతనితో మాటాడుతూనేవుంది కాని దృష్టంతా శశాంకమీదేవుంది. ఆమె కటికచీకట్లో గడ్డకట్టుకుపోయే మంచులో ఎల్లా నడిచి వెడుతోందా అని చాలా అనుమానంతో బాధపడింది. కొంచెంసేపటి కామెసంగతి మరపుకు తెచ్చుకుంటే పావెల్ సంగతి జ్ఞాపకానికొచ్చింది. జైల్లో చీకటికొట్లో అతడేమి బాధపడుతున్నాడో ననుకుంది. ఈ బాధలన్నిటికీతోడు, ఒకవిధమైన అసూయకూడా కొంచెం బయలుదేరింది. తనకొడుకు తనకు తెలియకుండా ఇంకొకయువతిని ప్రేమిస్తున్నాడేయని అనుకుంది.

తల్లి ఈలాంటి ఆలోచనా ప్రపంచంలో చచ్చాడుతూవుంటే. ఈగర్ ఆమెకేదో ఆయాసంగావుందని గ్రహించాడు. ఆమె అతనితోచెప్పి వంటయింట్లో కెళ్ళి పడుకుంది. మరునాడుదయం ఈగర్ తల్లితో కరపత్రాల విషయం హెచ్చరించేడు. "ఒకవేళ నీదగ్గర వాళ్ళు కరపత్రాలు పట్టుకుని, ఇవి నీకెవరిచ్చారంటే యేం చెప్తావు?" అని అడిగేడు,

"ఆమాత్రం సమాధానం చెప్పలేకపోతానా? ఆ సంగతి మీ కెందుకులే అని చెపురాను"అని చిరునవ్వు నవ్వుతూ చెప్పింది.

"ఓహో! ఆమాటలు తీసెయ్యి. ఆపని వాళ్ళదే; వాళ్ళు నిన్ను గుచ్చి గుచ్చి అడుగుతారు. తప్పకుండా అడుగుతారు."

"అడగనీ! ఏమడిగినాసరే యేమీచెప్పను"

"ఏమీ చెప్పకపోతే ఖైదులో పెడతారు"

"అంతకన్నానా? పెడితే యింకేం కావాలి? నేను జైలు కెళ్ళడానికి పనికొస్తానా? అంతమాత్రం పనికొస్తే నే నదృష్టవంతురాలినే. అయినా ఈ ముసలిదాన్ని జైల్లో పెట్టేవా రెవరు?"

"అవునులే. మనిషి తన జాగ్రత్త తానే పడాలి" అని ఈగర్ ఏమిటో ఆలోచిస్తూ ఇటూ అటూ పచారు చేస్తూ కొంచెంసేపు దీర్ఘంగా ఆలోచించాడు.

"అమ్మా! ఈ పని నువ్వు చెయ్యలేవేమో ననుకుంటాను. ఇది చాలా కష్టం" అన్నాడు.

"అలాగా! నాకు కష్టమైతే అందరికి కష్టమే. దాని సుళువు తెలుసుకుంటే సరి. ఆ మాత్రం నాకు తెలుసు" అంది. ఈగర్ చిరునవ్వు నవ్వేశాడు. తల్లికి కూడానవ్వొచ్చింది.

## ౧౧

మరునాడు మధ్యాహ్నం తల్లి కరపత్రా లన్నిటిని ఒంటినిండా పేర్చుకుని పైన దుస్తులు ధరించింది. జాగ్రత్తగా యేమీ పైకి కనబడకుండా కట్టుకుంది. ఆమె చాకచక్యానికి ఈగర్ చాల సంతోషించాడు. పైకి యేమీ మార్పుకనబడడమే లేదు.

నెమ్మదిగా మధ్యాహ్నం భోజనాలవేళకి ఒక కావడి భుజాన్ని పెట్టుకుని తల్లిఫాక్టరీ గేటుదగ్గరికి చేరుకుంది. లోపల కాగితాలబరువు. పైన కావడి బరువు. ఈ రెంటితోనూ నడవలేక నడవలేక ఆ వృద్ధు ఫాక్టరీకి చేరింది. గేటుదగ్గర ఇద్దరు కాపలావాళ్ళు లోపలకొచ్చే వాళ్ళనందరినీ సోదా చూస్తున్నారు. ప్రక్కనొక గూఢచారి నిలబడి చూస్తున్నాడు. ఒక కాపలాదారుడు ఒక పనివాని జేబులు తడిమి చూచాడు. అ పనివాడికి ఒళ్ళు మండింది. "జేబు లేమిచూస్తావు. తల తడిమి చూడు" అని కోపంతో చరుమన్నాడు.

"నీ తల్లో ఏముంది? పేలు" అన్నాడు కాపలావాడు.

"ఈ పనికన్న పేలు చూడడమే మంచిపని" ఈ సంవర్భమంతా గూఢచారి కనిపెడుతున్నాడు. ఇంతమాత్రం గడసరిగా మాట్లాడేవా డెవ్వడా యని బాగా గుర్తుపెట్టుకున్నాడు. ఇంతలో తల్లివంతు వచ్చింది.

"ఇదిగో, బరువుతో కుంగిపోతున్నాను. నన్నుకాస్త త్వరగా పోనియ్యి నాయనా" అని అడిగింది.

"వెళ్ళువెళ్ళు. అట్టే ఉపన్యాసం ఇవ్వకు" అని లోపలి కొదిలిపెట్టేడు కాపలా బంట్రోతు. తల్లి బ్రతుకుజీవుడా అనుకొని లోపలికెళ్ళి కావడి దింపుకుని అమ్మయ్య అని నిట్టూర్పు విడిచింది.

ముందుగా తాళాలు పనిచేసే గాసెవ్ సోదరులు వచ్చి తల్లిని పలకరించారు. "ఏమమ్మోయి! యేమయినా మంచి సరుకు పట్టుకొచ్చావా?" అని పెద్దతను అడిగేడు.

"మంచి సరుకు రేపు తెస్తాను"

అదివరకే ఏర్పరచుకొన్న సాంకేతికపువడంచేత గాసెవ్ సోదరులకు అర్థమైంది. వాళ్ళముఖం వికసించింది. గుంభనగా తల్లిని అభినందించారు. మధ్యాహ్నం భోజనానికింటి కెళ్ళడం మానేసి, తల్లిదగ్గర ఫలహారాలు

కొనుక్కుని కాలక్షేపం చేద్దామని వాళ్ళిద్దరూ నిర్ణయించుకున్నారు. మాట్లాడుతూ మాట్లాడుతూ రహస్యంగా ఒకకట్ట కరపత్రాలు * వాసిలీ గాసెవ్ అందుకున్నాడు. నెమ్మదిగా వాటిని చొక్కాక్రింద దాచేసేడు. ఏవో పిచ్చాపాటీ మాట్లాడుతూ ఇంకొక బొత్తి జోళ్ళల్లో కుక్కేసేడు. తల్లి "కేబేజిపులుసు! సేమ్యాపాయసం! మసాలాకూర!" అంటూ అరుస్తూ అమ్మకం ప్రారంభించింది. నోటితో ఇల్లా అరుస్తూనే వుంది. చేల్తో కరపత్రాలు బొత్తులు బొత్తులు దాచేస్తోంది. ఒక కట్ట తీసినపుడల్లా ఆమె కండ్లకు గూఢచారులు కనుబడుతుండేవారు. మనస్సు అదటు అల్లా వుండేది. ఏలాగైతేనేమి, ఆఖరుకట్ట అందిచ్చేసింది. 'అమ్మయ్య. అని తలతడుముకుని చూచుకుంది.

పనివాళ్ళంతా గిన్నెలు పట్టుకొనివచ్చేరు. తల్లి అందరికి పులుసు, పాయసం, కూర తలొక కాస్త అమ్మింది. గాసెవ్ సోదరులు యీ చిత్రమంతా చూస్తూ ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. మొదటి అనుభవమైనా తల్లియింత చాక చక్యంగా యీపని జరిపించినందుకు చాలా సంతోషించారు.

ఒక పనివాడెవడొ వచ్చి "అమ్మా! యెంత కష్టం వచ్చిందమ్మా నీకు? పాపం! కూడుపెట్టేకొడుకును కాస్తావాళ్ళు తీసుకెళ్ళి జైల్లోపెట్టేరు. దుర్మార్గులు! ఫరవాలేదులే, కష్టేఫలే అన్నాడు. ఏదోమార్గం దేవుడే చూపిస్తాడు. నారు పోసిన వాడు నీరు పొయ్యడూ? నాకు మూడు • సెంట్లు సేమ్యా ఇయ్యి." అన్నాడు.

ఈమాత్రం మంచిమాటచెప్పే మనిషయినా ఉన్నాడుకదా అని తల్లి సంతోషించింది, గాసెవ్ సోదరులిద్దరూ కరపత్రాలు జాగ్రత్తపెట్టుకుని లోపలికెళ్ళేరు. తన పనైపోయిందికదా అని తల్లి అపరిమితమైన సంతోషం పొందింది. అంత కంతకు ఉషారెక్కి సరుకులమ్ముతూ గట్టిగా అరవడం మొదలెట్టింది.

అమ్మకం పూర్తిఅయింది. తనుచేసినపని తనకొడుక్కి చెప్పడం యెలాగా అని ఆలోచించుకోడం ఆరంభించింది. చెప్పడానికి వీలులేనంత ఆనందం కలిగింది. పనంతా పూర్తిచేసుకుని సాయంత్రం మేరీ ఇంటిదగ్గర టీ త్రాగడానికి బయలు దేరింది. ఇంతలో జైలునుంచి విడుదలై ఆండ్రీనకోడా లోపలికొచ్చి తల్లికి నమస్కారం చేశాడు. నకోడాను చూసేసరికి ఆమెకేమిటో అపరిమితమైన దుఃఖం పొంగివచ్చింది. అతనిని కూచోపెట్టి అతనిచేతులలో మొఖం పెట్టుకొని విచారించడం మొదలెట్టింది. పావెల్‌ను తప్పకుండా విడుదలచేస్తారనీ, అతనిమీద ఏమి కేసులేదని అనేకవిధాలుగ నకోడాచెప్పి ఆమెను ఓదార్చేడు. ఆమెకళ్ళు తుడిచి జైలులోజరిగే సంగతులన్నీ చెప్పడం మొదలెట్టేడు.

"అమ్మా! పాషా నీకు అనేక వందనాలు అందచెయ్యమన్నాడు. అంతకన్న యేం చెయ్యగలడు? అతడు ఉల్లాసాగానే ఉన్నాడు. జైలు యిప్పుడు మహా

* గాసెవ్ సోదరులలో పెదవాడు

• రష్యను నాణము.

రద్దిగావుంది. ఈమధ్య అనేకమందిని పైగా అరెస్టుచేసేరు. ఈ జనానికందరికీ చోటుచాలక ఒక్కొక్కకొట్లో నలుగురేసి మందిని కుక్కుతున్నారు. జైలు అధి కారులు కాస్త మంచివాళ్ళే. ఏదో గుడ్డిరోమెల్ల. పోలీసువాళ్ళ హడావుడివల్ల తమకు యీలేనిపోని తొంవరంతా కలిగిందని వాళ్ళు పోలీసులమీద విసుక్కుంటూ వుంటారు. వాళ్ళేమీ మమ్మల్ని అమర్యాదచేయరు. వాళ్ళకేమి మాటరాకుండా ఎక్కడో ఒకచోట కదలకుండా పడుండమంటారు. కనుక ఒకమోస్తరుగా బాగానే కాలక్షేపమైపోతుంది. మేమంతా కబుర్లుచెప్పుకుంటూ వుండేవాళ్ళం. అంతాకలసి భోజనం చెయ్యొచ్చును. చదువుకునేటందుకు కావలసినన్ని పుస్తకాలుకూడా వున్నాయి. ఇంకేంకావాలి? మొత్తంమీద సౌకర్యమైన జైలు. జైలైతే అశుభ్రం గానే వుంటుంది. కాని వున్నవాట్లోకల్లా నయం. మామూలు ఖైదీలకుకూడా మేమంటే చాలా అభిమానం.........నేను, బుకిన్, యింకోనలుగురం ఇవ్వాళ విడుదలైనాము. పావెల్నుకూడా త్వరలోనే వదలిపెట్టేస్తారు. నిజంగానే నామాట నమ్మ. ఉంచితే నికోర్ వైషోవికవ్ను కొంతకాలం వుంచుతారు. అతనినోరు మంచిదికాదు. పావెల్ యెంతచెప్పినా లాభంలేకుండావుంది. పావెల్ నడవడి మాత్రము చాలా బాగుంది. అతనంటే అందరికీ సదభిప్రాయమే. అతనుకూడా అందరిని సమానంగానే చూస్తాడు. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే అతన్ని తప్ప కుండా విడుదల చేస్తారు."

"అల్లాగ? నిజంగా చేస్తారా నాయనా?" అని వికసించిన ముఖంతో తల్లి ప్రశ్నించింది. "దానికేమీ సందేహం లేదు. ముందు నాకు కాస్త టీనీళ్ళు పొయ్యి. తర్వాత నువెల్లా కాలక్షేపం చేస్తున్నావో చెప్పు." అని ప్రేమతో తల్లి నడిగేడు. ఆమెకేసి కరుపుతీరేటట్లు అనురాగంతోచూశాడు. తల్లి అతని అనురాగాన్ని అందు కుంది. ఇదే సమయంకదా అని తానానాడు చేసిన సాహసకార్యాన్ని గురించి చెప్పింది. కరపత్రాలను ఫాక్టరీ లోపలికి తీసుకెళ్ళడంలో ఆమె చూపిన చాక చక్యం అంతా వినేసరికి నకోడా సంతోషం పట్టలేకపోయాడు. ఉత్సాహం ఉద్రేకం మితిమీరిపోయాయి. పెద్దగా చప్పట్లు కొట్టడం ప్రారంభించాడు. "ఓహో! బలే పని. బలేపని. ఈపనిచేయడం మాటలనుకున్నావా ఏమిటి? ఈసంగతి పావెల్కు తెలిస్తే ఎగిరి గంతేస్తాడు. బలే; తల్లి అంటే నువ్వే తల్లివి! యీ పనివల్ల పావెల్కు మిగతా వాళ్ళకీ ఎంత ఉపకారమైందో తెలుసునా నీకు?" అంటూ ఆనందంతో చిందులు తొక్కేడు. తల్లికి ఈ ఆనందంయొక్క అంతర్యం తెలీ యక పోయినా అతనితోపాటు సంతోషించింది.

"నాయనా! నకోడా! నా జీవితమంతా అతిభారమైంపే. ఒక్కొక్కప్పుడు నేనీ ప్రపంచంలో ఎందుకు బ్రతికున్నానా యని అనుకునేదాన్ని. ఏముంది? చాకిరి, చివాట్లు, చెప్పుదెబ్బలు తప్ప మరేమీ ఎరుగను. నాభర్త బ్రతికున్నంత కాలం నాకు వేరే గొడవేమీ లేదు. పావెల్ సంగతికూడా అట్టే శ్రద్ధచేసి ఎరుగను;

నామొగుడు తప్పత్రాగి ఎప్పుడింటికొస్తాడో అనే భయమే. వచ్చిన తర్వాత ఆ మోటుమనిషికేమి లోటు జరుగకుండా అమర్చి పెట్టాలనే ఆదుర్దా. ఏమికోపం వస్తే ఎముకలెక్కడ విరుగుతాయోఅనే భయం. ఇన్నివిధాల హడల్తూ బ్రతికాను. నేనెట్లా హడత్తూ ఉండేదాన్నో, అట్లాగే అతడు నన్ను ఎందుకో ఒకందుకు చావ గొట్టేవాడు. కొట్టడంలోను భార్యను భర్త కొట్టేటట్లు చప్పచప్పగా కొట్టడంకాదు. ఎవరో శతృవునుకొట్టినట్టే కొట్టేవాడు. నాకు గ్రాహ్యం వచ్చినతర్వాత ఇట్లాంటి బ్రతుకేగాని ఇంకొకటెరుగను..................... నాభర్త చచ్చిపోయిన తర్వాత నాదృష్టి పావెల్‌మీదికి మళ్ళింది. అతను చేస్తున్న పనిచూస్తే నాకు గుండె బేజా రెత్తుతోంది. ఆపని అతనిని సర్వనాశనం చేస్తుందని గ్రహించాను. నాహృదయం పగిలిపోయింది. మాకాలంనాటి ఆడవాళ్ళ ప్రేమ కేవలం స్వార్థపరమైందే. నేనున్నానంటే నాభర్తని, నాకొడుకుని నాకు కావలసినవాళ్లని ప్రేమించడమే ఎరుగుదును. ఇప్పుడు కాలం మారిపోయింది. ఇప్పుడు సంఘంకోసం, అనేకులు అనేక బాధలు పడుతున్నారు. సైబీరియా ప్రవాసం పోతున్నారు. ఉరికంబాలెక్కుతున్నారు. అర్థరాత్రివేళ, చీకటిని, చలిని, మంచును లెక్కపెట్టకుండా లోకహిత మైన కార్యాన్ని నెత్తినెట్టుకుని మైళ్ళకుమైళ్ళు కాలినడకను సంచారం చేస్తున్నారు. నిజంగా ఇది నిష్కళంకమైన ప్రేమ. నాయనా! నేనట్లా ప్రేమించగలనా? అది సంభవమే? అంటూ తల్లి ఆనందంతోటి ఉద్రేకంతోటి చెప్పింది.

"అమ్మా! అట్లాంటి సంశయం నీ కక్కరలేదు. ఎవరి బంధువులను వాళ్ళు ప్రేమించడం అందరికీ సహజమే. కాని విశాల హృదయం కలవారికి దూరం దగ్గిర అనే తేడా ఉండనేవుండదు. నీవుమాత్రం ఆ విషయాన్ని గురించి సందేహించనక్కరలేదు. నువ్వు అందరివంటిదానవు కావు. మాతృప్రేమ మూర్తీభవించిన తల్లివి" అంటూ బుజ్జగించాడు నకోడా.

"నాయనా, అట్లాంటి విశ్వప్రేమ నలవాటుచేసుకోవడం గొప్ప అదృష్టమే. ఇప్పుడు నువ్వున్నావనుకో. నీమీద నాకు నిజంగా పాషామీదకన్న యెక్కువ అభిమానం. పాషా నాతో యెప్పుడూ మనసిచ్చి మాట్లాడడు. మాటవరుసకి చెప్పుతున్నాను. పాషా శశాంకను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాడట. ఇలాంటి విషయంలో తల్లినికదా, నాకు మాటన్నా చెవిని కాస్తవడెయ్యకూడదూ?" అంది తల్లి.

"అమ్మా! అది అబద్ధం. నాకు పూర్తిగా తెలుసును. పావెల్ శశాంకను ప్రేమిస్తున్నమాట నిజమే. కాని పెళ్ళిసంగతి వట్టిదే. ఆమెకైతే చేసుకోవాలనే వుంది. కాని పాషాకుమాత్రం ఇష్టంలేదు. సుతరాం యిష్టంలేదు. అతను పట్టు పట్టాడంటే వదలడు. భల్లూకప్పట్టే. మాటతిరగడం వుండదు."

"అవును. కాని అతడిప్పుడు జైల్లో మగ్గిపోతున్నాడు. ఓహో! ఘోరం! ఘోరం! జీవితం మునుపటిలాలేదు. ఏదో మారిపోయినట్లు కనిపిస్తోంది. పూర్వం నాకుండే భయంలేదు. యిప్పుడు కలుగుతున్న భయం వేరు. ఇప్పుడు

ఇతరుల బాధలకుకూడా నాకు జాలికలుగుతోంది. పరాయివాళ్ళకు కలిగే ప్రమాదా లకు హృదయం పరితపిస్తోంది. హృదయం సంపూర్ణంగా మారిపోయినట్లుంది. నా అంతరాత్మ కళ్ళు తెరిచింది. నాకు తెలియని సంగతులెన్నో వున్నాయి. కాని మీరంతా నాస్తికులై పోతున్నారనీ మీమీద నాకు చాలా అసహ్యంగా వుండేది. ఇప్పుడుచూస్తే మీరంతా చాలా గొప్పవాళ్ళని తోస్తోంది. ప్రజాక్షేమంకోసం, సత్యంకోసం, స్వచ్ఛమైన మీ జీవితాలను ధారపోస్తున్నారు. మీ జీవితాలను ముళ్ళ కంచెలున్న మార్గాలలో నడిపిస్తున్నారు. మీ రన్వేషిస్తున్న సత్యం నాకూ అవగాహనైంది. ధనికులనేవాళ్ళున్నంతకాలం పేదలకు బ్రతుకే లేదు. పేద లకు సత్యంలేదు. సౌఖ్యంలేదు. ఒక్కొక్కప్పుడు నా పూర్వ జీవితాన్ని గూర్చి తలుచుకుంటే కంపమెత్తుతుంది. నా చిన్నతనమంతా యెట్లా నిరంకుశత్వమునకు లోబడి అణగిపోయిందో తలుచుకుంటే మళ్ళీ భయం, అసహ్యం కలుగుతోంది. ఇప్పటికి కాస్త స్వేచ్ఛగా బ్రతుకుతున్నాను. కనుక ప్రపంచం సంగతి నాటికి నాటికి బాగా చూడగలుగుతున్నాను" అని తల్లి పొంగి వచ్చే భావతరంగాలను వెళ్ళబుచ్చింది. నకోడా తల్లియందు కలిగిన్న భావవికాసానికి చాలా ఆశ్చర్యపడ్డాడు. సంతోషంచేత వుబ్బిపోయి పచారు చేయడం ఆరంభించాడు. చాలా కాలం నిర్బం ధంలో వున్నవాళ్ళు విడుదలైవస్తే స్వేచ్ఛయొక్క ఆనందం వాళ్ళనుభవించేటట్లు మరెవ్వరూ అనుభవించలేరు. చిరకాలం చీకట్లో యేడుస్తున్నవాళ్ళు వెలుతురులో కొస్తే వెలుతురుయొక్క సౌఖ్యం వాళ్ళనుభవించేటట్లు ఇతరులనుభవించలేరు. అల్లాగే తల్లికి యీ నూతన వికాసంవల్ల అనేక విషయాలు అనుభవానికొచ్చాయి.

"నాయనా! నకోడా! ఇంతవరకూ నా ఆలోచన ఎంతసేపూ రోజు ఎల్లా గడిపోచితుందా అనే. ఏరోజు కారోజు దెబ్బలు తినకుండా బయటపడడ మెల్లాగా అనే ఆలోచన. ఇప్పుడు నాకు నా స్వవిషయమైన ఆ ఆలోచనలు పోయాయి. ఇప్పుడు ప్రపంచాన్ని గురించే ఆలోచిస్తున్నాను. మీరు చేసే పను లన్నీ నా కర్థం కాకపోతే కాకపోవచ్చును. అయినప్పటికీ అంతా నాకు ఆప్తులు గానే కనిపిస్తున్నారు. అందరి బాధలు నా బాధలులాగే నేను తలుచుకుంటున్నాను. అందరియొక్క శ్రేయస్సు కోరుతూనే వున్నాను."

అని తల్లి తన మనసు విప్పి చెప్పేసరికి ఆంద్రీ ఆనందపరవశుడై పోయాడు. ఆ పల్లెలో వుండే యితర ఛాందసులందరికీ యీ మాత్రం వివేకం కలిగితే చాలా బాగుండునుగదా అనుకున్నాడు. వాళ్ళందరికీ యీ విషయాలను గూర్చి బాగా నచ్చచెప్పమని తల్లిని దీనంగా ప్రార్థించాడు.

అప్పటికే చాలా ప్రొద్దు పోవడంచేత ఆంద్రీ తల్లిదగ్గిర శలవు తీసుకొని నిద్రపోయాడు. ఆమెకూడా గిన్నెలు, పళ్ళేలు సర్దుకుని పడుకుంది.

## ౧౨

ఏరునాడు మళ్ళీ ఫలహారాల కావడి భుజాన్ని పెట్టుకుని మామూలు వేళకి తల్లి ఫ్యాక్టరీ గేటుదగ్గరకెళ్ళింది. గేటుకాపలామనిషి ఆమెను నిలబెట్టి కావడి దింపమన్నాడు. దింపిన తర్వాత కావడిలోవుండే సామానంతా తెగ వెది కేడు. తినుబండారాలు చల్లారిపోతాయి కనుక త్వరగా పంపించమని తల్లి నెమ్మదిగా అడిగింది. ఆ బంట్రోతు ఆమెను ఈసడించికొట్టి నోరు ముయ్యమన్నాడు. గేటుదగ్గర కాపలావున్న రెండో బంట్రోతుకు కొంచెం జాలికలిగింది. ఆమె వీపు తట్టి "అబ్బే! ఆ కాగితాన్ని ఎవరో ప్రహరీగోడమీదనుంచి పడేసుంటారు. అంతే కాని ఈముసలమ్మ కేం తెలుస్తుంది? పోనియ్యి"అని లోపలికొక్క నెట్టునెట్టేడు. తల్లి లోపలికెళ్ళింది. వృద్ధకార్మికుడైన సిజావ్ ఆమె కెదురొచ్చాడు. "ఏమమ్మోయ్ నిలోనా! సంగతి విన్నావా?" అన్నాడు.

"ఏం సంగతి?"

"ఏమి సంగతంటావా? కరపత్రాలసంగతి. అవి మళ్ళీ వచ్చిపడ్డాయి ఫాక్టరీలోకి. రావడంలోనూ కుప్పలు కుప్పలుగా వచ్చేయి. ఎక్కడ చూచినా అవే. మహజాగా అయిందిలే. జైళ్ళలో వున్నవాళ్ళకిది చాలలాభం. ఫ్యాక్టరీలో కాగితాలు పంచిపెడుతున్నారని నా మేనల్లుడినీ, నీ కొడుకునీ అరెస్టుచేసారు కదా? వాళ్ళు జైల్లోవున్నా కాగితాలు వస్తూనే వున్నాయి కనుక ఇదివరకు వాళ్లు పంచిపెట్టలేదని ఋజువుకాదూ? అయినా మనుష్యుల్ని తొక్కిపెట్టొచ్చును. కాని, వాళ్ళ భావాల్ని తొక్కిపెట్టడం ఎవరితరం? అవేమైనా జంతువులు కనుకనా?" అని గడ్డం సవరించుకుంటూ మాట్లాడేడు. అడపా దడపా కాస్త కనుపించి వెళ్ళమని తల్లితోచెప్పి అతడు వెళ్ళిపోయాడు. ఈ ఆహ్వానానికి సంతోషించి తల్లి తన మామూలుచోట కావడిదింపుకుని, దుకాణం విప్పి, 'కూరోయికూర! పులుసోయ్ పులుసు'అని కేకలు మొదలెట్టింది.

ఆరోజున ఫ్యాక్టరీలో ఎక్కడచూచినా, అంతా గడబిడగాఉంది. కూలీలు గుంపులుగాచేరి గుసగుసలాడుకుంటున్నారు. అందరి ముఖాలమీద చిరునవ్వు తాండవమాడుతోంది. అంతా సంతోషంగా నవ్వుతూ తుళ్ళుతూ ఆనందంగా ఉన్నారు. ఒకళ్లతో ఒకళ్ళు వేళాకోళాలాడుకొంటున్నారు. ముఖ్యంగా యౌవనంలో ఉన్న వాళ్ళు మరీ ఉషారుగా ఉన్నారు.

"ఉన్నమాటంటే ఉలుకెక్కువ; నిజం చెపితే వాళ్ళకి మహాకంటకం" అన్నాడొక పనివాడు.

"బలే దెబ్బకొట్టేడు. నిజమే" అన్నారు కొందరు యువకులు. ఇక ఫ్యాక్టరీ అధికారుల సంగతి చెప్పనే అక్కర లేదు. మేనేజర్లంతా ఇటూ అటూ కాలు కాలిన పిల్లులలాగున పరుగెత్తుతున్నారు. పోలీసులు కూడా వాళ్ళతో పాటే

గడబిడ పడుతున్నారు. వీళ్ళంతా కంగారుపడుతూ ఉంటే చూచి కూలీలు నవ్వుతూ ఉండడంవల్ల వాళ్ళకి మరింత ఒళ్ళుమండేది. వాళ్ళల్లో వాళ్లు ఏదో చెప్పుకుంటూ పనివాళ్ళనుచూచి పళ్ళు పటపట కొరుక్కున్నారు. తల్లి ఈ తమాషా అంతా చూస్తూ లోపల లోపల ఆనందించింది.

ఇంతలో గాసెవ్ సోదరులలో పెద్దవాడైన వాసిలీ తల్లిదగ్గరకొచ్చి బిగ్గరగా 'ఇవ్వేళకూడా ఇక్కడే నా భోజనం. ఏమైనా మంచి సరుకుందా?' అన్నాడు. తర్వాత మెల్లగా దగ్గిరకొచ్చి కన్నుగీటి "ఇదిగో! పతకం బాగా పారింది. చూసేవా? ఎక్కడ తగలాలో అక్కడే తగిలింది. బలే అమ్మా! ఇదంతా నీచలువ సుమా!" అని అభినందించేడు.

గాసెవ్ లాంటి పలుకుబడిగలవాడు తన్నంత ప్రశంసించడంచూచి తల్లి చాలా ఉబ్బిపోయింది. ఫ్యాక్టరీలో హడావుడి అంతాచూస్తే ఆమెకు మరీ ఆనందం కలిగింది. 'నేను లేకపోతే ఈ పనెవరుచేసేవారో?' అని తనలో తానే ఆలో చించుకుని సంతృప్తి పొందింది.

ఆమెకు కొంచెం దూరంలో ముగ్గురు కూలీలు ఈ విధంగా మాట్లాడు కున్నారు. "అరరే! అవి నా కంటేపడలేదురా!" "అవునురా నాకూ వినాలనేఉంది ఏంచెయ్యను. చదువురాదు. ఎవరైనా చదివితే వింటాను. బలే దెబ్బకొట్టేరట కాదు?" "ఇంజను గదిలోకి వెడదాం పదండి. అక్కడ నేను చదివి వినిపిస్తాను"

ఈ సంభాషణ తల్లివింది. పక్కనేఉన్న గాసెవ్ "చూసేవా? కరపత్రాల మజా! బలేపని జరుగుతోంది." అన్నాడు.

* * * *

తల్లి పట్టరాని సంతోషంతో ఇంటికొచ్చింది. తాను చూచిన సంగతులు, విన్న సంగతులు ఆంద్రీతో పూసగ్రుచ్చినట్లు చెప్పింది.

"ఆంద్రీ! కొందరు చదువురాక బాధపడుతున్నారు సుమా! నాగతీ అంతే. చిన్నప్పుడు కొంచెం చదివేదాన్ని. ఇప్పుడు శుభ్రంగా మరిచిపోయాను."

"పోనీ ఇప్పుడు నేర్చుకో." అన్నాడు ఆంద్రీ. "ఇప్పుడా నేర్చుకోవడం? అరవైఏళ్ళొచ్చేక చదువుకోక మన్ను కొట్టుకోనా అని ఇప్పుడు చదువు ప్రారం భించనా? ఎగతాళి చేస్తున్నావా ఏమిటి?"

ఆంద్రీ బీరువాలోనుంచి ఒక పుస్తకంతీసి అందులో ఒకఅక్షరం చూపించి అదేమక్షరమని తల్లినడిగేడు. 'ఆర్' అని సరిగ్గానే చెప్పింది. అల్లాగే నాలుగయిదు అక్షరాలు చూపెట్టి పరీక్షచేస్తూ పాఠాలు చెప్పడం ప్రారంభించేసరికి తల్లికేదో కష్టం కలిగింది. ?. నకోడా నవ్వుతున్నాడేమోనని బిడియపడింది.
నకోడా! నిజంగా నాకు చదువు చెప్పదలచుకొన్నావా?"

"ఆ. ఒక్కసారి శ్రద్ధపెడితే నీకేవస్తుంది" "ఇల్లలకడంలోపే పండుగవు

తుందా?" "ఓహో! సామెతలుకూడానా? చదువు తక్కువైతే సౌఖ్యంహెచ్చు—కడుపుకు కట్టువాటు. ఆడ్మకు స్వేచ్ఛ—వీటివేంగాని ఇదేమక్షరం?"

"యం"

"ఇదో?"

తల్లి శ్రద్ధగా అక్షరంకేసి చూసింది. అతికష్టంమీద పాత అక్షరాలను జ్ఞాపకం తెచ్చుకుంది. అక్షరాలు జ్ఞాపకం తెచ్చుకుంటుంటే ఆమె కేవో పూర్వకాలం నాటి సంగతులు జ్ఞాపకానికొచ్చి స్మృతితప్పింది. కాని వెంటనే లెప్పరిలి విచారించింది. కండ్లవెంబడి అశ్రుపులు జలజల రాలేయి.

"నకోడా! కాటికి కాళ్ళు చాచుకునియున్న నేనిప్పుడు చదువనారంభించానా!" అని గద్గదస్వరంతో అడిగింది.

నకోడా "అమ్మా! నువ్వల్లా విచారించకూడదు. ఇదివరకు నువ్వు నిర్భాగ్యమైన జీవితాన్ని గడిపేవంటే నీతప్పేమీలేదు. ఇప్పటికైనా నీపూర్వజీవితం నికృష్టమైనదని నీవు గ్రహించగలిగేవు. అందుకు సంతోషించు. వేలకొలది జనం అవకాశాలుండీ కూడా పశువులలాగున నికృష్టమైన బ్రతుకు బ్రతుకుతున్నారు. వాళ్ళ బ్రతుకేమి ప్రయోజనం? ప్రొద్దుననుండి సాయంకాలంవరకు చెమట ఊడ్చడం, సాయంత్రం వున్నంతలో తినడం. మళ్ళీతెల్లవారడంతోనే చాకిరీచేయడం సాయంత్రం తినడం, ఎవళ్ళయినా, పని తిండి. పనితిండి. ఇదే తంతు. దీనికితోడు పిల్లల్ని పుట్టించడం కూడాను. పిల్లలు చిన్నవాళ్ళుగా వున్నప్పుడు వాళ్ళను ముద్దులాడుతూ సంతోషిస్తారు. కాని వాళ్ళుకూడా కాస్త పెద్దవాళ్ళయి బాగాతినడం ప్రారంభించేసరికి వాళ్ళకి సంపాదించి పెట్టలేక విసుక్కుంటారు. అనేకవిధాల వాళ్ళకు శాపనార్థాలు పెడతారు. డబ్బుకక్కుర్తికొద్దీ బాగా వయస్సు రాకముందే పశువుల్ని తోలినట్లు పనిలోకి తోలేస్తారు. ఆకుర్రాళ్ళు, యెందుకొచ్చిన బ్రతుకురా యని నిమిషాలు లెక్కపెట్టుకుంటూ అతిఘోరంగా జీవయాత్ర గడుపుతుంటారు. సంతోషమనేదెప్పుడూ వాళ్ళమొఖంమీద కనబడదు. హృదయం మొద్దుబారిపోతుంది. కొంచరిబ్రతుకెప్పుడూ ముష్టిబ్రతుతే మరికొంచరిది దొంగబ్రతుకు' ఇతరుల నోట్లో గడ్డకొట్టి బ్రతకడమే వాళ్ళవృత్తి. మరికొందరు బాగా బ్రతుకుతున్నామని విర్రవీగేవాళ్ళున్నారు. వాళ్ళు దొంగచట్టాలు ఏర్పాటుచేసి కర్రలు, కత్తులు చేత్తోపుచ్చుకుని ప్రజలను వాటికి సలాంచెయ్యమని బలవంతపెడతారు. దూరంగా వున్నచోటపుండి ప్రజలను పీడిస్తారు. ప్రజలు యెదుర్కొంటే యేవో నిబంధనలుచేసి సబబునూ, సత్యాన్నీకూడా అణగ్గొట్టేస్తారు.... అమ్మా! మనిషిని బంధించేస్తున్న సంకెళ్ళ నన్నిటిని తెగగొట్టేసినవాళ్ళే నిజమైన మనుష్యులు. సమయం రావాలి. నువ్వుకూడా ఇప్పుడీపనికోసమే తంటాలు పడుతున్నావుసుమా" అని చిన్న ఉపన్యాసం యిచ్చాడు.

తల్లి ఆశ్చర్యంతో 'నేనా? నేనే చేస్తున్నానా? ఏంచెయ్యగలను?' అంది.

"ఎందుకు చెయ్యలేవు? యథాశక్తి. వర్షపు చినుకులన్నీ కలిస్తేనేకదా విత్తుకు బలం.........నువ్వు నిజంగా చదువుకూడా నేర్చుకుంటేనా........ బలే .... పావెల్ ఆశ్చర్యపోతాడు" అని నకోడా పకపక నవ్వాడు.

నాయనా! పడుచువాళ్ళకి అన్నీ సులభమే. నా వయసొచ్చేసరికి తెలుస్తుంది నీకు. అనేక కష్టాలు నెత్తిమీదకొస్తాయి. శక్తి అంతా వుడిగిపోతుంది. ఏపని చెయ్యడానికీ బుద్ధి తోచదు."

సాయంకాలం ఆంద్రీనకోడా వీధిలోకెళ్ళేడు. తల్లి దీపంముట్టించి మేజోళ్లు అల్లడానికి కూచుంది. కాని పనితోచలేదు. యేమీ తోచక అటూ ఇటూ తిరిగి గదిలోకెళ్ళి ఒక పుస్తకంతీసి నెమ్మదిగా యేదో గొణగడం మొదలెట్టింది. నెమ్మదిగా అక్షరాలు కూడపలుక్కుంటోంది.

ఇంతలో తలుపుతట్టిన చప్పుడయింది. తల్లి ఛటాలున లేచి "ఎవరువారు" అంటూ తలుపు తీసింది.

## ౧౩

రైబిన్ లోపలికొచ్చాడు. కాస్త వయసు గడచిన మనిషి. గడ్డం నెరిసింది. విశాలమైన వక్షస్థలం. వాగా ఆజానుబాహుడు. వస్తూనే గదంతా నాలుగు మూలలా చూచి "ఏమమ్మోయి! లోపల యెవరైనా ఉన్నారా యేమిటి? మనుష్యుల సంగతి సందర్భాలు కనిపెట్టకుండా అందరినీ లోపలికి రానిస్తావు. నువ్వొక్కదానివేనా ఉండడం" అని తల్లిని మెల్ల మెల్లగా మందలించాడు.

"ఒక్కతెనే" అంది తల్లి.

"అల్లాగా? ఆంద్రీ నకోడా కూడా ఇక్కడే వున్నాడనుకున్నాను. ఈ వేళ నకోడాను చూసేను. జైల్లో పెట్టినంత మాత్రాన మనిషి పాడవుతాడా? బుద్ధి లేకపోతే పాడవుతాడు. అంతే."

ఏదో మాట్లాడాలని చెప్పుతూ తల్లిని లోపలిగదిలోకి తీసుకొచ్చాడు. అదేమో వినాలని ఆమెకు ఎక్కువ ఆత్రత కలిగింది. రైబిన్ ప్రారంభించాడు.

"ప్రపంచమంతా డబ్బుతోవుంది. అంచేతే పెద్దలు 'ధనమూల మిదం జగత్' అన్నారు. అదిలేనిదే యేపనీ జరుగదు. పుడితే డబ్బు ఖర్చు. చస్తే డబ్బు ఖర్చు. బ్రతుకు సంగతి చెప్పనే అక్కరలేదు. ఈ పుస్తకాలకీ కాగితాలకీ కూడా డబ్బు ఖర్చవుతుంది కదా! ఈ కరపత్రాలు వగైరాలు అచ్చువేయించడానికి. పంచిపెట్టడానికి డబ్బెక్కడినుంచి వస్తోందో నీకు తెలుసునా? తల్లి భయపడుతూ "నాకేమీ తెలియదు" అంది. "నాకూ తెలియదు. కాని ఇంకొక ప్రశ్న. ఈ పుస్తకాలు వ్రాసేదెవరు? చదువుకున్నవాళ్ళే కాదూ? వాళ్ళే అధికారులు.

వాళ్ళే వ్రాయిస్తారు. వాళ్ళే పంచిపెట్టిస్తారు. ఈ పుస్తకాల్లో ఉండే విషయాలు వాళ్ళకి విరుద్ధంగా ఉన్నా ఎందుకిల్లా చేస్తారో ఆంతర్య మేమో తెలియడంలేదు."

తల్లి తెల్లబోయి వింటూ "నీ అభిప్రాయ మేమిటో చెప్పు" అంది.

"దగా! పచ్చిదగా! నాకు కనబడుతోంది. ఈ చదువుకున్నవాళ్ళు అంటే అధికారులు యెంత పనిబడితే అంతపని చేస్తారు. ఏదో పన్నాగం పన్నేస్తారు. నేను సత్యాన్వేషణం చేసేవాడిని. నాకింకేదీ పనికిరాదు. అందుచేతనే ఈ చదువుకున్నవాళ్ళతోపాటు కలిసి పనిచెయ్యడానికి నా కిష్టంలేదు. వాళ్ళవసరం వున్నంత కాలం మన్ని ముందుకు తోస్తారు. అవసరం తీరిన తర్వాత గోతులో తోసేస్తారు. వాళ్ళ కవసరమైతే మన శవాల మీద నుంచి నడిచిపోవడానికి కూడా సందేహించరు. దీని ఆంతర్యం నేను గ్రహించాను." రైబిన్ ఈ మాటలు చెపుతుంటే తల్లికి కంగారు పుట్టింది. అనేక సంశయాలు కలిగినాయి. పావెల్ శశాంక మొదలైన వాళ్ళు ఈ నిజాన్ని తెలుసులేక పోయారానుకుంది. వాళ్ళు చాలా నిజాయితీ మనుష్యులని మనస్సులో నిర్ధారణ చేసుకుని రైబిన్‌తో "ఇదిగో నీవు చెప్పే మాటల్లో నాకేమి నిజం కనుపించడంలేదు. వాళ్ళు మహాత్యాగులు. గౌరవనీయులు. కల్లకపటా లెరుగని పెద్ద మనుష్యులు" అంది.

"ఎవరిమాట నీవనేది" అని రైబిన్ అడిగాడు.

"ఎవరన్న మాటేమిటి? నేను చూచినంత మట్టుకు అంతా మంచివాళ్ళే. మనుష్యుల రక్తమాంసాల నమ్ముకుని జీవించే వాళ్ళెవ్వరూ యిందులో లేరు" అన్నది తల్లి.

"మామ్మా! నేనెవరినిగురించి చెపుతున్నానో నీవు గ్రహించలేదు. నువ్వు చెప్పేవాళ్ళంతా అగ్గిలాంటివాళ్ళే. అందులో యేమి సందేహంలేదు. కొందరు మాత్రం స్వార్థంకోసం యిందులో చేర్తారు. వాళ్ళ విషయంలో జాగ్రత్తగా వుండాలి.......... సరే. ఇదంతా యెందుకుగాని యీ చదువుకున్నవాళ్ళని నేను నమ్మను. వీళ్ళవల్ల యేమి పనిజరుగదు. నామాట నమ్ము!" అని అతి నమ్మకంతో రైబిన్ చెప్పాడు. తల్లికి యేదో ఆశ్చర్యంకలిగి నీ ఆకాశ పంచాంగం నా కర్థమవడంలేదు. నీ వుద్దేశ్య మేమిటి?" అని అడిగింది.

"నా ఉద్దేశ్యమా? చదువుకున్నవాళ్ళకి కొంచెందూరంగా వుండమని.......... అంతే మామ్మా. నేను యిక శలవు తీసుకుంటాను. నేనూ యిందులో పనిచెయ్య దలచుకున్నాను. నాకు కాస్త చదువొచ్చును. కొద్దోగొప్పో పట్టుదలా వుంది. మొత్తంమీద యీ పనికి పనికొస్తాను. అల్లాటప్పాను కాను. ముఖ్యంగా యేమిటంటే ప్రజలకి ఏమిచెప్పాలో ఎల్లాచెప్పాలో నాకు తెలుసును. కనుక వెళ్ళిపోతాను. ఇక్కడ నాకు నమ్మకంలేదు. యేమైనా జనం చాలా మూర్ఖులు. ఆశాపరులు. తినడానికేమి లేకపోతే ఒకళ్ళనొకళ్ళు పీక్కుతింటారు. అయినప్పటికీ నేనొక నిశ్చయం చేసుకున్నాను. నేను పల్లెటి గ్రామాలకుపోయి నేలమున్నకువి

బ్రతికే నిర్భాగ్యపు జనాన్ని రెచ్చకొడ్తాను. వాళ్ళకి సంగతిసందర్భాలన్నీ తెలియజేసి, పని పురమాయిస్తే మిగిలిన పనులన్నీ వాళ్ళే చేసుకుంటారు. తమపాట్లు తామే పడతారు."

"అధికారులు నిన్ను పట్టుకుంటేనో ?"

"పట్టుకుంటే వదలిపెడతారు. వదలిపెడితే మళ్ళీ అక్కడికేవెళ్ళి పని సాగిస్తాను.

"పల్లెటూరి జనమే నిన్ను పట్టుకుని పప్పజెపితే ?"

"అంతేకదా ! కొంతకాలం జైల్లో వుంటాను. మళ్ళీవచ్చి మళ్ళీ ప్రారంభిస్తాను. పల్లెటూరివాళ్ళు కొంతకాలం మాత్రమే యిలా చేస్తారు. తరువాత వాళ్ళకే తెలుస్తుంది. నేను వాళ్ళని ఊరికే ముందు చెప్పేమాటలు వినమంటాను. వింటే నామాటల్లో వాళ్ళకే విశ్వాసంకుదురుతుంది" కొంచెంసేపు తల్లీ రైబిన్ ఈవిషయాలన్నీ మాట్లాడుకున్నారు. తనకక్కడి సంగతులు నచ్చలేదని చెప్పాడు. తల్లి ఒక్కతే బాగా ఆలోచించి "రైబిన్ ! ఇదంతా చివరకి నీనాశనాని కొస్తుందిసుమా అంది.

రైబిన్ ఛటాలున ముందుకువంగి "నాశనమా ? క్రీస్తు ఏంచెప్పేడో తెలుసునా ? జీవుడికి మరణం లేదన్నాడు. పాతబట్ట వదలి క్రొత్తబట్ట కట్టుకున్నట్టే. జీవుడు ఒక దేహాన్నివదలి ఇంకొక దేహాన్ని ఆశ్రయిస్తాడు. నాకు చావుభయమేమీలేదు. నేను సూక్ష్మగ్రాహిని. కనుక అందరికన్న సూటియైన దారిని నడుస్తాను.........సరే, నేనింక వెడతాను. నకోడా మళ్ళీ పనిలోకి దిగేడా ఏమిటి ?"

"అబ్బే. ఇంత ఆలస్యమా ? జైల్లోనుంచి వచ్చిన మరునాటినుంచే మామూలుగా పని ప్రారంభించాడు"

"భేష్ ! అలాగే ఉండాలి. నాసంగతి అతనితోచెప్పు"

"అల్లాగే చెప్తాను"

"శలవుమరి"

"శలవు. నీ పనెప్పటినుంచి మానేస్తావు ?"

"ఎప్పుడోనా ?"

"ప్రయాణ మెప్పుడు"

"రేపుప్రొద్దున్నే"

రైబిన్ సలాంకొట్టి శలవుతీసుకుని చక్కాపోయాడు. అతను వెళ్ళిపోయినతర్వాత చాలా రాత్రిదాకా తల్లి రైబిన్ చెప్పిన మాటలన్నీ తర్జన భర్జన చేస్తూ కూచుంది. ఇంతలో ఆంద్రీ నకోడా సంతోషంతో ఇంటికొచ్చాడు. తల్లి అతనితో రైబిన్ సంగతి యావత్తూ చెప్పింది. "ఆంద్రీ! పోనీ, అతడు గ్రామాల్లోకెళ్ళి రైతుల్ని రెచ్చగొట్టడం మంచిదే. మన సత్యసందేశం వాళ్ళకుకూడాఅందాలి. అయినా రైబిన్ మాతోపాటు ఉండలేదు అన్నాడు. ఆంద్రీ ; రైబిన్ అధి

కారుల్ని గురించీ, చదువుకున్నవాళ్ళని గురించి చెప్పిన మాటలన్నీ నిజమేనా ? వాళ్ళు మిమ్మల్ని దగా చేస్తున్నారంటావా ?" అని తల్లి ఉదుర్దాగా అడిగింది.

నకోదానవ్వి "అమ్మా ! ఆవిషయమై నువ్వు అనవసరమైన దిగులుపడకు. ఉస్ ! డబ్బుంటే ఏ పనైనా చెయ్యవచ్చు. దానితో కొండమీది కోతైనా దిగొస్తుంది. అదే మనకి లోటు. మన బ్రతుకింకా ముష్టి బ్రతుకే. చందాలమీద ఆధారపడున్నాము. మాటవరుసకి చెపుతున్నాను. నికోలే ఇవానిష్ నెలకు డెబ్బదియైదు రూబుల్సు సంపాదిస్తాడు. అందులో యాభై రూబుల్సు మనసంఘానికే ఇచ్చేస్తాడు. ఇల్లాంటివాళ్ళింకా చాలామందున్నారు. విద్యార్థులనేకమంది తమ కడుపుకూడా మాడ్చుకుని దమ్మిడీ దమ్మిడీ చొప్పున కూడబెట్టి మనకి చందాలిస్తున్నారు. అధికార్లలో అంటే ఈ ధనికులలో కూడా రకరకాల మనుష్యులున్నారు. కొందరు మనల్ని దగాచేస్తారు. కొందరు తటస్థంగా తమకెందుకన్నట్లు వూరుకుంటారు. మరికొందరు మనతోపాటే నిలబడి మన గమ్యస్థానం చేరేవరకు మనతోనే వుంటారు. ఆ గమ్యస్థానానికి, ఎంత రెక్కలు కట్టుకెగిరినా ఒక్కసారి చేరలేము. మధ్య మకాములున్నాయి. రేపు మే నెల 1 వ తేదీని అలాంటి మకాముకొకదానికి చేరుదాం. చాలా ఆనందంగా ఉంటుందిలే". ఈ మాటలవల్ల తల్లి ఆందోళన కొంచెం తగ్గింది. నకోడా ఏదో ఆలోచిస్తూ పచారుచేస్తున్నాడు. చటుక్కున ఏదో ఆలోచన స్ఫురించి తల్లితో ఇల్లా చెప్పాడు, "అమ్మా ! ఒక్కొక్కప్పుడు మన హృదయాల్లో ఒక చిత్రమైన అభిప్రాయం బయలుదేరుతుంది. ప్రపంచంలో మనుష్యులంతా సోదరులే ననిపిస్తుంది. అందరిలోనూ ఒకే జ్యోతి వెలుగుతున్నట్లు కనుపిస్తుంది. అంతా సంతోషంతో కేరింతలు కొడుతున్నట్లు, అంతా మంచివాళ్ళయినట్లూ స్ఫురిస్తుంది. మాటా మంతీతో నిమిత్తం లేకుండానే ఒక విధమైన ఐకమత్యం సిద్ధిస్తుంది. ఒకళ్ళకొకళ్ళు అడ్డురావడంగానీ, ఒకళ్ళనొకళ్ళు అసహ్యించుకోవడంగాని ఉండదు. ఎవరి హృదయాని కానందంగా ఉండే పాట వాళ్ళు పాడుకున్నా మొత్తంమీద అంతా అన్యోన్యంగా ఉంటారు. అనేకములైన సెలయేళ్ళు మెల్లమెల్లగా మందస్వరాల నాలాపిస్తూ ప్రవహించి, మహానదిలోకలసి ఉప్పొంగి జోరుగా ప్రవహించే టట్లుగానే ఆయా వ్యక్తుల హృదయాల్లోనుండి బయలుదేరిన భావగీతాలు కూడా ఒకచోట సంగమమై మహానదిగా పొంగక మానవు. ఈ సంగతంతా తలుచుకుంటుంటే, ఆ సుదినంకోసం ఉవ్విళ్ళూరుతుంటే — ఓహో ! హృదయం కరిగి నీరై పోతోంది. విచారం, ఆనందం మిళితమై వస్తున్నాయి."

ఈ మాటలన్నీ చెవిని పడుతుంటే, తల్లి నిశ్చేష్టురాలై వింటోంది. అతని మాటకడ్డొస్తే ఏమి తప్పిపోతుందోనని ఆమె తదేక ధ్యానంతో వింది. మిగిలిన వాళ్ళందరికన్నా ఆఖరుకి పావెల్ కన్న కూడా నకోడా బాగా విపులంగా అర్థమయ్యేటట్లు మాట్లాడుతాడు. అతనెప్పుడూకూడా ముందు కలుగబోయే సౌఖ్యాన్నిగురించి

మాటాడుతూ ఉండడంచేత, తల్లి తన కుమారుని జీవితంలోని ఆంతర్యంకూడా స్పష్టంగా యిప్పుడు గ్రహించగలిగింది. నకోడా మళ్ళీ అందుకున్నాడు.

"కాస్త కళ్ళుతెరిచిచూస్తే సంగతి తెలుస్తుంది. అంతా అసహ్యంగా కనుపిస్తుంది. ప్రాణం విసిగి జనం చికాకు పడుతున్నారు. మానవ జీవితమంతా రోడ్డుమీద అడుసులావుంది......................(కొంచెంసేపు ఏదో ఆలోచిస్తూ తలకాయ వూపి) అవును. మనిషిని నమ్మడానికి వీలులేదు. మనిషికి భయపడాలి. ఒక్కొక్కప్పుడు అసహ్యించుకోవాలిసొస్తుంది కూడాను..........వాస్తవానికి మనుష్యుల నందరూ ప్రేమించాలిసిందే. కాని అదెల్లా సాధ్యమవుతుంది ? ఒక మనిషి మరీ పశువుగా ప్రవర్తిస్తూ, యెదుటి వాడిలోకూడా ఒక జీవుడున్నాడనే సంగతి గమనించక మొఖంమీద తన్ని అవమానపరుస్తుంటే భరించడం ఎల్లాగ? భరించనేకూడదు నా స్వవిషయంలో యేదయినా అవమానం కలిగినా నేను భరించగలను. కాని పదిమందికీ సంబంధించిన విషయాల్లో ఏ అవమానాల్నీ భరించలేను. అయినా, నన్నొక్కడినే అవమాన పరచినాడని నే నూరుకుంటే, వాళ్ళకదే అలవాటయిపోతుంది." (ఈ మాటలు చెపుతూంటే అతని కండ్లల్లో ఒక అపూర్వమైన జ్యోతి ప్రకాశించింది. మాటలలో పటుత్వ మెక్కువైంది.)

"ఒక్క అవమానమన్నమాటేమిటి ? నాకు అసహ్యం కష్టం కలుగజేసే దేనిని భరించను. నేనొక్కడనేకాదు. ప్రపంచంలో వున్నది. యెవరైనా యివ్వాళ నన్ను అవమాన పరిచినపుడు నేను చూచీ చూడనట్లు ఊరుకుని నవ్వేస్తే యీలోకువ కనిపెట్టి నన్ను అవమానపరచినవాళ్ళే రేపు యింకొకడిని, యెల్లుండి మరొకళ్ళని, ఈలా ప్రపంచాన్నంతనూ క్షోభపెట్తారు. అందుచేతనే. యెవ్వరూ యేవిధమైన అవమానాలనూ భరించి వూరుకోకూడదు. ఈ కారణం చేతనే ప్రపంచంలో మంచివాళ్ళు, చెడ్డవాళ్ళు, తనవాళ్ళు, పరాయివాళ్ళు అని భేదాలు యేర్పరచవలసి వచ్చింది."

ఈ సంగతి చెప్పుతూంటే తల్లికి శశాంక సంగతి, పోలీసు ఆఫీసరు సంగతి స్ఫురణకొచ్చింది. ఒక్క నిట్టూర్పు విడిచి "అవును. ఈ రాతిగుండెల మనుష్యులతో యేమిపని జరుగుతుంది ?" అంది.

"అదేబాధ. ఏసంగతైనా రెండుకళ్ళతో చూడవలసొస్తోంది. శరీరంలో రెండుహృదయాలు కొట్టుకుంటున్నాయి. ఒక హృదయం అందరిని ప్రేమించమంటుంది. రెండో హృదయం జాగ్రత్త ! జాగ్రత్త ! అని వరాకు చెపుతోంది."

తల్లి దీర్ఘాలోచనలో పడింది. ఆమె కండ్లకు తనభర్త ఘోర స్వరూపం కనపడింది.

తరువాత ఆస్వరూపాన్ని మనోనేత్రాల యెదుటనుండి తొలగించుకునేసరికి నకోడా - నటాషాల దాంపత్యం, పావెల్ శశాంకల పొందిక; తలపుకొచ్చి సంతోషంకలిగింది. నకోడా మాట్లాడుతూనే ఉన్నాడు.

"అమ్మా! యేతావాతా చెప్పదలచుకొన్న విషయమిది. మనుష్యులంతా ఒక్క మోస్తరు సమాన ఫాయీలోలేరని స్పష్టంగా కనుపిస్తోంది. ఇది చాలా అన్యాయం, అక్రమం. కనుక మనమిప్పుడు అందరిని ఒక్క వరుసలో నిల బెట్టాలి. ఒక్కయెత్తుకు తీసుకురావాలి. సంఘంలోవుండే కుశాగ్రబుద్ధుల బుద్ధివిశే షముచేత కలిగిన ప్రయోజనాన్ని కాయకష్టంచేసే పనివాళ్ళవల్ల కలిగిన ప్రయోజ నాన్ని సమ్మిళితంచేసె అందరికీ సమానంగా పంచిపెట్టాలి. ఒకళ్ళనొకళ్ళు అణగ ద్రొక్కకుండామనే దురాశ, మూర్ఖత్వం, ఈర్ష్య మొదలైన దుర్గుణాలను తీసిపా రెయ్యాలి. ఒకళ్ళంటే యింకొకళ్ళకిగల భయాన్నిలొలగించి అన్యోన్యం యేర్పర చాలి.

ఆంద్రీ, తల్లీ తరుచుగా యిలాంటి సంభాషణలలో కాలక్షేపంచేస్తూ వుండే వారు. మళ్ళీ ఆంద్రీ ఫాక్టరీపనిలో ప్రవేశించాడు. అతడు సంపాదించితెచ్చిన కూలి దబ్బులను తల్లిచేతుల్లో పెట్టేవాడు. ఆమె తనకొడుకుమాదిరిగానే ఆదరించేది. అప్పుడప్పుడు ఆంద్రీ ఆమెకు చదువుచెపుతూ వుండేవాడు. ఆమె తప్పులుచదువు తూవుంటే ఆంద్రీకి కొంచెం యెగతాళిగావుండేది. ఆంద్రీ ఎప్పుడైనానవ్వితే కొంచెం కోపంకూడావచ్చి "ఇలాగైతే నేచదువనుసుమీ" అని బెదరిస్తూవుండేది. తప్పులురాకుండా చదవాలని ఆమె విసుగులేకుండా ఒంటరిగా కూచుని పాఠాలు చదువుకొనేది. సాయంత్రం ఆంద్రీని ఆమాటకీ యీమాటకీ అర్థాలు అడుగుతూ వుండేది. క్రమంగా చదువు దారిలోపడింది. వృద్ధాప్యంలో చదువు అవడంచేత కళ్ళు జబ్బిచ్చాయి. ఆంద్రీ ఆమెను తన స్నేహితుడైన కళ్ళవైద్యుడి దగ్గరకు తీసుకెళ్ళి పరీక్షచేయించి సులోచనాలజోడు కొనిపెట్టాడు.

* * * *

తల్లి పావెల్‌ను చూడడానికి జైలు దగ్గరకు మూడుసారులు వెళ్ళింది. మూడు సారులు అక్కడుండే ముసలి పోలీసు ఆఫీసరు ఎప్పటికప్పుడు ఏవో తియ్యని కబుర్లుచెప్పి పావెల్‌ను చూపించకుండానే పంపేశాడు. ఏసారికాసారి మళ్ళీవారం అనేవాడు. నోరుమంచిదైతే ఎంతపనైనా చెయ్యవచ్చు. ఆముసలి ఆఫీసరు పళ్ళుకుట్టుకుంటూవచ్చి నెమ్మదిగా కబుర్లుచెపితే తల్లి సంతృప్తి పడి చక్కావచ్చేది.

ఒక్కసారి యింటికొచ్చి ఆంద్రీతో "అతను మహానెమ్మదిగా మాట్లాడు తాడు. నవ్వుతూనే వుంటాడు. ఆపని చేసేవాళ్ళలాగే ఉండాలనుకుంటాను" అంది.

"అవునవును. వాళ్ళు నెమ్మదిగా నవ్వుతూ అలాగే ఉంటారు. కాని పై అధికారు లెవరైనా వచ్చి 'అయ్యాయీ! ఇదిగో, ఈ మనిషి తెలివైనవాడు, మర్యాదస్తుడు, కాని మనకు ప్రమాదంగా వున్నాడు కనుక శిక్షించండి' అని చెపితే, అప్పుడుకూడా నవ్వుతూనే శిక్షిస్తారు. ప్రాణాలు తీస్తున్నా నవ్వుమానరు" అన్నాడు ఆంద్రీ.

"అయితే ఇదివరకు మనింటికి సోడాకొచ్చినవాడే నయం. ఇతనికన్న అతని వ్యాపారమంతా బట్టబయలు. కళ్ళలో చూస్తేనే కుక్కని తెలిసిపోతుంది."

"అసలు వీళ్లెవళ్ళూకూడా మనుష్యుల్లో లెక్కకాదు ప్రజలను పీడించడం వాళ్లకి నిత్యకృత్యం. మనలాంటివాళ్ళను తమ చెప్పుచేతల్లో వుంచుకోవడానికని ప్రభుత్వం వీళ్ళని సాధనాలుగా ఉపయోగిస్తారు. వాళ్ళమట్టుకు వాళ్ళుకూడా తమ స్వాధీనంలో లేరు. కేవలం నిర్జీవమైన యంత్రసాధనాలై పోయారు. ప్రభుత్వాధికారులు ఏపనిచేయమన్నా, ఏమీ ఆలోచనలేకుండా, అవసరావసరాలు విచారించకుండా చేసే స్థితిలో వున్నారు."

* * * *

కొంతకాలానికి తల్లికి కొడుకును చూడడానికి ఆర్డరిచ్చారు. ఒక ఆదివారం నాడు తల్లి జైలుదగ్గరకెళ్ళి ఆఫీసు గదిలోకూచుని, తనలాగే బంధువులను మిత్రులను చూడడానికొచ్చిన వాళ్ళతో మంచి చెడ్డా మాట్లాడుతూ కూచుంది. ఈ లోకాభిరామాయణంలో యీ విషయం ఆ విషయం అనే తేడా లేకుండా ప్రపంచంలో వుండే అన్నిసంగతులూ వచ్చాయి. చుట్టుప్రక్కల దేశాల్లో జరిగిన వింతలు, విశేషాలు, పాడిపంటల అంచనాలు. ధరల హెచ్చుతగ్గులు అన్నీ వచ్చాయి. మధ్యమధ్య ముతకగుడ్డలతోటీ సంకెళ్ళతోటీ వచ్చి ఖైదీలు తమకు కావలసినవాళ్ళతో మాట్లాడిపోతూ వుండేవారు. ఇదంతాచూస్తుంటే తల్లికి కంపరమెత్తింది. ప్రపంచం అంతా తబ్బిబ్బయిపోయినట్లయింది. అప్పు డామె ప్రక్కనున్న ఒక ముసలమ్మకీ ఆమెకూ ఈ క్రింది సంభాషణ జరిగింది.

తల్లి :—నీవాళ్ళెక్క డెవరున్నారమ్మా ?

ముసలమ్మ :—నా కొడుకు. చదువుకుంటూ వుండేవాడు. నీవెవరికోసం వచ్చావమ్మా ?

తల్లి :—నేనూ నా కొడుక్కోసమే. నా కొడుకు ఫాక్టరీలో పనిచేసేవాడు.

ముస :—పేరు ?

తల్లి :—'వాసవ్'

ముస :—వాసవ్ ? పే రెప్పుడూ వినలేదే. ఎన్నాళ్ళయింది జైలులోపడి ?

తల్లి :—ఏడువారాలు.

ముస :—ఇంతేనా ? నా కొడుకు పదిమాసాలనుంచి వున్నాడు.

ఈసంభాషణ జరుగుతూవుంటే యింకొక పొడుగాటి ఆడమనిషివచ్చి మాట సాగదీస్తూ "క్రమంగా మర్యాదస్తులందరినీ వీళ్ళు జైల్లో పారేసేటట్లున్నారు" అంది.

'అవునవును. మనుష్యులికి ప్రాణం విసుగొస్తోంది. ఇక కాంతంవుండదు. ఎంతకాలం ఓరుస్తారు ? అసంతృప్తి పెరిగిపోతోంది. ధరలు హెచ్చిపోతున్నాయి.

కూలినాయిలు తగ్గిపోతున్నాయి. ఒకడూ ఆలించేవాడూ పాలించేవాడూ లేడు' అని ఒక ముసలివా డంయకుని గడబిడగా ఉపన్యాసం ఇచ్చాడు.

ఇల్లాగే అచ్చట చేరినవారంతా ఏదో తలా తోకా లేకుండా బాతాఖానీ కొట్టుకున్నారు. ఎవరిమట్టుకు వాళ్ళు తమ అభిప్రాయాన్ని చెపుతూవుండేవారు. అందరిలోనూ కూడా అధికారులంటే అసహ్యం ఎక్కువగా ఉందని మాత్రం తల్లి గ్రహించింది.

ఇంతలో ఒక లావుపాటి వార్డరొచ్చి తల్లిని పిలిచి తనతో రమ్మని తీసుకెళ్ళాడు. తిన్నగా ఆమె పావెల్‌వుండే గదివగ్గర కెళ్ళింది. పావెల్ చిన్నగదిలో నిలబడున్నాడు. అతను తల్లిని చూడడంతోనే చిరునవ్వునవ్వి ఆమెచెయ్యి పట్టుకునేందుకు కటకటాల్లోంచి తనచెయ్యి అందిచ్చాడు. తల్లికి చెయ్యి వణికింది. అతనిచెయ్యి అందుకుని నవ్వింది మాటతోౌణకలేదు. కంగారు పడుతూ 'కు.... కు....కులాసాగా వున్నావా?' అని అడిగింది.

'అమ్మా, కంగారుపడకు ఫరవాలేదు. ధైర్యంతెచ్చుకో' అన్నాడు పావెల్.

'సరే, సరే' అంది తల్లి.

ఇంతలో పానకంలో పుడకులాగున ఒక వార్డరొచ్చి మర్యాదామంతీ లేకుండా 'ఏమమ్మోయి! దూరంగావుండి మాట్లాడు' అంటూ ఆవలించాడు.

పావెల్ తల్లిని కుశలప్రశ్నలేసి ఆమె ఆరోగ్యం సంగతి అడిగాడు. కొడుకు మొఖంకేసి చూడడమేకాని ఆమెకేమీ మాట తోచలేదు. ఊరుకుని ఊరుకుని "శశాంక నిన్ను చాలాచాలా అడిగింది" అంది. ఈమాట వినేసరికి ఉక్కబేల బాధపడేవానిమీద చల్లగాలి సోకినట్లు అతనిప్రాణం లేచొచ్చి మొఖం తేటపడింది.

"నాయనా! మిమ్మల్ని యింటిల్లో వదలిపెడతారా? మిమ్మసలు జైల్లో యెందుకు పెట్టినట్లు? ఎల్లాగా ఫాక్టరీలోకి కాగితాలొచ్చి పడుతూనే వున్నాయి" అని తల్లి అడిగింది.

పావెల్ ముఖం వికసించింది. "అలాగా? అలాగా? చాలా వచ్చినాయా?" అని పావెల్ మళ్ళీ అడిగాడు.

మళ్ళీ అంతట్లో బుడగ వార్డరొచ్చి "ఆమాటలు మాట్లాడకూడదు. సంసారపు గొడవలేమైనావుంటే మాట్లాడుకోండి" అని అదలించాడు.

'ఇది సంసారపుగొడవే?' అంది తల్లి.

'ఇదిగో, అదంతా నాకు తెలియదు. ఈమాటలు మాట్లాడకూడదు. మేవో తిండీ తిప్పలు, గుడ్డా గుడుసు సంగతులు మాట్లాడుకోండి. అంతే,

'పోనీలే. అమ్మా! మనయింటివ్యవహారాలు మాట్లాడు. అన్నట్లు నువ్విప్పుడేం చేస్తున్నావో చెప్పు' అన్నాడు పావెల్.

'ఇదంతా ఫ్యాక్టరీలోకి మోసుకెడుతున్నాను. ఏముంది? కూర పులుసు

వగైరాలు మేరీవండి యిస్తోంది. నేను చలామణి చేస్తున్నాను' అని తల్లి ధైర్యం తెచ్చుకుని గాఢంగా యుక్తిగా జవాబు చెప్పింది. పావెల్ గ్రహించాడు. సంతోషము పట్టలేక మెల్లగా 'అమ్మా! తల్లి అంటే నువ్వేతల్లివి. బలేపని చేస్తున్నావు. కాని మంచిపని కల్పించుకున్నావులే. నీకేమి ఇప్పుడు బెంగలేదన్నమాట' అన్నాడు.

'ఫ్యాక్టరీలో కాగితాలు కనపడ్డాక నన్నుకూడా సోదా చేసేరుసుమా?'

'అదిగో! మళ్ళీఅదేగొడవ. మాట్లాడకూడదని ఎన్నిసార్లు చెప్పాలి? ఇలాంటి విషయాలతనికి తెలియకూడదనే అతన్ని జైలులోఉంచడం. నీవొచ్చింది ఈసోదంతా చెప్పడానికా ఏమిటి? వల్లకాదు' అని వార్డరు కొంచెం కోపముతో తల్లిని అదలించాడు.

"పోనీలే; అమ్మా! ఆమాటలేమీ చెప్పకు. ఈవార్డరున్నాడే చాలామంచివాడు. మనతో చాలమర్యాదగా వుంటాడు. ఏమి పేచీ పూచీలు లేకుండా కాలక్షేపంచేస్తున్నాం. అతనికి చిక్కొచ్చే మాటలేమి మాటాడవద్దు. అసలు ఈపని అసిస్టెంటు సూపర్నెంటు చెయ్యాలి. అతను లేనప్పుడు ఇల్లాంటిమాటలు మాట్లాడితే తనకేమి ముప్పొస్తుందోనని మావార్డరుకు భయం"అని తల్లికి నచ్చచెప్పేడు.

ఇక సమయమయిపోయిందని వార్డరు తొందరపెట్టాడు. పావెల్ తల్లిని కౌగిలించుకొన్నాడు. తల్లికి కడుపు చెరువైపోయింది. హృదయం నీరైపోయింది. దుఃఖం పొర్లిపోయింది. కన్నీళ్ళు కాలువలు గట్టినాయి. విధిలేక తల్లి వెనక్కివచ్చింది. జైలులో చోటులేదని అందుచేత అందరినీ వదిలిపేస్తారని పావెల్‌కూడా త్వరలోనే బయట పడతాడని వార్డరు తల్లినోదార్చాడు.

తల్లి యింటికొచ్చి జైలుదగ్గర జరిగిన విషయాలన్నీ పూసగ్రుచ్చినట్లు నకోడాతో చెప్పింది. ఫ్యాక్టరీలోకి కాగితాలు చేరిన సంగతి యావత్తు పావెల్ గ్రహించాడని నకోడాకు నచ్చజెప్పింది. నకోడా చాలా సంతోషించి తల్లిని అభినందించాడు.

రెండు మూడు రోజులైన తర్వాత ఒకనాటిరాత్రి తల్లి మేజోళ్ళు అల్లుతూ బల్లవగ్గిర కూర్చుంది. నకోడా ఏదో పుస్తకం చదివి వినిపిస్తున్నాడు. తలుపు చప్పుడయ్యేసరికి నకోడాలేచి తలుపుతీశాడు. చంకని మూటతో నికోలేవైషోవికవ్ లోపల ప్రవేశించాడు. మోకాళ్ళదాకా బురద.

"దారివెంట పోతూంటే మీ యింట్లో దీపం కనిపించింది. క్షేమసమాచారములు కనుక్కొనిపోదామనివచ్చాను ,ఇప్పుడే జైలునుంచి విడుదలైవస్తున్నాను" అని వైషోవికవ్ చెప్పాడు, తల్లివగ్గరికెళ్ళి చెయ్యిపట్టుకొని, పావెల్ నిన్ను చాలా చాలా అడిగాడు. అని చెపుతూ బల్లమీద చతికిలబడ్డాడు. ఇల్లంతా క్రొత్తగా చూశాడు. అరడంటే ఇదివరకు తల్లికి ఒకమాదిరి లయిష్టం. అనివాలకంచూస్తే ఆమెకేదో అనుమానం; కాని ఇప్పుడదంతా పోయింది. అతను చిక్కిపోయి

నందుకు ఆమెచాలా విచారించింది. ఆంద్రీ టీ తయారుచేయడానికి లోపలికెళ్ళేడు. వైషోవికవ్ మాట్లాడుకుంటూ కూర్చున్నాడు.

"పావెల్ కులాసాగా ఉన్నాడా? నిన్నొక్కడినేనా ఇంకెవరినైనా వదలి పెట్టారా?"

"నన్నొక్కడినే. నేను అధికారులతో చెప్పాను. నాకింక ఈ జైలు చాలు; నన్ను వదిలెయ్యండి లేకపోతే మీలో యెవరినో ఒకరిని బలిపుచ్చుకొని తర్వాత నేను చస్తానని చెప్పాను. అందుచేత నన్ను వదలిపెట్టారు."

"ఓహో! అలాగా" వంటయింట్లోంచి నకోడా "అన్నట్లు ఫెడ్యా మాజిన్ ఎల్లా ఉన్నాడు ,పద్యాలు పాటలు అల్లుతున్నాడా?" అని అడిగాడు.

"ఆ, అతనిని ఒక బోనులో పడేశారు. అందులో పడుండి కూనిరాగాలు తీస్తూఉంటాడు. సరేకాని నాకు యింటికెళ్ళాలనే లేదు" అన్నాడు వైషోవికవ్.

"అవునవును. అల్లాగే. ఎందుకెళ్ళాలని ఉంటుంది? మీ కక్కడేముంది? పెళ్ళామా బిడ్డలా?" అంది తల్లి.

వైషోవికవ్ దీర్ఘంగా ఏమిటో ఆలోచిస్తూ మాట్లాడకుండా కూచున్నాడు. అల్లాంటప్పుడు సిగరెట్టులో వుండే మజా అనుభవించేవాళ్ళకు తెలుస్తుంది. గుప్ గుప్‌మని ఊదుతూంటే పొగ మేఘాలు జమ్‌మని అలా పరుగెత్తుతూంటే ప్రపంచాన్ని మరచిపోయే తన్మయావస్థ సిద్ధిస్తుంది. వైషోవికవ్ సిగరెట్టుమీద సిగరెట్టు ముట్టించి అలాంటి అవస్థ ననుభవించాడు. ఆ రాత్రికక్కడే పండుకుంటానని చెప్పాడు. అంతకన్న మహాభాగ్యమేముందని తల్లి సంతోషించింది.

కొంచెంసేపు అల్లె కళ్ళుమూసుకొని ఆలోచించి హఠాత్తుగా వైషోవికవ్ ఉపన్యాసం ప్రారంభించాడు.

"ఏమమ్మోయ్ నిలోనా! ముందు రాబొయ్యే సంతతివాళ్ళు నిజంగా వాళ్ళ తలిదండ్రులను తలుచుకుని సిగ్గుపడాలి. నేనిల్లా అంటున్నాని నువ్వు మరోలా అనుకోకు. నిన్ననడంలేదు ,పావెల్ నిన్ను తలుచుకొని గర్విస్తాడు. అతనికి సిగ్గుపడవలసిందేమీలేదు. నేను మాత్రం నాతండ్రిని తలచుకొని భిడియపడక తప్పదు. ఇకనేను అతని గుమ్మం త్రొక్కను. నాకు తండ్రిలేనట్లు లెక్క. కొంప అంతకన్నాలేదు. పోలీసునిఘాలో ఉంచారు, కాని లేకపోతే సైబీరియా పోయేవాడనే. ఒళ్ళుదాచుకోకపోతే సైబీరియాలోకూడా కావలసినంత పనిచెయ్యొచ్చు. ముఖ్యంగా ఖైదీలను తప్పించడానికి చాలా వీళ్ళున్నాయి."

ఈ ఉపన్యాసం వింటుంటే తల్లికి అతనిలో ఉండే ఆవేదన స్పష్టమైంది. ఏమీ మాట్లాడకపోతే బాగుండదని "నీకంత పట్టుదలగా ఉంటే సైబీరియా కెడితేనే నయం" అని అంటించింది. ఇంతలో వంటయింట్లోనుంచి నకోడా నవ్వుతూ వచ్చి "ఏమిటోయి! పెద్ద ఉపన్యాసం ఇస్తున్నావు?" అని నికోలే నడిగేడు. తల్లిలేచి తినడానికేదైనా తెస్తానని లోపలికెళ్ళింది. వైషోవికవ్ నకోడా

కేసి తేరిపారచూచి "ఆంద్రీ! అవసరమైతే కొంచెం ఆలోచిస్తే కొందరి ప్రాణాలు తియ్యాలనుకుంటాను" అన్నాడు.

"అలాగా? ఎందుకేమిటీ?" అని నకోడా వేళాకోళంగా ప్రశ్నించాడు.

"ఎందుకేమిటి? వాళ్ళ అంతం చూడడానికే"

"అలాగా! మనుష్యుల ప్రాణాలు తీయడానికి నీకు హక్కేముంది?

"ఆహా! కావలసినంత హక్కుంది"

"ఎక్కడనుంచి వచ్చిందేమిటి ఆ హక్కు?"

"ప్రజలదగ్గరనుంచే"

నకోడా గదిలో మధ్యనిలబడి జేబులలో చేతులెట్టుకుని తదేకదృష్టితో నికోలేను చూస్తున్నాడు. అతను పొగమేఘాలమధ్య కూచున్నాడు. అమాంతంగా బల్లగ్రుద్ది మళ్ళీ ప్రారంభించాడు.

"ఆ హక్కు ప్రజలేయిచ్చారు. ఎవరు నన్నుతంతారో వాళ్ళను మళ్ళా తన్నడానికి, వాళ్ళగ్రుడ్లు తోడెయ్యడానికీ నాకు అధికారంవుంది. కుక్కకాటుకు చెప్పుదెబ్బ. నాజోలికెవరూ రాకపోతే నేనొకళ్ళజోలికెళ్ళను. నాఇష్టమొచ్చినట్లు నన్ను బ్రతుకనిస్తే, నేనెవరినీ ముట్టుకోనైనా ముట్టుకోను. అంతగా వస్తే ఏ అడవిలోనో, ఏచెట్టుమీదో పుట్టమీదో బ్రతుకుతాను. మొత్తంమీద ఒకడిగొడవ నాకక్కరలేదు. "అయితే అలావెళ్ళి ఇప్పుడు బ్రతుకరాదూ? నిన్నెవ్వ రొద్దన్నారు?"

'ఇప్పుడా? ఇప్పుడసంభవం. దానికి ప్రజలే అడ్డు. యేమైనా సరే. నా జీవితం ప్రజలకి ధారపోయడానికి నిశ్చయించుకున్నాను. వాళ్లెంత నిర్భాగ్యులైనా సరే. వాళ్ళు నా కడ్డొచ్చారు. నేను వాళ్ళకడ్డెళ్తాను..........."

"మా నాన్న దొంగయాదంటే కారణం యెవరు:

ఆగార్బో వున్నాడే, ఇసేగోర్బో, వాడివిషయం.........నువ్వు చూస్తావుగా? వాడిపుచ్చె యెప్పుడో యెగరేవేస్తాను."

"ఎందుకేమిటి?" అని మెల్లగా అంటించాడు నకోడా.

"ఎందుకా? వాడు గూఢచారి కనుక. ప్రజలను వా డెందుకు దూషించాలి? మా తండ్రి పాడైనాడంటే వాడి మూలాన్నే. వాడి ప్రోత్సాహం వల్లనే నాతండ్రి కూడా ఇప్పుడు గూఢచారిగా ప్రవేశించ దలచుకున్నాడు."

"ఓహో! అల్లాగా! సరేకాని నీకెందుకంత ఆత్రత? నీతండ్రి పాపానికి నిన్నెవ్వరేమంటారు? అనేవాళ్లెవరైనా వుంటే వాళ్ళు మూర్ఖులే:

ఏదైనావస్తే తెలివైనవాళ్ళకీ మూర్ఖులకికూడా వస్తుంది............నువ్వూ, పావెల్ వున్నారు. మీరిద్దరూ తెలివైనవాళ్ళుకదా? నేను మూర్ఖుడిని. నువ్వు నిజంచెప్పు. ఓదరూ, ఫెద్రామేజిన్, శాములో మొదలైన చదువుకున్నవాళ్ళను చూసినట్లు నన్ను చూస్తారా? నువ్వు చూస్తామన్నా నేను నమ్మను. మీరు నన్ను కాస్త దూరంగానే వుంచుతారు.

"నికోలే! నీ హృదయానికేదో నొప్పి కలిగినట్లుంది. అపును నొప్పే. నా హృదయంలోనేకాదు. నీహృదయంలోనూ ఉంది. మనం ఒకళ్ళ విషయంలో ఒకళ్లు చాలా దగాగా ఉంటాము. ఏమంటావు?" పైషోవికవ్ అగ్గిలా మండి పడుతూ నకోదాకేసి చూశాడు.

నకోడా శాంతంగా "నేనేం చెప్పను? హృదయములో అనేకగాయాలు పడి అవి బాధపెడుతున్నపుడు ఆ మనిషితో వాదించి ప్రయోజనం లేదు. అందు వల్ల అతన్నెక్కువ అవమానపరచడం కూడాను, తమ్ముడూ! అంతవరకూ నాకూ తెలు"సన్నాడు?

"ఏమిటీ? నాతో వాదించడం సాధ్యంకాదూ?"

"నికోలే, ఈ అవస్థ నీకొక్కడికే ప్రత్యేకంగా పట్టింది కాదు. మేమంతా ఎప్పుడో ఒకప్పుడు ఇల్లాంటి అవస్థలుపడ్డ వాళ్ళమే. అంతా ముళ్ళమీద చెప్పులు లేకుండా నడచిన వాళ్ళమే. మారోజుల్లో మేమూ నీలాగే ఏమీ తోచక ప్రపంచా న్నంతా అసహ్యించుకుంటూ ఊపిరి తిరుగక తన్నుకొన్న వాళ్ళమే"

"అంద్రీ, నాతో చెప్పడానికి నీకేమీ లేనేలేదూ? నా హృదయాన్ని క్రూర సర్పాలు పీడిస్తున్నట్లుంది."

"నేనేమీ చెప్పదలచుకోలేదు, క్రమంగా డక్కాముక్కాలు తింటే ఈబాధ దానంతటదే పోతుంది. పూర్తిగా పోకపోయినా చాలావరకైనా బాధ తప్పుతుంది. (నకోడా నవ్వుతూ అతని వీపుతట్టి బుజ్జగించి) అబ్బాయీ గడబిడపడకు. ఇది చిన్న పిల్లలకొచ్చే పొంగులాంటిజబ్బు. చిన్నప్పుడు దీనిబాధనంతా అనుభవించిన వాళ్ళమే. గుండె నిబ్బరంకలవాళ్ళకి ఈజబ్బు కొంచెం తక్కువగా వస్తుంది. లేనివాళ్ళకి జోరుగా వస్తుంది. మనిషి తనసంగతిని తాను గుర్తెరిగినతర్వాత ప్రపంచధోరణిని, అందులో తనస్థానాన్ని గుర్తించుకోలేక పోయినప్పుడు ఈజబ్బు ముఖ్యంగా వస్తుంది. ప్రపంచంలో నీ స్థానమేమిటో, నీతరహా ఏదో, నీ తాహ తెంతో తెలుసుకోలేనప్పుడు నీలాంటి వ్యక్తములు ప్రపంచంలో లేనేలేరనే అహం కారం నీకు కలుగుతుంది. పైగా ప్రపంచం అంతా నిన్ను ద్వేషించి మింగెయ్య డానికి ప్రయత్నించేస్తున్నట్లు భ్రమకలుగుతుంది. నీశక్తి సామర్థ్యాల్ని ఇతరులు గ్రహించలేదనుకుంటావు. కొంతకాలాని కా భ్రమ తొలిగిపోతుంది. నీకున్నపాటి మంచితనం, సామర్థ్యం, ఇతరు లందరికూడా ఉందని తెలిసొస్తుంది. అప్పుడు నీ హృదయంలో ఉండే భావమంతా పోతుంది. కొంచెం సిగ్గుపడతావుకూడాను. అసలు నీ సామర్థ్యం తక్కువగా వున్నప్పుడు ఒంటరిగా నువ్వెంత గింజుకున్నా లాభంలేదు. జనానికి లెక్కవుండదు. నలుగిరితోపాటు నువ్వుకూడా ఏకమై ఏదైనా ప్రయత్నించేస్తే సాగుతుంది. శాస్త్రంతెలిసినా గాత్రలోపం కలవాడు సంగీతకచేరీ చేయబోతే జనం ఛీ ఛీ అంటారు. అలాంటి వాడు పదిమందితో కలసిపాడితే గాత్రలోపం కమ్ముకు పోతుంది. నే చెప్పేదర్థమవుతోందా!"

"అర్థమవుతోంచనుకో..........,కాని సేను నమ్మను," అన్నాడు నికోలే.

నకోడా పక్కున నవ్వేడు. గదాలునలేచి పచారుచేసి...............“సేనూ నమ్మలేదులే! ఓయి పిదుగా!" అన్నాడు.

అతాత్తుగా నికోలేకూడా ఒక వెకిలినవ్వు నవ్వేడు. "అబ్బ! నిన్ను చిన్న బుచ్చడం మహాకష్టం" అన్నాడు.

ఇంతలో తల్లి నకోడాను టీ తీసుకెళ్ళమని వంటఇంట్లోకి పిలిచింది.

నకోడా లోపలికెళ్ళేడు. వైషోవికవ్ కాస్సేపు ఒళ్ళు విరుచుకుని బద్ధకం తీర్చుకున్నాడు. నకోడా టీ తీసుకొచ్చేటప్పటికి అతను అద్దంపగ్గర నిలబడి మొఖం చూచుకుంటున్నాడు.

"అంద్రీ! నాముఖం అద్దంలో చూచుకొని యెన్నాళ్ళో అయింది సుమా! నాముఖం చాలా అందవికారంగాఉంది. వున్నప్పుడు నవ్వుతూ ేదే నీకేమి?"

"ముఖం బాగుంటే హృదయం బాగుంటుందని, హృదయానికి ముఖం అద్దంలాంటిదనీ శశాంక చెప్పింది."

"ఉట్టిమాట, ఆమెయొక్క ముక్కు కుక్కగొడుగులావుంది. గెడ్డంకోలగా వుంటుంది. ఆమె హృదయంమాత్రం నక్షత్రంలా ప్రకాశిస్తోంది" అన్నాడు నకోడా.

ఇలా బాతాఖానీ కొట్టుకుంటూ టీ త్రాగడానికి కూచున్నారు. వైషోవికవ్ ఒక పెద్ద బంగాళాదుంపనుతీసి ఒక రొట్టెముక్క పుప్పులో అద్ది రెంటిని కలిపి నోట్లోకి తోశాడు. ఏదో జంతువులాగ నోటినిండా నములుతూ నెమ్మదిగా "అంద్రీ ఇక్కడి వ్యవహారాలెల్లా వున్నాయి?" అన్నాడు.

నకోడా అతనికి ఫాక్టరీలో జరుగుతున్న విశేషాలు, (సోషలిస్టు) సామ్యవాద సంఘంయొక్క అభివృద్ధి మొదలైన సమాచారాలన్నీ చెప్పాడు. అంతా వింటే నికోలేకు ఏదో చింత కలిగింది.

"అచ్చే చాలా నెమ్మదిగాఉంది వ్యవహారం. ఇల్లాగయితే ఎప్పటికవను? గబగబా నడిపించాలి." అన్నాడు. "జీవితమంటే గుర్రమనుకున్నావా ఏమిటి? గుర్రాన్ని కొరడాతో ఒక్కటేస్తే దవుడా యిస్తుంది. కాని జీవితం అల్లా పరుగెత్తదు." అన్నాడు నకోడా. వైషోవికవ్‌కు ఈ జవాబు తృప్తికరంగాలేదు. "అబ్బ! ఇది చాలా చప్పచప్పగా ఉంది. నాకు వోపికలేదు. నేనేమిచెయ్యను?" అని నిస్పృహతో చేతులు తేలేశాడు.

"మనం నేర్చుకోవడం ఇతరులకు చెప్పడం కూడా మనపనే" అన్నాడు నకోడా. "అయితే మనం దెబ్బలాడడం ఎప్పుడూ?"

"దెబ్బలాట? ఈలోగా ఎన్నిసార్లు మనబోటిగాళ్ళు హతమారిపోవాలో? అంతవరకూ సిద్ధాంతమే. ఆ దెబ్బలాట ఎప్పుడొస్తుందో నాకుమాత్రం ఏమి

(7)

తెలుసు ? కాని ముందు మనం బుద్ధిబలాన్ని వృద్ధిచేసుకోవాలి. తరువాత హస్త లాఘవం దేహబలమున్నూ. అదీ నా అభిప్రాయం."

"మరి హృదయం మాట ?"

"హృదయంకూడానూ."

వైషోవికవ్ మౌనందాల్చాడు. మాట్లాడడానికి బదులు నోటిని తినడాని కుపయోగించాడు. తల్లి దూరంగా నిలబడి ఓరకంటితో అతని స్ఫోటకపు మచ్చల ముఖాన్ని పరీక్షగా చూచింది. ఆంద్రీ ఏదో ఆలోచిస్తూ చేతులమీద తలవాల్చుకుని కూర్చున్నాడు. అడిగినమాటలకు ముక్తసరిగా జవాబుచెబుతూ వైషోవికవ్ తృప్తిగా భోజనం చేశాడు. జైలుబడలిక తీర్చుకోవాలని వెంటనే పడుకున్నాడు. తల్లి నకోడా దగ్గరకొచ్చి మెల్లగా వైషోవికవ్ హృదయంలో ఏదో గొప్ప తుపానులాంటిదుంది సుమా ?" అంది. "అవును. అదేమిటో అర్థమవడంలేదు" అన్నాడు నకోడా. ప్రొద్దుపోయింది కనుక తల్లిని పడుకోమనిచెప్పి, తాను గదిలోకెళ్ళి ఏదో చదువు కోడం ప్రారంభించాడు.

ఇల్లంతా ప్రశాంతంగాఉంది. గడియారం టిక్‌టిక్ శబ్దంమాత్రం స్ఫుటంగా వినిపిస్తోంది. తల్లి గదిలోకెళ్ళి ప్రార్ధనకు కూచుంది. ఆంద్రీ చదవడంమాని ప్రార్ధన నాలకించాడు. ఈక్రింది మాటలాతని చెవినిబడ్డాయి. "ఓ భగవంతుడా ! ప్రపంచంలో ఎందరున్నారోగదా ? అందరు ఏదోఒక దుఃఖము ననుభవించేవారే కదా ? హేదయాళో ! నిత్యసంతోషు లెవ్వరయినా ఉన్నారా ?"

"త్వరలో ఉంటారు" త్వరలోనే అన్నాడు ఆంద్రీ.

## ౧౪

జీవితం త్వరితంగా సాగిపోతోంది. కాలక్రమేణా తల్లికి క్రొత్తమనుష్యు లతో పరిచయం కలగడం, వాళ్ళ స్వభావ సామర్థ్యాలు తెలుసుకోడం అలవాటై పోయింది. మునుపటిలాగ కొత్తవాళ్ళొస్తే బెదరడంపోయింది. ఆంద్రీతో మాట్లాడ డానికి రోజూ ఎవరో కొత్తమనుష్యులు వస్తూనే ఉండేవారు. ఏ సాయంకాలమో వచ్చి అర్ధరాత్రిదాకా మాట్లాడిపోతూ వుండేవారు. వాళ్ళేమిటో వుద్రేకంగా మాటా డుకుంటూ హడావిడిపడుతూ ఉండేవారు. సహజంగా వాళ్ళ ముఖలక్షణాలు వేర్వే రుగావున్నా తల్లిదృష్టికి అంతా ఒక్కమాదిరిగానే, కన్పడేవారు. అందరూ యేదో ఒక మహాత్కార్యానికి దీక్షవహించినట్లు ఆమెకులోచింది. వాళ్ళందరూ పావెల్ ననుసరించుకొనివున్న మనుష్యులుగా ఆమె స్థిరపరచుకుంది.

ఒకరోజున వుంగరాలజుట్టుగల ఒకయువతి ఏదో పార్సెలుపట్టుకొచ్చి ఆంద్రీచేతికిచ్చి వెళ్ళిపోయింది. వెడుతూవెడుతూ 'సోవరీ' (కామ్రేడ్) అని తల్లిని పలుకరించి చక్కాపోయింది. 'సోవరీ' (కామ్రేడ్) అని పిలువడంతోనే

తల్లిహృదయం యెందుచేతనో కరిగిపోయింది. ఆ యువతి చూపుదక్కేవరకు తల్లి కిటికీంలోంచి చూస్తునేవుంది.

పట్టణంనుంచి వచ్చేపొయ్యేవాళ్ళలో తల్లికి కొన్ని విశేషాలు కనుపించేయి. వాళ్ళ అమాయకత్వం చూచి తనలో తానే నవ్వుకొనేది. కాని వాళ్ళకుండే ఆత్మ విశ్వాసం, న్యాయం తుదకు జయంపొంది తీరుతుందనే ధీమా, చూస్తే హృదయం వుప్పొంగేది. వాళ్ళు నలుగురూచేరి తమకు కలుగబొయ్యే విజయాన్నిగూర్చి కలలు కంటూంటే తల్లి యెంతో జాలిపడి వీళ్ళ కష్టాలెప్పుడు గట్టెక్కుతాయా దేవుడా అనుకునేది. అన్నిటికన్నా ఆమె హృదయాన్నాకర్షించింది వాళ్ళ స్వార్థత్యాగము! ప్రతిఫలాపేక్ష యెంతమాత్రంలేని త్యాగం!! ముందువెనుక లెరుగని త్యాగం!!!

తల్లికి చాలావరకు జీవితాన్నిగూర్చి వాళ్ళు అనుకునే మాటలు బాగా అవగాహనైనాయి. ఈ నవయుగ సిద్ధాంతాలు ప్రజలకష్టాలకు మూలాన్ని కనిపెట్టినట్లామెకు తోచింది. వాళ్ళు కనే కలలన్నీ నిజమవుతాయనే పూర్ణవిశ్వాసమూమెకు లేకపోయినా, మొత్తంమీద వాళ్ళ అభిప్రాయాలామెకు బాగా నచ్చాయి. ఎవళ్ళ పొట్టకి వాళ్ళు దేవులాడడం, కష్టానికి భయపడుతూ వుండడం, జనంలోవుండే సామాన్యలక్షణం. కాని ఈయువజనులు ఆ సంకుచిత స్వభావాన్ని వదిలేసి, లోక కల్యాణం నిమిత్తం ఆత్మార్పణం చేస్తున్నారని తెలిసికొన్న తర్వాత ఆమెకు వాళ్ళంటే గొప్ప అభిమానం, ప్రేమా కలిగింది. ఎన్ని కష్టాలొచ్చినా భరించి వాళ్ళకి సర్వవిధాల తోడ్పడడం చాలా అవసరమని ఆమెకు తోచింది.

ఇంతవరకు ఆమె అనుభవాన్నిబట్టి ప్రపంచంలో తానెందుకైనా ఎవరికైనా ప్రయోజనకారి కాగలననే సమ్మకంలేదు. అందులోనూ ఆవృద్ధాప్యంలో, తాను చచ్చిపోతే తన భర్త కూడొండిపెట్టడానికి ఇంకొకతెను పెళ్ళిచేసుకొనేవాడే. అంతే. తన కొడుక్కయినా తాను విశేషం సహాయపడగలననే విశ్వాసం ఆమెకిదివరకులేదు. కాని ఇటీవలి విషయాల్నిబట్టి తానూ కొంత ప్రపంచానికి వుపయోగించే పనిచేయగలననే ధైర్యం తెచ్చుకుంది. ఒక మహత్కార్యానికి తాను సాయపడుతున్నాననే సంతృప్తివల్ల ఆమె కెంతో సంతోషం కలిగింది.

ఫ్యాక్టరీలోకి రహస్యంగా కాగితాలను తర్లించడం తనధర్మమని ఆమె నిర్ణయించుకుంది. అధికారులు కనుక్కోకుండావుండే అనేక మార్గాలు యెప్పటికప్పుడే ఆలోచించుకొని కార్యం నెరవేర్చేది. ఫ్యాక్టరీగేటు కాపలావారులకు ఆమె రాక అలవాటై పోవడంచేత అంతగా అమెననుమానించేవాళ్ళుకారు. సాధారణంగా ఆమెను సోదాచూసే వాళ్ళేకారు. కాని ఫ్యాక్టరీలోకి కరపత్రాలు వగైరాలు వచ్చి పడిన మరునాడు మాత్రం మహాకచ్చితంగా సోదాచూసేవారు. తన దగ్గరేమీ కాగితాలు లేనప్పుడు ఆమె గమ్మత్తుచేసేది. సోదా కుంగీకరించనట్లు నటించి అధికారుల అనుమానాన్ని హెచ్చించేది. సోదాచేసి వాళ్ళు మతావా తాల్చేవాళ్ళు. ఈ తమాషా చూచి తల్లి తనలో తానే ఆనందించేది.

నికోలే వైషోవికవ్‌కు మళ్ళీ ఫాక్టరీలో పనిదొరకలేదు. ఎవరో వర్తకుడి దగ్గర కూలికి కుదిరేడు. చిక్కి శల్యాలుగా వున్న రెండు గుర్రాలను బండికట్టుకుని రోజంతా బండితోలుకుపోయేవాడు. అదే జీవనోపాధి. అల్లాగే రోజులు దొర్లిస్తున్నాడు. సాయంత్రం మాత్రం నకోడా దగ్గరకొచ్చి ఆండ్రీతో పాటుగా ఏవో పత్రికలలో సంగతి సందర్భాలు విని చక్కాపోతూ వుండేవాడు. ఆ సందర్భాల్లో జరిగే చర్చలలో అట్టే జోక్యం కలుగజేసుకునేవాడు కాడు. ఒకనాడు మాత్రం అంతా వెళ్ళిపోయేదాకా వుండి ఆండ్రీని ఒక ప్రశ్నేశాడు

"ప్రజల యీ దురవస్థకి కారణం యెవరంటావు? చక్రవర్తి అంటావా లేక మరెవరైనా వున్నారా?"

"ఎవరంటావా? ప్రపంచంలో మొట్టమొదట ఇదినాది అనే మాట తెచ్చిపెట్టినవాడు. వాడు చచ్చిపోయి చాలా కాలమైంది. కనుక వాడిమీద ఆగ్రహపడి కసితీర్చుకుందామంటే లాభంలేదు" అని ఆండ్రీ తమాషాగా జవాబు చెప్పాడు.

"అయితే డబ్బుగలవాళ్ళు వాళ్ళ నాశ్రయించుకొన్న వాళ్ళమాటేమిటి? వాళ్ళకు న్యాయమేమైనా వుందంటావా? అని మళ్ళీ ప్రశ్నవేశాడు వైషోవికవ్. ఈప్రశ్నకి సమాధానం చెప్పడానికి నకోడా చాలా తటపటాయించాడు. అట్టే నుదుటి మీద చెయ్యిపెట్టుకొని ఆలోచించాడు; కొంచెంసేపు ప్రజల జీవితపద్ధతినిగూర్చి సులభశైలిలో ఉపన్యసించాడు. వైషోవికవ్‌కు ఏమి తృప్తికలుగలేదు.

మరొకరోజున వైషోవికవ్ నకోడాతో యిల్లాఅన్నాడు.

"ఆండ్రీ! ఎవరిదో ఒకరిలోపం వుండితీరాలి. పొలంలో కలుపుతీసేసినట్లు అలాంటి పాపిష్టుల్ని తీసిపారెయ్యాలి. దయా దాక్షిణ్యం ఆలోచిస్తే మాట దక్కదు."

ఈమాటలువింటూంటే తల్లికి రికార్డుగుమాస్తా ఐసేసంగతి జ్ఞాపకం వచ్చింది. ఒకసారి మనలను గురించి ఐసే కూడా అల్లాగే అన్నాడు సుమా అంది. ఒక్క క్షణం అంతా ఊరుకొన్నారు "ఐసే కామా?" అని వైషోవికవ్ రెట్టించాడు.

"అతనే. చాల దుర్మార్గుడు. అక్కడా ఇక్కడా పొంచి ఉండి అందరి మీద చాడీలు చెపుతాడు. గూఢచారిగా పనిచేస్తున్నాడు. మన ఆచోకీ తీస్తూ ఉంటాడు. ఈ మధ్య ఈ వీధుల్లో రహస్యంగా తిరుగుతూ మన కిటికీలోంచి తొంగిచూడడం ఆరంభించాడు" అంది తల్లి.

ఐసే మాట తలపెట్టేసరికే వైషోవికవ్ అగ్గయిపోయాడు. "మా కిటికీల్లో తొంగిచూస్తున్నాడా?" అని హుంకరించాడు. ఆండ్రీ అతనికోసం శాంతింపచేయడానికి ప్రయత్నంచేశాడు. "అతను వీధుల్లో తిరిగితే ఏమి? కొంపల్లో తొంగి చూస్తే ఏముంది? వాడికేదో కళ్ళనొప్పి. అంతే"అన్నాడు. వైషోవికవ్‌కు ఈశాంత వచనాలు వినేసరికి మరీ ఒళ్ళు మండింది. "నువ్వూరుకో. వాళ్ళే చేస్తున్నారు ఇదంతా. వాళ్ళదేపూచీ" అన్నాడు ఆగ్రహంతో.

ఆంద్రీ ఇంకా వారింపబోయాడుకాని వైసోవికవ్ మూతి ముడుచుకొని చరా పోయాడు. తల్లి మంచంమీద పడుకుని వాళ్ళ సంభాషణ ఆలకించింది. వైసోవికవ్ వెళ్ళిన కాస్సేపటికి ఆమె ఆంద్రీతో ఇల్లా చెప్పింది.

"అబ్బ! ఈ మనిషికి మహా తొందర. చిచ్చులపిడుగు. సగం సగం పని అతనికి గిట్టదు. అతన్ని చూస్తేనే నాకేమిటో భయం."

"అవును. అతనిదగ్గర మహా దుడుకుంది. ముందూ వెనుకా ఎరగడు. అందుచేతనే నేనెప్పుడూ అతనిదగ్గర రికార్డు గుమాస్తా అనే సంగతెత్తను. వాడు నిజంగా గూఢచారి పనిచేస్తూ డబ్బు సంపాదిస్తున్నాడు" అన్నాడు ఆంద్రీ. "అతని పుట్టుపూర్వోత్తరాలల్లాంటివే. అతన్ని చిన్నప్పుడు ఆదరించినది పోలీసే కాదూ?" అందితల్లి. "కాని వైసోవికవ్ వాడినిచూస్తే ఊరికే వదలిపెట్టడు.... ఏంచేస్తాం? ఈ అధికారులు తెచ్చిపెట్టే కష్టాలు చూశావా? సామాన్య జనంలో ఎంత ద్వేషం పెంచేస్తున్నారో? వైసోవికవ్ లాంటి అమాయకులు తమ దురవస్థను గ్రహించి తెగబడ్డారంటే ఏమవుతుంది? అంతా ప్రమాదమే. భూమ్యాకాశాలు ఏకమైపోతాయి."

"అబ్బ! ఆంద్రీ, ఆదినములు మహాభయంకరములు కదా!"

"........అవును. ఇదివరకు వాళ్ళు ఈగల్ని మింగారు. అవి అరుగుతాయా? ఇప్పుడు దక్కుతారు........ఇంతకీ వాళ్ళ దేహంనుంచి చిందిన రక్తబిందువుల నన్నిటిని ప్రజల కన్నీళ్ళలో కడగవలసొస్తోంది. అదీ మాట!" అని చెప్పి ఊరుకుంది.

* * * *

ఒక శెలవురోజున తల్లి బజారుకెళ్ళి ఇంటికొచ్చింది. తలుపు తీసుకుని లోపలకొచ్చేసరికి సంతోషాతిశయంచేత ఆమె నిశ్చేష్టురాలైపోయింది. గదిలో పావెల్ మాట ఆనవాలుగా వినిపించింది. ఇంతలో నకోదా తల్లినిచూచి పావెల్‌ను హెచ్చరించాడు. తల్లి ఆశ్చర్యంతోనూ సంభ్రమంతోనూ 'వచ్చావా నాయనా!' అని దగ్గరకెళ్ళుతూంది. పాషాకు ఆమెను చూచేసరికి గుడ్లల్లో నీళ్ళు తిరిగేయి. నోటమాటరాలేదు. వెల్లబోయి కొయ్యబొమ్మలా కూచోబడిపోయాడు. తల్లికూడా ఏమీ మాట్లాడలేక అతనిముఖం కేసి చూస్తూవుంది. కొంచెంసేపు ఇద్దరూ అలాగే ఉండిపోయారు. ఇంతలో ఆంద్రీ ఈలవేసుకుంటూ దొడ్లోకి వెళ్ళిపోయాడు. చిట్టచివరకు పావెల్ ఆమె వీపు నిమిరి "అమ్మా! నీకనేక వందనాలు అనేక వందనాలు." అని మెల్లగా రెండుమూడుసార్లు అన్నాడు. తల్లి ఈ కృతజ్ఞతకు చాలా సంతోషించి పావెల్‌ను దగ్గరగా తీసుకొని అతని తల వేళ్ళతో నిమురుతూ "ఎందుకు నాయనా అల్లా అంటావు? నేనేంచేశాను? ఇంతకీ ఒకళ్ళు చేయడానికేముంది? నీ అంతటనువ్వు........" అని ఏదో చెప్పబోయింది. పావెల్ మాట కడ్డొచ్చాడు.

"అమ్మా! మా ఉద్యమాని కింతగా తోడ్పడినందుకు నీకు మేమెంతో కృతజ్ఞులం. నిజంగా మాతృసేవతవంటే నువ్వే."

తల్లి యేమీ మాట్లాడలేదు. అల్లాగే కొడుకును చూస్తూ కూచుంది.

"అమ్మా! నేను యింతకాలం నీదగ్గర చాలా ముభావంగా వున్నాను. నేను చేసేపనులు నీకు చాలా కష్టంగా వుంటాయని నే నెరుగుదును. కాని నేనేమి చెయ్యగలను? నా జీవితపద్ధతి నీకు యెప్పటికైనా నచ్చుతుందని నేననుకో లేదు. నచ్చడమేమిటి? మాతోపాటు యీలాగ కిం అనకుండా బాధయి పడతావని అసలే అనుకోలేదు. అందుచేతనే ఇన్ని విషయాలు నీకు నేను చెప్పలేదు.

"అవునవును! ఆంద్రీ నాకుచాలాసంగతులు చెప్పేడు"

"అతను నిన్ను గురించిగూడా చెప్పేడునాకు."

"ఈగర్ ది అసలు మావూరేసుమీ!....ఆంద్రీ నాకీమధ్య చదువుచెపుతానని ప్రారంభించాడు"

"అందుచేత నీకు కోపంవచ్చి నీలో నువ్వే చదువుకున్నావు కాబోలు!"

"ఓహో! సరిగ్గా కనుక్కున్నావే?" అంది తల్లి. "పాషా! ఆంద్రీని పిలువనా? అతను మనిద్దరినీ మాట్లాడుకోమనే వెళ్ళిపోయాడు. పాపం! అత నికి తల్లిలేదు"అంది. పాషా ఆంద్రీని పిలిచాడు. "వంటచెరుకైపోయింది. నేనా పని చూడాలి" అన్నాడు ఆంద్రీ.

"దానికేమీ తొందర లేదులెద్దూ! రా" అన్నాడు పావెల్. సరేనని ఆంద్రీ లోపలికొచ్చాడు. సంసారతాపత్రయం కలిగిన మనిషిలాగ వస్తూ వంట యింట్లోకెళ్ళి చూచివచ్చి "వంటచెఱకు తక్కువగావుంది. రేపు వైషోవికవ్ తో ఒక బండి వెయ్యమని చెప్పాలి. అమ్మా! పాషాను చూశావా? కాస్త ఒళ్ళు చేశాడు. మొఖం తేటపడింది. ప్రభుత్వం యీ ఆందోళకులను శిక్షించాలని జైళ్ళకు పంపుతారు. కాని నిజానికి వాళ్ళకే లాభం. బలిసొస్తారు" అన్నాడు.

తల్లి ఫక్కున నవ్వింది. ఆమె హృదయంలో ఆనందం పొంగిపోతోంది. సంతోషాతిశయంచేత తన శరీరం తానే మరచిపోయింది. సంతోషం యెక్కడైపోతుందో అనే భ్రాంతి కలిగి ఆమె సంతోషాన్ని కప్పిపుచ్చుకొని "లేవండి, భోజనం చేద్దాం. పాషా! నువ్విప్పటిదాకా ఏమీ తినలేదుకామా?" అని అడిగింది.

"లేదు. నిన్న వార్డరొచ్చి యివ్వాళ విడుదలనిచెప్పాడు. అప్పటినుంచీ యేమీ తినబుద్ధే వెయ్యలేదు" అని తల్లితోచెప్పి పావెల్ ఆంద్రీకేసి తిరిగి యిలా చెప్పేడు. "నాకు జైల్లోంచి రావడంతోనే మొదట కనబడింది సిజొవ్. అతను నన్ను చూడడంతోనే ప్రత్యేకంగా నాదగ్గరకొచ్చి పలకరించాడు. 'పోలీసు కావలాలో వున్నాను. మునుపటిలాకాదు జాగ్రత్త!' అని హెచ్చరించాను. మరేమీ ఫర్వాలేదన్నాడు అని తన మేనల్లుడినిగురించి అతడడిగిన సంగతులు వినితీరాలి.

'ఫెద్యా తిన్నగావున్నాడా' అని అడిగేను. తిన్నగా అంటే యేమిటో చెప్ప మన్నాను. "మరేంలేదు, తోటివాళ్ళమీద ఏమైనా వాగడంగాని, మరేమీ పేచీపూచీ లేకుండా వున్నాడా" అని వ్యాఖ్యానం చెప్పాడు. అలాంటి గండ్రగోళాలేమీ లేవని చెప్పేసరికి ఎక్కడలేని గర్వం అతని ముఖంమీదే కనుపించింది. మహాశీవిగా "మా వంశంలో చత్తాఖానీవాళ్ళు పుట్టనేలేదులే" అన్నాడు.

ఆండ్రీ, "ఆ ముసలాడు మహా గట్టివాడు. బలే సూక్ష్మబుద్ధి, అతనితో నేను తరుచు మాట్లాడుతూనే వుంటాను. మంచిరైతు. ఇంతకీ ఫెద్యాను కూడా ఇప్పట్లో వదలిపెడతారా?" అని అడిగాడు.

"ఆ, బహుశా ఈమధ్యే యెప్పుడో ఒకప్పుడు వదలిపెట్టేస్తారు. రికార్డు గుమాస్తా ఐసే తప్ప మరేమీ సాక్ష్యంలేదు. వాడుమాత్రం ఏంచెప్తాడు సాక్ష్యం?" అన్నాడు పావెల్.

తల్లి గదిలో పచారుచేస్తోంది. పావెల్ పచారుచేస్తూ ఏదో చెపుతున్నాడు. ఆండ్రీ అతని కబుర్లువింటూ కిటికీదగ్గర నిలబడ్డాడు. పావెల్ గడ్డం బాగా పెరిగి ఉంగరాలు చుట్టుకుపోయింది. కాస్సేపట్లో తల్లి ఏదో వేడిగావున్న పదార్థాన్ని తెచ్చి ముందుపెట్టి పావెల్‌ను, ఆండ్రీని తినమంది.

భోజనంచేస్తూ ఆండ్రీ పాషాతోటి రైబిన్ సంగతంతా చెప్పాడు. అంతా విన్నాక పావెల్ పెదిమెలు చప్పరించేశాడు.

"నేనుంటే అతన్నల్లా పోనివ్వనుసుమా? అతను కూడా పట్టుకెళ్ళిన దేముంది? అసంతృప్తి తప్ప. పైగా అతని బుర్రంతా కంగారే!" అన్నాడు పాషా.

"కాని నలభైయవపడి దాటినతర్వాత, మనిషిక్రిందా మీదా పడ్డాక, అతనిలో మార్పుతేవడం మాటలు కాదు" అని నవ్వుతూ నకోడా చెప్పాడు. పావెల్ ఒక్క సారి అతనికేసి తీవ్రంగా చూశాడు. "ఏమిటీ! మనుష్యుల బుర్రలోకి వెర్రి అభిప్రాయాలెక్కితే నచ్చచెప్పి వాటిని తొలగించడం అసంభవమే నంటావా?"

"పాషా! అట్టే అమాంతంగా ఎగరకు? ముందు వెనుకా చూసుకోకుండా యెగిరితే కాళ్ళూ చేతులూ విరుగుతాయి. జాగ్రత్త!" అని ఆండ్రీ కాస్త మందలించాడు.

వాళ్ళు చాలాసేపు యేవో సంగతులు చర్చించుకున్నారు. తల్లికిదంతా అయోమయంగా కనుపించింది. భోజనం అయిపోయింది. కాని చర్చ ముగియ లేదు. చర్చలో తల్లికి యీ క్రిందిమాటలు మాత్రం తెలిశాయి.

పా:—ఏమొచ్చినాసరే, మనం ముక్కుకు సూటిగా నడవాలిసిందే. దారి తప్పనే కూడదు.

ఆ:—ఏమిటీ? కుడీయెడమ లేకుండా సూటిగా ప్రజల్లో పడాలి? వాళ్ళు మన్ని శత్రువులను చూచినట్లు చూస్తారు.

పా :—అది ఎలాగా తప్పదు.

ఆ.—అయితే తమ తెలివితేటలన్నీ ఏమవుతాయండీ ?

తల్లి వాళ్ళమాటలు శ్రద్ధగా వింది. పాషాకి రైతులంటే అంశ్యమనీ, నకోడాకి వాళ్ళంటే అభిమానమనీ గ్రహించింది. రైతుల్లోకూడా ప్రబోధం చెయ్యాలంటాడు ఆంద్రీ. అతని మాటల్లోనే తల్లికి యెక్కువ సబబు కనిపించింది. వాళ్ళు మాట్లాడుకొనే ధోరణిచూస్తే కోపాలొచ్చి దెబ్బలాడుకుంటారేమో అనుకుంది. కాని వెంటనే ఒకళ్ళనొకళ్ళు పరిహాసకం ఆడుకుంటుండటం చూచి సంతోషించింది.

౧౫

వసంతకాలం దగ్గరపడింది. యేప్రిల్‌మాసం. రష్యాదేశంలో అప్పుడే మంచుకరుగుతుంది. సూర్యుడు కొంచెం తీక్షణంగా కనిపిస్తాడు. సెలయేళ్ళు సంగీతాలు పాడుకుంటూ ప్రవహిస్తుంటాయి. వసంత సౌఖ్యానికి జనులువ్విళ్ళూరుతూ ఉంటారు.

మేనెల ఒకటవతేదీ ఉత్సవం జరిపించడానికి పావెల్ ప్రభృతులు ప్రయత్నాలు చేయడం మొదలెట్టేరు. ఆ ఉత్సవం యెందుకు చెయ్యాలో, దాని ఉద్దేశ్యమేమిటో తెలియచేసే కరపత్రాలు ఫ్యాక్టరీలోకి కుప్పలు తిప్పలుగావచ్చి పడ్డాయి. అవి చదువుకున్న తర్వాత అంతకుముందు ఏమీ తెలియని యువజనులందరికీ ఉత్సవంలో పాల్గొనాలని బుద్ధిపుట్టింది. నికోలే వైషోవికవ్ చాలా జోరుగా వున్నాడు. ఈదెబ్బతో కల్తో బద్దో తేలాలిసిందేకాని, ఈముసుగుల్లో గ్రుద్దులాట ఈ దాగుడుమూతలు పనికిరావంటున్నాడు. ఫెడ్యామాజిన్ చాలాఉషారుగాఉన్నాడు. జైల్లోంచి వచ్చేసరికి మనిషి పలుచబడ్డాడు. అతని ధోరణంతాచూస్తే పంజరంలోనుంచి బయటబడ్డ పక్షిలా రంయిమన్నాడు. అతనూ, యాకూబ్, సోమోముగ్గురూ యెప్పుడూ కలుస్తుండేవాళ్ళు.

ఉత్సవం విషయంలో అభిప్రాయభేదం వచ్చింది. శామొలో, గానెవ్, ద్రేగనాల్ మొదలయినవాళ్ళు కొందరు "ఆయుధ" సహితంగా ఉత్సవం సాగించాలన్నారు. పావెల్, నకోడా, సోమో మొదలయిన వాళ్ళంతా ఆయుధాల్లేకుండా ఉత్సవం జరిపాలన్నారు. ఇలా ఉండగా ఆయాసంతో ఒగుర్చుకుంటూ ఈగర్ వచ్చి వేళాకోళంగా మాటాడడం ఆరంభించాడు.

"లోకాన్ని మరామతుచేయటం గొప్పపని. ఆపని చురుకుగా జరగాలంటే నేనొక కొత్తబూట్సులజోడు కొనుక్కోవాలి. ఆయుధాలపేరు చెప్పవెరుగును. ముందు నేను చెప్పులుకొనుక్కొని సిద్ధంగా ఉండాలి. ఈ పాతపద్ధతులన్నీ మారిపోయేవరకు ఈలోకం విడిచిపెట్టి, వెళ్ళడం నాకిష్టంలేదు. కనుక నేను శామొలో

తీర్మానాన్ని ప్రతిఘటిస్తున్నాను. ఆయుధాలకు బదులు నేను క్రొత్త చెప్పులజోడు కొనుక్కురావాలని నా సలహా. సామ్యవాదానికిదే మొదటి విజయం"

అటుతర్వాత హాస్యంగా ఇతరదేశాల్లో కూలినాలి జనం తమ స్థితిని బాగు చేసుకోవడానికి చేసే ప్రయత్నాలను కథలుగా చెప్పాడు. ఆకథలు వింటూంటే తల్లికి చాలా ఆనందం కలిగింది. ఈసంగతులువిన్నాక తల్లికి భూస్వాములన్నా, ధనికులన్నా పరమఅసహ్యమేసింది. బీదజనాన్ని దగాచేసేవాళ్ళూ, బాధించేవాళ్ళూ వీళ్ళే అనుకుంది. చక్రవర్తి అధికారం ఉన్నంతకాలం వీళ్ళ ఆటమేమీ సాగేది కాదు. అందుచేత వీళ్ళు జనాన్ని రెచ్చగొట్టి, జారును పడగొట్టేరు. జారు పడిపోవడంతోనే ఏదో మోసంచేసి అధికారాన్ని తమచేతుల్లోకి తెచ్చుకుని ప్రజలను త్రోసిరాజన్నారు. ప్రజలు కాస్తమేలుకొని 'ఏమిటయ్యా ఈపని' అని అడిగితేనే వేలకొద్దీ జనాన్ని చంపిపారేస్తున్నారని నిర్ధారణచేసుకుంది. తన అభిప్రాయం సరిగాఉందో లేదో నిర్ధారణ చేసుకోవాలని ఈగర్ ఇవానిష్ నడిగింది.

"వహావ్వా! మాబాగా కనిపెట్టేవు కామా ? సరిగా అదేతంతు: అంతే. ఈ ధనికులు, యీమధ్యతరకం భూస్వాములు పెట్టుబడిదార్లు మనడబ్బు బాగాతిని రాంబోళ్ళలా పొట్టలుపెంచి కూచుని ప్రజలను దగాచేస్తున్నారు. మహాపాపులు, దగాకోర్లు వీళ్ళే. మానవసంఘానికి చెదపురుగులు వీళ్ళే. వీళ్ళనే పరాసులు "బూర్జువా" * అంటారు. ఈమాట బాగా జ్ఞాపకంపుంచుకో" అన్నాడు. ఈగర్.

"అంటే ధనికులనేనా ?"

"అవునుధనికులే. అది వాళ్ళపాపం. చిన్నప్పుడు రాగిడబ్బులతో పోషణ చేస్తేనే ఎదుగూ బొదుగూ వుండదు. కాస్తవయసొచ్చి బంగారం కళ్ళచూస్తుంటే హృదయమే నశించిపోతుంది."

అని ఈగర్ తల్లికి బాగా నచ్చచెప్పాడు.

ఒకసారి పావెల్ ఈగర్నుగురించి ఆంద్రీతో "ఆంద్రీ! హృదయంలో యెక్కువ ఆవేదనకలవాళ్ళు యెక్కువగా నవ్వులాడుతూ వుంటారు సుమా" అన్నాడు. ఆంద్రీఅదాలోచించి "అలాగైతే రష్యాఅంతాకూడా నవ్వుతో కడుపు చెక్కలు కావలసిందే" అన్నాడు.

* * *

నటాషాకూడా తిరుచు ఇంటికొచ్చేది. ఆమెకూడా ఇంకొక పరగణాలో జైల్లోపడివచ్చింది నటాషా వున్నంతసేపూ నకోడే చాలా సరదాగా మాట్లాడుతూ వుషారుగా వుండడం తల్లికనిపెట్టింది.

శశాంకకూడా అప్పుడప్పుడు వస్తూవుండేది. ఎప్పుడొచ్చినా హడావిడిగా వచ్చేది ఏదో తీవ్రత ముఖంమీద తాండవమాడుతూ వుండేది ఒకసారి శశాంక

* బూర్జువాలంటే మధ్యరకం మనుష్యులు. ధనికులకు అండగా వుండేవాళ్లు.

వెళ్ళిపోతుంటే దిగబెట్టడానికి పావెల్ వసారాలోకొచ్చాడు. వాళ్ళిద్దరూ ఇల్లా మాటాడుకుంటూవుంటే తల్లివింది.

శశాంక :—జండా నువ్వు పుచ్చుకుంటావు కాదూ ?

పావెల్ :—అవును.

శ :—నిశ్చయమేనా ?

పా:—అహా, అది నాహక్కే !

శ :—అంటే మళ్ళీ జైలుకన్నమాట.

పావెల్ మాట్లాడలేదు.

శ :—పోనీ యీసారికి నువ్వు మానేసి..........

పా:—ఏమిటీ ?

శ :—ఈసారి కింకొకళ్ళ కివ్వకూడదూ ?

పా:—(బిగ్గరగా) వల్లకాదు. ముమ్మాటికి వల్లకాదు.

శ :—బాగా ఆలోచించు! నీకు చాలాపలుకుబడుంది. నలుగురికీ నీవంటే చాలా ఇష్టం. నీమాటంటే బాగా గురుంది అందరికీ. ఇక్కడుండే విప్లవకారులలో కల్లా నువ్వూ, నకోడా ముఖ్యులు. మీరిద్దరు బయటవుంటే స్వాతంత్రోద్యమానికి చాలా పనిచేయగలరు. బహుశా యీసారి మిమ్మల్ని యేసైబీరియాకో పంపితే పంపవచ్చు. శిక్షకూడా గట్టిగానే తగిలిస్తారు!

(ఈ సంభాషణ వింటూంటే తల్లికి కడుపు తరుక్కుపోయింది. శశాంక మాటలలో ప్రేమపూర్వకమైన ఆత్రత, భయం ఆమెకు కనుపించింది)

పా:—ఏమైనాసరే, నేను నిశ్చయించుకున్నాను. ఒక్కసారి నిశ్చయించుకున్న తర్వాత యెవ్వరూ తప్పించలేరు.

శ :—ఏమిటీ! నేను బ్రతిమాలినానా!........నేను....

పా:....(కొంచెం నిష్కర్షగా) నువ్వల్లా మాట్లాడనే కూడదు. నువ్వైతేమాత్రం? నువ్వు అలా అనకూడదు.

శ :—(మెల్లగా) ఎంతైనా నేనూ మనిషినే మరి.

పా:—అవును. మంచిమనిషివికూడాను. అందులో నాకు మరీ ప్రియమైనదానవు కూడాను. కనుకనే నువ్వల్లా మాట్లాడకూడదు.

శశాంకను పావెల్ కొంచెం బుజ్జగించేడు. ఆమె శలవుతీసుకొని వెళ్ళిపోయింది. పావెల్ వీధి గుమ్మందాకా దిగబెట్టేడు.

ఇదంతా వింటున్న తల్లికి గుండెల్లో రాయిపడింది. వాళ్ళేవిషయమైమాట్లాడుకుంటున్నారో ఆమెకు బాగా అర్థంకాలేదు. కాని తనకేదో మళ్ళీ ముప్పు వస్తుందని మాత్రం తోచింది పాషా ఏమిచెయ్యదలచుకున్నాడా అని ఆమె కనుమానం కలిగింది. ఏమీ తోచక వంటయింటి కిటికీలోంచి ఆకాశంకేసి చూస్తూ నిలబడిపోయింది.

పావెల్ అంద్రీలు వీధిగుమ్మంలోంచి, లోపలకొస్తూ, రికార్డు గుమాస్తా ఐసే విషయంలో ఏమిచెయ్యాలా అని ఆలోచించారు. పావెల్ ఐసేకోటి ఆపని మానెయ్యమని చెప్పాలన్నాడు. అలాచేస్తే వాడు మనందరినీ అధికారులకు వప్ప చెపుతా డన్నాడు అంద్రీ.

ఇంతలో తల్లి "నాయనా పాషా! ఏం చెయ్యదలచుకొన్నావు? అని తల వంచుకొని అడిగింది.

"ఎప్పుడు? ఇప్పుడా?"

"కాదు. మే 1 వ తేదీని"

"ఓహో, నువ్వు విన్నావా? నేను జండా పుచ్చుకోబోతున్నాను. ఆరోజున జరిగే ఊరేగింపుకు నాయకత్వం వహించబోతున్నా. బహుశా అందుకోసం మళ్ళీ అరెస్టుచేసి జైలులో పెడతారనుకుంటాను." అని మెల్లగా పాషా తల్లితోచెప్పాడు. తల్లికి కళ్ళు తెరలు గప్పినట్లయింది. నోరెండి పోయింది. పావెల్ ఆమెచెయ్యి పట్టుకొని "అమ్మా! నేనాపని చేసితీరాలి. ఆ పనంటే నాకు చాలా సంతోషం అన్నాడు.

తల్లి "నేనేమీ అనడంలేదు నాయనా?" అని మెల్లగా అతని ముఖంకేసి చూసి చెప్పింది. అట్టేసేపు చూడలేక తల వాల్చుకుంది. పావెల్ ఆమెచెయ్యి వదిలి "అమ్మా! నువ్వు విచారపడకూడదు. పైగా సంతోషించాలికూడాను. దేశం కోసం, సంఘంకోసం తమ బిడ్డలప్రాణాల నర్పించి గర్వించే తల్లుల్ని ఎప్పుడు చూస్తామోకదా?" అన్నాడు.

"గుఫ్! చుప్! ఓహో చాలా జోరుగా యెగురుతున్నావే?" అని అంద్రీ వేళాకోళం చేశాడు.

"నాయనా! ఎందుకిదంతాను? నేనేమైనాఅన్నానా? నేను నీకేమీ అడ్డు రాను. నీ విషయమై నే విచారపడుతున్నానా అంటే అది తప్పదు. కడుపుతీపి అల్లా ఏడిపిస్తుంది...." అంటూ తల్లి ఒక్క నిట్టూర్పువిడిచింది పావెల్ వెనక్కి తిరిగి "మానవజీవితాని కద్దొచ్చే ప్రేమ ఒకటుంది" అన్నాడు.

ఇంకా యేమి భయంకరమైన సంగతులు వినాలిసొస్తుందో యని తల్లి గడగడలాడింది.

"పాషా! నువ్వేమీ చెప్పనక్కరలేదు. నాకు తెలిసింది. నీ మిత్రులకోసం నువ్వాపనిచేయక తప్పదనుకొంటాను.

"కాదుకాదు. నా మిత్రులకోసంకాదు. నాకోసమే. నాకోసమే నేను జండా పుచ్చుకోదలచుకున్నాను" అని చాలా కంగారుగా చెప్పేసి గదిలో కెళ్ళిపోయాడు. గదిగుమ్మంలో నిలబడ్డాడు అంద్రీ. పావెల్ మీద అతనికి చాలా కోపంవచ్చి అతని కేసి కోరచూపు చూశాడు. "ఏమందోయి అయ్యా! ఈపాటికీధోరణింక చాలిం చండీ" అన్నాడు.

తల్లికి బావురుమని యేడ్వాలన్నంత దుఃఖం వచ్చింది. కాని తన కొడుక్కే-మేం కష్టం కలుగుతుందో నని యేడ్పు అపుకుని లోపలికే మ్రింగుకుపోయింది. తన గదిలో ఒకమూలంగా కూచుని యెవరికీ వినబడకుండా నోరు నొక్కుకుని యేడ్చి యేడ్చి సొమ్మసిల్లింది. మరి ఆ తల్లి కండ్లలోంచి రాలినవి కన్నీళ్ళో రక్త బిందువులో ఆ భగవంతుడికే తెలియాలి.

ఆ రాత్రిలో పావెల్, నకోదాలు గదిలో ఏదో చర్చ పెడుతున్నారు. ఈ క్రింది సంభాషణ ఆమె చెవుల్లో పడింది

నకోడా:—"ఏమన్నావోయి. ఆ ముసలి పంతు నల్లా క్షోభపెట్టడం మహాగొప్పను కుంటున్నావా"

పావెల్:—ఇవ్వాళ్లా మాట్లాడడం సబబుకాదు.

నకోదా:—నువ్విల్లా తెలివితక్కువగా మాట్లాడుతూ వుంటే నేను చూస్తూ ఊరు కున్నట్టయితే నేను నీకు నిజమైన స్నేహితుణ్ణి కాను. ఈ మాటలన్నీ నువ్వు మీ అమ్మ కెందుకు చెప్పాలి ?

పా:—మనిషైనవాడు మంచివచ్చినా, చెడ్డవచ్చినా ఏ సంగతొచ్చినా నదురూ బెదురూ లేకుండా మాటచెప్పేసెయ్యాలి నీళ్ళు నమిలి ప్రయోజనంలేదు.

న:—ఎవరితోటి ? ఆ ముసలమ్మతోనా ?

పా:—ఎవరితోనైనా నేమిటి ? ఎవరైనా సరే నా కొకటే. నేను ఏదైనా ఒకపని చేయదలుచుకున్నాక నన్ను వెనక్కి లాగేటట్లయితే నాకు స్నేహితులూ అక్కరలేదు. బంధువులూ అక్కరలేదు. ప్రేమబంధనాలు తెంపేసు కోవడమే.

న:—ఓహో ! మహా గొప్ప వీరుడవులే. ఈ మాటలు ఆ శశాంక దగ్గరకెళ్ళి చెప్పరాదూ ?

పా:—చెప్పాను.

న:—చెప్పేవులే. కాని మీ అమ్మదగ్గర మాట్లాడినట్లే మాట్లాడేవా ? లేదు. ఆమెతో మెల్లగా మాట్లాడి వుంటావు. నువ్వు మాట్లాడుతూవుంటే నేను వినలేదు కాని మీ అమ్మ దగ్గర మాత్రం నీ శౌర్యం అంతా జమనిపించే లావు. నీ వీర్యం శౌర్యం దిమ్మడికి కొరగాదు సుమా !

ఈ సంభాషణ విని తల్లి పావెల్ నకోడాలు దెబ్బలాడుకుంటారేమో అను కుంది. అల్లాంటి అవాంతరం రాకుండా తాను గదిగుమ్మదగ్గర కొచ్చి ఏదో సవరిస్తూ, వాళ్ళకి వినిపించేటట్లుగా "ఏంచలి ! అబ్బ ! వసంతకాలంలో యీ చలేమిటి ? జనంలో వేడెక్కుతోంది. గాలి చల్లబడుతోంది" అంది.

ఏదో మాట్లాడుతున్నదని పావెల్ నకోడాలు మాటలు మానేశారు. "అబ్బ యేంచలి !" అని వణుకుతూవచ్చి తల్లి వాళ్ళిద్దరినీ "టీ త్రాగుదురుగాని రండి" అని పిలిచింది.

పావెల్ మెల్లగా తల్లిదగ్గరకొచ్చి ఓరచూపులు చూస్తూ "అమ్మా! నన్ను క్షమించు. నేను కుర్రాడిని. అవివేకిని" అని చెంపకాయలు వాయించుకున్నాడు.

తల్లి పాషాను దగ్గరకు తీసుకుని ఏడుస్తూ ఇలా చెప్పింది.

"నాయనా! నాకు బాధకలిగించకు! నువ్వేమీ నాకు చెప్పనక్కరలేదు. దేవుడు నీకు తోడ్పడాలి. నీ బ్రతుకు నీది. నా హృదయానికి మాత్రం నొప్పికలిగించకు. కొడుకుకోసం తల్లి ఏడ్వకుండా యెల్లాఉంటుంది? అసంభవం. మీఅందరికోసం కూడా నేను విచారపడుతూనే ఉన్నాను. మీరంతా నాకు రక్తస్పర్శగల బంధువులు లాగే ఉన్నారు మీరంతా యెంతో మంచివాళ్ళు నీకోసం నేను విచారించకపోతే యెవరు విచారిస్తారు? నువ్వు ముందెడతావు. నీవెనుక మిగతావాళ్ళు వస్తారు వాళ్ళంతా సామాన్యులా? తమ ఆస్తిపాస్తుల నన్నిటినీ వదులుకొని ఇందులో పడుతున్నవాళ్ళేకాదూ? ఇదొక పవిత్రమైన మహోత్సవం"

ఈమాటలు చెపుతూండే ఆమె హృదయంలో ఏదో గొప్ప ఊహపుట్టింది. ఒక విధమైన ఆనందం, దుఃఖం కలిసివచ్చేయి. కాని పైకి చెప్పడానికి నోరు మాత్రం రాలేదు. కొడుకుమొఖంకేసి రెప్పవాల్చకుండా చూసింది. పావెల్ "అమ్మా క్షమించు. నాకిప్పుడంతా అర్థమైంది. నువ్వు ఇప్పుడు చెప్పినమాటలను మరచి పోనులే" అని నవ్వుతూ నెమ్మదిగా చెప్పాడు

తల్లి పావెల్‌ను వదిలేసి ఆంద్రీతో "అబ్బాయీ! నువ్వు పాషామీద అల్లా కేకలెయ్యకూడదు. అతనికన్న నువ్వుపెద్దవాడవు. కనుక...."అంటూ యేమేమో చెప్పబోయింది ఆంద్రీమాట కడ్డొచ్చి "ఆహా! అతన్ని కేకలేయడమేకాదు. వీపు బద్దలుకొట్టాలికూడాను!" అని కోపం నటించాడు తల్లి ఆంద్రీని వంటఇంట్లోకి తీసుకెళ్ళింది అతను టీ కాచడానికి కుంపటి ఊదడం ఆరంభించాడు. పావెల్‌ను లోపలికి రావద్దని కేకేసి "అమ్మా! భయపడకు. నేనతని ఒంటిమీద చెయ్యి వెయ్యను. నేను చాలా మంచివాడిని. అతనంటే నాకు చాలా ప్రాణం కాని అతని పైవేషం నాకిష్టంలేదు. అతనొక క్రొత్త చొక్కా తొడుక్కున్నాడు. అది అతనికి బాగా నచ్చింది. అందుమాత్రాన అందరిదగ్గరకివెళ్ళి "ఇదిగో నాచొక్కా ఎంత బాగుందో అని దబ్బావాయించడ మెందుకు"అని తల్లికి వినవేసి కోపం లేదని నచ్చచెప్పాడు

పావెల్ నవ్వుతూ లోపలికొచ్చాడు "ఏమిటోయి వాగుడు? ఒక్కదెబ్బ కొట్టేవుచాలునా?" అన్నాడు.

ఆంద్రీ మాట్లాడలేదు. పావెల్ అతనిచెయ్యి పట్టుకున్నాడు.

"నాచెయ్యి వదలు" అన్నాడు ఆంద్రీ

"ఎందుకంత సందేహం? మీరిద్దరూ ఒక్కసారి కౌగిలించుకోండి" అంది తల్లి.

"ఏమంటావు?" అన్నాడు పాషా.

"దానికేముంది" అని ఆంద్రీ లేచాడు.

ఇద్దరూ ఒక్కసారి గట్టిగా కౌగలించుకున్నారు. రెండు శరీరాలే కాని ఆత్మ ఒక్కటైపోయింది.

తల్లి కళ్ళనుండి ఆనందాశ్రువులు జలజల రాలినాయి.

"ఆడవాళ్ళకి యేడ్వడం చాలా యిష్టం. ఈ యేడుపు సంతోషం వచ్చినా వస్తుంది, దుఃఖంవచ్చినా వస్తుంది".

అనుకుంటూ పాషాను దగ్గరతీసుకొని వీపుమీదచెయ్యేసింది. మొదటేమిటో విచారం కలిగిందికాని మళ్ళీ సంతోషం వచ్చింది.

"అమ్మా! భోజనం ప్రయత్నం నేచేస్తానుగాని నువ్వు కాస్సేపు విశ్రాంతి తీసుకో, అంటూ ఆంద్రీ గదిలోకొచ్చాడు. గదిలోనుంచి ఆంద్రీ, యివతలనుంచి తల్లీ పావెల్ ముగ్గురూ యిల్లా మాట్లాడుకున్నారు.

ఆం:— మనం అట్టే అనుకోకూడదు కాని నిజంగా జీవితమంటే ఇదే జీవితం. సత్యస్వరూపమై ప్రేమమయమైన జీవితం అంటే ఇదే. మహబాగుంది.

పా:— అవును.

తల్లి:— ఇప్పుడంతా మారిపోయింది. దుఃఖం వేరే, సుఖం వేరే. నాకేం తెలియదు కాని అసలు మనమెల్లా బ్రతుకుతున్నామో నా కర్థమే అవడంలేదు. నా ఉద్దేశ్యాలు చెప్పడానికి మాటలే రావడంలేదు.

ఆం:— "అమ్మా! అది అల్లాగే వుండాలి. మనుష్యులలో యిప్పుడొక క్రొత్త హృదయం పుట్టిపెరుగుతోంది. ఇంతవరకు ప్రజల హృదయాలు దురాశ, దురాగ్రహం, అసత్యం, పిరికితనం మొదలైన అవలక్షణాలవల్ల పీడింపబడుతున్నాయి. ప్రజలు యీ బాధలన్నీ పడుతూ యెవడి గొడవలు వాళ్ళు చూచుకుంటూ అంధకారంలో పడి కొట్టుకుంటున్నారు. ఎవరినొప్పి వాళ్ళకే కాని రెండోవాళ్ళ నొప్పి యెరుగకుండా వున్నారు. కాని యిప్పుడుచూడు! ఇప్పుడొక దివ్యవాణి వినిపిస్తోంది. యెవ్వడో ఒకడు బయలుదేరి, "నాయనలారా! మనుష్యులంతా ఒకటే. అందరూ బ్రతకాలి అందరూ వృద్ధిపొందాలి! అని హెచ్చరిస్తూ జీవితాన్ని వికసింపచేస్తున్నాడు. మొట్టమొదట యీకేకవేశే మహానుభావుడొక్కడే, కాని క్రమంగా అనేకమంది అతని కేకనాలకించి అతని వెనుక చేరుతారు. అందరూ ఏకమయ్యేసరికి ఆ ఐక్యతలోనుంచి గొప్ప సందేశం బయలుదేరుతుంది."

"ప్రపంచంలో వున్న మనుష్యులారా, మీరంతా ఒక్కటికండి! ప్రేమయే జీవితానికి మాతృస్థానం అనే యీ సందేశం సర్వవ్యాప్తమవుతుంది పాషా! అదిగో యిప్పుడే నాకు ఆధ్వని వినిపిస్తోంది."

పా:— నాకూ వినిపిస్తోంది............నేను రాత్రిళ్ళు ఒంటరిగా పడుకున్నప్పుడు,

నడుస్తున్నప్పుడు నాకు యీ సందేశం వినబడులోంది. విన్నప్పుడు నా హృదయం ఉప్పొంగిపోతుంది.

అంటూ పావెల్‌లేచాడు. తల్లి అతని చెయ్యిపట్టుకునిలాగి దూచోపెట్టింది. నకోడా యేదో చెప్పుతున్నాడు వినమంది. నకోడా ఇలా చెప్పేడు.

"ప్రజలింకా బాధలుపడవలసిందే. దురాశాపరులు ప్రజల రక్తాన్ని యింకా ప్రవహింపచేస్తారు. కాని మనం చేయవలసిన త్యాగం, పడవలసిన బాధ, జరగబొయ్యే రక్తపాతం—అంతాకూడా మన హృదయాలు కోరుకునే దివ్యఫలానికి తగినంత విలువకాదు. ఆకోరిక నా హృదయంలో, నామనస్సులో. నాశల్యాల్లో కూడా వ్యాపించివుంది. ఆ కోరిక సిద్ధించడంకోసం ఏబాధలనైనా పడతాను. యెందుచేతనంటే యీ బాధలోనే నాకొక అచంచలమైన ఆనందంకూడా వుంది. ఈ ఆనందంలోనే బ్రహ్మాండమైన శక్తికూడావుంది." టీ త్రాగి ముగ్గురూ బల్ల దగ్గరకూచుని అర్ధరాత్రిదాకా ఇలాగే ప్రజలనుగురించీ, జీవితాన్నిగురించీ, రాబొయ్యే కాలాన్నిగురించీ కులాసాగా మంచీచెడ్డా మాటాడుకున్నారు.

## ౧౬

తల్లి ప్రాపంచక విషయాల్నిగూర్చి స్వయంగా ఆలోచించడం మొదలెట్టింది. ఏదైనా ఒకఆలోచన స్ఫురించినప్పుడు ఆలోచనకీ తన అనుభవానికీ పోల్చి చూచుకునేది. ఒకరోజున ఆమెతండ్రి పెండ్లినాడన్న ఈక్రింది మాటలు జ్ఞాపకానికొచ్చాయి.

"ఎందుకల్లా ముఖం ముడుచుకుంటావు? నిన్ను పెళ్ళిచేసుకోడానికి తయారుగాఉన్న మూర్ఖుడొకడు దొరికాడు. వాడిని పెళ్ళిచేసుకో. ఈడువచ్చిన ఆడపిల్లలంతా మొగుళ్ళని చూసుకోవలసిందే, పిల్లల్ని కనవలసిందే. ఆపిల్లలు తల్లిదండ్రులకు భారం కావలసిందే."

ఈమాటలు తనతండ్రి చెప్పినపుడు ఆమె ఎదుట ఏదో అంధకారబంధురమైన మార్గమొకటి కనబడింది కాని ఆదారిని నడవడం తప్పనిసరి అనిలోచింది. అలాంటిభావమే యిప్పుడుకూడా ఆమెకు కలిగింది. ఏదో మహాప్రమాదం వస్తుందని ఆమెకు స్ఫురించింది యేదో తనలోతానే గొణుక్కుంది.

మరునాడు ఉదయం పావెల్ ఆంద్రీ బయటకెళ్ళిన కాస్సేపటికి మేరీ కార్సునోవా హడావిడిగా లోపలికొచ్చింది. వస్తూనే కంగారుగా 'ఐసేని చంపేశారు' అంది

"ఎవరు?" అని తల్లిగడగడ లాడుతూ అడిగింది.

"ఎవరో! చంపినవాడు అక్కడ కూర్చున్నాడేమిటి? ఒక గ్రుద్దేశాడు. పారిపోయాడు"

*           *           *           *

రోడ్డుమీద మేరీ యిలా చెప్పింది.

"ఇకవాళ్ళు హంతకుడికోసం కొంపలన్నీ గాలిస్తారు. నిన్నరాత్రి మీవాళ్ళంతా ఇంట్లోవుండడం కొంతనయమే. నిన్నరాత్రి 12 గంటలయిన తర్వాత నేను కిటికీలోంచిచూచాను. మీరంతా బల్లచుట్టూ కూచుని మాటలాడుకుంటున్నారు. నేను సాక్ష్యంకూడా చెప్పగలను."

తల్లి వులికిపడి "ఏమిటీ మేరీ! మావాళ్ళకీ అల్లాంటిపనులకీ, సంబంధం వుంటుందని మాటవరుసకైనా యెవరనగలరు?" అంది.

"అయితే అసన్నెవరు చంపేరేమిటి? మీవాళ్ళలోనే యెవరో ఒకరు చంపివుండాలి. ఐసే వాళ్ళని వెంటాడించి వేపుకతింటున్నాడని అందరికీతెలుసు" అని కార్సునోవా తనకు మహాస్పష్టంగా తెలిసినట్లు అనేసింది.

తల్లిగుండె గుభాలుమంది. ఒక్కక్షణంఆగి గుండెలమీద చెయ్యేసుకుంది.

"ఏం భయంలేదులే! ఎవళ్ళు తొందరపడితే వాళ్ళే అనుభవిస్తారు. త్వరగా వెడదాంపద; లేకపోతే శవాన్ని తీసుకెళ్ళిపోతారు" అంది కార్సునోవా. తల్లి తాను యెందుకెడుతోందో ఆలోచనే లేకుండా ఆమెవెంట వెళ్ళింది. దారి పొడుగునా ఆమె మనస్సంతా పైషోవికవ్ మీదేవుంది. బహుశా అతనే యీపని చేసివుంటాడని ఆమె నమ్మకం

ఫాక్టరీ ప్రహరీగోడదగ్గరగా, కాలిపోయిన కొంపొకటుంది. ఆ ఖాళీ స్థలంలో జనం పెద్ద గుంపుచేరారు జనం గొల్లుమని గోలచేస్తున్నారు. చాలా మంది ఆడవాళ్ళు, పిల్లలు కూడా చేరారు. ఆ గుంపులో పోలీసులుకూడా ఉన్నారు. ముసలి సార్జెంటు పెట్లిన్ దీపస్తంభంలా నిలబడున్నాడు. ఆ గుంపుమధ్య ఒక కాలిపోయిన స్తంభానికి వీపుచేరబడి రికార్డు గుమాస్తా ఐసే పడున్నాడు. మెడ ప్రక్కకు పడిపోయింది. పంట్లాం జేబులో చెయ్యి అలాగేఉంది.

తల్లి ఐసే ముఖంకేసి చూసింది. కళ్ళువాగా తెరువబడున్నాయి. నోరు సగం తెరువబడుంది ఆ కళేబరం చూసేసరికి ఆమెకెంతో జాలేసింది. అతడు బ్రతికున్నపుడు ఆమె కసహ్యంవేసింది కాని శవాన్ని చూస్తేమాత్రం, "అయ్యో పాపం" అనిపించింది

"రక్తం ఎక్కడా కనుపించదే! బహుశా ఎవరో గుద్ది చంపేసినట్లున్నారు" అని గుంపులో ఎవరో అన్నారు.

ఒక స్థూలదేహంగల ఆడమనిషొచ్చి పోలీసు చెయ్యి లాగి "ఇంకా ప్రాణం ఉందేమో?" అంది.

"పోపో!" అన్నాడు పోలీసు.

"డాక్టరొచ్చి చచ్చిపోయాడని చెప్పేశాడు" అని ఎవరో ఆ ఆడమనిషికి సమాధానం చెప్పాడు.

"బహుశా గొంతుకు నొక్కేసుంటారు. దుర్మార్గుడి గతేమవుతుంది? మహబాగా అయింది!" అని యే మూలనుంచో మాట వినబడింది.

పోలీసుకు పట్టరాని కోపంవచ్చింది. దగ్గరున్న జనాన్ని ఒక్కతోపు తోసేసి "ఎవరది ? ఆమాటన్నదెవరు ?" అంటూ చిందులుత్రొక్కాడు ఎవరూ మాట్లాడలేదు. ఎవరిమట్టుకువాళ్ళు దారితీశారు. ఆ గుంపులో ఎవరో వేళాకోళంగా ఒక్క నవ్వునవ్వారు; తల్లికూడా ఇంటికి చక్కావచ్చేసింది. ఐసే చచ్చిపోతే ఒక్కడూ విచారించ లేదేమా అనుకుంది. ఆమె ఆలోచనమాత్రం వైషోవికవ్ మీదే ఉంది.

కొంచెంసేపట్లో పావెల్, ఆంద్రీ భోజనానికొచ్చారు. వాళ్ళు రావడంతోనే తల్లి 'ఐసే హత్యకి ఎవరినైనా అరెస్టు చేశారా ?" అని అడిగింది.

"మాకేమీ తెలియనే లేదే" అన్నాడు ఆంద్రీ. "వైషోవికవ్‌ను గురించి యేమీ చెప్పుకోవడం లేదుకదా ?"

"ఏమీలేదు. అతని సంగతే యెవరూ తలపెట్టడం లేదు. నిన్న అతనేదో ఊరెళ్ళేడు. తిరిగి రానేలేదు. నేనతని కోసం వెదికేను కూడాను." అన్నాడు పావెల్.

తల్లి బ్రతుకుజీవుడా అనుకొని ఒక నిట్టూర్పువిడిచింది. ఆంద్రీ ఆమెకేసి చూచి తలవంచు కున్నాడు.

"ఐసే అక్కడ వెల్లకిల పడుకున్నాడు. కాని ఎవ్వరూ 'అయ్యో పాపం' అనేవాళ్ళులేరు. ఒక్కడైనా ఆతన్ని మంచి వాడనేవాడు లేకపోయాడు. నిర్భాగ్యుడు! చిళ్ళపెంకులాగు దిక్కుదివాణం లేకుండా పడున్నాడు." అంటూ తల్లి తాను చూచివచ్చిన సంగతులన్నీ చెప్పింది.

పాషా, ఆంద్రీ భోజనానికి కూచున్నారు. పాషా భోజనం చేస్తూ చేస్తూ గభాలున చెంచా క్రిందపడేసి,

"అదే నాకర్థమవడం లేదు." అన్నాడు.

"ఏది ?" అని ఆంద్రీ అడిగేడు.

"వేడుకకోసం ప్రాణాలుతీయడం. యేదైనా క్రూరమృగాన్ని చంపడానికి నాకేమీ అభ్యంతరంలేదు. మనుష్యుడు పశువైపోయి, జనాన్ని పీక్కుతింటూంటే, అల్లాంటివాడిని చంపిపారెయ్యడానికి నాకేమీ అభ్యంతరంలేదు. కాని ఇల్లాంటి అల్పజీవుల్ని చంపడం మాత్రం నా కెంతమాత్రం యిష్టంలేదు. అల్లాంటివాళ్ళను చంపడానికి మరిచేతులెట్లా వస్తాయో నాకు తెలియదు."

"ఐసే క్రూరజంతువుకన్న యేవిధంగా మెరుగు ?"

"అవును, ఏమీ మెరుగుకాదు."

"ఒక్క క్షణం వంటిమీద వాలి కాస్త రక్తం తాగినందుకే దోమని చంపి పారేస్తాంకాదూ ?"

"అవును. అందు కేమనదంలేదు. కాని ఇది మహా యాతనపనిసుమా?"

"కాని యేంచేస్తాం ?" అని ఆంద్రీ పెదివి విరిచాదు. పావెల్ కొంచెంసేపు మౌనం వహించాడు. తర్వాత "ఆంద్రీ! నువ్వల్లా మనిషిని చంపగలవా ?" అని అడిగేదు.

"నా స్వార్థంకోసం అయితే మనిషిని కాదు జీవమున్న దేనినీకూడా చంపలేను. కాని మన ఆదర్శంకోసం, సంఘంకోసం, ఏపనైనా చెయ్యగలను. ఆఖరుకి నా కొడుకును చంపాలసొచ్చినా చంపగలను" అని ఆంద్రీ జవాబు చెప్పేడు.

తల్లి "ఓహో! ఆంద్రీ ?" అని అదిరిపడింది.

ఆంద్రీ చిరునవ్వు నవ్వుతూ "ఏమిచేస్తాం! వేరేమార్గంలేదు." అన్నాడు.

"అవును మనబ్రతుకంతే" అని పావెల్ రెట్టించాడు ఆంద్రీ కొంచెంసేపు ఏమిటో దీర్ఘంగా ఆలోచించాడు. అమాంతంగా ఏదో వుద్రేకంవచ్చి లేచి మాట్లాడడం ఆరంభించాడు.

"మనిషికి గత్యంతరమేముంది ? సర్వమానవ సమానత్వాన్ని స్థాపించడానికి ముందు కొందరిని అసహ్యించుకోవడం తప్పనిసరి అవుతోంది. తమ స్వీయసుఖంకోసం, తమ పేరు ప్రతిష్టలకోసం మనుష్యుల రక్తమాంసాలను అమ్ముతూ మానవ జీవితాభివృద్ధికి ఆటంకాలు కల్పించేవాళ్ళని ముందుగా నాశనం చెయ్యాలి. ఎవడైనా ఒక దుర్మార్గుడు మర్యాదస్తుల మార్గానికడ్డొస్తూ వుంటే అలాంటివాడిని అంతంచేయక చూస్తూవూరుకుంటే నేనూ దుర్మార్గుడిక్రిందే లెక్క. అల్లాంటప్పుడు అవకాశందొరికితే వాళ్ళమీద విజృంభించడానికి నాకు హక్కువున్న మాటే. శత్రుకోటిలో యెవరు నాదగ్గరకొచ్చి మిగతావాళ్ళకన్నా యెక్కువ నాకు బాధ కలుగజేస్తారో వాళ్ళమీద కసితీర్చుకోడానికి నాకు సబబు యేర్పడుతుంది. ఇది సరియైన న్యాయం; కాని ఇప్పుడు నేనా న్యాయాన్ని గమనించదలచుకోలేదు. వాళ్ళ రక్తం చిమ్మడంవల్ల ప్రయోజనంలేదు. అది జీవరాహిత్యమైన రక్తం. నిజంగా సత్యం స్థిరపడి వృద్ధిపొందాలంటే, స్వచ్ఛమైన మన రక్తాన్నే సమృద్ధిగా ధారపోయాలి. అల్పులైనవాళ్ళ కుళ్ళినరక్తాన్నిచిమ్మి ప్రయోజనంలేదు. ఆ సంగతి నాకు తెలుసును. అవసరమైతే హత్యచేస్తాను. కాని దానిపాపం నాదే. దాని బాధ్యతంతా నాదే. ఇంకొకళ్ళకేమీ సంబంధంలేదు. నా పాపం నాతోటే ఆఖరు."

ఆంద్రీ పై విషయం చెపుతూ లేచి పచారుచేయడం ఆరంభించాడు. తల్లి బెదురుతూ అతనికేసి చూసింది. హత్యంటే ఆమెకుగల భయం పోయింది. బహుశా ఈపని వైషోవికవ్ తప్ప ఇంకెవ్వరూ చేసివుండరని ఆమె అనుకుంది.

పావెల్ తల వాల్చుకొని శ్రద్ధగా వింటున్నాడు. ఆంద్రీ ఘంటాపథంగా తన ఉప న్యాసాన్ని సాగించాడు.

"ఒక్కొక్కప్పుడు అవసరంకొద్దీ స్వీయసిద్ధాంతాలకి ప్రతికూలంగా నడ వాలసొస్తుంది. నీ సర్వస్వాన్ని—ఆఖరికి ఆ సిద్ధాంతాలనుకూడా త్యజించడానికి సిద్ధ పడాలి. ఒక ఆదర్శంకోసం ప్రాణాన్ని అర్పించడంలో విశేషంలేదు. ప్రాణాని కన్నా ప్రియమైన సిద్ధాంతాన్ని విడిచిపెట్టడం చాలా ఘనమైన సంగతి. అప్పుడే సత్యం ధర్మం వృద్ధిపొందుతుంది.................ప్రజలలో అఖండమైన ఐకమత్య మేర్పడి అంతా సోదరభావంతో జీవించేరోజులు రాకతప్పదు. అంతా ఒకరిమాట ఇంకొకళ్ళు వినడం, ఒకరి ఆధిక్యత నింకొకళ్ళు గుర్తించడం సంభవిస్తుంది. భూమిమీదనుండే మనుష్యులంతా స్వేచ్ఛగా ఆకాశంమీద విహరించే పక్షుల్లా విహ రిస్తారు. మనుష్యులహృదయాలన్నీ పవిత్రంగావుంటాయి. మానవులహృదయాల్లో దురాశ, అసూయ ఉండనే వుండవు. మానవసేవయే మనుష్యుల పరమావధి అవు తుంది. అప్పుడు జాతి మహోన్నతస్థితికివస్తుంది. స్వేచ్ఛావిహారులకు ఎగరలేని యెత్తేముంది? అప్పుడు మనం సత్యం, స్వేచ్ఛా, సౌందర్యం మొదలయిన సద్గు ణాల మధ్య జీవయాత్ర సాగిస్తాం. అన్నిటికీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలే మూలం. అందులో ఘనత, సౌందర్యం ఉన్నాయి. అప్పుడు ఎవరయితే మానవ సేవకు తమ సర్వస్వాన్ని ధారపోస్తారో వాళ్ళే ఘనులుగా పరిగణింప బడతారు. ఎవరు స్వేచ్ఛగా ఉంటారో వాళ్ళే గొప్పవాళ్ళు. ఇంతెందుకు? అప్పుడు జీవితమే ఘనంగా ఉంటుంది" ఆంద్రీ కొంచెంసేపు ఆగాడు. ఒక్కసారి ఇటూ అటూ ఊగి మళ్ళీ ఆరంభించాడు. "అటువంటి జీవితంకోసం నేనేపని చేయడానికయినా సిద్ధంగా ఉన్నాను. ఆఖరికి నా చేత్తో నా గుండెలు పెరికి కాలితో మట్టగించవలసొ చ్చినా సందేహించను. సిద్ధంగా ఉన్నాను."

ఈ మాటలు చెపుతున్నప్పుడు అతని కెక్కడలేని ఉద్రేకం వచ్చింది. ముఖం కందగడ్డలాగయింది. కన్నీళ్ళు బొట బొట రాలినాయి. తల్లి లేచి నిల బడి ఆదుర్దాగా చూస్తోంది. పావెల్ తెల్లబోయి "ఆంద్రీ! ఏమిటిదంతా" అడిగాడు. ఆంద్రీ తల ఊపుతూ ఒక్కనిముషం తల్లికేసిచూచి "ఐసేని నేనే కొట్టేను."

గబాలున తల్లి లేచి గడగడ వణకుతూ ఆంద్రీదగ్గరకెళ్ళి చేతులు పట్టుకుని రహస్యంగా "ఆంద్రీ ఆంద్రీ! ఊరుకో గట్టిగా అనకు. ఎంతపని జరిగింది! అయ్యో! అయ్యో!" అని నిశ్చేష్టురాలయింది.

"అమ్మా! కొంచెం ఆగు. జరిగిన సంగతంతా చెప్తాను" అన్నాడు ఆంద్రీ.

"అక్కరలేదులే. నువ్వు గట్టిగా మాట్లాడొద్దు. ఇకముందు భారం అంతా దేవుడిదే" అని తల్లి మాటకడ్డొచ్చింది. పావెల్ నెమ్మదిగా ఆంద్రీదగ్గరకొచ్చేడు. అతని ముఖం వెలవెల బారుతోంది. పెదిమెలు వణికాయి, ఒక చిత్రమైన చిరు

నవ్వుతున్నా "అంద్రీ! ఏ చెప్పేది? ఒక్కసారి మనసారా కరచాలనం చెయ్యనియ్యి. నిజంగా నీమనస్సెంత క్షోభించిందో కదా! అని చెయ్యి పట్టుకోబోయాడు. అంద్రీ తల్లిచేయి వదల్చుకునే సరికి గట్టిగా పాషా అతనిచెయ్యి పట్టుకున్నాడు.

తల్లి "నాయనా! నువ్వు ఐసేని చంపానంటావా? లేదు. నువ్వు చంపలేవు. నా కళ్ళారా చూసినా నేను నమ్మను" అంది.

"అంద్రీ! అమ్మ చెప్పినమాట నిజమే ఇక ఊరుకో. అది మా ఆలోచనకు మించిపోయిన సంగతి" అన్నాడు పావెల్.

అంద్రీ కొంచెంసేపు తలవాల్చుకుని కూచున్నాడు. తర్వాత గద్గదస్వరంతో ఇలా చెప్పడం మొదలెట్టాడు.

"పావెల్! నేనాపని చెయ్యదలచుకొనే లేదుసుమా? నువ్వూ నేనూ వెళుతున్నప్పుడు నువ్వుకాస్త ముందరున్నావు; నేను ఇవాన్‌గూసవ్‌తో మాట్లాడుతూ కాస్త వెనకబడ్డాను. అప్పుడా సందు మొగకొచ్చి ఐసే మమ్మల్ని చూచి నవ్వేడు. ఇవాను ఇంటికెళ్ళిపోయాడు. నేను ఫాక్టరీకేసి వెళుతున్నాను. ఐసే నా కూడా వచ్చాడు.................. ఆ గాడిద నన్ను మహా అగౌరవపరిచాడు సుమా? ఇదివర కెవ్వడూ నన్నాల్లా అవమానించలేదు. వెంటపడ్డ కుక్కలకొడుకు తిన్నగా నోరుమూసుకుని రావచ్చునా? లేదు. పోలీసులు మనల్ని గుర్తుపెట్టుకున్నారనీ, మే 1 వ తేదీ లోగానే మన్ని జైలు కీడ్చుకెడతారనీ చెప్పడం మొదలెట్టేడు. నాకు ఒళ్ళుమండింది. తిక్కెత్తుకొచ్చింది. అక్కడికీ సహించి వూరుకున్నాను. అంతటితో వాడు వూరుకోక నేను చాలా తెలివైనవాడిననీ, అందుచేత యీ పని మానేసి పోలీసులో గూఢచారిపనిలోకి దిగితే బాగా రాణిస్తాననీ. సలహా చెప్పడం మొదలెట్టేడు. దానితో నాకు అరికాలుమంట నెత్తికెక్కింది. నన్ను ముక్కుమీద గుద్దినా శాంతం ఉండేదేమో కాని, ఈ కుళ్ళుమాటలు వినేసరికి ఇక ఒళ్ళు తెలియలేదు. ఆవేశంగా పళ్ళుబిగించి యిదిగో యీ కుడిచేతితోనే మెడమీద ఒక్కగలేలా యిచ్చేసి నా దారిని నేను చక్కావచ్చాను. గిర్రున తిరిగి ఢామ్మని క్రిందపడటం మాత్రం చూసేను. మళ్ళీవాడి ఆతీ గతీ యేమవుతుందా అనే ఆలోచనే నాకు కలుగలేదు. వాడికింత ప్రమాదం వస్తుందని తోచనేలేదు. కాళ్ళక్రింద పడ్డ కప్పని తొక్కేసి చక్కావచ్చినట్లే నేను ఫ్యాక్టరీకి వచ్చేశాను. పనిచూస్తూండే ఐసే నెవరో చంపేశారనే కబురు విన్నాను. నిజంగా నేను నమ్మనేలేదు. కాని నా చెయ్యిమాత్రం తిమ్మిరెక్కిపోయింది. ఆ దెబ్బకి ఈ చేత్తో పనిచెయ్యలేకపోయాను. (పిడికిలి చూపిస్తూ) నిజంగా యీ చేతి కంటుకున్న పాపం యీ జన్మానికి పోదనుకుంటాను"

తల్లి మాట కడ్డొచ్చి "నాయనా! నీ హృదయంలో కల్మషం లేకపోతే సరి" అంది. తల్లి కండ్లవెంబడి కన్నీళ్ళు జల జల రాలినాయి.

"అమ్మా! నాకు కల్మషం యెంతమాత్రం లేదు. నే నసలు తప్పుచేసినట్లే

భావించడం లేదు. కాని ప్రాణం విసుగుతుంది. ఈ కల్మషం కడుపులో పెట్టుకో వలసిన అవసరం లేనే లేదు."

"అయితే యిప్పుడేంచేస్తావు?" అని పావెల్ అడిగేడు.

"చెయ్యడానికేముంది? అవసరమైతే వాడిని నేనే కొట్టేనని చెప్పడానికి నాకేమి భయంలేదు. కాని ఒకందుకు మాత్రం చిన్నతనంగా వుంది. ఇల్లాంటి స్వల్పవిషయంకోసం జైలుకెళ్ళడానికి మాత్రం సిగ్గవుతోంది. ఒకవేళ యీనేరానికి యెవరినైనా అరెస్టుచేసి కేసు పెడితే మాత్రం నేను బయటపడినా నేరం ఒప్పు కుంటాను లేకపోతే మాత్రం నా అంతట నేను వీధిలో పడను. (లేచి చేతు లూపుతూ) అబ్బే. ఇంత చిన్నవిషయానికి బయట పడతానా? పడను, నాకు సిగ్గేస్తుంది."

ఫాక్టరీకూత వినబడింది. ఆండ్రీలేచి "పావెల్! నేను యివ్వేళ పనిలోకి రాను" అన్నాడు.

"నేనూ వెళ్ళను"

"నేను స్నానంచేస్తాను" అని ఆండ్రీ దిగాలుపడుతూ స్నానాలగదిలోకి పోయాడు.

ఆండ్రీ వెడుతుంటే తల్లి అతనికేసి దీనంగా చూచింది.

తర్వాత పావెల్‌తో ఇల్లాచెప్పింది.

"పాషా! నేను ఇదంతా నమ్మను. ఒకవేళ నమ్మినా ఆండ్రీనేమీ అనవల సినపనిలేదు. మనిషిని చంపడం పాపం అని యెరుగుదును నాకూ దేవుడంటే చాలానమ్మకం. క్రీస్తుప్రభునియందు పూర్తియైన విశ్వాసంవుంది. అయినప్పటికి ఆండ్రీలో ఏమీ దోషం నాకు కనుపించటంలేదు. ఐసే సంగతి తలుచుకుంటే మాత్రం కొంచెం విచారం కలుగుతుంది. అతను నిర్భాగ్యుడు. అక్కడ దిక్కు లేక పడుంటే చూచాను. మిమ్మల్ని ఉరితీయిస్తానంటూ అతడు బెదిరించిన మాట లన్నీ జ్ఞాపకానికొచ్చాయి, కాని ఎందుచేతనోగాని అతడంటే అసహ్యం కలుగలేదు. చచ్చిపోయాడుకదా అనే సంతోషమూ కలుగలేదు. జాలిమాత్రం వేసింది. కాని ఇప్పుడెవరిచేతుల్లో చచ్చిపోయాడోకూడా తెలిసింది. కనుక విచారమేలేదు

తల్లి కొంచెంసేపు యేమిటో తనలోతానే ఆలోచిస్తుంది. "ఓయి దేవుడా!" అంటూ అదిరిపడి "పాషా! నేచెప్పేమాటలన్నీ వింటున్నావా?" అని అడిగింది.

పావెల్ ఆమెప్రశ్నను విన్నట్లులేదు. గదిలో ఇటూఅటూ పచారుచేస్తూ చెప్పడం ఆరంభించాడు.

"అమ్మా! ఆండ్రీ యీ విషయాన్నింతటితో సర్దుకునేటట్లులేదు. అసలు ఎప్పటికైనా సర్దుకుంటాడనే విషయంకూడా అనుమానమే. ఇదిగోచూడు! మను ష్యులంతా ఒకళ్ళకొకళ్ళు యెల్లావున్నారోచూడు. నీకెంతయిష్టం లేకపోయినా

ఒక్కొక్కప్పుడు దెబ్బతీయాలనొస్తుంది. ఆ దెబ్బయినా యెవరిమీద ? ఎందుకూ పనికిరాని సిర్పాగ్యుసిమీద. వాడు మూర్ఖుడవడంచేత నీకన్నా అధమస్థితిలో ఉన్నాడు. ఆంద్రీ పొంబాటును యాదాలాపంగా, ఒక మనిషిని చంపాడు అందుకు అతనికెంతో పశ్చాత్తాపంకలిగి సిగ్గుపడుతున్నాడు. యెంతో మహాపాపం చేసినట్లు ఆందోళనతో బాధపడుతున్నాడు. ఇక ఫాక్టరీ అధికారుల సంగతిచూడు. వాళ్ళు వేలకొలది జనాన్ని చదీచప్పుడూ, దయాదాక్షిణ్యం, నదురూ బెదురూ లేకుండా చంపి పారేస్తున్నారు. చంపడంలోనూ విధిలేకకాదు. విలాసం కోసం. సంతోషంకోటి. ఈమారణకర్మంతా యెందుకో తెలుసునా ? తమ స్వంత సౌఖ్యంకోసం, తమ కొంపలు నిలబెట్టుకోడానికి తమ భవనాల్లోని కుర్చీలు, బీరువాలు చెక్కుచెదరకుండా ఉండడానికి. తమ వెండి బంగారాలు బాగా ఉండడానికి అన్నిటికన్నా తమ పేరు ప్రతిష్ఠలు నిలుపుకుని ప్రజలమీద ఇష్టంవచ్చినట్లు నధికారం చలాయించడానికి వేలకొద్దీ జనం ఆత్మలను హత్యచేయడం కేవలం తమ శరీర రక్షణానికోసంకాదు, తమ ఆస్తిపాస్తుల రక్షణానికే. తమ ఐశ్వర్యం నిలబెట్టుకోడానికే. (పావెల్ నిట్టూర్పువిడిచి తల్లిచేయిపట్టి ఆడించి) "అమ్మా ! ఈ కుళ్ళునంతా నువ్వు గ్రహించినట్లయితే మా ఆదర్శంయొక్క సత్యాన్ని నువ్వు గ్రహించగలుగుతావు. మా ఆదర్శమెంత మహత్తరమైనదో నీకప్పుడర్థమవుతుంది."

ఈమాటలు వింటూంటే తల్లికేదో ఆందోళన బయలుదేరి లేచింది. తన కుమారుని హృదయంలో తన హృదయాన్ని మిళితం చేసేసి, ఒకగొప్ప జ్యోతిని వెలిగించాలనే కోరిక కలిగింది.

"పాషా ! కొంచెం ఆగు. నేనూ మనిషినే. నాకూ హృదయం ఉంది." అన్నది.

ఇంతలో వాకిట్లో యెవరో వస్తున్నట్లు చప్పుడైంది. వాళ్ళిద్దరూ వులిక్కిపడ్డారు.

"ఒకవేళ ఆంద్రీకోసం పోలీసువాళ్ళువస్తే" అన్నాడు పాషా.

"ఓభగవంతుడా ! నాకేమీ తెలియదు : నాకేమి తెలియదు ప్రభో !" అంది తల్లి మెల్లగా.

## ౧౭

తలుపు తీసేసరికి "నేనే" అని నవ్వుతుంటూ రైబిన్ లోపలికొచ్చాడు. ఒక దట్టమైన బొచ్చుచొక్కా తొడుక్కున్నాడు. తలమీదకూడా ఒక బొచ్చుటోపీ తగిలించాడు. బట్టలంతా తారుమరకలే. కొంచెం హెచ్చుతగ్గుగా ఎలుగ్గొడ్డు ఆకారం వచ్చింది. లోపలికి ప్రవేశిస్తూనే తల్లిని పరామర్శించి పావెల్ క్షేమసమా

చాలాలు కనుక్కున్నాడు. కుశలప్రశ్నలయిన తరువాత చొక్కా గిర్కాతీసి బల్ల మీదపెట్టి, గది నాలుగు మూలలూ పరీక్షగాచూచి సావకాశంగాకూచుని జావాఖానీకి ఉపక్రమించాడు.

"ఏమోయ్ పాషా: నువ్వు బాగా పెద్దమనిషి వౌతున్నావు. నేను పక్కా పల్లెటూరి రైతునై పోతున్నాను. నీకేమి ఆస్తీపాస్తీహెచ్చినట్లు లేదుకాని పుస్తకాల సంపదమాత్రం హెచ్చినట్లు కనిపిస్తుంది. గ్రంథాలతో బీరువాలు నిండుతున్నాయి. అవే కాబోలు మహాకనకం నీకు! అవునులే; నిజమే. సరేకాని. ఏమిటి విశేషాలు? ప్రపంచధోరణి ఎల్లాగుంది?"

"అంతా బాగానేఉంది. వ్యవహారం ముందుకే సాగుతోంది"అన్నాడు పాషా

"బాగానేఉంది"అంటూ రైబిన్ ఉషారుగా రైతులు పాడుకునే యీలపాట నొకదానిని పాడేడు. ఇంతలో తల్లి 'టీ కావాలీ?' అని అడిగింది.

రైబిన్ "ఓ! టీ అన్నమాటేమిటి? ఇస్తే లొట్టెడు కల్లుకూడా పుచ్చు కుంటాను. లేకపోతే తినడానికేమైనా పెట్టినా వద్దనను. వీటికేంగాని ఇంతకీ మిమ్మల్ని చూచాను. అదే నాకు చాలా సంతోషం" అన్నాడు.

పావెల్ రైబిన్‌కు దగ్గరగాకూచుని "ఏమయ్యా రైబిన్! నీసంగతెల్లా వుంది? విశేషా లేమైనా ఉన్నాయా?" అని అడిగాడు.

"ఉంది ఒకమోస్తరుగా. నేనిప్పుడు "ఎడిల్‌గేవ్"అనే గ్రామంలోఉంటున్నా. గ్రామం చాలామంచిది. సాలుకు రెండుసంతలు. జనాభా రెండువేలుపైచిల్లర. మనుష్యులు మాత్రం పరమ దౌర్భాగ్యులు. భూమిఅట్టేలేదు. ఉన్నది సారవంత మైనదీకాదు. చిన్నచిన్న ప్రతులుగా చీలికలై ఉంది" అన్నాడు రైబిన్.

"వాళ్ళతో ఏమైనా మాట్లాడుతూ ఉన్నావా?"

"నోరుమూసుకు కూర్చుంటానా మరీ? మీరు ఇక్కడ ప్రచురించిన కాగితా లన్నీ జాగ్రత్తపెట్టేను. మొత్తం 34 కరపత్రాలు. వాటితో కొంతగ్రంథం సాగిస్తు న్నాను. కాని నాకు ముఖ్యమైన సాధనంబైబిలు. దానితోదాగా గ్రంథమునడుపుతూ ఉన్నాను. అది గవర్నమెంటు పుస్తకమైనా అందులోకూడా కొన్ని సంగతు లున్నాయి. దానిమీద ప్రజలకు నమ్మకంగూడా ఎక్కువ అయినప్పటికీ ప్రచారం చాలదు. అందుకోసమే నీదగ్గరనుంచి ఏమైనా పుస్తకాలుంటే పట్టుకెడదామని వచ్చాను. నాతోకూడా ఏఫీమ్‌అనే కుర్రవాడుకూడా వచ్చాడు. తారు తోలుకొచ్చాం బళ్ళమీద; ఇంటికి వెడుతూ వెడుతూ ఈపని చూసుకుందామని ఇల్లావచ్చాను. ఏఫీమ్ వచ్చేలోగా నాకు ఏవోకొన్ని పుస్తకాలిస్తే వాటిని జాగ్రత్త పెట్టుకుంటాను.

పావెల్ తల్లితో "అమ్మా! నీవెళ్ళి కొన్నిపుస్తకాలు పట్టుకురా. గ్రామాల నిమిత్తమని చెప్పు వాళ్ళతో" అన్నాడు.

"అల్లాగే వెడతాను మీరు టీత్రాగండి" అంది తల్లి.

రైబిన్ చిరునవ్వు నవ్వుతూ "ఏమమ్మోయి నిలోవ్నా! నువ్వుకూడా యీ యుద్ధరంగంలో దిగేవూ?" అని తల్లిని హెచ్చరించాడు.

పావెల్‌తో "సరేకాని, మన యీపుస్తకాలు చదవాలనే కుతూహలం కలవాళ్ళు మాగ్రామంలో చాలామందున్నారు. అక్కడ వీటియందు అభిరుచి కలిగించే ఉపాధ్యాయుడొకడున్నాడు. అతడు చర్చితాలూకు మనిషయినా మంచివాడని వాడుక. మాగ్రామానికి సమీపంలో ఇంకొక ఊరిలో ఆడమేష్టరుకూడా యీపని చేస్తుంది. అయితే వాళ్ళు యీనిషేధగ్రంథాలను మాత్రం ఉపయోగించరు. వాటి పేరుచెబితే హడలిపోతారు. నాకుమాత్రం ఆ నిషేధగ్రంథాలే కావాలిసుమా. అవెల్లాపుండాలో తెలుసునా? మంచి వాడాల్లాగు తగిలేటట్లుగా ఉండాలి. వాటిని తీసుకెళ్ళి మెల్లగా ఎవరికీ తెలియకుండా వాళ్ళకందిస్తాను. వాళ్ళద్వారా అవి ప్రజలకందుతాయి. ఈలోగా పోలీసులు కనుక్కుంటే వాళ్ళే పంచిపెడుతున్నారనుకుంటారు. నేనుమాత్రం బయటపడను" అంటూ తన తెలివితేటలకి తనే కాస్త సంతోషపడ్డాడు.

"ఓహో! పైకి ఎలుగుగొడ్డులాఉన్నా ఇతనిదగ్గర నక్కజిత్తులు చాలనే ఉన్నాయి" అనుకుంది తల్లి.

పావెల్ లేచి పచారుచేస్తూ కొంచెంసేపు ఆలోచించాడు. పిమ్మట వాళ్ళిద్దరికీ ఈక్రింది సంభాషణ జరిగింది.

పా :— "రైబిన్! నీకు పుస్తకాలిస్తాంకాని, నువ్వు చెయ్యబోయే పనిమాత్రం బాగాలేదు."

రై :— ఏమిటీ? బాగాలేదు? (అని తెల్లబోయాడు)

పా :— నువ్వు చేసేపనికి ఎప్పుడూ నువ్వే బాధ్యత వహించాలి. అంతేకాని నువ్వేగోచేసి ఇతరులను చిక్కులోపెట్టడం సబబుకాదు.

రై :— (తలకాయ ఊపుతూ) నువ్వు చెప్పే సంగతేమిటో నాకు బుర్రకెక్కలేదు.

పా :— అయితే చెపుతా విను. కరపత్రాల్ని బడిపంతుళ్ళు పంచిపెట్టారని పోలీసులకి అనుమానం తగిలితే వాళ్ళని జైల్లో పెడతారామరి?

రై :— ఆ! పెడతారు. పెడితే ఏమి?

పా :— ఏమిటా? పుస్తకాలు పంచిపెట్టినది నువ్వు. జైలుకు నువ్వే వెళ్ళాలికాని ఇంకొకళ్లెందుకు వెళ్ళాలి?

రై :— పాషా! నువ్వు చాలా చిత్రమైన మనిషిలాగున్నావే? నాగలి దున్నుకుంటూ ఛోఛో అనుకునే రైతుముండావాడిల్లాంటి పనుల్లో కలుగజేసుకుంటాడంటే యెవరు నమ్ముతారు. ఎవరనుమానపడతారు? పుస్తకాల గొడవంతా చదువుకున్నవాళ్ళదే. దాని సాధక బాధకాలన్నిటికీ వాళ్ళే సమాధానం చెప్పుకోవాలి.

ఈ సంభాషణ తల్లి శ్రద్ధగా వింటోంది. రైబిన్ మాటను పాషా అర్థం చేసుకోలేకపోయాడు. ఆతని కండ్లలో కొంచెం ఆగ్రహం కనుపించింది. "రైబిన్ ఉద్దేశ్యమేమిటంటే అలని పని కేమీ అక్కరాకుండా యెవరో ఒకరు జైలుకెళుతూ ఉంటారని" అని మెల్లగా వ్యాఖ్యానం చేసింది.

"అంతే. అంతే" అన్నాడు రైబిన్ అంగీకారంతో.

పావెల్ చటుక్కున "అమ్మా ; మా బాగా చెప్పావు కామా సబబు ? మాట వరసకి మన ఆంద్రీ ఏదో తప్పుపనిచేసేడనుకో. అతను చేసిన పనికి నన్ను ఖైదులో పెట్టారనుకో అప్పుడేమంటావు ?" అన్నాడు.

తల్లి కీ ప్రశ్న నషాళానికంటింది. ఏమిచెప్పడానికితోచక 'అల్లా యెందుకు జరుగుతుంది ?' అంది.

రైబిన్ అందుకుని తల్లితో "నిలోనా ! ఇల్లాంటి విషయాలు మహాసున్నితమైనవి" అన్నాడు. కాస్త ఉపదేశధోరణిలో పావెల్‌తో ఇల్లా చెప్పాడు.

"ఓయి తమ్ముడూ ! ఈ విషయాల్లో నీ అభిప్రాయా లింకా చాలా పచ్చిపచ్చిగా వున్నాయి. బాగా పక్వానికి రాలేదు. రహస్యపుకార్యక్రమంలో కీర్తికి స్థానం లేదు. కొన్ని సంగతు లాలోచించి. ఎవరివగ్గర కరపత్రాలుంటే వాళ్ళని ముందుగా జైల్లోపెడతారు. అంతేకాని వాళ్ళ కంపజేసిన వుపాధ్యాయులజోలి కెళ్ళరు. అది మొదటిసంగతి. ఇక రెండవ విషయం. ఆ బడిపంతుళ్ళు ప్రజలకి చట్టసమ్మతమైన పుస్తకాలిచ్చినప్పటికీ అందులోకూడా నిషేధపు పుస్తకాల్లో వుండే విషయాలు లేకపోలేదు. కాకపోతే అంత హెచ్చుగా ఉండకపోవచ్చును. అంతకంటె మెత్తటిభాషలో వుండవచ్చును. సత్యమంతా ఒక్కటే. అంటే నేను చేసే పనినే వాళ్ళుకూడా చేస్తుంటారన్నమాట. కాని నేను రాచబాటను పోతాను. వాళ్ళు సందుల్లోంచి, గొందులలోంచి పోతారు.........ఇక మూడవవిషయం, వాళ్ళకీ నాకూ సంబంధమేమిటి ? కాలి నడకనుపోయే నాకూ, గుర్రంమీద సవారిచేసే వాళ్ళకూ పొత్తేమిటి ? వాళ్ళకీ నాకూ స్నేహం యెల్లా కుదుస్తుంది ? నాలాంటి యింకో రైతు విషయంలో యిలా ప్రవర్తించను. కాని ఇల్లాంటి చదువుకున్నవాళ్ళతో నాకు మొగమాటమేమిటి ? ఒకడేమో చర్చితాలూకు మనిషి. రెండో ఆమె యెవరో భూస్వామందుకుమార్తె. ప్రజల నుద్ధరించాలనే బుద్ధి వీళ్ళకెందుకు పుట్టిందో నా కర్థమవడములేదు. వాళ్ళ వుద్దేశ్యాలు అంటే ఆ చదువుకున్న మాష్టర్ల అభిప్రాయాలు రైతువాడినైన నాకు అవగాహన అవడంలేదు. నే నెందుకు పనిచేస్తున్నానో నాకు తెలుసును కాని వాళ్ళ సంగతిమాత్రం తెలియడంలేదు.

శతాబ్దాలుతరబడి వాళ్ళు ప్రజలమీద పెత్తనంవహించి రైతుల్ని పీడించుకు తిన్నారు. మరిప్పుడింత అర్థాంతరంగా రైతుల నుద్ధరించాలనీ, వాళ్ళకళ్ళు తెరిపించాలనీ, యెందుకు ప్రయత్నిస్తున్నారో తెలియడంలేదు. తమ్ముడూ ! నేను పిచ్చి పిచ్చి కథలను నమ్మేవాడినికాను. అందుచేత వాళ్ళంటే నాకు అంత నమ్మ

కములేదు. చీకట్లో నడుస్తున్నప్పుడు ఎదటనున్నది ఏట్లో, మొద్దో లేకపోతే మరొకటో తెలుసుకోవాలి ”

ఈ ధోరణి వింటూంటే తల్లి తెల్లబోయింది. పాషా ఏమంటాడో అని అతని ముఖంకేసి చూసింది. ఇంతలో ఆమెకు చదువుకున్నవాళ్ళల్లో కొందరు జ్ఞాపకానికొచ్చి “రైబిన్ ! కొందరు శ్రీమంతులూ విద్యాధికులూ కూడా ఈ రైతుల కోసం అష్టకష్టాలు పడుతున్నారే. అనేకమంది జైళ్ళలో హరిమారిపోతున్నారే. దానికేమంటావు ?” అని అడిగింది.

రైబిన్ మళ్ళీ అందుకున్నాడు. “వాళ్ళ వుద్దేశ్యమే వేరు. అల్లాంటివాళ్ళ తరహాయే వేరు రైతుదగ్గర నాలుగు డబ్బులుచేరితే పెద్దమనిషైపోలాడు పెద్ద మనిషి చేతిలోవుండే పైసా ఖర్చయిపోతే రైతైపోతాడు. అంతే చేతిలో పైసా పైసలయితే ఆత్మకూడా పరిశుద్ధమవుతుందన్నమాట. మనిషి జీవితాన్నిబట్టే బుద్ధికూడా ప్రసరిస్తుందని వెనుక నువ్వేకాదూ చెప్పావు ? పనివాడికీ యజమానికీ చుక్కెదురు. ఒకడవుననంటే రెండోవాడు తప్పకుండా కాదనాలి. అల్లాగే రైతుకీ చదువుకున్నవాడికీని. రైతు స్వభావం వేరు. పెద్దమనిషి తరహావేరు. రైతుకి కడుపునిండితే పెద్దమనుష్యులు మడత కుడుము చెయ్యాలి. రైతులంతా మంచి వాళ్ళని నేను చెప్పను. వాళ్ళల్లోనూ కొందరు దౌర్భాగ్యులు, ఆత్మఘాతకులు లేకపోలేదు.”

రైబిన్‌కి ఉద్రేకం వచ్చి లేచాడు. మొఖం కందగడ్డయి పోయింది. ఆ వుద్రేకంతోనే మెల్లగా మాట్లాడడం సాగించాడు.

“నాసంగతే చూడండి. అయిదేళ్ళపాటు పొట్ట చేత్తోపుచ్చుకొని ఆ ఫ్యాక్టరీ నుండి యీ ఫాక్టరీకి యీ ఫాక్టరీనుండి ఆ ఫాక్టరీకి తిరిగేను. చివరికి ప్రాణం విసిగి పల్లెటి దిక్కుకి చేరుకున్నాను. పల్లెటూరు అలవాటు తప్పిపోయినాక మళ్ళీ అచ్చటికి చేరుకునే సరికి ఆ జీవితమంతా చాలా దుర్భరంగా కనబడింది. అక్కడ బ్రతుకే అసంభవ మనిపించింది. మీకిక్కడ ఆకలిబాధంటే ఏమిటో తెలియదు. అందుచేత గ్రామాలలో జరిగే దారుణాలన్నీ మీకు తెలియవు. అక్కడ ప్రజల్ని ఆకలి పీడించేస్తోంది. అన్నం దొరికే యెత్తేమీ కనుపించడంలేదు. ఈ క్షుద్బాధ ప్రజల ఆత్మల నన్నిటిని నాశనం చేసేస్తోంది. మనుష్యుల మొఖాలమీద వుండవల సిన జీవకళ యేమీ అచటి ప్రజలలో కనపడడంలేదు. వాళ్ళది బ్రతుకని చెప్పడా నికే వీలులేదు. నిత్యదరిద్రంలో కుళ్ళిపోతున్నారన్నమాట. ఈ బాధలకి తోడు ప్రభుత్వాధికారులు వాళ్ళని బ్రతకనివ్వరు. ‘అన్నమోదేవా’ అని యేడుస్తూవుండే యీ నిర్భాగ్యుల కేమైనా యెప్పుడైనా గుప్పెడు మెతుకులు దొరికితే, వాటినికూడా గుటకాయించడానికి యీ వుద్యోగులు తయారుగా కనిపెట్టు కుంటారు. దొరికింది లాక్కోడమే కాకుండా, ఏమని అడిగితే పళ్ళూడకొడతారుకూడాను. (పావెల్‌కేసి చూస్తూ) తమ్ముడూ ! ఈ బ్రతుకు చూసిచూసి నాకు ప్రాణం విసుగెత్తిపోయింది.

అసహ్యంవేసింది. కన్నెత్తి చూడలేకపోయాను. కాని మళ్ళీ ఆలోచించుకున్నాను. ఈ అసహ్యాన్ని, ఆగ్రహాన్ని సందాళించుకున్నాను. ఈ అవస్థదాచేసు. ఏమైనాసరే అక్కడేవుండి యేదో కొంత గొడవచేయడానికి నిశ్చయించుకున్నాను. ప్రజలకు జరుగుతున్న అపచారాలన్నీ నావంటికి పట్టేయి. వాటికి కారకులైన అధికారులమీద అసహ్యంకూడా నారక్తంలో జీర్ణించింది. ఈ అపచారాలన్నీ నా హృదయంమీద పొడుస్తున్నట్లు పొడుచుకుంటున్నాయి.

ఈ మాటలు చెపుతుంటే రైబిన్ నుదుటిమీద ముత్యాలులా చెమటపట్టింది. అతను పావెల్ భుజంమీద చేతితో తట్టేడు.

"పావెల్ ! ఈ విషయంలో నువ్వునాకు పూర్తిగా సాయంచెయ్యాలి. నాకు కొన్ని పుస్తకాలు ఇవ్వాలి. ఎల్లాంటి పుస్తకా లనుకొన్నావు ? పుస్తకంవక్కసారి చదివితే ఇక మనిషికి శాంతి అనేమాట ఉండకూడదు. ప్రజల మనస్సుల్ని కలవర పెట్టెయ్యాలి. ఈ పట్నవాసం వాళ్ళకోసం వ్రాసేవాళ్ళనే పల్లెటూరి వాళ్ళకోసం కూడావ్రాయమనిచెప్పు. ఎల్లా వ్రాయాలంటే, నిజంగా ఉన్నదున్నట్లే వ్రాసెయ్యాలి. పల్లెటూరి వాళ్ళు చదువుకుంటే వుడుకెత్తిపోవాలన్నమాట. ఆఖరుకు ప్రాణాలైనా తెగించడానికి సిద్ధపడేటట్లు వ్రాసెయ్యాలి. (చెయ్యి ఆడిస్తూ) ఇదిగో చూడు; కొంచరు మనుష్యులు చచ్చిపోతే ఫరవాలేదు. ప్రజలనుద్ధరించ డానికోసం కొంచరు చచ్చిపోవాలి. ఆ శవాల్లోంచి గొప్పవెలుగు బయలుదేరుతుంది. ప్రపంచంలోని అనేక కోట్లజనాన్ని ఉద్ధరించడానికి కొన్నివేలమంది ఆహుతులైతే కానియ్యి. అంతే. మనుష్యులు చావడం సులువే. మళ్ళీ ప్రజలలో జీవంకలగాలి." రైబిన్ ఇలా తీవ్రంగా మాట్లాడేడు. మాట్లాడినంత సేపూ చాలా ఆవేశంతో మాట్లాడేడు. అప్పుడప్పుడు పళ్ళుపటపట కొరికి ముష్టిబిగించేవాడు. ఆ బల్లగుద్దేశేవాడు. ఆధోరణంతాచూస్తే తల్లికి తనభర్తజ్ఞాపకాని కొచ్చాడు. నిలోనా టీ తీసుకొచ్చి రైబిన్ ముందర పెట్టింది. పావెల్ రైబిన్ ఉపన్యాసాన్ని విని తలకాయ ఊపుచూ వచ్చాడు. ఆఖరికి "రైబిన్ ! నువ్వుచెప్పిన సంగతులన్నీ నిజమే. పుస్తకాలు అవసరమే. పల్లెటూళ్ళలో ప్రచారంకోసం ఒకపత్రిక కూడా అవసరమే. నువ్వు మాకు సంగతి సందర్భాలన్నీ తెలియచేస్తూంటే గ్రామాలకోసం ఒకపత్రికను ప్రచురిస్తాం." అన్నాడు.

"సరే చేయించండి. అన్ని విషయాలు మీకు తెలియచేస్తాం. వ్రాయడం మాత్రం బహుతేలికభాషలో వ్రాయాలి. ఆఖరుకి శుద్ధ ఎద్దుమొద్దుకయినా తెలిసే టట్లుండాలి."

ఇంతలో తలుపుతోసుకుని, "ఏఫిమ్"* లోపలికొచ్చాడు. రైబిన్ అతన్ని పావెల్‌కు, పావెల్‌ను ఏఫిమ్‌కు పరిచయం చేశాడు. ఏఫిమ్ మంచి ఒడ్డూపొడుగూ గల యువకుడు. లక్షణాలన్ని మంచివే. అతను పావెల్ కరస్పర్శనం చేస్తూనే

* రైబిన్‌తో కూడా వచ్చిన యువకుడు.

గదంతా నాలుగు మూలలూ పరికాయించాడు. ఒకనిచ్చెన సరాసరి పుస్తకాల బీరువామీద ఉంది. గబగబా బీరువా దగ్గరకెళ్ళి పుస్తకాలన్నీ జమాబందీ చేయడం ఆరంభించాడు.

"అబ్బో! ఇక్కడ చాలా పుస్తకాలే ఉన్నాయి. కాని యివన్నీ చదువ డానికి మీకు తీరికలేదనుకుంటాను. పల్లెటూళ్ళలో మాకు చాలా తీరికవుంది" అన్నాడు పుస్తకాలు తిరగేస్తూను.

"తీరికుంది. కాని చదువుకోవాలనే కోరికలేదు" అన్నాడు పావెల్.

"కోరికలేకేమి? ఈరోజుల్లో స్వతంత్రంగా ఆలోచించుకోలేనివాళ్ళు చచ్చి పోయినవాళ్ళక్రిందే లెక్క. కాని ప్రజలు చచ్చిపోదలచుకోలేదు. కనుక కాస్త ఆలోచించుకుంటున్నారు" అన్నాడు ఏఫిమ్. ఒక పుస్తకాన్ని చేత్తోపుచ్చుకొని పేరు చదివి.

"ఖగోళశాస్త్రం! ఇదేమిటి?" అని పావెల్ నడిగాడు. పావెల్ విపులంగా తెలియచెప్పాడు.

"ఇది మాకక్కరలేదు" అన్నాడు ఏఫిమ్.

రైబిన్ అందుకుని "పల్లెటూరివాళ్ళకు ఖగోళశాస్త్రం యెందుకూ? భూమి యెల్లా పుట్టినాసరే, యెల్లావున్నాసరే. ఆకాశంమీదనుంచి వ్రేలాడుతూవున్నా ఒకటే, సముద్రంమీద తేలుతూవున్నా ఒకటే. వాళ్ళకి భూమిలోవున్న ప్రయోజనం ఒకటే. భూమి యింత భుక్తినివ్వాలి" అన్నాడు.

"దాస్యచరిత్ర—యిది మనలను గురించేనా?" అని ఏఫిమ్ అడిగాడు.

"ఇదిగో! ఇది రష్యాప్రజల దాస్యచరిత్ర" అంటూ పావెల్ ఒక పుస్తకం తీసి అతనిచేతికిచ్చాడు.

"ఇది పాతపురాణం. ఈకాలానికి పనికిరాదు" అంటూ ఏఫిమ్ దాని నవతల పెట్టేశాడు.

పావెల్ "నీవాటా కేమైనా భూమివున్నదా?" అని అడిగాడు.

"ఆవున్నట్టేలెక్క. మా అన్నదమ్ములు ముగ్గురికీ కలిపి పదిన్నర ఎకరా లుంది. అదంతా యిసకబొందే. పాత్రలు తోముకునేందుకే కాని పంటకు పనికి రాదు. నేనాభూమిని వదలుకున్నాను. విడుదలపెట్టక యేం చెయ్యను? కష్టపడినా కడుపునిండదుగదా! నాలుగేళ్ళనుంచి కూలిపని చేసుకుని పొట్టపోసుకుంటున్నాను. ఈసారి సిపాయిపనిలో చేరదామని అనుకుంటున్నాను. కాని రైబినుమామ వెళ్ళొద్దంటున్నాడు! ఇప్పుడు సిపాయిలచేత జనాన్ని చావగొట్టిస్తున్నారటకాదూ? అంచేత వద్దంటున్నాడు. చివరకేమైనా చేరదామనే అనుకుంటున్నాను. తరతరాల నుంచీ వస్తున్న యీ సైన్యాన్ని లాగిపారవేయవలసిన రోజువొచ్చా యనుకుంటాను మరేమంటావు?" అన్నాడు ఏఫిమ్.

"ఆ వచ్చింది. కాని చాలా కష్టమైనపని. అన్నిటికన్న ముఖ్యం ఏమిటంటే—సైనికులతో మాట్లాడేనేర్పుండాలి" అన్నాడు పావెల్ నవ్వుతూ.

"వానికేమి ? నేర్చుకుంటాం"

"పైఅధికారులకి పట్టుబడ్డామంటే తుపాకితో కాల్చిపారేస్తారు తెలుసునా?"

"అవును. దయాదాక్షిణ్యాలు చూపించరు" అంటూ ఏఫిమ్ పుస్తకాలన్నీ తిరగేయడం మళ్ళీ ఆరంభించాడు.

రైబిన్ టీ త్రాగిపోదామని తొందరచేశాడు. "తిన్నగా ఇంటికే?....అవును కాని విప్లవంఅంటే తిరుగుబాటుకాదూ ?" అని ఏఫిమ్ ప్రశ్నవేశాడు. ఆసమయానికే అంద్రీ లోపలికొచ్చి ఏఫిమ్‌ను వీపుమీదతట్టి రైబిన్ పక్కనే కూచున్నాడు.

"నువ్వుకూడా ఫాక్టరీలోనే పనిచేస్తున్నావా ?"అని ఏఫిమ్ ఆంద్రీనడిగాడు.

"అవును అయితేఏమి ?"

"మరేంలేదులే అతను ఫాక్టరీ పనివాళ్లను చూడడం ఇదేమొదలు. వాళ్ళు అందరిలాగా వుండరని అతని వుద్దేశ్యం"అని రైబిన్ సమాధానం చెప్పాడు.

"ఏంచేత ?" అన్నాడు పావెల్.

ఏఫిమ్ ఆంద్రీని జాగ్రత్తగా నఖశిఖపర్యంతం పరీక్షచేశాడు. "మీఎముకలు కోసుగా వుంటాయి. రైతుల ఎముకలు పుష్టిగా కాస్త గుండ్రముగా నునుపుతేరి వుంటాయి" అన్నాడు. రైబిన్ అందుకుని ఇల్లా అన్నాడు. "రైతుకి తన కాళ్ళ మీద తాను నిలబడగల శక్తివుంది. తనది కాకపోయినా తనకాళ్ళక్రింద భూముందనే స్పృహవుంది. కాని ఫాక్టరీకూలీకి ఆనిలకడలేదు. ఎప్పుడూ పక్షిలాగు ఎగురుతూ వుంటాడు. ఒక కొంపాగోడూలేదు. ఇవ్వేళ ఇక్కడ, రేపు అక్కడ, ఎల్లుండి మెక్కడో: ఆఖరికి పెళ్ళామైనా పట్టివుంచలేదు. ఎక్కడైనా కాస్త పేచీవస్తేసరి: ఆఫాక్టరీకి సలాంకొట్టేస్తాడు. కాని రైతల్లాకాదు. తానున్నస్థలం నుంచి కదలకుండానె తనస్థితి బాగుచేసుకోవడానికి ప్రయత్నిస్తాడు............ అదిగో నిలోనావచ్చిందే ?" ఇల్లాఅంటూ రైబిన్‌లేచి వంట ఇంట్లో కెళ్ళాడు.

ఏఫిమ్ పావెల్‌దగ్గరకొచ్చి పుస్తకమేదైనా ఇమ్మని అడిగేడు. చదువుకుని తారు తెచ్చేవాళ్ళవెంట పంపేస్తానన్నాడు. పావెల్ అంగీకరించాడు. ఇంతలో లోపలి నుంచి రైబిన్ దుస్తులు బాగా పొందికగా ధరించివచ్చాడు. "ఏఫిమ్! మనకి వేళయిపోయింది. పోదాంపద" అంటూ ప్రయాణమైనాడు. చదువుకోనేందుకు పుస్తకం దొరికిందనే సంతోషంతో ఏఫిమ్ వెళ్ళిపోయాడు.

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయాక, పావెల్, ఆంద్రీ, నిలోనా ముగ్గురు కూచుని ఇల్లా మాట్లాడుకున్నారు.

పావెల్ :— ఆంద్రీ వీళ్ళసంగతి కనిపెట్టావా? ఆంద్రీ—ఆ! ఆ! సంధ్యాకాలపు మబ్బుల్లా ఉన్నారు.

నిలోనా .— రైబిన్ ఎంతమారిపోయాడో చూశారా? పక్కా రైతైపోయాడు. అసలెప్పుడూ ఫాక్టరీలో పనిచేసినట్టే కనుపించడంలేదు. ఎంత గడితేరేడు!

పా :— ఆంద్రీ! నువ్వు ఇందాక ఇక్కడలేవుకాని ఉంటే అతని సంగతి స్వయంగానే చూసేవాడవు. నువ్వెప్పుడూ హృదయాన్ని గురించి మాట్లాడుతూ ఉంటావు. హృదయంయొక్క చమక్‌లన్నీ చూపించేశాడు. నాకు గాభరా ఎత్తించేశాడు. నేనసలు యెదురుచెప్పనే లేక పోయాను. అతనికి మహా అపనమ్మకం. వాళ్ళని తృణప్రాయంగా చూస్తాడు. అమ్మ చెప్పినట్లు అతనిలో చాలా గొప్పశక్తి ఉంది సుమా!

ఆం :— అవును. నేనూ ఆ సంగతి కనిపెట్టాను. ప్రజలు ఇంతవరకూ అంధకారంలో ఉన్నారు. ఒక్కసారి వాళ్ళకు వెలుతురు కనుపించిందంటే ఇక ఆగరు. లేచారంటే వ్యవహారమంతా ఉల్టా సీదా చేసేస్తారు. వాళ్ళకి కావలసింది భూమి. దాన్ని సాఫ్‌సీదాగా పుచ్చుకుంటారు............ ఆహా! పుచ్చుకు తీరతారు. రైతు లేచాడంటే బడబానలమే. సాదురేగినట్లే. ప్రపంచాన్నంతా తగలేసేస్తాడు.

పా :— అప్పుడు మన కడ్డొస్తాడు.

ఆం :— అల్లాంటి అడ్డురాకుండా మనం జాగ్రత్తపడాలి. రైతుకి మనమే బాగా సన్నిహితులం. అంచేత రైతు మనలనే నమ్ముతాడు, మన్నే అనుసరిస్తాడు కూడాను.

పా :— మనం గ్రామాల నిమిత్తం ఒక వార్తాపత్రికను ప్రచురించా లంటున్నాడు రైబిన్.

ఆం :— అవును. తప్పకుండా ప్రచురించాలి. సాధ్యమైనంత త్వరలో.

పా :— (నవ్వుతూ) నే నతనితో వాదించ తలుచుకోలేదు.

ఆం :— అప్పుడే యేమైంది? అతనితో వాదించడాని కింకా చాలా అవకాశాలున్నాయి. మనం ఒక్కసారి జనాన్నందరినీ ఊపెయ్యాలి. తర్వాత పని వాళ్ళే జరిపిస్తారు.

ని :— ఆంద్రీ! నీ కన్నీ సుళువుగా ఉన్నట్లే మాట్లాడుతావే!

ఆం :— అవును సుళువే. జీవితం సుళువుకాదూ? నేను పొలాల్లోకి షికారెడతాను.

త :— స్నానమైన తర్వాత షికారేమిటి?

ఆం :— అబ్బ! నా ప్రాణం గాలికోసం తపిస్తోంది.

పా :— జాగ్రత్త! జలుబుచేస్తుంది పడుకుని నిద్రపట్టించుకో.

అం :— అబ్బే; నిద్రపట్టదు. నేను వెడుతున్నా.

ఆంద్రీ వెళ్ళిపోయాడు. 'అతనికేదో చాలా బాధగా వున్నట్లుంది సుమా' అంది తల్లి. తల్లి ఆంద్రీని చాలా ప్రేమతో ఆదరిస్తున్నందుకు పావెల్ ఆమె నభినందించాడు.

"అమ్మా! నీ హృదయం అమృతం సుమా"

"అల్లాగా నాయనా? అయితే సంతోషమే. కాని మీ కేవిధంగానైనా నేను సహాయం చేయగలనా? చేయగలిగితే................"

"అమ్మా! మరేమీ భయంలేదులే చేస్తావు."

భయం లేకపోవడం ఎల్లాగ? అది తప్పదు. నాయనా ఆ మాత్రంధైర్యం చెప్పినందుకు సంతోషంగావుంది"

"సరేలే. ఇక ఆ విషయం యెప్పుడూ మాట్లాడుకోవద్దు. నీమీద నాకెంతో ప్రేమనే సంగతి మరచిపోకు. నువ్వుచేసే సహాయానికి నేనెప్పుడూ చాలా కృతజ్ఞుడనే"

ఆపుకోలేని దుఃఖంవచ్చింది. కొడుకుయెదుట కన్నీరు కార్చడాని కిష్టంలేక వంటయింట్లో వెళ్ళిపోయింది

## ౧౮

ఒకనాడు వైషోవికవ్ యథాప్రకారం చింకిరితలతోటి చీకి గుడ్డలతోటి అసహ్యంగా రుసరుసలాడుకుంటూ పావెల్ యింటికొచ్చాడు. వస్తూనే పావెల్‌కేసి తిరిగి.

"ఇసేని చంపినదెవరో తెలిసిందా? అన్నాడు.

"లేదు"

"ఎవడోకాని యేమీ ఆర్భాటం లేకుండానే కొట్టేశాడు. ఆపనెప్పుడో నేనే చేద్దామని తయారవుతున్నా. ఆపని నాదే అనుకునేవాడిని. అదే నాకు సరిపోయేపని.

• "నికోలే ' తెలివితక్కువ వాగుడు కట్టిపెట్టు" అని పావెల్ మందలించాడు స్నేహంగా.

తల్లి మాటకడ్డమొచ్చి "నాయనా! నీకిల్లాంటి బుద్ధి పుట్టిందేమిటి? నీ హృదయమైతే నవనీతములాంటిదే కాని పైకిమాత్రం కాట్లకుక్కలా అరుస్తావు. సంగతేమిటి?" అని బుజ్జగించింది. ఆ సమయంలో అతడంటే నిలోనాకెంతో జాలికలిగింది స్ఫోటకం మచ్చలతో వికారంగా వుండే అతని ముఖం చాలా ముద్దుగా కనబడింది.

• నికోలె వైషోవికవ్ పూర్తిపేరు.

"అమ్మా! నేను యిలాంటి పనులకు తప్ప యెందుకు పనికొస్తాను? ఈ ప్రపంచంలో నా స్థానమేమిటాయని ఎప్పుడూ ఆలోచిస్తూ వుంటాను. నాకెక్కడా స్థలం కనిపించడంలేదు. ప్రజలకు బోధచెయ్యాలంటే దాగా నేర్పుగా మాట్లాడడం చేతకావాలి. అది నావల్లకాదు. జరుగుతుంటే సంగతులన్నీ చూస్తూనేవుంటాను ప్రజల కష్టాలన్నీ నాకు తెలుస్తూనే వుంటాయి. కాని వాటిని చెప్పలేను. అంటే నాఆత్మ మూగదన్నమాట" అన్నాడు వైశోవికవ్. తర్వాత పావెల్ దగ్గరకెళ్ళి నేలకేసిచూస్తూ చంటిపిల్లాడులాగ ఇల్లాచెప్పాడు.

"సోదరా! నాకేదైనా మంచికష్టమైన పని వప్పచెప్పు. నేనిల్లాంటి బ్రతుకింక బ్రతకలేను నిరర్థకమైనబ్రతుకు బ్రతికితే ఏమి? బ్రతక్కపోతేనేమి? మీరంతా యీ వుద్యమంలో చక్కగా పనిచేస్తున్నారు. వుద్యమం దినదినాభివృద్ధి పొందుతోంది. నేనుమాత్రం దూరంగా వున్నాను. యేమీ పనిచేయడంలేదు. ఎంతసేపూ దుంగలు మొయ్యడం దూలాలెత్తడంతో నాపని సరిపోతోంది. ఈపనికోసమేనా బ్రతకడం? నాకేదైనా గట్టిపని చెప్పండి"

పావెల్ అతనిచెయ్యి పట్టుకుని అతి ఆప్యాయంగా దగ్గరకు లాక్కున్నాడు. "సరే. అల్లాగే చెప్తాములే"అని చెప్పి అప్పటికి సంతృప్తిపరిచాడు. ప్రక్కగదిలో నుంచి ఆంద్రీమాట వినిపించింది

"నికోలే! నీకు నేను చెప్తానుపని. చేస్తావా? అచ్చుకూర్చడం నేర్పుతాను. మన అచ్చుపనంతా నువ్వే చెయ్యవచ్చు అది నీకుసరి."

వైశోవికవ్ ఆంద్రీదగ్గర కెళ్ళేడు. "ఆంద్రీ! నువ్వునాకు అచ్చుపని నేర్పితే నాకత్తి నీకు బహుమతి యిస్తాను."

ఆంద్రీ ఫక్కున నవ్వేడు

"కత్తిఅంటే మామూలుకత్తి అనుకున్నావేమిటి?" అన్నాడు వైశోవికవ్ మళ్ళీ.

పావెల్‌కూడా ఫక్కున నవ్వేడు. వైశోవికవ్ గదిలో మధ్యనిలబడి "ఏమిటది? నన్నుచూచి నవ్వుతున్నావా"అన్నాడు. ఆంద్రీ గభాలున పడుకున్నవాడు లేచివచ్చి "సందేహమా? ఎందుకో తర్వాత చెబుతానులే కాస్సేపు పొలాల్లోకిపోయి షికారు చేద్దాంపదండి. వెన్నెల మహాబాగావుంది, లేవండి"అన్నాడు

"నువ్వు నవ్వుతూంటే చూడాలి; నేనొస్తానుపద"అని వైశోవికవ్ లేచాడు.

"నువ్వు బహుమతులు. వాగ్దానాలు చేస్తూంటే నాకు వినాలనుంది, రా" అంటూ సరసమాడేడు ఆంద్రీ

ముగ్గురూకలిసి బయటకు షికారు బయలుదేరేరు. కిటికీలోంచి తల్లి వాళ్ళకేసి రెప్పవాల్చకుండా కాస్సేపుచూసింది. తర్వాత క్రీస్తుదేవుని బొమ్మకేసి తిరిగి "ఓయిభగవానుడా! వాళ్ళకు తోడ్పడాలి సుమా!" అని అప్రయత్నంగా తనలో తానే ప్రార్థించింది. తర్వాత లోపలకెళ్ళి దీపం ఆర్పేసి వెన్నెల్లో ప్రార్థనచేసింది.

* * * *

రోజులు నిముషాల్లాగున గడచిపోయాయి. కాలచక్రవేగంలో తల్లికి మే 1 టవ తేదీనిగూర్చి ఆలోచించడానికి తీరికలేక పోయింది. పగలల్లా పనిలో విసిగి విసిగి పడుకుంటే యెప్పుడైనా ఒక్కొక్కప్పుడు యీ విషయం జ్ఞాపకానికొచ్చేది అదేదో త్వరగా అయిపోతే బాగుండును కదా అనుకునేది

ప్రొద్దున్న ఫ్యాక్టరీ కూత వెయ్యడంతోనే పావెల్, అంద్రీయ గబగబా గ్రుక్కెడు టీ త్రాగి తల్లికేవో పని చిల్లరపనులు పురమాయించి చక్కాపోయేవారు. రోజంతా విసుగూవిశ్రమం లేకుండా కాస్సేపువంటపని, కాస్సేపు గోడలమీద కాగితాలంటించడానికి మైదాపిండి వుడికించడం, మరి కాస్సేపేవో యింకొకపనీ యిల్లాగే యెప్పుడూ యేదో ఒక పనిచేస్తూ వుండేది. మధ్యమధ్య యెవరో ఒకరొచ్చి పావెల్ కిమ్మని యేదో చీటీముక్క లామెచేతికిచ్చి హడావిడిగా వెళ్ళిపోతూ వుండేవారు.

మే 1 టవ తేదీని కార్మికోత్సవము జరుపవలెనని పనివాళ్ళందరినీ హెచ్చరించే కాగితాలు లెక్కా పత్రంలేకుండా కూలీపేటలోకి, ఫ్యాక్టరీలోకి వచ్చిపడ్డాయి. తెల్లవారేసరికి యేగోడమీద చూసినా, ఆకాగితాలే అంటించి ఉండేవి. ఆఖరుకి పోలీసుస్టేషను తలుపులమీదకూడ అవే సిద్ధమయేవి. ప్రొద్దున్నే పని పెట్టుకుని పోలీసులు బయలుదేరి నానాతిట్లూ తిట్టుకుంటూ ఊరంతాతిరిగి ఆనోటీసులన్నిటిని చింపిపారేస్తూ వుండేవారు మళ్ళీ మరునాడు ప్రొద్దున్నే గోడలమీద సిద్ధంగానే వుండేవి మధ్యాహ్నమప్పుడు ఈ కాగితాలు ఊరికే ఎగిరిపోతూ వుండేవి యేవీధిలోచూసినా అవే. రహస్యపు పోలీసులు ప్రతివీధి మొగలోనూ నిలబడి వచ్చేవాళ్ళని వెళ్ళేవాళ్ళని కనిపెట్టి చూస్తూనే వుండేవాళ్ళు ఏమైనా, నోటీసులు మాత్రం గోడలమీది కెగిరొచ్చి పడుతూనే ఉండేవి. జనం అంతా ఈ తమాషానుచూచీ, పోలీసులేమీ చెయ్యలేకపోవడం చూచీ నవ్వుకుంటూ వుండేవాళ్ళు ముసలికూలీలుకూడా ఆశ్చర్యపడి ముక్కుమీద వ్రేలేసుకున్నారు

అంతటాకూడా జనం గుంపులు గుంపులుగాచేరి ఈ నోటీసుల్లో వుండే సంగతులన్నీ చర్చచేయడం మొదలెట్టేరు ప్రజలలో ఉడుకు ప్రారంభమైంది. మొత్తంమీద అందరికీ ఏదో క్రొత్తవింత; ఒక ఉద్రేకం. కొందరు ఈ ఆందోళకులను తిట్టిపోసి సంతుష్టిపడేవారు. కొందరికేదో ఆత్రత; ఏదో ఆశ. ఇంకా కొందరికి సంతోషం. ఉత్సాహానికంతా కారణం తామేకదా అనే తృప్తి.

పావెల్, అంద్రీయ నిద్రాహారాలుకూడా లేకుండా పనిచేశారు. రాత్రంతా ఎక్కడో తిరిగి తిరిగి తెలతెలవారుతూవుంటే ఇంటికొచ్చేవాళ్ళు. ఏ తోటల్లోనో దొడ్లల్లోనో కూలివాళ్లు సభలుచేస్తూ వుండడంమాత్రం తల్లికి తెలుసును.

గుర్రాలమీద పోలీసులు రాత్రంతా గస్తీతిరుగుతూ వుండేవారు. ఒంటరిగా వెడుతున్న కూలీలను అటకాయించడం అప్పుడప్పుడు కొందరి నరెస్టుచేయడం కూడా మొదలెట్టారు. ఏమూలచూచినా గ్రామమంతా రహస్యపు పోలీసులు నక్కి

నక్కి సంచరిస్తూవుండేవాళ్ళు. ఎప్పుడో అమాంతంగా తనకొడుకునీ, ఆంద్రీనీ కూడా అరెస్టుచేస్తారని తల్లికి చూచాయగా తెలిసింది. వాగా ఆలోచించుకుంటే ఆమెకు వాళ్లు ముందుగా అరెస్టయిలేనే మంచిదేనేమో ననుకునేది.

రికార్డు గుమాస్తా ఐసే హత్యవిషయమైన దరియాప్తు ఆగిపోయింది. ఆ వూరు పోలీసులు రెండు రోజులు దడబిడలు పడి పదిమందిని పట్టుకుని విచారణచేసి చివరకి ఆకేసు వదులుకున్నారు. ఒకరోజున మాటవశాత్తు మేరీకార్సునోవా ఈ సంగతి తల్లితో చెప్పింది. మేరీకి పోలీసువాళ్ళతో పరిచయం యెక్కువ. ఆమె ఆ విషయమై యిల్లా చెప్పింది :

"ఎవరు చంపారో కనుక్కోవడం యెవరితరం? ఆ రోజు ప్రొద్దున్న సుమారొక వందమందైనా ఐసేని కలుసుకొనివుంటారు. అందులో అధమం తొంభైమందైనా అతనికి శత్రువులుంటారా? ఏ పదిమందో కలిసి వెయ్యక పోయినా, ఆఖరుకి ఏ ఒక్కడైనా వేసి వుండొచ్చు ఒకదెబ్బ. ఎనిమిదేళ్ళనుంచి అతడందరినీ హింసపెడుతూనే వున్నాడు"

* * * *

ఆంద్రీ యిటీవల చాలా మారిపోయాడు. ముఖంలో మునుపటి వికాసం లేదు. ఇదివరకంత మాట్లాడడంకూడా మానేశాడు కాని మనిషిలోవుండే తీవ్రత మాత్రం తగ్గలేదు కొంచెంగా మాట్లాడినా జనాన్ని సమ్మోహింపచేసే శక్తిమాత్రం ఆలాగేవుంది అతడు తరుచు మే 1 వ తేదీనిగూర్చి, కార్మికులయొక్క భావి భాగ్యాన్నిగురించీ, ముందుముందు ప్రపంచంలో కలుగబొయ్యే స్వేచ్ఛా సౌఖ్యాల్ని గురించీ మాట్లాడుతూవుంటే వినేవాళ్ళంతా విస్మయులై పోయేవారు. ఐసే హత్యను గురించిన విచారణ ఆపుచేశారనే సంగతి వినడంతోనే ఆంద్రీ చాలా విసుక్కొని చిరునవ్వునవ్వుతూ యిల్లా అన్నాడు.

"అధికారులు ప్రజలనొక్కళ్ళనేకాదు గడ్డిపరకలక్రింద తీసిపారెయ్యడం, ప్రజలమీద కుసికొలిసే కుక్కలనుకూడా అల్లాగే తృణీకరించి పారేస్తారు. తమ కెంతో విశ్వాసంతో చాకిరీచేసే ఈకుక్కలంటే వాళ్ళకేమీ లక్ష్యంలేదు. ఎంతసేపు తమ కాయుష్యం తమ కారోగ్యమే. కృతఘ్నత.........పాపం, ఆ నిర్భాగ్యుడి సంగతి తలుచుకుంటే నాకే జాలేస్తుంది. నేనతన్ని చంపదలచుకోనేలేదు"

పావెల్ "చాలు చాలు ఆగు" అన్నాడు. "నాయనా! నువ్వేమిచేస్తావు? నీతప్పేముంది? అప్రయత్నంగా నీతల ఒక పాపిష్టిజీవికి తగిలింది. ఆ పాపిష్టి బ్రద్దలై పోయింది. అంతే" అని తల్లి సముదాయించింది. "నువ్వుచెప్పినమాట నిజమే కాని అలా సంతుష్టి పొందడానికి వీలులేదు" అన్నాడు. ఆంద్రీ విచారంతో తరుచు అతని ధోరణిలోనే మాట్లాడుతూ వుండేవాడు.

* * * *

ఆఖరికి మే 1 వ తేదీ వచ్చింది. మామూలుగానే ఫాక్టరీ చెవులు గింగురు మనేటట్లు కూసింది. ఆక్రితం రాత్రి అంతా తల్లికి నిద్రపట్టలేదు. అందుచేత పెందలకడే లేచి టీకి నీళ్ళుకాచి అన్నీసిద్ధంగా ఉంచింది. మామూలుగానే పావెలును, ఆంద్రీని లేపడానికి వాళ్ళ గదిదగ్గరకెళ్ళింది. ఇంతలో ఆమెకు మే ఒకటవ తేదీ అనే స్పృహవచ్చి కిటికీదగ్గర కూచోబడింది. ఏమీ తోచక తదేకధ్యానంతో ఆకాశంకేసీ, మేఘాలకేసీ చూస్తూకూచుంది. ఆచూపుకేమీ అర్థంలేదు. తల బరువెక్కిపోయింది. ఆమెకొక చిత్రమైన ప్రమాదావస్థ సిద్ధించింది. తనలోతానే 'ఇవ్వాళ టీకి నీళ్ళు పెందలకాడే పెట్టే వాళ్ళు ఇంకా నిద్రలేవనేలేదు. చాలా అలసిపోయియున్నారు. పాపం!' అనుకుంది.

సూర్యుని అరుణ కిరణాలు గదిలో తొంగిచూచేయి. తల్లి వాటినిఆనందిస్తూ చూసింది. ఒక్క నిముషమైన తర్వాత మరిగిపోతున్న నీళ్ళ గిన్నెను పొయ్యి మీదనుంచి దింపేసి, చేతులూ కాళ్ళూ కడుక్కొని మెల్లగా దేవుణ్ని ప్రార్థించింది. వాళ్ళకెక్కడ నిద్రాభంగమవుతుందోనని, ఏమి చప్పుడుచేయకుండా పనులన్నీ చక్కబెట్టుకుంది.

ఫ్యాక్టరీ రెండోకూతేసింది. ఆంద్రీకి మెలకువ వచ్చి పావెల్‌ను లేపాడు. పావెల్ బిగ్గరగా ఆవులిస్తూ లేచాడు. సావిట్లోంచి తల్లి టీ సిద్ధంగా వుందని కేకపెట్టింది. "మేములేచాం. వస్తున్నాం" అన్నాడు పావెల్. ఆంద్రీ లేచి చిరునవ్వునవ్వుతూ వంటయిట్లోకెళ్ళి తల్లికి వందనంచేసి పలుకరించాడు.

"అమ్మా! రాత్రి బాగా నిద్రపట్టిందా?"

"ఆ............నువ్వుమాత్రం పాషాకి దగ్గరగానే వుండాలిసుమా!" అని తల్లి ఆంద్రీ చెవిలోచెప్పింది. "సందేహమేమిటి? అల్లాగే. మావశంలో వున్నంత వరకూ ఇద్దరం ఒకళ్ళనొకళ్ళు విడిచిపెట్టం" అని నమ్మకంగా ఆంద్రీ ఆమె చెవులోనే చెప్పాడు

"ఏమిటోయి! ఆ రహస్యం?" అన్నాడు పావెల్.

"మరేంలేదు. ఇవ్వాళ నన్ను బాగా ముఖం గిఖం కడుక్కోమంటూంది అమ్మ. ఆడవాళ్ళంతా నన్నే చూసేటట్టుండాలిట" అంటూ ఆంద్రీ ముఖం కడుక్కునేందుకు వెళ్ళిపోయాడు.

* "మేలుకోరా కూలివాడా,
మేలుకొని నీదేశ—మేలుకోరా కూలివాడా"

అంటూ మెల్లగా పావెల్ పాటపాడాడు. తల్లి ప్రాతఃకాల భోజనానికి టీ, రొట్టె వగయిరాలన్నీ తయారుచేసిపెట్టింది. మధ్యాహ్నం ఏమిజరుగుతుందో అనే ఆలోచనగాని ఆందోళనగాని కించిత్తయినాలేకుండా వాళ్ళిద్దరూ నవ్వుతూ ఉండడం ఆమెకు చాలా ఆశ్చర్యమేసింది. రోజూకన్న ఆవేళ పావెల్ ఆంద్రీలు తీరికగా

---

* Rise up awake you workingmen

టీ త్రాగుతూ కూచున్నారు. పావెల్ టీలో పంచదార కొంచెంకొంచెం కలుపుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు. ఆంద్రీ కాళ్ళుఊపుకుంటూ గదిలో ప్రసరించుచున్న సూర్య కిరణాల సౌందర్యం, గోడలమీద వాటి నృత్యంచూచి ఆనందిస్తూ కూచున్నాడు. ఇద్దరూ బాతాఖానీలోకి దిగేరు. చిన్ననాటి అల్లరిపనులను జ్ఞాపకం చేసుకుంటూ వాటిమీద చర్చచేయడం ఆరంభించారు. సందర్భంలేని యీసోది అంతా వింటుంటే తల్లికి విసుగొచ్చింది.

"మీరు ఉత్సవం యేర్పాట్లగురించి మాట్లాడుకోకుండా యీ ఊకదంపు ఆరంభించారేమిటి ?" అని అడిగింది.

"అన్ని యేర్పాట్లు అయిపోయాయి" అన్నాడు పావెల్.

"ఒకసారి ఏర్పాట్లన్నీ చేసుకున్నాక ఆ విషయాలనుగురించి పదేపదే మాట్లాడుకుంటే ప్రయోజనమేమీలేదు. వృథాగా మనస్సు కలవరపరచుకోవడమే. మేమంతా అరెస్టయిపోతే ఏమిచెయ్యాలో నీకు * నికోలే ఇవానిష్‌వచ్చి చెపుతాడు. అతనే యిక నీకు అన్నివిధాల సహాయం" అన్నాడు ఆంద్రీ. తల్లి నిట్టూర్పువిడిచి సరేఅనుకుంది. పావెల్ బయటికి పోదామన్నాడు. అనవసరంగా పోలీసుల కళ్ళు కుట్టేటట్లు తిరగడమెందుకు కనక వద్దన్నాడు ఆంద్రీ.

ఇంతలో ఫెద్యామేజిన్ ఒగర్చుకుంటూ వచ్చాడు. అతని ముఖం సంతోషంతో కలకలలాడుతోంది. బుగ్గలు యెర్రబడిపోయాయి. ఒగరుస్తూనే "ఆరంభమయింది" అన్నాడు.

"జనం అంతా వీధుల్లో నిలబడివున్నారు. వైషోవికవ్, గాసెవ్ సోదరులు శామొరో ఫాక్టరీగేట్లదగ్గర నిలబడి కూలీలను హెచ్చరిస్తూ ఉపన్యాసాలిస్తున్నారు. కూలీలు చాలామంది ఫాక్టరీలోనుంచి వచ్చేశారు. పదండి మనం వెళ్ళాలి. అప్పుడే పదిగంటలయింది." .

పావెల్ లేచి బయలుదేరాడు.

"మధ్యాహ్నానికి ఫాక్టరీఅంతా ఖాళీ అయిపోతుంది" అంటూ చక్కాపోయాడు ఫెద్యా,

అతను వెళ్ళిపోతుంటే తల్లి "గాలిలో దీపంలా వున్నాడు" అనుకుంది. తల్లి దుస్తులు ధరించడానికి వంటయింట్లో కెళ్ళింది.

"అమ్మా . నువ్వెక్కడికి ?" అన్నాడు పావెల్ .

"మీతోటే"

పావెల్, ఆంద్రీ లొకళ్ళనొకాలొకళ్ళు చూసుకున్నారు. పావెల్ చేత్తో తల సర్దుకుని, "సరేనమ్మా ! నీకు నేనేమీ చెప్పదలుచుకోలేదు. నువ్వు నాకేమీ చెప్పొద్దు సరేనా ?" అన్నాడు.

"అల్లాగే నాయనా ! అల్లాగే : దేవుడు మిమ్మల్ని చల్లగా చూడాలి అంతే."

---

* పట్టణవాసంలో వుండే సామ్యవాది. ఉపాధ్యాయుడు.

తల్లి పావెల్, ఆంద్రీలవెంట బయలుదేరి వెళ్ళింది. ఎక్కడచూచినా ప్రజల కలకలధ్వనులతో చెవులు గింగురుమంటున్నాయి. ఉత్సాహానికి మేరలేకుండాఉంది. తనకొడుకూ ఆంద్రీ కలసి నడుస్తుంటే జనమంతా వాళ్ళకేసి తేరిపారచూడడం ఆమె కనిపెట్టింది. కొందరు వాళ్ళకి సగౌరవంగా నమస్కారాలు పెట్టారు. ఈ సందడిలో ప్రజలనుకునే రకరకాల కబుర్లు ఆమె చెవుల్లో పడ్డాయి. "ఇదుగో నయ్యా! వచ్చారు నాయకులు."

"నాయకు లెవరేమిటి?"

"నాయకులంటే తప్పా?"

ఇంకొకచోట ఒక దొడ్లో ఇద్దరు మాటాడుకుంటున్నారు ఆవేశంతో.

"పోలీసువాళ్ళొచ్చి పట్టుకుంటారు. దానితో వాళ్ళ పనవుతుంది."

"ఏం పట్టుకుంటే? మునిగిపోతుందా"

మరొకచోట వీధి కిటికీలోనుంచి ఈ ముక్కలు ఆమెచెవిలో పడ్డాయి.

"ఆలోచించుకో. వాళ్ళంటే పెళ్ళాంబిడ్డలు లేని మొరకళ్ళు. ఒంటిరిగాళ్ళు, ఏలక్ష్యంలేకుండా ఏపనైనా చెయ్యవచ్చు. నువ్వలాంటి వాడవు కావుమరి!"

ఫ్యాక్టరీలో కాళ్లు విరుగగొట్టుకుని పింఛను పుచ్చుకుంటున్న జోసిమో యింటి దగ్గరనుంచి వెడుతూంటే అతడు కిటికీలోనుంచి తలబయటికిపెట్టి "ఏయ్ పావెల్. గాడిదా! నీతలకాయి ఎగరేస్తారులే." అని గట్టిగా కేకేశాడు. ఈ కేక విని తల్లి అదరిపడి నిలబడింది. ఆ కుంటివాడిమీద కోపంవచ్చి వాడికేసి తీవ్రంగా చూచింది. వాడు తిట్లు మరింత జోరుచేశాడు. ఏం చెయ్యలేక ముందున్న పావెల్ ఆంద్రీలను కలుసుకుంది. వాళ్ళీమాటలేమీ వినిపించుకోకుండానే పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ కులాసాగా నడిచి పోతున్నారు. దారిలో దేనియల్ ఇవానిష్ అనే పెద్దపనివాడు కనబడి పలుకరించాడు.

"ఏమిటీ? దేనియల్! నువ్వూ పని మానేశావూ?" అన్నాడు పావెల్.

"ఆ! నాభార్య ఇవ్వేళ నొప్పులుపడుతోంది. పైగా ఇవ్వేళ ఇంత హడా విడిగావుంటే పనేమిటి?" అని జవాబుచెప్పేడు దేనియల్. కాస్త దగ్గరకొచ్చి "ఇదిగో! మీరు యేదో దిట్టమైన గడబిడ చెయ్యదలచుకున్నారని విన్నాను. కానివ్వండి. ఇదే సమయం. సూపర్నెంటు తలుపులు గిలుపులు యెగిరిపోవాలి." అన్నాడు. "మే మేమైనా తాగి తందనాలు త్రొక్కుతామనుకున్నావా యేమిటి?" అన్నాడు పావెల్. "మేమూరికే జండాలు పుచ్చుకుని పాటలు పాడుకుంటూ వీధుల్లో ఊరేగుతాం. అంతే. అంతకన్న గడబిడ యేమీలేదు. నువ్వుకూడావస్తే పాటలువిందుగాని, అప్పుడు మా అభిప్రాయ మేమిటో తెలుస్తుంది." అన్నాడు ఆంద్రీ. "మీ అభిప్రాయాలు మీ తత్త్వాలు నాకు తెలుసును. మీ కరపత్రాలు, పత్రికలు చదువుతూనేవున్నా. (తల్లికేసి తిరిగిపరిచయంగా) ఏమిటమ్మోయి! నువ్వుకూడా తిరుగుబాటుకే బయలుదేరేవా?"

"కాటికికాళ్ళుచాచుకున్నప్పుడయినా సత్యమార్గాన్ని అనుసరిద్దామని నాకోరిక" అంది తల్లి. "ఓహో! అయితే సరే ఇప్పుడర్థమైంది. ఫ్యాక్టరీలోకి రాజద్రోహపు కరపత్రాలు తీసుకొచ్చింది నువ్వే అన్నారు. నేను నమ్మలేదు. వాళ్ళన్న మాట నిజమేనన్నమాట."

"ఎవరన్నారు?" అన్నాడు పావెల్. "యెవరేమిటి? జనం. సరిలెండి; నేను పోతాను మీయిష్టం. యేదో మీ తంటాలు మీరుపడండి" అంటూ డేనియల్ చక్కాపోయాడు.

తల్లి ముసి ముసి నవ్వులు నవ్వుకుంది. తన్నుగురించి జనం ఈ మాత్రం చెప్పుకుంటున్నారుగదా అని సంతోషించింది. పావెల్ చిరునవ్వుతో "ఏమమ్మోయి! నువ్వుకూడా ఖైదులో కొస్తావు" అని హెచ్చరించాడు.

"సిద్ధమే. అంతకన్నానా?" అంది తల్లి మెల్లగా.

* * * *

బాగా పొద్దెక్కింది. వసంతకాలమవడంచేత మనుష్యుల ముఖాల్లో వికాసం కనబడుతోంది. ఆకాశం మీద లేతమబ్బులు పరుగెత్తుతున్నాయి. గ్రామానికంతా కొత్తగా శోభవచ్చింది. ప్రజలగోల ఫాక్టరీ మిషనుల చప్పుడ్ని ముంచేసింది. ఏ యింట్లో కబుర్లు వినవచ్చినా యిదేగొడవ. కొందరు మంచిగాను కొందరు చెడ్డగాను పరిపరివిధాల చెప్పుకుంటున్నారు.

పెద్దవీధినుంచి పోయే ఒక సందు మొగలో నూరుమంది చేరేరు. వాళ్ళ మధ్య నిలబడి వైషోవికవ్ జోరుగా ఉపన్యాసం దంచేస్తున్నాడు.

సరిగ్గా పావెల్ ప్రభృతులక్కడి కెళ్ళేసరి కతను "మన రక్తాన్ని వాళ్ళు ద్రాక్షకాయల రసం పిండేస్తున్నట్లు పిండేస్తున్నారు" అంటూ మాట్లాడుతున్నాడు.

ప్రజలకీ మాటలు బాణాల్లా తగులుతున్నాయి. ఉద్రేకం ఉత్సాహం పొర్లిపోతోంది. "నిజం నిజం" అని సభలోంచి కేకలు లేచాయి.

"మన కుర్రాడు బాగానే కొట్టుకొస్తున్నాడు. నే వెళ్ళి సాయం చేస్తాను" అంటూ ఆంద్రీ గుంపులో దూరి మధ్య నిలబడి ఉపన్యాసం ఆరంభించాడు.

"సోదరులారా! ప్రపంచంలో యూదులు, జర్మనులు, ఆంగ్లేయులు, టార్టనులు మొదలైన అనేకజాతు లున్నాయని కొందరు చెపుతారు. నే నదంతా నమ్మను. భూమండలంలో రెండే రెండుజాతులున్నాయి. ఆ రెండుజాతులు ఒకదానితో నొకటి యెప్పటికీ కలవవు. అవేవంటే ధనికులు — పేదలు. వీళ్ళ వేషభాషలన్నీ వేరే. ప్రపంచంలో జనం అనేక రకాలుగా దుస్తులు ధరిస్తారు. అనేక భాషలు మాట్లాడుతారు. కాని ధనికుడయిన ఆంగ్లేయుడినో, ఫ్రెంచి దేశస్తుడినో, జర్మనువాడినో చూడండి. వాళ్ళ తప్పాదియ్యా; బీదల నేడిపించడంలోనూ కూలివాళ్ళని క్షోభ పెట్టడంలోనూ అంతా ఒక్కటే మచ్చు."

( జనంలో నవ్వు )

"ఇక ఫ్రాన్సుదేశంలో, టర్కీదేశంలో, టార్టన్ దేశంలో- ఈ దేశ మా దేశ మేమిటి—యే దేశంలోనైనా సరే, కూలివాడి బ్రతుకు చూడండి. అంతా ఒక్కటే మోస్తరు. మన రష్యను కూలిజనంలాగే నిర్భాగ్యమైన కుక్కా నక్కా బ్రతుకు బ్రతుకుతున్నారు.

(జనం గుంపు పెద్దదయిపోయింది. సందు మొగంతా నిండేరు. ఎవళ్ళ మట్టుకువాళ్ళు చప్పుడుచెయ్యకుండా వింటున్నారు. ఆంద్రీ గొంతుక పెద్దదిచేశాడు) "విదేశములలోవుండే కూలినాలి జనం ఈ సత్యాన్ని అప్పుడే గ్రహించారు. ఈ మే 1 వ తేదీని, ఈ వసంతోత్సవ సందర్భమున ప్రపంచమంతన్ని దేశాల్లోవుండే కూలినాలి జనం ఒకళ్ళకొకళ్ళు సానుభూతిని తెలుపుకుంటున్నారు. ఈ రోజున ప్రపంచమంతటా కూలీలు పనిమానేసి, ఉత్సవాలు జరిపి తమ అపారశక్తిని పరీక్ష చేసుకుంటున్నారు. ఈ పవిత్రదినమున ఇచట కార్మికులంతా ఐక్య హృదయులగుదురుగాక! తమ అఖండశక్తిని గుర్తించెదరుగాక! అందరి హృదయాల్లోనూ సోదరభావం కలుగుగాక! ప్రతివాళ్ళూ అందరియొక్క సౌఖ్యంకోసం, స్వేచ్ఛకోసం, సత్యంకోసం, ధర్మంకోసం తమ ప్రాణాలనయినా అర్పించదానికి సంసిద్ధులయ్యెదరుగాక! సోదరులారా!..................." "పోలీసు! పోలీసు!" అనే కేకలు బయల్దేరినాయి.

## ౧౯

మెయిన్‌రోడ్డుమీదనుంచి నలుగురు పోలీసులు గుర్రాలను దౌడాయించుకుంటూ తిన్నగా ప్రజలమీదకొచ్చి పడ్డారు.

"పొండి ఎక్కడివాళ్ళక్కడికి!"

"ఏమిటీ సభ?"

"ఎవరా మాట్లాదేది?"

ఈ కేకలు వినబడేసరికి ప్రజలు చల్లగా తప్పుకున్నారు. కొందరు గోడ లెక్కి చూస్తున్నారు. మరికొందరు చెట్లెక్కేరు.

"లగుదుముమ్మాయని, నాయకులంటూ బయలుదేరేరు కుంకలు. కుక్కల్ని అందలాలెక్కిస్తామంటారు" అంటూ యెవడో బొంయ్యిమన్నాడు.

ఆంద్రీ ఒక్కడే వీధిమధ్యను నిలబడిపోయాడు. రెండు గుర్రాలు సకిలించుకుంటూ రెండువేపులనుంచి అతనిమీద కొచ్చాయి. మధ్య నొక్కుకుపోయేటంత పనైంది కాని ఆంద్రీ మెల్లగా ప్రక్కకొదిగాడు. ఇంతలో తల్లి అతని చెయ్యి పట్టుకుని యివతలికి లాగింది.

"ఆంద్రీ! ఇదేంపని! నువ్వుపాషాను విడిచిపెట్టనని నాకు మాటిచ్చేవు

కాదూ ? మరి యిప్పుడెందుకల్లా ఒంటరిగా పెద్దపులినోట్లో చెయ్యిడతావు ?"అని అడిగింది.

"అవును. పొరపాటే. తప్పే" అని ఆంద్రీ ఒప్పుకున్నాడు. పావెల్ కేసి తిరిగి "అబ్బ ! ప్రపంచంలో పోలీసుఫౌజు ఎంతుందో" అన్నాడు.

తల్లి తలకాయ ఆడించింది. ఆమె హృదయంలో యేమిటో చెప్పలేని ఆందోళన పుట్టింది. తల దిమ్మెక్కిపోయింది. సంతోషం విచారంకూడా కలిసి వచ్చాయి. త్వరగా మధ్యాహ్నం వేళైపోయి, ఏదో తేలిపోతే బాగుండునని పించింది. అంతా చర్చిదగ్గర మైదానంమీదికొచ్చారు. అక్కడ నాల్గయిదువందల జనం గుంపులు గుంపులుగాచేరి రొదచేస్తున్నారు. దేనికోసమో అంతా ఆత్రత పడుతూ చూస్తున్నారు. వాళ్ళల్లోవాళ్ళు చర్చలు చేసుకుంటున్నారు.

"ఏమోయి మీటింగా ? నువ్వు బాగా ఆలోచించుకో, ప్రమాదం నెత్తి మీదికి కోరితెచ్చుకోకు" అంటూ ఒకమెల్లని స్త్రీస్వరం వినబడింది. దానికి "నోరు ముయ్ ! ఇకచాలు" అని జవాబువచ్చింది.

సిజావ్ గొంతుక లేచింది.

"మన బిడ్డల్ని మనం వదలిపెట్టకూడదు. ఉహూం కూడదు వాస్తవానికి వాళ్లు మనకన్న తెలివైనవాళ్ళయినారు. మనకన్న నిస్సందేహంగా ధైర్యవంతులు. మొన్న మురుగుగుంటతాలూకు వ్యవహారంలో వాళ్ళుచేసిన ధైర్యంవల్లనే మన డబ్బు మనకు మిగిలింది. ఆసంగతి మనం మరచిపోకూడదు. కష్టపడి పనిచేసి నందుకు వాళ్ళని జైల్లో పెట్టారు. లాభంమాత్రం మన మనుభవిస్తున్నాం. కష్టం వాళ్ళది. ఫలితం మనందరిదీని."

ఫ్యాక్టరీ మధ్యాహ్నం కూతేసింది. జనమంతాలేచారు. ఒక్కక్షణం చీమ కూడా చిటుక్కుమననంత నిశ్శబ్దం. అందరూ ఆత్రతతో చూస్తున్నారు. ఖంగు మనే గొంతుకతో పావెల్ 'సోదర సోదరీమణులారా' అని వుపన్యాసం ప్రారంభించాడు. తల్లి అదిరిపడింది. నెమ్మదిగా ధైర్యం తెచ్చుకుని కొడుకువెనకాల చేరింది. జనమంతా సూదంటురాయిదగ్గర కినుపముక్కలు చేరినట్లు గబగబా పావెల్ దగ్గరకు చేరారు.

"సోదరులారా! ఆశాపూరితమైనవన్నీ, అంధకారబంధురమైనవన్నీ, హింసా సహితమైనవన్నీ. యీ అసహ్య జీవితాన్ని వదలివేయవలసిన రోజు వచ్చింది. యీజీవితమే మనఆత్మను, మనలోని మానవత్వాన్ని నశింపజేసి, ఈ ప్రపంచంలో మనకు స్థానంలేకుండా చేస్తోంది. ఇటువంటి నిర్భాగ్యపు బ్రతుకును ఒక మహత్తరమైన ఆదర్శంకోసం తృణప్రాయంగా వదలిపెట్టేసేకాలం వచ్చింది" అంటూ పావెల్ గంభీరంగా తనఉపన్యాసాన్ని సాగించాడు. ఒక్కక్షణం ఆగాడు. జనం మరీదగ్గరగా ఒత్తుకొచ్చారు. తల్లి అతనికేసి తేరిపారచూచింది. అతని కండ్లల్లో తల్లికి ఒక గొప్పజ్యోతి కనబడింది.

"కామ్రేడ్సు! మన సేవకమో, మన ఆదర్శమేమిటో బహిరంగంగా తెలుపడానికి నిశ్చయించుకున్నాం. సత్యసమ్మతమైనట్టిన్నీ, ధర్మసమ్మతమైనట్టిన్నీ మన పతాకాన్ని ఇదిగో యివ్వేళ నేను ఎగరేస్తున్నాను" అని పావెల్ జండా నెత్తాడు. కార్మిక పతాకము రక్తవర్ణశోభితమై గాలిలో స్వేచ్ఛగా ఎగిరింది. పావెల్ చేయెత్తి కర్రను పట్టుకున్నాడు. కాని గాలిపాటున అది వూగులాడు తుండటచేత మరి పదిమంది గట్టిగా దాన్ని పట్టుకొన్నారు. తల్లికూడా చెయ్యి వేసింది.

"కార్మిక జనమునకు క్షేమమగుగాక!"

అని పావెల్ జయధ్వానంచేశాడు వందలకొద్దీజనం ప్రతిధ్వానంచేశారు.

సాంఘిక ప్రజాస్వామిక కార్మికపక్షము చిరస్థాయియగుగాక!"

ప్రజలలో పెద్దధ్వని, పతాకంయొక్క అభిప్రాయం గ్రహించినవాళ్ళంతా ఒక్కసారి జండాను చుట్టుకుని వెనక్కివచ్చారు. ఫెడ్యామాజిన్. శామొలో, గాసెవ్ సోదరులు మొదలైనవాళ్ళంతా పావెల్ ప్రక్కనే నిలబడ్డారు. వైషోవికవ్ ఇంకా కొందరు యువకులు ఉద్రేకంతో జనాన్ని తోసుకొచ్చి పావెల్ ముందు నిలబడ్డారు.

"ప్రపంచంలోని కార్మికులందరికి క్షేమమగుగాక!" అని పావెల్ జయ ధ్వానం చేశాడు. ప్రజలు ఇదివరకుకన్న యెక్కువ జోరుగా ప్రతిధ్వనిచేశారు

తల్లి ఒకచేత్తో పాషాచెయ్యి పట్టుకుంది. రెండవచేత్తో ఎవరినో పట్టుకుంది. ఆమె దేహమంతా జలదరించింది. కాళ్ళు వణికినాయి. తడబడుతున్న పెదవుల నుండి అప్రయత్నంగా "నాయనలారా! నిజం, నిజం!" అనే మాటలు వెలువడ్డాయి.

నికోలేవైషోవికవ్ సంతోషాతిశయంచేత తల్లిచెయ్యి ముద్దుపెట్టుకున్నాడు.

ఇంతలోఆండ్రీ తీవ్రంగా తన ఉపన్యాసాన్ని ప్రారంభించాడు. అతనికంఠం జనంగోల నంతటినీ ముంచేసింది.

"సోదరులారా! మనము నేడొక నూతనమైన భగవంతునిపేరిట పవిత్ర మైన యీఉత్సవమును ప్రారంభించాం. ఆభగవంతుడు సత్యం, ధర్మం, జ్ఞానం, ప్రకాశం, మంచితనం మొదలైన సద్గుణసంపత్తికి మూలమైనవాడు. సోదరులారా! ఈ యూరేగింపు సాగేమార్గం అతి దీర్ఘమైనదికూడాను. మన లక్ష్యమింకా చాలాదూరాన్నేవుంది. ముండ్లకిరీటము మాత్రం దగ్గరలో కనబడుతోంది. ఇందులో యెవరికైనా, సత్యధర్మాలయొక్క శక్తియందు విశ్వాసం లేకపోయినా, వాటి కొరకు ప్రాణాన్నికూడా అర్పించే ధైర్యసాహసములు లేకపోయినా యేవిధమైన భయభ్రాంతులు కలిగినా, అల్లాంటివాళ్ళు యిప్పుడే తప్పుకోవచ్చు. తక్షణం తప్పుకోండి! మనకు తప్పక విజయం కలుగుతుందనే సంపూర్ణమైన విశ్వాసం కలవాళ్ళే ముందుకురావాలి. మా ఆదర్శమునందు నమ్మకం లేనివాళ్ళు రావద్దు.

వాళ్ళకి దుఃఖం తప్పదు. సోదరులారా ముందంజవేయండి! స్వేచ్ఛావాసులకు పండుగదినమైన వసంతోత్సవం చిరస్థాయి యగుగాక!"

జనం అత్యుత్సాహంతో తొక్కుడుపడి జండాదగ్గర కొత్తుకొచ్చారు. పావెల్ జండా నాడించాడు. ప్రజలు జయజయ ధ్వానాలు ప్రారంభించారు.

"పాత పద్ధతులను వదిలేద్దాం" అంటూ ఫెద్యా ఊతం ఇచ్చాడు. జనం దాన్ని అందుకుని జయధ్వానాలు సాగించింది.

ఊరేగింపు ప్రారంభమైంది. తల్లి ఫెద్యా వెనకాలే నడిచింది. తన దృష్టి మాత్రం పావెల్ మీదనుంచి తప్పించలేదు. చుట్టుప్రక్కలన్నివైపులా యువజనుల ఉత్సాహానికి మేరలేదు. వాళ్ళందరిలోనూ పావెల్ అంద్రీలిద్దరూ చుక్కల్లో చంద్రుడు లాగున్నారు. వాళ్ళు తమ మృదుస్వరంతో'

"లెండు! కార్మికులారా లెండు! సమరమునకు రండు!"

అని పల్లవిని పాడడం మొదలుపెట్టారు. జనం అంతా పరుగులెత్తుకుంటూ దగ్గరకుచేరారు. అంతా ఎలుగెత్తి పాడారు. పాటల శబ్దం ఆకాశాన్నంటింది. తల్లికీపాట క్రొత్తగాదు. అప్పుడప్పుడు పావెల్ నెమ్మదిగా పాడుకుంటూంటే వింది. అంద్రీ ఈలమీదకూడా ఇదే పాడుతూ వుండేవాడు. కాని యీజనమంతా ఒక్కసారి ఇల్లా పాడుతూఉంటే ఆమెకేదో క్రొత్తగా కనుపించింది.

"కష్టమునను న్నట్టి సోదరులారా! కలయుదమురండు! లెండు సోదరులారా లెండు!" అని కార్మికులందరినీ ఒక్కటి కావలెనని పాట హెచ్చరిస్తూంటే ఆమె హృదయం ఉప్పొంగింది. పాట జనాన్ని ఆకర్షించుకుంటూ సెలయేరులాగ ప్రవహించింది. పిల్ల తరంగాలు లేచినాయి. ఇంతలో తల్లి ప్రక్కనుండి యెవరో ఒక స్త్రీ కళ్ళనీళ్ళు కారుస్తూ "మిత్యా! ఎక్కడికెడుతున్నావు? బాబోయి!" అని అరిచింది.

తల్లి ఆమెచెయ్యిపట్టుకుని "ఎందుకల్లా కేకలేస్తావు? వెళ్ళనియ్యి. మరేమీ ఫరవాలేదు. కంగారు పడకు. భయం లేదులే. మొట్టమొదట నేనూ నీలాగే భయపడ్డాను. కాని ఇప్పుడు మా వాడెక్కడున్నాడో చూసేవా? అదిగో ఆమొట్టమొదట నిలబడి జండాపుచ్చుకున్నవాడు నాకొడుకే" అంటూ సముదాయించింది. "యెక్కడికిరా పోతున్నారు? గొంతుకలు కోసుకుంటారుట్రా? సిపాయిలున్నారురా అక్కడ" అనుకుంటూ కంగారుగా ఆ స్త్రీ తల్లిచేయిపట్టుకుంది, "అయ్యో! అయ్యో! పాటలు కూడానా? మామిత్యాకూడా పాడుతున్నాడా?" అని ఉలికిపడింది,

"భయపడకు, భయపడకు, ఇది మహా పవిత్రమైన ఉత్సవం. తనకోసం బాధపడేవాళ్ళు లేకపోతే క్రీస్తుదేవుడు అవతరించేవాడే కాదు. ఆలోచించుకో!" అని మెల్లగా తల్లి ఆమెకు బోధించింది. ఈ ఆలోచన ఛటుక్కున ఆమె మనస్సుకు తట్టింది, ఆ స్త్రీ చెయ్యిపట్టుకుని ఆమాటే పదేపదే చెప్పింది.

అంతలో సిజావ్ తల్లివద్దకొచ్చి ఆమెను పలుకరించాడు. వాళ్ళు పాడే పాట నాలకిస్తూ తల ఊపుతున్నాడు. "యేమమ్మోయి! చూశావా? బహిరంగం గానే ఊరేగుతున్నారు. పాటయికూడా తయారుచేశారు, పాట బలే మజాగా వుంది కూడాను. అదిగో.................." (పాటవినబడుతుంది) వీళ్ళకి భయమే లేదు. నా కొడుకు చచ్చిపోయాడు కాని.........., అవును, ఈ ఫాక్టరీ వాడి ప్రాణాలు తీసింది."

తల్లిగుండెలు తటతట కొట్టుకున్నాయి. జనం త్రొక్కుడుమూలాన్ని నడవలేక వెనుకబడింది. ఆ జనం ఉత్సాహం ఆత్రత చూస్తే ఆమె కెంతో ఆనందం కలిగింది. జనం ఆమెను ఒక గోడవైపుకు త్రోసేశారు.........................

"లెండు కార్మికులారా లెండు" అంటూ పాట, ఎర్రజండా అగ్గిలా ఎగురుతోంది. జనం తన్మయులై గంతులేస్తూ పాడుతున్నారు. ఇది ఫలానా వారి గొంతు కని గుర్తుపట్టడానికి వీలులేకుండా అందరి గొంతుకులు ఐక్యమైపోయాయి. క్రొత్తదైనటువంటి ఈ జీవితగీతంలో అన్ని ధ్వనులు మిళితమై పోయినాయి. వెనుకటి భయభ్రాంతమై కళారహిత మైనట్టి ఆత్మ పాడే నిర్భాగ్యపు పాటకాదు. ఈ పాటలో స్థలదాహం కనబడదు. మంచిచెడ్డల విచక్షణ లేకుండా సర్వనాశన మొనర్చే కుహనా వీరత్వ మీపాటలో మచ్చుకైనా కనబడదు. స్వేచ్ఛను నాశనంచేసే పశుత్వంకాని, ప్రతీకార బుద్ధిగాని అసలేలేదు. దాస్య శృంఖలాలచే బంధింపబడియున్న పూర్వ జీవితసరణి ఎంతమాత్రం లేదు. గాలిలేనప్పుడు ప్రవాహంలోబడి మెల్లగా పోయే నావలాగున పాటసాగింది. ఆ పాటలో ఇనుమునకున్న పటుత్వం కనుబడుతోంది. కనుపించీ కనుపించకుండాఉండే యుడిపింపు వుంది. అతిస్పష్టమై మృదులమై ఆ గీతము ప్రజలను అతిదూరముననున్న మహాదాదర్శమువైపు కీడ్చుకొనిపోతోంది. దారిలో ఉండే కష్టాలనేమీ దాచటంలేదు. ఆ పాటలోనుంచి ఒక అద్భుతమైన అగ్నిజ్వాల ప్రజ్వరిల్లి ఇదివరకువాళ్ళు అనుభవించిన కష్టాలను, వాళ్ళ అజ్ఞానాన్నీ భయాన్నీ అన్నిటినీ కూడా దహించేసింది..........

"బలేపనిచేశేరు కాదూ కుర్రాళ్ళు! అంతా ఏకమయ్యారుగా!" అని ఎవరో తన సంతోషం పట్టలేక ఒక్కకేకేశారు.

"పిచ్చివెధవలు! అనుభవిస్తారు!" అన్నాడు ఇంకొకడు ముష్టియూడిస్తూ.

"ఓహో! చాలాముదిమొచ్చింది వ్యాపారం. చక్రవర్తిమీదే తిరుగుబాటు? సాక్షాత్ జారుమీదే? పనికిరాదు. ఉహూ." అన్నాడింకొకక కీచుగొంతుక మనిషి. ఇల్లా వాళ్లూవాళ్లూ అనుకునేమాటలు తల్లి చెవుల్లో పడ్డాయి. కాని హద్దూపద్దు లేకుండా స్త్రీపురుషులు ఆవేశంతో ఒకళ్ళు నొకళ్ళనుకుంటూ మహా ప్రవాహం లాగున ముందుకుసాగి పోతుండడం ఆమె కండ్లారా చూచించి. చూసేసరికి ఆమె హృదయంలో ఒక నూతనమైన ప్రేమ స్ఫురించింది. జాలేసింది. అయ్యో! బాబుల్లారా" అనుకుంది. ఎదురుగా కొంచెం దూరాన్ని అరుణ పతాకం అగ్ని

జ్వాలలా ఎగురుతోంది. దానిక్రిందనున్న తన కొడుకామె స్థూలనేత్రానికి కనుబడ లేదుగాని మానస నేత్రానికి మాత్రం స్పష్టంగానే కనబడ్డాడు. విశ్వాసంతో ధగధగ లాడే నేత్రాలతో ఆతనిరూపం ఆమె కండ్లకుకట్టినట్టయింది.

ఉత్సాహంతో యువజనులంతా ముందుకు త్రోసుకెళ్ళడంచేత తల్లి ఊరేగింపు చివరపడింది. ఈ ఊరేగింపంటేమేమీ అంతలక్ష్యం లేనివాళ్ళు, ఉబుసుపోకకూ, కాలక్షేపానికీ, తమాషాచూడడానికీ వచ్చినవాళ్ళమధ్య పడింది. వాళ్ళంతా తీరికగానడుస్తూ రకరకాలుగా మెల్లగా మాట్లాడుకుంటున్నారు.

"కొంతమంది సిపాయిలు స్కూలుదగ్గర, కొంతమంది ఫాక్టరీదగ్గర వున్నారు"

"గవర్నరుకూడ వచ్చాడట"

"ఆలాగా? నిజంగానే?"

"అరే! నేను చూస్తేనే? గవర్నరక్కడే వున్నాడు"

"ఓహో! అయితే బాగానేవుంది. మొత్తంమీద మనవాళ్ళంటే వాళ్ళకి భయంగానే వుందన్నమాట. కాదు మరి: సిపాయిలు రావడమే కాకుండా గవర్నరుకూడా స్వయంగా రావలసొచ్చిందా? ఒహో!"

ఈ మాటలు వింటుంటే తల్లి కానందం కలిగింది. కాని చుట్టుప్రక్కలున్న వాళ్ళంతా నిరుత్సాహకరమైన మాటలే మాట్లాడుతూ ఉండడంచేత వాళ్ళని దాటి ముందుకుపోవాలని గబగబ అడుగేసి ముందుకెళ్ళింది.

ఇంతలో ముందుకు సాగుతూన్న ఊరేగింపు గభాలున వెనక్కి దబాయించింది. ఇంజనొచ్చి తగులుకుంటే రైలుబండ్లు వెనక్కి దబాయించినట్లై. క్షణంలో నిర్మల ప్రవాహంలాగ సాగేపాట గాలి వూపుకు చలించినట్లు చలించింది. కాసేపు గట్టిగాను, కాసేపు తొందరగాను పాట వినిపిస్తోంది. వరుసలు, లయ తప్పిపోయాయి. అసలు పాటే ఆగిపోయేస్థితివచ్చింది. మధ్యమధ్యమాత్రం ముందున్న వాళ్లెవ్వరో పాట నాపకుండా వుండే ప్రయత్నం చేస్తూవచ్చారు.

"లెండు! కార్మికులార లెండు" అనే పల్లవితో గొంతెత్తారు.

ముందు ఏమిజరుగుతోందో తల్లికి తెలియడంలేదు. కాని ఏదో ప్రమాదం జరుగుతోందనే ఊహతో త్వరత్వరగా జనాన్ని తోసుకొని ఆమె ముందుకెళ్ళింది.

* * * *

## ౨౦

పావెల్ గంభీరస్వరం ఖంగున మ్రోగింది.

"సోదరులారా! సిపాయిలుమాత్ర మెవ్వరు? వాళ్ళుకూడా మనలాంటి ప్రజలే. వాళ్ళు మనలను కొట్టరు. వాళ్లెందుకు మన్ని కొడ్తారు? అందరికీ శ్రేయస్కరమైన సత్యాన్ని మనం ప్రకటించుచున్నందులకేనా? మనం ప్రకటించే ధర్మం వాళ్ళకికూడా కావలసిందే. ప్రస్తుతం వాళ్ళసంగతి వాళ్ళు తెలుసుకోలేకపోవచ్చును. వాళ్ళుకూడా తమ స్థితి తెలుసుకుని మనతోపాటు స్వేచ్ఛాపతాకము క్రింద నడిచే రోజులు అచిరకాలంలోనేవస్తాయి. ఎన్నోనాళ్లు వాళ్ళీ హంతకులయొక్క, అసత్యవాదులయొక్క జండాక్రింద ఉండలేరు. త్వరలో మన ధర్మపతాకముక్రింద కొచ్చేస్తారు. మన మతాన్నీ, మన ఆదర్శాలనీ వాళ్ళు త్వరగా గ్రహించాలంటే మనం త్వరత్వరగా ముందుకు సాగాలి. కాబట్టి సోదరులారా! ముందుకు నడవండి! ఎప్పుడూ ముందడుగే?"

పావెల్ గంభీరోపన్యాసాన్ని ప్రజలంతా విన్నారు. కాని జనం ఒక్కొక్కరుగా పక్కకు తప్పుకున్నారు. అందరు ఇంటిముఖం పట్టారు. మరికొందరు గోడలప్రక్కలకొదిగారు. ఊరేగింపు ముందుకు పోయినకొద్దీ జనం పల్చబడడం చేత చూడడానికి త్రికోణాకారంగావుంది. ముందుకోణాన్ని పావెల్ నిలబడ్డాడు. ఆతని నెత్తిమీద కార్మికుల లాల్‌బావుటా అగ్గిలా యెగురుతోంది.

వీధిమొగని సరిగా చౌకులోకెళ్ళేదారి నటకాయిస్తూ కొంతమంది సిపాయిలు గోడకట్టినట్లు నిలబడియుండడం తల్లి చూసింది. వాళ్ళ ముఖాలన్నీ ఆమె కొక్కమాదిరిగానే వున్నాయి. వాళ్ళభుజాలమీద సన్నీలు ధగధగ మెరసి పోతున్నాయి. ఆ సోల్జర్ల వరుసా, ఈవూరేగింపూ చూసేసరికి అమెగుండె ఝల్లుమంది. గుంపులోంచి ముందుకు చొచ్చుకెళ్ళి తల్లి తనకు పరియస్థుడైన ఒక పొడుగాటి కుంటి మనిషిదగ్గర నిలబడింది. ఆతను ప్రక్కకు తిరిగి "ఎవరు నువ్వు? ఏం కావాలి?" అన్నాడు.

"నేను పావెల్ తల్లిని" అని పెదవులు తడబడుతూ జవాబు చెప్పింది.

"ఓహో! నువ్వా! సరసరి" అన్నాడు ఆ కుంటి.

ఇంతలో పావెల్ స్వరం వినబడింది-

"సోదరులారా! ముందడుగువేయండి. జీవితమంతా ముందుకే. ఇంకో మార్గం మనకి లేనేలేదు. పాడండి! పాట పాడండి!"

స్థితిగతులు విషమించాయి. ఎఱ్ఱజండా సోల్జర్లమీద రండ్రుమని యెగురుతోంది తల్లి కళ్ళుమూసుకొని వణుకుతూ 'ఓహోహో!' అంది.

జనం అంతా వెనక్కి తగ్గిపోయారు. పావెల్, ఆంద్రీ, శామొలోవ్, మాజిన్ మాత్రం ముందడుగేశారు. ఫెద్యా వుషారుగా పాట ఆరంభించాడు.

"స్వతంత్రపథమున చచ్చిన మీకు స్వర్గము మోక్షము కలదా..........."

జనం అంతా అందుకున్నారు ఫెడ్యా రెండవచరణం గట్టిగాఆరంభించాడు.

"ఆరి గాడిదెల్లారా! చావుపాటలు పాడుతున్నారుగా?" అన్నాడెవడో కోపంగా.

'తన్నండి వాడినిముందు' అని యెవడో ఆగ్రహంతో ఆజ్ఞాపించాడు.

తల్లి చేతులుకట్టుకుని ఇదంతా చూస్తోంది. ఇదివరకెంతో దట్టంగావున్న జనం పల్చబడిపోయారు ముందుకు యేపదిమందో నడుస్తుంటే జనం వాళ్ళను వదలిపెట్టి వెనక్కి పలాయనంచేయడం తల్లి చూచింది

"నిరంకుశత్వం నాశనం అయిపోయింది" అని ఫెడ్యా ఒక్క కేకపెట్టేడు. మిగిలినవాళ్ళంతా జై, కార్మికులకూ జై, ప్రజాప్రభుత్వానికి జై"అని అందుకున్నారు.

"అదిగో అతనే ఉత్తరువు చేస్తున్నాడు" అన్నారెవరో మెల్లగా.

ఇలా అంటూ ఉండగానే "పొడవండి సన్నీలతో!" అని ముందునుంచి ఆజ్ఞవచ్చింది. సన్నీలు సిపాయిల భుజాలమీద పడ్డాయి. చిత్రవిచిత్రంగా ధగధగ మెరుస్తూ నృత్యం చేసినాయి.

"మార్చి" (నడవండి) అని ఆఫీసరు ఆజ్ఞాపించాడు. తల్లిముందున్న కుంటివాడు ప్రక్కకు తప్పుకున్నాడు. ఆమెమాత్రం తెల్లమొగం వెయ్యకుండా చూస్తూ నిలబడింది. సోల్జర్లు కాస్సేపు ముందుకూవెనక్కి ఊగులాడి చివరకిరోడ్డు కడ్డంగా నిలబడ్డారు. అందరిచేతుల్లోనూ సన్నీలు మెరుస్తున్నాయి. ఆసన్నీలన్నీ వరుసగా ఒక్కమోస్తరుగా ఉండడంచేత దువ్వెన పళ్ళలావున్నాయి.

తల్లి గబగబా అడుగేసి పావెల్ దగ్గరకెళ్ళాలని ప్రయత్నించింది. ఆంద్రీ చరచర అడుగేసి పావెల్ ముందుకెళ్ళి అతనికడ్డం నిలబడడం ఆమె చూసింది. ఆంద్రీచేతులు వెనక్కిపెట్టుకొని తలెత్తి పాటపాడుతున్నాడు. పావెల్ అతన్ని ప్రక్కకులాగి నాప్రక్కకురా బావుటా ముందుండనీ" అన్నాడు.

ఇంతలో ఒక చిన్న ఆఫీసరు తళతళలాడుతూవుండే కత్తిఝళిపించి "పొండి వెనక్కిపొండి!" (డిస్పర్స్) అని ఆజ్ఞాపించాడు. ఆగ్రహంతో తన బూట్సు కాలితో నేలమీద గట్టిగాకొట్టేడు. నేల అదిరింది. అతని ప్రక్కగానే కొంచెం వెనుకగా ఒక పొడుగాటి ఆఫీసరు నడుస్తున్నాడు. అతడిమీసం వత్తుగా నెరిసిపోయింది. గోధుమరంగు పొడుగాటి చొక్కాతొడుక్కున్నాడు. లాగుమీద యెర్రటిఅంచూ పచ్చనిగీతలూ ఉన్నాయి. దేహం పెద్దది. ఆంద్రీలాగే అతనూ చేతులు వెనక్కి పెట్టుకున్నాడు. పావెల్‌కేసి తేరిపారచూశాడు.

తల్లి తెల్లబోయి అయోమయపు చూపు చూసింది. ఏక్షణానికాక్షణం ఆమె హృదయం భళ్ళున బ్రద్దలైపోతుం దేమోననిపించింది. గొంతుకలోనుంచే ఏదో వస్తున్నట్లు తోచింది. కాని ఆపుకుంది. గట్టిగా చేతులుకట్టుకుంది. ఏస్పృహలేకుం

డానే ముందుకెళ్ళింది. వెనకాలజనం ఆకురాలుకాలంలో క్రిందపడిపోయినాకులు గాలికెగిరిపోయినట్లు చెల్లాచెదరై పోవడం చూసింది.

జండావగ్గరనున్న పావెల్ ప్రభృతులు ఒకళ్ళకొకళ్ళు బాగా దగ్గరగాచేరి జండాచుట్టూ నిలబడ్డారు. వీధికడ్డంగా సోల్జరులు సన్నీలుతీసి ప్రజల గుండెలకు బారుపెట్టి నిలబడ్డారు ఇంకా పొడవడంమాత్రం ప్రారంభించలేదు. ప్రజలు చిందరవందరై పలాయనమయ్యారు.

తల్లికి తన వెనుకనుంచి పారిపోతున్నవాళ్ళ కేకలు వినిపించాయి.

"ఏయి కుర్రాళ్ళు! వెనక్కిరండి!"

"వాసవ్, పరుగెత్తు"

"పావెల్ వెనక్కిరా."

"జండా వదిలెయ్యి పావెల్. ఇల్లాపడేస్తే నేను దాస్తాను" అని నికోలే వైషోవికవ్ అతని చేతిలో జండా లాక్కోబోయాడు.

"వద్దు, ఉండనియ్యి" అని పావెల్ హుంకరించాడు.

నికోలే ఛటాలున చెయ్యి వెనక్కి తీసుకున్నాడు. పావెల్ చుట్టూ కొంత మంది చేరారు. అతను సరిగా మధ్య ఎదురుగా నిలబడ్డాడు. అంతా నిశ్శబ్దం. బావుటాచుట్టూ సుమారిరువైమంది గుంపుగా నిలబడ్డారు. సంఖ్య తక్కువైనా వున్నవాళ్ళు మాత్రం మహాధైర్యంగా నిలబడ్డారు. ఆ దృశ్యంచూచి వాళ్ళతో ఏమిటో చెప్పాలనుకుంది తల్లి.

"* లెఫ్టినెంట్, వాడిదగ్గరనుంచి ఆ జండా లాగెయ్యి" అని ఆముసలి ఆఫీసరు జండాకేసి వేలుచూపిస్తూ ఆజ్ఞాపించాడు. ఒక పొట్టి ఆఫీసరు గభాలున పావెల్‌దగ్గర కెగిరివచ్చి జండాకర్ర పట్టుకుని "వదులు" అని కయ్‌మని అరిచాడు. యెర్రజండా గాలిలో గిజగిజ కొట్టుకుంది. మళ్ళీ లేచింది. పొట్టి ఆఫీసరు వెనక్కి చతికిలబడ్డాడు

"పట్టుకోండి వాళ్ళని!" అని ముసలిఆఫీసరు చిందులు తొక్కుతూ గర్జించాడు. గబగబా కొంతమంది సిపాయిలు వాళ్ళమీద కొచ్చారు. అందులో ఒకడు తుపాకీమడమను గురిపెట్టి మీదకొచ్చాడు. జండా కాస్సేపు వూగులాడి క్రిందపడిపోయింది. పడిపోయిన తక్షణం మాయమైపోయింది.

"అయ్యో!" అని ఎవ్వరో మూలిగారు; తల్లికూడా కెవ్వుమంది. ఇంతలో సిపాయి మధ్యనున్న పావెల్ స్వచ్ఛమైన స్వరంతో "అమ్మా! శలవు" అన్నాడు. ఆంద్రీకూడా అల్లాగే శలవు పుచ్చుకున్నాడు. "అమ్మయ్య! బ్రతికున్నాడు పోనీలే? నన్ను జ్ఞాపకంకూడా పెట్టుకున్నాడు." అని తల్లి సంతోషించింది. బొటనవేళ్ళ మీద నిలబడి చేరులెత్తి వాళ్ళని చూడడానికి ప్రయత్నంచేసింది. ఆంద్రీ బాగా దారీమనిషి కనుక అతని గుండ్రని ముఖం సోల్జర్ల మధ్య కనుపించింది. అతను

* లెఫ్టినెంటు కెప్టన్ క్రింది వుద్యోగి.

చిరునవ్వు నవ్వుతూ ఆమెకు నమస్కారం చేశాడు "అయ్యో నాయనలారా! ఆంద్రీ! పాషా!" అని తల్లి వాళ్ళని గట్టిగా పిలిచింది * "బ్రామేష్సు! తలపు"

* సోదరులారా! అని భావము.

అని పావెల్ ప్రభృతులంతా సోల్జర్ల మధ్యనుంచే జనంవగ్గర శలవు తీసుకున్నారు జనమంతా ఒక్కసారి జయధ్వానంచేసి వాళ్ళనభినందించాడు. ఇంతలో ఆపొట్టి ఆఫీసరొచ్చి తల్లి గుండెలమీద ఒక పోటు పొడిచాడు. ఆమె అదరిపడి చూసేసరికి ఆతడు గుడ్లెర్రచేసి "పో! ముసలీ! పో! తక్షణం. ఇక్కడనుంచి పోవాలి" అని హుంకరించాడు. తల్లి ఆతడ్ని నఖశిఖపర్యంతం చూచింది ఛటాలున అతని పాదాలదగ్గర పడున్న జండా కర్రముక్కలూ అందులో ఒకదాని చివర ఎర్రనిగుడ్డా కనుబడ్డాయి. చప్పున ఆమె వంగి ఆ గుడ్డపీలిక ఉన్న కర్రను తీసింది. ఆ ఉద్యోగి దాన్ని చేతుల్లోంచి లాక్కుని అవతలికి పొమ్మని గెంటడం ఆరంభించాడు. సోల్జర్ల మధ్యనుండి పాట రయ్యిమని లేచింది; "లెండు" పొట్టి ఆఫీసరు ఛటుక్కున వెనక్కి తిరగి వాళ్ళదగ్గర కెగిరి గంతేశాడు......................

"ఏయ్ సార్జంట్, క్రెనావ్, ఆ పాటలూ గీటలూ కట్టిపెట్టించు"

ఈలోగా తల్లి అతను లాగిపారేసిన జండాకర్రముక్కను ఎర్రగుడ్డపీలికను తీసుకుంది.

"ఏయ్ వాళ్ళనోళ్ళు నొక్కెయ్యి!" అంటూ హుంకరించాడు ఆఫీసరు.

పాట మొదట గడగడలాడింది. తడబడింది. కంగారైంది. సన్నగిల్లింది. ఆరిపోయింది. ఎవరోతల్లిని జబ్బలుపట్టుకుని వెనక్కితిప్పి తోశారు. పొట్టిఆఫీసరు వీధిలోనుంచి పొమ్మని అరుస్తునే వున్నాడు. ఆమెకు పదిబారలు దూరంలో జనం గుంపుచేరింది. ఉద్రేకంలో మాట్లాడుకొనేవారు కొందరు, గొణుక్కుంటూ కొందరు, ఈలేసుకుంటూ కొందరు వెనక్కొడుతున్నారు.

"ఏయ్ ముసలిపిశాచం, పో?" అని ఒక పోతుమీసాల సోల్జరు అమాంతంగా ఆమె చెవుదగ్గరకొచ్చి అరిచేడు, అంతటితో వూరుకోక ఆమెను పక్కసందులోకి ఒక గెంటు గెంటాడు. నెమ్మదిగా జండాకర్ర వూతంచేసుకుని ముందుకెళ్ళింది. గబగబా నాలుగడుగులేసింది. కాని శక్తిచాలక కాళ్ళు చచ్చుపడ్డాయి. నెమ్మదిగా గోడను పట్టుకుని నడిచింది. వెనకాల సోల్జర్లు తరుముతూంటే ఇంకా జనంవచ్చి పడుతున్నారు. సిపాయీలు ఆమెను దాటి ముందుకెళ్ళారు. ఒక్కసారి ఆమె వెనక్కి దిరిగి చూచింది. సోల్జర్లు చౌకులో కెళ్ళేదారి కడ్డంగా వీధిమొగలో నిలబడ్డారు. కొందరు జనాన్ని తరుముతున్నారు. చౌకు నిర్జనంగా వుంది తల్లికి మళ్ళీ వెనక్కెళ్ళాలనిపించింది. కాని అప్రయత్నంగానే ముందుకెళ్ళింది. కొంచెం ముందుకెళ్ళిన తర్వాత అక్కడొక సందు కనుపించింది అందులో కెళ్ళి ఒక్క నిమిషం ఆగి "అమ్మయ్య" అనుకుంది. ఎక్కడనుంచో మనుష్యులమాటలు వినబడ్డాయి. నెమ్మదిగా జండా కర్ర ముక్కను వూతంచేసుకుని పదడుగులేసింది.

కనుబొమలు అదరడం ప్రారంభించాయ్. ముఖ మంతా ముచ్చెమటలు పోశాయి. పెదిమెలు తడబడ్డాయి చేతులు యెందుకో ఆడించడం మొదలు పెట్టింది. ఆమె హృదయంలో యేవో కొన్ని భావాలుపుట్టి మెరుపుల్లా మెరిశాయి. జనం కని పిస్తే ఒక్కసారి ఆ భావాలన్నిటినీ వెళ్ళగ్రక్కాలనేభావం కలిగింది.

నెమ్మదిగా నడుస్తుంటే ఆ సందు ఎడమప్రక్కకు మళ్ళింది. ఆ మూలగా చాలా పెద్ద జనసమూహం కనబడింది. బిగ్గరగానూ తీవ్రంగానూ ఇల్లా మాట్లాడు కుంటున్నారు.

"వాళ్ళు ఊరికే వెర్రి సాహసంకొద్దీ సన్నీలకెదురెళ్ళడంలేదు. ఆ సంగతి మీరు గ్రహించాలి.

"ఒక్కసారి వాళ్ళసంగతి చూడండి. సోల్జర్లు సన్నీలు బారుచేసి ఎద కొస్తుంటే నదురూ బెదరూలేకుండా నిలబడ్డారు. ఎంత ధైర్యమోచూసేరా? బలే"

"ఆ పావెల్ సంగతి చూడండి"

"అతనో? ఆ ఆంన్డ్రీ నకోడా!"

"అవునవును. వాడితస్సాదియ్యా! వాడొక దెయ్యమే. చేతులు వెనక్కి పెట్టుకుని నవ్వుతూ అల్లాగే నిలబడ్డాడు. కదలనన్నా కదలలేదు."

తల్లి యీ జనంలోకి చొచ్చుకెళ్ళింది.

"అయ్యో బాబుల్లారా! బాబుల్లారా!" అంటూ ముందుకెళ్ళింది. జనం ఆమెకెంతో గౌరవంగా చోటిచ్చారు.

"చూడు చూడు! ఆ జండా ఆమె" అని యెవరో ఫక్కున నవ్వేరు.

"నోరుముయ్యి. చాలుచాలు" అని యెవరో అతడ్ని మందలించాడు.

తల్లి ముందు నిలబడి రెండుచేతులు విశాలంగా సాచి గొంతెత్తి యిల్లా మాట్లాడింది. "నాయనలారా! వినండి. క్రీస్తు దేవునిపేరు తలుచుకొని వినండి. మీరంతా నాకెంతో ప్రియమైనవాళ్ళు. మీరందరూ చాలామంచివాళ్ళు. మీ హృద యాలకు బిగించియున్న తలుపుల నొక్కసారి తెరువండి. భయాన్ని వదలిపెట్టి మీచుట్టూ జరుగుతూవుండే సంగతులను గమనించండి. మన పిల్లలు కొత్తదయిన ప్రపంచంలో పడ్డారు. మన కడుపునపుట్టిన బిడ్డలు, మన రక్తంలో రక్తమైనవాళ్ళు, సత్యాన్ని అన్వేషిస్తున్నారు. వాళ్ళు నిష్కళంకమైన హృదయాలతో బయలుదేరి, మనం అందరం నడవడానికి వీలుగా ఉండేటట్లు ఒక నూతనమైనట్టిన్ని, విశాల మైనట్టిన్ని మంచి రస్తాను చూపిస్తున్నారు. మీ అందరి సౌకర్యంకొరకు, మీ బిడ్డ పాపల క్షేమంకోసం, వాళ్లు తమ సర్వసౌఖ్యాలనూ అర్పణచేసేసి, ఆ మహాపవిత్ర మైన పనిని సాగిస్తున్నారు. వాళ్ళు నిరంతరం ప్రకాశించే సూర్యుడికోసం వెదుకు తున్నారు. న్యాయధర్మములమీద ఆధారపడి అందరికీ సౌఖ్యకరమయ్యే ఒక నూతనజీవితాన్ని వాళ్లు కోరుతున్నారు." తల్లికి హృదయం విచ్చినట్లయిపోయింది

గొంతుక యెండిపోయింది. లోపలినుండి ప్రేమమయమైన వాగ్జాలము మాత్రము పుట్టుకొచ్చింది.. అవి బయటపడే టప్పుడు ఆమె నోరు నాలుక వేడెక్కిపోయాయి. జనం అంతా నిశ్శబ్దంగావుండి తన మాటలు వినడం చూచింది. వాళ్ళంతా తాను చెప్పినమాటలను గురించే ఆలోచిస్తున్నట్లు ఆమెకు తోచింది. ఇదే సమయంగదా అనుకొని వీళ్ళందరినీకూడా పావెల్, ఆంద్రి ప్రభృతుల ననుసరించేటట్లు పురికొల్పాలని ఆమెకు బుద్ధిపుట్టింది వాళ్ళ ముఖాలకేసి చూస్తూ మళ్ళీ ఉపన్యాసం ప్రారంభించింది. "మనబిడ్డలు సౌఖ్యమునే అన్వేషిస్తున్నారు. మన అందరి శ్రేయస్సుకోసం, క్రీస్తుభగవానునిధర్మం స్థాపించడం కోసమే వాళ్ళీమార్గాన్ని నడుస్తున్నారు. అసత్యపరులూ, దురాశాపీడితులూ, ఈర్ష్యాళువులూ అయిన మన అధికారులు క్రీస్తుదేవుని ధర్మానికి విరుద్ధంగానే మనలను బంధించి అణగద్రొక్కేసేరు. నాయనలారా! ఇంతెందుకు? మన అందరికొరకే, ప్రపంచమంతటి కొరకే, మనకార్మికులందరికొరకే మనరక్తంలో రక్తమైన యువజనులు అష్టకష్టములూ పడుతున్నారు కనుక వాళ్ళను విడిచిపెట్టకండి. మీరు మీబిడ్డలను నట్టడవిలో దిగవిడువకండి. మీరంతా వాళ్ళ ననుసరిస్తారనే విశ్వాసంతో మీకు మార్గం చూపించడానికే మనపిల్లలీ ధర్మపథాన్ని, ధైర్యంతో ముందడుగు వేస్తున్నారు. ఒక్కసారి మీ అవస్థచూచుకోండి. మీ బిడ్డలను ప్రేమించండి. హృదయాల ఆంతర్యాన్ని అవగాహనచేసుకోండి. వాళ్ళని నమ్మండి. వాళ్ళు సత్యాన్ని బహిర్గతంచేసేరు. ఆ సత్యమే వాళ్ళ హృదయాలను దహించేస్తోంది. దానికోసమే వాళ్ళు తమసర్వనాశనానికికూడా సిద్ధమైనారు. కనుక వాళ్లని నమ్మండి!"

తల్లికి నోటివెంబడి మాటరాలేదు. ఆమె నీరసంచేత తూలింది. యెవరో ఆమె చంకకింద చెయ్యేసి మెల్లగా వూతమిచ్చారు.

"ఆహా! ఆమె మాటలు దేవుడినోట్లోనుంచి వస్తున్నాయి. ఏమర్రోయి వినండి! అమాయకుల్లారా వినండి. సాక్షాత్తుదేవుడి వాక్యాలే" అని యెవరో బిగ్గరగా జనాన్ని హెచ్చరించారు.

"అయ్యయ్యో! పాపం! చూడండి. ఎల్లా బాధపడుతోందో?" అని జాలితో యెవరో ఒకరు పెదివి చప్పరించారు.

"సరి సరి. ఆమె తనకేమీ నొప్పికలగజేసుకోవడంలేదు. మూర్ఖులమైన మనకి నొప్పినాటేటట్లు దెబ్బతీస్తోంది. ఆసంగతి తెలుసునా?" అని యింకొకడు మందలిస్తూ పైవాడికి జవాబు చెప్పేడు,

ఇంతలో ఎవరో ఒక స్త్రీ జనం అనుకొనేమాటలుకూడా వినబడనంత గట్టిగా మాట్లాడడం మొదలెట్టింది.

"ఓ నాయనలారా! సత్యాన్ని నమ్మే బాబుల్లారా! మామిత్యా చేసపాపం ఎరుగని వెర్రిబాబు. యేంచేశాడో చూశారా? అతనుకూడా తన మిత్రులతోపాటు

వెళ్ళిపోయాడు. ఆ తల్లిచెప్పేమాటలు ముమ్మాటికీ నిజం. మనం మన పిల్లల నొదిలిపెట్టి యెందుకు వెనకొచ్చేం. వాళ్ళు మనకేమి ప్రమాదం చెచ్చేరు?"

తల్లి యీమాటలు విని గడగడలాడింది. మాటలాడలేక కన్నీరు విడిచింది. అంతలో సిజావ్ వచ్చి తల్లిని యింటికెళ్ళి శ్రమతీర్చుకోమని చెప్పాడు. అతను ముందుకొచ్చి నిలబడ్డాడు. అతని ముఖంమీద నెత్తురుచుక్కలేదు. గెడ్డమంతా చిరాకుగావుంది, ఒక్కసారి జనాన్ని తేరిపారచూచి లేచి నిలబడి ఇల్లా మాట్లాడాడు.

"నాకొడుకు మాటేని ఈ ఫాక్టరీ తన పొట్టని పెట్టుకుంది. ఫాక్టరీ వాడిని బలిపుచ్చుకున్నసంగతి మీరంతా యెరుగుదురు నిజంగా వాడిప్పుడు బ్రతికుంటే నేనేస్వయంగా వాడినివ్వేళ వాళ్ళతో పంపేవాడినే. నేనేపిల్చి, ఒరే అబ్బాయీ! నువ్వుకూడా వాళ్ళతోవెళ్ళు. అది చాలాన్యాయం. గౌరవం అయినటువంటి పని సుమా అని చెప్పి పంపేవాడినే"

ఒక్కక్షణం ఆగి అంతా శ్రద్ధగా వినడంచూచి వ్రేలు చూపిస్తూ మళ్ళీ ఆరంభించాడు.

"నేను ముసలివాడిని మీసం గడ్డం నెరిసిపోయింది. మీరంతా నన్నెరుగుదురు నేను 39 సంవత్సరాలనుంచి యిక్కడ పనిచేస్తున్నాను. 53 సంవత్సరాలు నా నెత్తిమీది కొచ్చాయి.

ఇవ్వాళ నా మేనల్లుడిని అరెస్టుచేశారు. వాడు బుద్ధిమంతుడు, తెలివైనవాడు. బాగా అక్కరకొచ్చేవాడు. వాడుకూడా ముందువరుసలోనే పావెల్ ప్రక్కనే సరిగా బావుటాదగ్గరే నిలబడ్డాడు. (సిజావ్ వంగి తల్లిచెయ్యి పట్టుకొని) ఈ అవ్వచెప్పిన మాటలన్నీ నిజమే. మన పిల్లలంతా గౌరవంగా బ్రతుకాలంటున్నారు. మనం వాళ్ళని వదిలేసి చక్కావచ్చాం. అమ్మా! నిలోనా నువ్వింక వెళ్ళు"

తల్లి అశ్రుపూరితమైన కళ్ళతో జనాన్ని ఒక్కసారి చూచి "నాయనలారా! జీవితం మన బిడ్డలకోసమే. ప్రపంచమే వాళ్ళకోసం" అంది. నిలోనా! ఇక వెళ్ళమ్మా. ఇదిగో యీకర్ర ఊతంచేసుకో" అని సిజావ్ సగం విరిగిపోయిన జండాకర్రను ఆమెచేతి కందిచ్చాడు. జనం అంతా విచారంతోటీ సానుభూతితోటి ఆమెకేసి చూచారు సిజావ్ ఆమెను మెల్లగా జనంలోనుంచి తప్పించి బయటికి తీసుకెళ్ళాడు. జనం ఆమెకు దారిచ్చి వెనుకబడ్డారు. దారిలో ఆమెనుగురించి ఆశ్చర్యంతో మెల్లగా చెప్పుకున్నారు

నెమ్మదిగా ఆమె ఇల్లు చేరుకుంది. గుమ్మమెక్కి జండాకర్రమీద ఆనుకుని జనంకేసి తిరిగి వాళ్ళకందరికి వంగి సలాంచేసింది.

"నాయనలారా! శలవు తీసుకుంటాను.........తనకోసం సర్వసమర్పణం చేసే మనుష్యులే లేకపోతే మన క్రీస్తుదేవు డవతరించే వుండడు ఈసంగతి మాత్రం మరచిపోకండి" అని తన హృదయంలోని భావాన్ని వెలిబుచ్చింది. మళ్ళీ ఒక్కసారి ప్రజలకు వంగి వందనంచేసి ఇంట్లోకెళ్ళింది. సిజావ్‌కూడా లోపలికెళ్ళాడు.

జనం కాస్సేపు గుమ్మందగ్గిరనిలబడి మాట్లాడుకొన్నారు. క్రమంగా ఒక్కొక్కళ్ళే యెవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు.



ఒకటోభాగం పూర్తి అయింది.



# రెండవ భాగం

## ౧

ఆ రోజంతా తల్లికదే ధ్యాస. అలసటొచ్చి కన్నుమూస్తే ఆనాటి మధ్యాహ్నము సంగతులన్నీ కళ్ళకు కట్టినట్లుండేవి. ఆయువకుల కళకళలాడే ముఖాలు, వాళ్ళు పాడిన పాటలు, జ్ఞాపకానికొచ్చేవి. ఆ ఊరేగింపు, ఆ ఎర్రజండా, దానిక్రింద పావెల్ ముఖం, అతని ప్రక్కనే చిఃనవ్వుతో చంద్రబింబంలా ప్రకాశించే ఆంద్రీ ముఖం అన్నీ ప్రత్యక్షంగా కనిపించేవి.

ఏమీ తోచక గదిలో ఇటూ అటూ తిరిగింది. కొంచెంసేపు కిటికీలోనుంచి వీధికేసి వెర్రిచూపుచూసేది. ఏదో పనున్నట్లు గదంతా తచ్చాడడం, చివరకి యేమీ తోచక ఒక గ్లాసెడు నీళ్ళు త్రాగడం ఇల్లా వెర్రిగా ప్రవర్తించింది. ఆమె కడుపులో ఆపశక్యంగాని అగ్నిహోత్రం పుట్టింది. దాహం కలిగింది. ఎన్ని నీళ్ళుపోస్తే మాత్రం ఆ అగ్ని చల్లారుతుంది? మనస్సంతా ఖాళీయైపోయింది. ఇకముందు సంగతేమిటి? అనే ప్రశ్న ఆమెను డోలాయపరిచింది.

* మేరీ కార్సునోవా వచ్చింది. వస్తూనే నెత్తిబాదుకుంటూ యేడవడం ఆరంభించింది. రకరకాలుగా ఎవరినో శాపనార్థాలు పెట్టింది. అదిచేస్తా నిదిచేస్తానంటూ గంతులేసింది. కాని యిదేమీ తల్లికి మనస్కరించలేదు.

"ఆహా! జనం అంతా కలవరపడిపోతున్నారు: ఫ్యాక్టరీ ఫ్యాక్టరీ అంతా తిరుగబడ్డారు" అంది మేరీ

తల్లి అవునవునంటూ తల వూపింది. కాని ఆమెదృష్టి మాత్రం ఎక్కడికో పోయింది. కడుపు తరుక్కుపోతోంది. కాని యేడుపు రావడంలేదు. పెదిమలు యెండిపోయాయి. నోరుతడి ఆరిపోయింది. చేతులు గడగడ వణికేయి. ఒక్కచలి తెరవచ్చి వళ్ళంతా కదిపేసింది.

సాయంకాల మయ్యేసరికి పోలీసులు సిద్ధమయ్యేరు. మునుపటిలాగు వాళ్లని చూస్తే తల్లికేమీ భయం కలుగలేదు వాళ్ళు మామూలుగానే పెద్ద ఆర్భాటంచేస్తూ లోపలి కొచ్చారు.

---

* ఆమె తల్లి పొరుగింటి స్త్రీ............ఫ్యాక్టరీలో తినుబండారము లమ్మేది.

ఏదో మహా ఘనకార్యంచేసిన వీరుల్లాగ సంతోషంతోనూ, అహంకారం లోనూ ప్రవేశించారు. అందులో ఒక పసుపుపచ్చమొగం ఆఫీసరు "ఏం ముస లమ్మా! బాగున్నావా? నేను మీయింటికిరావడం యిది మూడవసారి" అని పళ్ళికిలిస్తూ తల్లిని పలుకరించాడు. ఆమె మాట్లాడలేదు. ఆ వుద్యోగస్థుడు అతిఘోరంగ ప్రారంభించి ఆమెకు బుద్ధిచెప్పడం మొదలెట్టాడు. అలా వాగడమే అతనికి సరదాకాబోలు ననుకుని ఆమె మాట్లాడక ఊరుకుంది. ఆమాటలామె చెవులనైనా పట్టలేదు. కీచుమంటూయి శబ్దం క్రింద తీసిపారేసింది. చివరికి "ఏమ మ్మోయి! ముసలమ్మా! ఇదంతా నీదేతప్పు. నీకొడుకుని చిన్నప్పటినుంచీ అదు పాజ్ఞల్లో పెట్టకపోవడం, దేవుడన్నా, చక్రవర్తిఅన్నా, భయభక్తులతో నడిచేటట్లు చెయ్యకపోవడం నీతప్పుకాదూ? చిన్నప్పటినుంచీ చెప్పుచేతల్లో వుంచుకోకుండా వదలిపెట్టడం తప్పుకాదూ?" అన్నాడు ఆఫీసరు. చాలా సేపటినుంచి ఓపికపట్టిన తల్లి ఇక భరింపలేకపోయింది. (నెమ్మదిగా తలుపుదగ్గరనుండి ఇలా అంది) "అవునవును మనపిల్లలే మనమంచి చెడ్డలను, తప్పొప్పులనూ నిర్ణయించవలసిన అధికారులు. వాళ్ళు సత్యమార్గాన్ని నడుస్తుంటే మనం వాళ్ళకర్మానికి వాళ్ళని వదిలేసినందుకు, వాళ్ళే మనకు తగిన అనుభవం చేస్తారు."

"ఏమంటావ్? మళ్ళీ గట్టిగాచెప్పు" అని ఆఫీసరు గర్జించాడు. అతడగ్గయిపోయాడు.

"నేచెప్పేదేమిటంటే, మన బిడ్డలే మన పాలిటికి న్యాయాధిపతులని" తల్లి ఒక్కనిట్టూర్పు విడిచింది.

ఆఫీసరు తోకత్రొక్కిన త్రాచులాగులేచి కోపంతో యేమిటో లొడలొడ మన్నాడు. ఆమాటలేమి ఆమె కర్థంకాలేదు. మేరీ కార్సునోవా ఒకసాక్షి. ఆమె, తల్లిప్రక్కనే నిలబడింది. కాని తలయెత్తి చూడడంలేదు. ఆఫీసరు ఆమెనేవో ప్రశ్నలెయ్యడం ఆరంభించాడు. అన్నిటికీ ఆమెదొక్కటే జవాబు. గడగడ లాడుతూ సలాంకొట్టి "మహాప్రభో! నాకేం తెలియదు. నేను శుద్ధ వెర్రిదాన్ని అమాయకురాలిని, మూర్ఖపుముండను. ఏవోకాస్త కూర, పులుసు అమ్ముకుని పొట్ట పోసుకుంటున్నాను. ఏపాపం పుణ్యం నేనెరుగను" అంది.

"అయితే నోరుముయ్యి" అన్నాడు ఆఫీసరు.

నిలోవాను సోదాచెయ్యమని ఆఫీసరు మేరీని ఆజ్ఞాపించాడు. ఆమె తెల్ల బోయి గ్రుడ్లుతేలేసి "ప్రభో! క్షమించండి నావల్లకాదు" అని గడగడలాడింది

ఆఫీసరు జోడుకాలుతో నేలమీద చప్పుడుచేస్తూ నానా హంగామా చేశాడు.

మేరీ భయపడిపోయి తల్లికేసిచూచి "నిలోవా! తప్పదు, అన్నిటికీ వప్పుకుని భరించాలిసిందే."

మేరీ సోదాచేయడం ప్రారంభించింది. తల్లిదుస్తులు తనిఖీచేస్తూవుంటే ఆమెకు ఒళ్ళుమండింది. 'అమ్మా! కుక్కల కొడుకులు!' అని మెల్లగా సణిగింది.

"ఏయి! ఏమిటాసణుగుడు?" అని ఆఫీసరు ఒకకేక పెట్టి గ్రుడ్లెర్రచేసి ఆమెకేసి చూశాడు.

మేరీ గడగడలాడుతూ "ఏమీ లేదు బాబూ. ఆడవాళ్ళ రహస్యం" అంది.

ఆఫీసరు తల్లిని వారంటుమీద దస్కతు చేయమన్నాడు. తల్లి అక్షరాలు జ్ఞాపకం చేసుకుని నెమ్మదిగా అచ్చు అక్షరాల్లాగ ఆ కాగితంమీద • 'పిలాగా నిలోనా. కూలివాని వితంతువు' అని తన హోదా సహితంగా చెక్కింది.

ఒసిఫీ అయిపోయింది! పోలీసులు వెళ్ళిపోయారు. తల్లి చేతులు కట్టుకుని కిటికీదగ్గరనిలబడి రెప్పవాల్చకుండా ఆకాశంకేసి అదేచూపు చూసింది — దీపంలో చమురు నిండుకుంది. గప్పున ఒక వెలుగువెలిగి దీపం ఆరిపోయింది. ఆ చీకట్లో కూడా ఆమె అల్లాగే కిటికీదగ్గర నిలబడేవుంది. ఆమె హృదయంలో ఏమీ ఆగ్రహం గానీ, అసహ్యంగానీ లేదు. కాని చెప్పడానికివీలులేని పరితాపం మాత్రం వుంది. బుర్రంతా ఖాళీ. దేహం అలిసిపోయింది. సొమ్మసిల్లినట్లయింది, ఎదురు కిటికీలో నుంచి మేరీ కార్సునోవా మాటవినబడింది.

"నిలోనా! ఇంకా పడుకోలేదూ? అయ్యో నిర్భాగ్యురాలా పడుకో! ఏం చేస్తాం? ఆ వెధవలు అందరినీ అల్లాగే తిడతారు" అంది. చాలాసేపటికి నిద్రవచ్చి అల్లాగే మంచంమీద వ్రాలింది. గాఢమైన నిద్రపట్టింది.

ఆ నిద్రలో కల.

ఆ కలలో పావెల్ ఆంద్రీలు పాటపాడుకుంటూ రోడ్డుప్రక్కనున్న ఒక పెద్ద ఇసుకదిబ్బను త్రవ్వుతున్నారట. తానా రోడ్డుమీదనుండి వెడుతూ వాళ్ళని గుర్తుపట్టిందట. కాని తనకి గర్భిణీ అవడంచేత దగ్గరకెళ్ళడానికి సిగ్గుపడింది. తనచేతులో ఒక చంటిపిల్లవాడు కూడా వున్నాడు. ఆ ప్రక్కనే పిల్లలు బంతి ఆడుకుంటున్నారు. చేతిలో పిల్లవాడు గభాలున క్రిందపడ్డాడు. వాడు యేడుస్తుంటే వాడికి పాలిచ్చి వూరుకోపెట్టింది. ఇంతలో సిపాయి లామెను తరుముకొచ్చారు. తరుముకొస్తే ఒక పెద్ద చర్చిలో దూరింది. అక్కడ యేదో శవాన్ని పూడ్చిపెడుతున్నారు. ఫాదిరీ యేవో పాటలు పాడుతున్నాడు పాడుతూ పాడుతూ అమాంతముగా పిల్లలనందరినీ అరెస్టు చెయ్యమన్నాడు. అతని ఫాదిరీవేషం అంతాపోయి గభాలున పెద్దమీసం గెడ్డం సిద్ధమయ్యాయి. జనం పారిపోతూంటే తల్లి తన బిడ్డను వాళ్ళకాళ్ళకడ్డం పడేసింది. వాళ్ళు భయపడి తప్పుకు పారిపోయారు. తాను "పారిపోకండి; యీ బిడ్డను తీసుకుపోండి" అని అరిచింది. ఇంతలో ఆంద్రీ ఆ బిడ్డనెత్తి వై షోవికవ్ బండిలో వేశాడు. సూర్యుడు దేదీప్యమానంగా ప్రకాసిస్తూ వున్నాడు. ఆంద్రీ 'అహా యేమి జీవితం? ఏదైనా పాట పాడుతా' అంటున్నాడు. ఇంతలో తానేదో అఘాతంలో పడిపోయిందట.

ఇదీ కల. కలకి తలా తోకా లేదు. అఘాతంలో పడిపోయినట్లయ్యేసరికి

---

• తల్లి పూర్తిపేరు.

మెళకువవచ్చి వులిక్కిపడి లేచింది. ఒళ్ళంతా ముచ్చెమటలు పోసినాయి. గుండె లాగిపోయినాయా అనిపించింది. ఇంతలో ఫాక్టరీ కీచుమని కూతపెట్టింది. అప్పటికప్పుడే అది రెండవకూత. గదంతా తంగరబింగరగా వుంది. పుస్తకాలు, బట్టలు చెదజల్లి వున్నాయి. ఆమెలేచి ముఖం కడుగుకుని ప్రార్థన వగైరా నిత్య కృత్యాలన్నీ తీర్చుకోకుండానే గదిసర్దుకుంది. వంటయిల్లు సవరించుకుంటుంటే జండాకర్రా, ఎర్రగుడ్డా కనుపించాయి వాటిని చూచేసరికి ఛర్రున కోపంవచ్చింది. రెండింటిని పొయ్యిలో పారేద్దామని వాటిని తీసింది. కాని యింతలో ఏమైందో కాని ఒక్కనిట్టూర్పువిడిచి, జండాగుడ్డను జాగ్రత్తగా మడిచి జేబులో పెట్టుకుంది. కిటికీలు గిటికీలు కడిగి యిల్లంతా శుభ్రంచేసుకుని, స్నానంచేసి క్రొత్తబట్టలు కట్టుకుని టీ కి నీళ్ళు పొయ్యిమీద పెట్టింది. వంటయింటి కిటికీలోనుంచి ఆకాశం వంకచూస్తూ నిలబడింది మళ్ళీ "ఇక ముందుమాటేమిటి ? ఏంచెయ్యాలి?" అనే ఎప్పటి సంశయమే స్ఫురించింది.

తానింకా ప్రార్థనచేసుకోలేదని జ్ఞాపకంవచ్చి క్రీస్తుబొమ్మదగ్గరకెళ్ళి ఒక్క క్షణం నిలబడి వెంటనే కూర్చోబడింది. హృదయమంతా ఖాళీ. తన బ్రతుకు నట్టేట్లో నావలాతోచింది. ఏవో వెర్రి ఆలోచనలు మనస్సును కలవర పరచడం మొదలెట్టాయి ఈ అవస్థనుంచి తప్పించుకుందామని, చప్పున కళ్ళు నలుపుకుని లేచి టీ ముందర పెట్టుకుంది. అప్రయత్నంగా క్రితంరోజుసంగతి జ్ఞాపకాని కొచ్చింది. అది తలుచుకుంటూ వుండేసరికి ఒళ్ళు మరిచిపోయింది. టీ చల్లారి పోయింది. ఇలాంటి స్థితిలో యెవరైనా మంచి స్నేహితులొచ్చి కాస్సేపు మాట్లాడిపోతే బాగుండుననిపించింది.

అల్లా అనుకుంటుండగానే నికోలే ఇవానిష్ భోజనంచేసి చక్కావచ్చాడు. అతను కనుపించేసరికి తల్లి ఖంగారుపడింది. కూచోమని మర్యాదచేయకుండా మరిచిపోయింది. ఒక్కక్షణమైన తర్వాత "అయ్యో. నాయనా ! నువ్వెందుకు యిక్కడికొచ్చావు ? ఇక్కడికొచ్చి యేమి ప్రయోజనంరా ? నిన్నుకూడా అరెస్టు చేశారంటే, పాషా పనిపూర్తిగా సున్నవుతుంది నువ్వుచాలా నిర్లక్ష్యంగా వున్నావు. నిన్నిక చూశారంటే పట్టుకుపోతారు." అని పలుకరించింది.

ఇవానిష్ అమె చెయ్యిపట్టుకొని యెడంచేత్తో కళ్ళజోడు సర్దుకుంటూ గబగబా యిట్లాచెప్పాడు.

"నేను, పావెల్, ఆంద్రీలతో ఒక ఖరారు చేసేను. వాళ్ళు అరెస్టయితే, నేను మరునాడే నిన్ను పట్టణానికి తీసుకెడతానని మాట ఇచ్చాను. అందుకే యిప్పుడొచ్చాను. ఈ యిల్లు సోదాచూచారా ?"

"ఆహా ! సోదా చూడడమేమిటి ? కొంపంతా గాలించేశారు. సామానంతా చిందరవందర చేసేశారు. వాళ్ళ కేమైనా సిగ్గా ? బిడియమా ? అంతరాత్మ అనేది అసలేలేదు."

"వాళ్ళకెందుకూ సిగ్గు?" అని భుజాలెగరేసి మెల్లగా ఆమె తనతోకూడా పట్టణానికెందుకు రావలసిన అవసరం వుందో తెలియచెప్పాడు. ఇవానిష్ మాటల ధోరణి, అతని స్నేహలక్షణం చూచి ఆమె కతనియందొక గట్టినమ్మకం కుదిరింది. దాన్ని ప్రకటిస్తూ ఒక చిన్న వెర్రినవ్వు నవ్వింది.

"పాషా అల్లా చెపితేసరే, కాని నేను నీ కొంపమీద భారం............"

"అమ్మా! ఆ విషయంలో నువ్వు సంశయపడక్కరలేదు. నేను ఒంటరిగాడిని. మా అక్కయ్య మాత్రం అప్పుడప్పుడు వస్తూవుంటుంది."

"నేనుమాత్రం వూరికే ఏమీపనిచెయ్యకుండా భోజనంచేస్తూ కూచుంటానా?"

"నీకు పనిచెయ్యాలని వుంటే యేదో ఒకపని లేకపోతుందా?" అన్నాడు ఇవానిష్.

తల్లికిప్పుడు పనంటే తనకొడుకు ఆంద్రీ వగైరాలు చేసేపననే అర్థం. అంచుచేత అతని ముఖంకేసి చూస్తూ "ఓహో! నాకేదో పని చూస్తావన్నమాట!" అంది.

"నేను బ్రహ్మచారిని. నా కొంపలో ఆడదక్షతలేదు. చిన్నయిల్లు........"

"నేనాసంగతి మాట్లాడడంలేదు. గృహకృత్యం విషయంకాదు. పనిఅంటే లోకాన్ని ఉద్ధరించే పని" అని మెల్లగా చెప్పింది తల్లి. ఆమె భావాన్ని వెంటనే గ్రహించలేనందుకు ఇవానిష్ చాలా నొచ్చుకున్నాడు. చటుక్కునలేచి చిరునవ్వుతో "ఆలాగే, నీకు కావలిస్తే లోకవ్యవహారంలో కూడా తగినపని దొరుకుతుందిలే" అని సమాధానం చెప్పాడు.

ఇలా అంటూంటే తల్లి మనస్సుకొక అలోచన తట్టింది.

"ఇదివరలో నేనొకసారి పావెల్‌కు సాయంచేశానుకదా! ఇంకొకసారి చెయ్యలేకపోతానా? యెంత యెక్కువమంది యీ మహా వుద్యమంలో పనిచేస్తే అంత త్వరగా ప్రజలకీయుద్యమంయొక్క సత్యం తెలిసొస్తుంది."

ఇలా అనుకొని "ఇవానిష్! నేనేమి పనిచెయ్యగలను?" అని అడిగింది.

అతడు కొంచెంసేపట్టే ఆలోచించినతర్వాత విప్లవపద్ధతులన్నీ విపులంగా చెప్పాడు. ఆ మాటల సందర్భంలో అతనిల్లా చెప్పాడు, "నువ్వు యీసారి పావెల్‌ను చూడడానికి జైలుకెళ్ళినప్పుడు గ్రామాల్లోని రైతులకోసం వార్తాపత్రికను ప్రచురించమని కోరిన రైతుల వూర్లుపేర్లు వగైరా వివరాలు తెలుసుకునిరా."

"ఎందుకూ? నాకేతెలుసును. వాళ్లెవ్వరో, ఎక్కడున్నారో నేనెరుగుదును. ఆ కాగితాలు నాచేతికిస్తే నేనే వాళ్ళకిచ్చివస్తాను. ఆరైతుల్ని కనుక్కుని నువ్వు యేమిచెయ్యమంటే ఆపనిచేసివస్తాను. నాదగ్గర రాజద్రోహపు కరపత్రాలుంటాయని యెవరనుకుంటారు? దేవుడి దయవల్ల వేలకొద్దీ కరపత్రాలను ఫాక్టరీలోకి నేనుకాదూ చేరేసింది?" అని తల్లి సంతోషంతో చెప్పింది.

ఆమెకు, భుజాన్ని ఒకసంచి తగిలించుకొని కర్ర చేత్తోపట్టుకుని గ్రామాల వెంట, అడవులవెంట నడిచిపోవాలనే సరదాకలిగింది

"నాయినా! నికోలే! నువ్వు చాలా మంచివాడవుకాని. ఈపని నాకు ఏర్పాటుచేద్దూ. నాకీ ఉద్యమంలో పనిచేసే అవకాశం కలిగించు. మిరెక్కడికెళ్ళ మంటే అక్కడకెడతాను. సత్యంకోసం, ఈఉద్యమ ప్రచారంకోసం, నాకంఠంలో ప్రాణం వున్నంతమట్టుకు యెండా, వాన, చలీ లక్ష్యంలేకుండా తిరుగుతాను. నాలాంటి అనాథ స్త్రీకది మంచిపనికాదూ? దేశదిమ్మరిబ్రతుకు మంచిదే. తినడానికి తిండితప్ప మరేలగులాటంలేదు. ఒకడిచేత చివాట్లుపడనక్కరలేదు. హాయిగా శాంతంగా వొకరిజోలీ శొంఠీ లేకుండా ప్రపంచంఅంతా చుట్టపెట్టొచ్చు. నేనూ అల్లాగే తిరుగుతాను. ఆంద్రీ, పాషా లెక్కడఉంటే అక్కడకే నేనూవెడతాను."

నికోలే ఆమెచెయ్యి నెమ్మదిగా పట్టుకొని గడియారం చూశాడు

"సరేలే. ఆసంగతి తర్వాత మాట్లాడదాం. నువ్వు చాలా ప్రమాదమైన పని నెత్తినెట్టుకుంటున్నావు నువ్వు చేయదలచుకొన్నపని ఎలాంటిదో బాగా ఆలోచించుకో" అన్నాడు.

"ఓయినాయనా! నాకేముంది ఆలోచించుకోవడానికి? ఈ ఉద్యమంకోసం కాకపోతే నేను బ్రతుకడందేనికి? నావల్ల ఎవరికయినా ఏమైనా ప్రయోజనముందా? ఒక చెట్టుంది. అది పెరిగి పెద్దదయిన తర్వాత జనానికి చల్లనినీడనిస్తుంది. దాన్ని కొట్టేస్తే వంటచెరుకుగా పనికొస్తుంది. జనానికి చలి లేప్పుకునేందుకుగూడా పనికొస్తుంది. మాటామంతీలేని కర్రమొద్దే ఏదోవిధంగా జీవకోటి కుపయోగపడు తుంటే నావంటిమనిషి ఊరికే నిష్ప్రయోజనంగా ఉండనా? పిల్లలు మాగర్భవాసాన్ని పుట్టినబిడ్డలు, తమస్వేచ్ఛనీ, ప్రాణాన్నికూడా తృణప్రాయంగా వదిలేస్తుంటే కాటికి కాళ్ళుచాచుకుకూర్చున్న నేను, అందులోనూ బిడ్డలనుకన్నతల్లిని, ఊరికేతెల్లబోయి చేతులుకట్టుకునిచూస్తూ వూరుకుంటానా?" (ఇట్లాఅంటుంటే ఆమెకు తనకొడుకు జండాపుచ్చుకొని ఊరేగింపు నకు నాయకత్వము వహించినదృశ్యం కండ్లకుకట్టినట్లు కనబడింది.)

"నాకుమారుడు సత్యంకోసం తన ప్రాణాన్ని అర్పిస్తుంటే నేనెందుకు సోమరిపోతులాగు కూర్చోవాలి? అతను సత్యంకోసం, ధర్మంకోసం పాటుబడు తున్నాడని నాకు ఇప్పుడు బాగా నచ్చింది నేనూ ఐదేళ్ళనుంచి యిదంతా చూస్తున్నాను. నా హృదయం కరిగింది ఇప్పుడు మరుగుతోంది. మీరంతా యెందుకు కష్టాలపాలవుతున్నారో నాకు తెలిసింది మీరొక్కొక్కళ్ళు మీ భుజాల మీద యెంతెంత భారం మోస్తున్నారో నేనూ చూస్తున్నాను. నాయనా! క్రీస్తు దేవుని పేరిట నా కొడుక్కి సహాయపడే నిమిత్తం నన్నుకూడా నీతో తీసుకెళ్ళు పద తీసుకెళ్ళు—నికోలేతెల్లబోయాడు దీర్ఘమైన నిశ్వాసం విడిచాడు చిరునవ్వు నవ్వుతూ తల్లిని బుజ్జగించి,

"అమ్మా! యిల్లాంటిమాటలు వినడం నాకిదే మొదలు" అన్నాడు

"నేనేమి చెప్పగలను?" అంటూ లేచి నిస్సహాయసూచకంగా చేతులు వేలాడేసి "నాయనా! కొడుకులను కన్న తల్లి హృదయంలోవుండే భావాలన్నీ చెప్పడానికి నాకు మాటలు దొరుకుతేనా? ఎందరెందరో యేడుస్తారు పరమ దుర్మార్గులైనా, ఎంత హృదయంలేని వాళ్ళయినా గదగదలాడి కరిగి నీరు కావలసిందే. పూర్వం క్రీస్తుదేవుని విషంత్రాగించినట్లే, ఇప్పుడు వాళ్ళు మనవాళ్ళని విషంత్రాగిస్తున్నట్లే. నేనూ వాళ్ళచేత విషం త్రాగించగలను. వాళ్ళు తల్లికడుపులో చిచ్చుపెట్టారు" అంది.

నికోలే లేచి గడ్డం సవరించుకుంటూ "ఏమమ్మోయి! ఎప్పుడో ఒకరోజున నువ్వు వాళ్ళతో మాట్లాడేటట్లుగానే వున్నావు" అన్నాడు గడియారంకేసి చూచి. "అయితే నిశ్చయమేకాదూ? నువ్వు యింటికొచ్చేస్తున్నట్టేనా?" అని అడిగాడు.

తల్లి అంగీకారసూచకంగా తల ఆడించింది

"ఎప్పుడు? సాధ్యమైనంత త్వరగా రావాలి. నీకోసం యెప్పుడెప్పుడని యెదురుచూస్తూ ఉంటాను సరేనా?"

తల్లి అతనికేసి వెర్రిచూపు చూసింది. తనకీ నికోలేకీ, ఏమి సంబంధమా అని ఆలోచించింది. ఇంతలో అతను దగ్గరకొచ్చి 'నీదగ్గర యేమైనా డబ్బుందా? అన్నాడు

"లేదు"

నికోలే గభాలున జేబులోనుంచి డబ్బుసంచితీసి ఆమెముందు పెట్టాడు. ఎంతకావాలో అంత తీసుకోమన్నాడు

తల్లికి అప్రయత్నంగా నవ్వొచ్చింది "నాయనా! మీ అందరి సంగతి యేవిషయంలో చూచినా కొత్తగానేవుంది. డబ్బంటేకూడా మీకేమి లక్ష్యం లేదు. మీకవి కాగితంముక్కలూ, రాగిముక్కలూగా వున్నాయి. లోకంమీద దయకొద్దీ డబ్బు మీదగ్గర వుంచుకుంటున్నా రనుకుంటాను" అంది.

నికోలే ఇవానిష్ మెల్లగా నవ్వేడు. "అమ్మా! డబ్బు చాలా పాపిష్టిది. చాలా చిరాకు కలిగిస్తుంది. దాన్ని పుచ్చుకోవడం కష్టమే, యివ్వడమూ కష్టమే"

త్వరగా రావాలసిందని చెప్పి నికోలే వెళ్ళిపోయాడు.

అతనువచ్చి వెళ్ళిన నాల్గవరోజున తల్లి పట్టణానికి ప్రయాణమైంది. ఒక బండిలో తన ట్రంకుపెట్టెలు రెంటినీ వేసుకుని బయల్దేరింది. బండి సాగుతూంటే తన జీవితంలో విశేషకాలం గడిపిన ఆగ్రామాన్ని ఒక్కసారి చూడాలని బుద్ధిపుట్టి వెనక్కి తిరిగింది. సంతోషవిచారాలు కలసివచ్చాయి. పూర్వజీవితాన్ని తలుచుకుంటే విచారం. తన జీవితపరిణామాన్ని తలుచుకొని ఆనందం. ఇల్లాంటి అవస్థలో ఫ్యాక్టరీదాటిపోయింది బండి. తారుగాని చమురుగాని లేకపోవడంచేత టకటక శబ్దంతో వూగుతూ బండి సాగిపోయింది.

* * *

౨

నికోలే ఇవానిష్ కాపురము పట్టణం చివర జనసమ్మర్దంలేని ఒకవీధిలో. అతని ఇల్లు రెండంతస్తులమేడ. కాని పాతది. నికోలేవుండేభాగానికి ముందు పువ్వుల తోటుంది. అందులో రకరకాల పువ్వులున్నాయి. ఇల్లు శుభ్రంగాను ప్రశాంతం గానూ ఉంటుంది. గదిలో చక్కని అద్దాల బీరువాలు. వాటినిండా పుస్తకాలు ఉన్నాయి. గోడలమీద యెవరెవరివో బొమ్మలు వ్రేలాడుతున్నాయి.

నికోలే తల్లికి ఒకగది చూపించి అది ఆమెకు వీలుగావుంటుందేమో చూచు కోమన్నాడు. ఆగది కిటికీలోనుంచి చూస్తే చక్కని పువ్వులతోట కనబడుతుంది. ఇంకొక కిటికీలోంచిచూస్తే విశాలమైన పచ్చికబయలు కనబడుతుంది. ఆ గదిలో పుస్తకాల బీరువాలున్నాయి ఇవన్నీ నిలోనా ఒక్కసారి యెగాదిగా చూచింది.

"నేను వంటఇంటోనే వుంటాను. అది చిన్నదిగా, అందంగావుంది" అంది.

నికోలే ఇవానిష్ ఆశ్చర్యపద్దాడు. చివరకెల్లాగైతేనేమి, ఆమెచేత ఒప్పించి గదిలో ప్రవేశపెట్టేడు. నికోలే కాపురముండే మూడు గదులుకూడా చాలా బాగున్నాయి. శుభ్రమైన గాలి, ప్రశాంతమైనస్థలం అక్కడుంటే అసలు మాట్లాడ టానికే బుద్ధిపుట్టదు,

తల్లి పువ్వులచెట్ల కుదుళ్ళలో చెయ్యిపెట్టి చూచి "నికోలే! ఈ చెట్లకు నీళ్ళు లేవేమి?" అని అడిగింది.

"అవును; నీళ్ళులేవు. నాకు మొక్కలంటే చాలా సరదాయే కాని. వాటికి సంరక్షణ చేయడానికి తీరికమాత్రం లేదు."

ఆ యింటికి యజమాని నికోలే. అతనిధోరణిచూస్తే అతను కూడా ఆ యింట్లో పరాయివాడుగానే వుండేవాడు. అంటీ ముట్టకుండా కుమ్మరిపురుగులాగా వర్తించేవాడు. పిల్లిలాగా చప్పుడుచేయకుండా పచారుచేస్తూ వుండేవాడు ఏ వస్తు వెక్కడుందో, అది తనవపునో కాదో కూడా అతనికి తెలియదు ఈ స్థితి తల్లి గ్రహించి యే వస్తువెక్కడుందో తానే తెలుసుకుంది. అతని అలవాట్లన్నీ కని పెట్టింది. అతని వ్యవహారమంతా అడ్డదిడ్డంగా కనబడింది.

తల్లి పూలచెట్లకు నీళ్ళుపోసింది పియానోమీద పడున్న బూజంతా తుడి చింది. చిందరవందరగా పడున్న కాగితాలన్నీ సర్దింది. టీ కాచుకునే గిన్నె మసి పట్టిపోయింది.

ఆ రాత్రి ఆమె నిద్రపోవడానికి పక్కమీద పడుకుని తలయెత్తి కిటికీలోంచి చూచింది. అంతా ఆశ్చర్యంగా కనబడింది. ఆమె జీవితంలో పరాయికొంపలో పక్కవెయ్యడాని కదే మొదలు. కాని యెందుచేతో ఆమె కేమీ కష్టం మాత్రం తోచలేదు.

నికోలే అమృత హృదయుడని నిశ్చయించుకుని ఎల్లాగైనా తన చేతనైనంతవరకు అతని జీవితానికి సౌఖ్యం కలుగచెయ్యాలనుంది. అతని అమాయకత్వంచూస్తే ఆమెకు జాలీ విచారం కలిగినాయి ఇంతలో ఆమె ఆలోచన ఆండ్రీ, పాషాల మీదికి పోయింది. ఫెడ్యామాజిన్ పాడినపాట. ఆ మృదులస్వరం ఆమె చెవులకి సోకినట్లయింది, క్రమంగా మే 1 వ తేదీని జరిగిన సంగతులన్నీ జ్ఞాపకానికొచ్చాయి. ఆమెకు ఆ రోజున తనుపడ్డ కష్టం, ఆదుర్దా అన్నీ తలుపుకొచ్చి హృదయం కుమిలిపోయింది ఒక విధమైన ఆగ్రహం, ఆవేశం రేకెత్తినాయి. ముసలితనం అంతా పోయినట్లయింది.

తెల్లవారగట్ల లేచి, తల్లి టీ గిన్నె చక్కగా తోమి నీళ్ళుకాచి టీ తయారు చేసి సిద్ధంగా వుంచింది, నికొలే ఎప్పుడు లేస్తాడా అని కనిపెట్టుకుంది. అప్పుడే బిగ్గరగా ఆవలిస్తూ నికోలే లేచాడు. ఒకచేత్తో కళ్ళజోడు పట్టుకొని రెండో చేత్తో గొంతుక సర్దుకుంటూ బయటికి వచ్చి తల్లిని పలుకరించాడు. ఆమె టీ బల్లమీద పెట్టింది నికోలే విసుక్కుంటూ గబగబా ముఖం గిఖం కడుక్కున్నాడు.

ఇద్దరూ కూర్చుని టీ త్రాగుతుంటే నికోలే ఇవానిష్ తన సంగతంతా తల్లితో చెప్పాడు.

"అమ్మా! నాకు • జంస్ట్వోబోర్డులో పని. ఇది చాలా దౌర్భాగ్యపుపని. మన రైతులంతా ఎల్లా నాశనమైపోతున్నారో కళ్ళారా చూస్తుంటాను........... అంతే. అదేపని నాకు. ఏంచెయ్యగలను ? జనం ఆకలిచేత మాడిమాడి చివరకి అకాలమృత్యువు నోట్లో పడిపోతున్నారు. అతిబలహీనంగా, మలపల్లాంటి పిల్లలు పుట్టి అనేక రోగాలపాలై చీమల్లాగ, ఈగల్లాగ మాడిపోతున్నారు. ఇదంతా మాకు తెలుసును. ఈ దురవస్థకు కారణంకూడా తెలుసును. అసలు ఈ విషయాలన్నీ కనిపెడుతున్నందుకే మాకు దిట్టంగా జీతాలిస్తున్నారు. ఇంతే, మేము నిజంగా చేసేపని."

"నువ్వు విద్యార్థివా ?"

"కాదు కాదు, నేనొక పల్లెటూరి బడిపంతుల్ని. మా నాన్న వ్యాట్కాలో ఒక పెద్ద మిల్లుకి సూపరెంటుగా ఉండేవాడు. నేను బడిపంతులు పనిలోకొచ్చేను. ఆ ఉద్యోగంలో ఉండి రైతులకు కరపత్రాలు, పుస్తకాలు పంచిపెడుతూ ఉండేవాడిని. ఆసందర్భంలోనే కొంతకాలం ఖైదులో కెళ్ళవలసివచ్చింది. తిరిగొచ్చిన తరువాత పుస్తకాల దుకాణంలో గుమాస్తాగా ప్రవేశించాను. అక్కడ తగినంత ఉషారుగా ఉండకపోవడంవల్ల మళ్ళీ జైలుకి పోవాలిసొచ్చింది. అక్కడనుంచి * ఆర్కేంజల్ ప్రవాసం పంపారు. అక్కడ గవర్నరుకూ నాకూ జగాదారావడం వలన శ్వేతసముద్రంకు పంపారు. అక్కడ అయిదేళ్ళపాటు కాలక్షేపంచేశాను."

• లక్షిక స్థితిగతుల విచారించె సంఘము.

* తెల్లసముద్రం White sea.

ఈ సంగతంతా అతను తొణుకూ బెణుకూ లేకుండా యెవరిసంగలో చెపు తున్నట్లు చెప్పాడు. తల్లి ఇలాంటి చిత్రకథలెన్నో చాలా వింది. ఇంలింత బాధయి పడికూడా వీళ్ళు పిసరంతైనా ఆగ్రహం, ఆవేశంలేకుండా ఎల్లాచెప్తుతారా అనిపిం చింది. ఇంతశాంతం వీళ్ళకెల్లా అబ్బిందాఅని ఆమెకాశ్చర్యం కలిగింది. ఇన్నిన్ని కష్టాలు వీళ్లెందుకుపడాలో ఆమెకర్థంకాలేదు. ఈ విషయమై తనలో తాను తర్జన భర్జనచేస్తుంటే నికోలే "ఇవ్వేళ మా అక్కయ్య వస్తుంది" అన్నాడు.

"ఆమెకు పెళ్ళి అయిందా ?"

"ఆమె విధవ. ఆమె భర్తను సైబీరియా ప్రవాసం పంపారు. అతను తప్పించుకుని పారిపోయివస్తూంటే దారిలో జలుబుచేసి చచ్చిపోయాడు. చనిపోయి రెండు సంవత్సరాలయింది."

"మీ అక్క నీకన్న యెంత పెద్ద ?"

"ఆరు సంవత్సరాలు. నాకు ఆమె చాలా సహాయంచేస్తోంది. కొంచెంసే పాగితే నీకే తెలుస్తుంది. ఆమె పియానో ఎంత హాయిగా వాయిస్తుందో విందువు గాని. అదిగో ఆ పియానో ఆమెదే."

"ఆమె మకామెక్కడ?"

"ఎక్కడపడితే అక్కడే. ఎక్కడైతే ధైర్యం అవసరముంటుందో అక్కడల్లా ఆమె వుండి తీరుతుంది."

"ఈ ఉద్యమంలో కూడా వుందా ?"

"సరిసరి ! సందేహమేమిటి ? ఇందులోనే."

ఈ సంభాషణ అయినతర్వాత నికోలే తనపనిలో కెళ్ళిపోయాడు. తల్లి యీ వుద్యమాన్ని గురించి యిందులో పనిచేసే మనుష్యుల అద్భుతశక్తినిగురించీ ఆలోచించడం మొదలెట్టింది. ఆ ఆలోచనలో పడేసరికి ఆమెను అంధకారం కమ్మేసింది. ఆ అంధకారంలో ఒక మహా పర్వతం కనబడింది.

మధ్యాహ్నానికి, మంచి ఒడ్డుపొడుగూ కలిగినటువంటి స్త్రీ తలుపుతట్టి లోపలికొచ్చింది. వస్తూనే నిలోనా చెయ్యిపట్టుకుని "పావెల్ తల్లివి నువ్వేకామా?" అని ప్రశ్నించింది. తల్లి అవునన్నట్లుగా తలూపింది. అతి విలాసంగా వుండే ఆమె దుస్తులుచూచి తల్లి తెల్లబోయింది.

"నేనల్లాగే అనుకున్నాను పావెలూ, మేమూ చాలాకాలంనుంచి యెక్కువ స్నేహితులం. అతను నిన్నుగురించి చాలాసార్లు చెప్పుతూవచ్చాడు." అంటూ ఆ స్త్రీ టోపీతీసి అద్దందగ్గరకెళ్ళి ముంగురులు సర్దుకుంది. ఆమె దీర్ఘాలుతీస్తూ మాట్లాడింది. ఆమె నడక మహా చలాకీగావుంది. ఆమె విశాలనేత్రాల్లో యౌవనం కనిపిస్తూన్నా, నుదుటమీద ముడుతలు, నెరిసిన వెంట్రుకలు ఆమె పెద్దరికాన్ని సూచిస్తున్నాయి.

"నాకు ఆకలవుతోంది. ఏమైనా ఒక కప్పు కాఫీ దొరుకుతుందా ?"

"నీకు కావలిస్తే యిప్పుడే చేసిస్తాను" అని తల్లి కాఫీసామాను తీసింది. "పాషా నన్నుగురించి చెప్పేవా?" అని తల్లి పట్టలేక అడిగింది.

"అబ్బో! చాలా చెప్పేడు." అని ఆమె తోలుపెట్టిలోనుంచి సిగరెట్టుతీసి అంటించింది. రయ్యిమని పొగవిడుస్తూ "ఏమమ్మా! పాపం. నువ్వు పాషా కోసం బెంగపెట్టుకున్నా వనుకుంటాను, కాదూ?" అని తల్లిని జాలిపడుతూ అడిగింది. తల్లి చిరునవ్వు నవ్వుతూ పొయ్యికేసి తిరిగి నిలబడింది. తనకొడుకు తన్నిగురించి యింత ప్రశంసగా అందరితో చెప్పాడు కదా అని చాలా సంతోషించింది. చాలా గర్వం కూడా కలిగింది.

"ఏమిటీ? నాకు బెంగలేదా అని అడుగుతున్నావా? లేకేమి? కొంతకాలం క్రిందటయితే అసలు బెంగచేత ప్రాణమే పొయ్యేది. ఇప్పుడు అతడొక్కడే కాదని తెలిసింది నేనొక్కతెనే కాదు. నాలాంటివాళ్ళు చాలామంది వున్నారు: ...............సరేకాని నీ పేరేమిటి?"

"సోఫియా" అని ముక్తసరిగా చెప్పి మాట్లాడడం ఆరంభించింది.

"ఇప్పుడు ముఖ్యమైన సంగతేమిటంటే, వాళ్ళు అనవసరంగా చాలాకాలం జైల్లో వుండకూడదు. ఈ విచారణ త్వరగా అయిపోవాలి. వాళ్ళకి ప్రవాసశిక్ష వేస్తారు. పావెల్ తప్పించుకొని పారిపోయి రావడానికి చెయ్యవలసిన ఏర్పాట్లన్నీ చేస్తాం..............................................................................

అతనివంటివాడు వృధాగా సైబీరియాలో ఉంటే ఏమి ప్రయోజనం? ఇక్కడతనికి కావలసినంత పనుంది. అతను లేకపోతే పని జరుగదు" ఇల్లా మాట్లాడుతూ మాట్లాడుతూ సోఫ్యా సిగరెట్టుపీకి పారెయ్యటం ఎక్కడా అని ఇటూ అటూ చూచి చివరకు పువ్వుల చట్టిలో వేసింది. తల్లి అప్రయత్నంగా "అల్లా చేస్తేనే పూలచెట్లు పాడైపోతాయి" అని మెల్లగా మందలించింది. "అవునవును. క్షమించు! పొరబాటు. నికోలే నాకనేకసార్లు చెప్పాడు" పీకితీసి కిటికీలోంచి అవతల పారేసింది. తల్లి ఆమెకేసి ఖంగారుపడి చూసింది. "నువ్వే నన్ను క్షమించాలి. నేను ఆనాలోచితంగా అన్నాను. నేను నిన్ను మందలించడానికి ఇదేమైనా నాయిల్లా?"అంది

"సరిసరి తప్పుచేస్తే ఎందుకు మందలించకూడదు? ఇది తప్పని నాకు తెలిసిందకాని మరచిపోతూ ఉంటాను. ఈ సిగరెట్టు పీకిలు యెక్కడబడితే అక్కడ పారెయ్యడం, కాల్చిన బూడిద ఎక్కడపడితే అక్కడ దులపడం, ఇది మహాచెడ్డ అలవాట్లు ముఖ్యంగా వాళ్ళకి శుభ్రత అనేది కొంత శ్రమపడి చేసే పనియొక్క ఫలితం. శ్రమతో కూడినపనిని గౌరవించక తప్పదు అప్పుడే కాఫీ తయారైందే? సంతోషం అయితే ఒక్క గిన్నెడు మాత్రమే చేశావేమి? నువ్వేమీ పుచ్చుకోవూ?"అని చాలాసేపు మాట్లాడింది. కాస్సేపైన తర్వాత చటు

క్కన తల్లి జబ్బలు పట్టుకొని దగ్గరకులాక్కొని "ఏమిటమ్మా? అల్లాగకొత్తగా బెదురుబెదురుగా ఉంటావేమి?" అని అడిగింది.

"బెదురేముంది? ఇప్పుడేకాదూ నిన్ను సిగరెట్టుపీకి పారేసినందుకు ఆక్షేపించాను? మీయింటికి నిన్ననేకదావచ్చాను. అప్పుడే స్వంతమనిషినైపోయాను, చిరకాలంనుంచీ ఎరుగున్నట్లుగా ప్రవర్తిస్తున్నాను, ఏమీ భయంలేకుండా ఏమాట పడితే ఆమాట అంటున్నాను" అని చిరునవ్వునవ్వింది.

"అంతే, అల్లాగే వుండాలి" అంది సోఫియా.

"నాతల తిరిగిపోతోంది. నాలో నాకే యేమిటో క్రొత్తగావుంది. ఇదివరకు యెంతో పరిచయముంటేనే కాని యెవరితోనూ మనసిచ్చి మాట్లాడేదాన్నికాను. ఇప్పుడల్లాకాదు. మాటల్ని హృదయంలో యిముడ్చుకోలేకుండా వున్నాను. కలలోనైనా అనుకోనిమాటలన్నీ అనేస్తున్నాను. (సోఫ్యా యీలోగా యింకొక సిగరెట్టు ముట్టించి తల్లికేసిచూస్తుంది)............ నువ్వు పాషా తప్పించుకొచ్చే యేర్పాట్లు చేస్తానంటున్నావే? పారిపోయివచ్చి అతడు రహస్యంగా ఎల్లా బ్రతుకుతాడు? అని తల్లి చివరికి తనమనస్సును ఆందోళనపరుస్తున్న సందేహాన్ని తేల్చింది.

సోఫ్యా కాఫీని గిన్నెలో పోసుకుంటూ ఆరంభించింది.

"అదెంతపని? రహస్యంగా బ్రతుకుతున్న వాళ్లెందరులేరు? వందలూ వేలూ వున్నారు. వాళ్ళతోపాటే పాషాకూడాను ఇప్పుడే నేనల్లాంటి మనిషిని కలుసుకొని మాట్లాడి పంపేశాను. అతను దక్షిణ దేశంలో యీఉద్యమంలో తీవ్రంగా పనిచేసేవాళ్ళల్లో ముఖ్యుడు. అతనికైదేళ్ళు ప్రవాసశిక్ష వేశారు. కాని అక్కడ మూడున్నర మాసాలు మాత్రమే వున్నాడు అందుకోసమే నేను ఇంత పెద్దవేషం వేశాను. లేకపోతే నేను రోజూ మామూలుగా ఇంతపెద్దవేషం వేస్తాననుకున్నావేమిటి? నేనీ షోకుబట్టల ఆర్భాటాన్ని భరించలేను. మనిషి చాలా నిరాడంబరముగా వుండాలి. బట్టలుఅందంగానూవుండాలి. ఆడంబరం లేకుండానూ వుండాలి"

తల్లి సోఫ్యాకేసి తేరిపారచూసింది. చిన్ననవ్వు నవ్వింది. తలపూపుతూ ఆలోచించి ఇలాచెప్పింది.

"ఏమోకాని మేనెల 1 వ తేదీ వసంతోత్సవము నాటి సంగతులు చూచినప్పటినుంచి నాలో యేదో పెద్ద మార్పుకలిగినట్లు తోస్తుంది. ఒక్కొక్కప్పుడు ఏమిటో రెండు దారులలో ఒక్కసారిగా నడుస్తున్నట్లు గడబిడగా వుంటుంది. ఒక్కక్షణంలో అంతా తెలిసినట్లుంటుంది. మళ్ళీ ఉత్తరక్షణంలో మబ్బు కమ్ముకుపోతూంది. మాటవరుసకి చెపుతున్నాను. నువ్వున్నావు: ఒక గౌరవమైనస్త్రీవి. ఈఉద్యమంలో పనిచేస్తున్నావు. పాషాను బాగా ఎరుగుదువు. అదే సంతోషంనాకు. అందుకేనేను నీకుయెంతో కృతజ్ఞురాలిని."

"సరి సరి. నీకే మేము కృతజ్ఞతచూపించాలి." అని సోఫ్యా నవ్వింది.

"నాకా? నేనేమీ అతనికీవుద్యమం సంగతి నేర్పలేదే?" అని నిట్టూర్పు విడిచి గట్టిగా మాట్లాడడం ఆరంభించింది.

"నేనిప్పుడిల్లా మాట్లాడుతూవుంటే అన్నీ తెలిసినట్లుగానే వుంటాయి. క్షణంలో మళ్ళీ అంధకారమై పోతుంది. మళ్ళీ నేనే సర్దుకుంటూ వుంటాను. నాజీవితమంతా భయపడుతునే గడిపాను. నిజానికి భయానికిప్పుడెక్కువ ఆస్కారంవుందికాని నాకు భయం చాలాతగ్గిపోయింది. యెందుచేతో కారణం తెలియదు"

ఇక తల్లికి మాట తొణుకులేదు. సోఫ్యా యీస్థితి గ్రహించి తానందుకుంది.

తొందరెందుకూ? నీకంతా స్పష్టంగా తెలిసేరోజు త్వరలో రాకతప్పదు. మనిషి ఎప్పుడైతే ఒక వుద్యమాన్ని హృదయపూర్వకంగా ప్రేమించి, అది సర్వజనానికీ వుపయోగకరమైనదనీ, మంచిదనీ గ్రహిస్తాడో అప్పుడే అతనికొక శక్తి వస్తుంది. అటువంటి ప్రేమ ఒకటుంది.........సరేకాని నేనీ ఆర్భాటపువేషాన్ని తీసెయ్యాలి." అంటూ సోఫ్యా సిగరెట్టుపీకి పళ్లెంలోవేసి లేచి తలములుపుకుంది. బంగారంలా మెరిసే తలవెంట్రుకలు విరియపడ్డాయి. ఆ విరియబోసిన లలతో నవ్వుకుంటూ లోపలికెళ్ళింది. తల్లి ఆమె వెడుతూవుంటే చూచి చూచి చివరకు కాఫీత్రాగిన గిన్నెలు పళ్లాయితీసి సర్దడం ఆరంభించింది.

* * * *

సాయంత్రం నాలుగుగంటలకు నికోలేవచ్చాడు అంతాకలిసి భోజనంచేశారు. భోజనం చేసేటప్పుడు మధ్యమధ్య నవ్వుతూ సోఫ్యా తాను ప్రవాసంనుంచి పరారయి వచ్చిన మనిషినెల్లా కలుసుకొన్నదీ, గూఢచారులకెల్లా భయపడినదీ, ఆ పారిపోయి వచ్చినవాళ్ళు యెంత తమాషాగా ప్రవర్తించినదీ అంతా వివరంగా చెప్పింది. మంచి పనివాడు తనకు తృప్తికలిగేటట్లు పనిచేసిన తర్వాత బడాయిగా చెప్పేటట్లు చెప్పడం ఆరంభించింది అప్పుడు సోఫ్యా చక్కని పొడుగాటి లేతపుబ్బురంగు గౌను తొడుక్కుంది. ఆ గౌను తొడుక్కుంటే చాలా భారీగా కనుపించింది. భోజనమైన తర్వాత నికోలే "సోఫ్యా! యిదిగో నీకు ఇప్పుడొక పని తగిలింది. గ్రామాలకోసం ఒక పత్రికను ప్రచురించడానికి మనం వొప్పుకొన్న సంగతి నీకు తెలుసునుగదా. ఈ మధ్యజరిగిన అరెస్టులవలన అక్కడి మనుష్యులకీ, మనకీ సంబంధం తెగిపోయింది. ఆ పత్రికలను పంచిపెట్టే మనుష్యులను చూపించ గలిగినది నిలోనా ఒక్కతే. ఇంకెవ్వరూ లేరు. నువ్వుకూడా ఆమెతో వెళ్ళు. సాధ్యమైనంత శీఘ్రంగా పో" అన్నాడు.

"సరే మనంపోదాం. నిలోనా, ఏమంటావు?"

"అలాగే వెడుదాం."

"అది చాలా దూరమా?"

"ఉంటుంది సుమారు 50 మైళ్ళు"

"బలేబాగుంది! నేనిప్పుడు కాస్సేపు పియానో వాయించుకుంటాను. సంగీతం వినడానికి నీకేమీ అభ్యంతరం లేదుగదా?"

"నన్నుగురించి అట్టె ఆలోచించకండి. నేను లేనట్టే యెంచుకుని మీయిష్ట మొచ్చినట్లు చేయండి" అని చెప్పి తల్లి సోఫామీద ఒక మూలగా కూర్చుంది.

అప్పా, తమ్ముడూ ఏవో తమ గొడవలు మాట్లాడుకున్నారు. తల్లి కేమీ తెలియకపోయినా మధ్యమధ్య యాదాలాపంగా ఒక్కొక్క ముక్క వేస్తూఉండేది. సోఫ్యా పియానో తీసింది. సప్తస్వరాలు ఒప్పేటట్లు హాయిగా వాయించింది. ఒక్కొక్కటి హెచ్చుస్థాయిలోనూ, ఒకటి మధ్యమంలోనూ వాయిస్తుంటే తల్లి కేమీటో అంతా విపరీతంగా తోచింది. ఆ స్వరాలు ఆమె కేమీ అర్థం కాలేదు. ఆనంద మెక్కడ? బిందెమీద కుండపెంకెట్టి గీసి బర్రుబర్రు మనిపించినట్టే ఉంది. చెవులు దిబ్బడేసిపోయి కునికిపాట్లుకూడా వచ్చాయి. సోఫ్యా ఎడంచేత్తో రంయ్యిమని వాయించేస్తోంది. నికోలే శ్రద్ధగావింటున్నాడు. గదంతా సంగీతంతో ప్రతిధ్వనిస్తోంది. తల్లికి కొన్ని రాగాలు సరిగ్గా ఆ రోజున ఫెడ్యా పాడినట్లె ఉన్నాయి. క్రమంగా ఆమె సంగీతంలో ఉండే ఆనందం అనుభవించింది........

ఏమి కారణమో కాని ఆమెకి తన చిన్ననాటి కష్టాలన్నీ జ్ఞాపకానికొచ్చాయి. ఒకరోజున ఆమె భర్త తెగతాగివచ్చి ఆ నిషామీద ఆమెను మంచంమీద నుంచి క్రిందికి పడదోసి వీధిలోకి గెంటేశాడు పైమీద బట్టయినా లేకుండా రెండేండ్ల పిల్లవాడిని శాలువలో పెట్టుకొని మారు మాటాడకుండా వీధిలోబడిపోయింది. వంటినిండా దుస్తులు లేకపోవడంచేత ఎవరైనా చూస్తారేమోనని సిగ్గుపడి మురుగు గుంటకేసిపోయి అక్కడ చెట్లక్రింద తెల్లవారేదాకా పడుంది ఏడుస్తున్న పిల్ల వాడిని జోకొట్టుకుంటూ కూచుంది. పక్షులు కూసేవేళ లేచి చలిలో గడగడ వణు కుతూ, ఇంకా యేమి దెబ్బలు వ్రాసున్నాయో అని గుండెలు పీచు పీచుమంటూ ఇంటికి వెళ్ళింది. ఆ ఆలోచనలో పడుండేసరికి పియానో స్వరం ఒక్కసారి షడ్జ మానికెళ్ళి క్రమంగా నిట్టూర్పులాగొచ్చి తగ్గి ఆరిపోయింది. సోఫ్యా నికోలేతో మెల్లగా "ఎల్లావుంది పాట? నీకు నచ్చిందా?" అంది.

"చాలా బాగుంది" అన్నాడు నికోలే. సోఫ్యా తల్లికేసి చూసింది కాని ఏమీ మాట్లాడలేదు. తల్లికి సంగీతం యింకా పాడుతూంటే బాగుండుననిపించింది. తన పూర్వావస్థలు జ్ఞాపకానికొచ్చినట్లె ఆమెకు యీ అప్పా తమ్ముల గురించి ఒక ఆలోచన కలిగింది. ఈ అప్పా తమ్ముడూ చక్కగా ఒకళ్ళ జోలీ సొంఠీ లేకుండా అతిస్నేహంగా కాలక్షేపం చేస్తున్నారు. చదువుకొనేందుకు పుస్తకా లున్నాయి. హాయిగా సంగీతం పాడుకుంటారు. ఒకళ్ళనొకళ్ళు తిట్టుకోరు. బ్రాంది వగైరా నిషావస్తువులను ముట్టుకోరు. మామూలు జనంలాగ ఒకళ్ళ నొకళ్ళు అసహ్యించుకోరు ఇదేమి అదృష్టమా అని తల్లి ఆలోచించింది.

సోఫియా సిగరెట్టు ముట్టించింది. ఆ వరుసని అవేకాల్చడం ఒకదానిమీద

ఒకటి. ఆపొగ మేఘాలు ఆమె ముఖబింబాన్ని ఆవరించేశాయి ఆస్థితిలో ఆమె కొంచెం విచారంతో ఇలాఅంది నికోలేతో.

"ఈ పాటంటే మా • కోస్త్యాకెంతో ప్రాణం. ఆయనకోసం పాడడమంటే నాకెంతో సరదాగా వుండేది. సంగీతాన్ని మాటల్లోకి మార్చే ప్రతిభ అతనిలో వుండేది. నువ్వెరుగవూ ? (కొంచెం ఆగి చిరునవ్వునవ్వి)............ యెంతటి సూక్ష్మగ్రాహి ? ఆహా యెటువంటి మంచిగుణాలు ! దేనికైనాసరే పనంటే తయార్ ! మనిషంటే అల్లావుండాలి."

తల్లి యీ మాటలువిని "పాపం తన భర్తసంగతి కాబోలు చెపుతోంది. నవ్వుతోందే ?" అనుకుంది. సోఫ్యా మెల్లగా పియానో మెట్లమీద వ్రేళ్ళుంచి "ఆహా ! ఆయన నన్నెంత సౌఖ్యపెట్టాడోగదా ! యెప్పుడూ సంతోషమే. పిల్లవాడిలాగ ఆనందంలో వుయ్యాలలూగిపోయేవాడుకదా" అంది.

"అవునవును, అతని ఆత్మ యెప్పుడూ సంగీతం ఆలాపిస్తూనేయుండేది" అన్నాడు నికోలే.

సోఫ్యా తన భర్త సంగీతజ్ఞానాన్నిగురించి చిన్న ఉపన్యాసం యిచ్చింది. ఛటుక్కున నోట్లో సిగరెట్టుపారేసి మళ్ళీ ఆ పాటే వాయించింది. సోఫ్యాకి తన భర్త సంగతి జ్ఞాపకమొచ్చి వాయిస్తుంటే తల్లికి ఆపాట వింటూంటే తన పూర్వావస్థే జ్ఞాపకానికొచ్చింది.

"సంగీతంలో స్వరం వినొచ్చు" అన్నాడు నికోలే.

"ఏమమ్మా నిలోనా ! నా చప్పుడు నీకేమీ బాధగాలేదుకదా ?" అని సోఫ్యా తల్లి నడిగింది.

"నా సంగతి మీరు అట్టే తలపెట్టొద్దని చెప్పలేదూ ? నే నిక్కడకూచుని వింటూ యేదో నా సంగతే ఆలోచించుకుంటున్నాను."

"అల్లాకాదు ! స్త్రీకి సంగీతం అర్థంకాకపోవడమంటూ వుండదు. ముఖ్యముగా విచారంలో విన్నప్పుడు" అని మళ్ళీ సోఫ్యా జోరుగా పియానో వాయించింది చాలాసేపు. తల్లికొకవిధమైన హాయికలిగింది. ఆమె హృదయంలో అనేక భావాలు పుట్టాయి. వాటినన్నిటినీ స్పష్టపరచడానికి భాష చాలదు. ఆ భావాలవల్ల ఆమెకు మరింత ధైర్యంమాత్రం కలిగింది.

ఆ అప్పా తమ్ములనుగురించి మొత్తంమీద యీ రకం మనుష్యులనుగురించి యేదో మంచిగా మాట్లాడాలని ఆమెకభిలాష కలిగింది. సంగీతంవల్ల కొంచెం ఆవేశం కలిగింది. నికోలే సోఫ్యాలకు తాను యేదో సహాయం చెయ్యాలని బుద్ధిపుట్టి ఒక్కక్షణం ఆలోచించింది. వంటయింట్లోకెళ్ళి టీ తయారుచేసుకొచ్చింది. కాని అంతటితో సంతృప్తికాలేదు. టీ గిన్నెలోపోస్తూ వుద్రేకంగా యిల్లా చెప్పడం ప్రారంభించింది.

• సోఫ్యా భర్త.

"మూర్ఖులమై అధోగతియందుపడివున్న మాబోంట్లకుకూడా అన్నీ తెలుస్తాయి. కాని మాహృదయంలో వున్న భావాన్ని మాత్రం పైకి తేల్చలేము. ఆలోచనలు బయలుదేరుతాయి వాటిని చెప్పలేకపోవడంచేత మాకు సిగ్గేస్తుంది. ఆ సిగ్గుచేత చిరాకుకలుగుతుంది; కోపం విసుగూవస్తుంది. అందుచేత చివరకి ఆలోచించడమే మానేస్తాం. చూడండి. ఈ బ్రతుకే కష్టం. నాలుగువైపులనుంచీ చీవాట్లు చెప్పుదెబ్బలూ తగులుతూ వుంటాయి. అల్లాంటప్పుడు విశ్రాంతికావాలి. అప్పుడు ఆలోచనలు బయలుదేరి ఆత్మ మేలుకొంటుంది."

(నికోలే కళ్ళజోడు తుడుచుకుంటూ శ్రద్ధగా తల్లిమాటలు వింటున్నాడు. సోఫియా చేతిలో సిగరెట్టుసంగతికూడా మరిచిపోయి ఆమెకేసి రెప్పవాల్చకుండా చూస్తూవింటోంది.)

తల్లి తనహృదయంలోంచి వచ్చేమాటలన్నీ ఒకపాటలా వుండడంచేత అప్రయత్నంగా సోఫ్యావ్రేళ్ళు శృతికోసమో అన్నట్లు పియానోమీద కెళ్ళేయి.

"ఇప్పుడిప్పుడే నాకు జీవితరహస్యం తెలియడంచేత నన్నుగురించీ, నా ప్రజలగురించీ కొంచెం కొంచెం చెప్పడానికి మాటలొస్తున్నాయి. మనుష్యుల జీవితాలు పోల్చిచూడడంవల్లనే జీవితంయొక్క పరమార్థం నేను తెలుసుకోగలిగేను. ఇంతకుపూర్వము నాతో పోల్చుకొనేందుకు ఎవరూ లేనేలేరు. మా ప్రాంతంలో జనం అందరిదీ ఒకటేబ్రతుకు. ఇప్పుడు నేను యితరుల జీవిత పద్ధతులనుకూడా చూస్తున్నాను కనుక దీనినిబట్టి నా పూర్వజీవితాన్ని పోల్చి చూసుకుంటే చాలాకష్టంగాను, అసహ్యంగానూ వుంది. వెనక్కివెళ్ళడం అసంభవం. కాని యిప్పుడు నాకు చాలామట్టుకు తెలిసిందనేనమ్మకం ఇప్పుడు నేను మిమ్మల్ని చూస్తూవుంటే మీతరహా మనుష్య లెందరో నాకు జ్ఞాపకానికొస్తున్నారు. బహుశా నేను చెప్పేమాటలు సరిగా లేకపోవచ్చును. అసలు మీకు నేను యేమీచెప్పనే అక్కరలేదు. మీరే ఎరుగుదురు. అయినా నా తృప్తికోసమే చెపుతున్నాను. నన్ను మీతోపాటే వుంచుకోండి. నావలన మీకేమి ప్రయోజనంగాని, సంతోషంగాని కలుగదు. ఆసంగతి నాకు తెలుసును. దేవుని దయవలన ఆరోజు కారోజు నా హృదయం విశాలమవుతుంది. అది మంచితనంవలన పెంపొందుతుంది. నేను ప్రపంచకానికంతకీ శుభం కోరుతున్నాను."

తల్లి కండ్లనుండి అశ్రుబిందువులు జలజలరాలేయి. ఆమె కంఠంలో స్వల్పమైన అవరోధం కలిగింది. ఆసోదరీ సోదరులకేసి దృష్టిసారించి మళ్ళీ మాట్లాడడం ప్రారంభించింది.

"నా హృదయాన్ని మీకుస్పష్టంగా చూపించదలచుకున్నాను. మీ శ్రేయస్సు నేనెంతగా కోరుతున్నానో మీకే తెలుస్తుంది."

"మేము చూస్తూనేవున్నాం. మాకు నువ్వు యెంతో హాయి కలిగిస్తున్నావు" అని మెల్లగా మాటకడ్డొచ్చాడు నికోలే.

"నేనేమనుకుంటున్నానో తెలుసునా? నాకేదో గొప్ప నిధో నిక్షేపమో దొరికిందనీ, దానితో నేను చాలా ధనికిరాలైనాననీ అనుకుంటున్నాను. ఇప్పుడు నేనందరికీ దానం ధర్మం చేయగలనని నావూహ. అయితే యిదంతా నాబుద్ధి హీనతే కావచ్చును"

సోఫ్యా "నిలోనా! నీవల్లా ఖిడియపడకూడదు. మరేమీ ఫరవాలేదు" అంది.

తల్లి మళ్ళీ ప్రారంభించింది. వాళ్ళిద్దరికీ తన పుట్టుపూర్వోత్తరమంతా చెప్పింది. తన బీదతనం, తన భర్త పెట్టినపాట్లూ, అన్నీ వివరంగా ఎవరిని గురించో చెపుతున్న కధల్లాగున చెప్పింది ఏమీ ద్వేషం లేకుండానే. మధ్య మధ్య విచారకరమైన చిరునవ్వు నవ్వుతూ దుఃఖపూరితమైన తన పూర్వగాధను చెప్పింది.

నికోలే సోఫ్యాలు ఈ కధనంతా శ్రద్ధగా విన్నారు. చిరకాలం పశువుమాదిరిగా హింసపెడితే నోరెత్తకుండా భరించిన ఆమెగాధ వారి హృదయాలకి నాటింది. ఆమె మాట్లాడుతూవుంటే వాళ్ళకి ఆమెవలెనే హింసపడుతున్న లక్షలకొద్దీ జనం మాట్లాడుతున్నట్లనిపించింది. ఆమె జీవితం సర్వసాధారణమే అయినా, జనం పడుతుండే అవస్థలకు ప్రత్యక్ష నిదర్శనమవడంచేత అతిశ్రద్ధగా విన్నారు. నికోలే బల్లమీద చేతులు పెట్టుకొని విన్నాడు, సోఫ్యా కుర్చీకి జేర్లబడివింది. మధ్యమధ్య తన అసమ్మతిసూచకంగా తల ఊపుతూ వుండేది. ఆమె ముఖం వెలవెలబారింది. హృదయంలోనుంచి వాక్ప్రవాహం బయలుదేరింది.

"ఒకప్పుడు నాది చాలా అసౌఖ్యకరమైన బ్రతుకనుకొనేదాన్ని. బ్రతుకొక జ్వరంలా వుండేది. అది నేను ప్రవాసంలో వుండే రోజుల్లో. నేను ప్రవాసంలో వున్న స్థలం ఆజిల్లాకు ముఖ్యపట్టణం. అక్కడున్నప్పుడు యెప్పుడూ నావిషయమై ఆలోచించుకోవడం తప్ప వేరే యేపనీ వుండేదికాదు. నా దురదృష్టాన్ని తలచుకుంటూ, యెప్పటికప్పుడు తూచుకుంటూ వుండేదాన్ని; నేనెంతో ప్రేమిస్తూ వుండిన నా తండ్రితో తగవు పెట్టుకున్నాను. నన్ను స్కూలులోనుంచి వెళ్ళగొట్టారు. ఖయిదులో పడ్డాను. నాకు స్నేహితుడయిన ఒక మిత్రుడు నన్ను ద్రోహంచేశాడు. నాభర్త అరెష్టయినాడు. మళ్ళీ నేను ఖైదులోకెళ్లాను. ఇంతలో నా భర్తచనిపోయినాడు. కాని నేనుపడ్డ ఈకష్టాలన్నీ కలిపినా, వీటికి పదిరెట్లయినా నువ్వు ఒక్కనెలలోపడ్డ కష్టాలపాటు చెయ్యావు. సంవత్సరాల తరబడి రోజుకి రోజూ చెప్పరాని హింసపడ్డావు. మనుష్యులకి ఇంతింత బాధలను ఓర్చుకునేశక్తి యెక్కడనుంచి వస్తుదోకదా?"

"అలవాటు పడిపోతారు" అని సందేహ నివృత్తిచేసింది తల్లి.

నికోలే మెల్లగా ఇల్లా అన్నాడు.

"ఇలాంటి జీవితంయొక్క కష్టం నేనెరుగుదు ననుకున్నాను. కాని నేను పుస్తకాల్లో చిదివినదానికంటేకూడా, ఇప్పుడు నువ్వే నీనోటితో చెపుతూవుంటే చాలా భయంకరంగాఉంది. క్షణక్షణం నువ్వుపడ్డ బాధలు పూర్ణంగా వింటుంటే గుండె చెరువైపోయింది."

ఈరీతిగా నెమ్మదిగా చాలాసేపుదాకా అనేకవిషయాల్ని గురించి ప్రజా సామాన్యంయొక్క జీవితాన్నిగురించి సంభాషణ సాగింది. తల్లికి తనపూర్వ జీవితం స్మరణకొచ్చి తన్మయురాలైపోయింది. ఆదురదృష్టపు రోజులలో తాను బడ్డ యమచర అంతా పూసగ్రుచ్చినట్లుచెప్పి చాలాసేపైనతర్వాత "అయ్యో. నేను వసపోసిన పిల్లలాగు ఇంతసేపటినుంచీ వాగుతున్నాను. మీకు పడుకునే వేళయిం దనుకుంటాను. నాశోకం ఎన్నాళ్ళుచెప్పినా తరిగేదికాదు" అని ముగించింది. అప్పాతమ్ముడూ తల్లితో మాట్లాడకుండా శలవుతీసుకున్నారు. నికోలే రోజూకన్న ఎక్కువ గౌరవంగా ఆమెకువంగి సలాంచేశాడు. సోఫ్యా ఆమెను గదిదాకా సాగ నంపింది. తల్లి వాళ్ళప్రేమకు ఆనందించి 'మీరు చాలామంచివాళ్ళు' అని కృత జ్ఞత తెలిపి విశ్రమించింది.

## 3

మూడురోజులపాటు తల్లికి నికోలే సోఫ్యాలతో మాట్లాడడం సరిపో యింది, తన పూర్వచరిత్ర తరిచి తరిచి కథలుగా చెప్పింది నికోలే సోఫ్యాలు అతి శ్రద్ధగా వినడంచేత ఆమెకు మరింత ప్రోత్సాహం కలిగి హృదయం కరిగి పోయేటట్టుగా ఏమీ దాపరికం లేకుండా చెప్పింది.

నాలుగోరోజు ప్రొద్దున్నే తల్లి, సోఫ్యా యిద్దరూ చినిగిపోయిన గౌనులు ధరించి సిద్ధమయ్యారు. బీద స్త్రీల మాదిరి వేషాలేసుకుని నికోలే దగ్గర నిల బడ్డారు. భుజాలకి మూటలు తగిలించుకొని చేత్తో బెత్తాలు పట్టుకుని ప్రయాణానికి సిద్ధమయ్యారు.

నికోలే సోఫియా చెయ్యిపట్టుకుని "సన్యాసి మఠాల్లో తిరిగే మనిషిలా గున్నావు సుమా; అచ్చంగా" అని వేళాకోళం చేస్తూ సాగనంపాడు. తల్లికి వాళ్ళ అమాయకత్వం బంధుత్వం చూస్తే ఆనందం కలిగింది. మామూలుగా తా నిదివరకు చూస్తూవచ్చిన జనం యిల్లాంటి సందర్భాల్లో యేక ముద్దులు పెట్టుకో వడం హడావిడి చెయ్యండ చివరకి గాట్లకుక్కల్లా దెబ్బలాడుకోవడం మామూలు. వీళ్ళు అల్లాంటి ఆవేశపు పనులేమీ చెయ్యనేలేదు. చాలా ముక్తసరిగా శలవు పుచ్చుకున్నారు.

నిలోనా సోఫియా లిద్దరూ జంటగా సంచులు భుజాన్నేసుకుని వీధిలో పడ్డారు. నడిచి నడిచి రోడ్డువదిలేసి పుంతదారి పట్టారు.

"నీకు ఆయాసం రాదూ ?" అని తల్లి సోఫియా నడిగింది.

"సరి సరి; నీ ఉద్దేశ్యమేమిటి ? నే నెప్పుడూ నడవలేదనా ? నడక నాకు కొట్టినపిండే. ఎంతదూరమైనా నడువగలను." అని జవాబు చెప్పింది సోఫియా.

సోఫియా చిరునవ్వు నవ్వుతూ చిన్నప్పటి నుంచీ విప్లవోద్యమంలో చేసిన పనంతా చెప్పడం మొదలుబెట్టింది. తాను అవసరంకొద్దీ మారుపేరుతో ఎట్లా వ్యవహరించినదీ, సమయానుకూలంగా ఎట్లా వేషాలు మార్చుకున్నదీ, దొంగ నాణేలు, దొంగఉత్తరాలు ఎల్లా మార్చినదీ అన్నీ వివరంగా కథల్లా చెప్పింది. వందలకొద్దీ రాజద్రోహ కరపత్రాలను పట్టణాల్లో తాను పంచిపెట్టిన సంగతీ, ప్రవాసంలో నుంచి సోదరులను ఎట్లా తప్పించిన సంగతులూ పూస గ్రుచ్చినట్లు చెప్పింది. ఒకసారి ఆమె కొన్ని రహస్యపు కరపత్రాలు అచ్చు వేయించడానికని ఒక ఇంట్లో కెళ్ళింది. అక్కడే అచ్చుకూటం ఉంది. పోలీసుల కీ సంగతి తెలిసి వాళ్ళు సోదాకొచ్చారు. ఈ సంగతెల్లాగో తెలిసి ఆమె ఒక్కక్షణంలో తన వేషం మార్చేసి దాసీవేషంవేసుకొని చేత్తో ఒక పాత కిరసనాయిలుడబ్బా పట్టుకుని బయటికి వచ్చింది. వస్తూవుంటే పోలీసులు ఎదురైనారు. కాని వాళ్ళు ఆమెను గుర్తే పట్టలేకపోయారు. ఆ దాసీ వేషంతోనే రాత్రంతా గడగడ వణికెత్తించే చలిలో వీధుల్లోనే తిరిగింది. ఇంకొకసారి ఒక పట్టణానికి తన స్నేహితులతో మాట్లాడడానికెళ్ళింది. సరిగా ఈమె వాళ్ళుండే మేడ మెట్లెక్కుతూ ఉండేసరికి వాళ్ళగదిలో పోలీసులు సోదా చేస్తున్నట్లు కనిపెట్టింది. ఆ స్థితిలో వెనక్కి వెళ్ళ డానికీ అవకాశంలేదు. వెంటనే ఒక్క క్షణమైనా తటపటాయించకుండా క్రింద అంతస్థులోని ఒక పరాయివాళ్ళయింటికెళ్ళి తలుపుతట్టింది. చేతిలో సంచి ఆడించు కుంటూ ఎంతోపరిచయమున్నట్లుగా లోపలికెళ్ళింది. లోపలివాళ్ళు తెల్లపోతూంటే అసలు సంగతంతా వాళ్ళకు చెప్పేసింది. అతిధీమాగా "మీకు మంచిదనితోస్తే నన్ను పోలీసుల కప్పచెప్పండి, అయినా మీరల్లాంటి పనిచేస్తారని నేననుకోను" అంది ఆ యింట్లో జనం చాలా భయపడి ఆ రాత్రి అంతా నిద్రపోలేదు. ఏ నిమి షానికానిమిషం పోలీసులొచ్చి తమ్ము పట్టుకుంటారేమోనని గడగడలాడేరు. కాని సోఫియాను పోలీసుల కప్పచెప్పడానికి మాత్రం వాళ్ళకి మనస్కరించలేదు. మరునాడు ప్రొద్దున్నే అంతాఅయిపోయిన తర్వాత పోలీసువాళ్ళ తెలివితక్కువను గురించి అంతాకలసి నవ్వుకున్నారు ఇంకొకసారి ఆమె సన్యాసిని వేషం వేసు కొని రైలుబండిలో మూడవ తరగతిలో ప్రయాణం చేస్తోంది. ఆమె ప్రక్కనే ఆమెకోసం వెదుకుతున్న గూఢచారి కూచున్నాడు. ఆ గూఢచారి ఆమెతో తన ప్రజ్ఞనుగురించి బడాయిగా చెప్పడం మొదలెట్టాడు ఆమెను పట్టుకునేందుకు తాను చూస్తూవుండే ప్రయత్నాలన్నీ యేకరువుపెట్టాడు. ఆమె తప్పకుండా ఈ బండి

లోనే రెండవతరగతిలో ఉండితీరుతుందన్నాడు రైలు ఆగినచోటల్లా దిగి చూచి వచ్చి సోఫియాతో "అవ్వే కనుపించలేదు. బహుశా నిద్రపోయివుండాలి. వాళ్ళకి కూడా పాపం ఆయాసం వస్తుంది. వాళ్ళదికూడా మామాదిరిగానే మహాకష్టమైన బ్రతుకు" అని పెదవి చప్పరించాడు.

సోఫియా చెప్పిన ఈ కథలన్నీవింటే తల్లికి కడుపుబ్బేటట్లు నవ్వువచ్చింది. ఆమెయెడల అనురాగంకూడా ఎక్కువైంది. ఇలా కబుర్లు చెప్పుకుంటూ సోఫియా నిలోవా లిద్దరూ పుంతలుపట్టి నడచిపోయారు. సోఫియా సుళువుగా నడిచింది. ఆమె నడకలోనూ, మాటలోనూ, కంఠధ్వనిలోనూ ఒకవిధమైన ధైర్యం ప్రస్ఫుట మయ్యేది. ఆమెలో మంచి సాహసం, స్వేచ్ఛాపిపాస, సూక్ష్మదృష్టి అన్నీ ప్రత్య క్షంగా కనుపించేవి ఒక్కొక్కప్పుడు నడుస్తూనడుస్తూ ఆమె ఏ చెట్టునో చేమనో చూచి పుప్పొంగిపోతూ వుండేది. ప్రకృతి సౌందర్యంచూచి పరమానందం పొందేది. కోకిల గానాలకి పరవశమైపోయేది. అడవి పువ్వులను త్రుంపి వాటి రేఖలను తమాషాగా వ్రేళ్ళతో వత్తి తుమ్మెద ఝీంకారంలాగ చక్కగా కూసేది. సోఫియా చేష్టల కానందిస్తూ తల్లి ఆమెతో అడుగు కలిపి గబగబా నడక సాగిం చింది. దారిలో వాళ్ళిల్లా మాట్లాడుకున్నారు.

తల్లి :— నీకాట్టే వయస్సున్నట్లులేదే ?

సోఫియా :— లేకేమిటి ? అప్పుడే 32 ఏళ్ళు నెత్తిమీద కొచ్చాయి.

త :— ఏళ్ళమాటకాదు నేచెప్పేది. నీముఖంచూస్తే వయస్సున్నట్లుగానే కని పిస్తుంది. కాని నీకళ్ళు, కంఠధ్వని చూస్తే నిజంగా ఆశ్చర్యమవుతూంది. పడుచుతనం వుట్టిపడుతూ వుంటాయి. నీబ్రతుకు కష్టాలమయమై నప్ప టికీ నీ హృదయం మాత్రం యెప్పుడూ చిరునవ్వు నవ్వుతూనే వుంటుంది.

సో :— ఏమిటీ ? హృదయం చిరునవ్వు నవ్వుతుందీ ? అబ్బ ! ఏమి బాగా మాట్లాడుతావమ్మా నువ్వు ! అతి సూక్ష్మంగానూ మంచిగానూ మాట్లాడు తావే. నా బ్రతుకు కష్టమంటావా ? కాని నాకేమీ కష్టంగాతోచడంలేదు. ఇంతకన్న సరదాగావుండే జీవితం నాకు తోచడమేలేదు.

త .— మిమ్మల్నందరినీచూస్తే ఒక్కందుకు నాకు పరమ సంతోషం. మను ష్యుల హృదయాలను ఆకర్షించే మార్గాలు మీకు చక్కగా తెలుసును. ఎవరైనా సరే మీతో మనసిచ్చి మాట్లాడుతారు. మిమ్మల్ని గురించే నేనెప్పుడూ ఆలోచించుకుంటూ వుంటాను. మీరు ప్రపంచంలో వుండే చెడుగును జయించేస్తున్నారు. పూర్తిగా చెడుగును నిర్మూలనం చేసేస్తారు.

సో :— ఆహా ! సందేహమేమిటి ? మేము గెలిచిలీరుతాం. కాయకష్టం చేసే వాళ్ళ తరపున వుండడంచేత మాకు జయం నిశ్చయం. మాకు శక్తి, సత్యమందు విశ్వాసం ప్రజలమూలంగానే కలుగుతున్నవి. అవి భౌతికం గానూ ఆధ్యాత్మికంగానూ కూడా. ప్రజలే మాబలం. ప్రజలలోనే సర్వ

శక్తులూ నిబిడీకృతమై యున్నాయి. వాళ్ళు తలుచుకుంటే సాధించలేనిపని లేదు. ఇంతకీ వాళ్ళని మేల్కొల్పాలి. జ్ఞానం కలుగచెయ్యాలి. ఏవిధమైన వికాసం, వృద్ధీ లేకుండా అంధకారంలో బంధింపబడిన ప్రజలఆత్మను మేలుకొలుపాలి.

(సోఫియా మాటలు తల్లికి ఒకవిధమైన జాలి కలిగించాయి. పెద్ద కుటుంబములోని స్త్రీ ఇల్లా భుజంమీద సంచివేసుకొని ఈ కరపత్రాల మూటలనెట్లా మోస్తుందాయని ఆశ్చర్యపడింది.)

త ;— సోఫియా ! మీరుపడే కష్టానికంతకీ ప్రతిఫలమెవరిస్తారు ?

సో :— (సగర్వంగా) మాకెప్పటికప్పుడే బహుమానాలు ముడుతున్నాయి. మాకు తృప్తికరమైన జీవితం దొరికింది. అంతేచాలు. మేము హాయిగా, స్వేచ్ఛగా మాఆత్మశక్తితో జీవిస్తున్నాం. ఇంకేమి కావాలి ?

ఇల్లా మాట్లాడుకుంటూ తాపీగా ప్రయాణం సాగిస్తుంటే తల్లికి తీర్థయాత్ర జ్ఞాపకానికొచ్చింది. తన చిన్నతనంలో ఆమె ఇల్లాగే యెక్కడో దూరంగావుండే క్రైస్తవ దేవాలయానికి నడచివెళ్ళడం ఆమెకు జ్ఞాపకం వచ్చింది. మధ్యమధ్య సోఫియా చక్కని పాటలూ పద్యాలూ రంయ్యిమని పాడేది. ఆసంగీతం వింటూ తల్లి పరవశురాలైపోయేది.

ఇల్లానడిచి నడిచి చివరకి మూడవరోజుకి గమ్యస్థానమైన గ్రామంచేరేరు. ఊరుమొగమెరుగని ఎవరో ఒకరైతు కనిపించేసరికి తల్లి అతడిని తారు కంపెనీలో పనిచేసే ఒకరైతునుగురించి అడిగి అతని మకాముకుదారి తెలుసుకుంది. కొంచెంసేపట్లో తారుపని చేసేచోటికి చేరుకున్నారు. అక్కడ చెట్లకొమ్మలతోటి ఆకులతోటి వేసిన పందిరి కనుపించింది. ఆపందిరిక్రింద రైబిన్, ఏఫీమ్, ఇంకా ఇద్దరు యువకులు బల్లచుట్టు కూచుని భోజనంచెయ్యడానికి సిద్ధంగాఉన్నారు. ఆ బల్ల నాల్గుకొయ్యలమీద రెండు పొరాటుముక్కలతో అమర్చబడింది. వాళ్ళగుడ్డలన్నీ నల్లగాతారుతో మసిపట్టిపోయివున్నాయి. రైబిన్ఎవరో ఆడవాళ్ళు వస్తున్నారని ముందుగాగ్రహించి, నొసటిమీద అరచెయ్యి పెట్టిచూశేడు. ఇంతలోతల్లి.

"ఏంతమ్ముడూ ! రైబిన్ ! క్షేమమా ?" అని దూరాన్నుంచే పలుకరించింది. రైబిన్ నెమ్మదిగాలేచి దగ్గరకెళ్ళేడు. తల్లిని గుర్తుపట్టడం తోనే గడ్డం దువ్వుకుంటూ ముసిముసినవ్వులు నవ్వాడు. తల్లి అతనిదగ్గరకెళ్ళి "ఇదిగో, మేము ఇప్పుడు తీర్థయాత్ర కెడుతున్నాం. దారిలో ఉన్నావుగదా తమ్ముడివి; పోనీ చూచిపోదామని వచ్చాను. ఈమె నాస్నేహితురాలు. పేరు 'అన్నా' అంటారు" అనిచెప్పి సోఫియాకేసి సగర్వంగా చూసింది. 'నాసమయస్ఫూర్తి చూచావా' అని ఆచూపుకర్థం.

రైబిన్ నవ్వుతూ సోఫియాను క్షేమసమాచారాలడుగుతూ పలుకరించాడు.

తర్వాత "నిలోనా! ఇదిగోచూడు! అబద్ధమాడకు. ఇదిపట్నవాసంకాదు. ఇక్కడ దాఁలాడవలసిన అవసరంలేదు, వీళ్ళంతా మనవాళ్ళే. మంచివాళ్ళు" అన్నాడు.

ఏఫిమ్ తనమిత్రుల చెవుల్లో ఏమిటో చెప్పాడు. స్త్రీ లిద్దరు బల్లదగ్గర కొచ్చేసరికి అతడులేచి నమస్కారంచేశాడు.

మిగతావాళ్ళేమీ కదలలేదు. రైబిన్ తల్లిభుజంమీద మెల్లమెల్లగా తట్టుతూ ఇల్లాచెప్పాడు.

"మేమిక్కడ ఒకమాదిరి సన్యాసులులాగ బ్రతుకుతున్నాం. మాదగ్గర కెవ్వరూరారు. మాయజమాని గ్రామంలోలేడు. ఆతని భార్యని ఆసుపత్రికి తీసు కెళ్ళాడు. ఇప్పుడు నేనే దీని కంతకూ ఒకవిధమైన మేనేజరును అదిగో ఆ బల్లమీద కూచోండి. బహుశామీకు ఆకలివేస్తోందేమో! ఏఫీమ్! కొంచెం పాలుపట్టుకురా." ఏఫీమ్ లేచి ప్రక్కనేఉన్న ఇంకొక గుడిసెలో కెళ్ళాడు. ఆ యాత్రికు లిద్దరూ భుజాలమీది బరువును దింపురున్నారు. ఒక పొడుగాటి యువకుడు లేచి వాళ్ళకు సాయంచేశాడు. ఇంకొకడు బల్లమీద మోచేతులు ఆన్చి తల గోక్కుంటూ ఏదోపాట గొణుగుతూ కూర్చున్నాడు.

అప్పుడే తయారైన తారుఘాటు కుళ్ళిపోతున్న ఆకులకంపు రెండూకలిసి అతిధుల తలలు దిమ్మెత్తించాయి. రైబిన్ వాళ్ళకి ఆయువకులనుచూపి "ఇతడు యాకూబ్, అదిగో ఆ కూర్చున్నతడు ఇగ్నాటా." అని పరిచయంచేశాడు. తర్వాత "పావెల్ ఎల్లాఉన్నాడు?" అని అడిగేడు "జైల్లోఉన్నాడు."

"మళ్ళీ జైలా? అతనికి జైలంటే అంత ఇష్టంకాబోలు."

ఇగ్నాటా కూనిరాగం చాలించాడు. యువకులు తల్లిని కూర్చోమన్నారు. రైబిన్ సోఫియాను మర్యాదగా కూర్చోమన్నాడు. సోఫియా ఒకదుంగముక్క మీద కూర్చుని రైబిన్‌ను విమర్శకదృష్టితో రెప్పవాల్చకుండా చూసింది. రైబిన్ తల్లికెదురుగా కూర్చుని "అతడి నెప్పుడుపట్టుకున్నారు మళ్ళీని? నీ దురదృష్టం!" అన్నాడు.

"దురదృష్టమేమిటి? బాగానే ఉంది."

"అవును. నీకలవాటయిపోయింది."

"నాకలవాటు కాలేదు. కాని మనం చేసేదేముంది. తప్పనిసరి."

"అవునవును. నీకధంతా చెప్పుమాకు," ఏఫీమ్ ఒక జాడీతో పాలుతీసు కొచ్చేడు. బల్లమీదనుంచి ఒకగిన్నెతీసి కొంచెం నీళ్ళతో దానిని తొలిచి నిండా పాలుపోసి సోఫియా కందిచ్చాడు. చప్పుడు చేయకుండా పచారుచేస్తూ తల్లికధ విన్నాడు. తల్లి క్లుప్తంగా తన గాధంతా చెప్పేసరికి వాళ్ళు ఒకళ్ళమొగాలు ఒకళ్ళు చూచుకున్నారు. ఇగ్నాటా మెల్లగా గోటితో బల్లమీద ఏదో పిచ్చిబొమ్మగీశాడు. ఏఫిమ్, రైబిన్ వెనకాల నిలబడ్డాడు. యాకూబ్ ఒక చెట్టుమొదలు కానుకుని

చేతులు కట్టుకు నిలబడ్డాడు. సోఫియా ఈ రైతులసంగతంతా గ్రహిస్తూ ఓర చూపులు చూస్తూకూచుంది. వారిలో వారిల్లా సంభాషించుకున్నారు.

రైబిన్ :—(హఠాత్తుగా) సరే. ఇప్పుడు బహిరంగంగా సాగించడానికి నిశ్చయించారన్నమాట.

ఏఫిమ్ :—(నవ్వుతూ) మనం ఇక్కడ అలాంటి ఊరేగింపు జరిపితే రైతుల నందరిని చచ్చేటట్లు కొడతారు.

ఇగ్నాటా :— సందేహమేమిటి ? నేను ఫాక్టరీ కెడతాను. అక్కడ కాస్తనయం.

రై :— నిలోనా ! పావెల్ కేసు విచారణ చేస్తారంటావూ ?

త :— ఆ; నిశ్చయమైంది.

రై :— ఓహో ! శిక్ష ఏమాత్రం పడుతుందనుకుంటున్నారు? నువ్వేమీ వినలేదూ?

త :— జన్మం కఠినశిక్ష; తప్పితే యావజ్జీవం సైబీరియా ప్రవాసం.

(ఈమాట చెప్పేసరికి ఆ యువకులు ముగ్గురూ తల్లి కేసి నిర్ఘాంతపోయి చూశారు)

రై :— ఈ ఊరేగింపు గీరేగింపు చేసేటప్పు డీసంగతి తెలుసునా అతనికి ?

త .— నాకు తెలియదు కాని బహుశా తెలుసనే అనుకుంటాను.

సోఫి :— (గట్టిగా) ఆ. తెలుసును.

(అంతా నిశ్శబ్దంగా కొంచెంసేపూరుకున్నారు.)

రై :— అవును. నేనుకూడా అతనికి తెలుసుననే అనుకుంటాను. పట్టుదలతో పనిచేసే మనిషి ముందు చూచుకునే దూకుతాడు - (యువకులకేసి తిరిగి)

ఒరే అబ్బాయిలూ ! చూశారామరి ? సన్నీలతో పొడుస్తారనీ, యావజ్జీవం ద్వీపాంతరశిక్ష వేస్తారనీకూడా తెలిసి అతడు ముందుకెళ్ళాడు. అతని కల్లావెళ్ళడం మంచిదనితోచింది. వెళ్ళాడు అతను ముందు కడుగేస్తుంటే తనతల్లి దారికడ్డంగా పడుకున్నా ఆమెను దాటిపొయ్యేవాడే.(తల్లితో)నిలోనా ! ఏమంటావు ? అంతేనా?

తల్లి :—ఆహా ! (అని పెద్దనిట్టూర్పు విడిచింది. దేహం కంపించింది. సోఫియా ఆమెచెయ్యి తట్టింది)

రైబిన్ :— నాయనలారా ! చూశారా! చూశారా! అదిగో అతడే మీకు ఆదర్శంగా ఉండవలసిన మనిషి.

ఈమాట అంటూ రైబిన్ ఆ యువకుల ముఖాలకేసి చూచాడు. అంతా నిశ్శబ్దంగా వున్నారు. సూర్యకిరణాలు కలకలా నృత్యం తేస్తున్నాయి. ఇంతలో ఒక కాకి అరచింది. తల్లికి మే 1 వ తేదీ, ఆంద్రీ. పాషా వగైరాలు జ్ఞాపకాని కొచ్చి గ్రుడల్లోనీరు తిరిగింది. తారుపీపాలు, కర్రముక్కలు, చెట్టుమొదళ్లు-అన్నీ చిందరవందరగా పడున్నవి. ఇంతలో యాకుబ్ హఠాత్తుగా చెట్టుదగ్గరనుంచి ముందుకొచ్చి

"అయితే ఏఫిమ్‌తోపాటు మేముకూడా సైన్యంలోచేరితే మమ్మల్ని పావెల్ లాంటి వాళ్ళమీదికే నన్నమాట ఉసికొలుపడం" అన్నాడు,

రైబిన్ :— ఆహా! మరేమనుకున్నావు? ఇంకెవరి మీదికి పంపుతా రనుకున్నారు? వాళ్ళు మన చేతుల్తోటే మన గొంతుక పిసుకుతారు. అదే రహస్యం. దాన్నే మాయ మంత్రం అనేది.

ఏఫిమ్ :— (గట్టిగా) అయినా సరే. నేను సేనలోనే చేర్తాను.

ఇగ్నాటా :— (ఏఫిమ్‌కేసి చూచి నవ్వుతూ) ఎవ రొద్దన్నారు నిన్ను? వెళ్ళు. తక్షణం వెళ్ళు. ఇదిగో నువ్వు నన్ను ఎప్పుడయినా కాల్చవలసొస్తే తలకు బారుపెట్టు సుమా. అంతేకాని ఊరికే గాయ పరచకు. ఒక్కసారే చంపెయ్యి.

ఏఫిమ్ :— మీరు చెప్పే మాటలన్నీ వింటున్నా. నా కర్థమవుతోంది.

ఇంతలో రైబిన్ "నాయనలారా. ఇదిగో ఈమె కొడుకును గోల్పోయిన తల్లి. చూడండి" అన్నాడు — తల్లి విచారగ్రస్తమైన కంఠంతో "ఎందు కిలా చెబుతున్నావు" అని అడిగింది. రైబిన్ తీవ్రంగా "దాని అవసరంఉంది; నీవిచారం అంతా వృధా పోగూడదు. నీ హృదయానికి కలిగిన నొప్పి నిరుపయోగం కా కూడదు. ఓ నాయనలారా! చూడండి. ఈమె తన పుత్రుని పోగొట్టుకొనినది. కాని అంతమాత్రమున ఆమె మరణించిందా? లేదు. నిలోనా! పుస్తుకాలేమైనా తెచ్చావా?" అన్నాడు. తల్లి తెల్లబోయి ఒక్కక్షణం ఆలోచించి "ఆ తెచ్చాను" అంది.

"అదిగో అదీ. నేను నిన్ను చూడడంతోటే అనుకున్నాను. అందుకు కాకపోతే నువ్విక్కడికి రావలసిన పనేముంది?" అని బల్లగుద్ది రైబిన్ ఆ యువకులతో ఇల్లా అన్నాడు.

"చూసేరా? వాళ్ళ కొడుకును ఉద్యమంలో పనిచేయకుండా తప్పించాలని జైల్లో పెట్టారు. కాని తల్లి ఆ స్థానం ఆక్రమించింది. (పళ్ళు పట పట కొరుకుతూ కసిగా) వాళ్ళు......... వాళ్ళు........ (కసితీరక బూతుప్రయోగాలు చేశాడు) వాళ్ళకి గ్రుడ్డితనంవల్ల తమ చేతులేమి చేస్తున్నాయో తమకే తెలియడంలేదు. మన శక్తి బాగా వృద్ధిపొందిన తర్వాత వాళ్ళు పెంచి పెద్దది చేసిన ఈ విషపు గడ్డిని మనం నరికేసే టప్పుడు — అప్పుడు తెలుస్తుంది. అప్పుడే బాగా తెలియడం."

రైబిన్ యిల్లా హుంకరించేసరికి తల్లికి భయం వేసింది. ఆమె రైబిన్ ముఖంకేసి చూసేసరికి ఆ ముఖం అంతా కమిలిపోయినట్లయింది. చొక్కాకు బొత్తాములు యేమీలేవు. కళ్ళు జ్యోతుల్లావున్నాయి. ముక్కుబాగా కందిపోయింది. గ్రుడ్లు నిప్పులు కక్కుతున్నాయి. మొత్తంమీద అతనిరూపంలో గొప్ప తీవ్రత కన బడుతోంది. సోఫియా ఈ విగ్రహాన్నిచూస్తూ తెల్లబోయికూర్చుంది. ఇగ్నటా తల ఊపుతూ ఏమిటో ఆలోచిస్తున్నాడు. యాకూబ్ గోడదగ్గిర నిలబడి కోపంగా యేమిటో చూస్తున్నాడు. ఏఫిమ్ ఇటూ అటూ పచారుచేస్తున్నాడు. రైబిన్ మళ్ళీ అందుకున్నాడు.

"ఈమధ్య ఒకనాడు ఒక గవర్నమెంటు వుద్యోగి నన్ను పిలిచి, ఏయ్! దొంగ వెధవ! నువ్వు మతగురువుదగ్గర యేదోపేలేవట యేమిటి? అని నన్నడిగేడు. వెంటనే దొంగవెధవను నేను కాను. ఏదో చెమటోడ్చి నాతిండినేను తింటున్నాను. నేనెవ్వరికీ అపకారం చెయ్యడంలేదే! అన్నాను. అతడు అంతటితో వూరుకోక యేమిటో అరచి ఒక్క చెంపకాయకొట్టేడు. మూడు రాత్రులు, మూడు పగళ్ళు పోలీసు స్టేషనులో పడేసేడు."

ఈ సంగతిచెప్తూ రైబిన్ అగ్గయిపోయాడు. ఆవేశం హెచ్చిపోయింది. "ఓహో పిశాచపు పీనుగుల్లారా! మిమ్మల్ని దయ తలుస్తారని అనుకోకండి. నాకు జరిగిన అపరాధానికి నేను కాకపోతే యింకొకళ్ళైనా మీకు ప్రతిఫలం ముట్ట చెబుతారు. ఆకసి మీమీద కాకపోతే మీపిల్లలమీదైనా తీర్చుకోక మానరు. మీరు తప్పుకున్నా మీపిల్లలకైనా తగినశాస్తి జరుగకమానదు. మీరు ద్వేషం విత్తేరు. దానికి ఫలం ద్వేషమే. దయపండుతుందనుకోకండి" అని గర్జించాడు. ఆగర్జనకి తల్లి మరింత గజగజలాడింది. రైబిన్ కాస్త శాంతించేడు.

"ఇంతాచేస్తే నేను మతగురువుతో యేమిచెప్పేనో తెలుసునా? అతడు గ్రామ సమావేశం అయినతరువాత నలుగురితోనూ యేదో పిచ్చపాడీ మాట్లాడుతూ వుంటాడు. ఒకరోజున అతను యేదో మాట్లాడుతూ జనంఅంతా వట్టి గొర్రెల మందలాంటివాళ్ళు. కనుక వాళ్ళని కాచేటందులకు ఒక గట్టి గొల్లవాడుండితీరాలి" అన్నాడు. అంటే నేను అవునవును, నక్కకి అడవిమీద రాజరికంయిస్తే బొమికలేగాని జంతువులు కనుపించవు. అని హాస్యంగా అన్నాను, అతడు నాకేసి ఓర చూపులుచూసి ప్రజలు ఇంకా శాంతంగా వుండాలనీ, దేవుడిని ప్రార్థన చెయ్యాలనీ, చెప్పాడు. ప్రజలు ప్రార్థన చేస్తూనే యున్నారు కాని వాటిని వినడానికి దేవుడికి తీరికలేకుండా వుందని నేనన్నాను. నువ్వేమని ప్రార్థనచేస్తున్నావని అతడు నన్నడిగేడు. ఓదేవుడా! అధికారులకు యిటికలు మొయ్యడం, మన్నుతినడం, కట్టెలు కొట్టడం నేర్పవోయి నాయనా! అని ప్రార్థనచేస్తూ..........ఈ ముక్క యింకా పూర్తిగా నానోటివెంబడి రాకపూర్వమే దవడమెద కొట్టేడు."

రైబిన్ ఈసంగతి చెపుతూ చెపుతూ ఛటుక్కున సోఫియాకేసి తిరిగి "నువ్వు ధనికురాలు లావున్నావే?" అన్నాడు.

"ఏం? నేనల్లా కనుపిస్తున్నానా?" అని ఆశ్చర్యంగా అడిగింది.

"చినిగిపోయిన బట్టలు వేసుకున్నంత మాత్రాన్ని నీ పూర్వపు తీవిని కనుక్కోలేమనుకున్నావా ఏమిటి? నీ జన్మనక్షత్రం అల్లా కనుపిస్తోంది; గోనెపట్టాలు కట్టుకున్నా మతగురువును మూడు నిమిషాల్లో గుర్తుపట్టవచ్చు. ఇందాక నువ్వు ఆతడి బల్లమీద మోచెయ్యిపెట్టి చిరాకుపడ్డావు అదీకాకుండా మంచి తీరుగావున్న నీ వెన్నుచూస్తే ఎవరూ నిన్ను కూలిపనివిల్ల జీవించేవానివనుకోరు. కష్టపడేవాళ్ళ వీపు అల్లా ఉండనేవుండదు అన్నాడు రైబిన్

రైబిన్ సోఫియాను అమర్యాద చేస్తాడేమోనని తల్లి భయపడి "రైబిన్! ఆమె నా స్నేహితురాలు; చాలామంచిది. ఈ ఉద్యమంలో చాలా కష్టపడి పని చేస్తోంది. నువ్వు అట్టే............" అంటూ ఏదో చెప్పబోయింది రైబిన్ "నేనే మైనా ఇప్పుడమర్యాదగా మాట్లాడేనా?" అని మాటకడ్డొచ్చాడు.

"నువ్వేమిటో నన్నుగురించి చెప్పదలచుకున్నావు. అదేమిటో పూర్తి చెయ్యి" అంది సోఫియా.

"నేనా? మరేంలేదు. ఇక్కడికీమధ్య ఒక కొత్తమనిషొచ్చాడు. మన యాకూబ్ పినతండ్రి కొడుకు. అతడికి క్షయరోగం. చాలా బాధపడుతున్నాడు. కొంచెం చదువుకున్నవాడు అతన్ని పిలుద్దామా?"

"అభ్యంతరమేమిటి? పిలవండి" అంది సోఫియా రైబిన్ ఏఫిమ్‌తో అతడ్ని పిలుచుకురమ్మనమని చెప్పాడు. ఏఫిమ్ టోపీ నెత్తినెట్టుకుని ప్రయాణ మైనాడు. అతను కనుచూపుదూరం వెళ్ళాక, రైబిన్ అతనికేసి చూపిస్తూ యిల్లా అన్నాడు,

"చూశారా? అతను లోపల్లోపల చాలా బాధపడుతున్నాడు. కాని చాలా పట్టుదలగా ఉన్నాడు. ఇక్కడనుంచి అతనూ, యాకూబ్ సైన్యంలో చేరాలి. వాళ్ళవంతు వచ్చింది. యాకూబ్ అసలు వెళ్ళనంటాడు. ఏఫిమ్‌కూడ వాస్తవానికి వెళ్ళలేడుకాని అతనికి ఒకందుకు వెళ్ళాలనేవుంది. సైన్యంలోచేరి సిపాయిలకంద రికి ప్రబోధంచేసి వాళ్ళని లేవదీయవచ్చని అతని నమ్మకం. కాని నా అభిప్రాయం అదేమీ లాభంలేదని. పెద్ద రాతిగోడని తలకాయతో బ్రద్దలకొట్టగలమా? చేతు ల్లోకి సన్నీలు, తుపాకులు వచ్చేసరికి వాళ్ళకు కళ్ళు కనబడవు. ఎక్కడికెడు తున్నారో, ఎవరిమీదకెడుతున్నారో, ఎందుకెడుతున్నారో వాళ్ళకి తెలియదు. తమ రిని తామే పొడుచుకుంటున్నామనే జ్ఞానం వాళ్ళకుండదు. ఆ కారణంచేత ఏఫిమ్ నిజంగా చాలా బాధపడుతున్నాడు, దానికితోడు పుండును పుల్లతో కెలికినట్లు యీ ఇగ్నాటా అతడిని ఊరికే రేపుతూ ఉంటాడు."

ఇగ్నాటా "సరిసరి. నేనేమన్నాను? నాభయం ఏమిటంటే సోల్జర్లను ఇతను మార్చడంమాట ఎల్లావున్నా, అతన్ని సోల్జర్లు మార్చేస్తారు. ఇతనుకూడా వాళ్ళందరిలాగే తయారవుతాడు" అన్నాడు.

రైబిన్ :— కాదు కాదు. కష్టం. కాని మొత్తంమీద సైన్యంలో చేరకుండా పారి పోవడమే ఉత్తమం. ఇంత విస్తీర్ణంగల రష్యాదేశంలో ఎవడు పట్టుకో గలడు? •ప్యాసుపోర్టు సంపాదిస్తే ఊరూర తిరగొచ్చు.

యాకూబ్ :— సరిగ్గా నేనదే చేయదలచుకున్నాను. ఒక్కసారి ప్రభుత్వంమీద

---

• ప్యాసుపోర్టు రష్యాలో ఒక ఊరునుంచి ఇంకోఊరి కెళ్ళేటప్పుడు చీటీ పుచ్చుకొని వెళ్ళాలి.

ఎదురుతిరగ తలుచుకుంటే సూటిగా పోవలసిందేకాని వక్రమార్గాలు పట్ట కూడదు.

ఇంతలో సంభాషణ ముగిసింది. ఈగలు బుయ్యిమని ముసరడం ఆరంభించాయి పొలాల్లోంచి పాటలు వినబడ్డాయి. ఒక్కక్షణం ఆగి రైబిన్ "సరి. ఇకమేము పనిలో కెళ్ళాలి. మీరు కాస్సేపు పడుకుంటారా ? లోపల గుడిసెలో బల్లచెక్కలున్నాయి. యాకోబ్ ఎండిపోయిన ఆకులుతెచ్చి పక్కవేస్తాడు. అయితే నిలోనా ! నువ్వుతెచ్చిన పుస్తకా లిల్లాతే అమ్మా. ఎక్కడున్నాయీ ?"అన్నాడు.

తల్లి, సోఫియా సంచులు విప్పారు; రైబిన్ సంచులలోకి తొంగిచూచి "ఓహో ! చాలానే ఉన్నాయి. ఎంతకాలంనుంచి ఈవ్యవహారం చేస్తున్నావేమిటి? నీపేరు ?" అని సోఫియా నడిగాడు.

సోఫియా :— నాపేరు అన్నా ఇవానోనా అంటారు. పన్నెండేళ్ళనుంచి ఇదేపని ? ఎందుకిల్లా అడుగుతున్నావు ?

రై :— అబ్బే; ఊరికేనే. ఏమీలేదు - జైల్లోకెళ్ళావా ?

సో :— ఆ - వెళ్ళేను.

రైబిన్ ఒక కట్టపుస్తకాలు చేత్తోపుచ్చుకుని నవ్వుకుంటూ నేను యిల్లా మోటుగా మాట్లాడుతున్నానని మరోలా అనుకోవద్దు. రైతుకీ భూఖామందుకీ తారుకీ నీళ్ళకీ ఉన్నంతతేడా ఉంది. ఈరెండూ కలవడం అసంభవం. ఒకరి కొకరు చుక్కెదురు అన్నాడు.

సోఫియా "నేను శ్రీమంతురాలినికాను. నేనూ మామూలు మనిషినే"అంది.

"అయితే అవవచ్చును. కాని నేను సుళువుగా నమ్మను. ఒకప్పుడు అలాంటిది సాధ్యమేనంటారు. ముందు నేనీ పుస్తకాలెక్కడైనా దాచాలి."

దాచేప్రయత్నంలో ఇగ్నాటా, యాకూబులుకూడా రైబిన్ దగ్గరకొచ్చారు. అవన్నీ ఒక్కరకమేనాయని రైబిన్ సోఫ్యా నడిగాడు. అన్నీ ఒక్కరకంకావనీ అందులో వార్తాపత్రికలుకూడా ఉన్నాయని సోఫ్యా చూపింది. చంకలు గ్రుద్దుకుంటూ వాళ్ళుముగ్గురూ లోపలికెళ్ళారు. తల్లి సోఫ్యాతో "చూడు ఈరైతుబిడ్డ మహా అగ్గయిపోతున్నాడు" అంది.

"అవును. నేను నిజంగా ఇల్లాంటి వీరత్వంగల మొగం చూడలేదు. మనంకూడా లోపలికెడదాం. నాకుయింకా వాళ్ళసంగతి చూడాలని వుంది."

సోఫ్యా. తల్లీకూడా లోపలికెళ్ళారు. అప్పుడే ఆముగ్గురుకూడా వార్తాపత్రికను చదువుచున్నారు. ఇగ్నాటా నెత్తిమీద చేతులుపెట్టి చదువుకుంటున్నాడు. ఈస్త్రీలిద్దరు లోపలికెళ్ళేసరికి తలయెత్తిచూచి మళ్ళీ పేపరుమీదే దృష్టినిలిపాడు. రైబిన్ నుంచునే పెదిమెలు కదుపుతూ చదువుకుంటున్నాడు. సరియైన సంగతులు తెలుసుకోడానికి వాళ్ళుపడే ఆదుర్దా ఆమె గ్రహించింది. సోఫియా, తల్లి ఒకమూల

కూర్చుని వాళ్ళసంభాషణ వింటున్నారు. యాకూబ్ (గొణుగుతూ) బాబాయీ, రైబిన్ ! ఈపత్రికలో మనరైతులమీద మహామోటుగా వ్రాశారయ్యా ?

రై :— అవును; కాని మనమీద ప్రేమచేతనే. ప్రేమతో ఏమన్నా అది అగౌరవంకాదు. ఇ—(వెకిలినవ్వుతో) చూడు! ఇక్కడెల్లా వ్రాశాడో: "రైతు మానవత్వమును పూర్తిగా మరచిపోయినాడు"........అవును. ఆమాట నిజమే కాని........ఈవ్రాశేవాళ్ళంతా మన స్థితిగతులుచూస్తే తెలుస్తుంది. ఇల్లాంటిచోట ఉండే వాళ్ళూ అంతే అవుతారు."

ఇంతలో తల్లి 'నాకు అలసటగావుంది. పడుకుంటాను' అంది. సోఫియానుకూడా పడుకోమందికాని ఆమె పడుకోనంది. తల్లి ఒకబల్లమీద సర్దుకొని పడుకొంది. ఒక్కనిమిషంలో గుర్రుపట్టింది, గాఢమైన నిద్రపట్టింది. సోఫియా దగ్గరకూచుని ఈగలను తోలుతూ చదువుకునే పురుషులను పరిశీలిస్తూంది.

రైబిన్ నిద్రపోతున్న తల్లిదగ్గరకొచ్చి ఆమె ముఖాన్ని తదేకదృష్టితో చూచి "బహుశా కొడుకును సరిగా అనుసరించిన తల్లులలో ఈమె మొదటిదనుకుంటాను. సందేహమేమిటి? మొట్టమొదటి తల్లి" అన్నాడు. "మనం ఆమె నిద్రకి భంగం కలుగచెయ్యకూడదు. అవతలికెడదాం" అంది సోఫియా. "మేమిప్పుడు పనిలోకిపోతాం. నీతో తీరికగా మాట్లాడాలనివుంది. కాని ఇప్పుడుకాదు. సాయంత్రం విశ్రాంతిగా మాట్లాడుకుందాం. అనిచెప్పి రైబిన్ ఆయువకులను వెంటబెట్టుకొని పనిలోకి పోయాడు.



సోఫ్యాను ఆగుడిసెలో వదలిపెట్టి రైబిన్ వగయిరాలు వెళ్ళిపోయారు. దూరాన్ని గొడ్డళ్ళ చప్పుడు వినిపిస్తోంది. సోఫ్యాగుమ్మంలో కూర్చుని చల్లగాలి పీలుస్తూ, సూర్యాస్తమయాన్ని చూచి ఆనందిస్తూ. మెల్లగా యేదో పాటపాడుకుంటూ కాలక్షేపంచేసింది. కనుచీకటిపడడం, ఆవులతోపాటు మనుష్యులుకూడా ఇంటికొచ్చేరు.

వాళ్ళువచ్చిన అలజడిచేత తల్లికి మెళకువవచ్చింది. ఆవలిస్తూలేచింది. రైబిన్‌కూడా చాలా సంతోషంగా వున్నాడు.

"ఇగ్నాటా! మనం కొంచెం టీ పుచ్చుకుందాం. (సోఫ్యాతో) ఇక్కడ మావంట మేమే చేసుకుంటాము. వంతులేసుకుని సంసారం చక్కబెట్టుకుంటాము. ఇవ్వేళ ఇగ్నాటావంతు. అతడే మన కన్నియేర్పాట్లు చేస్తాడు" అన్నాడు రైబిన్. ఇగ్నాటా చలిమంట వెయ్యడానికి కర్రా కంపా తెచ్చేదు 'ఇవ్వేళ నావంతుకావడం చాలా సంతోషం' అన్నాడు, ఇల్లాంటి అతిథులు వచ్చినప్పుడంతా సహాయం

చెయ్యాలన్నాడు. ఏఫిమ్, యాకూబ్ నిప్పులమీద ఒకరొట్టెనుకాల్చి ముక్కలు కోసి బల్లమీద పెట్టేరు.

ఇంతలో ఖళ్ ఖళ్ మని దగ్గు వినబడింది. రైబిన్ దగ్గునాలకించి సోఫ్యాతో "అడుగో అతనొస్తున్నాడు. అతనే గొప్పసాక్ష్యం. అతన్ని పట్టణానికి తీసుకెళ్ళి బహిరంగసభలో ఉపన్యాసాలిప్పించాలి. అతను యెప్పుడూ చెప్పిందే చెపుతాడు. కాని ప్రతివాళ్ళు ఒక్కసారయినా వినితీరాలి" అన్నాడు

ఒక భారీమనిషి, వంగిపోయిన నడుము నీడ్చుకుంటూ ఒక సన్నని కర్ర నూతంచేసుకుని మెల్లగా అడుగులేసుకుంటూ వస్తున్నాడు. దూరాన్నించే అతని ఒగర్పు వినబడుతోంది.

"ఇదిగో. సేవీ! రారా!" అని ఆహ్వానించాడు యాకూబ్.

"వచ్చేనుగా?" అని అతను నిలబడే దగ్గడం ప్రారంభించాడు.

అతడు తలదగ్గరనుంచి కాళ్ళవరకు ఒకటే అసహ్యమైన కోటువేసు కున్నాడు. తలవెంట్రుకలన్నీ జడలుకట్టుకుపోయినాయి. మొగంమీద ఎముకలు బయటబడ్డాయి కండ్లు గుంటలుపట్టిపోయి, యెక్కడో వున్నట్లున్నాయి రైబిన్ అతనిని సోఫ్యాకు పరిచయంచేసేడు. తర్వాత అతడు "ఓహో! మీరు ప్రజల కోసం పుస్తకాలు పట్టుకొచ్చేరటకాదూ?" అని పలుకరించాడు.

సోఫ్యా "అవును" అని తల ఊపింది. "ప్రజల తరపున మీకనేక వంద నాలు. జనం ఇంకా తమంతట తాము సత్యాన్ని గ్రహించే స్థితిలో లేరు. అందు చేత వాళ్ళు మీకు కృతజ్ఞత తెలుపలేరు. ఆ సత్యాన్ని అర్థంచేసుకునే శక్తి నా కుండడంవల్ల వాళ్ళతరపున కృతజ్ఞత తెలుపుతున్నాను" అని ఆ రోగి రొజుకుంటూ చెప్పాడు.

"ఇంత చీకటిపడ్డాక ఈ అడవిప్రాంతంలో వుండడం మంచిది కాదు. ఇక్కడ చాలా చల్లగాను, ఉక్కగాను ఉంది" అంది సోఫ్యా జాలితో. అతడు ఆయాసపడుతూ "నాకింక యేమీ మంచిదికాదు. ఒక్కచావే మంచిది" అన్నాడు. అతడల్లా అన్నప్పుడు ఆమె కడుపు తరుగుకుపోయింది. హృదయం నీరయిపో యింది. ఇగ్నాటా చలిమంట అంటించాడు. మంట గప్పున ఒక్కసారిలేచి తగ్గి పోయింది. పొగకమ్మి అడివంతా దట్టమైపోయింది. సేవీ తన గాథ ఆరంభిం చాడు.

"నేను చావుకు సిద్ధంగా వున్నా. వాళ్ళుచేసిన మహానేరానికి నేను ప్రత్యక్ష మైన నిదర్శనంగా వుండి ప్రజలకింకా ఉపకారం చేయగలను. చూడండి; నాకు వయస్సు 28 సంవత్సరాలు. నేను చచ్చిపోతున్నట్లే లెక్క. పది సంవత్సరాల క్రితం నేను నా భుజంమీద 500 పౌనులు బరువు అవలీలగా మోసేవాడిని. ఆ బలంతో అధమం డెబ్బది సంవత్సరాలయినా బ్రతుకుతాననుకున్నాను. కాని పది సంవత్సరాలే జీవిస్తున్నాను. నా యజమానులు నన్ను తుడిచిపెట్టేశారు. నా ఆయుర్దాయంలో నలభై సంవత్సరాలు మింగేశారు."

"అతని మాటకదే పల్లవి" అన్నాడు రైబిన్. మళ్ళీ మంట జోరుగా లేచింది. అడివంతా దివిటీ వేసినట్లయింది. కర్రలు ఫట్ ఫట్ మని చిట్లినాయి. సేవీ మళ్ళీ అందుకున్నాడు.

"అది నాపాపేకాదు. వేలకొద్దీజనం అదేపాట పాడుతున్నారు. కాని వాళ్లు లోపల్లోపల గొణుక్కుంటున్నారు. ఆపాట గట్టిగా పాడితే అందరికీ జ్ఞానంవస్తుందనే బుద్ధి వాళ్ళకిలేదు. ఎంతమంది దుర్భరమైన పనివల్ల క్షీణించిపోయి, అంగవిహీనులై, తిండిలేక మలమల మాడిపోవటంలేదు! సోదరులారా! ఈ సంగతి మనం అందరికీ తెలియచెయ్యాలి - శక్తి వున్నంతవరకు గట్టిగా అరవాలి" ఇల్లా అంటూవుండగా దగ్గు తెర వచ్చినది దగ్గి దగ్గి మెలికెలు తిరిగిపోయాడు "ఎందుకిదంతా? యెవడి ప్రారబ్ధం వాడిది. నా సంతోషం చూడరాదూ?" అన్నాడు ఏఫీమ్,

"మాటాడుతుంటే అడ్డుపుల్ల వెయ్యకు!" అని రైబిన్ అతన్ని మందలించాడు

"సరిసరి. నువ్వేకాదూ చెప్పింది? ఎవడి దురదృష్టాన్ని గురించి వాడు అట్టే చెప్పుకోకూడ"దని అన్నాడు ఏఫిమ్.

"ఆ సంగతి వేరు. ఇతని దురదృష్టం అందరిలాంటిదికాదు. ఇతపొక అఘాతంలోపడి వుక్కిరి బిక్కిరవుతున్నాడు. ఆ అఘాతంలోనుంచే ఇతరజనాన్ని "ఇక్కడకు రాకండిరా బాబూ"అని హెచ్చరిస్తున్నాడు.

యాకూబ్ ఒక జాడీతో పాలు తీసుకొచ్చి త్రాగమన్నాడు. రోగి వద్దన్నాడు. యాకూబ్ అతన్ని చంకక్రింద చేతులేసి యెత్తి నెమ్మదిగా బల్లదగ్గరకు తీసుకొచ్చి కూచోపెట్టాడు.

"ఏంపని చేశావు? ఇంత జబ్బుగా వున్నవాడి నెందుకు రప్పించావు? ఏనిమిషాన్ని చచ్చిపోతాడో అన్నట్లుగా వున్నాడు పాపం!"అంది సోఫియా మెల్లగా రైబిన్‌తో.

రైబిన్ "అవును. చచ్చిపోయేటప్పుడు ఒంటరిగా చచ్చిపోవడమెందుకు? జనంమధ్యనే చచ్చిపోతే మేలు. బ్రతికున్నంతసేపూ మాట్లాడనియ్యి. అతను తన ప్రాణాన్ని దండుగకు పోగొట్టుకుంటున్నాడు. అల్లాంటప్పుడు ఆఖరుదశలోనయినా కాస్సేపు ప్రజలకోసం బాధపడనియ్యి. ఇందులో తప్పేమీలేదు"అన్నాడు.

"ఓహో! నీకిల్లాంటిబాధ చూడడం సంతోషంలా కనుపిస్తోందే?"

"క్రీస్తుదేవుడు శిలువమీద మూలుగుతూ వుంటే ఆనందించినది అధికారులు, ఖామందులు. మనకి ఆనందంలేదు. అతనిదగ్గర మేము పాఠం నేర్చుకోవలచుకున్నాం. నీకు కూడా కాస్త నేర్పాలని మా కోరిక"

ఇంతలో గ్రుక్కెడు పాలు గుటకేసి క్షయరోగి మళ్ళీ మాట్లాడటం ప్రారంభించాడు.

"వాళ్ళపనిలో మనుష్యుల ప్రాణాలు తోడేస్తారు. ఎందుకోసం వాళ్ళు ఇలా చేస్తారో నాకర్థమవడంలేదు నేను నెఫిడావ్ బట్టలమిల్లులో పనిచేసి నాప్రాణాలను ఆమిల్లు కర్పించేసేను. నాయజమాని తన భార్యకు ఒక బంగారపు స్నానపుతొట్టిని బహుమాన మిచ్చాడు. ఆమె సింగారపు సామానులన్నీ బంగారంతో చేసినవే. ఆస్నానపుతొట్టె నాప్రాణాన్ని మ్రింగింది. నారక్తం ప్రాణం దానికర్పించుకున్నాను. ఒక మానవుడు పనిలో నాప్రాణంతీసి నారక్తంతో తన పెళ్ళాన్ని కుడికిస్తున్నాడు. నారక్తంతోటే ఆమెకు బంగారపు తొట్టిని కొన్నాడు"

"మానవుడు భగవంతుని ప్రత్యక్షస్వరూపం అంటారు అటువంటి స్వరూపాన్ని యెలా వినియోగిస్తున్నారోకదా వాళ్ళు!" అన్నాడు ఏఫిమ్.

"అవును. అందుకే నోరుమూసుకుని వూరుకోకండి" అన్నాడు రైబిన్ బల్లగ్రుద్దుతూను.

ఇగ్నాటా నవ్వాడు అచ్చటి యువకులు ముగ్గురుకూడా రైబిన్ అంటే యెంతో భక్తిగా వుండడం తల్లి గ్రహించింది ఆ క్షయరోగి మాట్లాడుతూవుంటే వాళ్ళ ముఖాలమీద చిరునవ్వు తాండవమాడుతుంది. 'రోగికదా' అనే జాలేమి కనబడలేదు

తల్లి మెల్లగా సోఫ్యాచెవులో 'ఇదంతా నిజమే?' అంది

"సందేహ మేమిటి? నిజమే. ఇల్లాంటి బంగారపు బహుమతులుగురించి పత్రికల్లో అప్పుడప్పుడు పడుతూ వుంటాయి. ఈ సమాచారం మాస్కోలో జరిగిందే" అని బిగ్గరగా సమాధానం చెప్పింది సోఫ్యా.

రైబిన్ ఉగ్రుడై "అంతపని చేసినందుకు వాడిని ఉరితియ్యలేదు కాదూ? వాడిని వురితియ్యవలసిందే. వాడిని తీసుకెళ్ళి ప్రజలముందుపెట్టి ముక్కలక్రింద కొయ్యాలి. వాడి దుర్మాంసాన్ని కుక్కలకెయ్యాలి. ఒకసారి ప్రజలు లేచారంటే ఇల్లాంటివెన్నో చేస్తారు వాళ్ళకి జరిగిన అవమానాన్నంతటినీ రక్తంతో కడుగుతారు. ఈ రక్తంమాత్రం ఎక్కడిది? అదీ ప్రజలదే. వాళ్ళ రక్తనాళాల్లోంచి పీడింపపడ్డదేకాదూ!" అన్నాడు.

రోగికి చలిగా వుండటంచేత యాకూబ్ అతన్నికూడా చలిమంటదగ్గర కూచో పెట్టేడు. చలిమంట తాపీగా మండుతోంది. రోగి దగ్గుతూ చేతులలో చలికాగుతున్నాడు. ఖంగు ఖంగుమని దగ్గుతున్నాడు. మంట ఎదుట చేతులు పెట్టినపుడు రక్తక్షీణంవల్ల అతని ఎముకలు లెక్క పెట్టేటట్లున్నాయి. రైబిన్ పళ్ళు పటపట కొరికి సోఫియాతో ఇల్లాచెప్పేడు. "పుస్తకాలకన్న ఇలాంటి దృశ్యం చురుక్కుమని నాటుతుంది. ఈ సంగతి బాగా వెల్లడి కావాలి. కూలివాని చెయ్యో, కాలో ఏ [illegible]నో పడి విరిగితే అదొక మోస్తరు. అందులో కొంత వరకైనా వాడితప్పుం[illegible]ంది కాని ఇల్లాంటి విషయంలో మనిషి రక్తాన్ని పీల్చేసి ఖాళీచెత్తిని అవతల పారవేయడంవుందే దీనికేమి సమాధానం చెప్పడానికి సావ

కాశంలేదు. ఉద్రేకంచేత స్వప్రయోజనం కోసము మనుష్యులను హత్యచేయడం నాకర్థమవుతుంది. కాని కేవలం విలాసంకోసం మనుష్యుల ప్రాణాలు తీయడ మనేది చాలా విపరీతం. నాకు ఊహించడానికే శక్యమవడంలేదు. ఎందుకు వాళ్ళు ప్రజల నిల్లా పీడిస్తారు? మన్నిపీడిస్తే వాళ్ళకేమొస్తుంది? ఏమీలేదు తమాషా. తమదు ఈ భూమిమీద షోకుగా బ్రతుకటానికి, గుర్రాలను, వెండి కత్తులను, బంగారపు పళ్ళేలను, వాళ్ళపిల్లలకు ఖరీదైన తమాషా వస్తువులను ప్రజల రక్తంతో కొనుక్కొని కుడుకదానికి. నువ్వుపనిచెయ్యి. నీ బ్రతుకంతా పనే. నీపనివల్ల వచ్చే లాభాన్ని నేను మూటగట్టుకొని నా పెళ్ళానికి బంగారపు సామానులు బహుమతులిస్తాను" అంటారు.

తల్లి రైబిన్ మాటలన్నీ శ్రద్ధగా వింది. ఒక్కసారి తలయెత్తి చూసేసరికి ఆమెకు పావెల్ పోయేమార్గం, అతని వెంటబడిపోతూన్న జనం అంతా పగటి కలలా కనుపించాప. భోజనంచేసి మళ్ళీ అంతా చలిమంటదగ్గరకుచేరారు. మంట జోరుగా మండుతోంది. క్షయరోగి దగ్గుతూ మంటకేసిచూస్తూ కూచున్నాడు. అతనికి ప్రాణం యెగిరిపోతూన్నట్లుతోచింది. యాకూబ్ అతన్ని పందిరిక్రింద కూచోమన్నాడు. రోగి "ఎందుకూ? ఇక్కడేవుంటాను. నేనూ యెప్పుడూ పదిమందిలో బ్రతికాను. బ్రతికున్నన్నాళ్ళు పదిమందిలో వుంటేనే నాకు సుఖం. ఇక్కడుంటే నాకు హాయిగా వుంటుంది. మీకేసి చూస్తూ దురాశవల్ల వాళ్లు కొల్లగొట్టిన ప్రజల కసి మీరు తీర్చుకుంటే తీర్చుకోవచ్చుననుకుంటూ వుంటాను" అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు. అతనికి చిన్న మగతనిద్రవచ్చింది. తలముందుకు వాల్చి కళ్లు మూసుకున్నాడు. రైబిన్ అతన్ని చూపిస్తూ "ఇతను యిక్కడికొచ్చి కూచుని మనిషికి జరుగుతున్న అవమానాన్నిగురించి ఎప్పుడూ ఒకేమోస్తరుగా మాట్లాడుతూవుంటాడు. ఇదితప్ప యింకొకటేమీ యెరుగడు" అన్నాడు.

తల్లి ఇంతకన్న యింకా యేమికావాలి? యజమానుల విలాసంకోసం వేలకొద్దీ జనం రాత్రింబగళ్లు విసుగు విరామంలేకుండా పని చేసిచేసి అరిగిపోయి ప్రాణాలు ఆహుతిచేస్తుంటే యింకా యేమికావాలి?" అంది.

ఇగ్నాటా "అతను చెప్పిందే చెప్పడంవల్ల ప్రాణం విసుగుతుంది. ఇల్లాంటి సంగతి ఒక్కసారి వింటే ఎన్నటికీ మరచిపోరు. మరి యితనెప్పుడు అదేగొడవ చెపుతాడు" అన్నాడు.

రైబిన్ తీవ్రంగా "అతని బ్రతుకంతా ఇదేవిషయం. ఆసంగతి మరచిపోకూడదు" అన్నాడు.

క్షయరోగి కండ్లుతెరచి నేలమీదకొరిగాడు. యాకూబ్‌లేచి మెల్లగా రెండు కంబళికోట్లు తెచ్చి అతనిమీద కప్పి తాను సోఫియా ప్రక్కనే కూచున్నాడు.

చలిమంట పటపటధ్వానాలుచేస్తూ జోరుగాలేచింది. సోఫియా ప్రపంచాన్ని గురించి ప్రజల జన్మహక్కులకోసం జరుపుతూవున్న పోరాటంయొక్క చరిత్రను

చెప్పడం మొదలెట్టింది. జర్మనీ దేశంలో రైతులు భూమందులతో పేచీపడడం, ఐరిషు ప్రజల అవస్థలు, స్వతంత్రంకోసం ఫ్రెంచి ప్రజలు పడినపాట్లు, వాళ్లుచేసిన ఘనకార్యాలు మొదలైన గాథలన్నీ చెప్పింది. ఆ రాత్రి ఆమె చెప్పని చరిత్రలేదు. ఏయే దేశాల్లో ఎల్లా ఎల్లా దెబ్బలాడుకుని రక్తపాతము చేసుకున్నదీ, సత్యం కోసం, ధర్మంకోసం, స్వేచ్ఛకోసం ఏయే దేశాలలో ఏష్యే మహావీరులెట్లా పోరాడి ప్రాణాల నర్పించినది, మొదలైన విషయాలనుగురించి సవిమర్శకంగా ఆ చిన్న సభలో సోఫియా పుపన్యాసం యిచ్చింది. సభికులంతా ఆమె చారిత్రకోపన్యాసాన్ని అతి శ్రద్ధగా విన్నారు ఆగాథలు వారిలో ఒక విశ్వాసాన్ని, ఆశను కలిగించినాయి. ఆసంగతంతా విన్నాక ప్రపంచంలో సామాన్యజనం స్వేచ్ఛ సమానత్వం మొదలైన ఆదర్శాలకోసం సలుపుచున్న యెడా తెంపులేని పోరాటం, అందులో నున్న సత్యం వాళ్ళకు కళ్ళకు కట్టినట్లు కనుపించింది. పూర్వంకూడా జనం జన్మహక్కుల కోసం పోరాడి యెల్లా తమరక్తాన్ని ప్రవింపచేసారో గ్రహించి వారి ఆదర్శానికి, తమ ఆదర్శానికి వుండే సామీప్య స్థితిని గుర్తించారు. ఆనాటి మహావీరులకు రక్తంలోనుంచే ప్రకాశవంతమైనవట్టన్నీ ఉత్సాహకరమైనట్టన్నీ మానవజీవితాన్ని స్థిరపరచే ప్రయత్నాలు బయలుదేరినాయని గ్రహించారు. ప్రపంచంలోవున్న మానవులంతా ఒక్కటే అనే ఆధ్యాత్మిక సమానత్వం వారి అంతరంగంలో పుట్టింది.

సోఫియా ఘంటాపథంగా "వస్తుంది అచిరకాలంలోనే ఒక్కరోజున వస్తుంది. అన్ని దేశాల్లోనూ ఉన్న కూలినాలిజనం తలలెత్తి ఐక్యకంఠంతో గట్టిగా 'చాలుచాలు. ఈ మాదిరి జీవితాన్ని యిక భరించం.' అని చెప్పేరోజు వస్తుంది. ఆరోజున తమ దురాశచేతనే ఆధిక్యత వహించియున్న నిరంకుశాధికారము కూలిపోవకతప్పదు. ఆ అధికారమంతా అధఃపాతాళంలో పడిపోక మానదు." అని చెప్పింది.

రైబిన్ తలవంచి "అవును. అంతే. సందేహంలేదు. నిన్నుగురించి నువ్వే యేమీ జాలిపడకుండావుంటే లోకాన్నంతా జయిస్తావు" అన్నాడు.

ఆ యువకులు సోఫ్యా మాటలన్నిటినీ శ్రద్ధగా కిక్కురు మనకుండా విన్నారు మధ్యమధ్య చలిమంట ఆరిపోకుండా ఒక కట్టెవేస్తూ వుండేవారు. పొగవస్తే ఆడవాళ్ళమీది కెళ్ళకుండా చేతులతో త్రోసేసేవారు. యాకూబ్ లోపలి కెళ్ళి రెండు కంబళ్ళు తెచ్చాడు. అతడూ ఇగ్నాటా కలిసి వాటిని ఆడవాళ్ళమీద కప్పేరు.

సోఫియా తనకథ సాగించింది. తమ జీవితశక్తినంతా వృధాగా యజమానికి ధారపోసి ప్రాణాలు పోగొట్టుకొనే వాళ్ళు ఏ యే దేశాల్లో ఉన్నా అంతా ఒక్కటే అని ఆమె రుజువుచేసింది ఆ యువకుల హృదయాల్లో అలాంటి అసహ్యభావాన్ని కలిగించింది. ఎప్పటికైనా తమ శక్తి విజృంభించి జయము కలుగక

తప్పదనే విశ్వాసం పుట్టించింది. ఆనాటి విజయోత్సవాన్ని గురించి వాళ్ళ మనసులు ఉవ్విళ్ళూరి కోరికపుట్టేటట్లు వర్ణించింది.

మాటాడుతూ మాటాడుతూ ఉంటే తెల్లవారే సమయమైంది. సోఫియా మాటాడలేక వాళ్ళమొగాలు చూస్తూ కూచుంది. తల్లి "ఇక వెళ్ళడానికి మనకి సమయమైంది" అంది. సోఫియా అవును; అయింది అంది. రైబిన్ "మీరు వెడుతున్నారంటే నాకు విచారంగా వుంది. (సోఫియాతో) నువ్వు చాలాబాగా మాట్లాడుతావు. ఈ మహోద్యమం ప్రజలలో గొప్ప ఐకమత్యాన్ని కలిగించింది. నువ్వు చేసేపనే కోట్లకొద్దీ జనం చెయ్యాలనుకున్నారని తెలిస్తే నీహృదయంలో ఒకవిధమైన సంతోషం కలుగకపోదు ఆ సంతోషంలోనే ఒక గొప్పశక్తి ఉంది" అన్నాడు మెల్లగా.

"బాబాయి! ఎవళ్ళూ చూడకుండగానే వీళ్ళు వెళ్ళిపోవడం మంచిది. ఈ పుస్తకాలను మనం పంచిపెడదాం ఇవన్నీ ఎల్లావచ్చాయా అని ఉద్యోగస్తులు తెల్లబోవాలి. అట్లాంటప్పుడు ఎవళ్ళయినా వీళ్ళనుచూచిన సంగతి జ్ఞాపకం రావద్దు" అన్నాడు ఏఫిమ్.

రైబిన్ అతనిమాట కడ్డొచ్చి "సరే. అమ్మా! మీరువెళ్ళండి మీరు పడ్డ శ్రమకి చాలాచాలా నమస్కారాలు. నిలోనా! నిన్నుచూచినప్పుడల్లా పావెల్ జ్ఞాపకానికొస్తాడు. నువ్వునడిచే మార్గమే సరియైనమార్గం" అనిచెప్పి చిరునవ్వు నవ్వుతూ తల్లిదగ్గరగా నిలబడ్డాడు. చలిగాలి జోరుగా కొడుతుంది. తల్లి రైబిన్ భారీదేహాన్ని ఎగాదిగా చూసింది. ఏమీతోచక నవ్వుతూ "చలేస్తుంది. ఏదైనా బట్టకప్పుకో" అని నల చెప్పింది.

రైబిన్ "ఎందుకూ? నాకు చలిలేదు. నాహృదయంలోనే వుంది నిప్పు" అన్నాడు వెంటనే. ఆముగ్గురు యువకులు ఆ చలిమంటదగ్గరే నిలబడి ఏదో గొణుగులాడారు. వాళ్ళకాళ్ళదగ్గరే క్షయరోగి శవంలా పడున్నాడు. తెలతెలవారుతుంది. కాకులు కూసాయి. రైబిన్ సోఫియా కరస్పర్శంచేసి మళ్ళీ కలుసుకోవడం ఎల్లాగని అడిగాడు. తల్లి 'నన్ను కలుసుకుంటేసరి' అంది. ఆయువకులుకూడా కృతజ్ఞతా పూర్వకంగా ఆమె కరస్పర్శనం చేశారు. వాళ్ళందరి ముఖాలమీద ఒక విధమైనతృప్తి తాండవమాడుతుంది. రాత్రంతా నిద్రలేకపోవడంచేత పొడిపారిన కళ్ళతో ఆమెకేసి చూసేరు.

వాళ్ళ మంచితనానికి సంతోషిస్తూ సోఫియా సోదరులారా! శలవు' అంది. ఆ సోదరశబ్దం వినేసరికి వాళ్ళదేహాలు కొంచెం ఝల్లుమన్నాయి. క్షయరోగి ఖంగుమని దగ్గాడు. చలిమంట ఆరిపోయింది.

అంతా విచారంతో మెల్లగా 'శలవు' అన్నారు. ఆ స్త్రీయాత్రికు లిద్దరూ తమ పని పూర్తిచేసుకుని ఇంటికి బయలుదేరారు. అడివివారివెంట మెల్లగా నడక సాగించారు. తల్లి సోఫియా వెనుకాల అడుగేస్తూ ఇల్లా చెప్పింది. "అమ్మాయీ!

ఇదంతా కలలాఉంది. బలేబాగుంది. ప్రజలకు నిజంసంగతి తెలుసుకోవాలనే ఉంది. ఇదంతా చూస్తే నాకొక సంగతి జ్ఞాపకం వస్తోంది. పండుగరోజున చీకటికోనే చర్చికెడతామనుకో. అప్పుడింకా మతగురువు రాలేదనుకో. చీకటిగాఉన్నా జనం బాగా చేరేరనుకో. అలాంటప్పుడు ఒక్కొక్క క్రొవ్వత్తే వెలిగిస్తుంటే క్రమంగా అంధకార మంతా పోయి దేవమందిరం ప్రకాశమానమయ్యేటట్లుంటుంది."

"అవునవును. సరిగ్గానే చెప్పేవు. కాని ఇక్కడ దేవాలయం మాత్రం ఈ విశాల ప్రపంచమే."

"భూమండలమంతానా ? ఓహో ! చాలా బాగుంది."

వాళ్ళిద్దరూ రైబిన్‌సంగతే, ఆ క్షయరోగి సంగతే, ఆ యువకులను గురించి, వాళ్ళ మర్యాదనుగురించీ, మాట్లాడుకుంటూ నడక సాగించారు. పుంతలు దాటి పొలాల్లోకొచ్చారు. సూర్యోదయమైంది. అరుణకిరణాలు గడ్డిమీదనున్న మంచు బిందులమీదపడి కెంపుల్లా మెరిసినాయి. పక్షులు నిద్రలేచి మనోహరంగా పాడడం ఆరంభించాయి. తల్లికమాంతంగా ఆలోచన లట్టింది.

"ఒక్కొక్కప్పుడు ఎవరెంత చెప్పినా మనిషి కర్థంకాదు ఆఖరు కేదో ఒక చిన్నముక్కలో చెపితే అర్థం అవుతుంది. ఒక్కమాట గ్రహిస్తే అంతా కూడా అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లు తెలుస్తుంది. మాటవరసకి చెప్తాను. ఆ క్షయరోగి సంగతి చూడు. నేను ఫాక్టరీల్లోనూ అక్కడా కూలివనివాళ్ళని పీల్చి పిప్పిచేస్తారని చెప్పుకుంటే విన్నాను. నేను స్వయంగానూ ఎరుగుదును. కాని పుట్టినప్పటి నుంచీ అల్లాంటి సంగతులు చూడడం వినడంవల్ల హృదయం రాయై పోతుంది. జాలే కలుగదు. మామూలు విషయంగానే కనిపిస్తుంది. కాని ఆ రోగి అమాంతంగా ఎల్లాంటి దుర్మార్గమైన విషయం చెప్పాడో చూడు. ఘోరం! ఘోరం! ఓ భగవంతుడా! యజమానుల షోకుకోసం, దర్జాకోసం, కూలి నాలి జనం ప్రాణాల నర్పించాలసొస్తోందా? ప్రభో! ఇదేమీ న్యాయంకాదు సుమా?"

తల్లి ఆలోచనలన్నీ చిన్నప్పటినుండి తాను విన్న ఇల్లాంటి ఘోరకృత్యాల మీదికి పోయినాయి. హఠాత్తుగా ఒక్కసంగతి జ్ఞాపకం వచ్చింది. "వాళ్ళ జబర్ దస్తీకి హద్దూ పద్దూలేదు. పాపం పండిపోతోంది. ఒకసారి ఒక జిల్లా ఉద్యోగి తన గుర్రం గ్రామంలోనుంచి వెడుతూఉంటే రైతులంతా వంగి వంగి సలాములు చెయ్యాలని ఆర్డరేశాడు. ఆ ఉత్తరువు నతిక్రమించిన వాళ్ళందరినీ అరెస్టుచేయుం చాడు. చూడు! ఇందులో అతనికి కలిగేలాభమేముంది? దీనిలో ఏమైనా అర్థం ఉందీ? సబబూ సందర్భం కొంచెమైనా ఉందా?" అంటూ తల్లి ఒక్క నిట్టూర్పు పుచ్చింది. ఆఖరుకు ఒక్కక్షణం ఆలోచించి—

"అవును. బీదవాళ్ళు దరిద్రంచేత మూర్ఖులై పడున్నారు, ధనికులు దురాశ చేత మూర్ఖులైనారు." అంది. సోఫియా చక్కగా కంఠమెత్తి రయ్యిమని ఒక్క పాట పాడింది.

## ౨౫

నిలోనా జీవితం యేమీ ఒడుదుడుకులు లేకుండా సాగిపోతోంది. ఆ నిశ్చలత్వంచూస్తే ఆమెకే ఆశ్చర్యం కలిగేది. కొడుకు జైల్లోవున్నాడు. దారుణమైన శిక్ష పడుతుందని తెలుసును ఆలోచన మనస్సులో కొచ్చేటప్పటికి, ఆంద్రీ ఫెడ్యా మొదలైన అసంఖ్యాకులగు యువకులంతా జ్ఞాపకానికొచ్చేవారు. వీళ్ళందరిని తన కొడుకే యీ మహత్కార్యానికి ప్రోత్సాహం చేస్తున్నట్లు ఒక దృశ్యం ఆమె కంటికగుపడేది. ఈవిషయం గురించి తనలో తానే తర్జన భర్జన చేసుకుంటూంటే క్రమంగా ఆమె హృదయం వైశాల్యమైంది తన కొడుకు నొక్కనిగురించి ఆలోచించుకోవడానికి బదులు ప్రపంచం అంతటిని గురించి ఆలోచిస్తూ వుండేది.

సోఫియా యెక్కడికో యేదో పనిమీద వెళ్ళి అయిదురోజులయిన తర్వాత తిరిగివచ్చింది. రెండుగంటలు ఇంట్లోవుండి మళ్ళీ యెక్కడికోవెళ్ళి పదిహేను రోజులకు వచ్చింది. ఆమె పుట్టినప్పటినుంచీ ఇల్లాగే చక్కర్ కొడుతూన్నట్లు తోచింది తల్లికి.

నికోలే జీవితం యెప్పుడూ ఒకేమాదిరి. యేమీ కించిత్తుమార్పులేదు. ఎనిమిది గంటలకులేచి టీ త్రాగడం, తర్వాత పత్రికలు చదవడం, అందులో వుండే విశేషాలు తల్లికి చెప్పడం. మధ్యమధ్య వర్తకులసంగతీ, పట్నవాసం బ్రతుకునుగురించి చెపుతూ ఉండేవాడు. పట్నవాసం బ్రతుకునుగురించి అతడు చెప్పేమాటలవల్ల ఆమెకు ప్రజలు డబ్బుఅనే తిరగళ్ళలో పడిపోయి యెల్లా నలిగి పోతున్నారో భోధపడింది. నికోలే ఆఫీసుకు తొమ్మిది గంటలకు పోయేవాడు.

నిలోనా ప్రొద్దున్నే గదులూ గిదులూ శుభ్రంచేసి, వంటచేసి స్నానం చేసుకొని శుభ్రమైన గుడ్డలు కట్టుకొని తనగదిలో కూచుని బొమ్మల పుస్తకాలు తిరగేస్తూవుండేది. ఆమె చదవడం బాగానే అభ్యాసంచేసింది. కాని పట్టిపట్టి చదువడంవల్ల చాలాశ్రమగావుండేది. మాటల కర్ధంకూడా ఆమెకు సరిగా తెలియడం లేదు. బొమ్మలు చూచుకుంటూవుంటే ఆమెకెంతో ఆనందంగా వుండేది. ఏదో క్రొత్త ప్రపంచాన్ని చూస్తున్నట్లు సంతోషపడేది. పట్టణాలు, బ్రహ్మాండమైన ఓడలు, గొప్పగొప్ప భవనాలు అన్నీ ఆమె కళ్ళముందర ప్రత్యక్షంగా కనుబడేవి; ప్రకృతినిమించి ప్రజలెంతెంత పనిచేస్తున్నారా అని ఆశ్చర్యపడేది. రోజూ యేదో క్రొత్త విపరీతం ఆమెకు కనుబడేది. జంతువుల బొమ్మలుచూస్తే ఆమెకెంతో ప్రియం. భూమండలంయొక్క అనంతమైన ఐశ్వర్యం, అందం వాటిలో ఆమెకు కనుపించేవి సీతాకోక చిలుకల్లాంటి చిన్నచిన్న పురుగుల్ని చూసి పరవశయై పోతూవుండేది. "ప్రజలకింతింత అందమైన వస్తువు లున్నాయని తెలియవుగదా! తెలిస్తే యెంత సౌఖ్యంగావుంటారోగదా!" అనుకునేది. నికోలే ఆమె ఆనందం కనిపెట్టి రోజురోజూ క్రొత్త క్రొత్త బొమ్మల పుస్తకాలు తెస్తూవుండేవాడు

సాయంకాలమప్పుడు నికోలే ఇంటికి ఎవరో పైమనుష్యులు చాలామంది వస్తూవుండేవారు. అలెగ్జేవాసిలిష్, రోమన్ పెట్రోలిష్ మొదలైనవాళ్ళు. అందులో ఈగర్ ఇవానిష్ తన జబ్బునుగురించి మహా వేళాకోళంగా మాట్లాడుతూ వుండే వాడు. వచ్చినవాళ్ళంతా యేదో తీవ్రంగా చర్చచేస్తూ వుండేవారు. కాని సామాన్యంగా విషయం ఒకటే. ప్రపంచంలో కూలినాలి జనంయొక్క శ్రేయస్సును గురించి చర్చలు ఒకప్పుడు మహాఘాటుగా సాగేవి. ఆఘాటును వుపశమింప చేయడానికి కాబోలు టీ కూడా జోరుగా యెక్కిస్తూ వుండేవారు. నికోలే ఎవళ్ళెంత చర్చచేస్తున్నా తానుమాత్రం అట్టే మాట్లాడేవాడుకాడు. అంతా మాట్లాడుతుంటే తానొక కాగితం పుచ్చుకుని తలవంచి ప్రకటనలు, హెచ్చరికలు గబగబ వ్రాసేస్తూ వుండేవాడు పూర్తిచేసి అందరికి చదివి వినిపించేవాడు. తర్వాత వాళ్ళంతా మంచి దస్తూరీలతో నకళ్ళు వ్రాసేవారు. అప్పుడతను తాను వ్రాసిన చిత్తును చింపేసే వాడు. ఆచింపేసిన ముక్కలన్నీ జాగ్రత్తచేసి యేరి తల్లి వాళ్ళకి టీ అందిచ్చేది. ప్రజలకు తమ వుద్యమతత్వాన్ని సులువుగా తెలియచెప్పే మార్గాలేమిటాయని వాళ్ళు క్రిందామీదా పడుతూంటే తల్లికాశ్చర్యంగా వుండేది. ఒకప్పుడు వాళ్ళు ఒకళ్ళనొకళ్ళు దెప్పుకుంటూవుండేవారు. దేవుకుంటూ వుండేవాళ్ళు. బేధాభిప్రాయాలను కళ్లెర్రజేసి చెప్పేవారు: ఒక్కొక్కప్పుడు వీళ్ళంతా యెందుకిల్లా కంఠశోషపడతారా అనుకునేది తల్లి. వాళ్ళకన్న కూలినాలి జనం అవస్థ తనకే యెక్కువ తెలుసుననిపించేది. భార్యా భర్తలకుండే అసలు సంబంధమేమిటో తెలియకుండానే చిన్నపిల్లలు "మొగుడూ పెళ్ళాం" ఆట ఆడుకుంటూంటే పెద్దవాళ్ళు తమాషాగాచూచి ఆనందించేటట్టుగా ఆ యువకుల చర్చలనన్నిటిని నిళ్లోనా వింటూవుండేది.

అప్పుడప్పుడు శశాంకకూడా వచ్చేది. కాని అట్టేసేపు వుండేదికాదు. నీమీ నవ్వు, త్రుళ్ళు లేకుండా ముక్తసరిగా మూడుముక్కలు మాట్లాడిపోయేది. ఎప్పుడొచ్చినా పావెల్ క్షేమసమాచారాలు కనుక్కోకుండా మాత్రం వెళ్ళేదికాదు. ఒక్కొక్కప్పుడు తల్లి శశాంకతో పావెల్‌కేసు ఇరిగా విచారణకు రాలేదనీ, వాయిదాకూడా యెప్పుడో తెలియదనీ బాధకొద్దీ చెప్పేది. శశాంకకూడా దిగాలుపడి మాటామంతి లేకుండా నిలబడిపోయేది. అలాంటప్పుడు నిలోనాకు "ఓహో ! నీ సంగతి తెలిసిందిలే, నువ్వాతని ప్రేమిస్తున్నావని నాకు తెలిసిందిలే" అని అందామని బుద్ధిపుట్టి మాట నాలుకచివరదాకా వచ్చేది. కాని ఆమె తీవ్రమైన నేత్రాలు, ముక్తసరిగా మాటాడేమాటలుచూస్తే తల్లికంత చనువుతీసుకోడానికి సాహసం కలిగేదికాదు. "పాపం దురదృష్టవంతురాలు" అనుకునేది.

* * * *

ఒకసారి నటాషావచ్చింది. వస్తూనే చాలా సంతోషంతో కౌగలించుకొని తల్లిని ముద్దులెట్టుకుంది. ఏదో పిచ్చాపాటి మాట్లాడుతూ సందర్భవశాత్తు ఇల్లా

చెప్పింది. "మా అమ్మ చచ్చిపోయింది. పాపం! చచ్చిపోయింది — నాకు చాలా దుఃఖంవస్తోంది. ఇంకా ఏభై ఏళ్ళయినా నిండలేదు. బ్రతికితే ఎన్నాళ్ళయినా బ్రతుకవచ్చు. కాని ఒకవిధంగా ఆలోచిస్తే ఆమె చచ్చిపోతేనే అదృష్టవంతురాలు. ఆమెలాంటి బ్రతుకు బ్రతికేమిప్రయోజనం? ఎప్పుడు ఒంటరిగా ఉండడం, పైగా ఏ నిమిషానికానిమిషం మా నాన్న రేకలేసి హడలగొడుతూ ఉండటం. ఇదీ ఒక బ్రతుకే? మనిషి ఎప్పటికైనా మంచిరోజులు వస్తాయనే ఆశతోనే బ్రతుకుతాడు. ఆమెకల్లాంటి ఆశ ఏమీలేదు. ఆమె వ్రాత ఎప్పుడూ చీకాట్లే."

"అవును నటాషా! నువ్వు చెప్పింది నిజమే. ఎప్పటికైనా మంచిరోజులు వస్తాయనే ఆశతోనే ప్రజలు బ్రతుకుతారు. ఆ ఆశలేకపోతే బ్రతుకెందుకు? ఐతే అమ్మాయీ! ఇప్పుడు నువ్వొకరెవే అన్నమాట."

"అవును."

"అల్లాగా? ……………ఫరవాలేదులే. మంచివాళ్లెప్పుడూ ఒంటరిగా ఉండరులే. జనం అంతా మంచివాళ్ళచుట్టూ చేరతారు" అని తల్లి ఆమెను ఓదార్చింది. నటాషా ఇప్పుడొక బట్టలమిల్లుండే గ్రామంలో ఉపాధ్యాయిని పనిచేస్తోంది. తల్లి ఆమెదగ్గర కప్పుడప్పుడు రాజద్రోహ సంబంధమైన కరపత్రాలు, వార్తాపత్రికలు ప్రకటనలు పట్టుకెళ్ళి అందిచ్చేది.

రహస్యపు కాగితాలు పంచిపెట్టడమే తల్లికి ముఖ్యమైన పనైపోయింది. ఒక్కొక్క నెలలో అనేకసార్లు అనేక వేషాలువేసి కాగితాలు పంచిపెట్టేది. ఒకసారి సన్యాసివేషం, ఇంకోసారి జరీవర్తకురాలివేషం, మరొకసారి శ్రీమంతురాలి వేషం వేసుకుని, వేషానికి తగినట్లుగా గోనెసంచినో, తోలుపెట్టెనో చేత్తోపట్టుకుని నడిచో, బండిమీదో ప్రయాణంచేసి కాగితాలు పంచిపెట్టి చక్కావచ్చేది. రైళ్ళలోను,స్టీమర్లలోను, హోటళ్లలోను క్రొత్త మనుష్యులు కనిపిస్తే, తనే ముందుగా కల్పించుకొని ఎదురూ బెదురులేకుండా వాళ్ళకానందం కలిగేటట్లు మాటల్లోకి దింపేది.

ప్రజలతో మాట్లాడడమన్నా, వాళ్ళు తమజీవితంలో వుండే కష్టనష్టాలను గురించి చెపుతూవుంటే వినడమన్నా నిలోనాకు మహాఇష్టం. ఎవరైనా ప్రాణంమీద విసుగుతో తనబాధలు చెప్పుకుని, విధిని తిడుతూ తమ కష్టావస్థకు కారణమేమాయని జిజ్ఞాసపడుతూవుంటే ఆమెకు మహాసంతోషం. ప్రజలు దరిద్రాన్ని జయించడానికి చేసే నిత్యపోరాటం ఆమెకళ్ళకు కట్టినట్లగుపడేది. ఎక్కడచూచినా ప్రజలను కొల్లగొట్టి వాళ్ళరక్తం పీలుస్తూవుండే ఘోరకృత్యమే ఆమెకు కనుపించేది. ప్రపంచంలో కావలసినంత ఐశ్వర్యం ఉన్నా, కోట్లకొలది ప్రజలు తిండితిప్పలులేక పడున్నారని ఆమె తెలుసుకుంది. పెద్దపెద్ద పట్టణాల్లో వెండి బంగారాల మయమైన చర్చీలుంటాయి. వాటి గుమ్మాలముందర కాలుతూవున్న కడుపులతో, చలికి గడగడ వణకుతూ బిచ్చగాళ్లు ఎవరయినా ఒక్క రాగిదమ్మిడీ ఇస్తారా అని నోరు

తెరచుకుని పడుంటాడు. ఈదృశ్యం తల్లి చూచింది. బంగారు మలాముచేసిన దేవాలయాలను, బంగారపు జరీదుస్తులను ధరించిన పూజారులను ఆమె ఇదివరకు చూసింది. దరిద్రం ఓడుతూవుండే బీదవాళ్ళ పూరిగుడిసెలూ వాళ్ళ గోచిపాతలూ చూసింది. కాని అప్పుడు అది సృష్టిలో సహజమనిపించింది. ఇప్పుడా తారతమ్యం ఆమెకు దుర్భరంగానూ, దురన్యాయంగానూ కనుపించింది. భగవంతుడు అసలు ధనికులకన్నా బీదలను ఎక్కువ ప్రేమిస్తాడు. వాళ్ళకే అండగా వుంటాడు. చర్చిల అవసరం నిజంగా బీదలకే. అలాంటి సందర్భంలో బీదలు లేమిలో పడి కొట్టుకుంటుంటే ధనికులు బంగారు చర్చిలలో ప్రార్థనలు చెయ్యడం, బీదలను, తద్వారా భగవంతుడిని అవమానపరచడమేనని ఆమెకు దృఢమైన విశ్వాసం కలిగింది.

ఏసుదేవుడు బీదలకు పరమమిత్రుడని కథల్లో నిలోనా వింది. ఆయన సామాన్యమైన దుస్తులు ధరించేవాడనికూడా వింది. అలాంటి బొమ్మలు చూసింది. కాని యెక్కడికైతే ప్రజలు ఆయన ప్రసాదాన్ని అపేక్షించి వస్తారో అటువంటి చర్చిలలోచూస్తే ఆయన బంగారు సిలువలమీద రత్నాల మేకులతో తాపడమై వుంటాడు. పట్టుబట్టలతో సింగారింపబడి వుంటాడు. అల్లాంటప్పుడు ఆమెకు రైబిన్ చెప్పిన ఈమాటలు స్ఫురణకొచ్చినాయి.

"వాళ్ళు మన దేవునికికూడా రూపు మాపేసారు. వాళ్ళచేతుల్లో ఉండే శక్తినంతా మనమీద ప్రయోగించారు. చర్చిలలో కెడితే దేవుడికి బదులొక దిష్టిబొమ్మను చూపెడరారు. వాళ్ళు భగవంతుని అసత్యంతోనూ, అధర్మంతోనూ అలంకరించారు! మన ఆత్మలను నాశనంచెయ్యడానికి ఆపరమాత్ముని ముఖం మార్చేశారు."

నిలోనా అప్రయత్నంగానే ప్రార్థనచేయడం మానేసింది. కాని యేసును గురించి, ఆయనపేరు తలపెట్టకుండానే ఆయన ఉపదేశము ప్రకారం భూమండలం అంతా బీదలరాజ్యమనీ, ప్రపంచంలో ఉండే ఐశ్వర్యాన్ని అంతా సమానంగా పంచుకుని అనుభవించాలనీ నమ్మకంగలవాళ్ళను గురించి నిరంతరం ఆలోచిస్తూ ఉండేది. ఆ ఆలోచనలోనే జిజ్ఞాసువైన ఆమె హృదయంలోనుంచి ఒక మహత్తరమైన ప్రార్థన బయలుదేరింది. ఏసుదేవుడుకూడా మునుపటికన్నా ఇప్పుడు తనకు చాలదగ్గర కొచ్చినట్లు ఏదో మార్పుచెందినట్లు కనిపించాడు. ఆతనిమూర్తి వెనుకటికన్న ఖారీగానూ, సంతోషంగానూ కనబడింది. తనపేరిట స్రవింపచేయబడుచున్న రక్తప్రవాహాల్లో స్నానంచేసి పవిత్రుడైన ఏసుదేవుడు మానవజాతి నుద్ధరించడానికి వచ్చినట్లుగా చిరునవ్వు నవ్వుతూ ఆమె కండ్లయెదుట ప్రత్యక్షమైనాడు.

ఎక్కడెక్కడో తిరిగి సాయంకాలం ఇంటికొచ్చి తల్లి నికోలేకో తాను విన్నసంగతులు; చూచిన సంగతులు, తాను చేసుకొచ్చినపని అంతా చెప్పేది. ఒకరోజు సాయంకాలం ఇలా చెప్పింది. "నికోలే! దేశమంతా తిరిగి ఎక్కడెక్కడ ఏం జరుగుతోందో తెలుసుకోవడం చాలామంచిది. అందువల్ల జీవితం

ఎల్లా ఏర్పడిందో తెలుస్తుంది. అధికారులు సామాన్య ప్రజలను దిగదుడుపుక్రింద తీసేసి ఒక కడకు గెంటేసారు. ప్రజలకిష్టం లేకపోయినా ధక్కా మొక్కాలు తింటూ అటూ యిటూ తిరుగుతూ, ఏమిరా భగవంతుడా! అని దేవులాడుతూ ఉంటారు. ఎందుకు వాళ్ళు మనల నిల్లా తరిమి కొట్టడం? ప్రపంచంలో తినడానికి పుష్కలంగా అన్ని వస్తువులూ ఉంటే మనమిల్లా కడుపుమంటతో ఎందుకు మడతకుడుము లెయ్యాలి? ప్రపంచంలో ఇంత విజ్ఞానం ఉండగా మనమెందుకీ అంధకారంలో పడి కొట్టుమిట్లాడాలి? దరిద్రుడు ధనవంతుడు అనే తేడాలేకుండా అందరిని సమానమైన బిడ్డలలాగున పాలించే దయాళుడైన దేవుడెక్కడున్నాడా అని ప్రజలు ఆలోచన చేస్తున్నారు. క్రమంగా ఈ జీవితపద్ధతిమీద తిరుగుబాటు చేస్తారు. మందకొడిగా పడుండి తమ గతేమిటో ఆలోచించుకోకపోతే అసత్యం వాళ్ళని తుడిచిపెట్టేస్తుందని గ్రహించారు."

తీరిక సమయాల్లో నిలోనా బొమ్మలపుస్తకాలు తిరగేస్తూ ఉండేది. ఆమె శ్రద్ధనుచూచి నికోలే చాలా సంతోషించేవాడు. ఏదో ఒక క్రొత్త వింతను చెపుతూ ఉండేవాడు. మనిషియొక్క సాహసాన్ని గురించి విన్నప్పుడు ఆమె ఆశ్చర్యంతో 'నిజమేనా?' అని అడుగుతూ ఉండేది.

నికోలే ఇలాంటి సందర్భంలో ఒక్కసారి మనిషియొక్క భావిస్థితినిగూర్చి ఇల్లా చెప్పాడు.

"మనిషి కోరికలకంతంలేదు. శక్తికూడా అనంతమైనదే. కాని ప్రపంచం మొత్తంమీద ఆధ్యాత్మిక శక్తి సంపాదించడంలో చాలా మందంగా ఉంది. కారణం యేమిటంటే ఈ రోజుల్లో స్వేచ్ఛనుకోరే ప్రతివాడూ కూడా జ్ఞానానికి బదులు ధనాన్ని కూడబెట్టుకోవడం తప్పనిసరై పోతుంది. ప్రజల్లో ఆశ అనేది పూర్తిగా నశించి నిర్బంధసేవకావృత్తి నాశనమైతేనా.................."

తల్లి చెవులు నిక్కపొడుచుకుని వింది. అతను చెప్పే మాటలన్నీ ఆమె కర్థంకాలేదు. కాని ఆ మాటలలో ఉండే విశ్వాసం ఆమె హృదయానికి నాటింది.

"ప్రపంచంలో స్వేచ్ఛ ననుభవించేవాళ్ళు చాలా కొద్ది మంది. అదే మన దౌర్భాగ్యం" అన్నాడు నికోలే.

ఈ మాట తల్లికి బాగా అర్థమైంది. ఆశను, దుష్టత్వాన్ని నిర్జించిన మనుష్యుల నామె యెరుగును. అలాంటి వాళ్ళు ఇంకా చాలా మంది వుంటే అంధకారమయమై అసహ్యంగా వుండే మానవజీవితం యెక్కువ మంచిగాను, ప్రకాశవంతంగాను వుంటుందని ఆమె గ్రహించింది.

౬

ఒకరోజున నికోలే మామూలుకంటె ఆలస్యంగా వచ్చాడు యింటికి. వస్తూనే చాలా తొందరగా "అమ్మా! ఇవ్వాళ ఆర్దీవారులను పిలిచేసమయంలో మన రాజకీయ ఖైదీలలో యెవరో ఒకడు పారిపోయాడట. కాని అతనెవ్వరో మనకింకా గుర్తు తెలియలేదు" అన్నాడు

తల్లికికూడా పట్టరాని ఆవేశం కలిగింది. కుర్చీలోకూచుని "పాషా కాదు కదా?" అని మెల్లగా అంది.

"అయితే అవచ్చును. కాని యిప్పుడతన్ని కనుక్కొని అతనికి కావలసిన సహాయం చెయ్యడం యెలాగో ఆలోచించాలి. వీధులలో యెక్కడైనా కనబడుతా డేమోనని ఊరంతా తిరిగివచ్చాను. అది తెలివితక్కువపనేకాని యేమీ తోచక తిరిగేను. ఇప్పుడు మళ్ళా వెడతాను"

"నేనూ వస్తాను."

"నువ్వు ఈగర్ ఇవానిష్ దగ్గరకెళ్ళి అతని కేమైనా తెలుసునేమో కనుక్కో" అంటూ నికోలే వెళ్ళిపోయాడు.

తల్లి జేబురుమాలు నెత్తికికట్టుకుని వీధిలోకొచ్చింది. ఎండవేడిమి మహా తీక్షణంగావుంది. నడువగా నడువగా ఆయాసం వచ్చింది. గుండె దడదడ కొట్టుకుంది. తల దిమ్మెక్కింది. నెమ్మదిగా కాళ్ళీడ్చుకుంటూ ఈగర్ గుమ్మం దగ్గర కెళ్ళేటప్పటికి కళ్ళు గిర్రునతిరిగేయి. ఒక్కక్షణం కళ్ళుమూసుకుని తెరిచే టప్పటికి నికోలే వైషోవికవ్ గుమ్మందగ్గర జేబులో చేతులుపెట్టుకుని నవ్వుతూ నిలబడినట్లయింది. బాగాకళ్ళు తెరచిచూస్తే యెవ్వరూలేరు. ఏమిటా అని ఆలోచిస్తూ వుండేసరికి మేడమెట్లదగ్గర అడుగుఃచప్పుడయింది. ముందుకెళ్ళి తొంగిచూసేసరికి మేడమెట్లవెనకాల వైషోవికవ్ స్ఫోటకం మచ్చల ముఖం కనబడింది. "పదపద" అని అతడు మెల్లగా తల్లికి సైగచేసేడు. ఆమె గబగబా మేడమెట్లెక్కి గదిలో సోఫాలో పడుకున్న ఈగర్ ఇవానిష్ చెవిలో నికోలే జైల్లోంచి తప్పించుకొచ్చేడు అని చెప్పింది.

"ఏ నికోలే? ఇద్దరున్నారుమరి."

"నికోలే వైషోవికవ్. అతనిక్కడికే వస్తున్నాడు."

"బలే! అతని కెదురెళ్ళడానికి మాత్రం నాకు ఓపికలేదు."

ఈగర్ ఇలా అంటూ వుండగానే వైషావికవ్ టోపీ చంకలో పెట్టుకొని తడుముకుంటూ లోపలికొచ్చాడు.

ఈగర్ మెల్లగాలేచి సంతోషంతో తలఊపుతూ "సరి సరి, కూచోకూచో" అని మర్యాద చేశాడు.

వైషోవికవ్ యేమీ మాట్లాడకుండానే చిరునవ్వు నవ్వుతూ తల్లిదగ్గరకెళ్ళి ఆమె చెయ్యిపట్టుకున్నాడు.

"నిజంగా యివ్వేళ యిప్పుడు నిన్ను చూడకపోతే మళ్ళీ జైల్లోకెళ్ళిపోయే వాడినే. ఈ వూరిలో నేనెవ్వరినీ యెరుగను. ప్రక్కనున్న పల్లెలలోకెడితే వాళ్ళే పట్టుకునేవాళ్ళు. అందుచేతనే దారీ తెన్నూ తెలియకుండా వీధుల్లో తిరుగుతూ యెంత తెలివితక్కువపని చేశానా అని అనుకుంటూ వుండగా ఛటుక్కున నువ్వు పరుగెత్తుతుంటే చూచాను. సరేననుకుని నీవెనకాల పడ్డాను" అన్నాడు వైషోవికవ్.

"అసలు నువ్వెల్లా తప్పించుకున్నావు?" అని అడిగాడు ఈగర్.

వైషోవికవ్ ఈగర్ సోఫామీద కూచుని ఆగాధంతా చెప్పాడు.

"ఎల్లా తప్పించుకున్నానో నాకూ తెలియదు. అదల్లా తటస్థించింది. కేవలం లాటరీ. అంతే..........."

నేను చల్లగాలికోసం పచారుచేస్తున్నాను; ఇంతలో ఖైదీలు * జైలు ఓవర్సీరును పట్టుకుని బాదడం ఆరంభించారు. ఆ ఓవర్సీరు అసలు పోలీసులో వుండేవాడు. అక్కడేదో దొంగతనంచేస్తే జైలుకి పంపించారు. ఇక్కడ అతడు జైలువాళ్ళకి గూఢచారి. చాడీకోరు. ఖైదీలనందరినీ వేపుకుతింటున్నాడు. అందుచేత ఖైదీలకు ప్రాణం విసిగి బాగా చావమోదేశారు. దానితో పెద్ద గలాటా అయిపోయింది. ఓవర్సీర్లంతా హడలిపోయి • అలారంకొట్టి ఈలవేసి గడబిడచేసేరు. ఈసందర్భంలో తలుపులు బారుగా తీసున్నాయి. నేను గేటుదగ్గర కొచ్చిచూస్తే యెదురుగా పెద్దమైదానం, వాటివెనుకాల మేడలు కనిపించినాయి. ముందుకు రావాలని బుద్ధిపుట్టి కలలోవచ్చినట్లుగా బయటికి వచ్చాను. తీరా బయటికి వచ్చిన తర్వాత యేమీ తోచలేదు. యెక్కడికెళ్ళనా? అని దిగులుపుట్టింది. వెనక్కి తిరిగిచూసేసరికీ గేట్లు మూతబడున్నాయి. నాకేమిటో కంగారుపుట్టింది మిగిలిన సోదరులేమవుతారా అని విచారం కలిగింది. నాకెప్పుడూ తప్పించుకురావాలనే ఉద్దేశ్యం లేనేలేదు"

"సరి సరి. ఊహుఁ! మళ్ళీవెళ్ళి గేటుతట్టి లోపలికెళ్ళలేకపోయావూ? అయ్యో! క్షమించండి. అవతల కెళ్ళాలని బుద్ధిపుట్టింది కాని మళ్ళీ వెనక్కొచ్చేను అని చెప్పలేకపోయావూ?" అన్నాడు ఈగర్.

వైషోవికవ్ చిరునవ్వునవ్వుతూ మళ్ళీ కథ సాగించాడు "సరి. అదీ బుద్ధి తక్కువ పనే. నే నొక్కడినే ఇలా తప్పించుకు రావడం. మిగతా మన సోదరుల కెల్లా వుంటుంది? వాళ్ళు యేమనుకుంటారో? యెవళ్ళతో యేమీ చెప్పకుండా చక్కావస్తినాయిరి? సరే. యేమైతే అయిందని ముందుకడుగేశాను.

* ఖైదీలలో వుద్యోగను కొంతమంది ఖైదీలమీద పెత్తనం చేస్తూవుంటాడు.

• జైలులోయేదైన గందరగోళం జరిగితే చాలాసేపు గంటకొడతారు. అదివిని అంతావస్తారు.

ఇంతలో యెవరో కొందరు చంటిబిడ్డ శవాన్నెత్తుకుని స్మశానాని కెడుతున్నారు. తలవంచుకుని వాళ్ళ వెనకాలపడ్డాను. స్మశానంలో కూచుని కాస్సేపు చల్లగాలి అనుభవించాను. ఇంతలో నా బుర్రలో ఒక ఆలోచన తట్టింది."

ఈగర్ "ఒక్కటేనా? ఆ ఆలోచన నీ బుర్రలో వుక్కిరి బిక్కిరి కాలేదు కదా?" అని మాటకడ్డొచ్చాడు.

వైషోవికవ్ నవ్వుతూ "మరి నా బుర్ర మునపటిలా ఖాళీగా వుందనుకున్నావేమిటి? అన్నట్లు ఈగర్! ఇంకా నీకు జబ్బే?" అని అడిగాడు. "ఎవరి శక్త్యానుసారంగా వాళ్ళు పనిచేస్తారు. ఒకడి కింకొకడి జోక్యం యెందుకు?" అని మాట తప్పించాడు. వైషోవికవ్ ప్రశ్నకు జవాబు చెప్పకుండానే దగ్గుతూ "నీ సంగతంతా పూర్తిగా కానియ్యి" అన్నాడు. వైషోవికవ్ తన కథను మళ్ళీ ప్రారంభించాడు. "అప్పుడు నేనొక వస్తుప్రదర్శనశాల (మ్యూజియమ్) కు వెళ్ళాను. అక్కడ ఇటూ అటూ తిరిగి నాలుగు ప్రక్కలా చూశాను. ఎక్కడికెళ్ళడానికి తోచలేదు. పైగా ఆకలి కడుపులో దహించేస్తోంది. దాహం పీకి ఆర్చుకుపోతోంది. వీథిలోకొచ్చి నాలుగడుగులేశాను. ఇంతలో పోలీసువాళ్ళు వీధిలో పోయేవాళ్ళందరి మొగాలు పరీక్షగా చూస్తుండడం కనిపెట్టాను. నా మొగం చూస్తే నిమిషంలో ఆనవాలు పడతారు గదా అనుకుంటూ వుండగా గవాలున నిలోనా పరుగెత్తుకుంటూ నా కెదురువచ్చింది. నేను ఛటుక్కున వెనక్కి తిరిగి ఆమె వెంట బడ్డాను. ఇంతే నా సంగతి." "ఏమిటీ? నేను నిన్ను చూడనయినా లేదే?" అంది తల్లి. వైషోవికవ్ తల గోక్కుంటూ "ఏమిటో! పాపం జైల్లో వున్న సోదరులు నే నేమైపోయానని ఖంగారుపడుతూ వుంటారో?" అన్నాడు.

"అల్లాగా? పాపం జైలు ఉద్యోగస్థులకోసం ఏమీ విచారపడటం లేదు కదా? మరి వాళ్ళుకూడా ఖంగారుపడుతూనే వుంటారు" అని కాస్త వేళాకోళం చేశాడు ఈగర్. తర్వాత "సరి. ఇక వేళాకోళానికేమికాని, నిన్ను దాచిబెట్టాలి. అది మరి సుళువైన పనికాదు. నేను లేచి తిరుగుతున్నట్లయితే" అని ఈగర్ యేదో చెప్పబోతూవుంటే ఒగర్పువచ్చింది. గుండెలమీద చేతితో రాసుకున్నాడు.

"ఈగర్! నీకు చాలా జబ్బుగానేవుందే?" అంటూ వైషోవికవ్ దిగాలు పడ్డాడు. తల్లి అతని కండ్లకేసిచూస్తూ నిలబడిపోయింది.

"సరిలెండి; అది నా గొడవ. మీకెందుకులెండి? చెప్పమ్మాయి! పావెల్ సంగతి అడుగు" అని ఈగర్ మాట తప్పించాడు. వైషోవికవ్ నవ్వేడు.

"పావెల్ కేం? బాగానేవున్నాడు. మంచి బలంగా వున్నాడు. మాకంతా అతడు పెద్ద. మా అందరి తరపున ఉద్యోగస్థులతో మాట్లాడుతూవుంటాడు. మేమంతా అతనెల్లాచెపితే అల్లాచేస్తాం. అతన్ని అంతా గౌరవిస్తారు. అది న్యాయమే."

తల్లి పావెల్ సమాచారంవింటూ ఈగర్‌కేసి చూసింది. అతని ముఖం పాలిపోయింది. కళకాంతులులేవు. కళ్ళల్లోనే ఉంది కాస్త జీవకళ.

"నాకు ఆకలిమండిపోతోంది. తినడానికి ఏమైనాపెట్టండి"అని వైషోవికవ్ నోరుతెరచి అడిగాడు. "అవ్వా! అదిగో ఆ బీరువామీద రొట్టెవుంది. అతని కియ్యి. తరువాత క్రిందికెళ్ళి ఎడమవైపున రెండోతలుపు తట్టితే ఒక స్త్రీ తలుపు తీస్తుంది. ఆమెనడిగి అక్కడ తినడానికి ఏముంటే అదంతా తీసుకురమ్మన్నానని చెప్పు" అన్నాడు ఈగర్.

"అంతా ఎందుకు?"

"అంత ఖంగారుపడకు. అంతా అంటే ఎంతో ఉండదు. అసలు యేమీ లేకపోవచ్చునుకూడాను" అన్నాడు ఈగర్.

తల్లి అతను చెప్పినప్రకారం వెళ్ళి తలుపుతట్టింది. లోపలినుంచి ఎవరైనా జవాబు చెపుతారేమోనని చెవు తలుపుదగ్గరే పెట్టింది. ఇంతలో లోపలినుంచి "ఎవరువారు?" అని కేకవచ్చింది. "ఈగర్ ఇవానిష్‌దగ్గరనుంచి. అతను నిన్ను రమ్మంటున్నాడు."

"వస్తున్నా"

తలుపెంతకీ తెరువలేదు. తల్లి మళ్ళీ తలుపుతట్టింది. లోపలినుండి ఒక పొడుగాటి స్త్రీ కళ్ళజోడుపెట్టుకుని చొక్కా దులుపుకుంటూ బయటికొచ్చింది. తల్లి కేసిచూచి కొంచెం కరుకుగా "యేంకావాలి?" అని అడిగింది.

"నేను ఈగర్ దగ్గరనుండి వచ్చాను"

"ఓహో! రా రా! నిన్ను నేను యెరుగుదునులే. క్షేమమా? ఇక్కడ చీకటిగా వుంటుంది?"

తల్లి ఆమెకేసి పరీక్షగా చూసింది. అప్పుడప్పుడు ఈమెకూడా నికోలే యింట్లో చూచినట్లు జ్ఞాపకంవుంది. "వీళ్ళంతా ఒకేమాదిరి మనుష్యులే. అంతా సోదరులే" అనుకుంది.

ఆ స్త్రీ తల్లి చేయిపట్టుకుని ముందుకు తీసుకెడుతూ 'ఈగర్‌కి చాలా జబ్బుగావుందా యేమిటి?' అని అడిగింది.

"అవును, పడుకునివున్నాడు. తినడానికేమైనా తెమ్మన్నాడు"

"అతనికేమికావాలి? ఏమీ అక్కరలేదే?"

వాళ్ళిద్దరూకలిసి ఈగర్ గదిదగ్గరకొచ్చారు. గదిలో అడుగు పెడుతూండగానే ఈగర్ ఇలాచెప్పడం ప్రారంభిచాడు. *లూడ్మిలా వాసిలీనా! నేను నాతాత ముత్తాతలదగ్గర కెడుతున్నాను. ప్రయాణానికి సిద్ధంగా ఉన్నాను. ఇదిగో ఇతడు నాస్నేహితుడు. అధికారులతో చెప్పకుండా పాపం జైల్లోంచి బయటికి చక్కా

* తల్లితో వచ్చిన స్త్రీపేరు.

వచ్చాడు. కాస్తయినా భిడియపడకుండా సాహసం చేశాడు. అన్నిటికన్న ముందు అతనికి భోజనంపెట్టి తర్వాత రెండుమూడు రోజులు ఎక్కడైనా దాచిపెట్టు."

లూడ్మిలా అతనిముఖం పరీక్షచేసింది. "నువ్వు వాగటం మానెయ్యాలి. అది మంచిదికాదని నీకు తెలుసు. వాళ్ళు రావడంతోడనే నాకు కబురంపాలిసింది. మందుకూడా పుచ్చుకున్నట్లు లేదు ఇల్లా అశ్రద్ధచేయడంలో నీఅభిప్రాయమేమిటో తెలియడంలేదు. మందుపుచ్చుకుంటే కాస్త ఒగర్పుతగ్గి సుఖంగా ఉంటుందని నువ్వే చెపుతావు" అని ఈగర్‌ను కాస్త మందలించింది. నికోలేతో "సోదరా! నాతోరా. ఇప్పుడే వాళ్ళొచ్చి ఈగర్‌ను ఆసుపత్రికి తీసుకెడతారు" అంది.

"ఇంతాచేస్తే నేను ఆస్పత్రికివెళ్ళడం ఎప్పుదన్నమాట?"

"అవును. నేనుకూడా వస్తాను అక్కడికి."

"అక్కడకుకూడా వస్తావూ?"

"చాలుచాలు. ఇష్"

లూడ్మిలా మాట్లాడుతూనే ఈగర్ రొమ్ముమీద శాలువాకప్పింది. నికోలేను పరీక్షగా చూసింది! సీసాలో మందెంతవుందో చూసింది. నెమ్మదిగా గడగడ మాట్లాడింది. చలాకీగా అటూ ఇటూ తిరిగింది మొగంమాత్రం తెల్లగావుంది. కళ్ళు నీలంగాను, గుండ్రంగాను వున్నాయి. ముక్కుదూలంవరకూ వున్నాయి కనుబొమ్మలు. మొత్తంమీద ఎందుచేతనోకాని ఆమె ముఖం తల్లికి నచ్చలేదు కొంచెం కోపంగాను, చటమట లాడుతున్నట్లు కనుపించింది. నోరుతెరిస్తే ఆజ్ఞాపించడమేకాని మరొకటెరుగదు. లూడ్మిలా తల్లితో "ఇదిగో మేము వెడుతున్నాం మళ్ళీ నేనిప్పుడే వస్తాను. ఈలోగా ఈగర్‌కి ఒక చెంచా మందియ్యి" అని తల్లికి ఆజ్ఞఇచ్చింది ఆమె 'సరే' అంది.

నికోలేను తీసుకెడుతూ వెడుతూ "ఇదిగో, అతన్ని మాట్లాడనివ్వకూడదు సుమా!" అని చెప్పి వెళ్ళిపోయింది.

ఈగర్ వుస్సురని ఒక్క నిట్టూర్పు విడిచాడు "అద్భుతమైన ఆడది. బ్రహ్మాండమైన శక్తివంతురాలు, అమ్మా! నువ్వామె సంగతి చూదాలంటే ఆమెతో కలసి పనిచెయ్యాలి. చూసేవా ఆమె ఎల్లా చిక్కి శల్యమైపోతోందో? మన అచ్చుపనంతా చెయ్యడం ఆమే"

"ఊరికే మాట్లాడకు ఇదిగో ఈమందు పుచ్చుకో" మందుత్రాగి ఈగర్ కళ్ళు నలుపుకుంటూ "అవ్వా! నేను మాట్లాడకపోతినా చచ్చిపోతాను" అంటూ తల్లికేసి చూచి చిరునవ్వునవ్వేడు తల్లికి కండ్లలో గిర్రున నీళ్ళు తిరుగేయి. దీనంగా అతనికేసి చూసింది "అవ్వా! మరేమీ ఫరవాలేదు. బ్రతకడం అనే సుఖం ఎప్పుడైతే ఉందో, దానివెంట చావడం అనేది వుండనే వున్నది సహజమే." తల్లి అతనిచేతిని పట్టుకొని "మాట్లాడకునాయనా" అని దీనంగా చెప్పింది.

"ఏమి ప్రయోజనం అవ్వా ? మాట్లాడకుండా వుండడం చాలాబుద్ధితక్కువ. మరి నాలుగు ఘడియలు బాధపడుతూ బ్రతికి ప్రయోజనం యేమిటి ? సజ్జనులతో మాట్లాడేభాగ్యం పోగొట్టుకోవడ మెందుకు ? ముందు జన్మలో ఇల్లాంటి సజ్జనులు దొరుకుతారో దొరకరో ?"

తల్లి అతనిమాట కడ్డొచ్చి "ఇదిగో ఆ దొరసాని వచ్చిందంటే నన్ను చీవాట్లెడుతుంది" అంది. "ఆమె దొరసానిగాదు. విప్లవవాది. ఒక పల్లెటూరి బడి పంతులు కుమార్తె. ఆమె నిన్ను ఎలాగాతిడుతుంది. ఆమె ఎప్పుడూ ఎవరినో ఒకరిని తిడుతూనే వుంటుంది."

ఒగుర్చుకుంటూ నెమ్మదిగా లూడ్మిలా సంగతంతా తల్లికి చెప్పేడు తల్లికి అతనిముఖం చూస్తూంటే మృత్యువు సమీపిస్తున్నట్లు కనుపించింది. ఇంతలో లూడ్మిలా గదిలోకొచ్చి తలుపు దగ్గరగా వేసింది నిలోనాతో—

"ఏమమ్మోయి ! మీ స్నేహితుడు ముందు బట్టలు మార్చెయ్యాలి నువ్వు త్వరగా బజారుకెళ్ళి బట్టలుపట్టుకురా. అబ్బ ! ఇప్పుడు సోఫియా ఇక్కడుంటే బాగుండును. మనుష్యులను దాచడంలో ఎవరయినా ఆమె తరువాతే" అంది

"సోఫియా రేపువస్తుంది" అంటూ తల్లి శాలువ భుజాన్నేసుకొని ప్రయాణమైంది.

"అతని కెల్లాంటి వేషానికి దుస్తులు కావాలి"

"ఏవైనాసరే రాత్రికదా ?"

"రాత్రి కనుకనే మరీ జాగ్రత్తగా వుండాలి. రోడ్డుమీదజనం అట్టేవుండరు కనుక పోలీసువాళ్ళు మరీశ్రద్ధగా చూస్తారు. అందులోను ఇతనుచాలా అసహ్యంగా వుంటాడు" అందితల్లి. ఈగర్ పక్కున నవ్వేడు.

"ఏమమ్మోయి ! అవ్వా, నువ్వు పడుచుపిల్ల వౌతున్నావు ?" అన్నాడు.

"నిన్ను చూడడానికి ఆస్పత్రికిరానా ?" అని అడిగింది.

ఈగర్ తలఊపుతూ దగ్గేడు.

లూడ్మిలా తల్లికేసి చూసి

"అతని కుపచారం చెయ్యడానికి నాకు సాయుమా ఏమిటి.? దీనికేమిలే ముందునీతో చెప్పిన పని చూడు" అని చెయ్యిపట్టుకొని అవతలికి తీసుకెళ్ళింది.

"నేను యిలామోటుగా మాట్లాడుతున్నానని నీకు కోపం వద్దు. ఇది మోటుతనమని నాకు తెలుసును. అతడింకా బ్రతుకుతాడనే ఆశవుంది. అందుచేత మాట్లాడితే అతనికి ప్రమాదం."

"అలా అనకు. మోటుతనమని యెవరన్నారు? సరే నేను వెళ్ళివస్తాను.

"గూఢచారులుంటారు. జాగ్రత్త."

"ఓ ! నాకు తెలుసును."

తల్లి పీధిగుమ్మందాటి అవతలికివచ్చి చేతిరుమాలు సర్దుకుంటున్నట్లు

నటించి ఒక్క నిముషం ఆగి ఇటూ అటూ చూచింది. జనంలో కలిసిపోయి వున్న గూఢచారులను గుర్తుపట్టింది. వాళ్ళు యేమీ యెరుగనట్లుండాలనిచేసే నటన, వాళ్ళ దొంగచూపులు ఆమెకు గుర్తే. ఎరుగున్నవాళ్లెవ్వరు కనబడకపోవడంచేత గబగబా నడిచి రోడ్డుమీదకొచ్చి జట్కాబండితీసుకుని బజారుకెళ్ళింది. ఆమె బట్టలదుకాణాలలో పినభర్త త్రాగుమోతైనట్లు, నెలనెలకి బట్టకొనవలసివస్తున్నట్లు యేమిటో విసుగుకుంటూ తిడుతూ బేరం చేసిచేసి బట్టలుకొంది. వర్తకు లెవ్వరికి కావాలి యీ గొడవ ? వైషోవికవ్ బట్టలు మార్చుకోవాలని పోలీసులు గ్రహించి బట్టలమార్కెట్టు కెవరినైనాపంపి వుంటారని ఆమె అనుమానపడి యీ ముందు జాగ్రత్తంతాపడింది. బట్టలు పట్టుకుని ఈగర్ యింటికి వచ్చింది. తర్వాత వైషోవికవ్‌ను ఊరుబయిటిదాకా సాగనంపాలసొచ్చింది. రోడ్డుమీద చెరొక ప్రక్కన నడిచి ఊరు చివరదాకా వెళ్ళారు చివర శశాంక కనుబడి వైషోవికవ్‌కు సైగచేసి శలవుపుచ్చుకుని చక్కాపోయింది.

తల్లి యింటికొచ్చేసరికి నికోలే వాకట్లో కెదురొచ్చాడు. ఎంతో విచారంతోనూ ఖంగారుతోనూ "అమ్మా ! సంగతి తెలిసిందా ? ఈగర్‌కు చాలా జబ్బుగావుందట. ఆస్పత్రికి తీసుకెళ్ళారుట. ఇప్పుడే లూడ్మిలావచ్చి కబురుచెప్పి పోయింది. నిన్నక్కడికి రమ్మనమంది" అని చెప్పేడు.

"ఎక్కడికి ? ఆస్పత్రికా ?"

"అవును. ఇదిగో యీ పొట్లంకూడా పట్టుకెళ్ళు. వైషోవికవ్‌ను జాగ్రత్తగా పంపేశావా ?"

"ఆ ! జాగ్రత్తగా"

"నేనుకూడా వస్తానులే. ఆస్పత్రికి"

ఈగర్ విషయంలో నికోలే పడుతూవున్న ఖంగారు చూచి తల్లికికూడా దుఃఖమువచ్చినది. "పాపం చచ్చిపోతాడు కాబోలు !" అనుకుంది, ఈ ఆలోచనలతో తల బ్రద్దలైపోయింది.

నిలోనా ఆస్పత్రికి వెళ్ళింది. ఒక శుభ్రమైన చిన్నగదిలో ఈగర్ మంచం మీద తలగడకానుకుని హాస్యాలాడుతూ నవ్వడంచూచి కాస్త శాంతపడింది, వైద్యుడితో సరసాలాడుతుంటే బయటనుంచే విని సంతోషించింది,

ఈగర్ :— మందంటే సంస్కరణాలన్నమాట.

వైద్యుడు :— (ఆజ్ఞార్థకంగా) ఊరికే అనవసరంగా వాగకు,

ఈ :— నేను విప్లవవాదిని. నాకు సంస్కరణాలంటే అసహ్యం.

ఈగర్ ముఖంమీద నజ్జుచూచి వైద్యుడు యేదో ఆలోచిస్తూ నిలబడ్డాడు. నిలోనా అతనిని బాగా యెరుగును. అతనిపేరు ఇవాన్ దేనిలోవిష్. అతనికి, నికోలేకు జోస్తి యెక్కువ. తల్లినెమ్మదిగావెళ్ళి ఈగర్‌దగ్గర నిలబడింది, ఈగర్

మాట్లాడలేక నాలుక వెళ్ళబెట్టి ఆహ్వానించాడు. డాక్టరు వెనక్కి తిరిగిచూచి తల్లిని పలుకరించి కూచోమన్నాడు. చేతిలో కట్ట యేమిటని అడిగాడు.

తల్లి "పుస్తకాలేమో" అంది.

"ఇతనేమీ పుస్తకాలు చదువకూడదు" అన్నాడు వైద్యుడు,

"అమ్మా! డాక్టరు నన్ను వట్టిమూర్ఖుడిని చెయ్యాలని చూస్తున్నాడు" అన్నాడు ఈగర్.

డాక్టరు చురచురచూచి "నోరుమూసుకో!" అని మందలించి యేదో పుస్తకంలో యేమిటో వ్రాసాడు.

ఈగర్‌కు ఆయాసం ఒగర్పు బయలుదేరింది. ముఖంమీద చిరిచెమట పట్టింది. నెమ్మదిగా అతనుచేత్తో చెమట తుడుచుకున్నాడు. నజ్జుచేత ముఖం అంతా మారిపోయింది. ముఖం పాండించింది. కళ్ళు గుంటలుపట్టినాయి. కళ్ళల్లో కళమాత్రం తగ్గలేదు.

"ఏమి వైద్యమోయి బాబూ. నాకు విసుగెత్తిపోయింది పడుకోవచ్చునా?" అని డాక్టరు నడిగాడు.

"వల్లకాదు"

"నువ్వెళ్ళిపోతే నేను పడుకుంటాను"

"నిలోనా! ఇతన్ని పడుకోనియ్యకు. మంచిదికాదు" అని అవతలికి వెళ్ళిపోయాడు.

తల్లి సరేనని తల ఆడించింది,

ఈగర్ తల వెనక్కి వ్రేలాడవేసుకుని కండ్లుమూసుకుని కొంచెంసేపు జార్లాపడ్డాడు. గదంతా దుఃఖం మూర్తీభవించినట్లు తోచింది. 'ఈగర్ కళ్ళుమూసుకునే "అమ్మా! నాదగ్గరకు మృత్యువు యిష్టంలేక యిష్టంలేక వస్తున్నట్లు నెమ్మదిగా వస్తోంది. నేను అందరితోనూ కులాసాగా స్నేహంగా వుండడంచేత దానికి కొంచెం విచారంగా వున్నట్లుంది" అన్నాడు.

'తల్లి చెయ్యిపట్టుకుని "ఈగర్! మాట్లాడకుండావుండు నాయనా" అంది,

"అవ్వా! కాస్సేపు ఆగితే నేనిక మాట్లాడకుండానే వుంటాను" అని ఆయాసపడుతూ మాట్లాడలేక చెప్పడం ఆరంభించాడు.

"నువ్వు ఇక్కడున్నందుకు చాలా సంతోషం. నీముఖం కండ్లు చూస్తుంటే పరమానందం, ఒక్కొక్కప్పుడు నీబ్రతుకాఖరి కేమవుతుందాఅని అనుకుంటూ వుంటాను. అందరిలాగే నీకూ ఖైదుప్రవాసం వగయిరా బాధలన్నీ కలుగుతాయి కాబోలు! ఈమాట తలుచుకుంటేనే గుండె నీరైపోతుంది. అయితే జైలంటే నీకేమైనా భయమా?"

"లేదు."

"ఎంతచెప్పినా ఖైదు మహా అసహ్యమైన స్థలం. ఖైదే నన్నీ అవస్థకు తెచ్చింది. నిజానికి నాకు చచ్చిపోవాలనిలేదు "

"ఏమో నాయనా! ఇంకా బ్రతుకుతావేమో? ఎవరుచెప్పగలరు?"

"అమ్మా! నాకు జబ్బుచెయ్యకుండావుంటే నేనింకా యీ ఉద్యమంలో బాగా పనిచేసేవాడినే. కాని యిప్పుడు లేవలేని స్థితిలో వుండడంవల్ల పని చెయ్య లేను. పనిచెయ్యలేనప్పుడు బ్రతికిమాత్రం ప్రయోజనమేమిటి? కనుక బ్రతికి వుండడం మూర్ఖత్వం, బరువుచేటు;"

"అది నిజమేకాని........................నాయనా! అల్లాగంటే ఎల్లాగ?"

తల్లికి ఆంద్రీమాటలు జ్ఞాపకానికొచ్చాయి. ఒక్కసారి ఇస్సురనుకుంది. ఈగర్ ఒగర్పు ధ్వనితో గదంతానిండి పోయింది సాయంకాలమైంది చీకటి గదిలో కొచ్చింది దానితోపాటు ఈగర్ ముఖంకూడా నల్లబడిపోయింది. చాలా బాధతో కండ్లుమూసుకున్నాడు. అతడు ప్రయాసపడుతూ ఊపిరికోసం గిలగిల లాడుతూవుంటే తల్లిచూస్తూ కొయ్యబొమ్మలా నిలబడింది. కొంచెంసేపు కునికి పాట్లు పడింది. తలుపు చప్పుడైతే లేచింది. ఈగర్ కళ్ళుతెరచి చూస్తున్నాడు. "అయ్యో నాయనా! కునికిపాట్లొచ్చాయి. క్షమించు" అంది "నయం, నువ్వే క్షమించాలి" అన్నాడు ఈగర్ ఇంటిలో లూడ్మిలా లోపలికొచ్చింది. ఈగర్ ఆమెకేసిచూస్తూ అతిప్రయాసమీద తనిచేతిని గుండెలమీద వేసుకున్నాడు.

"ఏమిటది?" అంటూ లూడ్మిలా అతనిదగ్గరకెళ్ళింది. అతడు తల్లిముఖం కేసి రెప్పవాల్చకుండా చూశాడు. ఆకండ్లెంతో ప్రకాశవంతంగా కనుపించాయి.

"ఆగు, ఆగు" అని మెల్లగా తలెత్తి చేతులుచాచి పెద్దగా ఆవులించాడు వెంటనే గభాలున తల వెనక్కివాల్చేసి "గాలి గాలి" అన్నాడు గట్టిగా. ఒక్కసారి అతని వళ్ళంతా ఝల్లుమంది. తల ప్రక్కకొరిగిపోయింది కండ్లుతెరిచే వున్నాయి. గదిలో దీపం అతని కండ్లల్లో ప్రతిబింబించింది.

"అయ్యో నాయనా!" అని తల్లి అతని చేయిపట్టుకుంది అప్పుడే చెయ్యి బరువెక్కిపోయింది లూడ్మిలా మంచం దగ్గరనుంచి లేచి కిటికీవగ్గరకెళ్ళి ఆకాశం కేసి చూసింది.

"ప్రాణం పోయింది. ప్రాణం.................. పోయింది. నిజంగా వీరుడు లాగ శాంతంగా చచ్చిపోయాడు యేమీ విచారమన్నమాటలేదు" అని విచారంతో తల్లితో చెప్పింది.

అకాత్తుగా యెవ్వరో తలమీద ఒక్కవ్రేటు. వేసినట్లు తల్లి క్రిందపడి మోకాళ్ళమీద కూచుని రెండుచేతుల్తో మొగం కప్పుకుని మెల్లగా యేడ్చింది.

౭

నిలోనా ఈగర్ రెండుచేతులను గుండెలమీద మడిచి తలగడమీద తల కాయ సర్దింది. కండ్లవెంట ప్రవాహంగా వస్తున్న నీళ్ళను తుడుచుకుంటూ నెమ్మ దిగా లూడ్మీలా దగ్గరకెళ్ళి వేళ్ళతో ఆమె జట్టు చిక్కుతీసింది. లూడ్మీలా వెనక్కితిరిగి లేచినుంచుని పెదిమెలు తడబడుతూ ఇల్లా చెప్పింది.

"నేను ఇతన్ని చిరకాలంనుంచీ ఎరుగుదును. మేము ప్రవాసంలో కలిసి ఉండేవాళ్ళం. మేమిద్దరం ఒక్కసారే నడిచివెళ్ళేం. ఖైదులో ఒక్కచోటే ఉన్నాం. ఒక్కొక్కప్పుడు ఆ జీవితం మహాదుర్భరంగా ఉంటుంది. ప్రాణం విసుగెత్తిపో తుంది. అలాంటప్పుడు చాలామంది నీరుకారిపోతారు కూడాను. కాని ఈగర్ అటు వంటి సమయాల్లోకూడా మహా సంతోషంగా ఉండేవాడు. నవ్వుతూ గంతులేస్తూ. హాస్యాలాడుతూ కష్టాన్ని మరిపించేసేవాడు. తనలోపాటుఉండే బలహీనుల కెంద రికో ఉషారు కలిగించేవాడు. ఎప్పుడూ అందరితో చాలా ఆప్యాయంగా మాట్లాడే వాడు. మంచి జాగ్రత్తమీదకూడా ఉండేవాడు: సైబేరియాలో నిర్వ్యాపారత్వం మనుష్యుల్ని పూర్తిగా పాడుచేసి, జీవితంమీద రోతపుట్టిస్తుంది. అలాటి విసుగనేది లేకుండా ఏమేమిచేసేవాడోకదా! అటువంటి స్నేహితు డింకెక్కడ? జీవితంలో అతనికెన్నో కష్టాలున్నాయి. కాని ఎన్నడూ ఎవరితోటీకూడా తనబాధల సంగతి చెప్పినట్లు నేనువినలేదు. నేనందరికన్న అతనితో దోస్తీగా ఉండేదాన్ని. అతడు కూడా నన్నెంతో ప్రేమతో ఆదరించేవాడు. అతడు నాకు మహోపకారంచేశాడు, కాని ఎన్నడూ బదులుకోరలేదు. ప్రతిఫలమనేది అతని దృష్టిలో లేనేలేదు."

లూడ్మీలా ఈగర్ దగ్గరకు వచ్చి వంగి అతన్ని ముద్దుపెట్టుకుంది. అగ్ని పర్వతంలా పొంగివచ్చిన దుఃఖాన్ని ఆపుకొని రోదనస్వరంతో శలవు తీసుకుంది.

"మిత్రమా! మిత్రమా! హృదయపూర్వక వందనములు. శలవు. నీవలెనే సంశయమనేది లేకుండా జీవితమంతా ఈ ఉద్యమములో ధారపోస్తాను. శలవు" ఏడుస్తూ ఆమె తనతలను ఈగర్ కాళ్ళముందర పెట్టింది. తల్లి లోప ల్లోపల దుఃఖిస్తోంది. కన్నీరు చెక్కిళ్ళమీదనుండి కాలువలుగట్టినాయి. ఎంత ఆపుకున్నా ఆగలేదు. ఈగర్‌ను ఎంతో ప్రశంసించి లూడ్మీలాను ఓదార్చాలని ఆమె సంకల్పం. కన్నీరుకారుస్తూ అతనిముఖంకేసి చూస్తూకూచుంది.

ఇంతలో డాక్టరు ఇవాన్‌దే నిలోవిష్ వచ్చాడు, గది మధ్యనిలబడి జేబుల్లో చేతులెట్టుకుని తొందరగా "ఎంతసేపయింది?" అని అడిగాడు,

తల్లి మాట్లాడలేదు. లూడ్మీలా అసలే మాట్లాడలేదు. అతనే దగ్గరకెళ్ళి ఈగర్ చెయ్యిపట్టుకుని "ఇందులో క్రొత్తేమిటి? ఇతని గుండెలుచూస్తే ఆరునెలల క్రితం చచ్చిపోవలసిందే" అన్నాడు.

సామాన్యంగా గైంగైమని బొబ్బలెట్టే డాక్టరు నోటివెంబడి మాటేరాలేదు. గోడకానుకుని గడ్డం సవరించుకుంటూ, కళ్ళు నలుపుకుంటూ నిలబడి లూడ్మిలాను తల్లినిచూశాడు "సరి నేను మూడోవాడిని" అన్నాడు. ముగ్గురు ఏమీ తోచకుండా ఆకాశంకేసిచూస్తూ నిలబడ్డారు. డాక్టరు పెదిమలు విరుచుకుంటూ కళ్ళజోడు తుడుచుకోవడం ఆరభించాడు పట్టణం నిశ్శబ్దంగా వుంది. లూడ్మిలా గడగడ వణుకుతోంది కండ్లవెంబడి ప్రవాహం ఆగనేలేదు. ఆ ముగ్గురూ అలాగే అంధ కారాన్ని చూస్తూ కొయ్యబొమ్మల్లాగ నిలబడిపోయారు.

ఇక అక్కడవుండవలసిన అవసరంలేదనుకుని తల్లి నెమ్మదిగా బయటి కొచ్చింది ఇంటికొచ్చేటప్పుడు తల్లి ఆలోచనంతా లూడ్మిలామీదేవుంది. పాపం గట్టిగా యేడ్వడానికయినా వీలులేకపోయిందిగదా అని చింతించింది. ఈగర్ శవాన్ని, ఆసుపత్రిని, డాక్టరును తలుచుకుంటూ గబగబా అడుగేసి యింటికి చేరుకుంది.

ఆమరుసటి రోజంతా ఈగర్ అంత్యక్రియల ప్రయత్నమే. సాయంత్రం నికోలే, సోఫియా, తల్లి, కూచుని టీ త్రాగుతూ ఈగర్ సంగతి మాట్లాడుకుంటుం టుంటే శశాంక సంతోషంతో చకాచకా వచ్చింది వాళ్ళంతా విచారంలో ఉంటే ఆమె సంతోషించడం చిత్రంగా కనుపించింది, నికోలే ఆమెకేసిచూచి నవ్వుతూ "ఏమిశశాంకా! నీధోరణిచూస్తే ఇవ్వేళ నువ్వుచాలా మారిపోయినట్లు కని పిస్తుందే." అన్నది

"అయితే అవచ్చు" అని నవ్వింది శశాంక,

తల్లి ఆమెకేసి విలక్షణంగా చూసింది. సోఫియా కొంచెం మందలింపు స్వరంతో "మేమిప్పుడు ఈగర్ సంగతి మాట్లాడుకుంటున్నాం" అంది.

శశాంక ఈగర్‌నుగురించి ఇలా ప్రశంసించడం ఆరంభించింది. "ఏమి దివ్యమయిన మనిషండీ! ఆ నమ్రత. ఆ తెగింపు, ఆచొరవ మరెవ్వరికీరాదు. ఎప్పుడూ విచారించినట్లే కనుబడేవాడు కాడు. ఎప్పుడూ హాస్యాలాడుతూ ఉండే వాడు. పనిచెయ్యడంలో మహాగట్టివాడు. ఈ విప్లవానికంతా అతనొక చిత్ర కారుడు. విప్లవభావాల్ని ప్రచారం చెయ్యడంలో అతనిశక్తి అద్భుతం వాటిని ప్రజలకు నచ్చచెప్పడంలో అసమానుడు. అసత్యం, మోసం, దౌర్జన్యం మొద లైన అకృత్యాలను గురించి ఏమిచిత్రంగానో చెప్పేవాడు. చెపితే కళ్ళకు కట్టి నట్లుండాలసిందే. అతని అద్భుతమైన హాస్యంచేత ఎంత కోపధారులనైనా నవ్వించేవాడు. హాస్యంలోను వెర్రిహాస్యంకాదు. తనభావాలన్నీ విస్పష్టంగా తెలియ చెప్పేహాస్యం. నేనాతని కెంతో కృతజ్ఞురాలిని. ఆవేళాకోలపు మాటలను ఉత్సా హాన్ని ఎప్పటికీ మరచిపోను. నాకెప్పుడైనా సంశయాలొస్తే నివారణ చేసుకునేం దుకు అతని ఉపదేశాలు ఎంతో ఉపయోగంగా ఉంటాయి. ఇంతెందుకూ! అత నంటే నాకెంతో ప్రేమ."

శశాంక కొంచెం విచారంతో ఈ ప్రశంసచేసినా మొఖంమీద మాత్రం సంతోషం కనుబడుతోనే ఉంది. (ఒక్కొక్కప్పుడు మనుష్యులు తమసోతామే ఎంతో ఆలోచనలోపడి సంతోషిస్తూఉంటారు అది తమకు ప్రమాదకరమైనదైనా సరే. ఆ ఆలోచనలో పడున్నప్పుడు ఎంత దుఃఖాన్నయినా మ్రింగగలుగుతారు. అసంతోషం వాళ్ళ హృదయాన్ని రాసేస్తుంది ఈగర్ మరణ సందర్భంలో నికోలేసోఫియా నిలోనాలకు విచారంతప్ప మరొకభావానికి స్థానమేలేదు.) శశాంక కూడా తమతోపాటే ఈగర్‌నుగురించి విచారించాలనే అభిప్రాయంతో సోఫియా ఆమెతో "మరి ఈగర్ ఇప్పుడు చచ్చిపోయాడు" అంది. శశాంక ఎగాదిగా చూసింది. తలవంచి ఏమిటో ఆలోచించింది. "ఈగర్ చనిపోయాడు. కాని నిజానికి నాకామాట నమ్మడానికి మనసొప్పడమే లేదు" అంది.

"నీకు మనసొప్పకపోయినా అతను చచ్చిపోయినమాట నిజం" అన్నాడు నికోలే.

శశాంక గదిలో ఒక్కక్షణం పచారుచేసింది. ఛటుక్కున ఆగి చిత్రమైన స్వరంతో ఇల్లాచెప్పింది.

"చచ్చిపోవడమా ? అంటే ఏమిటి ? ఏమి చచ్చిపోయింది ? నాకు ఈగర్ మీద ఉండేభక్తి చచ్చిపోయిందా ? అతనిమీద నాకుండే సోదరవాత్సల్యం చచ్చిపోయిందా ? అతని ఉపదేశాలు నశించినాయా ? అతడొక వీరాధివీరుడనే భావం మనలో అంతమైందా ? లేదు. అతనియందుండే ఆధిక్యత చచ్చిపోలేదు. చచ్చిపోదు. దానినెన్నటికిని నేను మరువను. ఎవడైనా ఒకమనిషి చచ్చిపోయాడని చెప్పడం చాలా దురుసుతనమని నా అభిప్రాయం. ఎవరైనా ఒకమనిషి స్వార్థత్యాగబుద్ధితో సత్యంకోసం, సౌఖ్యంకోసం వీరోచితమైన పనులుచేస్తే వాటిని మనం మరచి పోనంతకాలం అతడు మరణించడు: మనుష్యులు కీర్తి దేహాన్ని ధరించి శాశ్వతంగా జీవించివుంటారు. మనిషియొక్క భౌతిక దేహంతోపాటు అవినాశకరమైనట్టి వాళ్ళ ఆత్మలను పూడ్చిపెట్టికూడదు. దేవాలయం శిథిలమైపోవచ్చును కాని దేవునికి నశింపులేదు."

ఈ ఆలోచనలవల్ల కలిగిన ఆవేశంతో ఆమె మైమరచిపోయింది. బల్ల మీద ఆనుకుని కాస్తమెల్లగా మళ్ళీ ఆరంభించింది. "నేనిందాకటనుంచి బహుశా తెలివితక్కువగా వాగుతున్నాను కాబోలు. జీవితంయొక్క అద్భుతమైన వివిధత్వం, చిత్ర చిత్రమయిన దృశ్యాలుచూస్తే నాకు ఒక విధమయిన నిషా ఎక్కింది ఈ బ్రతుకంతా ఒక పెద్దమాయలా తోస్తోంది."

"శశా ! ఇవ్వేళ చాలా ఉషారుగా ఉన్నావే ? ఏదైనా విశేషం ఉందేమిటి?" అని సోఫియా నవ్వుతూ అడిగింది.

"అవును ................ ఒకరాత్రి అంతా వైషోవికవ్‌తో మాట్లాడాను. ఇదివరకు అతనంటే నాకు అసహ్యం. ఎప్పుడూ మందకొడిగాను, మోటుగాను

కనుపించేవాడు. అందరిమీద కస్సూ బుస్సూమంటూ చిరాకు పడుతూ ఉండేవాడు. అన్నింటిలోనూ తానే పెద్దగా ముందుకొచ్చి 'నేను నేను, నా' అంటూ వచ్చేవాడు. ఇప్పుడు అతనూ అందరినీ 'సోదరులు' అంటున్నాడు అతనంటుంటే వినితీరాలి. అతని హృదయం పూర్తిగా మారిపోయింది అమాకుడైపోయాడు. కల్లా కపటం లేదు. పని చెయ్యాలని అతిఉత్సాహపడుతున్నాడు అతడు తన సత్తా ఎంతవర కుందో గ్రహించాడు అన్నిటికన్నా ముఖ్యమైన విషయమేమిటంటే, ఆతనిలో నిజమైన సోదరభావం, మైత్రి ఏర్పడింది. అదొక్కటుంటే ఎన్నికష్టాలనైనా జయించవచ్చును."

తల్లి శశాంక మాట్లాడినంతసేపూ శ్రద్ధగావింది. ఇదివరకు మాదిరిగా అతి ముభావంగా ఉండకుండా ఇంత సంతోషంగా నవ్వుతూ మాట్లాడుతూవుంటే విని చాలా సంతోషించింది. మనస్సులో "పాషాగతేమిటి?" అనుకుంది.

శశాంక తన సంగతిచెప్పడం ఆరంభించింది,

"వైషోవికవ్ ఆలోచన ఇప్పుడెంతసేపూ తన మిత్రులనుగురించే, అతను నాతో ఇంతసేపటినుంచీ చెప్పుతున్న సంగతేమిటో తెలుసునా? వాళ్ళని జైల్లో నుంచి తప్పించవలసిన అవసరాన్ని గురించే. అది మహా సులభమైన పనంటాడు.

సోఫ్యా తలెత్తి "మరి నువ్వేమనుకుంటున్నావు? సాధ్యమవుతుందం టావా?" అని అడిగింది. తల్లి టీ గిన్నె బల్లమీదపెడుతూ గడగడ వణికింది. శశాంక బొమలు ముడిచింది. ఒక్కక్షణం ఆలోచించి ఖంగారుపడి నవ్వుతూ "అతడు సాధ్యమేనని దృఢంగా చెప్తాడు, అతను చెప్పేదంతా సరిగావుంటే మనం ప్రయత్నంచేసి చూడవలసిందే, అది మన ధర్మం" అని చెప్పింది.

తల్లి "అయ్యో అమ్మయ్యో" అనుకుని నవ్వింది సోఫ్యా నికోలేకూడా నవ్వేరు శశాంక వాళ్ళు నవ్వడం కనిపెట్టింది. తెల్లబోయింది. కాస్త కష్టం తోచింది.

"ఓహో! మీరు నవ్వుతున్నారా? తెలిసిందిలెండి. ఇందులో నాకేదో కొంత స్వార్థం వుందనుకుంటున్నారు కాబోలు"

"ఎందుచేత అల్లా అనుకుంటున్నావు శశా?" అని అడిగింది సోఫ్యా. శశాంక ఖంగారుపడి తెల్లపోయింది.

"సరే. ఇక నేనేమీచెప్పను. ఈవిషయం నిర్ధారణచెయ్యడంలో నేనేమీ చెప్పదలచుకోలేదు. మీకుతోస్తే చెయ్యచ్చు" అని యేదో చెప్పబోయింది. నికోలే మాటకడ్డొచ్చి "శశా! ఆగు" అన్నాడు మెల్లగా. తల్లి కీరహస్యం అర్థమైంది. శశాంకదగ్గరకెళ్ళి అమెతలను ముద్దెట్టుకుంది. శశాంకనుచూస్తే ఆమెకు జాలేసింది. సోఫ్యా శశాంక ప్రక్కకొచ్చి కూచుని ఆమెభుజంమీద చెయ్యేసి "నువ్వు చాలా చిత్రమైన మనిషివి శశా"అంది. "అవును. బహుశా నేను చాలా తెలివితక్కువగా మాట్లాడుతున్నాను కాబోలు"

నికోలే కొంచెం గట్టిగా "చాలు చాలు. సాధ్యమైతే వాళ్ళని తప్పించాలనే విషయంలో ఎవరికీ భేదాభిప్రాయంలేదు. కాని అసలు రోపలవున్నవాళ్ళ అభిప్రాయమేమిటో, వాళ్ళకెంతవరకు ఇష్టమో తెలుసుకోవాలి" అన్నాడు.

శశాంక తలవంచుకుంది. సోఫ్యా సిగరెట్టు ముట్టించి తమ్ముడికేసి చూచింది. తల్లి 'వాళ్ళొద్దంటారా?' అని నిట్టూర్పు విడిచింది. ఎవరూ ఆమెకు సమాధానం చెప్పలేదు.

నికోలే 'సరే నేను వైషోవికవ్‌తో మాట్లాడాలి.'

శశాంక :— అల్లాగే. అతడు రేపు ఎక్కడుండేది ఎప్పుడుండేది కనుక్కొని చెపుతాను.

సోఫ్యా :— అయితే ఇప్పు డతడేమి చెయ్యదలచుకున్నాడు?

శశాంక :— ఒక క్రొత్త అచ్చు యేర్పాటుచేసి అతన్ని అందుకో వుంచడానికి నిశ్చయం చేసేం. అందాకా అక్కడే, ఆ ఫారెస్టరు దగ్గరే వుంటాడు.

శశాంక తలవాల్చుకుంది. ముఖంమీద, వచ్చినపుడున్న సంతోషంలేదు. నికోలే గిన్నెలు కడుగుతూ వున్న తల్లిదగ్గరకెళ్ళి "అమ్మా! నువ్వు ఎల్లుండి పాషాను చూడడానికెళ్ళి అతనికొక చీటిముక్క అందచెయ్యాలి. తెలిసిందా? ఈ విషయంలో అతని అభిప్రాయమేమిటో తెలియాలి" అన్నాడు

"సరే తెలిసింది. చీటీ జాగ్రత్తగా అందిస్తాను. యేమీ ఫరవాలేదు. ఆ పనంతా నాకు తెలుసు. మీరు చెప్పనక్కరలేదు" శశాంక అందరి దగ్గర శలవు పుచ్చుకుని వెళ్ళిపోయింది. "పాపం! వెర్రిపిల్ల" అంది సోఫ్యా.

"అవునవును" అని దీర్ఘంతీసేడు నికోలే. సోఫ్యాదగ్గర కెళ్ళి "అమ్మా! నీ కిల్లాంటి కూతురుంటే ఇష్టమేనా?" అని అడిగింది.

తల్లి "ఆహా! నా కళ్ళు చల్లగా, వాళ్ళిద్దరూ ఒక్కరోజయినా కలిసి వుంటేనా! ఒక్కరోజయినా చాలు" అంది. "నిజమే. ప్రతివాళ్ళకీ కాస్త సౌఖ్యం మంచిదే" అంది సోఫ్యా.

"కాని కొంచెం సుఖంకోరే వాళ్లెవ్వరూ వుండరు. సుఖం మళ్ళీ యెక్కువయితే దానికి విలువలేదు" అన్నాడు నికోలే.

సోఫ్యా పియానో దగ్గరకూచుని నెమ్మదిగా పాటపాడడం ఆరంభించింది.

౮

మరునాడు ఉదయం హాస్పిటలు గేటువద్ద చాలామంది స్త్రీ పురుషులు గుంపుగాచేరారు. ఈగర్ శవాన్ని వైభవంగా తీసుకెళ్ళాలని కాచుకున్నారు. రహస్యపు పోలీసులుకూడా ఆ గుంపులోనే చేరి ఎవళ్లెవళ్ళేమనుకుంటున్నారో, ఎవరెవరి ముఖాలు ఎట్లావున్నాయో కనిపెడుతున్నారు. రోడ్డు కవతలివైపున ఒక ముఠా పోలీసులు రివాల్వర్లతోసహా సిద్ధంగా నిలబడ్డారు. రహస్యపు పోలీసుల గీర్వాణం, పోలీసువాళ్ళ అహంకారపు నవ్వు ప్రజలను రెచ్చగొడుతున్నాయి ఆ కోపాన్ని తగ్గించుకొనేటందుకు ప్రజలు తమలోతామే వేళాకోళాలాడుకుంటున్నారు. కొందరు వాళ్ళకేసి చూడకుండా ఇంకొకవైపుకు తిరిగి మాటాడుకుంటున్నారు. మరికొందరు కోపం ఆపుకోలేక కత్తి కఠారులేని ప్రజల నోటిమాటలకే ప్రభుత్వం ఇంత బెదిరిపోతోందేయని వెక్కిరించడం ప్రారంభించారు

తల్లికూడా ఆ గుంపులోనే చేరింది. ఇదివరకు పరిచయమైన ముఖాలకేసి వెలవెలబారచూస్తూ 'అయ్యో చాలామంది లేరే?' అనుకుంది............ ఆసుపత్రి గేటులోనుంచి శవాన్ని మోసుకొచ్చారు. శవపేటికంతా ఎఱ్ఱని పట్టీలతో అలంకరించారు. శవం బయటికి రావడంతోనే ప్రజలంతా నెత్తిమీద టోపీలుతీసి గౌరవించారు ఇంతలో ఒక పెద్ద పొడుగాటి బుర్రమీసాల పోలీసు ఆఫీసరు జనాన్ని ప్రక్కకు గెంటుకుంటూ గుంపులోకి వచ్చాడు. అతనివెంబడే జోళ్ళు శబ్దంచేసుకుంటూ సిపాయిలు వచ్చారు అంతా శవాన్ని ముట్టడించారు. ఆఫీసరు బిగ్గరగా "ఎఱ్ఱపట్టీలు తీసెయ్యండి" అని ఆజ్ఞాపించాడు. జనం అంతా చుట్టుకున్నారు. బిగ్గరగా కేకలు పెట్టారు. త్రొక్కుళ్ళాడేరు. కొందరు మొగాలు తెలవేశారు. కొందరికి గ్రుడ్లల్లో నీళ్ళుతిరిగినాయి. "ఏమిటాదౌర్జన్యం" అని ఎవ్వడో ఒక యువకుడు కేకవేశాడు. జనంగోలలో అది వినబడలేదు. తల్లికికూడా కడుపు మండిపోయింది.

"ఎవరి ఇష్టప్రకారం వాళ్ళు వాళ్ళమిత్రులను పూడ్చిపెట్టుకోడానికి కూడా వీళ్ళ అడ్డేమిటి? వీళ్ళ ఉద్దేశ్యమేమిటీ?" అంది తల్లి ప్రక్కనున్న ఒక యువకుడితో.

గోల ఎక్కువైంది. శవపేటిక జనం నెత్తిమీద ఊగిసలాడింది. ఎఱ్ఱ పట్టీలు గాలిలో జండాల్లాగ ఎగిరినాయి ఏమి గలాటా వస్తుందోయని తల్లి గడగడలాడింది.

"వాళ్ళు అంత మోటుతనానికి దిగితే మనవాళ్ళు నెమ్మదిగా ఊరుకుని ఆ పట్టీలు తీసేస్తేనే మంచిది. 'మరి ఏంచేస్తాం?" అని మెల్లగా తల్లి ప్రక్కన నున్నవాళ్ళతో చెప్పింది.

ఇంతలో ఎవ్వడో ఆధ్వనినంతా ముంచేటట్లు అరిచాడు;

"బ్రతికున్నన్నాళ్ళు యమబాధలుపెట్టి ప్రాణంతీశాస. అంత్యక్రియలలో నైనా జోక్యం కలిగించుకోకండి. నిక్కచ్చిగా చెపుతున్నాం."

ఇంకొక యువతికాబోలు గట్టిగా మధురస్వరంతో యేదోపాట ఆరంభించింది.

"ఏయి, యాకోలేవ్! ఎర్రపట్టీలు లాగెయ్యి. తెంపేసెయ్యి" అని ఆఫీసరు ఆజ్ఞయిచ్చాడు. తల్లి కళ్ళుమూసుకుంది. కత్తి పరపరలాడే చప్పుడు వినబడింది. జనం చప్పట్లుకొట్టి అల్లరిచేస్తారనుకుంది. కాని అల్లాంటిదేమీ జరుగలేదు.

ప్రజలు ఈఅవమానాన్ని సణుగుతూ భరించారు. తమ అశక్తతకు అసహ్యపడుతూ గట్టిగా ధ్వనిచేశారు. ఎర్రపీలికలు తీసేయ్యడంతోటే శవపేటిక అలంకార హీనంగాఉంది. శవం ముందుకుసాగింది. శవాని కిరుప్రక్కలా రోడ్డుమీద గుర్రపు పోలీసులు కాపలాకాశారు. జనసంఖ్య అఖండంగా పెరిగిపోయింది. రోడ్డంతా జనమే. తల్లి బాగా వెనుకబడింది. జనం గుంపువల్ల ఆమెకు శవం కనుపించడమేలేదు. వెనుకకూడా గుర్రపు పోలీసులున్నారు. వాళ్ళప్రక్కనే కత్తులు చేత్తోపుచ్చుకొని మామూలు పోలీసులుకూడా నడుస్తున్నారు. రహస్యపు పోలీసులమాట చెప్పనక్కరలేనేలేదు. ఎక్కడచూచినా మనుష్యుల మొగాన్ని పరీక్షచేస్తూ వాళ్ళేప్రత్యక్షం. అనేకమంది దారిలో శవానికి దండాలుపెట్టి సెలవు తీసుకుంటున్నారు. ఇంకొకరెవరో పాటపాడవద్దని గట్టిగా కేకవేశారు. ఆకేకతో జనం శాంతపడ్డారు. పాటలు మానేశారు. గుసగుసలు తగ్గిపోయినాయి. అడుగుల చప్పుడుతప్ప వేరే ధ్వనిలేదు. ప్రజలు తమదుఃఖాన్ని, అవమానాన్ని కడుపులో పెట్టుకున్నారు అడుగుల చప్పుడెక్కువయింది. జనం తలయెత్తి చూస్తున్నారు. గాలివల్ల దుమ్మురేగి ప్రజల కళ్ళుకప్పింది. తల్లికి పురోహితుడు గిరోహితుడు లేకుండా ఏమీ ఆర్భాటంలేని ఈ అంత్యక్రియలు చూస్తే మనస్సుకి చాలా కష్టం తోచింది. మనుష్యుల మొగాలు కోపంతో మటమటలాడుతున్నాయి. అట్టేమంది లేకపోయినా వీళ్ళనిచూస్తే అధికారులకింత భయమెందుకూ? అని తనలోతానే ఆలోచించుకుంటూ తలవంచుకుని వెనకాలవెళ్ళింది.

ఊరేగింపు స్మశానభూమిదగ్గరకు చేరింది. ఖాళీస్థలంకోసం వెతికి చివరకొకచోట కూర్చున్నారు. జనమంతా సమాధులచుట్టూ చేరారు. పోలీసులు వరుసగా తమ కెప్టెనుకేసిచూస్తూ నిలబడ్డారు. ఒక పొడుగాటి యువకుడు ఈగర్‌సమాధిమీద నిలబడ్డాడు. వెంటనే "సోదర సోదరీమణులారా" అన్నాడు పోలీసుకెప్టెను.

ఆ యువకుడు "కామ్రేడ్సు" అని అంతకన్నా బిగ్గరగా అరిచాడు.

"నే చెప్పేమాట వినండి. పోలీసుకమీషనరు ఉత్తర్వుప్రకారం మీరెవ్వరూ కూడా యేమీ ఉపన్యాసాలు ఇవ్వకూడదని నేను ఆజ్ఞాపిస్తున్నాను." అన్నాడు కెప్టెను.

ఆ యువకుడు మెల్లగా ప్రారంభించాడు ఉపన్యాసం.

"మిత్రులారా! నేను కొద్దిగామాత్రమే మాట్లాడదలచుకున్నాను. మిత్రులారా! మనకు పరమమిత్రుడును, గురుతుల్యుడునైన ఈగర్ సమాధిముందర అతనికోరిక నెన్నడును మరిచిపోమని మనము గట్టిగా శపథము చేయవలసియున్నది. మన దేశముయొక్క దౌర్భాగ్యమున కంతకూ మూలమై మనలను పీల్చి పిప్పిచేస్తున్నట్టి ఈనిరంకుశత్వమునకు సమాధికట్టేవరకు మనము విశ్రమింపకుందుముగాక!"

పోలీసుకెప్టెను అతనిని అరెస్టుచెయ్యమని ఆజ్ఞాపించాడు. ఆగోలలో ఆమాట యెవ్వరికీ వినబడలేదు.

"నిరంకుశత్వం నాశనమగుగాక!" అనే జయధ్వానాలు ఆకాశాన్ని అంటాయి. పోలీసులు ఆ ఉపన్యాసకుని ముట్టడించారు. జనంకూడా చుట్టేశారు. జనంమధ్యనుంచే "స్వాతంత్ర్యము చిరస్థాయి యగుగాక! స్వాతంత్ర్యముకొరకే మరణించెదముగాక!" అని చేతులు ఊపుతూ బిగ్గరగా కేకలేశారు.

తల్లి ఆక్షణంలో కొంచెం భయపడింది. కళ్ళుమూసుకుంది. ప్రజల గోల వల్ల ఆమెచెవులు దిబ్బళ్ళు పడిపోయాయి. కాళ్ళు గడగడ వణికిపోయాయి. ఊపిరి సరిగా పీల్చలేకపోయింది.

పోలీసుల యీలలు బుయ్యిమని రేగేయి. కెప్టెను యేమేమిటో జోరుగా అరుస్తున్నాడు. ఆడవాళ్ళు భయభ్రాంతులై అరిచారు శ్మశానం అంతా అల్లకల్లోలమైపోయింది. ఇంతగోలను మించి ఢంకా మ్రోగించినట్లు ఆయువకుని శబ్దంలేచింది

"మిత్రులారా! శాంతం, శాంతం మర్యాద కాపాడుకోండి! తొందరవద్దు. నన్ను వెళ్ళనియ్యండి! దారియివ్వండి"

తల్లి తలయెత్తిచూసింది. అప్రయత్నంగానే ముందుకువెళ్ళింది. ప్రక్కనే పోలీసులు ఆయువకుని ముట్టడించి అతనిదగ్గరకువచ్చే జనాన్ని త్రోసిపారేస్తున్నారు సన్నీలు జనం తలలమీద తళతళలాడుతూ నృత్యాలుచేస్తున్నాయి. విరిగిపోయిన కర్రముక్కలు యెగురుతున్నాయి. పెనుగులాడే ప్రజల రోదనధ్వనులు ఆర్తనాదాలు లేచాయి పోలీసు అధీనంలోనున్న యువకుడు అతి నిశ్చలమైన కంఠంతో "సోదరులారా! మీశక్తి వృథాచేసుకోకండి" అని హెచ్చరించాడు

అతని హెచ్చరిక వృథాపోలేదు ప్రజలంతా చేతిలోనికర్రా, కంపా అవతలపారేసి ఒక్కొక్కళ్ళే బయటికి.పోయారు తల్లి తాను ముందుకు చొచ్చుకువెళ్ళింది. అక్కడ నికోలే జనాన్ని హడావిడిగా వెనక్కి తోసేస్తూ "మీకేమైనా మతిపోయిందా? కొంచెం తమాయించుకోండి"అని అరుస్తూ ఉండడంచూసింది.

అతనిచెయ్యి యెర్రగా కనబడింది.

"నికోలే! నువ్వెళ్ళిపో"అని అతనికి సలహాయిచ్చింది.

"సరి సరి. నువ్వెక్కడికి? నిన్నుకూడా కొడతారు" అంటూ ఎక్కడ

నుంచో హడావిడిగావచ్చి సోఫియా ఆమెచెయ్యి పట్టుకుంది. ఆమె రెండవచేతితో యెవరో ఒకచిన్న కుర్రవాడిని పట్టుకుంది. అతడు గీసుకుపోయిన తన ముఖాన్ని రెండుచేతులతో కప్పుకుని "నన్ను పోనియ్యండి ఇదో పెద్దదెబ్బకాదు. ఫరవా లేదు" అంటున్నాడు.

"ఈ కుర్రాడిని జాగ్రత్తగా యింటికితీసుకువెళ్ళి, అతని ముఖానికి కట్టు కట్టించు" అని సోఫియా ఆపిల్లవాడిని తల్లికప్పచెప్పి "తక్షణం వెళ్ళిపో, లేకపోతే నిన్నుకూడా అరెస్టు చేస్తారు"అని హడావిడిపెట్టి వెళ్ళిపోయింది.

ప్రజలు నాలుగువైపులా చెల్లాచెదరైపోయారు. పోలీసులు వాళ్ళవెంబడి తిట్టుకుంటూ తరిమేరు.

నిలోనా ఆకుర్రవాడి ముఖం తన జేబురుమాలుతో తుడిచి "త్వరగాపద నాయనా. నీపేరేమిటి?" అని అడిగింది.

"ఇవాన్" అన్నాడు నోట్లోంచి రక్తం చిమ్మింది, "నన్ను గురించి పెద్ద ఆదుర్దా పడనక్కరలేదు నాకేమీ దెబ్బతగిలినట్లులేదు. వాడు నన్ను కత్తి పిడి కిటితో తలమీద ఒకటేశాడు. నేను మళ్ళీ నాచేతి కర్రతో ఒక్కపెట్టు పెట్టాను. దానితో తనపెద్దల్ని తలచుకుని మొర్రోమన్నాడు. (రక్తమయమైన తన పిడికిటిని చూపిస్తూ) ఉండండి. ఈసారి ఇదికాదు. ఉండండి. మాకూలినాలి జనమంతా లేచి తిరుగబడిన రోజున దెబ్బలాట లేకుండానే ఉక్కిరిబిక్కిరిచేసి పారేస్తాం"అని ఇవాన్ తన సంతృప్తిని వెల్లడించాడు.

తల్లి తొందరబెట్టి శ్మశానభూమి బయటగేటుదాకా తీసుకెళ్ళింది. అక్కడ కూడా పోలీసులు దాక్కొని ఉండి, తమమీద పడతారేమోనని భయపడింది. అవ తలికివెడితే యేమీలేదు. కాస్త తాపీపడ్డాక "అబ్బాయీ! నీముఖం కట్టు కట్టనియ్యి" అంది.

"ఫరవాలేదు అల్లాగే ఉండనియ్యి! ఇల్లా బయటికి వెళ్ళడానికి నాకేమీ అభిమానంలేదు. మా దెబ్బలాట గౌరవంగానే ఉంది. అతను నన్నొకటేశాడు. నేను అతన్ని ఒకటేశాను. కాయకి కాయచెల్లు" అన్నాడు ఇవాన్.

నిలోనా అతని గాయానికి కట్టుకట్టింది, ముఖంమీద యెర్రగా రక్తం ప్రవ హిస్తుంటే ఆమె కెంతో భీతి, జాలి కలిగింది. ఆ వేడిరక్తం చేతికి తగిలేసరికి ఒళ్ళు ఝుల్లుమంది. ఇవాన్ తన నోటికడ్డంగా కట్టినకట్టు తప్పించుకుని చిరునవ్వు నవ్వుతూ "ఏమమ్మోయి! నన్నెక్కడికి తీసుకెడుతున్నావు? నా అంతట నేనే నడవగలను" అన్నాడు.

కాని నీరసంచేత అతని చేతులు కాళ్ళు కొంకరులు పోవడం ఆమె గ్రహిం చింది. ఆ నీరసంతోటే మాట్లాడడం ఆరంభించాడు.

"నేను తగరం పనిచేస్తాను. నువ్వెవరవు? ఈగర్ ఇవానిష్ కూటంలో 12 గురిలో మేము ముగ్గురం తగరం పనివాళ్ళమున్నాం. మాకు ఈగర్ అంటే

ప్రాణం. అతడు చిరంజీవి అవుగాక! నాకు దేవుడిమీద నమ్మకంలేదు, కాని, ఈ కుక్కలే, వాళ్ళు పెట్టే బాధలన్నీ కిక్కురుమనకుండా మనవాళ్ళు అనుభవిస్తూ వుండాలని, దేవుడిపేరుచెప్పి దగాచేస్తారు." వీధిలో ఒకజట్కాబండి వెడుతూంటే తల్లి దానిని ఆపి అందులో ఇవాన్ నెక్కించి అతని చెవులో యేమీ మాట్లాడ వద్దని చెప్పింది. అతని ముఖం తన జేబురుమాలుతో జాగ్రత్తగా కప్పింది.

అతడు ఆ కట్టు ఊడదీసుకోవడానికి ప్రయత్నించాడు. కాని కట్టు ఊడి రాలేదు. అల్లాగే గొణగడం ఆరంభించాడు.

"నేనీ దెబ్బలను చస్తే మరచిపోతానా? మీ బదులు ఇంత కింతా తీర్చు కుంటాను లెండి! నాకసి తీర్చుకు తీరుతా. ఈగర్‌తో ఇంకొక విద్యార్థిఉన్నాడు. అతనిపేరు టిటావుష్. అతడు మాకు రాజకీయ అర్థశాస్త్రం చెపుతూ వుండేవాడు. చాలా కరుకుమనిషి. గట్టివాడు. అతన్ని కూడా అరెస్టు చేశారు."

తల్లి అతని మాటలు వినబడకుండా ఉండాలని అతని తలను రొమ్ము మీదకు లాగుకుంది. అతనికే ఆయాసంవచ్చి మాట్లాడ కూరుకున్నాడు. ఏ మూల నుంచి పోలీసులువచ్చి ఇతని కట్లుచూచి అనవాలుపట్టి పట్టుకుని చంపేస్తారో అని తల్లికి భయం. అందుచేత వీధుల్లో మూలమూలలు జాగ్రత్తగా పరీక్షచేసింది. జట్కాబండివాడు "ఏమిటి వాగా సారాయి పుచ్చుకున్నాడా ఏమిటి?" అని వెనక్కితిరిగి తల్లి నడిగాడు.

"ఆ; కాస్తా కూస్తా కాదు"

"నీ కొడుకా?"

"అవును. చెప్పులు కుడుతూవుంటాడు. నాకు వంటపని" ఒక్కసారి కొరడాతో గుర్రాన్ని అదలించి బండివాడు లోకాభిరామాయణం ఆరంభించాడు. "ఇప్పుడే శ్మశానభూమిదగ్గర ఏదో గలాటా జరిగిందని విన్నాను. వాళ్ళెవ్వరో, ఒక రాజకీయవేత్త, అంటే గవర్నమెంటుకు వ్యతిరేకంగా పని చేసేవాడు చచ్చిపోతే సమాధి చేస్తున్నారట అధికారులతో పేచీపెట్టుకోవడాని కిదొక అవకాశం. బహుశా వాళ్ళంతా అతని స్నేహితులే అనుకుంటాను. అతనిలాంటివాళ్ళే అయి ఉండాలి. వాళ్ళు అంత్యక్రియలు జరిపిస్తూ అధికారులను త్రోసిపారెయ్యండి! వాళ్ళు ప్రజల రక్షకులుకారు! భక్షకులు అని పెద్దకేకలు వేశారట. పోలీసులు వాళ్ళమీదపడి గట్టిగా బాదినారట. కొందరు చచ్చిపోయినారని కూడా అంటు న్నారు అయితే పోలీసువాళ్ళకికూడా బాగానే ముట్టినాయట గలేతాలు............ అట్టే ఆలోచిస్తే ఈ అధికార్లు చచ్చిపోయిన వాళ్ళనికూడా వదలిపెట్టేటట్లు లేదు. సమాధుల్లో ఉన్నవాళ్ళనికూడా వేపుకుతినే టట్టున్నారు

బండి గతుకుల్లోంచి నడుస్తోంది. ఇవాన్ తల తల్లి ఒడిలో కొట్టుకుంది. బండివాడు మళ్ళీ తల్లికేసితిరిగి తనసోదె ఆరంభించాడు.

"మొత్తంమీద ప్రజలకీ ఉడుకెత్తుతోంది. అతి తరుచుగా గలాటాలు

జరుగుతున్నాయి నిన్నరాత్రి మాయింటికి పోలీసులొచ్చి తెల్లవార్లూ ఏమిటో చేస్తూనే వున్నారు. చివరకి ప్రొద్దున్నే ఒక కమ్మరిపనివాడిని అరెస్టుచేసి తీసుకు పోయారు. రాత్రి అతన్ని ఏటిదగ్గరకు తీసుకెళ్ళి అందులోముంచి పారేస్తారని చెప్పుకున్నారు. ఇంతకీ ఆ కమ్మరి బాగా చదువుకున్నాడు తెలివైనవాడు. సంగతి సందర్భాలు బాగా తెలుసుకోగలవాడు; ఈ వాలకం అంతాచూస్తే ప్రపంచం సంగతి తెలుసుకుంటేనే అపరాధంలా కనిపిస్తోంది................అతను అప్పుడప్పుడు మా దగ్గరకొచ్చి 'జట్కాతోలే వాడి బ్రతుకేం బ్రతుకు?" అనేవాడు. 'అవును. అంతే. వెధవబ్రతుకు కుక్కా నక్కాకన్న అధ్వానం' అనేవాళ్ళం మేము."

ఇంతలో తల్లి బండి ఆపమంది. బండి టకీని ఆగింది. ఆ కుదుపుకు ఇవాన్‌లేచి కొంచెం మూలిగాడు. బండివాడు "ఒళ్ళంతా కదిలిందికాబోలు! దిక్కుమాలిన సారా! సారా!" అన్నాడు. ఇవాన్ కష్టంగా లేచి "ఫరవాలేదు. నేను నడవగలను." అంటూ నెమ్మదిగా లోపలికివెళ్ళాడు.

౯

తల్లి ఇంటికి చేరేటప్పటికే సోఫియా ఇంటికి చేరుకుంది, సిగరెట్టుపొగ విడుస్తూ తల్లికి గుమ్మంలో కెదురువచ్చింది. మనిషి కొంచెం చిరాకుగా కనపడింది. ఆ దెబ్బతగిలిన పిల్లవాడిని సోఫామీద పడుకోపెట్టి నలుగురికీ పని పురమాయించింది. "నిలోనా! నువ్వు చాలా శ్రమపడ్డావు, పడుకో. నికోలే! నిలోనాకు ఒకగ్లాసు బ్రాంది ఇయ్యి."

తల్లి కొంచెం అలసటతో "నావిషయమై మీరంత ఆదుర్దాపడొద్దు" అంది. కాని నిజంగా అప్పుడామె పరిచర్యకోరే స్థితిలోనేఉంది

ప్రక్కగదిలోనుంచి చేతికి కట్టుకట్టుకుని నికోలేవచ్చాడు. డాక్టరు డేనిలోవిష్ ఎంతో హడావిడిగా వచ్చాడు. వస్తూనే ఇవాన్ ప్రక్కదగ్గరకొచ్చి "సోఫియా! నీళ్ళు, శుభ్రమైన గుడ్డ, కట్లబద్దలు, దూది" అన్నాడు.

తల్లి గబగబా వంటయింటికేసి బయలుదేరింది. నికోలే ఆమె చెయ్యిపట్టుకొని ఆపి భోజనాలగదిలోకి తీసుకువెళ్ళి "డాక్టరు నీకు కాదు ఈపని చెప్పింది; సోఫియాకు. నువ్వు ఇదివరకుపడ్డ శ్రమ చాలదూ?" అన్నాడు.

తల్లి నికోలేయొక్క ఆదరదృష్టినిచూసింది. వెంటనే అతనితలమీద చెయ్యివేసి "అయ్యో నాయనా! ఎంతభయంకరంగా ఉందనుకున్నావు? మన వాళ్ళను కొట్టిపారేశారు. కొట్టిపారేయడమే?" అని చెప్పింది.

నికోలే ఆమెకొక గ్లాసు బ్రాంది నిస్తూ "అవును నేను చూశానుగా ? రెండు పక్షాలుకూడా జోరుగానే వెళ్ళారు. కాని ఫరవాలేదు వాళ్ళుఖడ్గాలు తిరగేసి మాత్రమే ఉపయోగించారు. ఒక్కడికే బాగా దెబ్బలుతగుల్తా. అతన్ని కొట్టడం నేను చూస్తూనేఉన్నాను నేనే అతన్ని జనంలోనుంచి బయటకు లాగుకొచ్చాను" అని సమాధానం చెప్పాడు. అతనిమాటలతో ఆమెమనస్తాపం కొంచెం శాంతపడింది.

"నిన్నుకూడా కొట్టారా ?" అని అడిగింది "వాళ్ళుకొట్టలేదు నేనే అజాగ్రత్తగా వెడితే నాచెయ్యి దేనికో కొట్టుకొని కాస్త గీసుకుపోయింది నువ్వు కొంచెం టీ త్రాగమ్మా, చలిగాలేస్తుంది. వంటినిండాబట్ట కప్పుకో" అన్నాడు నికోలే.

టీ అందుకోడానికి చెయి చాపేసరికి చేతివేళ్ళమీద రక్తం మరకలు కనుపించాయి. వెంటనే చేతులు మోకాళ్ళమీద పెట్టుకొనేసరికి గౌనంతాకూడా రక్తంతో తడిసింది. డాక్టరు చొక్కా చేతులువెనక్కి తీసుకొని వచ్చాడు నికోలా కేసి చూసి "అతని ముఖంమీద దెబ్బయితే చిన్నదే కాని, తలమాత్రం పగిలింది. అయితే అంత ఎక్కువగా పగలలేదు మంచి బలమైనవాడు కాని ఇప్పటికే చాలారక్తంపోయింది. ఆస్పత్రికి తీసుకెడదాం ?" అన్నాడు.

"ఎందుకూ ? ఇక్కడే ఉండనియ్యి "

"ఇవ్వేళ ఇక్కడే ఉండవచ్చు. రేపుకూడా ఉండవచ్చు. కాని తర్వాత అతన్ని ఆసుపత్రికి తీసుకెడితేనే మనకు వీలు. నేను తరచుగా ఇక్కడికివస్తూ ఉండడానికి తీరుబడిలేదు. మీరు శ్మశానభూమిలో జరిగిన గలాటాగురించి కరపత్రం అచ్చేస్తారుగా ?"

"ఆహా : సందేహమా ?"

తల్లిలేచి వంటయింట్లోకి వెళ్ళింది. నికోలే "సోఫియా చేసుకోకలదు. నువ్వుకూడా ఎందుకూ?" అన్నాడు.

తల్లి నవ్వుకుని "నాఒళ్ళంతా రక్తమేఅంది." లోపలికివెళ్ళి బట్టలు మార్చుకుంటూ ఈ ఉద్యమంలో ఉండేవాళ్ళశాంతం, ఓపిక తలచుకుని తనలోతానే ఆశ్చర్యపడింది. సత్య ధర్మలకోసం ఎంతటి కష్టాలనైనా ఓర్చేశక్తి వాళ్ళలో ఆమెకు స్పష్టంగా కనుపించింది. ఈలాంటివాళ్ళతో పరిచయంవల్ల ఆమె భయం కూడా పోయింది. తర్వాత గాయపడ్డ పిల్లవాడు పడుకున్న గదిలోకివచ్చింది. అప్పుడే సోఫియా "తెలివి తక్కువగా మాట్లాడకు" అంటోంది. "మెసంగతికనుక్కుంటా". ఆ యువకుడు నీరసంగా" నువ్వుమాట్లాడకు అది మంచిది నీకు" అన్నాడు

తల్లి సోఫ్యా వెనుకనిలబడి ఆమె భుజంమీద చెయ్యివేసి వంగి ఇవాన్ కేసిచూస్తూ ఒక చిన్న నవ్వునవ్వి పలుకరించింది. పిమ్మట అతను బండిలో ఒళ్ళు తెలియక అన్నమాటలు, అందువల్ల తనకు కలిగిన భయం అంతాచెప్పింది.

ఇవాన్ అసంగతంతా విని "అల్లాగా? ఎంత తెలివి తక్కువ పనిచేసేను? అయ్యో!" అని మెల్లగా పశ్చాత్తాపపడ్డాడు.

"నిన్ను ఇక్కడేవుంచేస్తాం. నువ్వు బాగా విశ్రాంతితీసుకో" అనిసోఫియా అతని వంటిమీద కంబళి కప్పింది.

తల్లి, సోఫియాకూడా భోజనాలగదిలోకివెళ్ళి మెల్లగా ఆవేళజరిగిన సంగతులన్నీ మాట్లాడుకున్నారు. అదేదో యెప్పుడో జరిగినట్లు మాటాడుకుని ఇక ముందు జరుగవలసిన పనినిగురించి తీవ్రంగా ఆలోచించుకోవడం మొదలుపెట్టేరు. వాళ్ళు ఇదివరకు చేసినపనివల్ల వాళ్ళకి సంతుష్టి కలుగలేదు. వాళ్లంతా ఇల్లా సంభాషించుకున్నారు

డాక్టరు దేనిలోవిష్ (చేత్తో అభినయంచేస్తూ) "ప్రచారం! ప్రచారం! అదే ఇప్పుడు తక్కువ. కార్మిక యువకులు చెప్పేమాట ముమ్మాటికీ నిజం"

నికోలే:— ప్రతిచోటనుంచీ కూడా కరపత్రాలు చాలడంలేదని రిపోర్టులు వస్తున్నాయి. గాని మనకింతవరకు మంచి ప్రెస్ ఏర్పాటుకానేలేదు. లూడ్మిలా ఒక్కతే రాత్రింబవళ్ళు తంటాలుపడుతోంది. ఆమెకు సాయంచేసేవాళ్ళని త్వరగా చూడకపోతే త్వరలో ఆమెకూడా రోగంవచ్చి పడిపోతుంది.

సోఫియా:— మరి వైషోవికవ్?

నికోలే:— అబ్బే! అతడు పట్టణంలో వుండడానికి వీలులేదు. క్రొత్త ప్రెస్ పెట్టేదాకా అతనికి పనిలేదు. అయినా ఇంకొకడు కావాలి

తల్లి:— (మెల్లగా) నే పనికొస్తానా?

నికోలే:— అబ్బే! అది నీకు చాలకష్టం. ఊరుబయట కాపురముండాలి. పైగా పాషాని చూడడం మానెయ్యాలి. మరి ఇంకా.................

త:— (నిట్టూర్పువిడిచి) అందువల్ల పావెల్‌కేమీ పెద్దనష్టంలేదు. ఇక నామట్టుకు ఆలోచిస్తే నేను అతన్ని ఇల్లా చూస్తూవుండడం నాకే బాధగావుంది. నా హృదయం కరిగిపోతోంది. నేనేమీ అతనితో మాట్లాడడానికి వీలులేదు. అక్కడికెళ్ళి శుద్ధమొద్దులాగున యెదురుగా నుంచోడమే. ఇక వార్డరులు నా నోటంబడి యేమి చెప్పరాని మాటవస్తుందో అని నోటికేసి చూస్తూ కాసుకు కూచుంటారు.

సోఫియా ఆమె కార్యదీక్షనుచూచి ఆశ్చర్యపడి ఆప్యాయంగా ఆమె చెయ్యి గట్టిగా పట్టుకుంది. నికోలే ఆశ్చర్యంతో ఆమెకేసిచూసి అక్కడ ఆమె చెయ్యవలసిన పనేమిటో చెప్పాడు. పనివాళ్ళకు ఆమె రక్షకురాలుగా ఉండాలన్నాడు.

తల్లి "సరే. నా కర్థమైంది. నేను వంటచేస్తాను. నాచేతనవును. ఏమేమి ఎల్లాచెయ్యాలో నేను ఊహించుకోగలను" అంది.

సోఫియా:— "ఎంత పట్టుదలమ్మా నీకు?" అని ముక్కుమీద వ్రేలువేసుకుంది.

గడచిన కొద్దిరోజులనుంచీ జరుగుతూవున్న వ్యవహారాలు ఆమెకు కొంచెం

విసుగెత్తించాయి అందుచేత గడబిడగా ఉండే ఈ పట్టణం వదలిపెట్టి ప్రశాంతంగా ఉండేచోటికి పోవాలనుకుంది. కనుక ఆమెకీయవకాశం బాగా దొరికింది. ఇంతలో నికోలే ఆమాట తప్పించివేసి వేరే కబుర్లు పెట్టాడు డాక్టరుకేసి తిరిగి "నువ్వు ఇంవాకటి సంగతి యేమాలోచిస్తున్నావు ?" అన్నాడు.

"మనం జనం చాలా తక్కువగావున్నాం. అదే నేను ఆలోచిస్తుంట. మనం ఇంతకన్న తీవ్రంగా పనిచేస్తే కాని లాభంలేదు. ఏమైనాసరే పావెల్, ఆంద్రి తప్పించుకొచ్చేటట్లు వాళ్ళనొప్పించాలి. అక్కడ చేతులు నలుపుకుంటూ కూర్చునేటంత నిష్ప్రయోజకులుకారు మరి" అన్నాడు డాక్టర్.

నికోలే ఏదో అనుమానిస్తూ తలవంచుకున్నాడు. ఒక్కసారి తల్లికేసి చూసేడు. తన కొడుకు సంగతి తన యెదుట మాట్లాడుకోవడానికి సంశయపడతారని గ్రహించి తల్లి తన గదిలోకి వెళ్ళిపోయింది.

గదిలో మంచంమీద పడుకుని అవతలవాళ్ళ గుసగుసలు వింటూంటే తల్లికి యేవో ఆలోచనలు కలిగేయి. తన కొడుకు బయటికిరావాలని ఉందికాని రావడములోవుండే ప్రమాదం తలచుకుంటే భయంవేసింది. ఈ మహోద్యమం నానాటికి పెరిగిపోతున్నట్లు ఆమెకు స్పష్టంగా కనిపిస్తోంది. త్వరలో ఏదో ఒక పెద్ద సంఘర్షణ వచ్చేటట్లుతోచింది. ప్రజల ఓర్మి తగ్గిపోతోంది. పెద్ద ప్రవాహంవచ్చి ఏదో వింత కలిగించేటట్లుంది. ద్వేషపూరితమైన ప్రసంగాలు పెచ్చుపెరిగిపోయాయి. ప్రతిచోట యేదో ఒక ఉత్సాహం కలిగించే విశేషమే. ఒకకరపత్రం ప్రచురమయ్యేసరికి బజారుల్లోనూ, దుకాణాల్లోనూ, కూలీలలోనూ, యెంతో గడబిడ పుడుతూ ఉండేది ఎవరయినా అరెస్టయినప్పుడల్లా వాళ్ళమీద చాలా సానుభూతి కలుగుతూ ఉండేది. కాని పైకి ప్రకటించలేకపోయేవారు. ఒక్కొక్కప్పుడు తల్లికి గుండెల్లో గుర్రాలను పరుగెత్తించిన "గలాటా," "సాంఘికవాదం". "రాజకీయం" అనే మాటలు ఇప్పుడు ప్రతివాళ్ళ నోటినుండీ వస్తూనేఉన్నాయి. వీటిని గురించి జనం పైకి అప్పుడప్పుడు హేళనగా మాట్లాడుతూ వచ్చినా లోపల అధికారులంటే అసహ్యం కనిపిస్తూనే ఉండేది. ఆందోళన మొత్తంమీద ప్రజలమాంద్యాన్ని వదలగొడుతూంది అజగరాల్లాపడుండేప్రజలులేచికలవరపడుతూ ఆలోచించుకోడం మొదలుపెట్టారు. ఈపరిణామం అంతా తల్లి బాగా కనిపెడుతూనే ఉంది. ఈ మార్పుచూస్తే ఆమెకు ఒకందుకు సంతోషం. ఇంకొకందుకు విచారం. ఈవికాసానికంతా తన కొడుకేకదా కారణమనే సంతోషం. ఒకవేళ తన కొడుకు బయటకు వస్తే వీళ్ళందరికి మొనగాడై చివరకి నాశనమైపోతాడేమో అని విచారం. ఆమెకు తరుచుగా యేవో ఊహలు ప్రపంచానికి చాలా లాభకరమైనవని అనుకునేది. కాని బయటికి చెప్పడానికి నోటంబడిమాట వచ్చేదికాదు. అందుచేత అవి హృదయంలోనే చిక్కుపడిపోయి భారంగా ఉండేవి. ఒక్కొక్కప్పుడు ఆమెకు తన కొడుకు పుక్కిటిపురాణాల్లోని రాక్షసావతారంలా కనుపించేవాడు. ఆ స్వరూ

పంలోనే మంచి నుంచి ధర్మాలు వాటికోసం కష్టపడేవాళ్ళు అంతా ఇమిడిపోయి యున్నట్లు కనిపించేది. "ఇదంతా మంచికే అనుకునేది. తల్లికి సహజ మైన పుత్రప్రేమ ప్రజ్వరిల్లి ఆమె హృదయాన్ని దహించడం ఆరంభించింది. "అతను నాశనమైపోతాడు. ఆ, పడిపోతాడు" అని తనలో తానే కించపడేది.

ఆ రోజు రాత్రి నిద్రలో నా చాలా ఆలస్యంగా పడుకుంది. గాఢమైన నిద్ర పట్టింది. కాని పెందలకడే లేచింది. మధ్యాహ్నం జైలు ఆఫీసుగదిలో పావెల్‌ను కలుసుకుంది. వార్డరు లెవ్వరూ చూడకుండా తన చేతిలోని చీటిముక్కను అతని కందివ్వడానికి మంచి అవకాశం కోసం చూస్తోంది. కాలక్షేపానికి యేదో మాట్లా డడం ఆరంభించారు.

పావెల్ :— నేను క్షేమంగానే వున్నాను. మిగతా వాళ్ళంతా కుశలమే. నువ్వు కులాసాగా వున్నావా?

తల్లి :— ఆ. అల్లాగే వున్నాను. ఈగర్ ఇవానిష్ చచ్చిపోయాడు.

పా :— అల్లాగా? అయ్యో!

త :— 'అంత్యక్రియలు జరిపేటప్పుడు శ్మశానంలో పోలీసులొచ్చి నానాగలాటా చేసి ఒకరిని అరెస్టుచేశారు.

జైలు అసిస్టెంటు ఓవర్సీరు గభాలున లేచి కోపంలో "ఏయి! ఆ సంగ తెత్తకూడదు. చెపితే నీ కర్థంకాదూ? రాజకీయ విషయాలు మాట్లాడకూడదని నీకు తెలియదూ?" అని గర్జించాడు.

తల్లికూడా నెమ్మదిగా కుర్చీమీదనుంచిలేచి "నేనేమి రాజకీయం మాట్లాడు తున్నాను? ఒక దెబ్బలాటసంగతి చెప్పేను. దెబ్బలాట జరిగినమాట నిజం. అందులో ఒకడి తలకూడా బ్రద్దలుకొట్టేరు" అంది.

"కొడితే కొట్టేరు నువ్వూరుకో. నీస్వంత, విషయాలు అంటే కొంపా గోడీ, సంసారం, ఈవిషయాలు మాట్లాడుకో. ఇతరగొడవలు వద్దు. అని నిక్క చ్చిగాచెప్పి కూచుని ఏవో కాగితాలు తిరగేస్తూ మీరేం మాట్లాడుకున్నా నాకొంప మీది కొస్తుంది" అని విసుక్కున్నాడు.

ఈసందడిలో తల్లి ఇటూఅటూచూచి చీటీముక్క పావెల్ చేతిలో పెట్టే వేసింది. "అమ్మయ్య" అనుకుంది.

"ఏముందిక మాట్లాడడానికి? యేమీ కనుపించదు" అంది పావెల్‌తో.

"అవును. నాకూ యేమీ కనుపించదు."

"ఓవర్సీరు భర్రునలేచి యెందుకైతే యీ రావడం. మాట్లాడడానికి యేమీ లేకపోతే నన్ను బాధపెట్టడానికా రావడం?" అన్నాడు

త :— విచారణ త్వరగా అవుతుందా?

పా :— అవచ్చును. మొన్ననే * పబ్లిక్ ప్రాసిక్యూటరు వచ్చాడు త్వరలో విచా రణకొస్తుందని అతనే అన్నాడు.

---

* గవర్నమెంటు తరపున వకీలు.

త :—ఏమో ? అప్పుడే ఆరునెలలయింది జైలుకొచ్చి.

ఇలాగే మాటకీ మాటకీ సంబంధంలేకుండా మాట్లాడుకున్నారు. పావెల్ ఆమెకేసి అతి ఆదరంగా చూచాడు. అతని కెలాగైనా నికోలే వైషోవికవ్ సంగతి యెట్లాగైనా తెలియపరచి సంతోషపెట్టాలనే కోరిక కలిగింది. అందుచేత అలాగే అనవసరమైన విషయాలు మాట్లాడుతూ యేమీ ఆవేశంలేకుండా "నీ అభిమాన పుత్రుడిని చూసేను" అని వైషోవికవ్ స్ఫోటకంమచ్చలు గుర్తుగా తన చెంప మీద వ్రేలు నెమ్మదిగా కొట్టుకుంది.

"అతడు కులాసాగానే ఉన్నాడు అతనెప్పుడూ తనకు గట్టిపనిమ్మని అడుగుతూఉండేవాడు జ్ఞాపకముందా ? ఇప్పుడతని కోరికప్రకారం పనితగులు తుంది." అని చెప్పింది.

పావెల్ గ్రహించి కృతజ్ఞతచూపిస్తూ తలకాయ ఆడించి "ఆ! జ్ఞాపకం లేకేమి ?" అన్నాడు.

"సరే వెళ్ళివస్తాను" అంటూ అతనిచెయ్యి గట్టిగా పట్టుకుంది.

"వెళ్ళిరా చాలాసంతోషం" అని పాషా వందనంచేశాడు కొడుకును సంతోషపెట్టిన ఆనందంచేత ఆమె తన్మయత్వంచెంది మాట్లాడలేకపోయింది.

నిలోనా ఇంటికివచ్చేసరికి, శశాంకకూడా వచ్చింది.

తల్లి పావెల్‌ను చూడడానికివెళ్ళినరోజున ఆమె రావడం మామూలే.

శంశాక :—సరే. అతడు క్షేమమా ?

తల్లి :—ఆ : బాగానే ఉన్నాడు.

శ :—చీటీ ఇచ్చావా ?

త :—సందేహమేమిటి ? చాలా సులువుగా తమాషాగా ఇచ్చాను.

శ :—అతడు చదువుకున్నాడా ?

త :—అప్పుడేనా ? అక్కడెల్లాగా ?

శ :—అవునవును. మరచిపోయాను. ఇంకొకవారం ఆగిచూద్దాం. ఏమిటి! అతను ఒప్పుకునేటట్లున్నాడా ?

త :—ఏమో నాకు తెలియదు. కాని ఒప్పుకుంటాడనే అనుకుంటాను. ప్రమాదం లేకుండా జరిపిస్తే అతని కభ్యంతరం ఏముంటుంది ?

(శశాంక తల ఆడించింది)

శ :—ఈ జబ్బుగావున్న మనిషి ఏమి తినవచ్చునో నీకు తెలుసునా ? అతను ఏమైనా ఆహారం ఇమ్మంటున్నాడు.

త :—ఏదయినాసరే. ఏదో ఒకటి నేనుచూచి తెస్తానులే. తల్లి వంటయింట్లోకి వెళ్ళింది. శశాంకకూడా వెనకాలే వెళ్ళింది. "నేనేమైన సాయం చెయ్యనా ?" అని అడిగింది.

త :— "అంతేచాలు. నువ్వెందుకూ?" అని తల్లి ఒక్కపాత్ర మాతతీస్తుండగా శశాంక ఆమెను ఆపి పెదిమలు తడబడుతూ చెప్పింది.

"ఇదిగో అగు! ఒక్కమాటవిను. నిన్నొక్క సంగతడుగుతున్నాను. ఎంతో దీనంగా ప్రార్థిస్తున్నాను. అతను వప్పుకోడని నాకు తెలుసును. అయినా నీశక్తి వంచనలేకుండా ప్రయత్నంచెయ్యి. అతనికిక్కడ పని చాలావుంది. ఈ ఉద్యమానికి చాలా ముఖ్యావసరం. అతనికి జబ్బుచేస్తుందనికూడా నాకుచాలా భయంగావుందని చెప్పు చూడు. ఇప్పటికి ఆరునెలలయింది. ఇంకా విచారణ ఎప్పుడో యేర్పాటుకాలేదు కనుక ఏదో చూడాలి. అదే నా ప్రార్థన," తల్లికి ఆమె కలతంతా చూచేసరికి విచారం, జాలి కలిగినాయి. మెల్లగా కౌగలించుకుని "అమ్మాయీ! అతను ఒకరుచెపితే వినేవాడుకాదు. అతనికి తోచాలిసిందే", అంది. ఒక్కనిముషం వాళ్ళిద్దరూ అల్లాగే కౌగలించుకున్నారు తర్వాత శశాంక మెల్లగా తల్లిచేతులు వదల్చి వణుకుతూ "అవును నువ్వు చెప్పేమాట నిజమే. ఇదంతా మూర్ఖత్వం ఒక్కొక్కప్పుడు ప్రాణం విసుగుతుంది" అని చెప్పింది వెంటనే ఆమాయలోనుంచి బయటపడి.

"సరే. ఆసంగతికేమి? ముందు ఆరోగికేమైనా ఆహారం ఇయ్యి," అంది.

తక్షణమే శశాంక ఇవాన్ ప్రక్కదగ్గరకువచ్చి కూచుని "తల నొప్పిగా ఉందా?" అని అడిగింది

"అంత నొప్పిలేదు. తల దిమ్ముగామాత్రం ఉంది." అని ఇవాన్ కొంచెం సిగ్గుతో జవాబు చెప్పేడు. వెంటనే కంబళి మెడదాకా కప్పుకున్నాడు. హఠాత్తుగా వెలుతురుచూస్తే కళ్ళు మిరుమిట్లు గమ్మినట్లు కళ్ళు మూసుకున్నాడు శశాంక అతని అవస్థ గ్రహించి తనక్కడుంటే తిండికూడా తినడని యివతలికి వచ్చింది ఇవాన్ లేచి తలుపుకేసిచూస్తూ "ఆహా" అనుకున్నాడు మెల్లగా.

అతనికండ్లు చాలా ప్రకాశవంతంగా ఉన్నాయి. తల్లి అతని ప్రక్కనే కూచుంది. ఇద్దరూ ఇల్లా మాట్లాడు కున్నారు.

తల్లి :— నీ వయస్సెంత ?

ఇవాన్ :— పదిహేడు.

త :— నీ తలిదండ్రు లెక్కడ ?

ఇ :— మావూళ్ళో. నాకు పదేళ్ళు వచ్చినప్పటినుండీ ఇక్కడే వున్నాను బడి మానెయ్యటంతోనే ఇక్కడికోచ్చేను నీ పేరేమిటి ?

త :— నా పేరెందుకూ ?

ఇ :— (కాస్సేపు సందేహించి) మరేమీలేదు.... ఊరికేనే.... మా సర్కిలులో ఒకవిద్యార్థి ఉండేవాడు. అతను మాకు ఆ పుస్తకాలు, ఈ పుస్తకాలు చదివి చెపుతూ వుండేవాడు. అతను మాకు పావెల్ తల్లిసంగతి. 1 వ తేదీ

సంగతి చెప్పాడు. ఆ పావెల్ మనపార్టీ జండాను బహిరంగంగా పైకెత్తిన వాళ్ళల్లో మొదటివాడు. (అతడు గర్వంతో చెప్పినమాటలు వింటే తల్లికి కూడా చాలా సంతోషం కలిగింది.)

ఇ :— నేను అప్పుడక్కడలేను. మేం ఈ పట్టణంలోకూడా అల్లాంటి ఉత్సవం చెయ్యాలని అనుకున్నాంకాని సాగలేదు. అప్పుడు మేం ఎందరమోలేము. ఈ సంవత్సరం చేసితీరుతాం. నువ్వేచూస్తావుగా! అసలుసంగతేమిటంటే "నిలోనావాసనా" అనే అతని తల్లికూడా తర్వాత ఈ ఉద్యమంలో చేరిందట! ఆమె చాలా దేవాంతకురాలని చెప్పారు.

తల్లి చిరునవ్వు నవ్వుకుంది. ఆ పిల్లవాడు తన్నల్లా ప్రశంసించడంవిని చాలా సంతోషించింది కాని ఆత్మస్తుతి వినడానికి కొంచెం అయిష్టం కలిగింది. తానే పావెల్ తల్లినని చెప్పకుండానే ఉడాలసివచ్చింది చివరకి ఇవాన్‌ని మెల్లగా తట్టి. "నాయనా, బాగా భోజనంచేసి ఒళ్ళు నయంచేసుకో. ఈ మహోత్సవం కోసమే ఆరోగ్యం కాపాడుకో. ఈ ఉద్యమానికి ఎందరో శక్తివంతులు, ధర్మవర్తనులు, స్వచ్ఛమైన హృదయం కలవాళ్లు కావాలి. వాళ్ళ శక్తితోనే యావత్తు దుష్టత్వాన్ని అల్పత్వాన్ని జయించాలి" అని చెప్పింది.

ఇంతలో సోఫియా నవ్వుతూ గదిలోకొచ్చింది. చలిలోనుంచి రావటంచేత ఆమె ముఖమంతా నేతిగడ్డలావుంది ఆమె లోపలికి వస్తూనే మాట్లాడటం ఆరంభించింది. "అబ్బ! వీళ్ళ తస్సాదియ్య! ఈ రహస్యపు పోలీసువాళ్ళు నన్ను మహాశ్రద్ధగా కనిపెడుతున్నారు. ధనవంతురాలైన పెండ్లికూతురి విషయంలో పెండ్లికొడుకెంత శ్రద్ధగావుంటాడో, అంతకన్నా ఎక్కువ శ్రద్ధగా చూస్తున్నారు వీళ్ళు నన్ను. నేను వెంటనే ఇక్కడనుంచి వెళ్ళిపోవాలి. (సిగరెట్టుముట్టించి) సరి, ఇవాన్! ఎల్లావున్నావు? బాగావుందా? నిలోనా, పావెల్ ఎల్లావున్నాడు? ఏమిటీ! శశాంకకూడా ఇక్కడేవుందీ?" జవాబువచ్చేవరకు సోఫియా ఆగడం లేదు. ఈ ధోరణిచూచి తల్లి తనలోతాను నవ్వుకుంది. సోఫియా లోపలికివెళ్ళింది తల్లి ఇవాన్‌కు కొంచెం బ్రాంది ఇవ్వాలని వంటయింట్లోకి వెళ్ళేసరికి సోఫియా శశాంకతో ఇల్లా చెపుతోంది

"ఆమె అప్పుడే మూడువందల కాపీలు సిద్ధం చేసింది. దానితో ఆమె చచ్చిపోయేటట్లుంది. ఆహా! అదే వీరత్వం అంటేను. ప్రపంచానికి తెలియకుండానే ఆమె చేసేసేవ అద్భుతం. శశా! అలాంటివాళ్ళతో పనిచేస్తుంటేనే హాయి."

"అవును." అంది శశాంక.

* * * *

ఆరోజు సాయంత్రం టీ త్రాగేటప్పుడు సోఫియా తల్లితో "అమ్మా! నువ్వుమళ్ళీ ఆ గ్రామాని కెళ్ళవలసివుంటుంది" అంది.

"సరే దానికేమి? ఎప్పుడు?"

"రేపే వెడితేమంచిది వెళ్ళగలవా?"

"ఆహా!"

"నడిచి వెళ్ళకు తపాలా గుర్రపుబండిమీద వెళ్ళి మునుపెళ్ళిన దారినికాక నికోలస్కు జిల్లా కడ్డుపడివెళ్ళు" అన్నాడు నికోలే

"ఆదారివెడితే చాలదూరం. బండిమీద వెడితే డబ్బు చాలా అయిపోతుంది."

"అవును. అందుచేత నేను మొదటినుంచి ఈపని వద్దంటున్నాను. అప్పుడే అక్కడ అలజడి ప్రారంభమైంది కొందరిని అరెస్టుకూడా చేశారు. రైబిన్‌మాత్రం తప్పించుకున్నాడట. ఏమైనా మనం జాగ్రత్తగా ఉండాలి. మనం ఇంకా కొంతకాలం ఆగితే బాగుండేది."

"సరే. అదెప్పుడో ఒకప్పుడు తప్పుతుందా?" అంది తల్లి.

"ఏమైనా ఈకరపత్రాలు, వార్తాపత్రికలు జోరుగా పంచిపెడుతూ ఉండాలి. అది ముఖ్యమైనపని. ఏమంటావు నిలోనా? అక్కడకి వెళ్ళడానికి నీకేమీభయం లేదుగదా?" అంది సోఫియా. తల్లికి కొంచెం రోషంవచ్చింది.

"నేనెప్పుడు భయపడ్డానేమిటి? మొదటిసారే నాకు భయం కలుగలేదు. ఇప్పుడర్థాంతంగా ఏమొచ్చిందని........" అంటూ తలవంచుకుంది. నీకు భయం లేదుకదా అని, నీకు వీలుంటుందా అని, నువ్వు చెయ్యగలవా అనీ, తన్ని అడుగుతూఉండే ఆమెకు ఒకవిధమయిన చిన్నతనంగా ఉండేది. వాళ్ళు ఒకరికొకరు పనులు పురమాయించుకొనేటప్పుడు ఇల్లాంటి ప్రశ్నలు వేసుకోరు. తనవిషయంలో ఎందుకీతేడా చేస్తారాఅని కష్టంగా ఉండేది. మొదటిరోజులలో కొంత గాభరాపడినా క్రమంగా ఆమె కీపనియం దెక్కువ శ్రద్ధకలిగింది.

అందుచేత సోఫియా ప్రశ్న ఆమెకు మరీ కష్టం కలిగించింది. ఒక్క నిట్టూర్పు విడిచి ఇల్లాచెప్పింది.

"నన్ను మీరు భయమేస్తుందా అనీ, కష్టంగావుందా అనీ అడగక్కరలేదు. నాకు భయపడటాని కేమీలేదు. ఏదయినా వున్నవాళ్ళకి పోతుందేమోనని భయం. నాకేముంది? ఒక్క కొడుకున్నాడు. అతని విషయమై భయపడుతూ వుండేదాన్ని. అతని కేమైనా కష్టం వస్తుందంటే భయపడేదాన్ని. అదేమీ లేకపోతే.... ఇంకేముంది?" "నీకేమైనా కోపం వచ్చిందా ఏమిటి?" అంది సోఫియా "అబ్బే! కోపంలేదు, గీపంలేదు. కాని మీలోమీరు భయమేస్తోందా అని అడుగుకోరే?"

నికోలే కళ్ళజోడు సర్దుకుంటూ అప్పగారి మొఖంకేసి చూసాడు. ఒక్క క్షణం నిశ్శబ్దం. తల్లిఏమిటో అనుమానిస్తూ చెప్పడానికి లేచింది. ఇంతలో సోఫియా మెల్లగా "నిలోనా! క్షమించు. నే నింకెప్పుడూ అల్లా అనను"అంది. తల్లికి నవ్వు వచ్చింది కాస్సేపటికల్లా ముగ్గురూ కులాసాగా ఆగ్రామానికి వెళ్ళే ప్రయత్నాన్ని గురించి మాట్లాడుకున్నారు.

# ౧౦

మర్నాడు నిలోనా టపాబండిలో యెక్కింది. వర్షాలవల్ల రోడ్డంతా గతుకులుపడిపోవడంవల్ల బండి చాలా కుదిపింది. మొగానికి రివ్వుమని చలిగాలి కొట్టింది. బండివాడు తల్లికేసి సగం తిరిగి యేదో సొదఆరంభించాడు ఆసొదంతా నిద్రలో వింటూన్నట్లు వింది. ఒక్కసారి ఆమెకు తన పూర్వ జీవితమంతా స్మరణకువచ్చింది. ఏదో ఆలోచనలో పడింది. ఇదివరకు జీవితంయొక్క పరమావధి, లక్ష్యం యేమిటో తెలిసేదికాదు. ఇప్పుడు ఆమె కళ్ళముందర, ఆమె సహాయంతో అనేకపనులు జరుగుతున్నాయి. ఈ ఆలోచనలో ఆమె మనస్సంతా కలవరపడిపోయింది. బండి నడుస్తుంటే మేఘాలు పరుగెత్తుతూఉండే ఆకాశం, పచ్చని పైరులు, చిన్నచిన్నగుట్టలు, అన్నీకూడా నడుస్తున్నట్లే ఉన్నాయి.

బండివాడి సొద, బండి గంటలు, గాలిహోరు అదొక విధమైన గణగణ ధ్వని బయలుదేరి ప్రాణం విసిగించింది.

"స్వర్గానికెళ్ళినా ధనికుడికి యిరుకాటమే. వాడి బ్రతుకంతే. ఎప్పుడైతే ధనికుడు జనాన్ని హింసపెట్టడానికి పూనుకుంటాడో అప్పుడే గవర్నమెంటు అతనికి అండగా చేరుతుంది" అన్నాడు బండివాడు.

మొదట మకాం దగ్గర గుర్రాలను విప్పేస్తూ, "నాకు త్రాగుడుకేమైనా యిస్తేనా" అన్నాడు. తల్లి అయిదు కాసు లిచ్చింది. వాడు వాటిని పరమసంతోషంతో యెగరేస్తు "మూడుకాసులు త్రాగడానికి, రెండుకాసులు రొట్టెకి" అనుకున్నాడు.

మధ్యాహ్నానికి కుదుపుతోటి, చలితోటి అవస్థపడి నికోలస్కు గ్రామం చేరింది. అక్కడొక వంటపూటింటికి వెళ్ళి టీ అడిగింది. మూట బల్లక్రిందపెట్టి ప్రక్కనున్న కిటికీదగ్గర కూచుని వీధికేసి చూస్తోంది. ఎదురుగా పెద్ద మైదానం. దానిలో టౌనుహాలు. మైదానంలో పందులు సంచారం చేస్తున్నాయి. టౌనుహాలు మెట్లమీద పిల్లిగెడ్డం, బట్టతల గలిగిన ఒకరైతు చుట్టకాల్చుకుంటూ కూచున్నాడు. కొంచెం చీకటి కమ్మింది.

హఠాత్తుగా ఆ గ్రామం పోలీసు సార్జెంటు గుర్రాన్ని దౌడాయించుకు వచ్చాడు. సరిగా టౌనుహాలు మెట్లదగ్గర గుర్రాన్ని ఆపి కొరడా యూడిస్తూ మెట్లమీద కూచున్న రైతుమీద యేమేమో కేకలు వేయడం ఆరంభించాడు. ఆ రైతు లేచి దేనికేసో చూపించడానికి చెయ్యిచాపాడు. సార్జంటు గభాలున గుర్రం దిగి అతనిమీదపడి పట్టుకుని హాలులోపలికి లాగుకుపోయాడు. తరువాత మరేమీ గడబిడలేదు.

ఆ హోటల్లో పనిచేసే ఒకపిల్ల గదిలోకి వచ్చింది. అతికష్టంమీద పళ్లాలు గిన్నెలు గల ఒక బుట్ట మోసుకువచ్చి క్రిందపెట్టి తల్లికి నమస్కారం చేసింది

తల్లి ఆమెను పలుకరించింది. ఆ పిల్ల గదిలో బల్లమీద గిన్నెలు సర్దుతూ "ఇప్పుడొక దొంగను పట్టుకున్నారు. ఇక్కడికి తీసుకొస్తున్నారు" అని చెప్పింది.

"ఓహో! దొంగా? ఏం దొంగ?"

"నాకు తెలియదు."

"వాడేం చేశాడు?"

"అదేమీ నాకు తెలియదు. వాళ్ళు పట్టుకున్నారని మాత్రం విన్నాను. టౌనుహాలు కాపలామనిషి పోలీసుకమీషనరు దగ్గరకు పరుగెత్తుకెళ్ళి "వాడిని పట్టుకున్నారు. ఇలా తీసుకొస్తున్నారు" అని కేకవేస్తుంటే విన్నాను."

తల్లి కిటికీలోనుంచి మళ్ళీ చూచింది. టౌనుహాలు యెదుటనున్న ఖాళీ స్థలంలో చాలామంది రైతులు చేరారు. కొందరు తీరికగాను, కొందరు హడావిడిగాను పోతున్నారు. అంతా టౌనుహాలు మెట్లదగ్గర ఆగారు. అంతా నిశ్శబ్దంగా ఉన్నారు. తల్లికి యేమిటో కంగారు పుట్టింది. తనమూట బాగా బల్లక్రిందకు తోసేసింది. పరుగెత్తుకుని అక్కడికి వెడదామని బుద్ధిపుట్టింది. కాని ఆకోరిక నాపుకుంది. శాలువ నెత్తినివేసుకుని బయలుదేరింది.

తీరా ఆమె నెమ్మదిగా టౌనుహాలు మెట్లెక్కేసరికి మనిషి కొయ్యబారిపోయింది. ఊపిరి సలుపలేదు. ఏముంది? ఎదుటనున్న ఖాళీస్థలంలో రైబిన్! అతనిచేతులు వెనక్కివిరిచికట్టేరు. ఇరుప్రక్కలా పోలీసులు ఠంచన్‌గా నడుస్తున్నారు. మెట్లదగ్గర సంగతిసందర్భాలు చూస్తూ జనం గుంపుకూడి ఉన్నారు

ఏమైనా ప్రమాదం వస్తుందనే స్పృహ లేకుండానే ఆమె రైబిన్‌కేసి తేరి చూచింది. అతడేమో అన్నట్లుతోచింది, కాని మాట వినబడలేదు. కాస్సేపటికి స్పృహ తెచ్చుకుంది. ప్రక్కనే ఒక చిన్న గడ్డంగలరైతు ఆమెకేసి రెప్పవాల్చకుండా చూసేడు. తల్లి మెల్లగాదగ్గుతూ గొంతుక సవరించుకుని అతన్ని "ఏమిటిదంతాను?" అని అడిగింది. 'నువ్వేచూడు' అంటూ అతను వెళ్ళిపోయాడు. ఇంకొకరైతువచ్చి ప్రక్కన నిలబడ్డాడు.

"అరి దొంగా! ఎల్లావున్నావురా?" అంది ఎవరో ఒక స్త్రీ.

జనం ఎక్కువైపోయేరు. పోలీసులు జనానికెదురుగావచ్చి నిలబడ్డారు. రైబిన్ గొంతుక లేచింది. "రైతుసోదరులారా! నేను దొంగనుకాను. నేను దొంగతనం చెయ్యను. కొంపలు నిప్పంటించేవాడినికాను. అధర్మం అసత్యంతో మాత్రం దెబ్బలాడుతాను. అందుకే వీళ్ళు నన్నుపట్టుకున్నారు. మనరైతుల నిజస్థితినిగురించి తెలిపే పుస్తకాలసంగతి మీరు విన్నారా? ఆ పుస్తకాలను గురించే నేనిల్లా బాధలు పడుతున్నాను. నేనే జనానికి ఆ పుస్తకాలు పంచిపెట్టినది."

జనం రైబిన్‌చుట్టూ మూగారు. అతని కంఠధ్వని తల్లికి కాస్తధైర్యం కలిగించింది. "వింటున్నారా?" అన్నాడొకరైతు మెల్లగా ప్రక్కనున్న మబ్బుకళ్ళ రైతుతో. ఆతడేమీ మాట్లాడకుండానే తల్లికేసి చూశాడు. ఆ మొదటిరైతు

ఇతనికన్న చిన్నవాడు. ఇద్దరూ తల్లికేసిచూస్తు అవతలిప్రక్కకు వెళ్ళిపోయారు. వాళ్ళకి భయం కాబోలనుకుంది తల్లి. ప్రక్కనున్న ఒకచిన్న గట్టెక్కి జాగ్రత్తగా రైబిన్ మొగంకేసి చూసింది. అతనిగడ్డం కళ్ళు ఈసారి బాగా గుర్తుపట్టింది. అతనుకూడా తన్నిచూస్తే బాగుండునని మునివేళ్ళమీద నిలబడింది.

జనం అతనికేసి నోటంబడి మాటలేకుండా నిలబడి చూస్తున్నారు. గుంపు వెనకాల మాత్రం కొద్దిగా గుసగుసలు వినబడుతున్నాయి. రైబిన్ గొంతుక ఖంగుమని లేచింది. "రైతుసోదరులారా! ఈ కరపత్రాల్లోఉండే సంగతులన్నింటినీ నమ్మండి. వాటిమూలాన్ని బహుశా నన్ను చంపితేకూడా చంపవచ్చు. అవి ఎక్కడ నుంచివచ్చేయో తెలుసుకోవాలని. అధికారులు నన్ను నానాహింసలూ పెట్టేరు వాళ్ళు నన్ను చావగొట్టేరు. ఇంకా కొడతారు కూడాను. కారణమేమో తెలుసునా? ఆ పుస్తకాల్లో నిజం ఉన్నదున్నట్లుగా వ్రాసిఉంది. అదేకారణం. మనకు తిండికన్న మర్యాద, సత్యం ఎక్కువ నేచెప్పే సంగతిదే."

ఒకరైతు "ఎందుకతడల్లా మాట్లాడి దెబ్బలుతింటాడు?" అన్నాడు.

"ఏముంది? ఇంక అతనికేం భయం? ఎల్లాగూ అతన్ని బ్రతుకనియ్యరు. మనిషి ఎప్పుడో ఒక్కసారి చస్తాడు. కాని రెండుసార్లు చావటుకదా? కనుక చెప్పదలచుకున్నది చెప్తాడు" అని మబ్బుకళ్ళరైతు జవాబు చెప్పేడు.

సార్జంటు గభాలున టౌనుహాలు మెట్లెక్కి త్రాగుబోతులాగ "ఏమిటీ మూక? ఎవడా మాట్లాడేది?" అని అరిచాడు చప్పున రైబిన్ తలవెంట్రుకలు పట్టి వెనక్కి ముందుకు ఝాడించి "ఓరి వెధవా! నువ్వా మాట్లాడేది? నువ్వేనా?" అని గుడ్లెర్రచేసేడు.

జనం కాస్త తప్పుకు నిలబడ్డారు. ఎవరూ ఏమీ మాట్లాడలేదు అశక్తత వల్ల తల్లికి మరింత విచారం కలిగింది. రైబిన్ మళ్ళీ ఒక్క కేకపెట్టేడు.

"ఓ నాయనలారా! ఇదిగో! చూడండి."

"నోరుముయ్యి" అంటూ సార్జంటు అతనిచెంపమీద ఫెళ్ళుమని ఒక పెట్టు పెట్టాడు. రైబిన్తల గిరెక్కిపోయింది.

"సోదరులా! ఇదిగో ఇల్లాగే పీళ్ళు మనుష్యుల కాళ్ళుచేతులు కట్టేసి నానాహింసాపెట్టి వాళ్ళిష్టమొచ్చినట్లు పరిష్కారం చేసిపారేస్తారు" అన్నాడు రైబిన్.

సార్జంటు అతనిమీదపడి ముఖంమీద, రొమ్ముమీద, కడుపుమీద తడపిడ బాదేసేడు.

"ఏయి పోలీసు! పీడిని తీసుకుపొండి! ........జనాన్ని చెదరగొట్టెయ్యండి!" అని ఆజ్ఞాపించాడు.

"అతన్ని కొట్టకు" అని జనంలోనుంచి ఎవరో కేకవేసేరు.

"ఎందుకల్లా కొడ్తావు?" అన్నా డింకొకడు.

"ఓ! పనిపాటలులేని పశువా? ఆ."

గుంపులోనుంచి పిల్లికళ్ళ రైతొకడు ఇంకొకడు కూడబలుక్కొని గబ గబా మెట్లదగ్గరకు వెళ్ళేరు తల్లి వాళ్ళసంగతి కనిపెట్టి 'అమ్మయ్య' అనుకుంది.

సార్జంటు మళ్ళీ ముష్టి ఝాడిస్తూ హుంకరించడం ఆరంభించాడు.

"ఏయి వాడినిల్లా తీసుకురండి నేచెప్తాను" జనంలోనుంచి "వద్దు" అని ఆ మబ్బుకళ్ళరైతు కేకవేసేడు

"అబ్బాయిలూ! అతన్ని తీసుకెళ్ళనివ్వద్దు. లోపలికి తీసుకెళ్ళి అతన్ని కొట్టి చంపేస్తారు. తర్వాత మనమే చంపేశామంటారు. కనుక తీసుకెళ్ళనివ్వద్దు" అన్నాడు రైతు. సార్జంటు హుంకారాలను మించి రైబిన్ గొంతుక మళ్ళీలేచింది.

"రైతుల్లారా! మీ బ్రతుకెంతటిదో ఇప్పుడైనా తెలుస్తుందా? మిమ్మల్ని ఎట్లా దోచేస్తున్నారో. ఎల్లా దగాచేస్తున్నారో, మీరక్తానెల్లా పీల్చేస్తున్నారో తెలియ డములేదా? లోకంలో అన్నిటినీ నిలబెడుతున్నది మీరే. అంతా మీమీదే ఆధారపడిఉంది. ప్రపంచంలో అన్నిటికీ మూలశక్తిమీరే. అల్లాంటి మీకు ఏమి హక్కులున్నాయి? మీకున్న హక్కు ఒక్కటే. కడుపుమంటతో మాడిచావడం"

"ఇతను చెప్పేదంతా నిజమే" అన్నాడొకడు.

"పోలీసు కమీషనరు ఏడీ? అతన్ని పిలవండి" అన్నారు కొందరు.

"సార్జంటు గుర్రంమీద వెళ్లేడు అతనికోసం"

"ఈఉద్యోగస్థుల నందరినీ పిలిచేదాకా మనకేంపట్టింది?"

జనం గోలఎక్కువైంది.

"ఏయి! చెప్పదలచుకొన్నది చెప్పు. నీఒంటిమీద దెబ్బపడనియ్యం."

"ఏయి పోలీసులు! అతనిచేతుల సంకెళ్ళు తీసెయ్యండి."

"సోదరులారా! వాటి అవసరమంతలేదు."

"విప్పండి కట్లు!" అని జనంలోనుంచి కేకలు.

"జాగ్రత్త! తొందరపడకండి! తరవాత విచారిస్తారు."

"నేను నాచేతులకోసం విచారిస్తున్నాను" అంటూ రైబిన్ గట్టిగా మాట్లా డడం ప్రారంభించాడు.

"రైతుల్లారా! నేను తప్పించుకొని పారిపోను. నేను సత్యానికి మరుగు పడేవాడినికాను. అది నాఆత్మలోనేఉంది." జనం చినచిన్న ముఠాలుగాచేరి ఏమిటో సంభాషించుకుంటున్నారు. కొందరికి నవ్వు. మరికొందరికి కోపం. జనంకొందరు రైబిన్‌చుట్టూ మూగేరు. అతను వాళ్ళమధ్యను ఊగుతూ చేతులెత్తి జనాన్ని హెచ్చరించడం ప్రారంభించాడు. కొందరు చప్పట్లుకొట్టి, కొందరు 'ఆహా' యని వాళ్ళ ఆమోదం వెలిబుచ్చేరు.

"సోదరులారా! సత్పురుషులారా! కృతజ్ఞతా వందనములు. నేను మీ బ్రతుకుకోసమే బాధపడుతున్నాను. (రక్తమయమైన గడ్డాన్ని చేత్తోతుడిచి ఆచేతిని పైకెత్తి) ఇదిగో! నారక్తం. సత్యంకోసం దాన్ని ధారపోస్తున్నాను.

తల్లి హృదయంలో మాటల కతీతమయిన ఆనందం కలిగింది. శ్రద్ధగా అతడు చెప్పేమాటలు వింటోంది.

"రైతుసోదరులారా! మీకు అందే పుస్తకాలు జాగ్రత్తగా చదవండి. సత్యాన్ని తెలియచేసే ఈ పుస్తకాలను మీ కందిచ్చేవాళ్ళంతా నాస్తికులనీ, ఆతతాయిలనీ అధికారులు, ఫాదరీలు చెపుతారు. వాళ్ళమాటలు నమ్మకండి. ప్రపంచంలో సత్యం అతిరహస్యంగా ప్రచారమవుతుంది. అది వాళ్ళపాలిటికి కాలుతూవున్న కత్తిలాంటిది. అందుచేత వాళ్ళు దానినొప్పుకోరు. అది వాళ్ళని కాలుస్తుంది. నరుకుతుంది. సత్యం మీకు పరమ స్నేహితురాలు. అధికారులకు గర్భశత్రువు. అందుచేతనే అది రహస్యంగా ఉంటోంది." "ఆహా! వేదవాక్కులండీ"అన్నాడు ఆ మబ్బుకళ్ళ రైతు.

"అయ్యో! పాపం, చెడిపోతావుగదా!"

"నిన్ను దగా చేసినదెవ్వరు?"

"ఫాదరీ" అన్నాడొక పోలీసు.

ఇద్దరు రైతులు ఆ ఫాదరీని పచ్చిబూతులు తిట్టేరు.

"ఏయి! జాగ్రత్త! వెనుకాముందు చూచుకోండి" అని వెనుకనుంచి పంపలించాడు. పోలీసు కమీషనరు వచ్చాడు. మనిషి భారీగా ఉన్నాడు. ముఖం గుండ్రంగా యెర్రగావుంది. టోపీ ఒకప్రక్కకి ఓరగా పెట్టాడు. మీసం ఒకవైపున పైకి త్రిప్పాడు. ఇంకొకవైపున క్రిందికి దింపాడు. అందుచేత ముఖం వంకరగా కనిపిస్తోంది. దానికితోడు యికిలింపు. అందుచేత ముఖం అసహ్యంగా కనుపించింది. ఎడమచేతితో కత్తి పుచ్చుకున్నాడు. కుడిచెయ్యి యూడిస్తూవచ్చాడు. జనం దారియిచ్చారు. అంతా నిశ్శబ్దంగా ఉన్నారు.

"ఏమిటీగలాటా?" అని అడుగుతూ రైబిన్‌ను నఖశిఖపర్యంతం యెగాదిగా చూశాడు.

"ఏయ్ ఆఫీసర్! వాడి చేతులూకాళ్ళు కట్టెయ్యలేదేమీ? ఎందుచేత? వెంటనే కట్టెయ్యి"

"చిత్తం, కట్టేశామండి. కాని ప్రజలు విప్పేశారు" అన్నాడొక పోలీసు.

"ఏమిటీ? ప్రజలా? యెవళ్ళువాళ్ళు? ఎక్కడున్నారు?" అంటూ కమీషనరు జనంకేసి తిరిగి నాలుగువైపులా పరకాయించిచూచి చేతిలోని కత్తిపిడితో యెదుటనున్న మబ్బుకళ్ళ రైతునొక్కపోటు పొడిచాడు.

"ఏం చమాకా! ప్రజలంటే నువ్వేనాయేమిటి? కాకపోతే యెవరు? మిషీన్ నువ్వా?" అంటూ కుడిచేత్తో ఎవరిదో గడ్డంలాగాడు.

"ఏయ్ గాడిదల్లారా! పొండి!" అని జనాన్ని ఆజ్ఞాపించాడు.

అతని ముఖంలోగాని మాటలోగాని యేమీ ఆవేశంలేదు. ఊరికే మాట వరుసకి మాట్లాడుతున్నట్లే మాట్లాడాడు. నదురూ బెదురూ లేకుండా చేతితో ప్రజ

లను వెనక్కి గెంటాడు. జనం అర్ధచంద్రాకారంగా అతనియెదుట దూరంగా నిల బడ్డారు.

కమీషనరు పోలీసులకేసి తిరిగి, "సరి. మీసంగతేమిటి? అతని చేతులు కాళ్ళు కట్టండి" అన్నాడు.

రైబిన్‌కేసి తిరిగి యేమిటో తిడుతూ—

"ఏయి! చేతులు వెనక్కి పెట్టు" అన్నాడు.

"నాచేతు లెందుకూ వెనక్కి పెట్టడం? నేను పారిపోను. నేనేమీ దెబ్బ లాడదలచుకోలేదు. అనవసరంగా చేతులెందుకు కట్టాలి?"

"యేమిటీ?" అని హుంకరిస్తూ కమీషనరు మీదికి వెళ్ళాడు.

"ఓరి పశువుల్లారా! ప్రజలను హింసపెడుతున్నారు చాలదూ? వస్తుందిలే! మీరోజూ వస్తుంది! మీకూ దుర్దినాలు వస్తాయి. ఇంతకింతా మీకు ముడుతుంది లెండి" అన్నాడు రైబిన్ ఝూంకారంగా కమీషనరు పళ్ళుకొరుకుతూ యెదుట నిలబడ్డాడు. రెండడుగులు వెనక్కి వేసి "ఓరి వెధవా! ఏమిటి నీప్రేలాపన? ప్రజలా? ఆహా........."అంటూ బాగా ఊతంతీసుకుని ఫెళ్ళున మొగంమీద ఒక్క దెబ్బ కొట్టాడు.

"ఒరేయి! న్యాయాన్ని సత్యాన్ని పిడికిలితో చంపలేవురా!.........ఓరి కుక్కా! నన్ను కొట్టడానికేమి హక్కుందిరా నీకు?" అంటూ రైబిన్ దగ్గరకు వెళ్ళాడు,

"ఓహో! నాకామాత్రం ధైర్యంలేదు కాబోలు!" అని వెక్కిరిస్తూ మళ్ళీ చెయ్యిసాచి కమీషనరు రైబిన్ తలమీద కొట్టడానికి వెళ్లాడు. తీరా దెబ్బ మీదపడే సమయానికి రైబిన్ గభాలున తలవంచేసాడు. దానితో దెబ్బతప్పిపోవడం అలా ఉండగా కమీషనరు ఆవిసురు ఆపుకోలేక చిన్న పల్టీకొట్టేంటంత పనిఅయింది. కమీషనరును వేళాకోళంచేస్తూ జనంలోనుంచి కేకలు బయలుదేరినాయి. రైబిన్ కోపంతో గట్టిగా అరిచాడు.

"ఏయ్ సైతాను వెధవా! నన్నుకొట్టడానికా! కొట్టేసాహసంచేసి మీదకు రాకు. బలంలో నీకన్న తక్కువవాడినికాను. ఒక్కసారి తలకాయెత్తిచూడు!"

కమీషనరు ఇటూ అటూ చూచాడు. అతనిచుట్టూ జనం దగ్గరగా చేరారు. "ఏయ్ నికేటా!" అని ఒక రైతును పిలిచేడు. కంబళీకోటు వేసుకొని ఒక పొట్టి రైతు ముందుకువచ్చి నిలబడ్డాడు.

"నికేటా వీడికొకక గట్టి చెంపకాయ కొట్టు" అని కమీషనరు అతి సాహసంగా మీసం మెలేస్తూ ఆజ్ఞాపించాడు. ఆ రైతు రైబిన్‌మీదకు వచ్చి కొట్టడానికి చెయ్యెత్తుతున్నాడు. రైబిన్ అతని ముఖంకేసి తీక్షణంగా చూచి "ఇదిగో చూడండి. సోదరులారా చూడండి. చూశారా ఈ పశువులు మనచేతులతోనే మన గొంతుక ఎల్లా నొక్కుతున్నారో? చూడండి! బాగా చూడండి! జాగ్రత్తగా

ఆలోచించుకోండి. ఇతడెందుకంట నన్ను కొట్టడం? ఎందుకంటాను?" అన్నాడు బిగ్గరగా.

ఆ రైతు మెల్లగా రైబిన్ నొక్కటి వేశాడు.

"ఒరే నికేటా! దేవుడున్నాడురోయి. జాగ్రత్త" అని జనం అరచారు.

"కొట్టరా. మళ్ళీ కొట్టు. నే చెపుతున్నాను గదూ? వెయ్యి" అంటూ ఆ రైతును పీక పట్టుకుని కమీషనరు ముందుకొక్క త్రోపు త్రోశాడు. ఆ రైతు ప్రక్కకు తప్పుకుని తలవంచుకొని "ఇక నే కొట్టను" అన్నాడు.

"ఏమిటీ?" అని పోలీసు కమీషనరు గర్జించాడు. మొగం కందగడ్డయి పోయింది. కోపం పట్టడానికి శక్యంకాలేదు. కాళ్ళు నేలమీద చరుస్తుంటే క్రింద గొయ్యి పడిపోయింది నానా బూతులు తిడుతూ రైబిన్‌మీదికి వెళ్లాడు. రైబిన్ తన చేతుల నడ్డంపెట్టాడు. కమీషనరు రెండుదెబ్బలు కొట్టి అతన్ని క్రిందపడ వేశాడు. అంతటితో ఊరుకోక గర్జిస్తూ రొమ్ముమీద కురికి రొమ్ముమీద, తల మీద, ప్రక్కలోను తన్నడం ఆరంభించాడు.

జనానికి పట్టరాని ఉద్రేకం కలిగింది. హుంకరిస్తూ కమీషనరుమీద పడడానికి సిద్ధమైనారు. కమీషనరు సంగతి గ్రహించి ఒరలోనుంచి కత్తిదూసి గవాలున బయట బడ్డాడు. "ఓహో! ఇదా మీరు చేసేపని? గలాటాకు సిద్ధంగావున్నారా?" అన్నాడు.

అతనిమాట కొంచెం తడబడింది. ఇదివరకున్న ధైర్యం తగ్గింది. నెమ్మదిగా ప్రక్కప్రక్కల చూసుకుంటూ అవతలికి జారేడు, కొంచెం వెనక్కి వెళ్ళిన తర్వాత కోపంతో.

"సరి ....... వాడిని తీసుకెళ్ళండి. నేను వెడుతున్నాను, ........కాని ఒరేయి గాడిదల్లారా! వాడెవడో మీకు తెలుసునా? వాడు రాజకీయ నేరస్థుడు. అంటే సాక్షాత్ మన చక్రవర్తిమీద ఎదురు తిరిగినవాడు. వాడు ఎక్కడికెడితే అక్కడే గలాటా చేస్తాడు. తెలుసునా? అల్లాంటివాడిని మీరు దగ్గరకు చేరుస్తున్నారు జాగ్రత్త, మీరు కూడా యెదురు తిరిగిన వాళ్ళక్రిందే లెఖ్క. ఆహా! సందేహం లేదు" అంటూ అరిచాడు.

తల్లి నిశ్చేష్టురాలై నిలబడిపోయింది. భయం, జాలి రెండును ఆమె నావహించినాయి. ప్రజలు ఆవేశంతో వేస్తున్న కేకలు ఆమె చెవుల్లో గింగురుమంటున్నాయి.

"అతనేమైనా తప్పుచేస్తే కోర్టులో కేసుపెట్టండి."

"మరి అతన్ని కొట్టకండి"

"అయ్యా! అతన్ని క్షమించండి."

"నిజమే. ఏమిటి దీనర్థం? ఏమిటా జబర్దస్తీ! ఒక న్యాయం, ఒక పద్ధతి వుండక్కరలేదూ?"

"సరి సరి యిదికూడానా ? ప్రతివాళ్ళని ఇల్లాచావకొట్టేస్తుంటే మనగతేం కావాలి ?"

"వాళ్ళు మనపాలిట దెయ్యాలు ! మన్నందరినీ పీడించే పిశాచాలుకాదూ ?"

ఇల్లా పలువురు పలువిధాలుగా మాట్లాడారు కొందరు పోలీసు కమీషనరును ముట్టడించి కేకలు వేస్తున్నారు. మరి కొందరు రైబిన్ చుట్టూచేరారు. చాలమంది కలసి అతనిని లేవదీశారు. పోలీసులు మళ్ళి అతని చేతులూ కాళ్ళూ కట్టడానికి ప్రయత్నించారు.

"కాస్సేపాగండి, పిశాచాలూ ! అని జనం గొల్లుమన్నారు. రైబిన్ మొగం మీద, గడ్డంమీద ఉన్ననెత్తురును తుడుచుకున్నాడు. తుడుచుకుంటూ ఎదుటనున్న తల్లిమొఖంకేసి చూశాడు. ఆమె ముందుకువెళ్ళి అప్రయత్నంగా చేయిఆడించింది. అతనుముఖం ప్రక్కకు తిప్పేడు. 'నన్ను గుర్తుపట్టాడాయేమిటి ?' అనుకొని విచారంతోటి, సంతోషంతోటీ తలఆడించింది ఇంతలో ఆమెప్రక్కనే మబ్బుకళ్ళ రైతు నిలబడి తనకేసి చూడడం కనిపెట్టింది. చటుక్కున తానుచేసే పనివల్ల కలిగే ప్రమాదం స్ఫురణకు వచ్చింది. ఓహో ! ఏంపనిచేస్తున్నాను ? నన్ను కూడా పట్టుకుంటారేమో ?' అనుకుంది. ఆరైతు రైబిన్‌తో ఏమిటో చెప్పాడు. రైబిన్ నిర్లక్ష్యంగా తలఆడిస్తూ చాలా ధైర్యంగా ఇల్లా చెప్పాడు.

"ఫరవాలేదు.... ప్రపంచంలో నే నొక్కడినే కాను. సత్యాన్ని బంధించడానికి వాళ్ళ తరంకాదు. నే నెక్కడైతే ఉండేవాడినో అక్కడ నా పేరు శాశ్వతంగా ఉంటుంది. అంతే గూడు చెడగొట్టినంత మాత్రాన్న పక్షులేమైపోతాయి ? అక్కడింకా స్నేహితులు, సహచరులు చాలామంది ఉన్నారు."

ఈ మాటలు తనకోసమే చెపుతున్నట్లు తల్లి ఊహించింది.

"సత్యానికి స్థానం ప్రజలే చూపిస్తారు. వాళ్ళే వాటికి తగినగూళ్ళు కడతారు. అందులోనుంచి పక్షులు స్వాతంత్ర్యానికి ఎగిరిపోయేరోజులు త్వరలోనే వస్తాయి. ప్రజలు వాళ్ళని వాళ్ళే ఉద్ధరించుకుంటారు."

ఒక స్త్రీ కడవతో నీళ్ళు పట్టుకువచ్చి కుయ్యో మొర్రో అంటూ జాలి పడుతూ రైబిన్ మొగంకడిగింది. ఆమె మాటలవల్ల రైబిన్ చెప్పేమాటలు సరిగా తల్లికి వినబడలేదు. ఇంతలో పోలీసు కమీషనరూ, కొంత జనం వచ్చారు.

"రండి ; నేను అరెస్టు చేస్తున్నాను. తర్వాత ఎవరు." అన్నాడు కమీషనరు. కమీషనరుమాట ఈసారి చాలాస్పష్టముగాను జబర్‌దస్తీగాను. ఉంది. ఇదివరకు మాట ధోరణి మారిపోయింది.

"ఏయ్ దున్నపోతు ! నేనునిన్ను కొడితే కొడతాను కాని మళ్ళీ నువ్వు నన్ను కొట్టేసాహసం చెయ్యొద్దుసుమా ! జాగ్రత్త !"

"అల్లాగా ? ఏమమ్మా ? నువ్వెవరవేమిటి ? కొండమీదనుంచి దిగొచ్చిన దేవుడివా ?"

జనం గొల్లుమన్నారు. రైబిన్ మాటలు పూర్తిగా వినబడలేదు.

"ఎందుకు మామా ? ఆక్షేపించకు. నువ్వు అధికారుల మీద తిరుగబడ్డావు."

"అయ్యో! బాబూ కోప్పడకండి అతనికి మతిలేదు"

"ఇక ఊరుకో తమాషాగాడివి లాగున్నావే."

"ఇదగో ఇప్పుడునిన్ను నగరానికి తీసుకెడతానులే."

"మహామంచిది. ఇక్కడకన్న అక్కడ కాస్త న్యాయం ఉంటుంది."

ఇలా పరిపరివిధాల జనంలో గోల బయలుదేరింది. అంటే ప్రయోజనం యేమీలేదు. నిరర్థకమయినగోల. పోలీసులు రైబిన్‌ను టౌనుహాలు లోపలికి తీసుకువెళ్ళిపోయారు. జనం ఒక్కొక్కళ్ళే ఇంటిదారిపట్టారు ఆ మబ్బుకళ్ళ రైతు మాత్రం ప్రక్కకువచ్చి ఆమెకేసి ఓరచూపుచూడడం మొదలుపెట్టాడు. భయంచేత ఆమెకు కాళ్ళువణకినాయి. నీరసం నిస్సహాయత్వం తోచినాయి. ఏమయినాసరే అక్కడనుంచి కదలకూడదనుకుని ఏవో కమ్ముల నానుకుని నిలబడింది.

పోలీసుకమీషనరు టౌనుహాలు మెట్లెక్కి నిలబడి, మామూలు జబర్దస్తీ, అహంకారం అన్నీ ఉట్టిపడేటట్లుగా దబాయించడం మొదలుపెట్టాడు.

"ఒరేయి! మీరు వట్టిపిచ్చివెధవలు మూర్ఖులు. మీకుపనికి చాలామూలా తెలియదు. మీరేంచేస్తున్నారో మీకు తెలిస్తే ఇల్లాంటి గవర్నమెంటు వ్యాపారాలలో మీరు జోక్యం యెందుకు కలిగించుకుంటారు? వట్టిపశువులు! నా మంచితనానికి నిజంగా మీరు నా కాళ్ళకి దణ్ణంపెట్టాలి. నేను ఒక్కమాటేస్తేచాలు. మిమ్మల్ని తీసుకెళ్ళి జైలులో పారేస్తారు"

పది పన్నెండుమంది రైతులు నోరు మెదల్పకుండా విన్నారు. కొంచెం కనుచీకటి పడింది. ఆ మబ్బుకళ్ళ రైతు మెట్లదగ్గరకువచ్చి నిట్టూర్పువిడచి—

"ఇదేతంతు ఇక్కడ!" అన్నాడు.

"అవును" అంది తల్లి అప్రయత్నంగా.

అతడు ఆమెకేసి తేరిపారచూశాడు. ఒక్క నిమిషం ఆగి "నీకేం పని?" అని అడిగాడు.

"నేను జరీ వర్తకం చేస్తాను. ఆడవాళ్ళదగ్గర బట్టలు, జరీ ఖరీదుచేస్తాను"

"అల్లాంటి సామగ్రి ఇక్కడేమీ దొరకదే" అన్నాడు రైతు.

హోటలుకి వెళ్ళిపోవడానికి మంచి అవకాశంకోసం చూసిందితల్లి ఆరైతు ఏదో విచారంతో ఆలోచిస్తున్నాడు. చినిగిపోయిన కోటు. చేత్తో వడికిన లాగు తొడుక్కున్నాడు. కాళ్ళకి మేజోళ్ళు లేవు.

ఎందుకో తల్లి ఒక నిట్టూర్పు విడిచింది. అనాలోచితంగా గమ్మున బుద్ధిపుట్టి "ఈ రాత్రికి మీ యింట్లో ఉండనిస్తావా?" అని అతన్నడిగింది. అడగడం

అయితే అడిగింది కాని, ఆమెకేదో సంశయం కలిగి భయంవేసింది. ఊపిరి బిగపెట్టుకొని అతని మొగంకేసి చూసింది. "నికోలే ఇవానిష్‌ను పాడుచేశానుకదా! పాషాను ఇంక చూడనుకాబోలు! అతన్ని చంపుతారేమో!— నే నెక్కడికెడితే అక్కడే నిప్పచ్చరం" అనుకుంది.

ఆ రైతు కొంచెంసేపు నేలకేసిచూస్తూ ఆలోచించాడు

"ఈరాత్రికా? అల్లాగే ఉండొచ్చు. అభ్యంతరమేమిటి? కాని మా ఇల్లు మాత్రం బహు ఇరుకు" అన్నాడు

"సరిసరి ఫరవాలేదు. నేనేమీ ఆగర్భశ్రీమంతురాలిని కాను"

"అయితే ఈరాత్రి మా యింట్లో ఉండొచ్చు" అన్నాడు రైతు. అప్పటి కప్పుడే చీకటిపడింది. తల్లి అటూ ఇటూ చూచి మెల్లగా "అయితే వెంటనే వస్తాను. నా సంచిమాత్రం నువ్వు తెచ్చిపెట్టు" అంది.

ఆ రైతు అంగీకరించాడు. అదిగోబండి అన్నాడు మెల్లగా

ఒక్క క్షణం అయ్యేసరికి రైబిన్ మళ్ళీ టౌనుహాలు మెట్లమీదకువచ్చాడు అతని చేతులు వెనక్కి విరిచి కట్టివున్నాయి. తల, మొగం అంతా కోరాగుడ్డతో కట్టేశారు. మెట్లదగ్గర సిద్ధంగాఉన్న బండిలో కెక్కించారు. బండిలోనుంచి ఖంగుమనే స్వరంతో రైబిన్ తుదిసందేశాన్ని అందిచ్చేడు.

"సోదరులారా! సెలవు. సత్యాన్ని అన్వేషించండి. దాన్ని రక్షించండి. ఎవరైతే మీకు మంచిమాట చెప్తుతారో వాళ్ళను నమ్మండి. సత్యంకోసం మీరు ఎన్నికష్టాలనైనా భరించండి."

"నోరుముయ్యి పోలీస్! చవటా! బండితోల్రా." అన్నాడు కమీషనరు.

"సోదరులారా! మీకు చింతదేనికి? మీరు బ్రతికే బ్రతుకేం బ్రతుకు? దేనికోసం మీరిల్లామాడి నశించిపోతున్నారు? స్వాతంత్ర్యంకోసం పాటుపడండి. అదే మీకింత కూడు పెడుతుంది. సత్పురుషుల్లారా సెలవు" బండిచక్రాల కిరకిరః గుర్రాల అడుగుల టపటపలు పోలీసువాళ్ల హుంకారాలు అన్నీకలిసి రైబిన్ కంఠ ధ్వనిని ముంచేసినాయి.

"నువ్వు స్టేషను దగ్గర ఒక్క క్షణంఆగు. నేవస్తాను, అంతా పూర్తి అయిందిలే." అని ఆముబ్బుకళ్ళ రైతు తల్లితోచెప్పి చక్కాపోయాడు.

౧౧

తల్లి హోటలుకువెళ్ళి బల్లదగ్గరకూచుంది. ముందు రే, రొట్టె ఉన్నై. ఆకలిలేక ఒక చిన్న రొట్టెముక్క కొరికి మిగతాది పళ్లెములో వేసింది. విచారం చేత ఒళ్ళంతా ఏమిటో మందకొడిగాను, నొప్పిగాను ఉన్నట్లు తోచింది; ఆమె ఆ మబ్బుకళ్ళరైతును గురించే ఆలోచించింది. అతని ముఖంచూస్తే ఆమెకేమి ఇద మిద్ధమనే ధైర్యం తోచలేదు. అతడు దగాచేస్తాడేమోననే భయంకూడా కలి గింది ఈ అనుమానాలవల్ల మనస్సంతా చెడిపోయి, ఏమీతోచక దిగాలుపడి అలాగే కూచుంది. హోటలులో వడ్డించే పిల్ల గుమ్మంచగ్గర నిలబడి "ఏంకావాలి ? బజ్జికాయ తీసుకురానా ?" అంది.

"వద్దు నాకక్కరలేదు. ఇందాకటి కేకలుతో నాకు చాలా భయంగాఉంది."

ఆపిల్ల బల్లదగ్గరకువచ్చి కొంచెం ఉద్రేకంతో ఇల్లా చెప్పింది.

"అబ్బ ! పోలీసు కమీషనరు ఎంత గట్టిగా కొట్టాడు ! నేను దగ్గరగా నిల బడి చూచేను. పాపం ! అతని పళ్ళన్నీ ఊడిపోయినాయి. రక్తం దడదబ కట్టేసింది. మొగమంతా వాచిపోయి కళ్ళు పూడిపోయినాయి. అతను తారుపని వాడట సార్జెంటు వెగ్రతాగి ఇక్కడికొచ్చాడు. అల్లాంటివాళ్ళు ఇంకా చాలామంది ఉన్నారని అతనుచెప్పాడు. ఇతనే వాళ్ళకందరికీ పెద్దట. ముగ్గురినేమో పట్టు కున్నారట. అందులో ఒకడు తప్పించుకొని పారిపోయినాడట. వీళ్లలో ఒక పంతులున్నాడట. వాళ్ళకి దేవుడంటే ఏమీ నమ్మకంలేదట. చర్చిలను దోచెయ్య మని ప్రోత్సహిస్తారట అతన్నిచూచి మారైతులు కొందరు చాలా జాలిపడ్డారు. మరికొందరు అతన్ని పూర్తిగా చంపి పారెయ్యాలిసిందే అన్నారు. మారైతుల్లో ఇలాంటి అల్పబుద్ధులున్నారు. ఛీ ఛీ!"

తల్లి ఆమెగడబిడగా చెప్పేమాటలన్నీ శ్రద్ధగావింది. ఆమె ఇంకా లొడ లొడ మాట్లాడింది. "పంటలు సరిగ్గా పండకపోవటమే దీనికంతాకారణమని మా బాబయ్య చెప్పాడు. రెండు సంవత్సరాలనుంచి మాకు పంటపోయింది. ప్రజలకు చాలా విసువుగావుంది అంచేతే ఇల్లాంటి నిర్భాగ్యపు రైతులు తయారవుతున్నారు. సిగ్గుసిగ్గు ! గ్రామసభల్లో రైతులు కొట్లాడుకోవటం చూచితీరాలి ! మొన్ననే ఈమధ్య ఒకరైతు తాలూకు భూమిని శిస్తుకోసం వేలంవేస్తుంటే, ఆరైతు వచ్చి అమీనా నొక్కచెంపకాయ గిరెత్తేటట్లు కొట్టి ఇదిగో నాబాకీ పట్టుకెళ్ళు" అన్నాడు.

ఇంతలో మబ్బుకళ్ళరైతు లోపలికి వచ్చాడు. వస్తూనే తల్లిని 'మూట ఎక్కడుంది' అని అడిగాడు. మూట చూపించడంతోనే దాని నెత్తి "అట్టేబరువు లేదే. సరి. మేర్యా ! ఈమెకు మాఇల్లు చూపిద్దూ" అంటూ అవతలికి వెళ్ళి పోయాడు. "ఈరాత్రి ఇక్కడే ఉంటావా మేమిటి ?" అని ఆపిల్ల తల్లి నడిగింది.

"ఉంటాను. నేను జరీ ఖరీదుచెయ్యడాని కొచ్చేను."

"ఇక్కడ జరీదొరకదే. టంకాల్. డారినాలో దొరుకుతుంది."

"రేపు ఆ ఊళ్లెడతాను ఇవ్వేళ చాలా అయాసముగా ఉంది."

అని టీకి ఖరీదు ఇచ్చేసి ఆపిల్లచేతులో ఈనాంక్రింద మూడు కానులు పెట్టింది. ఇద్దరూ ఆరైతుఇంటికి ప్రయాణమైనారు

"నువ్వెళ్ళమంటే, నేను డారినావెళ్ళి అక్కడున్న జరీపనిచేసే ఆడవాళ్ళను నడుకిక్కడికే తీసుకురమ్మనమని చెపుతాను. నువ్వడికెళ్ళే అక్కరలేదు. ఇక్కడికి ఎంతోదూరంలేదు ఎనిమిదిమైళ్ళు" అంది ఆపిల్ల.

"అక్కరలేదమ్మాయీ" అంది తల్లి.

దారిలో నడుస్తూ ఆరైతుయింట్లో తానేం చెయ్యాలా అని ఆలోచించు కుంటోంది తల్లి. ఇంతలో ఆపిల్ల "ఏమమ్మోయ్! చాలా చెడ్డమకాం చూచుకున్నావే. ఆరైతు చాలా బీదవాడు" అని చెప్పి ప్రక్కనే ఒక చిన్నగుడిసె దగ్గరికి తీసుకువెళ్ళింది. తలుపుతోసి లోపల ప్రవేశపెట్టింది. "అత్త! తాతయ్యినా! ఇదిగో ఎవరో బాటసారి" అని ఒప్పచెప్పేసి వెళ్ళిపోయింది. తల్లి లోపల గుమ్మములో నిలబడి ఎగాదిగా చూచింది. ఆగుడిసె చాలా చిన్నది. కాని చాలా శుభ్రముగా ఉంది. పొయ్యిదగ్గరనుంచి ఎవరో ఒక యువతి తల్లికి దణ్ణంపెట్టి చక్కాపోయింది. గది కెదురుగా ఒకమూల ఒక బల్లవుంది. దానిమీద చిన్న దీపం మినుకుమినుకు మంటోంది. దానిదగ్గర ఇంటి యజమాని బల్లమీద ముత్తాయిస్తూ కూచున్నాడు. అతడు తల్లిని చూచి "లోపలికిరా" అని ఆహ్వానించాడు. "తాత్యాయినా! పైటరీనుపిలు త్వరగా" అన్నాడు ఆ యువతి తల్లికేసి తలయెత్తి చూడకుండానే వెళ్ళిపోయింది

తల్లి యజమాని కెదురుగా బల్లదగ్గర కూచుంది. అటూ ఇటూ చూచింది. తన సంచి కనబడలేదు. ఆమె కేదో అనుమానం కలిగింది ఆరైతు దిగాలుపడి కూచుని ఏమీ మాట్లాడలేదు

అర్థాంతంగా, ఆమెకే ఎందుకన్నానా అని ఆశ్చర్యం కలిగేటట్లు "నామూట ఎక్కడుంది?" అని అడిగింది. ఆరైతు ఏదో ఆలోచిస్తూ "నీమూటా? జాగ్రత్తగానేవుంది? ఇందాక ఆపిల్లదగ్గర సంచి ఖాళీగావుందని అనాలనే అన్నాను. అందులో ఒక కిటుకుంది. అబ్బే! అది ఖాళీగాలేదు. చాలా తూకంగానేవుంది" అన్నాడు.

"అయితేనేమి?"

ఆరైతు లేచి ఆమె దగ్గరకువెళ్ళి

"నువ్వామనిషి నెరుగుదువా?" అని రహస్యంగా అడిగాడు.

"ఆహా!" అంది అదరిపడి. దానితో ఆమెకొక వెలుగు కనిపించింది. ఏదో పెద్దభారం వదలి పోయినట్లయింది. 'అమ్మయ్య' అనుకుంది. ఆరైతు నవ్వేడు;

"నేనప్పుడే గ్రహించాను. ఎప్పుడైతే నువ్వు సంజ్ఞచేశావో అప్పుడే అనుకున్నాను. అతడుకూడా సంజ్ఞచేశాడు. మెట్లమీద నిలబడ్డ ఆ ముసలమ్మ నెరుగుదువా అని నేను అతన్నడిగాను"

"అతనేమన్నాడు?"

"అబ్బో మేము చాలామంది వున్నామన్నాడు"

ఆరైతు నిలోనాకేసి ఒక్కక్షణం రెప్పవాల్చకుండా చూసాడు. ఒక చిన్న నవ్వునవ్వి,

"అతను చాలా గట్టివాడు. ధైర్యశాలి. ఉన్నదున్నట్లు చెప్పేసేడు. వాళ్ళు చావకొడుతున్నా తనపని మానలేదు" అన్నాడు.

సానుభూతితోకూడిన ఈ మాటలు విన్నాక తల్లికి ప్రాణం లేచివచ్చింది. ధైర్యం కలిగింది. అనుమానంపోయింది. గభాలున రైబిన్ అవస్థంతా జ్ఞాపకం వచ్చింది. ఆపుకోలేక పళ్ళు పటపట కొరుకుతూ "దొంగలు! లుచ్చాలు" అని కండ్లనీరు పెట్టుకుంది.

ఆ రైతు దూరంగా నిలబడి తల ఆడిస్తూ "ఈ వెధవపనులు చేయడానికి అధికారులు చాలమందిని యేర్పాటుచేసేరు. సరేకాని నేనొకసంగతి ఊహించుకున్నాను—ఏమిటంటే నీ సంచిలో కాగితాలున్నాయని—నిజమేనా?" అని అడిగేడు

తల్లి కళ్ళు నలుపుకుంటూ "అవును. అతనికే ఇవ్వడానికి తీసుకెడుతున్నాను" అంది.

ఆ రైతు నేలకేసిచూస్తూ గడ్డం సవరించుకుంటూ కాస్సేపు మాట్లాడకుండా ఊరుకున్నాడు.

"అలాంటి కాగితాలు పుస్తకాలుకూడా మాదగ్గరికి వచ్చినాయి. మాకూ అవి కావలసినవే. అందులో వ్రాసేదంతానిజమే. నాకాట్టే చదువురాదు కాని నాస్నేహితుడిచేత చదివించుకుంటూ వుంటాను. నాభార్యకూడా చదువుతుంది."

ఒక్కక్షణం ఆలోచించి "సరేకాని ఇప్పుడా పుస్తకాలేం చేస్తావు?" అన్నాడు.

"నీచేతి కప్పచెప్తాను."

అతనికేమి ఆశ్చర్యం కలుగలేదు. నాకెందుకనలేదు. అంగీకార సూచకంగా "మాకే!" అన్నాడు.

నిలోనా మనస్సంతా రైబిన్ మీదికివెళ్ళింది. అతడిని పెట్టిన బాధలన్నీ ఆమె కళ్ళకుకట్టినట్లు కనిపించేయి. కన్నీరు ధారగట్టింది. అతన్ని గురించిన ఆలోచనతప్ప ఇంకో ఆలోచన ఆమెకు కలుగలేదు. తన సంచీమాటకూడా మరిచిపోయింది. అలాంటిస్థితిలో విస్పష్టమైన స్వరంతో ఇల్లాచెప్పింది.

"వీళ్ళు మనిషిని కొల్లగొడతారు. ఉక్కిరి బిక్కిరిచేస్తారు. బందలోవేసి

త్రొక్కుతారు. దుర్మార్గులు. ఆబాధపడేసునిషి "ఓరి మహాద్రోహుల్లారా! ఏం పనిరా ఇది? అని అడిగితే వాళ్ళని చావగొట్టి నానాహింసలు పెడతారు."

"అవునమ్మా వాళ్ళకి అధికారం చేతుల్లోవుంది—అధికారం!"

"ఆ అధికారం ఎక్కడనుంచి వచ్చింది? మన దగ్గరనుంచే. ప్రజల దగ్గరనుంచే. అంతావాళ్ళు మనదగ్గరనుంచే లాగుకోవడం."

"అవునవును ....... ఇదొక చక్రం." ఇంతలో తలుపు త్రోసుకుని అతని భార్య వచ్చింది. ఆమె వెనకాలే ఇంకొక రైతు వచ్చాడు. ఇంటి యజమానిభార్య • "స్టీపన్! మన అతిధుల కేమైనా ఫలహారం కావాలేమో?" అంది.

"అక్కర లేదమ్మా"

క్రొత్తగా వచ్చిన రైతు తల్లిదగ్గర చేరి "ఏమమ్మోయి! ముందు నే నెవరినో చెప్పుకోనియ్యి. నాపేరు పైటర్ ఈగరో రైబినిన్. అయితే అంతా నన్ను 'షిలోదిఆల్' అంటారు. మీ సంగతులు కొంతవరకు నాకూ తెలుసును. నాకు కాస్త చదువొచ్చును. అంటే నేను కేవలం శుంఠను కానన్నమాట అన్నాడు. తర్వాత ఇంటి యజమానికేసి తిరిగి 'ఏమోయి స్టీపన్! "వార్వారానికోలీనా" అన్ని విషయాల్లోనూ చాలా మంచిదే కాని ఈవిషయం ఏమీ లాభం లేదంటుంది. ఇదంతా కలకో మాటంటుంది. యువజనులు. విద్యార్థులు. రైతుల బుర్రల్లోకి పాలుపోలులేని అభిప్రాయాల్ని ఎక్కించి పాడుచేస్తున్నారని ఆమె అభిప్రాయం. ఏమైతేనేమి? ఇప్పుడొక విషయం చూసేంకదా! ఇప్పుడే మంచి తెలివైన నిఖారసైన బలేరైతుని అరెస్టు చేశారు. ఇదిగో! ఈ ముసలమ్మ బయలుదేరింది....... ఏమమ్మోయి! ఇల్లా అంటున్నానని కోపంవద్దు — నువ్వేమి పనిచేస్తావు?" అంటూ గబగబా గ్రుక్క త్రిప్పుకోకుండా మాట్లాడాడు అతని మాటల ధోరణి చూస్తే ఇప్పుడే దెబ్బలాటలోంచి గెల్చివచ్చినట్లుగా కనుపించాడు. అతని మాట వరుస తల్లికి నచ్చింది. అతని ప్రశ్నకు తగురీతిని జవాబు చెప్పింది. అతను తల్లిని కరస్పర్శచేసి నవ్వుతూ ఇల్లా అన్నాడు.

"స్టీపెన్! చూశావా? నే చెప్పలేదూ? ఈ పని చాలా మంచిది. ఇదే మార్గం. ప్రజలు క్రమంగా తమ సంగతి సందర్భాలు తెలుసుకుని ఆలోచించుకుంటున్నారు. అయితే ఆ * జమీందారిణీ చెప్పేది నిజంకాదు. నిజం చెపితే ఆమెకు ప్రమాదం. నాకు ఆమె అంటే గౌరవమే. ఆమె మంచిదే. మన శ్రేయస్సు కూడా కోరుతూనే ఉంటుంది. కాని, ఆమెకు మాత్రం ఏమీ ఉపద్రవం కలుగకూడదు. ప్రజలు మాత్రం ఏమైనాసరే సూటిగా నడవదలచుకున్నారు. చూశావా? కష్టనష్టాల నాట్టే లెక్కబెట్ట దలచుకోలేదు."

---

• మొబ్బుకళ్ళ రైతు పేరు.

* వార్వారా నికోలీనా.

"అవును. అల్లాగే!............ ఇదిగో ఈమెకు తన సంచివిషయం కొంచెం ఆదుర్దాగా వుంది" అన్నాడు స్టీపన్.

పైటర్ తల్లికేసి తిరిగి "ఏమమ్మోయి! ఆవిషయంలో నువ్వేమీ భయ పడక్కరలేదు. దానికేమీ చెక్కుచెదరదు. ఆ సంచి నా యింట్లోవుంది. ఇప్పుడే స్టీపన్ నీసంగతి, నీకు ఇప్పుడరెస్టయిన రైతుతో సంబంధంవున్న సంగతి చెప్పేడు. వెంటనే నేనతనితో "అబ్బాయీ! ఇలాంటి విషయాలలో చాలా జాగ్రత్తగా ఉండాలి. ఎక్కడా నోరు జారకూడదు సుమా! అని సలహాచెప్పేను. బహుశా నువ్వుకూడా మేము నీదగ్గర నుంచోడంచూచి పసికట్టే వుంటావను కుంటూను. పెద్దమనుష్యుల్ని ముఖాలుచూచే ఆనవాలుపట్టవచ్చు. నిజానికి అలాంటి వాళ్లెందరోవుండరు ప్రపంచంలో. ఇక నీసంచికేమీ ఫరవాలేదు. నాఇంట్లో వుంది ..........మరి..........నువ్వు వాటిని ఖర్చుపెట్టదలచుకుంటే మేమెంతో సంతోషంతో సాయంచేస్తాం. మాకూ పుస్తకాలు కావాలి" అన్నాడు.

"ఆమె అన్నీ మనకే ఇస్తానంటోంది"

"బలే! వహ్వా! ఇకనేమి? ఒకటవరకంగా వుంది. అన్నిటినీ దివ్యంగా ఉపయోగిద్దాం." పైటర్ ఎగిరిగంతేసేడు. సంతోషంతో పచారుచేస్తూ............ "దాని సుఖవంతే! అదే తత్వం. ఒకచోట తెంపితే ఇంకోచోట "తా" మని అతుక్కుంది. బలే! ఏమమ్మోయి; ఆవార్తాపత్రికుంచే అది బలేపనిచేస్తోంది. ఒకటవరకంగావుంది. చక్కగా పని జరిపిస్తోంది. మూర్ఖపుజనం కళ్ళకు కమ్మే సిన పొరను కోసిపారేస్తోంది. అయితే పాపం అధికారులకు చాలా కంటకంగా వుంది. ఇక్కడే అయిదుమైళ్ళ దూరంలోవున్న ఒక భాగ్యవంతురాలి ఇంట్లో నేను వడ్రంపని చేస్తున్నాను. ఆమె చాలా మంచిది. అంతవరకు ఒప్పుకోవలసిందే. నాకు ఆమె అప్పుడప్పుడు చదువుకునేందుకు పుస్తకాలు ఇస్తూవుంటుంది. ఒక్కొక్కప్పుడు అవి చాలా సుఖపుగా వుంటాయి. చదువుతూంటే కునికిపాట్లు కూడావస్తాయి ఒకరోజున మన కరపత్రం ఒకటి, వార్తాపత్రిక సంచిక ఒకటి, ఆమెకు చూపించేను. ఆమెకు కొంచెం కోపంవచ్చింది. "పైటర్! ఇలాంటి వాటి జోలికెళ్ళకు. ఇది తెలివి తక్కువ కుర్రాళ్ళు చేసే అల్లరిపని. ఇందువల్ల శిక్షా లింకా యెక్కువవుతాయి. పైగా ఖైదు, సైబీరియా యాత్రకూడా సిద్ధిస్తుంది" అని మందలించింది.

ఈ మాటలు చెపుతూ చెపుతూ అతను చటుక్కున ఆగేడు. ఒక్కక్షణం తటపటాయించి "ఆ అరెస్టయిన రైతు నీ కేమైనా అవుతాడా?" అని తల్లినడిగేడు.

"ఏమీకాడు. పరాయివాడే"

పైటర్ నవ్వుకుంటూ వెనక్కి చేరగిలపడ్డాడు. రైబిన్ విషయంలో "పరాయి వాడ"ని చెప్పినందుకు తల్లికి మనస్సు చాలాక్షోభించింది. ఆమాట చాలా అన్యాయమనుకుంది. దానిని సర్దుబాటుచేయడానికి "నాకూ అతనికి బంధుత్వంలేదు

కాని చాలాకాలంనుంచి అతన్ని నేను ఎరుగుదును. అతన్ని నాతోడబుట్టినవాని లాగే గౌరవిస్తూవుంటాను" అంది.

పైటర్ తలవాల్చుకుని గడ్డం సవరించుకుంటూ ఏదో ఆలోచిస్తున్నాడు. స్టీపన్ మోచేతుల బల్లమీదపెట్టుకొని వ్రేళ్ళతో బల్లమీద ముక్తాయింపువేస్తున్నాడు. అతని భార్య పొయ్యిదగ్గర కొయ్యబొమ్మలా నిలబడింది. తల్లి ఆమె కోల మొగాన్ని, తుమ్మెదరెక్కల్లాంటి కనుబొమ్మల్ని కళకాంతులు కలిగిన కండ్లనూ చూస్తూకూచుంది. పైటర్ మళ్ళీ సంభాషణ ఆరంభించాడు.

పైటరు .—అంటే. అతను నీకు స్నేహితుడన్నమాట. అతనిప్రవర్తన మంచిది. తన విలువ తనకి తెలుసును. నిజంగా ప్రతివాళ్లూ తెలుసుకోవలసినసంగతే అది. తాత్యాయినా! మనిషంటే అతనే! నువ్వనేది..........

తాత్యాయినా :— అతనికి పెళ్ళి అయిందా?

తల్లి:— అయిందికాని భార్య చచ్చిపోయింది.

తా :— అల్లాచెప్పు. అందుచేతనే అతనికాధైర్యం. పెళ్ళి అయినవాడికి ఆధైర్యం ఎక్కడుంటుంది? అంత సాహసంగా చొచ్చుకెడతాడా? భయపడిపోడూ?

పై :— అదేమన్నమాట? మరి నామాటేమిటి? నాకు పెళ్ళాం బిడ్డలు లేరా? ఉంటేనేమి?

తా :— (పెదిమలు విరుచుకుంటూ) చాలుచాలులే! అయితే నువ్వేమి చేస్తున్నా వేమిటి! మాటలుమాత్రం కోటలు దాటుతున్నాయి. ఎప్పుడో నూటికో రోజున పుస్తకము చదువుతావు. ఇంతేనా? నువ్వు స్టీపను ఆ మూల ఈ మూల చేరి ఏదో గుసగుస లాడుకుంటే ఎవరికేమి వుద్ధరింపు? ప్రజలకేం ప్రయోజనం?

పై :— (కొంచెంనొచ్చుకొని) సరిసరి. ఏమమ్మోయి! అంతే ననుకున్నావా ఏమిటి? నా చేతిలో చాలామంది జనంవున్నారు. నేనే ఇక్కడ జనానికి పురి ఎక్కించేది. సంగతి తెలుసుకోకుండా నువ్వల్లామాట్లాడడం న్యాయం కాదు మరి.

(స్టీపన్ భార్యకేసి చూసి తలవంచుకున్నాడు.)

తాత్యాయినా .— మరిరైతు పెళ్ళిచేసుకోవడ మెందుకు? పనికి సాయంకోసమా? ఇంతాచేస్తే ఏమిటాపని?

స్టీపన్ :— (దీర్ఘాలుతీస్తూ) అవునవును. నీ కింకా పనిచాలదు. ఇంకా పనికావాలి నీకు.

తా .— ఏమిటి మనం చేసేపని? ఈ పనిలో ఏమైనా దమ్మిడీయెత్తు ప్రయోజనం వుందీ? ఎంతపనిచేసినా ఏరోజుకారోజు అర్ధాకలే. మడతకుడుము లెయ్యడమే. పిల్లలుమాత్రం పుట్టుకొస్తున్నారు. దిక్కుమాలిన పనితోటి వాళ్ళ అతీగతీ చూడడానికైనా తీరుబడివుండదు. (మెల్లగా తల్లిదగ్గరచేరి)

నాసంగతి విను. నాకిద్దరు పిల్లలు పుట్టారు. ఒకడు రెండేళ్ళవాడై ఉండగా చూచేవక్షతలేక ఉడుకునీళ్ళల్లోపడి చచ్చిపోయాడు. రెండోవాడు ఈదిక్కుమాలినపని మూలాన్ని ప్రాణంలేకుండానే పుట్టాడు. ఇది నాబ్రతుకు సౌఖ్యం! అందుచేతనే నేచెప్పేదేమిటంటే రైతులు పెళ్ళిచేసుకోకూడదు. పెళ్ళివల్ల బుద్ధిపూర్వకంగా చేతులకు సంకెళ్ళు తగిలించుకోవడమే. రైతుకే నిజంగా ఈతగలాటం లేకపోతే అందరికీ సౌఖ్యావహనమైన జీవితపద్ధతిని యేర్పాటుచేయడానికి ఎక్కువ చొరవగా కష్టపడి పనిచేస్తాడు. సత్యంకోసం నిర్భయంగా ముందుకొస్తాడు. ఏమమ్మా! అంతేనా?

త :— అంతే! ఏమీ సందేహంలేదు. నువ్వు చెప్పినదంతా నిజం. అల్లాకాకపోతే ఈదౌర్భాగ్యపు బ్రతుకును జయించలేం.

తా .— "ఏమమ్మా! నీభర్త ఉన్నాడా?

త :— లేదు. చచ్చిపోయాడు. ఒక్క కొడుకున్నాడు.

తా .— ఎక్కడున్నాడు? నీతోనేనా?

త ;— అతను జైలులో వున్నాడు.

(ఈమాటలు చెపుతుంటే ఆమెకు ఇదివరకులా కష్టంతోచలేదు. గర్వం కలిగింది)

"ఇది రెండోసారి. భగవంతునియొక్క సత్యాన్ని అర్థంచేసుకుని కష్టనష్టాలను లెక్కచేయకుండా జనం అందరికీ దాన్ని వెల్లడిచేసినందుకే. అతను వయస్సుకు చిన్నవాడు. అందంచందం కలవాడు. తెలివితేటలయినవాడు. ఈవార్తాపత్రికవిషయం కనిపెట్టినది మావాడే. రైబిన్‌కున్న వయస్సులో సగంలేకపోయినా మావాడే అతన్ని ఈదారిలో పెట్టినది. ఇందుకే ఇప్పుడు మావాడినెత్తిమీద కొచ్చింది. విచారణ జరుపుతున్నారు. బహుశా సైబీరియాకు పంపుతారు. అయితే నేమి? అక్కడనుంచి తప్పించుకొచ్చి మళ్ళీ ఈ ఉద్యమంకోసం పనిచేస్తాడు."

ఈమాటలు చెపుతున్నకొద్దీ ఆమె హృదయముప్పొంగింది. ఆమె కండ్ల ఎదుట ఒక మ వీరుని ఛాయ కనుబడింది. ఆరోజున రైబిన్‌కు జరిగిన దుర్మార్గం చూచినప్పటినుంచీ ఆమెకడుపు మండిపోతుంది. దానికుపశాంతి కోరింది. తల్లి తానిదివరకు చూచినమంచి అంతాకలిసి ఒక్కసారి ఆమెకొక పెద్దవెలుగు కనుపించింది.

"ఇల్లాంటి వాళ్ళు చాలమంది వున్నారు. ఇంకా పుడతారుకూడాను. జనసామాన్యంయొక్క స్వేచ్ఛకోసం, సత్యధర్మాలకోసం తమ జీవితాలను ధారపోస్తారు"

ముందు జాగ్రత్త పాటించకుండా తల్లి వాళ్ళతో తనకు తెలిసున్నంతవరకు ప్రజల నుద్ధరించడానికి రహస్యంగా జరుగుతున్న విప్లవ ప్రయత్నాలన్నిటిని గురించి చెప్పింది.

ఆ ఉద్యమంలో పనిచేసేవాళ్ళ సంగతి చెప్పేటప్పుడు. ఆమె కిటీపల కలిగిన అనుభవాలన్నిటిని గుచ్చెత్తి ప్రేమమయమైన కథలుగాచెప్పింది ఆ ఉద్యమం యొక్క భావిస్థితినిగూర్చి ఇల్లాచెప్పింది.

"సర్వజన సౌఖ్యావహమైన ఈ మహోద్యమం ప్రపంచం అంతా అన్ని పట్టణాల్లోనూకూడా వృద్ధిపొందుతోంది. సత్పురుషులయొక్క శక్తి సామార్థ్యాలు అనంతం, అపారం. దానికి పెరుగేకాని తరుగులేదు. అది ధార్మిక విప్లవం వచ్చే వరకు పెరుగుతూనే ఉంటుంది."

ఆమె నోటివెంబడి మాటలు అనర్గళమైన ధారగావచ్చేయి. పరిశుభ్రమైన అంతఃకరణలోనుంచి వెలువడే వాక్ప్రవాహంచేత ఆరోజున రైబిన్ పరాభవ దుఃఖాన్ని కడిగివేయడానికి పూనుకుంది. ముగ్గురు శ్రోతలుకూడా నిశ్చేష్టులై వింటున్నారు.

"దారిద్ర్యంచేత. అన్యాయంచేత పీడింపబడుతూ నికృష్టమైనజీవితం గడిపే వాళ్ళందరి బాధకు కారణం ధనికులు, వాళ్ళననుసరించుకొనివుండే ఉపగ్రహాలు. ప్రజలందరూ తమకోసం అంధకారకూపాలవంటి జైళ్ళలోపడి భరింపరాని కష్టముల ననుభవించే ధీరులను కలుసుకోడానికి ప్రయత్నించాలి కించిత్తుఅయినా స్వలాభాపేక్షలేకుండా ఈ మహాపురుషులు ప్రజలకు సౌఖ్యపడడానికి మార్గం చూపిస్తున్నారు. ఆమార్గం కష్టమైనదని వాళ్ళేచెపుతున్నారు తాము చూపేదారిని రమ్మని ఎవ్వరినీ బలవంతపెట్టరు. ఎవరైనాసరే ఒక్కసారి వాళ్ళసంగతి గ్రహించి వాళ్ళవెంటబడ్డారా అంటే ఇకమళ్ళీ విడిచిపెట్టరు. అదే సరియైన మార్గంగా కనుబడుతుంది తప్పకుండా ప్రజలు అల్లాంటి ధీరులనే అనుసరించాలి. వాళ్ళు స్వల్ప ప్రయోజనాలకోసం కక్కుర్తిపడరు. మోసం, దుర్మార్గం, దురాశ మొదలైన అరిష్టాలన్నిటిని నాశనం చేసేవరకు ఆగరు. ప్రజలంతా కళ్ళుతెరచి, ఒక్కటై ఐక్యకంఠంతో నేనే పరిపాలకుణ్ణి, అందరికీ సమాన సత్యాలుగల చట్టాలను 'నేనేచేస్తాను' అని చెప్పగలిగే వరకు తమ పనిని మానరు."

ఆయాసం వచ్చి నిలోనా మాట్లాడలేకపోయింది. నాలుగుమూల్లా చూసి ఇక్కడ చెప్పిన ఇన్నిమాటలు వృధాపోవని నిశ్చయించుకుంది ఒక్క నిమిషం అంతా నిశ్శబ్దంగా ఉన్నారు.

ఇంకా ఏమైనా చెపుతుందేమోనని రైతులు ఆమెకేసి చూసారు.

"అదీ సంగతి" అని నుంచున్నవాడు కూచుని పైటరు సంభాషణ కుపక్రమించాడు.

స్టీపనులేచి ఒళ్ళు విరుచుకుంటూ "ఈపని చెయ్యదలచుకున్న మనిషి మనఃస్ఫూర్తిగా దిగాలి" అని భార్యకేసిచూసి రెప్ప లెగరేసుకుంటూ అన్నాడు.

పై :— అవును. మళ్ళీ వెనక్కితిరిగి చూడకూడదు.

స్టీ :— "ఇప్పుడీపని చాలావరకు వ్యాపించింది"

పైః:— చాలావరకేమిటి? ప్రపంచం అంతాను.

ఇల్లాగే వీళ్ళిద్దరూ చీకట్లో నడిచేవాళ్ళు దారి తడువుకుంటున్నట్లు మాట్లాడుకున్నారు. తల్లి గోడకానుకునే మాటలు జాగ్రత్తగా వింది. తాత్యాయినాలేచి కూచుంది. ఒక్కసారి రైతులుకేసి నిరాదరణగా చూచింది హఠాత్తుగా తల్లికేసి తిరిగి

"నువ్వు ఏదో కష్టంలో ఉన్నట్టున్నావే?" అంది.

తల్లి :— "అవును" అంది.

"నువ్వు చాలా బాగా మాట్లాడతావు. హృదయాన్ని చక్కగా ఆకర్షిస్తావు. నువ్వు చెప్పినప్పటినుండీ నేనూ ఆలోచిస్తున్నాను. ఇల్లాంటి మనుష్యుల్ని ఒక్కసారైనాచూస్తే బాగుండునుగదా దేవుడా! అనుకుంటున్నాను. మన బ్రతుకేమి బ్రతుకు? గొర్రెలబ్రతుకు. బర్రెలబ్రతుకు. నేనన్నాను; నాకూ వ్రాయడం చదవడం తెలుసును. ఏవో పుస్తకాలు చదువుతూనే వుంటాను ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ వుంటాను ఒక్కొక్కప్పుడు ఈ ఆలోచనలతో రాత్రంతా నిద్రపట్టదు. ఇంత ఆలోచనలోను ఏముంది? ఏమీలేదు. పోనీ ఆలోచించడం మానేద్దామాఅంటే ఆలోచించకపోతే నాజీవితం వృధా. ఆలోచించినా వృధాగానేవుంది. జీవితమే వ్యర్థమనిపిస్తోంది. ఇక రైతులుసంగతి పగలల్లా చచ్చేట్లు చెమటోడుస్తారు. ఏమి లాభం? రాత్రి బువ్వకుచాలదు. ఆకలిమండుతుంది. దానితో ఒళ్ళుకూడా మండిపోతుంది. సారా త్రాగడం, దెబ్బలాడుకోవడం. తర్వాత మళ్ళీ చాకిరీచేస్తూ వుండడం. ఇదే తంతు ఎంతసేపూ. పని..........పని..........పని. ఫలితం మాత్రం సున్న"

ఆమె చాలా చిరాకుతో మాట్లాడింది రైతులు కిక్కురుమనలేదు. వీధిలో కుక్కలు మొరిగినాయి. వర్షపుచినుకులు పడ్డాయి. దీపం గుప్పున ఆరిపోయినంత పనై మళ్ళీ వెలిగింది. తాత్యాయినా మళ్ళీ ఆరంభించింది.

"అమ్మా! నువ్వు చెప్పినమాటలన్నీ విన్నాక మనుష్యులు బ్రతుకడం ఎందుకో అర్థమైంది. ఇదొక చిత్రం. నువ్వు చెప్పిందంతా విన్నానా? ఇప్పుడు అట్టే ఆలోచిస్తే 'ఎందుకిదంతా తెలుసుకున్నానా' అని విచారిస్తున్నాను. నువ్వు చెప్పేవరకు నే నిలాంటి సంగతులెప్పుడు వినలేదు. ఈ ఆలోచనే లేదు."

స్టీవన్ మెల్లగా "సరేకాని మనమేదయినా కాస్త భోజనంచేసి ఇంక దీపం ఆరిపేయాలి లేకపోతే జనం మనయింట్లో యింత రాత్రిదాకా దీపం వెలుగుతూ వుండడం కనిపెట్టి అనుమానపడతారు. అనుమానపడితే మనకేమీ ఫరవాలేదు. కాని మన ఇంటికొచ్చిన అతిథికి మాత్రం కష్టం కలగొచ్చు" అన్నాడు.

తాత్యాయినా లేచి పొయ్యిదగ్గిరకెళ్ళింది. పైటర్ నవ్వుతూ మెల్లగా "అవునవును. ఇప్పుడు మనం చాలా జాగ్రత్తగా వుండాలి. కరపత్రాలు పంచిపెట్టిన తర్వాత.........." అని ఏదో ఇంకా చెప్పబోయాడు.

"నా సంగతి నేను చెప్పడం లేదు. నన్ను అరెష్టుచేస్తే మరేమీ అంత బ్రహ్మాండం లేదు" అని మాట కప్పువచ్చాడు పైటర్.

తాత్యాయినా వచ్చి భర్తను లేవమని బల్ల సర్దడమారంభించింది. స్టీపన్ నవ్వుతూ "మనబోటిగాళ్ళలెక్కమిటి పత్రమేమిటి? గడ్డిపోచగాళ్ళం శలగ శలగ" అన్నాడు. అతనల్లా అంటూవుంటే తల్లికి చాలా జాలివేసింది. యెంతో దయగలిగింది వారిద్దరిలా మాట్లాడుకున్నారు.

తల్లి:— నాయనా! నువ్వు అల్లా అనుకోకూడదు. నీ ఉద్దేశ్యం సరికాదు. మనిషి తన సత్తాను నిర్ణయించికొనేటప్పుడు తన రక్తమాంసాలను పీడించి వాళ్ళ లెక్క ప్రకారం గణించకూడదు. తన ఆంతర్యంలో వుండే శక్తిని గ్రహించి ఆ శక్తి తన మిత్రుల కెంతవరకు ఉపయోగిస్తుందో చూచుకుని మరీ లెక్కవెయ్యాలి.

స్టీపన్ .— మాకు మిత్రులెవ్వరు?

త :— అదేమన్నమాట? జనసామాన్యానికి స్నేహితులు తప్పకుండా వున్నారు.

స్టీ :— అవును. ఉన్నారు కాని ఇక్కడకాదు అదే చిక్కు.

త :— సరే అయితే ఆ స్నేహితుల నిక్కడే తయారుచెయ్యాలి

స్టీ :— (ఒక క్షణం ఆలోచించి) సరే ప్రయత్నం చేద్దాం.

ఇంతతో తాత్యాయినా భోజనానికి పిలిచింది. అంతా భోజనంచేస్తూ కబుర్లు చెప్పుకున్నారు. తల్లి మాటలవల్ల ముగ్ధుడై పైటర్ చాలాసేపు మాట్లాడలేదు. చివరికి "అమ్మా! నువ్వు ఇంక ఎవ్వరికంటపడకుండా సాధ్యమైనంత త్వరలో ఇక్కడనుంచి వెళ్ళిపోవాలి. ఈ స్టేషనులో కాకుండా ప్రక్క స్టేషనుకెళ్ళి టపా బండిలో ఎక్కు" అన్నాడు.

"ఏమంత తొందర? నేనుకూడావెళ్ళి దిగబెట్టివస్తాను" అన్నాడు స్టీపన్.

"నువ్వు వెళ్ళకూడదు. వద్దు. ఒకవేళ ఏదైనావస్తే అధికారులు ముసలమ్మ మీయింట్లో పడుకుందా అని నిన్ను అడుగుతారు. అవునంటావు నువ్వు. అయితే ఎప్పుడెళ్ళిందంటారు. నేనే ఫలానప్పుడు దిగబెట్టి వచ్చానంటావు. అల్లాగా! అయితే జైలుకు దయచేయండి అంటారు. తెలిసిందా? జైల్లోకెళ్ళడాని కెవళ్ళూ తొందరపడకూడదు. అందరికీ దాని సమయంవచ్చినప్పుడు అవకాశం వస్తుంది. చక్రవర్తి అయినా ఎప్పుడో ఒకప్పుడు చావక తప్పదనే సామెత ఎరుగవూ? నువ్వు దిగబెట్టకుండా ఉంటే సంగతిచూడు. ఆ రాత్రి మీ యింట్లో పడుకుంది. మరునాడు ఏదో బండి కట్టించుకొని తనదా నితాను చక్కాపోయింది. దానికో ఏముంది? దారిపోయేవాళ్ళెవరో వచ్చి గ్రామంలో ఏదో ఇంట్లోపడుకుని తెల్లవారిన తర్వాత వెళ్ళిపోయారు. ఇందులో ఏమీలేదు" అన్నాడు పైటర్.

"పైటర్! ఇంత భయమెక్కడవచ్చిందినీకు" అంది తాత్యాయినా.

"సరి సరి. మనిషి అయినతర్వాత అన్నీ నేర్చుకోవాలి. భయపడటం

నేర్చుకోవాలి. ధైర్యంగా వుండడం నేర్చుకోవాలి. మన వార్తాపత్రిక చేత్తో పట్టుకున్నందుకేనా మొన్న పోలీసు వాగనావ్‌ను చావకొట్టింది? జ్ఞాపకముందా? ఇప్పుడు అతని ఎత్తుకెత్తు ధనంపోసినా అలాంటి పుస్తకాన్నిగాని వార్తాపత్రికనుగాని అతను ముట్టుకోనైనా ముట్టుకోడు. తెలిసిందా? (తల్లితో) అమ్మా! నే చెప్పేమాట ముమ్మాటికీ నిజం. ఇల్లాంటి జిత్తులన్నీ నాకు తెలుసును. నేను సేవాంతకుడననే సంగతి అందరికికూడా తెలుసును. ఇదిగో ఈపుస్తకాలు కాగితాలు ఎన్నిపడితే అన్ని ఎంతతమాషాగా పంచిపెడతానో చూడు. ఇక్కడ జనం చదువూసంధ్యాలేని మూర్ఖులు. వాళ్ళని భయపెట్టేశారు కాని సహజంగా కాలమే తోసుకొచ్చి మనిషికి వత్తిడి కలిగించి కళ్ళుతెరిపిస్తుంది. అప్పుడతను ఏమిరా సంగతి అని ఆలోచించుకుంటూ ఉంటాడు. అట్లాంటప్పుడు మనం ఈ పుస్తకాన్ని చేతికిస్తే అతని ఆలోచనకు సమాధానంవస్తుంది. 'దాని సంగతంతేరా అబ్బాయీ! బాగా ఆలోచించుకొని ఐకమత్యంతో ప్రవర్తించు' అనే సమాధానం అందులో స్పష్టంగా కనిపిస్తుంది. చదువడం, వ్రాయడం చేతగానివాళ్ళు అనేకమంది చదువుకున్నవాళ్ళకన్న చాలా సూక్ష్మగ్రాహులై తెలివైనవాళ్ళుగా రాణించడం లోకంలో ఉన్నసంగతే. అందులోనూ చదువుకొన్నవాళ్ళు ధనవంతులుకూడా అయియుండి కడుపునిండినబేరమయితే వేరే చెప్పనే అక్కరలేదు, గ్రాహ్యశక్తి అసలే తగ్గిపోతుంది. నేను కొంచెం దేశ దిమ్మరిని. నాలుగు సంగతులూ చూస్తూవుంటాను. బ్రతకడం ఏమి కష్టంలేదు కాని మురికికుండలో పడకుండా ఉండాలంటే కాస్త మెసలుకోవాలి. తెలివితేటలతో ప్రవర్తించాలి. అధికారులుకూడా రైతులధోరణి మహా సులువుగా పసిపడతారు. రైతులు మునుపటిలా సంతోషంగా లేరనీ, అధికారులంటే ముఖం చిట్లించుకుంటున్నారనీ వాళ్ళూ గ్రహిస్తున్నారు. ఈమధ్య ఈ ఊరి దగ్గరే ఒకగ్రామంలో ఒక విశేషం జరిగింది. కొందరు పోలీసులు పన్నులు వసూలు చెయ్యడానికి వెళ్ళారు మంచి ఉషారులోవున్న రైతుబిడ్డలు నలుగురూ చేరి పన్నివ్వమని గట్టిగా నిలబడ్డారు. కొంచెంతీవ్రంగానే వెళ్ళారు. పోలీసు కమీషనరిదంతా చూచి 'ఆరి భడవల్లారా! ఏమిట్రోయి ఈ తిరుగుబాటు! చక్రవర్తి మీదే!" అన్నాడు. దానిమీద ఒకరైతు యువకుడు అతనిపేరు—సివకిన్—లేచి 'పోరా' పో! నువ్వు నీజారుకూడా మట్టిగొట్టుకుపోండి! పైమీదిగుడ్డ నెత్తిమీద వెంట్రుకలుకూడా లాగుకుపోయే చక్రవర్తి ఎంతవాడేమిటి?" అన్నాడు. అంత దూరందాకా వెళ్ళింది వ్యాపారం. అతన్ని అరెస్టుచేసేరనుకో. అయితేయేమి? అతడన్నమాట శాశ్వతంగా నిలచిపోయింది. ఈ చుట్టుప్రక్కల పిల్లపాపలు దగ్గరనుంచీ ఈ సంగతి చెప్పుకుంటున్నారు. ఈ మాట అలాగే పాకిపోతోంది. నిజానికి మనిషికన్న మాట శాశ్వతంకదా! కడుపుకోసం చాకిరీ చేసి చేసి, తాపత్రయం పడి పడి ప్రజలు మొద్దుతేరిపోయారు పాపం;"

పైటర్ ఈ మాటల ధోరణిలోపడి తిండికూడా మరచిపోయేడు. తల్లికి

గ్రామజీవితాన్ని గురించి తన అనుభవాలనేకం చేప్పేడు. మధ్యమధ్య స్టీపన్ భోజనం సంగతి జ్ఞాపకం చేస్తూ ఉండేవాడు. జ్ఞాపకం చేసినప్పుడల్లా కాస్త రొట్టిముక్క కొరికి మళ్ళీ మాట్లాడుతూ ఉండేవాడు. ఇలా చాలాసేపు మాట్లాడుతూ భోజనం పూర్తిచేసి పైటర్ ఛటుక్కున లేచి "ఇకనాకు సమయమై పోయింది. వెళ్ళాలి" అని తల్లి కరస్పర్శనం చేసాడు.

"సెలవు మళ్ళీ కలుసుకోకపోవచ్చు. మొత్తంమీద నీ పరిచయం కలగడం, నీమాటలు వినడం, ఇదంతా అదృష్టమే. నీ మూటలో కాగితాలుతప్ప ఇంకేమైనా ఉన్నాయా? ఒక శాలువా? సరే. స్టీపెన్ జ్ఞాపకం పెట్టుకో. నిలోనా! నీ సంచి స్టీపెన్ ఇప్పుడే పట్టుకొస్తాడు. మరి వెళ్ళొస్తాను. నే నెప్పుడూ నీమేలే కోరుకుంటూ వుంటాను" అని వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిపోయిన తర్వాత మంచి వర్షం కురిసింది. తాత్యాయినా తల్లి కోసం ఒక బెంచిమీద ప్రక్క అమర్చింది. ఇంతలో తల్లి పైటర్‌నుగురించి "మంచి ఉషారైనా మనిషే" అంది.

తాత్యాయినా ప్రక్కకుతిరిగి "అబ్బే! ఉట్టిపోచికోలు కబుర్లపోగు. తెగ వాగుతాడు. క్రియశూన్యం. కబుర్లుతప్ప ఇంకేమీలేదు" అంది.

"నీభర్తమాటేమిటి? యెలాంటివాడు?"

"ఒకమాదిరి పెద్దమనిషి. తాగుడు గీగుడు లేదు. ఏదో పేచీపూచీ లేకుండా శాంతంగా కాపురం చేస్తున్నాం కాని ఒక్కటేలోపం. కొంచెం రిజాలా మనిషి." అంటూ తల్లిపక్కమీద కూర్చుని ఇలాచెప్పింది.

"అయినా, ఈరోజుల్లో కావలసినదేముంది? ప్రజలను బాగా రెచ్చగొట్టాలి. తిరుగుబాటంతపని జరుగవలసిందే. అంతా ఈవిషయమై ఆలోచిస్తూయున్నారు. కాని యెవరిమట్టుకువారు రహస్యం ఇంక వదిలెయ్యాలి. బహిరంగంగా చెప్పగల గాలి. యెవరో కొందరు ముందు బయలుదేరాలి. సాహసం చెయ్యాలి..........

కాని ఒక్క సంగతడుగుతాను చెప్పాలి. ఈఉద్యమంలో వయస్సులోవున్న ఆడవాళ్ళుకూడా పనిచేస్తున్నారా? ఆడవాళ్లుకూడా పనివాళ్ళదగ్గరకెళ్ళి వాళ్ళకి పుస్తకాలు కాగితాలు చదివి వినిపిస్తూవుంటారా? వాళ్ళకిభయం, సిగ్గులేకుండా పనిచెయ్యగలుగుతున్నారా?"

తల్లి ఆప్రశ్నలకు సమాధానంచెప్పి తృప్తిపరచింది. తాత్యాయినా ఒక్క నిట్టూర్పువిడిచి తలప్రక్క కొరగేసి ఇలాచెప్పింది.

"ఒక పుస్తకంలో 'అర్థం ప్రయోజనంలేని జీవితం' అని చదివాను. వాటి అర్థం నాకు తక్షణం స్పష్టంగా తెలిసింది. ఆజీవితంసంగతి నాకు తెలుసును. ఆలోచనలు కలుగుతాయి. వాటికి ఒక వరుస, క్రమం వుండదు. కాపరిలేని మేకల మందలాగు చెదిరిపోతూ వుంటాయి వాటిని కూడగట్టుకొచ్చే దిక్కుండదు. యేంచెయ్యాలో తెలియదు. అర్థంలేని బ్రతుకంటే ఇది. ఇలాంటి జీవితాన్ని వది

లేసి పారిపోవాలనివుంది. అబ్బ! ఈసంగతులన్నీ తలుచుకుంటే మహాబాధగా ఉంటుంది "

ఆమె మాట్లాడుతుంటే ఆమాటలవల్లనే హృదయంలోవుండే ఆవేదన తల్లి గ్రహించింది. ఆమెను కాస్త ఓదార్చాలని "అమ్మాయీ! యేంచెయ్యాలో తెలుసుకో........"అంది.

తాత్యాయినా "సరే అందులోనేవుంది. నీకు పక్కసిద్ధంగావుంది. పడుకుని నిద్రపో" అంది.

తాత్యాయినా వెళ్ళి పొయ్యిదగ్గరనిలబడి ఏమిటో ఆలోచిస్తుంది తల్లి కళ్లు మూసుకుని పడుకుంది. కాళ్ళన్నీ నెప్పులుపెట్టడంచేత మూలగడం ఆరంభించింది.

తాత్యాయినా దీపం ఆరిపేసి దగ్గరకొచ్చి మళ్ళీ నెమ్మదిగా ఇలా చెప్పింది.

"నువ్వు ప్రార్ధన చెయ్యవన్నమాట. నాకుకూడా దేవుడున్నట్లు నమ్మకం లేదు. ఈ దేవుడినిగూర్చి చెప్పే విచిత్రమైన కథలను నేను నమ్మను. ఇవన్నీ మనల్ని భయపెట్టడానికే మనలను మూర్ఖుల్ని చెయ్యడానికే"

తల్లికేదో కష్టంతోచి పక్కమీద ఇటూ అటూ దొర్లింది. తరువాత మెల్లగా తాత్యాయినా చెవులో ఇలా చెప్పింది.

"దేవుడిసంగతి నాకేమీ తెలియదు. కాని క్రీస్తుమీద నాకు చాలా నమ్మకం. 'నీవలెనే నీపక్కవాడినికూడా చూచుకో' అని అతను చెప్పిన సిద్ధాంతంలో నాకు చాలా నమ్మకంవుంది. ముమ్మాటికి నాకందులో విశ్వాసముంది కాని.......... (హఠాత్తుగా) భగవంతుడే వుంటే తన దివ్యశక్తిని మన దగ్గరనుంచి ఎందుకు లాగెయ్యాలి? ప్రజలలో ధనవంతులు పేదలు అనే రెండు పెద్దవిభాగాలు ఎందుకు సాగిస్తున్నాడు? అతను దయాళుడే అయితే మనుష్యులనిల్లా హింసపెడుతుంటే యెందుకు సహిస్తున్నాడు. మనిషిని మనిషి వేళాకోళం చేసుకోవడం, అనేక విధాలయిన దుర్మార్గాలు, పశుత్వం ఇవన్నీచూచి యెల్లా ఊరుకుంటున్నాడు."

తాత్యాయినా ముగ్ధురాలైపోయింది. నిలోనా చీకట్లో ఆమె మూర్తినిచూచి విచారంచేత కళ్ళుమూసుకుంది. తాత్యాయినా తోకత్రొక్కిన తాచుపాములాగు లేచి ఖంగుమనేటట్లు ఇలా అంది.

"ఏమైనాసరే. నాబిడ్డల చావుసంగతి మాత్రం మరచిపోను. దేవుడైనా సరే, మనిషిఅయినా సరే, మరేమైనా సరేకాని ఈ అపరాధాన్ని మాత్రం నేను సహించను. ఊహుం. ఎంత మాత్రం. ఎన్నటికీ క్షమించను."

నిలోనా ప్రక్కమీదనుంచి లేచింది. కడుపు శోకంవల్ల ఆమె పడేబాధను గ్రహించింది. ఓదార్చాలని ఇల్లాఅంది. "ఏమిటంత? ఇంకా నువ్వు మంచి వయస్సులో వున్నావు. ఇంకా కనలేకపోతావా పెంచలేకపోతావా?" తాత్యాయినా ఒకక్షణం ఆగి "లాభంలేదు. ఆ ఆశంతాపోయింది. నాకింకపిల్లలు పుట్టరని డాక్టరు చెప్పేసాడు"

ఇంతలో ఒక ఎలుక అడ్డంగా పరుగెత్తి కాస్త గడబిడచేసింది. వర్షం జోరయింది. వాకిట్లో స్టీపన్ తలుపు తట్టాడు.

"తాత్యాయినా! అప్పుడే పడుకున్నావా?"

"లేదు"

"ఆమె నిద్రపోయిందా"

"ఆ. పోయినట్లే వుంది."

ఆ రైతు నెమ్మదిగా తల్లి పక్కదగ్గరకు వెళ్ళి ఒక కంబళిని ఆమె వంటి మీద కప్పాడు కాళ్ళకి వెచ్చబేయడానికి ఏదో కట్టాడు. ఈ ఆదరణంతా చూచి తల్లి హృదయం ఉప్పొంగింది. కండ్లుమూసుకుని తనలో తానే నవ్వుకుంది. స్టీపన్ పోయి పడుకున్నాడు. గుడిసెలో అంతా నిశ్శబ్దం.

## ౧౨

తాత్యాయినా అమర్చిన పక్కమీద తల్లి కదలకుండా పడుకుంది. అంతా ప్రశాంతంగా ఉంది. కాని, ఆమె మనస్సు మాత్రం రైబిన్ మీదే ఉంది. కండ్లుమూస్తే ఆ అంధకారంలో రక్తకాలువలతో కూడిన అతని ముఖమే కనపడింది అల్లా పడుకుని ఆలోచిస్తుంటే ప్రక్కన స్టీపన్ దంపతుల గుసగుసలు ఆమె చెవులో పడ్డాయి.

"స్టీపన్. ఎటువంటివాళ్ళు ఈ పనిలో దిగారో చూశావా? కాటికి కాళ్ళు చాచుకున్న ముసలివాళ్ళు, పడాలసిన అవస్థలన్నీ పడి, రేపో మాపో లోకాన్ని విడిచి పొయ్యేవాళ్ళు కూడా పనిచేస్తున్నారు సుమీ! మనుష్యులంటే మనుష్యులు వాళ్ళే. నీ సంగతేమిటి? మంచి వయస్సులో ఉన్నావు తెలివితక్కువవాడవు కావు. మరేమంటావు స్టీపన్?"

"అవును. కాని ఇల్లాంటి విషయంలో బాగాఆలోచిస్తేనే కాని దిగకూడదు. కొంచెం ఆగు."

"అబ్బో! ఇల్లా చాలాసార్లు నువ్వు చెప్పనూ చెప్పావు. నేను వినసూ విన్నాను."

"మనం ఆరంభిస్తే ఇదుగో ఈ ఫక్కీగా చెయ్యాలి. ముందు ఒక్కొక్కడినే చాటుగా పిలిచి మాట్లాడాలి. మాటవరుసకి చెప్పుతున్నాను. మన అలేషా వున్నాడు. అతను మంచి చలాకీ అయినవాడు, వ్రాతకోత తెలుసును మొన్న పోలీసులు అతన్ని పెట్టిన హింసకుచాలా కసిగా ఉన్నాడు. షోరియన్ సెర్జీకూడా తెలివైనరైతే. నయాజల్‌కూడా మంచి ధైర్యశాలి. మొదట ప్రారంభించడానికి వీళ్ళు ముగ్గురూ చాలు. వీళ్ళందరితో సంప్రదించి ఒక కూటం ఏర్పాటుచేసి మన

సంగతిచూద్దాం. మనం ఆమె ఎక్కడుంటుందో తెలుసుకోవాలి. ఆమె చెప్పిన మనుష్యులంతా ఎక్కడెక్కడున్నారో ఒక్కసారి మనమే స్వయంగాచూడాలి. నాకేమీ ఫరవాలేదు. గొడ్డలి బుజాన్నేసుకొని కట్టెలుకొట్టేవాడిలాగ పట్టణానికి పోతాను. ఈ విషయంలో నువ్వుమాత్రం జాగ్రత్తగా ఉండాలి. ఏమనిషి విలువ ఆమనిషే సరిగా నిర్ణయించుకోవాలని ఆమె చెప్పినమాట సరిగానేఉంది. ఇలాంటి విషయాల్లో ఎవరితాహతు వాళ్ళు కొంచెం హెచ్చుగానే లెఖ్కవేసుకోవాలి. మరి మనిషంటే మనిషి అతనే. ఆరైబిన్. పోలీసు కమీషనరు దగ్గరకు తీసుకెళ్ళినా సరే; ఆఖరుకి దేవుడి దగ్గరకు తీసుకెళ్ళినా సరే. అతను చెక్కు చెదరడు. తన పట్టు విడువడు. ఈవేళమరి ఆ నికీటా అతన్ని కొట్టడానికెందుకు జంకాడు? అది చాలా అద్భుతమే. కొందరు ఏకమై అన్యోన్యంగా ఉంటే ఏదైనా చేయడానికి పూనుకుంటే క్రమంగా అంతా చేరతారు."

"ఏమి అన్యోన్యం. వల్లకాటి అన్యోన్యం. మీకళ్ళముందర మనిషిని చావ గొడుతూంటే మీరు తెల్లబోయి నోరెళ్ళబెట్టుకుని చూసేరు."

"కొంచెం ఆగుమరి. అతన్ని మేము కొట్టలేదు. అందుకే సంతోషించాలి, సందేహమేమిటి? ఒక్కొక్కప్పుడు అధికారులు నిన్ను కొట్టమని బలవంతం చేస్తే కొట్టవలసి వస్తుంది నువ్వు లోపల ఎంతేడ్చినా కొట్టకలప్పుడు ఈపశుత్వం 'నుండి తప్పించుకోవడం మహాకష్టం. నువ్వు కొట్టలేకపోతే నిన్నే చంపేస్తారు. ఏయి కొట్టు చంపు' అని ఆజ్ఞాపిస్తారు. కుక్క పంది కమ్మని జబర్దస్తీచేస్తారు.. మనుష్యమాత్రుడుగా జీవించడానికి సావకాశంలేదు. కాస్త ధైర్యమైనవాడెవడైనా ఉంటే వాడిని త్వరలో పరలోకయాత్రకి పంపేస్తారు." స్టీపన్ అల్లాగే చాలాసేపు గుసగుస లాడాడు. మధమధ్య ఆవేశంవల్ల గట్టిగా మాట్లాడకపోతే తాత్యాయినా 'ఇస్' నెమ్మది. ఆమె నిద్రలేవగొట్టకు' అని జ్ఞాపకం చేస్తూవచ్చింది

కాసేపటికి తల్లి సుఖంగా గుర్రుపట్టి నిద్రపోయింది. తెల్లవారగట్ల ఇంకా కనుచీకటుండగానే తాత్యాయినా తల్లిని లేపింది. "టీ తయారుచేశాను, కొంచెం పుచ్చుకొనివెళ్ళు. లేకపోతే జలుబు చేస్తుంది" అని చెప్పింది.

స్టీపను తల్లిని పట్టణంలో తాను కలుసుకోవడం ఎల్లాగని అడిగాడు. టీ త్రాగుతూ స్టీపెను చిరునవ్వు నవ్వుతూ ఇల్లా అన్నాడు.

"ఆహా! ఒక్కొక్కప్పుడు అంత తమాషాగా ఉంటుంది ఘటన"

"ఏమిటది?" అంది తాత్యాయినా.

"ఏమిటా? ఈ అవ్వతో పరిచయం. ఎంత సుళువుగా లభించింది?"

"ఈ ఉద్యమంలో ఉండే తమాషా ఇదే. ఇక్కడచూసినా ఇదే ఆశ్చర్యం" అంది తల్లి.

ఆ రైతు, అతనిభార్య విశేషం ఆర్భాటం లేకుండా తల్లికి అవసరమైన ప్రయాణసౌకర్యాలుచేసి సాగనంపారు.

టపాబండిలో కూర్చుని తల్లి స్టీపన్ నెమ్మదిగా యీ ఉద్యమంలో పని చెస్తుంటాడనీ, అతనిభార్య ఎప్పుడూ తెగసంతోషిస్తూవుంటుందని ఊహించుకుంది. తాత్కాయినా తన బిడ్డలచావు నెప్పుడూ మరచిపోదని ప్రతీకారబుద్ధితో భర్త నెప్పుడూ ఏమరనియ్యదనీ ఆమెకు నమ్మకం కలిగింది. తర్వాత ఆమె మనో నేత్రానికి రైబిన్ అతని ముఖంమీద రక్తం, జ్యోతుల్లా ప్రకాశించే ఆ కళ్లు, అతని నోటంబడివచ్చిన మాటలు, అన్నీ జ్ఞాపకానికొచ్చినాయి. ఇదంతా చూస్తూ ఏమీ చెయ్యలేనిస్థితిలో ఉన్నాంకదా అనే విచారం ఆమె హృదయాన్ని కలవరపరిచింది. ఇంటికి చేరేవరకు రైబిన్‌ను చేతులు వెనక్కి విరచికట్టి తీసుకెళ్తూ ఉన్నట్టే కనుపించింది ఆమెకు ఎన్ని గ్రామాలో ఇల్లాగే అజా పజా లేకుండా అణగద్రొక్కబడిన సంగతి జ్ఞాపకంవచ్చింది. ప్రజలు రహస్యంగా సత్యంయొక్క సందేశాన్ని గ్రహించడానికి ఎదురుచూస్తూవున్నట్లు ఆమెకు తోచింది. కొద్దిమంది జనం బుద్ధి లేక జీవితమంతా ఏ ఆదర్శంలేకుండా పశువుల్లాగ పనిచేస్తూ ఉండడంకూడా ఆమె తలుచుకుంది.

ఆట్టే ఆలోచిస్తే ఈ జీవితం నాగరిక సంపర్కంలేని బంజరు భూమిలా కనుపడింది. కాని కష్టపడి పనిచేసేవాళ్ళకిమాత్రం తగినంత ప్రతిఫలం ఇచ్చే టట్లుంది. సత్యం, న్యాయం అనేవిత్తనాలు చల్లితేమీకు నూరురెట్లు ఫలంఇస్తాను, అని న్యాయపరుల నాహ్వానిస్తున్నట్లు ఆమెమనస్సుకి తట్టింది. పట్టణం సమీపిస్తున్న కొలది ఆమె మనస్సు స్వార్థరహితులై, సత్యం ప్రచారంచెయ్యడానికి అహర్నిశలూ కష్టపడే యువజనులపైకి పోయింది వాళ్ళకి తన సాయశక్తులా తోడ్పడడమే కాకుండా తన మాతృప్రేమ మూలకంగా వాళ్ళను లాలించాలనే ఉత్సాహం కలిగింది.

ఇంటికి చేరుకుంది. తలుపు తట్టేసరికి ఏదో పుస్తకం చేత్తోపుచ్చుకుని నికోలేవచ్చి తలుపుతీశాడు. తీస్తూనే చాలా సంతోషంతో "ఏమిటీ, చాలా త్వరగా వచ్చేసినావే ? అప్పుడే అయిందా ? సరి సరి. సంతోషం" అన్నాడు.

శాలువ, సంచి అందిపుచ్చుకునిఇలా అన్నాడు.

"నిన్నరాత్రి ఇక్కడ మనఇల్లు సోదాచేశారు. అగుబడడంలేదూ? కారణ మేమిటా అనుకున్నాను బహుశా నీకేమైనా చిక్కు వచ్చిందేమో ననుకున్నాను. అల్లాంటిదేమీలేదులేపోనీ. నిన్ను అరెస్టుచేయడానికి వస్తే, నన్నువదలి పెట్టరు."

మాట్లాడుతూ ఇద్దరూ భోజనాలగదిలో కెళ్ళేరు.

"కాని వాళ్ళు నన్ను ఉద్యోగంలోనుంచి తప్పిస్తామంటున్నారు. అందు కోసం నాకేమీ విచారంలేదు. మూడాదుడుకులేని రైతులను లెక్కపెట్టే ఈ ఉద్యో గానికి ఆరైతుల దగ్గరనుండి వచ్చే డబ్బులోనుంచి జీతం పుచ్చుకోవడం కూడా నాకు చాలా కష్టంగానేవుంది. నాఅంతటనేనే ఆఉద్యోగం వదిలేస్తే అసహ్యంగా

వుంటుందని ఊరుకున్నాను. నామిత్రులకుకూడా కష్టంగానేవుంది. ఇప్పుడీసమస్య దానంతటదే పరిష్కారమైపోయింది నాకు సంతోషంగానేవుంది"

తల్లిహార్చుని ఇల్లంతా కలయచూసింది అంతా చిందరవందరగా కాగితాలు బొమ్మలు వగైరాలన్నీ అటూఇటూ పడున్నాయి గోడకంటించిన కాగితాలన్నీ సగం చింపేసి ఉన్నాయి. నేలమీదున్న పలకలన్నీ తవ్వేసి ఉన్నాయి. పొయ్యి దగ్గరంతా బూడిదమయం కిటికీఊచలు విరిగిఉన్నాయి. ఇదంతాచూచి తల్లి ముక్కుమీద వ్రేలువేసుకుని చూచింది.

"వాళ్ళు తమకి ఊరికే జీతాలివ్వడంలేదని చూపించదలచుకున్నారు" అన్నాడునికోలే బల్లమీద యెంగిలీగిన్నెలు, పళ్ళేలు. బొగ్గులు, రొట్టెముక్కలు, పుస్తకాలు వగైరా చెత్తచెదారం పడున్నాయి తల్లి చిన్నినవ్వు నవ్వింది.

నికోలే "నేనే ఇదంతా సర్దడం యెందుకని ఊరుకున్నాను. వాళ్ళుచేసిన గలభానంతటినీ బాగుచేయదలచుకోలేదు. నిలోనా! ఫరవాలేదు పోనిద్దూ. బహుశావాళ్ళు మళ్ళీవస్తారేమో అనుకుంటాను. అంచేతే యెందుకీసర్దడం అని ఊరకున్నాను ఇది సరేకాని నీవెళ్ళిన ప్రయాణం ఎలావుంది" అన్నాడు. ఈ మాట అడిగేటప్పటికి తల్లి ఉలికిపడింది. రైబిన్‌మూర్తి కండ్లకగుపడింది. ఇంత సేపటివరకు ఆసంగతి చెప్పనేలేదుకదాఅని కించపడింది కుర్చీకానుకొని తన కధంతా చెప్పింది. ఆచెప్పడంలో "వాళ్ళు అతన్ని పట్టుకున్నారు" అనేసరికి నికోలే ఒళ్ళు జలదరించింది.

"పట్టుకున్నారూ? ఎల్లాగ?" అని అడిగేడు.

తల్లి ఆతని ప్రశ్నలన్నింటిని ఆపి తనగాధంతాచెప్పింది. వాళ్లు రైబిన్‌ను పెట్టిన హింసంతా క్రమం తప్పకుండా చెప్పింది

నికోలే కుర్చీకానుకుని తెల్లబోయి ఆశ్చర్యంతో పెదిమలు కొరుక్కుంటూ విన్నాడు. అతనిముఖం చాలాచిన్నపోయింది. నిలోనా యెప్పుడూ అంత దీనత్వం అతనిముఖాన్ని చూడలేదు.

తల్లి తన కధంతాచెప్పేసరికి అతనులేచి ఒక్కనిముషం జేబులో చేతులు పెట్టుకుని ఇటూఅటూ పచారుచేసాడు. పొర్లివస్తూన్న ఆవేశాన్ని. అశ్రువులను కూడా అపుచేసుకుని తల్లి కేసిచూశాడు.

"నిలోనా! మనమిక కాలయాపన చెయ్యకూడదు. మనమే ఆపనిని స్వయంగా చేసే పూచీపెట్టుకుందాము."

"ఓహో! అతడు బలేవాడు. దర్జాపురుషుడు. ఇలాంటి వాడికి పాపం ఖైదులో చాలా యిబ్బంది. అక్కడ చాలా బాధపడతాడు.

"కాని ఈ కమీషనర్లు సార్జెంట్లు వీళ్ళంతా ఏముంది. వీళ్ళంతా ఒక తెలివితేటలైన ద్రోహిచేతుల్లో కీలుబొమ్మలు, సర్కసువాడిచేతిలోని కొరడాలు. అందుచేతనే నేనుకొరడా నేమనను. అసలు సర్కసువాడి క్రూరత్వానికి ఒప్పు

కున్న జంతువునే చంపాలంటాను" అన్నాడు నికోలే. అతికష్టంమీద ఉద్రేక ఆపుకున్నాడు.

తల్లి అదంతా చూస్తూకూచుంది. కోపంతో అతని గదంతా చిందులు త్రొక్కినట్లు పచారుచేశాడు.

"ఎంతదారుణమో చూడు! కొందరు మూర్ఖులుచేరి తమ అధికారాన్ని చలాయించడానికని జనాన్ని నానాహింసా పెడుతున్నారు. పశుత్వం పెచ్చుపెరిగిపోయింది. క్రూరత్వం పరిపాటైంది. జాతిజాతంతా అధఃపాతాళానికి పోతోంది. జాతి యెంత విచ్ఛిన్నమైందోచూడు. ఒక భాగం ఇంకో భాగాన్ని హింసపెట్టి పశుత్వం దాలుస్తోంది. దాని కడుపూ ఆజ్ఞ లేకపోవడంవల్ల జనాన్ని హింసపెట్టాలనే యావ యెక్కువై పోతోంది. ఇక రెండోభాగం ఈ అవస్థలన్నీ పడి ప్రతీకారం కోసం ఆక్రోశిస్తుంది."

"ఇక మూడవరకం బాగా దెబ్బలు తినితిని మొద్దుతేరి మూర్ఖులైపోయి, మాటామంతీ లేక శవాల్లాగు పడివుంటుంది. వీళ్ళే జాతినంతా భ్రష్టుచేసేస్తున్నారు"

అంతటితో ఆగి తలుపునానుకొని రెండుచేతుల్తోటీ తలగట్టిగా నొక్కుకుని మాట్లాడకుండా కాస్సేపు నుంచున్నాడు.

"ఈ పశువుల జీవితంలో పడుంటే మనం కూడా అప్రయత్నంగా పశువులమై పోతాం" అన్నాడు.

ఏద్వలేక నవ్వినట్లు ఒకచిన్న వెర్రినవ్వు నవ్వి అతను తల్లిదగ్గరగా వెళ్ళి ఆమె చెయ్యిపట్టుకుని "నీమూట యెక్కడుంది?" అని అడిగాడు.

"వంటయింట్లో వుంది"

"గుమ్మంలో గూఢచారి వున్నాడు. ఇన్ని కాగితాలు యీవేళ యెవరికీ తెలియకుండా బయటికి పంపడం చాలా కష్టం వాటిని దాచడానికి స్థలంకూడా లేదు. బహుశా వాళ్ళు మళ్ళీ యీరోజురాత్రి వస్తారనుకుంటాను. నువ్వు అరెస్టవడం నాకిష్టంలేదు. ఈశ్రమ వృధాఅయితే అవనియ్యి. ఏంచేస్తాం? ఆ కాగితాలు తగలేసేద్దాం"

"ఏకాగితాలు?"

"నీమూటలో వుండేవి"

అప్పటికి నికోలే అభిప్రాయం తల్లికి తెలిసింది. ఎంత విచారంలో వున్నా తాను చేసుకువచ్చినపనికి గర్వం కలిగి నవ్వువచ్చింది.

"అందులో యేమీలేవు. కాగితాలన్నీ ఖర్చు అయిపోయినాయి" అని తల్లి తాను యీఉద్యమం అంటే సానుభూతిగల రైతులకెల్లా అందిచ్చినదీ చెప్పింది. నికోలే మొదట కొంచెం విసుక్కున్నాడు. తర్వాత ఆశ్చర్యపడ్డాడు. ఆఖరుకి సంతోషం పట్టలేకపోయాడు.

"అమ్మా!....ఆహా! నువ్వు చేసుకొచ్చిన పని........నీకు ఈ మహోద్య

మంలో ఉండే విశ్వాసం చూస్తే నాకు పరమానందం అయిపోయింది. నీ ఆత్మ చాలా పరిశుద్ధమైంది. నాకు నీమీదఉండే ప్రేమ నాతల్లిమీదైనా వుండేదికాదు"

తల్లి అతన్ని కౌగిలించుకుని ఆనందబాష్పాలురాల్చి మూర్ధాఘ్రాణం చేసింది.

"అమ్మా ! నేను తెలివితక్కువగా చెప్పడంలేదు. సరిగానే చెపుతున్నాను. నువ్వు బలేమనిషివి. ఆహా !" అన్నాడు నికోలే,

"నాయనా ! నిన్నుకూడా నేను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. నా రక్తంలో రక్తంగా భావించుకుంటున్నాను" అంది తల్లి సంతోషం పొర్లిపోతూ.

ఆనందం అనురాగంతోకూడిన వాళ్ళ అన్యోన్య అభినందనాలు ఒక్కటై పోయినాయి. వాళ్ళిద్దరూ ఇల్లా మాట్లాడుకున్నారు.

నికోలే :— అమ్మా! నీలో వెన్నలాంటి మృదువైనశక్తి చాలావుంది. ఆ మృదుత్వం వల్లనే నువ్వు జనం హృదయాలను ఆకర్షించగలుగుతున్నావు. నువ్వు జనాన్ని బాగా వర్ణిస్తావు. వాళ్ళజీవితం బాగా కనిపెడ్తావు.

త :— నాయనా ! నేను మీ జీవితం ప్రత్యక్షంగా చూస్తున్నాను. నాకు దాని అంతర్యం బాగా అర్థం అవుతోంది.

ని :— నిన్నెవరు ప్రేమించకుండా వుంటారు ? ఒక మనిషిని ప్రేమించడం అంటే చాలా గొప్ప సంగతి. మంచిది కూడాను. తెలుసునా ?

త :— నాయనా ! నిర్జీవులై పడియున్న జనాన్ని పునర్జీవులుగా చేస్తున్నది మీరే మీకు చాలా పనివున్నట్లు నాకు కనిపిస్తునే ఉన్నది. చాలాశాంతం, ఓపికా కావాలి మీశక్తి వృధాకాకూడదు. అది జీవితానికెంతో అవసరం ఇంతకీ అసలు అక్కడ జరిగిందేమిటో చెప్తాను విను. ఆ రైతుభార్య ఒకామె వుంది...............తల్లి ఆ కథంతా చెప్పింది. నికోలే దగ్గరగా కూచుని అతి ఆత్రంగా ఆమె చెప్పిన కథంతా విన్నాడు.

"అమ్మా ! అద్భుతం ! నువ్వు జైలు కెళ్ళడానికి చాలా సావకాశాలు ఉన్నాయి. ఆహా.......రైతుల్లో కూడా కలకలం పుట్టినట్లు స్పష్టంగానే కనిపిస్తోంది, అందులో విశేషం యేముంది ? అది సహజమే. మనం గ్రామాల్లో పని చేసేటందుకు మనుష్యులను ప్రత్యేకంగా యేరాలి. జనం స్తోమతు బాగా ఉండాలి. వున్నవాళ్ళు చాలరు. ఏ మూలకీ జనం ? వందలకొద్దీ కావాలి పనిచేసే మనుష్యులు."

"ఇల్లాంటప్పుడు మరి పాషా, ఆంద్రీ బయటవుంటేనా ?" అంది తల్లి మెల్లగా.

నికోలే ఆమెకేసి ఒక చూపు చూచి తలవంచుకుని ఇలా అన్నాడు.

"నిలోనా ! నీకు కష్టంగా వుంటే వుండవచ్చు కాని ఒక్కసంగతి చెప్పక తప్పదు "

"నేను పావెల్‌ను బాగా యెరుగుదును. అతను ఖైదును వదలి పెట్టడు.

విచారణ జరగాలనే అతని కోరిక. ఒక్కసారిగా తారాజువ్వలా పైకెగరాలని అతని వూహ. కనుక విచారణ వదలి పెట్టడు. నా అభిప్రాయంకూడా వదలిపెట్ట కూడదనే. అంతగా అయితే సైబీరియానుండే తప్పించు కొస్తాడు."

"సరే. తన వుద్యమానికి యెల్లాచేస్తే మంచిదో పాషాకే తెలుసు" అంది తల్లి ఒక్క నిట్టూర్పు విడిచి

నికోలే గమ్మున లేచాడు. సంతోషంతో ఉప్పొంగి పోయాడు.

"సంతోషం. అమ్మా! నా జీవితంలో ఈ క్షణంవుందే, ఇది మహా పవిత్ర మైంది ఇదే నా జీవితంలోకల్లా ఘనమైన వేళనుకుంటాను. రా, ఒక్కసారి మాతృదేవిని కౌగలించుకోనియ్యి" అన్నాడు.

వాళ్ళిద్దరూ ఒకళ్ళకేసి ఇంకొకళ్ళు దృష్టిసారించి కౌగిలించుకున్నారు:

నికోలే "సరి.... మంచిది" అన్నాడు.

తల్లి కౌగిలి వదిలేసి సంతోషంతో మెల్లగా నవ్వింది.

తక్షణమే నికోలే "అమ్మా! అక్కడ నువ్వుచూచిన రైతు ఒక్కసారి ఇక్కడకొస్తే బాగుండేది. గ్రామాల్లో ప్రచారంచెయ్యడానికి రైబిన్‌నుగూర్చి మనం తప్పకుండా ఒక కరపత్రం అచ్చెయ్యాలి. ఒక్కసారి అతడామాత్రం ధైర్యంగా బయటకొచ్చాడంటే ఇక ఫరవాలేదు. పైగా ఈ వుద్యమానికి చాలా లాభం. నేను ఇదిగో ఇప్పుడే కరపత్రం వ్రాస్తాను. లూడ్మిలా త్వరగా అచ్చువేసేస్తుంది. కాని ఒక్కసంగతి. ఇది గ్రామాలకు ఎవరుపట్టుకెడతారా అనే విషయం తేలాలి" అన్నాడు. "అంత ఆలోచనకేముంది? నే తీసుకెడతాను" అంది నిలోనా.

"వద్దు వద్దు. వైషోవికవ్! ఎందుకు ఈపని చెయ్యకూడదా అని ఆలో చిస్తున్నాను. అయినా మాట్లాడిచూస్తాను. కాని నువ్వు అతనితో మాట్లాడి చెప్ప వలసిన సంగతులు చెపితే బాగుంటుంది"

"కాని నేనేమిచేస్తాను?"

"ఆవిషయం ఆదుర్దాపడకు"అని నికోలే కూచుని వ్రాయడం ఆరంభించాడు. తల్లి బల్ల సర్దుతూ అతనికేసి చూస్తోంది. అతని చేతిలో కలం గడగడవణకడం కనిపెట్టింది. కలం చరచర నడిచింది. ఒక్కొక్కప్పుడు అతని మెడ అదిరేది. ఇంకొక్కప్పుడు తల వెనక్కివాల్చి కళ్ళుమూసుకుని ఏమిటో ఆలోచించేవాడు. ఇదంతాచూచి తల్లికి ఆవేశం కలిగింది, "కానియ్యి. బాగా తెగేసివ్రాయి. దుర్మా ర్గులు! రాక్షసులు! వాళ్ళని దయతలచకూడదు" అంది.

నికోలే లేచి "సరి, ఇదిగో తయారయింది. ఇది జాగ్రత్తగా నీ ఒంటిమీద్నే దాచుకో. పోలీసువాళ్లొస్తే నిన్నుకూడా సోదాచేస్తారనే సంగతిమాత్రం మరచిపోకు, అన్నాడు.

"ఏడిశారు, వాళ్ళమొఖం" అంది తల్లి మెల్లగా.

* * * *

సాయంత్రం డాక్టర్ ఇవానిష్ వచ్చాడు. గదిలో అటూ ఇటూ పచారుచేస్తూ హఠాత్తుగా ఇల్లా అన్నాడు

"అధికారులకేదో కిర్రి ఎక్కినట్లుందే నిన్నరాత్రి ఏడుచోట్ల సోదాలు. ఆ జబ్బుగావున్న కుర్రాడెక్కడ ?"

"అతడు నిన్ననే వెళ్ళిపోయాడు. ఇవ్వేళ శనివారంకాదూ ? అందుచేత కూలీలకు పుస్తకాలు చదివి వినిపించడాని కతనికి మనస్కరించలేదు" అన్నాడు నికోలే.

"అదే బుద్ధితక్కువపని తలపగిలి తనుంటే చదువేమిటి ?

"నేను అతన్ని మానిపించడానికి చాలా ప్రయత్నం చేశాను. కాని లాభం లేకపోయింది."

"బహుశా అతను కాస్తబయటికి పోయినట్లున్నాడు" అంది తల్లి.

నికోలే :— ఇవాన్ ! నీకిక్కడేమీ పనిలేదు ఇక్కడికిప్పుడు కొంతరు స్నేహితు లొస్తారు. నువ్వెళ్ళిపో. అమ్మ ! నిలోనా !ఆకాగితం అతనిచేతికియ్యి అన్నాడు.

డా. ఇవానిష్ :— ఓహో ! ఇంకో కాగితమా ?

ని :— అవును. అదితీసుకెళ్ళి అచ్చువేయడానికిచ్చి రావాలి.

డా :— సరే ఇస్తాను. అంతేనా ?

ని :— గుమ్మంలో గూఢచారి వున్నాడు.

డా :— అవును. చూశాను. నా ఇంటిముందరకూడా వున్నాడు. సెలవుఅమ్మా ! సెలవు.........ఇదిగో ఇంకోసంగతి, శ్మశానంలో జరిగిన గలాటా చాలా మంచిదే అయింది తెలుసునా ? ప్రజల్లో ఏక గడబిడగావుంది. తప్పని సరిగా వాళ్ళువిషయాన్ని గురించి ఆలోచించుకుంటున్నారు. నికోలే ! నువ్వు ఆవిషయంమీద వ్రాసినవ్యాసం చాలాబాగుంది. సరియైన టైములోకూడా పండింది. అందుచేతే నేనెప్పుడూకూడా చెడ్డరాజీకన్న, మంచిగలాటాయే మంచిదంటాను.

ని :— సరే. ఇక నువ్వువెళ్ళు.

డా :— నిలోనా ! ఒక్కసారి నీకరస్పర్శనం చెయ్యనియ్యి. ఆకుర్రవాడుమాత్రం చాలా తెలివితక్కువపని చేశాడు. అతని చిరునామా తెలుసునా ?"

నికోలే చిరునామా ఇచ్చేడు.

డా :— రేపు నేను అతడ్ని కలుసుకుంటాను. అతడు మంచిగట్టివాడు.

ని :— ఓ ! చాలామంచివాడు. సందేహమేమిటి ?

డా :— అతడ్ని జాగ్రత్తగా కాపాడాలి. అతనిబుర్ర మంచిది. అల్లాంటివాళ్ళల్లో నుంచే కూలినాలి జనానికి ఉపయోగపడే మంచి మేధావులు బయలుదేరాలి. మనమంతా ఏపనీ, పాటా, పూచీగీచీ, లేని ప్రవాసాలకెడితే మనస్థలం ఆక్ర

మించుకొనేందుకు అలాంటివాళ్ళు తయారుకావాలి. ఇంతచేస్తే ఏమవుతుందో ఎవరు చెప్పగలరు ?

ని :— ఇవాన్ ! నీకు వాగుడెక్కువైపోయింది సుమా ?

డా :— నాకు ఇవ్వేళ చాలా సంతోషంగా ఉందోయి. ఈ ధోరణికదే కారణం. సరి నేపోతున్నాను. అంటే మీరు ఖైదుకోసం కనిపెట్టుకున్నారన్నమాట. ఇక్కడ నీకు కావలసినంత విశ్రాంతి దొరుకుతుందనుకుంటాను.

ని :— సంతోషమే. కాని నేనంత అలిసిపోలేదు.

తల్లి వాళ్ళ సంభాషణంతా వింది. కూలినాలి జనంఅంటే వాళ్ళకుండే అభిమానం, జైలుకు వెళ్ళవలసివచ్చినా, ఇంకా ఎన్ని కష్టాలువచ్చినా తమ పని మానకపోవడంచూచి ఆమెకు చాలా ఆనందం కలిగింది డాక్టర్ వెళ్ళిపోయిన తర్వాత నికోలే, తల్లి,ఇద్దరూ స్నేహితులకోసం ఎదురుచూస్తూ ఏదో మాటాడుకుంటూ కూచున్నారు. నికోలే ఆమెకు ప్రవాసంలోఉన్న మిత్రులనుగురించీ, తప్పించుకొనివచ్చి మళ్ళీ ఉద్యమంలో మారుపేరులతో పనిచేస్తూన్న వాళ్ళను గురించీ చెప్పాడు. స్వాతంత్ర్యంకోసం తమ శక్తినంతా ధారపోసే నవయుగ వీరుల కథలను అతను మెల్లగా ఆమె చెవిలో ఊదాడు. అతడా కథలు చెపుతూంటే గోడలుకూడా ప్రతిధ్వనించినట్లు కనుపించింది

తల్లికీ కథలు వినగా వినగా తన కండ్లకేదో ఛాయకమ్మినట్లు తోచింది. ఎన్నడూ ఆ వీరులను తాను కండ్లతో చూడకపోయినా వాళ్ళమీద గొప్ప ప్రేమ కలిగింది. ఆమె మానసికదృష్టిలో ఈ యువకులంతా ఏకమై ఒక బ్రహ్మాండమైన శక్తిరూపందాల్చి, భూమండలమంతా తిరుగుతూ, సత్యం, ధర్మం, సమానత్వం మొదలైన సంగతులను ప్రజలకు తెలియజేస్తూ నిర్జీవులనుకూడా ఉత్సాహంతో తాండవింపచేస్తున్నట్లు కనుపించింది. ప్రపంచాన్నంతా దాస్యకూపంలో ముంచే దురాశ, క్రూరత్వం, అసత్యం అనే మూడు దుర్గుణాలను నాశనంచేసి, అందరికీ సమాన సత్త్వాలుగల జీవితాన్ని నిర్మిస్తున్నట్లు తోచింది. ఆ దృశ్యం తలుచుకుని ఆమె అపరిమితానందం పొందింది. ఆవేళ ఆమెకుచాలా తృప్తికలిగింది

"అయితే పోలీసులు రావడంలేదే" అన్నాడు నికోలే.

తల్లి విసుగుతో "పోనిద్దూ ఆ కుక్కలతో పనేమిటి ?" అంది.

"సరి నీకు పడుకునేవేళయింది. బాగా అలసిపోయినావు కూడాను. నువ్వు చాలా బలంగానేవున్నావనే చెప్పాలి. ఇంత గొడవగావున్న రోజుల్లో శాంతంగా కాలం తర్లించేస్తున్నావు. జుట్టుమాత్రం గబగబా నెరిసిపోతోంది. వెళ్ళి పడుకో" అన్నాడు నికోలే.

ఇద్దరూ ఎవరిగదిలోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

## ౧౩

తల్లి రాత్రి అంతా సుఖంగా నిద్రపోయింది. తెల్లవారుతూవుంటే యెవరోవచ్చి వంటయింటి తలుపుతట్టారు ఆ చప్పుడుకు మెళకువవచ్చి లేచింది. ఇంకా కనుచీకటిగానేఉంది. నిశ్శబ్దంగా ఉంది. పైమీదబట్ట కప్పుకొని వంట యింట్లోకి వెళ్ళి "ఎవరువారు ?" అని అడిగింది.

"నేను" అని పరిచయమైన కంఠధ్వని వినిపించింది.

"నేనంటే ?"

"తలుపుతీద్దూ"

తలుపుతీసింది. ఇగ్నాటీ లోపలికొచ్చాడు.

నవ్వుతూ "సరే. అయితే నేనేమీ పొరబాటు పడలేదన్నమాట. రావడం సరియైనచోటికే వచ్చాను" అన్నాడు.

అతని ఒళ్ళంతా బురద. మొఖం వెలవెల బారుతూవుంది, కళ్ళు గుంట బట్టి ఉన్నాయి.

"మాగ్రామంలో కొంపలంటుకున్నాయి అరెస్టు లారంభమైనాయి" అన్నాడు. మెల్లగా తలుపువేసి. "నాకు తెలుసు"

"ఆ ! అల్లాగా ? నీకెల్లా తెలిసింది ? ఎవరు చెప్పారు ?

తల్లి తనకెల్లా తెలిసిందీ సూక్ష్మంగా చెప్పి "మిగతా వాళ్ళనుకూడా పట్టు కున్నారా ?" అని అడిగింది.

వాళ్ళక్కడలేరు. సేనలో చేరడానికెళ్ళారు. రైబిన్‌తో సహా మొత్తం అయిదుగురిని పట్టుకున్నారు. నాకోసం వెతుకున్నారనుకుంటాను. వెతికితే వెతక నియ్యి. ఏమైనాసరే నేనక్కడికి వెళ్ళనేవెళ్ళను. ఇంకా మనవాళ్ళున్నారక్కడ. ఏడుగురు యువకులు, ఒకస్త్రీ ఉన్నారు. ఫరవాలేదు వాళ్ళంతా నమ్మకమైనవాళ్ళే" అని భుజాలెగరవేస్తూ చెప్పాడు.

"ఈఇల్లు ఎల్లాకనుక్కున్నావు ?"

"ఈ ఇల్లేనా ? సంగతంతా చెపుతానుండు" అని ఇగ్నాటీ కూచుని తన గాథంతా ఇలా చెప్పాడు.

"ఒకరోజు రాత్రి పోలీసులు తిన్నగా తారుపనిదగ్గర కొచ్చారు. అంత కొక్కనిమిషం ముందుగా అడివి కాపలామనిషొచ్చి కాస్త కబురందిచ్చేడు "అబ్బాయీ ! జాగ్రత్తగా ఉండండిరా" అని చెప్పి చక్కాపోయాడు. వాళ్ళెన్ని తంటాలుపడినా రైబిన్ మామనిమాత్రం అణచలేరు, వెంటనే అ^ను నన్నుపిలిచి ఇగ్నాటీ ! నువ్వు తక్షణం పట్టణానికి పరుగెత్తు. త్వరగావెళ్ళి ఆ వేళ ఇక్కడికొచ్చిందే ఆ ముసలమ్మ దగ్గరకెళ్ళు, అనిచెప్పి స్వదస్తూరీతో ఒక చీటీ వ్రాసిచ్చాడు. "వెంటనే పో" అని ఒక్కగెంటు గెంటాడు. నేను నెమ్మదిగా

గుడిసె వెలుపలకువచ్చి ఆ పొదలలో నక్కినక్కి పాకుతూవచ్చాను. ఇంతట్లో వాళ్ళ అడుగులచప్పుడు వినిపించింది చాలామంది ఉన్నట్లున్నారు. అడుగుల రొద చాలా ఎక్కువగానేవుంది. పిశాచపు వెధవలు. నేనలాగే పొదలచాటున పడుకున్నాను. వాళ్ళు నన్ను దాటి వెళ్ళిపోయారు. తరువాతలేచి నడక లంకించు కున్నాను. ఆ నడవడం నడవడం రెండు రాత్రులు ఒక పగలు ఆగకుండా నడిచాను, కాళ్ళనొప్పులు వారం రోజులదాకా వదలవు"

అతని ముఖం చూస్తే చాలా తృప్తి కనిపిస్తూంది. శక్తి తగ్గినా సంతోషం అతిశయంగానే ఉంది.

తల్లి "అబ్బాయీ! కొంచెం టీ త్రాగితే నొప్పులు తీస్తాయి. ఇదిగో! ఇప్పుడే తయారుచేసి ఇస్తానుండు; ఈలోగా కాళ్ళూ, చేతులూ, ముఖం కడుక్కో" అంది.

"ఇదిగో చీటీ యిస్తానుండు" అని కాలు కష్టంగా ఎత్తి బల్లమీదపెట్టి కాలి పట్టీలు విప్పడం ఆరంభించాడు.

"నాకు మహాచెడ్డ భయంవేసింది. నాపనైపోయిందనుకున్నాను."

ఇంతలో నికోలే లోపలికివచ్చాడు. ఇగ్నాటీకేదో క్రొత్తతోచి బెంచిమీది కాలు గభాలున క్రిందబెట్టాడు. లేచి నిలబడాలని ప్రయత్నించాడు, కాని లేవలేక పోయాడు.

తల్లి "ఫరవాలేదు నువ్వు కూచో నాయానా" అంది.

నికోలే యేమీ క్రొత్తలేకుండా సోదరవాత్సల్యముతో ఆ యువకునిదగ్గర కూచుని "ఎలా ఉన్నావు? కాలిపట్టీ నేను విప్పుతానులే" అని మట్టికొట్టుకున్న పట్టీలను విప్పడం మొదలు పెట్టాడు. ఆ యువకుడు బెదురుతూ తల్లికేసి చూచాడు.

"కాళ్ళకి కొంచెం బ్రాందిమర్దన చెయ్యాలనుకున్నాను" అంది తల్లి

"తప్పకుండా" అన్నాడు నికోలే.

కాలి పట్టీలు విప్పి అందులోఉన్న చీటీ చూచాడు.

"అమ్మా! నీకే ఈ చీటీ"

"చదువు"

"అమ్మా! నువ్వు ఈ విషయమై ఇంకా శ్రద్ధచేయవలెనని నా కోరిక నువ్వే స్వయంగా ఈ భారం వహించాలి. ఆ పొడుగాటి స్త్రీతో ఇంకా రైతుల విషయమై కరపత్రాలు అచ్చువేయుమని చెప్పు. మరచిపోవద్దని చెప్పు. ఇది నా ప్రార్థన. సెలవు........రైబిన్" అని నికోలే చదివేడు.

అయ్యో నాయనా! అప్పుడే నీగొంతుక పట్టుకున్నారుగదా అని ఒక్క సారి తల్లి విచారపడింది.

"ఆహా! ఇది చాలా అద్భుతమే. ఈచీటీ హృదయాన్ని కరిగించడమే కాదు. చెక్కటి పాఠంగూడా నేర్పుతుంది" అన్నాడు నికోలే.

ఇగ్నాటీ వాళ్ళకేసి తెల్లబోయిచూస్తూ కాళ్ళజోడుగీడు తీసేసి పాదాలు ఒత్తుకుంటూ కూచున్నాడు.

కడుపులో పుట్టిన దుఃఖాన్ని మ్రింగేసి పైకేమీ కనబడకుండా తల్లి ఒక పళ్లెంతో నీళ్ళుపట్టుకొనివచ్చి అతనికాళ్ళు కడగడానికని కూచుంది. కాలుపట్టుకునేసరికల్లా ఇగ్నాటీ గభాలున వెనక్కిలాగుకున్నాడు

ఇగ్నాటీ :— యేంపనిది ?

తల్లి :— ఇస్ ! పాదాలిల్లాపెట్టు త్వరగా.

నికోలే :— బ్రాందిపట్టుకొస్తానుండు.

ఇగ్నాటీ కాళ్ళనింకా బెంచిక్రిందికి లాక్కున్నాడు,

"ఏంపనిది ? నువ్వునాకాళ్లు పట్టుకోవడం తప్పుకాదూ ? పెద్దదానవు" అన్నాడు

తల్లి మాటాడకుండా రెండోకాలు పట్టీవిప్పింది. ఇగ్నాటీయేమీ అనలేక తెల్లమొగం వేసుకుని చూస్తూ కూచున్నాడు.

"నాకాలు కితకితలు" అన్నాడు.

"ఫరవాలేదు. ఓర్చుకోగలవు" అంటూ తల్లికాళ్ళు కడగడం మొదలుపెట్టింది.

ఇగ్నాటీ కితకితలవల్ల గడబిడపడ్డాడు అస్, ఉస్ అన్నాడు.

తల్లి "రైబిన్‌ను కొట్టినసంగతి తెలుసునా ?" అని అడిగింది.

ఇగ్నాటీభయంతో గడగడలాడుతూ "ఏమిటి ? ఆఁ" అని తెల్లబోయాడు.

"అవును కొట్టారు. ఆగ్రామానికి తీసుకెళ్ళేటప్పుడు దారిలో కొట్టారు. నికోలస్కిలో సార్జెంటు కొట్టాడు పోలీసు కమీషనరొచ్చి రక్తం కారేటట్లు మొగంమీదకొట్టి, తన్ని, నానాహింసా పెట్టాడు. రైబిన్ శరీరమంతా రక్తం వరదలై పోయింది."

ఆనాటి సంగతులన్ని జ్ఞప్తికివచ్చి ఇక మాట్లాడలేకపోయింది తల్లి.

ఇగ్నాటీ తలవాల్చుకున్నాడు, భుజాలు పొంగాయి.

"ఆహా ! వాళ్ళు అంతపనీ చెయ్యగలరు. అందుచేతే ఆపిశాచాలనిచూస్తే నాకు భయం అయితే ప్రక్కనున్న రైతులేంచేశారు వాళ్ళుకూడా కొట్టలేదూ ?"

ఒకడు కొట్టాడు. పోలీసు కమీషనరు కొట్టమన్నాడు మిగతా వాళ్ళంతా ఒకమోస్తరుగా ఊరుకున్నారు. కొంతవరకు సాహసంచేశారు కూడాను.

"ఆ కొట్టే రైతుకు కొట్టద్దని గట్టిగా చెప్పారు"

"ఊఁహూఁ.... ఇంకేమి ? బాగానేవుంది రైతులుకూడా ఇప్పుడిప్పుడు కాస్త తెలుసుకుంటున్నారన్నమాట. మనిషంటే ఏమిటో, ఏ స్థితిలోవున్నాడో గ్రహిస్తున్నారు" అన్నాడు ఇగ్నాటీ "అక్కడ మాత్రం తెలివైనవాళ్ళు మంచి చెడ్డలు తెలుసుకోగలిగినవాళ్ళూ లేకపోయారా ?" "అల్లాగే. అక్కడే అన్న

మా చేమిటి? బుద్ధిమంతులు ఎక్కడావున్నారు. అవసరంకొద్దీ వస్తూవుంటారు ముందుకి. ప్రతిచోట వుండడం వున్నారుకాని వాళ్ళని పట్టుకోవడం మహాకష్టం. ఏమూలో అజాపజాలేకుండా పడుంటారు. వాళ్ళల్లోవాళ్ళే ఆలోచించుకుంటూ బాధ పడుతూవుంటారు అంతాచేరి ఒక ముఠాగా యేర్పడి పనిచేసేటంత విశ్వాసం చొరవ యింకా పుట్టడంలేదు" అన్నాడు ఇగ్నాటీ.

ఇంతలో నికోలేవచ్చి బ్రాందిసీసా అక్కడపెట్టి, కుంపట్లో బొగ్గేసి నెమ్మదిగా అవతలికి వెళ్ళాడు. ఇగ్నాటీ అతను వెడుతుంటే అల్లాగే చూశాడు.

ఇగ్నాటీ :— ఎవరాయన? చాలా పెద్ద ఖామందులాగున్నాడే?

త :— ఈ వ్యాపారంలో ఖామందులంటూ లేరు. అంతా కామ్రేడ్లే. *

ఇ :— నాకిదంతా చిత్రంగా వుంది.

త :— చిత్రం ఏముంది?

ఇ :— ఏమిటా? ఒకవైపునేమో మొగంమీద రక్తాలు కారేటట్లు కొడతారు. ఇంకొకవైపున కాళ్ళు కడిగి యెంతో యెక్కువగా ఉపచారంచేస్తారు. ఈ రెంటికీ మధ్యస్థ మెవరు?

ఇంతలో గభాలున తలుపుతోసుకుని నికోలే లోపలికి వచ్చాడు. గుమ్మం దగ్గరే నిలబడి ఇల్లా అన్నాడు.

"మధ్యస్థం లేకేమి? ఎవరయితే మొగంమీద రక్తాలు కారేటట్లు కొడుతున్నారో వాళ్ళ పాదాలు నాకేవాళ్ళు, మొగంమీద నెత్తురు కరడులు కడుతూంటే ఆ నెత్తురు నాకుతూవుండేవాళ్ళు మధ్యస్థంగా వున్నారు. ఇదే మధ్యస్థం."

"ఆసంగతి అంతే"అన్నాడు ఇగ్నాటీ అతిగౌరవంగా నికోలేకేసి చూచాడు.

"రైబిన్‌కూడా ఇల్లాగే అనేవాడు. ఆ సంగతంతే అని గొడ్డలిపెట్టు అనేవాడు" అంది తల్లి.

"నిలోనా! నీకు శ్రమగా ఉన్నట్లుంది. నేను..........అని ఏమో చెప్పబోయాడు నికోలే."

ఇగ్నాటీ పాదాలు వెనక్కి పెట్టుకున్నాడు.

"ఇక చాల్లే ఇగ్నాటీ. కాళ్ళూ చేతులూ కడుక్కో" అని తల్లి లేచింది, అతను లేచి నెమ్మదిగా నాలుగడుగులు వేశాడు.

"ఆహా! వెయ్యి నమస్కారాలమ్మా నీకు. క్రొత్త పాదాల్లా ఉన్నాయి. ఓహో! మీకు కృతజ్ఞత చూపించడం ఎల్లాగో తెలియడంలేదు" అన్నాడు. అక్కడే తొట్టెలో నీళ్ళు సిద్ధంగావుంటే కాళ్ళూ చేతులూ కడుక్కున్నాడు.

తర్వాత ముగ్గురూ టీ త్రాగడానికి కూచున్నారు. ఇగ్నాటీ మెల్లగా కథ ప్రారంభించాడు.

---

* సోదరుడన్నమాట, సామ్యవాదులు ఒకరినొకరు అల్లాగే పిలుచుకుంటారు.

"నేను ఈ కరపత్రాలు పంచిపెడుతూ వుంటాను. ఎన్ని మైళ్ళయినా నాకు నడకంటే లక్ష్యంలేదు. అంచేత రైబిన్ మామ ఈపని నాకప్పజెప్పాడు. అబ్బాయీ! పంచిపెట్టు, పట్టుకుంటే అంతా నీకు సాయం చేస్తారనిమాత్రం అనుకోకు. నువ్వొక్కడవే అనుకో" అని చెప్పేడు.

"చాలామంది జనం ఈ కాగితాలు చదువుతున్నారా?" అని అడిగేడు నికోలే.

"చదువొచ్చినవాళ్ళంతా చదువుతున్నారు. ధనికులుకూడా చదువుతున్నారు. కాని వాళ్ళకు మేమివ్వడములేదు. మేమిస్తే వాళ్లు మమ్మల్ని వెంటనే పట్టుకుని వప్పజెప్పుతారు. వాళ్ళనిది యెప్పటికైనా తమ కురితాడవుతుందని తెలుసు."

"ఏమీ? వాళ్ళ కెందుకు ఉరితాడవుతుంది?"

"ఉరితాడు కాకేమి? రైతులు ఊరుకుంటా రేమిటి? రైతులు ఖామందుల భూములన్నీ పుచ్చుకోక మానరు. ఈ ధనికుల దగ్గరనుంచీ ఖామందుల దగ్గరనుంచి భూమంతా లాక్కొని ప్రజలే హెచ్చుతగ్గులు లేకుండా అందరికీ సమానంగా పంచిపెడతారు. ఒకడు యజమాని అనీ, ఇంకొకడు కూలీ అని తేడా వుండదు. అందుకోసం కాకపోతే ఈ గొడవంతా యెందుకు?"

ఇగ్నాటీకి కోపంకూడా వచ్చింది కొంచెం. నికోలేకేసి ఏమిటో అనుమానంగా చూచేడు. నికోలే చిన్న నవ్వు నవ్వేడు. తల్లి "కోపగించుకోకు" అని సంబాళించింది.

"సరే ఇప్పుడు రైబిన్ అరెస్టునుగూర్చి అచ్చువేసిన కాగితాలు గ్రామాలు చేరడం ఎల్లాగ?" అన్నాడు నికోలే.

ఇగ్నాటీ శ్రద్ధగా ఆలకించాడు.

"ఇవ్వేళ వైషోవికవ్‌తో మాట్లాడుతాను" అంది తల్లి.

"కరపత్రాలు సిద్ధంగా వున్నాయా?" అని ఇగ్నాటీ అడిగాడు.

"ఆ వున్నాయి."

"అయితే నాకివ్వండి, నేను తీసుకెడతాను. వాటిని ఎక్కడ ఎల్లా ఖర్చుపెట్టాలో నాకు తెలుసును; నేచేస్తాను" అన్నాడు ఇగ్నాటీ.

తల్లి మెల్లగా అతనికేసి చూడకుండానే నవ్వింది.

"నువ్వెందుకూ? చాలా శ్రమపడ్డావు. పైగా భయపడ్డావు కూడాను. ఏమైనాసరే ఇక అక్కడికి వెళ్ళనని ఇప్పుడేకాదూ చెప్పావు?" అంది తల్లి.

ఇగ్నాటీ పళ్ళు బిగించి తల దులుపుకున్నాడు.

"అవును, నేడు అలసటగానేవుంది. కొంతకాలం విశ్రాంతి తీసుకుంటాను. భయపడినమాటకూడా వాస్తవమే. మనిషిని రక్తాలు కక్కేటట్లు కొడతారని నువ్వేకదా చెప్పావు? అలాంటప్పుడు బుద్ధిపూర్వకంగా కాలుచేతులు విరుగగొట్టుకొనడానికి యెవరంగీకరిస్తారు. కాని మొత్తంమీద నే నెలాగో అలాగ రహస్యంగా

పనిమాత్రం జరిపిస్తాను ఫరవాలేదు. కరపత్రాలు నా కివ్వండి. ఈ సాయంత్రమే బయలుదేరుతాను.........నేను ముందు ఆ కాగితాలన్నీ అడివిలోకి పట్టుకుపోయి అక్కడ దాస్తాను. దాచేసి అక్కడున్న మనవాళ్ళు నలుగురికీ కబురుచేస్తాను. వాళ్ళనే అక్కడికివెళ్ళి తీసుకోమంటాను. అదేమంచిది. నేనే పంచిపెట్టినట్లయితే ఒకవేళ పోలీసుల చేతిలో చిక్కితే ఈ కాగితాలు వృధాగాపోతాయి. ఇల్లాంటప్పుడే చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. ఇల్లాంటి అమూల్యమైన కాగితాలుపోతే మళ్ళీ మళ్ళీ దొరుకవు" అంటూ అతి కరుకుగా తన కార్యక్రమం అంతా చెప్పాడు,

"అయితే మరి నీభయం మాటేమిటి?" అని నవ్వుతూ అడిగింది తల్లి. ఇగ్నాటీ పట్టుదలా, సద్బుద్ధీచూచి ఆమె చాలా సంతోషించింది.

"భయందారి భయాంది, పనిదారి పనిది" అని ఇకిలించాడు ఇగ్నాటీ.

"నువ్వుకూడా నవ్వుతున్నావేమిటి? ఇల్లా భయపడడంలో ఆశ్చర్యమేముంది? అవసరంవస్తే మనిషి అగ్గిలో దూకుతాడు. ఇల్లాంటి పనుల్లో ఆ సాహసం అవసరమే" అన్నాడు.

తల్లి "అయ్యో నాయనా!" అని నిట్టూర్పు విడిచింది. నికోలే ఇగ్నాటీకేసి అత్యాదరంగా చూచాడు. వాళ్ళిద్దరూ వ్యవహారాన్ని గురించి ఇల్లా మాట్లాడుకున్నారు.

నికోలే :— అయితే నువ్వక్కడికెళ్ళవన్నమాట.

ఇగ్నాటీ :— వెళ్ళక యేంచెయ్యను? ఎక్కడుండను?

ని :— దానికేమి? నువ్వెళ్ళకపోతే నీబదులింకొక రెడతారు. ఆ వెళ్ళేవాళ్ళకి యేం చెయ్యాలో, ఎల్లాచెయ్యాలో నువ్వు చెపుదువుగాని.

ఇ :— స.......రే. అల్లాగే.

ని :— నీకొక పని సంపాదిస్తాం. ప్యాసుపోర్టు సంపాదించి అడివిలో * ఫారెస్టరు ఉద్యోగం ఇప్పిస్తాం.

ఇ :— అదేనా?........అయితే........రైతులెవరైనా వంటచెరుకుకోసమో, మరోపనికో అక్కడికొస్తే నేను వాళ్ళనేం చెయ్యాలి? పట్టుకు నిర్బంధించాలా? ఆపని నేను చెయ్యలేనుసుమా!

(తల్లీ, నికోలే నవ్వారు అందుచేత ఇగ్నాటీకి మరీ చిరాకెత్తింది)

ని :— మరేమీ కంగారుపడకు. నువ్వేమీ రైతుల్ని బాధపెట్టనక్కరలేదు. నా మాటనమ్ము.

ఇ :— సరే అల్లాగే. నన్ను ఫ్యాక్టరీలో ప్రవేశపెట్టడానికి వీలులేదూ? అక్కడ జనమంతా మరి చాలా ఉషారుగా ఉంటారని విన్నానులే.

ఆ యువకుని హృదయంలో ఏదో అగ్ని ప్రజ్వలిస్తున్నట్లు స్పష్టంగా కన

---

* అడివి కాపలాదారుపని.

బడుతోంది. కని దానికింకా నిశ్చలత్వం రాలేదు. ఒకప్పుడు భగభగా మండు తుంది. ఇంకొకప్పుడు చప్పగా చల్లారి పొగొస్తున్నట్లుంటుంది.
ఇ :— నాకు పడుకోవాలనిలేదు.
త :— అదేమిటీ, పోయిపడుకో వెళ్ళు.
ఇ :— ఇక్కడచూస్తే వ్యాపారమంతా కరుకుగానే వుంది మీరిచ్చన టీ నీళ్ళకి షంచవాటికీ, చూపించిన ఆదరణకీ అనేక నమస్కారాలు.

మంచంమీద పడుకొని ఇగ్నాటా ఏదో గొణగడం ఆరంభించాడు

"మీ ఇల్లంతా తారువాసనే........నేను పడుకోదలచుకోలేదు నిద్రరావడం లేదు — అబ్బా ఎన్నోవేల మైళ్ళనుంచి వచ్చినట్లుందేనాకు....మీరంతా మంచివాళ్లే. అవును...." ఇలా అనుకంటూనే గుర్రుపెట్టాడు.

* * * *

అర్ధరాత్రివేళ గదిలో వైషోవికవ్, ఇగ్నాటాలు కూర్చుని గుసగుస లాడు కుంటున్నారు.

ఇ :— మధ్య కిటికీమీద టకటక నాలుగుసార్లు.
వై :— సరే నాలుగుసార్లు
ఇ :— మొదట ఇలా మూడుసార్లు (బల్లమీప తాను వ్రేలితోకొట్టి చూపించాడు) ఒక్కక్షణం ఆగి మళ్ళీ ఒకసారి
వై :— తెలిసింది.
ఇ :— అప్పుడొక ఎర్రటి వెంట్రుకలు రైతు తలుపుతీసి నిన్ను 'మంత్రసానిని తీసుకొచ్చావా ?" అని అడుగుతాడు. నువ్వు 'అవును ఖామందు దగ్గర నుంచి' అనిచెప్పు. నువ్వింకేమీ మాట్లా డక్కరలేదు. అతనికే అంతా అర్థమవుతుంది. వాళ్ళిద్దరూ చేరి చెవులు కొరుక్కోవడం ఆరంభించేరు. వాళ్ళని చూస్తూ చేతులు కట్టుకొని నిలబడింది తల్లి రహస్యపు గుర్తులు, సాంకేతికాలు, మారుపేరులు అన్నీ వింటే ఆమెకు నవ్వువచ్చింది." ఇంకా కుర్రాళ్ళు" అనుకుంది తనలోతాను. ఒకచిన్నదీపం గోడమీద మిణుకు మిణుకు మంటోంది. నేలమీద పాత గిన్నెలూ పనికిరాని ఇనుప సామానులు పడున్నాయి. కిటికీలోంచి పెద్ద నక్షత్రం దివ్యంగా కనబడు తోంది. 'ఇగ్నాటా ఒకమంచి దట్టమైన కంబళీ కోటు తగిలించుకున్నాడు. అది తీసుకొనే సరికి అతని కెక్కడలేని సంతోషమూ కలిగింది దాన్ని ఫసందు చేస్తూ అతడు చేసే కులాసాచేష్టలన్నీ తల్లిచూచి ఎంతో జాలి పడింది.

"ఇదిగో జ్ఞాపకంవుందికాదూ ? ముందట • మురటావ్ దగ్గరకెళ్ళి అతన్ని తాతసంగతి అడుగు" అని ఇగ్నాటా, వైషోవికవ్‌తో చెప్పాడు.

---

• మురటావ్ అంటే ఒకరైతు.

"జ్ఞాపకముంది" అన్నాడు వైశోవికవ్.

ఆతడేమైనా మరచి పోతాడేమోనని అనుమానం ఇగ్నాటాకి పోలేదు. తాను చెప్పిన గుర్తులు, మాటలు, చెయ్యవలసిన పనులు అన్నీ మళ్ళీ మళ్ళీ చెప్పిన సంగతే చెప్పాడు. చివరికి కరస్పర్శనంచేసి "సోదరా? ఇక వెళ్ళు. అక్కడ వాళ్ళందరికి నా నమస్కారాలు చెప్పు. నేను బ్రతికున్నానని, ఏమాత్రం చెక్కు చెదరకుండా ఉన్నానని చెప్పు. అక్కడ వాళ్ళంతా చాలామంచివాళ్ళు. నీకే తెలుస్తుందిలే" అన్నాడు.

ఒక్కసారి తనశరీరంకేసి తానే చూచుకొని సంతుష్టినొంది "అమ్మా! నిలోనా నేనిక వెళ్ళనా?" అని అడిగేడు.

"దారి తెలుసునా?"

"ఆ తెలుసును. సెలవు నమస్కారం" అంటూ ఇగ్నాటా జేబుల్లో చేతులు పెట్టుకొని, టోపీ ఓరగా తగిలించుకొని, రొమ్ములు విరుచుకొని చలాకీగా దర్జాకు లోటులేకుండా నడిచి చక్కాపోయాడు.

వైశోవికవ్ తల్లి దగ్గరకువెళ్ళి "అమ్మయ్య! ఇప్పటికి నాకూ ఒకపని తగిలింది. జైల్లోంచి నేనెందుకు పారిపోయి వచ్చానా అని ప్రాణం విసుగుతోంది. ఎన్నాళ్ళీ దాక్కోవడం? జైల్లో అదీ ఇదీ ఏదో కాస్త నేర్చుకుంటున్నాను. పావెల్ మాకు ఆ సంగతీ, ఈసంగతీ బాగానూరిపోస్తూ వుండేవాడు. కొంచెం బుర్రకెక్కుతోంది. పావెల్ చెప్పినదానికి ఆంద్రీ తమాషాగా మెరుగుపెడుతూ చెప్పేవాడు మరి వాళ్ళు తప్పించుకొచ్చే విషయంలో ఏమి ఏర్పాట్లు జరిగినాయో నీకేమైనా తెలుసునా? అసలు ఏమైనా చేస్తారా?" అని అడిగాడు.

"ఎల్లుండి కనుక్కుంటారు. ఇంకొక్కరోజు. రేపులేదు ఎల్లుండి" అంది తల్లి.

వైశోవికవ్ ఆమె భుజంమీద చెయ్యేసి ఆవేశంతో ఇల్లా చెప్పాడు.

"అక్కడున్న పెద్దవాళ్ళతో నువ్వుగట్టిగా చెప్పు. నీమాట వింటారు. అందులో ఏమీ కష్టంలేదు. చాలా సులభం. నీకు చెప్తానువిను లాంతరు స్తంభానికి దగ్గరగా జైలుగోడవుంది. దానికెదురుగా ఖాళీమైదానం ఎడమవైపున స్మశానం: కుడివైపున పట్టణం. లాంతరు తుడిచేవాడు పగలు దీపం తుడవడానికెడతాడు. వెళ్ళి గోడమీద రేండుమేకులు దిగగొట్టి ఒక త్రాటి నిచ్చెన లోపలికి జారవిడిచేసి చక్కావస్తాడు. లోపలున్నవాళ్ళకి ఈ టైము తెలిస్తే వాళ్ళు మామూలు ఖైదీలను ప్రోత్సాహపరచి ఒక పెద్ద గలాటా లేవదీస్తారు. అదీకాకపోతే వాళ్ళే గలాటా చేస్తారు. అంతా గలాటాలో పడుండగా యీ మూలనుంచి అవసరమైనవాళ్ళు ఒకళ్ళో ఇద్దరో ఆ నిచ్చెనెక్కి బయటికివస్తారు. వచ్చి ఇలా మెల్లగా పట్టణంలోకే చక్కావస్తారు. అంతగావచ్చి వెదకడమే తటస్థమైతే ముందుగా ఖాళీగావున్న స్మశానం వెతుకుతారు. కనుక పట్టణంకేసి రావడమే సులువు."

చేతులు త్రిప్పుకుంటూ ఈ ఆలోచనంతా చెప్పాడు. చేత్తో ప్లానుగీసి ఆవివ రాలన్నీ చెప్పాడు, అన్నీ సూక్ష్మంగానే కనుపించాయి ఇంతవరకూ.

తల్లి వైషోవికవ్ ఎందుకూ పనికిరాని మొద్దనుకునేది. జిడ్డోడుతూ ఈదురో గోలా అంటూ ఉండే అతని మసూచకపు మచ్చలముఖం యిప్పుడెంతో కళాకాంతులతో ఉంది.

"మీరెప్పుడేర్పాటు చేసినాసరేకాని పగలే జరగాలి పట్టపగలు ఖైదులో ఉండే ఆఫీసర్ల కళ్ళముందట ఖైదీ పారిపోతాడని ఎవరనుకుంటారు?" అన్నాడు వైషోవికవ్.

తల్లి గడగడలాడుతూ "పారిపోయివస్తుంటే గుండుతో కాల్చేస్తారేమో" అంది.

"ఎవరు కాల్చేది? అక్కడ సిపాయిలులేరు అక్కడుండేదల్లా ఓవర్‌సీర్లే. వాళ్ళు రివాల్వరు చెప్పులో మేకులు కొట్టుకునేందుకుమాత్రమే వుపయోగిస్తూ ఉంటారు."

"ఏమిటీ? ఇదంతా చాలా సుళువుగానే ఉంటే?"

"నువ్వు చూస్తావుగా! ఈపథకం పారితీరుతుంది ఆలస్యం చేస్తేకాదు. నువ్వెళ్ళి మాట్లాడు. నేనన్నీ అప్పుడే సిద్ధంచేశాను. పగ్గపునిచ్చెన, మరమేకులు తయారుగా వున్నాయి. నేనున్న గృహస్తుతో మాట్లాడాను. అతను దీపాలువెలి గించేవాడిపని చేస్తానన్నాడు."

వైషోవికవ్ ఇలాఅంటుంటే తలుపుతెరచిన చప్పుడైంది. దగ్గు వినిపిం చింది.

"అదిగో" అన్నాడు వైషోవికవ్

ఇంతలో ఒకపెద్దస్నానం తొట్టిని మోసుకుని ఒకడు లోపలికివచ్చేడు. మనిషి భారీగా ఉన్నాడు. గుండ్రనితల. జుట్టునెరిసింది. టోపీగీపీలేదు. మంచి బుర్రమీసం ముఖం మంచికళగాఉంది. తొట్టిలోపలికి సులువుగా రాకపోతే దాన్ని తిడుతూ లోపలికితోశాడు. వైషోవికవ్ అతనికి తోడుపట్టి తొట్టిని లోపలికీడ్చేడు. అతడు లోపలికి వస్తూనే గట్టిగాదగ్గి కళ్ళి అక్కడే ఉమ్మేసి "క్షేమమా" అని పరామర్శ చేశాడు

వైషోవికవ్ తల్లి కతన్ని చూపించి, "సరి సరి అదిగో అతన్నడుగు" అన్నాడు.

"నన్నా? దేన్నిగురించి అన్నాడు పెద్దమనిషి."

"జైల్లోంచి తప్పించుకు రావడాన్నిగురించి"

"ఆహా!" అంటూ మీసం దువ్వుకున్నాడు.

వై :— ఏమయ్యోయి ! * యాకూబ్ వాసిలావిష్ ! ఈవిషయం చాలా సూక్ష్మ మైనదని నేచెపుతూంటే ఈమె నమ్మడంలేదు

వా :— ఉహుం, నమ్మడం లేదూ ? అంటే నమ్మదలచుకో లేదన్నమాట. నీకూ నాకూ ఆపని అంగీకారం అంచేత మనం నమ్ముతాం. (ఇలాఅంటుంటే ఆపెద్దమనిషికి దగ్గు తెరవచ్చింది. దగ్గిదగ్గి గుండెలు రాసుకుంటూ ఆయాస పడుతూ కూచున్నాడు.

తల్లి :— వైషోవికవ్ ! ఈవిషయంలో నిర్ణయం చేయవలసింది నేనుకాదు.

వై :— అవును నువ్వు వాళ్ళతో మాట్లాడి నచ్చచెప్పాలి. అబ్బ ! నాకే వాళ్ళతో మాట్లాడే అవకాశం కలిగితేనా ? తప్పకుండా ఒప్పించితీరేవాడినే. అంతా సిద్ధంగావుందని చెప్పు.

(తల్లి తనలోతాను వైషోవికవ్ ఎంతవాడయ్యాడు ? అనుకుంది).

నాయనా ! ఇంతకీ దీనికంతకీ పాషా అంగీకరించాలికదా ?" అంది.

వైషోవికవ్ తలవంచి ఏదో ఆలోచిస్తున్నాడు.

అంతలో ఆముసలి కూచుని ఈ పాషా ఎవరు అన్నాడు.

"నా కొడుకు"..................

"ఇంటిపేరు ?"

"వాసవ్"

ఆ పెద్దమనిషి గొట్టంలో పొగాకు వేసుకొని మధ్య ఆగుతూ మాట్లాడడం ప్రారంభించాడు.

"నేను అతనిసంగతి విన్నాను. అతన్ని నా మేనల్లుడు బాగా ఎరుగును. మావాడూ జైలులోనే ఉన్నాడు వాడిపేరు "యశాంకో" నువ్వెరుగవూ ? మాది గోడన్‌కుటుంబం. వీళ్ళ ధోరణిచూస్తే కుర్రాళ్ళ నందరినీ తీసుకెళ్ళి జైలులో పారేసేటట్లున్నారు. అప్పుడిక మన ముసలాళ్ళకి సుఖమే సుఖం: వేరే అడగాలా ? పోలీసువాళ్ళు చెప్పడంబట్టిచూస్తే మావాడిని సైబీరియాకూడా పంపే టట్టున్నారు కుక్కలకొడుకులు ! ప్రవాసం మావాడిని పంపుతారేం ? .................. (పొగగొట్టం ముట్టించి వైషోవికవ్‌తో)........అయితే యీామె కిష్టంలేదంటావు. సరే. అది ఆమె యిష్టం. యెవరిష్టం వారిది. జైలులోకి పోవడం విసుగుగా వుందంటే... .........పో. బయటికి రావడమే కష్టంగా వుందంటే.................ఉండు. నిన్ను వాళ్ళు కొల్లగొట్టి బాధపెడుతున్నారూ ? నోరుమూసుకుని ఊరుకో. నిన్నువాళ్ళు హింసపెడతారూ ? భరించు. ఆఖరికి చంపుతారూ ? చావు. అంతే. ఇది నీ యిష్టం. కాని నావిషయంలో ఇంతమట్టుకు నిశ్చయం. నేను మావాడిని మాత్రం బయటికి లాక్కొచ్చేస్తా" ఆ పెద్దమనిషి కొంచెం మోటుగానూ వేళా

* హఠాత్తుగావచ్చిన ఆపెద్దమనిషి

కోళంగానూ తమాషాగానూ చెప్పినా, సద్భావంతో చెప్పిన అతనిమాటలు విన్నాక తల్లి కెటూతోచలేదు. అతను ఆఖరున చెప్పినమాటలుమాత్రం ఆమెకు కొంచెం ఈర్ష్యకలిగించాయి.

*  *  *  *

చలిగాలిలో ముసురులో నడుస్తూ తల్లి వైషోవికవ్‌ను గురించి "ఎంతవాడైనాడు?" అనుకుంది. గోడన్ సంగతికూడా జ్ఞాపకంవచ్చింది "ఈ నూతన జీవితాన్ని హర్షించేది నేనొక్క దానినే కానట్టుంది. ఈ సుహోద్యమం సంగతి యెవరైతే తెలుసుకుంటారో వారంతా పవిత్రమై పోతారనుకుంటాను. ఇది చాలా గొప్ప జ్వాలలావుంది" అనుకుంది.

ఇంతలో ఆమెకు పావెల్ విషయం జ్ఞాపకం వచ్చింది. ఇంతకీ అతనొప్పుకుంటేగదా అనుకుంది.

*  *  *  *

ఆదివారంరోజున తల్లి జైలులో పావెల్‌ను చూచి మాట్లాడింది. తిరిగివచ్చే సమయానికి ఆమెచేతికి చిన్నకాగితం ముక్క తగిలింది. అది తగిలేసరికి ఆమెకు చురుక్కుమనిపించింది. కొడుకు మొగంకేసి తెల్లబోయి చూచింది. ఏమీ సమాధానంలేదు. అతని ముఖం మామూలుగానే చిరునవ్వుతో కళ కళలాడుతోంది. అల్లాగే అతడు సెలవుపుచ్చుకున్నాడు. తల్లి నిట్టూర్పువిడిచి "సెలవు" అంది. అతడు మళ్ళీ ఆమెకు చెయ్యి అందిచ్చి ప్రేమ కరుణలు ఉట్టిపడేటట్లుగా "అమ్మా! సెలవు" అన్నాడు.

తల్లి ఏమీ మాట్లాడలేదు. చెయ్యిపట్టుకుని అల్లాగే నిలబడింది.

"అమ్మా! చిరాకుపడకు. కోపగించుకోకు," అతనన్న మాటలు, ఆ ముఖ లక్షణాలు చూస్తే ఆమెకు సంగతి అర్థమైంది."

"ఇదేమిటిది?" అని గొణుగుతూ అతనికేసి చూడకుండానే వెనక్కి తిరిగి గబగబా చక్కావచ్చింది. కడుపులోంచి పొంగివచ్చే దుఃఖాన్ని, కళ్లల్లోంచి ప్రవహించే కన్నీటికాలువను పావెల్ చూడకుండాఉండాలని ఆమె హఠాత్తుగా వెనక్కి తిరిగి చరచర అడుగులేసి ఇవతలికి వచ్చింది. దారివెంట వస్తూంటే యెందుచేతో ఆమె చెయ్యి చాలా బరువెక్కినట్లయి పోయింది.

ఇంటికి రావడంతోనే ఆ కాగితపు ఉండను నికోలే ఇవానిష్ చేతికిచ్చి తల్లి అతని ముఖంకేసి చూస్తూ నిలబడింది. నికోలే ఆ ఉండను సాపుగా చేశాడు. తల్లి చెవులు నిక్కబెట్టుకొని వినడానికి సిద్ధంగా ఉంది. నికోలే. "మరేమీ కొత్త విషయంలేదు. అతను వ్రాసినదిది" అని ఉత్తరం చదివాడు:

"సోదరా! మేము జైలునుండి తప్పించుకొనిరాము. ఆపని మే మెవ్వరం చేయదలచుకోలేదు. అది మన ఆత్మగౌరవానికి భంగం. ఇటీవల అరెస్టయిన రైతు సంగతి ఆలోచించండి. అతడు మీ దయకు శ్రమకు పాత్రుడు. అతని విషయమై మీరు కొంత ప్రయత్నించవచ్చును.అతనికిక్కడ చాలాకష్టం అధికారులతో రోజూ పేచీగావుంది. అప్పుడే 24 గంటలు చీకటికొట్టు నిర్బంధం చూచివచ్చాడు. వాళ్ళుకూడా అతని ప్రాణాలు తోడేస్తున్నారు నానాహింసా పెడుతున్నారు. మేమా విషయంలో జోక్యం పుచ్చుకుంటున్నాము. అమ్మని ఓదార్చి సంగతి సంద ర్భాలు చెప్పు. ఆమె తెలుసుకోగలదు" పావెల్—

తల్లి ఒళ్ళు విరచుకొని తల ఆడించింది. "ఇందులో నాకు చెప్పడాని కేముంది? నాకు తెలుస్తూనేవుంది ఈసారి వాళ్ళు ముక్కుకు సూటిగా పోద లచుకున్నారు సూటిగా వెళ్ళి బహిరంగంగా సత్యాన్ని దృఢపరచ దలుచు కున్నారు."

నికోలే చటుక్కున పక్కకుతిరిగి, ముక్కు చీది జేబురుమాలుతో తుడుచు కుంటూ 'అబ్బ రొంపపట్టింది' అన్నాడు కళ్ళజోడు సరిచేసుకున్నట్లుగా చేతులు ముఖంమీద పెట్టుకొని లేచి పచారు చేయడం మొదలు పెట్టాడు "ఏమైనా మనం నిర్వహించ లేకపోయే వాళ్ళమే" అన్నాడు నికోలే.

"పోనీ విచారణ అవనియ్యి" అంది తల్లి చిరాకుగా.

"ఇదిగో సెంటు పీటర్సుబర్గునుంచి ఒక స్నేహితుడుత్తరం వ్రాశాడు."

"అయితే అతను సైబీరియానుంచి కూడా తప్పించుకు రావచ్చునటగా? వీలుండదూ?"

"వీలుండకేమీ! ఇదిగో ఆ స్నేహితుడిల్లా వ్రాసేడు. త్వరలోనే విచారణ జరుగుతుంది. శిక్ష నిశ్చయం. అందరికీ ప్రవాసమే! చూశావా అమ్మా! ఈ దగా బాజీల సంగతి! వీళ్ళు న్యాయస్థానాలన్ని కేవలం నాటకం, బూటకం. తెలి సిందా? విచారణ యింకా జరుగక పూర్వమే • సెంటు పీటర్సుబర్గు పట్టణంలో శిక్ష నిర్ణయం చేస్తారు."

"ఇక చెప్పకు చాలు. నువ్వు నన్నేమీ ఓదార్చ నక్కరలేదు నాకేమీ తెలియచెప్ప నవసరములేదు. పాషా చెయ్యకూడని పని చెయ్యడు. కారణం లేకుండా అతను బాధ పడడు. ఇతరులను బాధపెట్టడు అతనికి నేనంటే ఎంతో ప్రేమ. చూశావా! అతను నన్నుగురించి ఎలా తలచుకుంటున్నాడో? ఆమెకు సంగతి సందర్భాలు చెప్పు" అని వ్రాశాడు.

"ఓదార్చుమన్నాడు ఏం?"

ఇల్లా అంటుంటే తల్లికి గుండెలు తటతట కొట్టుకున్నాయి: తలతిరిగింది.

---

• పూర్వం రష్యాదేశపు ప్రధాన పట్టణం. దానిని ఇప్పుడు లెనిన్‌గ్రాడ్ అంటారు.

"నీకొడుకు ఉత్తమోత్తముడమ్మా. నేను అతన్నెంతో గౌరవంతోనూ ప్రేమతోను చూస్తూఉంటాను" అన్నాడు నికోలే.

"సరే. ఇక రైబిన్ సంగతి ఆలోచిద్దాం" అంది తల్లి. ఆమెకు వెంటనే ఏదోపనిలోకి దిగాలని బుద్ధిపుట్టింది. ఎక్కడికో నడచివెళ్ళి కష్టపడి తిరిగివచ్చి చివరికి ఆరోజున చేసిన పనికి తృప్తిపడి పడుకుని హాయిగా నిద్రపోవాలనే కోరిక పుట్టింది.

"అలాగే; బాగానేఉంది" అని నికోలే అటూ ఇటూ తిరుగుతూ 'ఇప్పుడు శశాంక ఉండాలి' అన్నాడు.

"ఆమె ఇప్పుడొస్తుంది. నేను పావెల్‌నుచూచి వచ్చినరోజు తప్పకుండా వస్తుంది.

నికోలే తలవంచుకుని పెదిమలు కొరుక్కుంటూ ఏదో ఆలోచిస్తున్నాడు.

"మా అక్కయ్య ఇక్కడ లేకపోయింది. రైబిన్ విషయంలో ఆమె పూనుకోవాలి" అన్నాడు.

"ఇది వెంటనే ఏర్పాటు చెయ్యడం అవసరం. పాషా అక్కడుండగానే చేస్తే అతను సంతోషిస్తాడు" అంది తల్లి.

ఇంతలో గంట చప్పుడయింది. వాళ్ళిద్దరూ ఒకళ్ళ మొగం ఒకళ్ళుచూచుకున్నారు.

నికోలే :— (రహస్యంగా) అదిగో శశాంక.

తల్లి :— (రహస్యంగా) ఆమెకీసంగతెలాగ చెప్పడం ?

ని :— అవును కష్టమే !

త :— ఆమెనుచూస్తే నాకు చాలా జాలేస్తుంది పాపం.

మళ్ళీ గంట మోగింది. నికోలే తల్లి ఇద్దరూ లేచారు. నికోలే రెండడుగులువేసి.

"అమ్మా ! నువ్వెళ్ళి నువ్వేచెప్పు" అన్నాడు.

తల్లి తలుపుతీసింది వెంటనే.

శశాంక :— "అతను ఒప్పుకోలేదుగాదు ?" అంది.

"లేదు"

"ఆసంగతి నాకు తెలుసు" అని శశాంక చొక్కాబొత్తాములు విప్పి మళ్ళీ పెట్టుకుంది. మళ్ళా విప్పింది. చొక్కావిప్పాలని ప్రయత్నించింది. కాని మళ్ళీ మానివేసింది, "అబ్బ చితచితలాడుతూ ఈచినుకు అసహ్యంగా ఉంది. విసుగెత్తుతోంది. అతను కులాసాగా ఉన్నాడా ?"

"ఆహా"

"ఎప్పుడూ ఒక్క మోస్తరుగానే కులాసాగా ఉంటాడు. కాని ఇది........" అని శశాంక ఏమో చెప్పబోయింది.

"అతను రైబినును విడిపించడానికి ప్రయత్నం చెయ్యమని వ్రాశాడు" అందితల్లి.

"అవును. అతనిఆలోచనను మనం కొనసాగించాలనే నాకుతోస్తుంది."

"నాకూ అల్లాగే తోస్తుంది" అంటూ నికోలే తలుపుదగ్గరకు వచ్చాడు.

"ఏమిశశా! క్షేమమా?"

శశాంక నికోలేకి చెయ్యి అందించింది.

"ఇంకా ఆలోచనేముంది? ఈపథకం మీఅందరికీ ఇష్టమేనా?" అని శశాంక అడిగింది.

"అయితే ఇదెవరు నడిపిస్తారు? అందరూ ఏదోపనిలోనే వున్నారు" అన్నాడు నికోలే.

"నాకప్పజెప్పండి నాకు తీరుబడివుంది. నేచేస్తాను" అని శశాంక ఎగిరి గంతువేసింది.

"సరే కానియ్యి. కాని ఇతరులనుకూడా అడుగు" అంటూ చొక్కా బొత్తాములు పెట్టుకొని, ప్రయాణానికి శశాంక సిద్ధమైంది.

"నువ్వు కొంచెం విశ్రాంతి తీసుకోవాలి" అని సలహాయిచ్చింది తల్లి.

శశాంక చిరునవ్వునవ్వి మెల్లగా "నావిషయమై ఏమీ ఆత్రపడక్కరలేదు. నేనేమీ అంత అలసట పడలేదు" అంది తరువాత తల్లిదగ్గర సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయింది.

## ౧౪

శశాంక వెడుతూంటే తల్లి, నికోలే, కిటికీలోంచి ఆమెకేసి చూస్తూ నిలబడ్డారు. గేటు దాటిపోయేవరకూ చూశారు. నికోలే ఈలవేసుకుంటూ బల్లదగ్గర కూచుని ఏదో వ్రాయడం ఆరంభించాడు.

"ఆమె జంయూటంలో పడుంటుంది. కనుక రోజులు గడచిపోతున్నాయి" అంది తల్లి.

"అవును. అల్లాగే అమ్మా! నీ సంగతేమిటి? నీ కెప్పుడూ ఇల్లాంటి అవస్థపట్టలేదూ? నీకు ప్రియమైన మనిషికోసం నువ్వుమాత్రం ఎప్పుడూ తపించకుండా ఉన్నావా? నువ్వు యెప్పుడూ యెవ్వరినీ ప్రేమించలేదూ?" అని నవ్వుతూ అడిగాడు నికోలే.

"నాయనా! నాకు జ్ఞాపకంలేదు. నేనుమాత్రం ఎవరినో ఒకరిని ప్రేమించకుండా ఎలా ఉంటాను? ఎవరో ఒకరుండాలికాని................ నా భర్త నన్ను తెగబాదేవాడు. అంచేత పూర్వం జరిగిన సంగతులన్నీ మరచిపోయాను" అంది.

నికోలే బల్లదగ్గర కూచున్నాడు. తల్లి ఒక్క నిమిషం అవతలికివెళ్ళి వచ్చింది. ఆమె కూచున్నతర్వాత నికోలే మెల్లగా తన సంగతిచెప్పడం మొదలు పెట్టాడు.

"అమ్మా! నాసంగతి చెప్తావిను. నా అవస్థకూడా సరిగా శశాంకలాంటిదే. నేనూ ఒక యువతిని ప్రేమించాను. ఆమె చాలా అద్భుతమైనమనిషి. నిజంగా రత్నం. నాకామెతో మొదట ఇరువది సంవత్సరములక్రిందట పరిచయమైంది. అప్పటినుంచి నేనామెను ప్రేమిస్తూనేవున్నాను. వాస్తవానికి ఇప్పుడుకూడా ఆమెనే ప్రేమిస్తున్నాను. ఎప్పుడుకూడా ఆమెనే ప్రేమిస్తాను."

ఇల్లాచెపుతూంటే తల్లి ప్రక్కన నిలబడి అతనికండ్లల్లో వెలుగుతున్న జ్యోతినిచూచింది. చేతులు కుర్చీవెనక్కి పెట్టుకుని తలవాల్చి నికోలే ఆకాశంకేసి చూస్తున్నాడు.

"అయితే ఎందుకు పెళ్ళిచేసుకోలేదూ? చేసుకోవాలిసిందే."

"ఓ! ఆమెకు పెళ్ళి అయిపోయి అయిదేళ్ళయింది"

"అంతకుముందెందుకు చేసుకోలేదూ? ఆమె నిన్ను ప్రేమించలేదా?"

"అవును........ అల్లాగే అనుకోవాలి.... కాని ఆమె నన్ను ప్రేమించినట్లే కనబడింది. కనుపించడమేకాదు; ప్రేమించిన మాటకూడా నిశ్చయమే. కాని దాని సంగతి ఇల్లాఅయింది నేను జైలులోవుంటే ఆమె వెలుపలవుండడం, నేనువెలుపలవుంటే ఆమె జైలులోవుండడం, సరిగా శశాంక అవస్థమాదిరే. ఆఖరుకు ఆమెకు 10 సంవత్సరాలు సైబీరియా ప్రవాసం తగిలించేరు. నేను వెంట పడదామనుకున్నానుగాని సిగ్గేసింది. ఆమెకూడా సిగ్గుపడింది. అంచేత నేనిక్కడేవుండిపోయాను. తరువాత ఆమె కింకొనితో పరిచయం కలిగింది. అతను మనవాడే; నాకు బాగా స్నేహితుడు. చాలా మంచివాడు. వాళ్ళిద్దరూకలసి ప్రవాసంనుంచి తప్పించుకుని పారిపోయారు. ఇప్పుడిద్దరూ స్వేచ్ఛగా ఎక్కడో విదేశాలలో కాపురం చేస్తున్నారు" నికోలే కళ్ళజోడుతీసి తుడుచుకోవడం ఆరంభించాడు.

తల్లి "అయ్యో నాయనా! పాపం!" అంది విచారంతో. అతన్నిచూస్తే ఆమెకెంతో జాలికలిగింది. కాని మళ్ళీ ఎందుచేతో నవ్వువచ్చి చిన్ననవ్వునవ్వింది. ఇంతలో అతను తనవాలకం మార్చి చేత్తోకలంపుచ్చుకుని గబగబవ్రాస్తూ ఇల్లా చెప్పాడు.

"భార్యాబిడ్డలు మొదలైన ఈసంచార తాపత్రయం విప్లవకారునికి చాలా ప్రతిబంధకం. అతని శక్తినంతా ఇది మింగేస్తుంది. పిల్లలు బయలుదేరడం

తోటే, వాళ్ళని అపురూపంగానూ, ఏవిధమైన అపాయం రాకుండానూ పెంచాలి. అంటే పొట్టకోసం దేవులాట ఎక్కువైపోతుంది. విప్లవకారుడు అన్నివిధాలా తన సర్వశక్తుల్నీ వృద్ధిపరచుకోవాలి. తన శక్తిని విస్తరింపజేయాలి. ఇదంతా చేయడానికి చాలాకాలం పడుతుంది. చారిత్రక పరిణామాన్నిబట్టి చూస్తే ప్రపంచం లోని పాతపద్ధతులన్నీ నిర్మూలంచేయడం, నూతన జీవితాన్ని సృష్టించడంకూడా మన కార్మికులవంతు. కనుక ఈరకం విప్లవకారుడు ఎప్పుడూ ముందు నడవాలి. అంతేకాని మనం వెనుకబడినా, ఆయాసంచేత తగ్గినా, లేకపోతే ఏదైనా ఒక స్వల్ప ప్రయోజనంకోసం లొంగిపోయినా, కక్కుర్తిపడినా చాలా అనర్థం. అన ర్థమేకాదు: ఈ మహోద్యమానికి ద్రోహం చెయ్యడమన్నమాటే. విప్లవకారుడైన వాడు ఎవరినైనా ఒకవ్యక్తిని అంటిపెట్టుకొని ఉండడం అసంభవం. మూలమతా నికి విరుద్ధంలేకుండా ఇద్దరు విప్లవకారులు ఎప్పుడూ కలిసిమెలసి జీవితమంతా గడపడం అసాధ్యం. అన్నిటికన్నా మనం ఎప్పుడూ మరువకూడని సంగతి ఇంకోటుంది మన ఆదర్శం స్వల్పప్రయోజనంకాదు. సంపూర్ణవిజయం."

అతనికంఠధ్వని చాలా ఉద్ధృతంగాలేచింది. కండ్లు జ్యోతుల్లా మెరిసినాయి. ఇంతలో తలుపుదగ్గర గంటమోగింది. * లూడ్మిలా లోపలికివచ్చింది చలిచేత ఆమె బుగ్గలన్నీ యెరుపెక్కాయి. చినిగిపోయిన చెప్పులజోడు విడుస్తూ "విచా రణతేదీ నిశ్చయమైంది. ఇంకొక్క వారం" అంది.

"నిజంగా?" అన్నాడు నికోలే గట్టిగా.

తల్లికి సంతోషపడాలో విచారపడాలో తెలియకుండానే నికోలేదగ్గరగా వెళ్ళి నుంచుంది.

"నిజమే. • అసిస్టెంటు ప్రాసిక్యూటరు షష్టాక్ నేరారోపణపత్రం తయారుచేసి యిప్పుడే తీసుకొచ్చాడు. అప్పుడే శిక్ష నిర్ణమైపోయిందని కోర్టులో అంతా బహిరంగంగా చెప్పుకుంటున్నారు ఏమిటీ దారుణం? దీనర్థమేమిటి? ప్రభుత్వానికి శత్రువులైనవాళ్ళ విషయంలో న్యాయాధిపతులుకూడా కొంచెం దయా దాక్షిణ్యాలు చూపిస్తారని అధికారులకేమైనా భయమేస్తుందా యేమిటి? ఇంతకాలం నుంచి తమ తాబేదారులను పాడుచేస్తున్నా యింకా వాళ్ళు పూర్తిగా దౌర్భాగ్యులు కాలేదని వాళ్ళ అనుమానం కాబోలు"

ఇల్లా అంటూ లూడ్మిలా సోఫామీద కూచుంది ఆమె కళ్ళు చింతనిప్పుల్లా కణకణలాడాయి. మాట చాలా రోషంగా వచ్చింది.

"లూడ్మిలా! నువ్వు వృథాగా నోరు ఖాళీచేసుకుంటున్నావు. శక్తిదండుగ.

---

* అచ్చుపనిచేసే స్త్రీ.

• ప్రభుత్వ న్యాయవాది.

నీమాట వినేవారెవ్వరూలేరు" అని ఆమెను శాంతపరచడానికి ప్రయత్నించాడు నికోలే

"అల్లాగా! ఎప్పటికైనా నామాట వినేటట్లు చేస్తానుగా!"

ఆగ్రహంచేత ఆమెకళ్ళు అదిరాయి. పెదిమలు కొరికింది "నువ్వు నాకు వ్యతిరేకంగా వెళతావూ? వెడితేవెళ్ళు, నీయిష్టం. నీకు నేను శత్రువునే. కాని అధికారాన్ని కాపాడుకోడానికి ప్రజలనీతిని పాడుచెయ్యవద్దు......................"

ఇల్లా అంటూంటే నికోలే విచారంతో ఆమెకేసిచూస్తూ కూచున్నాడు. లూడ్మిలా తన ప్రతిపక్షులు ఎదుట నిలబడినట్లుగానే ఉద్రేకంతో మాట్లాడుతోంది. తల్లి కీమాటల కర్ధమేమీ తెలియలేదు. అప్రయత్నంగా 'విచారణ—ఒక్కవారంలో' అని తనలో తానే పదేపదే అనుకుంటోంది.

విచారణ యెల్లా ఉంటుందో, జడ్జీలు పావెల్‌నెల్లా చూస్తారో తల్లి ఊహించుకోలేకపోయింది. ఈ ఆలోచనతో ఆమె తల దిమ్మెక్కింది. ఒళ్ళంతా యేమిటో చలిచలిగాను, నొప్పిగానూ తోచింది. హృదయంలో యేదో భారంగా తోచింది. ధైర్యం అంతరించిపోయినట్లు తోచింది.

ఇలాంటి దుర్భరావస్థలో, ఏనిమిషంలో యేమివస్తుందో అనే భయంతో గంటలు లెక్కపెట్టుకుంటూ ఒకటి రెండురోజులు గడిపింది. మూడవరోజున శశాంకవచ్చి నికోలేతో "అంతా సిద్ధమైంది. ఇంకొక్క గంటలో" అంది.

"అప్పుడే అంతా సిద్ధమైందా? ఇంతలోనే" అన్నాడు నికోలే.

"సిద్ధం కాకపోవడానికేముంది? నాపని రైబిన్‌కు దాక్కునేందుకు స్థలం చూపడం! బట్టలు సప్లయిచేయడం మాత్రమే. మిగిలిన పనంతా గోడన్ తనమీదే పెట్టుకున్నాడు. రైబిన్ ఒక్కపేట దాటివస్తే చాలు. దారిలో వైషోవికవ్ మారువేషంలో అతన్ని కలుసుకుని ఒక ఓవర్‌కోటు, టోపీ అందిచ్చి దారి చూపెడతాడు నేను యివతల సిద్ధంగావుండి, బట్టలు మార్చేసి తీసుకుపోతాను."

"బాగానేవుంది........., ఈ గోడన్ ఎవరు?"

"నువ్వెరుగుదువు. అతనుండేచోట నువ్వు ఒకరోజున తాళాలు బాగుచేసే వాళ్ళకి ఉపన్యాసం యిచ్చేవుకూడాను."

"ఓహో! జ్ఞాపకంవచ్చింది. ఆ ముసలివాడుకాదూ?"

"అవును. అతని వయస్సులో సిపాయిపనిచేశాడు. ప్రస్తుతం ఇంటికప్పు పని చేస్తూవుంటాడు. చదువురాదు కాని, దౌర్జన్యమన్నా, దౌర్జన్యపరులన్నా అతనికి పరమసహ్యం. కొంచెం వేదాంతి. అతను తన మేనల్లుడిని విడిపించాలని ప్రయత్నం చేస్తున్నాడు. అతని మేనల్లుడు యశాంకో. కమ్మరపని చేస్తాడు. నీకు జ్ఞాపకంలేదూ? నువ్వతన్ని చాలా మెచ్చుకున్నావుకూడాను."

"అవునవును" అని నికోలే తల ఆడించాడు.

"గోడన్ యింతవరకు అంతా సరిగానే చేశాడు. కాని చివరవరకూ ఎలా సాగుతుందో చెప్పలేము. నా కనుమానంగానే వుంది. జైలురోడ్లమీద ఖైదీలంతా మనుష్యులోనే వుంటారు. ఆ ఖైదీలు నిచ్చెన చూడడంతోటే అందరూ పారిపోవాలనే ప్రయత్నిస్తారు. అంచేత ఒకళ్ళనొకళ్ళు త్రోసుకుని చివరికి ఎవరూ రాలేక పోతారేమో."

ఇలా చెపుతూచెపుతూ శశాంక కళ్ళుమూసుకుంది. తల్లి ఆమెదగ్గరచేరింది. ముగ్గురూ కిటికీముందు నిలబడ్డారు. శశాంక, నికోలే యేమిటో గబగబ మాట్లాడు కున్నారు. తల్లికి ఆ మాటలు వింటూంటే ఆదుర్దా హెచ్చిపోయింది ఏమీ తోచ లేదు. హఠాత్తుగా "నేనూవస్తాను అక్కడికి" అంది.

"ఎందుకూ ?" అని శశాంక అడిగింది.

"అమ్మా ! నువ్వు వెళ్ళొద్దు, పట్టుబడిపోతావు." అన్నాడు నికోలే

"కాదు కాదు, నేనూ వస్తాను" అంది తల్లి వాళ్ళకేసిచూస్తూ.

నికోలే, శశాంక ఒకళ్ళమొగం ఒకళ్ళు చూచుకున్నారు శశాంక భుజా లెగరవేసి "అవును. ఆశ అల్లా అనిపిస్తుంది" అని ఆమె భుజంమీద తలపెట్టి మెల్లగా ఇల్లా అంది.

"కాని అమ్మా ! నే చెప్పేమాట విను. నువ్వు వృధాగా ఆశపడుతున్నావు. అతను తప్పుకునేందుకు ప్రయత్నం చెయ్యడు."

"అయ్యో అమ్మాయీ ! అదంతా ఎందుకు ? నన్ను తీసుకెళ్ళు నేను మీకేమీ అడ్డురాను. జైల్లోనుంచి తప్పకురావడం సాధ్యమని నాకు నమ్మకంలేదు" అంటూ తల్లి శశాంకను దగ్గరకు తీసుకుంది.

శశాంక నికోలేతో 'ఆమెకూడా వస్తుందిపోనీ ?' అంది.

"సరే, అది నీ యిష్టం"

"అమ్మా ! మనమిద్దరం కలిసివుండగూడదు. ఆ ఎదురుగా వుండేతోటలో నువ్వుండు అక్కడుంటే యెదురుగావున్న జైలుగోడ కనిపిస్తుంది ఒకవేళ నువ్వక్కడెందుకున్నావని యెవరైనా అడిగితే ఏంచెప్తావు ?"

"ఏం చెప్పాలో ఆలోచిస్తా."

"జైల్లోవుండే ఓవర్సీర్లు నిన్ను బాగా ఎరుగుదురనే సంగతిమాత్రం మరచి పోకు. వాళ్ళు నిన్ను చూశారంటే...."

"నన్ను చూడనేచూడరు" అని తల్లి నవ్వింది.

ఒక గంటైనతర్వాత తల్లి జైలుకెదురుగా ఉన్న తోటలోకి వచ్చింది. రివ్వు మని ఒక్క గాలివేసింది. గాలి ఊపు ఆమెను ఒక ప్రక్కకు త్రోసివేసింది. ఆకాశం మేఘాలతో క్రమ్ముకుపోయింది. తల్లికి వెనుకవైపున ఇరవై గజాల దూర ములోజైలు. శ్మశానందగ్గర ఒకసిపాయి గుర్రాన్ని కళ్లెంపట్టుకుని నడిపిస్తున్నాడు.

ఇంకొక సిపాయి అతని ప్రక్కనే నవ్వుతూ తుళ్ళుతూ నడుస్తున్నాడు. జైలుకు దగ్గరగా వీళ్ళుతప్ప యింకెవ్వరూలేరు. అప్పటికప్పుడు ఏదో ఆలోచన స్ఫురించి తల్లి వాళ్ళదగ్గరకువెళ్ళి "సిపాయీలూ! ఇక్కడెక్కడైనా మీకేమైనా మేక కనుపించిందా బాబూ?" అని అడిగింది.

"లేదు" అన్నాడొక సిపాయి.

ఆమె వాళ్ళనుదాటి శ్మశానం కట్టవైపుకు నెమ్మదిగా నడిచింది. నడుస్తూ వెనకగా కుడివైపుకు ఓరచూపులు చూచింది. హఠాత్తుగా ఆమె ఒళ్ళు ఝల్లుమంది. కాళ్ళు బరువెక్కిపోయినాయి. జైలుగోడ మూలనుంచి ఒకమనిషి భుజాన్ని నిచ్చెన వేసుకొని గబగబా వచ్చాడు. అతని నడుము వంగింది. భుజాన నిచ్చెన మహాతేలికగా ఉంది. తల్లి గడ గడలాడుతూ సిపాయిలకేసి చూసింది. వాళ్ళు జోడుకాళ్ళతో నేలమీద మట్టగిస్తూంటే గుర్రం గిర్రున గుండ్రంగా పరుగెత్తుతోంది.

వాళ్ళు ఆ ఆటధోరణిలో ఉన్నారు. తల్లి నిచ్చెనకేసి చూసింది. ఆ నిచ్చెన తెచ్చిన మనిషి అప్పుడే దానిని గోడకు తగిలించి పైకెక్కుతున్నాడు. అతను పైకెక్కి జైలు దొడ్డికేసి చెయ్యి ఆడించి గబగబా దిగి ఆ మూలనుంచే అంతర్ధానమైపోయాడు. తక్షణమే రైబిన్‌తల నల్లగా గోడమీద కనబడింది. తిరువాత శరీరం అంతా బయటికి వచ్చింది అతని వెనుక ఇంకొకడు వచ్చాడు. వాళ్ళిద్దరూ క్రిందకు దూకారు. ఒకడు ఆ మూలనుంచే తప్పుకుని కాలికిబుద్ధిచెప్పాడు. రైబిన్ ఒళ్ళు విరుచుకుంటూ అటూ ఇటూ చూస్తున్నాడు,

"పరుగెత్తు! పరుగెత్తు!" అని మెల్లగా ఊదింది తల్లి. ఆమె చెవులు గింగురుమంటున్నాయి. పెద్ద పెద్ద కేకలు వినిపించాయి. గోడమీద మళ్ళీ ఇంకొక తల కనబడింది. తల్లికి భయంవేసి చేతులు జోడించుకు చూస్తోంది. ఆ గోడమీద మనిషి కాస్సేపు గోడమీద గిలగిల గింజుకున్నాడు చివరికి వెనక్కిపడిపోయాడు. లోపల కేకలు జోరైపోయినాయి. ఈలలు హోరెత్తిపోయేయి. రైబిన్ గోడ పక్కనుంచే మెల్లగా తలెత్తకుండా నడిచిపోతున్నాడు అప్పుడే అతను జైలుకి పట్టణానికి మధ్యనుండే ఖాళీస్థలాన్ని దాటేడు. త్వరగా త్వరగా అంది తల్లి. మెల్లగా గోడవెనకాల జైల్లో ఏదో పెద్ద చప్పుడైంది. గాజు పగిలినట్లయింది. సిపాయిలలో ఒకడు గుర్రాన్ని గభాలున కళ్లెం పట్టుకుని దగ్గరకులాగాడు. గుర్రం ఎగిరి గంతేసింది. రెండోవాడు జైలుకేసి చూస్తూ బిగ్గరగా అరుస్తున్నాడు.

తల్లి అతిశ్రద్ధగా అన్నివైపుల చూసింది. జరుగుతున్న సంగతులన్నీ కండ్లారచూసింది. కాని ఒకదానిని నమ్మడానికి మనస్కరించలేదు. ఎంతో భయంకరంగా ఉంటుందనుకున్నదంతా ఇంత సుళువుగా త్వరగా జరిగిపోవడం ఆమెకు చాలా ఆశ్చర్యంవేసింది. రైబిన్ కనుచూపుమేర ఎక్కడా కనుపడటంలేదు దూరాని

ఒక సన్ననిమనిషి పెద్ద ఓవరుకోటువేసుకుని నడుస్తున్నాడు. ఒక యువతి అటూ ఇటూ పరుగెత్తుతోంది. జైలుగోడమీదనుంచి ముగ్గురువార్డరులు క్రిందకుదూకారు. ఒకళ్ళప్రక్కగా నొకళ్ళు పరుగు లంకించుకున్నారు. వాళ్ళకి సిపాయి లెదురువచ్చారు. ఒకడు గంతులేస్తున్న పొగరుబోతు గుర్రాన్ని స్వాధీనపరచుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు ఈలలు ఆకాశాని కంటిపోతున్నాయి. చెవులు గింగురుమంటున్నాయి. వాటినివింటుంటే తల్లిగుండెలలో గడగడమంటోంది. వణకుతూనే ఆమె శ్మశానం కట్ట ప్రక్కనుంచే వార్డరుల వెనకాలే నడిచిపోయింది. కాని వాళ్ళు, సిపాయిలుకూడ జైలు అవతలి మూలనుంచి ప్రక్కకు మళ్ళిపోయారు వాళ్ళ వెనకాలే జైలు అసిస్టెంటు ఓవర్సీరు పరుగెత్తాడు. అతనిని తల్లి యెరుగును. కోటు బొత్తాములు గిత్తాములు ఊడిపోయి హడావిడిగా పరుగెత్తుతున్నాడు. అప్పటికప్పుడే ఎక్కడనుంచో పోలీసులు సిద్ధమైనారు జనంకూడా పరుగెత్తుకుంటూ వచ్చారు. గాలి జోరుగానూ వాటంగానూ ఉండడంవల్ల వాళ్ళనుకునే ఈమాటలు తల్లి చెవుల్లో పడ్డాయి.

"ఇందాకటినుంచీ ఇది ఇక్కడేవుంది."

"నిచ్చెనా ?"

"అరే ! మీతల్లికడుపుమాడ ! ఏం చేస్తున్నార్రా మీరు ?"

"సిపాయిలను అరెస్టు చెయ్యండి."

"ఏయి పోలీసు !"

మళ్ళీ ఈలలు జోరైనాయి. తల్లికీసారి ఈ గడబిడచూచి చాలా సంతోషం కలిగింది. తీరికగా నడుస్తూ "అంటే, ఇది సాధ్యమేనన్నమాట. అతనుకూడా సాహసించవలసిందే" అనుకుంది. అప్పు డామెకు తన కొడుకు సంగతి తలచుకుంటూంటే అంత బాధ కలగడం లేదు. పైగా ఒకవిధమైన గర్వం కలుగుతోంది. కాని అతనికేమి ప్రమాదం కలుగుతుందో అనే భయంమాత్రం ఇంకా వదలలేదు

ఎదురుగా యిద్దరు పోలీసులు వచ్చారు. అందులో ఉంగరాల జుట్టుగల పోలీసు "ఆగు !..........ఒక మనిషి—పెద్ద గడ్డంకూడా వుంది—ఇల్లా పరుగెత్తాడా ? నువ్వు చూడలేదూ ?" అని రోజుకుంటూ అడిగాడు.

"చూచాను, అదిగో అల్లా వెళ్ళాడు" అంది తల్లి.

• ఈగ్రో ! పరుగెత్తు. ఈలెయ్యి; ఎంతసేపైంది ?"

"ఆ........అయింది....ఒక్క నిముషం అవుతుందేమో" ఈల గోలలో పోలీసు ఆ మాటను వినుపించుకోనేలేదు. చేతులూపుకుంటూ గబగబా అతడు తోటకేసి పరుగులంకించుకున్నాడు. అతని వెంటనున్న పోలీసులు కూడా పరుగెత్తారు.

---

• పోలీసు వాని పేరు.

తల్లివాళ్ళనుచూస్తూ సంతుష్టి సూచకంగా తల ఆడించింది. ఇంటిమార్గం పట్టింది. దారిలో ఆమె పొలందాటి రాజవీధి కెక్కేసరికి ఒక గుర్రపుబండి ఆమె కెదురైంది. ఆమె తలెత్తి చూసేసరికి అందులో వెలవెల బారుతున్న ముఖం చిరుమీసం కలిగిన ఒక యువకుడు కనిపించాడు. అతడుకూడా ఆమెను చూచాడు కూచున్న వాటంచేత కాబోలు, అతని కుడిభుజం, ఎడమభుజంకన్న కొంచెం ఎత్తుగా కనుపించింది

ఇంటికి వచ్చేసరికి నికోలే నవ్వుతూ తల్లిని పలుకరించాడు.

"బాగున్నావా? ఎల్లాజరిగింది?"

"అంతా బాగానే జరిగినట్లుంది."

నెమ్మదిగా జ్ఞాపకమున్నంతవరకు వివరంగా జైలుదగ్గర జరిగిన సంగతంతా చెప్పింది నికోలేకూడా ఈపనింత సుళువుగా జరిగినందుకు చాలా ఆశ్చర్యపడ్డాడు. చేతులు నలుపుకుంటూ ఆమెతో ఇల్లాఅన్నాడు.

"అమ్మా! మన అదృష్టం బాగుంది ... నీవిషయంలో నేనెంత భయపడ్డానో ఆభగవంతుడికే తెలుసు. విచారణంటే ఏమీ భయపడకు. నామాటవిను. ఈవిచారణ ఎంతత్వరగా అయిపోతే అంతత్వరగా పావెల్ బయటికొస్తాడు. నామాటనమ్మ. నేనప్పుడే పావెల్‌విషయమై ఏమేమి ఏర్పాట్లు చేయడానికి వీలుంటుందో చూడమని మాఅక్కయ్యకు వ్రాశాను. అతడు దారిలోనే తప్పించుకుపోవచ్చును. ఎవరు చెప్పగలరు? విచారణంటే ఉజ్జాయింపుగా ఇల్లావుంటుంది"

నికోలే కోర్టు, విచారణ క్రమంఅంతా నెమ్మదిగా వర్ణించాడు. తల్లి శ్రద్ధగావింది. అతడేదో విషయాన్నిగురించి భయపడి తన కుత్సాహం కలగ చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు కాబోలు అనుకుంది.

"నేనేమైనా జడ్జీలతో చెప్పుకుంటాననిగాని, వాళ్ళనేదైనా ప్రాధేయపడి అడుగుతాననికాని నీఅభిప్రాయమా?" అని నికోలే నడిగింది.

"ఏమిటంటున్నావు? నన్నవమానం చెయ్యదలుచుకున్నావా?" అని నికోలే అదిరిపడి లేచాడు.

"క్షమించు క్షమించు. నాకేదో విషయాన్ని గురించి భయమేస్తూంది—కాని అదేదో చెప్పలేను."

ఒక్కసారి ఆమెగదిఅంతా నాలుగుప్రక్కలా చూచింది. ఒక్కక్షణం మాటామంతీలేకుండా ఊరుకుంది. తర్వాత ఇల్లాచెప్పడం మొదలుపెట్టింది.

"ఒక్కొక్కప్పుడు నాకువాళ్ళు పాషాను అవమానపరుస్తారేమో ననిపిస్తుంది. హేళన చేస్తారనుకుంటాను. ఓహో! నువ్వురైతుబిడ్డవే? ఆరిపిడుగా! ఇదంతా నువ్వుచేసిన హంగామేనా? అని కోర్టులో వేళాకోళం చేస్తారు. మన

వాళ్ళు కాస్త అహంకలవాళ్ళే కనుక సహజంగా ఊరుకోరు. పావెల్ తగిన జవాబుచెప్తాడు. లేకపోతే ఆండ్రీ వాళ్ళకేసిచూసి నవ్వుతాడు మిగిలిన బృందం అంతా కూడా మర్యాదస్థులైనా కోపిష్టులు. మాట మీదపడితే ఊరుకోరు. అందుచేత యేదో గడబిడజరుగుతుందని నా అభిప్రాయం. అందులో కొందరికి శాంతంకూడా తప్పిపోవచ్చును. మిగిలినవాళ్ళంతా వాళ్ళకి సాయంకాక తప్పదు. ఇదంతా అయేసరికి శిక్ష పెద్దదిగా పడిపోతుంది ఇక మళ్ళీ వాళ్ళని చూడడమే పడదేమో. ఈ ఆలోచన నాబుర్రలోనుంచి తప్పించడం మహాకష్టంగా వుంది. అబ్బ! వాళ్ళు ఒక్కొక్క విషయాన్నే ఎత్తుకుని విమర్శిస్తూవుంటే మహా కష్టంకదా! శిక్షంటే నాకంతగా భయమెయ్యడంలేదు. కాని విచారణంటే మాత్రం మహాభయంగావుంది. ఆ భయమేమిటో నోటితో మాత్రం చెప్పలేను"

తల్లి ఈ మాటలు చెపుతూంటే నికోలే నోరు కదపకుండా కూచునివిన్నాడు. అతడేమి మాట్లాడకపోవడంవల్ల మరింత భయం, పిరికితనం, హెచ్చయిపోయింది. ఇల్లాగే విచారణరోజువరకూ మూడురోజులు భయంగానే కాలక్షేపం చేసింది. విచారణరోజున కోర్టులోకి వెళ్ళేసరికి భయంతో ఆమె కుంగిపోయింది

విచారణరోజున తల్లి కోర్టుకి వెడుతుంటే దారిలో ప్రక్కఊళ్ళనుంచి వచ్చిన పరిచయస్థులంతా పలుకరించారు. అందరికీ ఆగకుండానే నమస్కారం చేస్తూ వసారాలో జనాన్ని తప్పించుకుని హాలులోపలికి వెళ్ళింది కోర్టు హాలులో ముద్దాయిల బంధువులను చూచింది. వాళ్ళంతా ఈమెను మెల్లగా పలుకరించారు. ఎవరేమి మాట్లాడుతున్నా ఆమెకు మాత్రం ఏమీ అర్థంకావడంలేదు. అంతా తల్లి లాగే విచారంతో కుంగుతున్నవాళ్ళే.

"మనం ఇద్దరం ఒక్కచోటే కూచుందాం" అంటూ సిజావ్ ఆమె నొక బల్లదగ్గరకు తీసుకువెళ్ళాడు. తల్లి మాట్లాడకుండా ఆ బల్లమీదకూచుని దుస్తులు సర్దుకుంది. ఒక్కసారి హాలంతా నాలుగుమూలలూ చూచింది పసుపుపచ్చ, ఎరుపు మొదలైన రంగులుగల పువ్వులు గుడ్డపేలికలు కనబడ్డాయి.

"నీకొడుకు మా "వాస్యా"ను పాడుచేసాడు." అంది ప్రక్కనే కూచున్న ఒక స్త్రీ.

"నోరుమూసుకో! నటాలయా, నీకేం తెలియదు" అని కళ్ళెర్రచేసి సిజావ్ ఆమెను మందలించాడు.

నిలోనా తలెత్తి ఆ స్త్రీకేసి చూచింది. ఆమె * శ్యామొలో తల్లి. ఆవరుస లోనే చివర అతని తండ్రి కూచున్నాడు.

---

* ముద్దాయిలలో ఒకడు, పావెల్‌తోపాటు అరెస్టయిన కామ్రేడ్.

కోర్టు హాలు చాలా విశాలంగావుంది. పెద్ద పెద్ద కిటికీల్లోంచి మందంగా వెలుతురు వస్తోంది. హాలులోపల కిటికీలమధ్య జారుచక్రవర్తి పెద్దపటమొకటిగోడకు తగిలించివుంది. దాని చట్రం బంగారపుగిల్టు కావడంచేత ధగధగ మెరుస్తోంది. దానికి రెండువైపుల ఎర్రటి తెరలు వ్రేలాడుతున్నాయి. పటానికిముందు హాలంత వెడల్పునా కటకటాల వెనుక ఒక పెద్దబల్లఉంది. ఆ బల్లమీద పచ్చనిగుడ్డ పరిచారు. గోడకు కుడివైపున రెండు బెంచీలున్నాయి. ఎడమవైపున రెండు వరుసల ఎర్రరంగు కుర్చీలున్నాయి. మెడలమీద ఆకుపచ్చని పట్టీలు, రొమ్ముమీద పసుపుపచ్చని బొత్తాములు కలిగిన బంట్రోతులు చప్పుడుచేయకుండా ఇటూ అటూ హడావిడిగా తిరుగుతున్నారు. హాలంతా గుసగుసలతో నిండిపోయింది. మందుల దుకాణంలో రకరకాలమందుల వాసనలన్నికలిపి ఏదో చిత్రమైన వాసనవచ్చినట్లుగానే, ఒక విధమైన వాసన బయలుదేరింది. రంగులు, వాసనలు, ధగధగలు, ఆ మెరమెపలు, ఆగుసగుసలు తల్లికి చాలా చిత్రంగాతోచాయి. ఈ హడావిడివల్ల ఒక విధమైన ఆశ్చర్యం, నిశ్చేష్టత్వం కలగడంలో వింతేమీలేదు.

హఠాత్తుగా ఎవరో అస్పష్టంగా ఒక్క కేకపెట్టారు. తల్లి గజగజలాడింది. అంతాలేచి నుంచున్నారు. ఆమెకూడా సిజావ్ చెయ్యిపట్టుకుని లేచింది.

హాలుకి ఎడమమూల నున్న తలుపు బరువుగా తెరవబడింది. ఒకవృద్ధుడు ఊగులాడుతూ లోపలికి వచ్చాడు. వెలవెలబోతూవున్న ఆయన చిన్నముఖంమీద పల్చపల్చగా మీసాలున్నాయి. కళ్ళకి సులోచనాలు జడ్జీ ఉద్యోగానికి చిహ్నంగా బిరుసైన మెడపట్టీ తగిలించుకున్నాడు. చప్పిదవడల మొగానికి ఆ పట్టీ బొట్టెట్టి నట్టుంది. చూచేవాళ్ళకి ఆ మెడపట్టీ లోపల అసలు మెడంటూ ఉందా అనే అనుమానం కలిగేటట్టుంది. పొడుగాటి యువకు డొకడు ఆయన చంకలక్రింద చేతులు వేసి తీసుకువచ్చాడు. ఆయనవెనుకాలే బంగారపు చమ్కీకోటును ధరించిన ముగ్గురు పెద్దమనుష్యులు ప్రవేశించారు. వాళ్ళవెనకాల మామూలు సివిలు ఉద్యోగస్తుల దుస్తులను ధరించి మరిముగ్గురు దయచేశారు. వీళ్ళంతా ఒకళ్ళవెనకాల ఒకళ్ళు మెల్లగా ప్రవేసించారు. అంతా సర్దుకుని కుర్చీలలో కూర్చునేసరికి కొంత సేపు పట్టింది.

అంతా కూర్చున్నతర్వాత అందులో నిద్రమొఖం, నున్నగా క్షవరం చేయించుకున్న గడ్డంకలిగిన ఒకాయన ఆ ముందువచ్చిన ముసలిజడ్జీతో ఏదో గొణగడం ఆరంభించాడు. ఆ ముసలిజడ్జీ ఏమీ కదలకుండా కొయ్యబొమ్మలా కూచుని వింటున్నాడు. బల్లచివర ఒక పొడుగాటి బట్టతలమనిషి నిలబడ్డాడు. అతను తన వ్రాతబల్లమీది కాగితాన్ని అటూ ఇటూ అందిస్తున్నాడు.

ఆ ముసలి జడ్జీ చటుక్కున ముందుకు వంగి మాట్లాడడం ఆరంభించాడు. మొదటిమాట ఒక్కటే స్ఫుటంగా వినిపించింది. మిగతాదంతా ఏమిటో తెలియనే

లేదు. పెదిమలు కదలడమేగాని ధ్వనేమీ బయటికి రావడంలేదు — "నేను ప్రారంభిస్తున్నా—"

"చూడు చూడు" అని సిజావ్ తల్లిని మెల్లగా తట్టాడు.

బోను వెనకాల తలుపు తెరిచారు. ఒక సిపాయి తళతళలాడే పెద్ద విచ్చు కత్తిని భుజాన్ని వేసుకొని ముందుకు వచ్చాడు. అతనివెనకాల పావెల్, ఆంద్రీ, ఫెద్యామాజిన్ గాసెవ్ సోదరులిద్దరూ, శామొలో, బూకిన్, సోమో, ఇంకా ఐదుగురు యువకులు ప్రవేశించారు. పావెల్ అమ్మకేసిచూచి చిరునవ్వు నవ్వాడు. ఆంద్రీ పళ్ళుబిగించి తల ఆడించాడు. అంతవరకు నిశ్శబ్దంగా నిర్జీవంగాను వున్న ఆ హాలులో వాళ్ళ నవ్వులతో కొంత ఉత్సాహం రేగింది. బంగారపు దుస్తులవాళ్ళ ధగధగలు తగ్గాయి. తల్లికి ఒకవిధమైన ధైర్యం, ఉత్సాహం కలిగింది. ఆమె వెనకాల అంతవరకు నిశ్శబ్దంగాకూచున్న జనంలోకూడా కలకలం బయలుదేరింది

"వాళ్ళేమీ భయపడడంలేదు" అన్నాడు సిజావ్. సోమోవ్ తల్లి నెమ్మదిగా ఏడ్వడం మొదలుపెట్టింది. "నిశ్శబ్దం" అని గట్టిగా ఒక్క కేక వినబడింది.

"నేను ముందుగానే చెపుతున్నాను. నిశ్శబ్దంగా వుండకపోతే............" అన్నాడు ముసలిజడ్జి.

## ౧౫

పావెల్ ఆంద్రీ పక్కనే కూచున్నాడు వాళ్ళతోపాటు ముందు బెంచీ మీద మాజిన్, శామొలో, గాసెవ్‌సోదరులు కూచున్నారు. ఆంద్రీ గెడ్డంతీసేశాడు. మీసం మాత్రం తెగ పెరిగింది. మొగం ఏదో కొత్తగా కనుపించింది శామొలో మాజిన్ మొగం మామూలుగానే నిండుగా ఉంది. శామొలో ఉంగరాలజుట్టూ అతనూ యధాప్రకారంగానే ఉన్నాడు. ఇవాన్ గాసెవ్ ఎప్పటిలాగే నవ్వుతూ కూచున్నాడు.

"అయ్యో ఫెద్యా! ఫెద్యా!" అని ఒక్కసారి నెమ్మదిగా అనుకున్నాడు సిజావ్.

తల్లి కిప్పుడు కాస్త ఊపిరి తిప్పుకునే ధైర్యం వచ్చింది. ఆ ముసలిజడ్జీ ముద్దాయిలకేసి చూడకుండానే ఏదో అస్పష్టంగా ప్రశ్నలువేస్తున్నాడు. ఆయన తలయినా కదపడంలేదు. పాషా చెక్కుచెదరకుండా ముక్తసరిగా ఆ ప్రశ్నలకు జవాబు చెప్పాడు. ఈసంగతి చూచినతర్వాత ఈ ముసలిజడ్జీకాని అతని సహాయకులుకాని ప్రజలకంతగా అపకారం చేస్తారని తల్లికి తోచలేదు. ఏదో గ్రహిస్తున్నట్లుగా వాళ్ళ ముఖాలకేసి ఆమె చూచింది. ఆమె హృదయంలో కొత్త ఆశ కూడా పుట్టింది.

ముసలిజడ్జీని చంకక్రింద చెయ్యివేసి తీసుకువచ్చిన యువకుడు ఆషామాషీగా ఒకకాగితం చదవడం ఆరంభించాడు. ఎందుకువచ్చిందిరా అన్నట్లు అతను కాగితం చదువుతూ ఉంటే హాలులో జనానికి విసుగెత్తింది. కాని జనం నిశ్శబ్దంగానే కూచుని విన్నారు. నలుగురు ప్లీడర్లు ముద్దాయిలతో మెల్లగా చేతులు త్రిప్పు కుంటూ మాట్లాడుతున్నారు

ఆ ముసలిజడ్జీ కొకప్రక్కన పెద్దదేహం, ఈగరెక్కల్లాంటి కళ్ళు కలిగిన ఒక జడ్జీ కుర్చీకంతా సరిపోయేట్టుగా కూచున్నాడు. రెండోప్రక్క వెలవెలబోతున్న ముఖం. ఎర్రటిమీసాలు వంగిపోయిన నడుమూ గల జడ్జీ కూచున్నాడు ఆయన కళ్ళు సగం మూసుకుని, కుర్చీకానుకుని ఏదో ఆలోచిస్తున్నట్లున్నాడు. పబ్లిక్ ప్రాసిక్యూటరు (ప్రభుత్వ న్యాయవాది) మొగం ఒడిలిపోయి కళా కాంతిలేకుండా ఉంది. జడ్జీల వెనకాల పురపాలకసంఘాధ్యక్షుడు కూచున్నాడు. ఏదో ఆలోచనలో పడి తన బుగ్గమీద తానే దరువేసుకుంటున్నాడు. ఆయన ప్రక్కనే ప్రభుకోటికి చెందిన Marshall of the nobility * పెద్దమనిషి కూచున్నాడు. ఆయన తల నెరిసింది. ఖారీగెడ్డం బారడేసికళ్ళు ఆయన ప్రక్క ఆ జిల్లా స్థానిక సంఘాధ్యక్షుడు కూచున్నాడు. రైతులు తొడుక్కునే పొట్టిచొక్కా ధరించాడు. పెద్ద గుమ్మడికాయ ప్రమాణంగాఉన్న బొజ్జని తన ఓవరుకోటుతోకప్పి కనబడకుండా చెయ్యాలనే ప్రయత్నంచేస్తూ వుండేవాడు. కాని ఆకోటు జారిపోయి బొజ్జ కనబడుతూనే ఉండేది.

"ఇక్కడెవ్వరూ నేరస్తులులేరు; న్యాయాధిపతు లంతకుముందేలేరు. ఇక్కడున్నది నిర్బంధితులు, విజేతలు" అని పావెల్ ఘంటాపథంగా చెప్పాడు. హాలు మారుమ్రోగింది. చీమ చిటుక్కుమనని నిశ్శబ్దం. తల్లికి కాస్సేపటిదాకా కాగితంమీద కలంతో వ్రాస్తుంటే అయ్యే బరబరధ్వని, తనహృదయం కొట్టుకుంటున్న తటతటధ్వని. తప్ప ఇంకేమీ వినబడలేదు.

ఆముసలిజడ్జీ యేమిటో శ్రద్ధగావింటున్నట్లు కనబడ్డాడు. మిగిలిన జడ్జీలు కూడా ముందుకువంగారు.

"సరి....ఆంద్రీనకోడా! నువ్వు వొప్పుకుంటావా?" అని ముసలిజడ్జి అడిగాడు

"లేచినుంచో" అని ఎవరో ఆంద్రీతో మెల్లగా అన్నారు.

ఆంద్రీ మెల్లగాలేచి ఒళ్ళు విరుచుకున్నాడు. మీసంమెలేస్తూ ముసలిజడ్జికేసి ఓరచూపుచూచి "బాగానేవుంది. నేను నేరస్తుడనని ఒప్పుకోవడం దేనికి? నేనెవ్వరినీ చంపలేదు. ఎవడిసొమ్మూ అపహరించలేదు; ప్రజలు ఒకళ్ళనొకళ్ళు

---

* డిస్ట్రిక్టు ఎల్డర్ District elder

కొల్లగొట్టుకుంటూ చంపుకుంటూఉండే యీజీవితపద్ధతి నాకిష్టంలేదు. అంతే" అన్నాడు.

ముసలిజడ్జి "ఏయి! అడిగినప్రశ్నకి తిన్నగా అవును, కాదన్నేఅని జవాబు చెప్పాలి" అంటూ మందలించాడు.

తల్లికి వెనుకగా కూచున్నజనంలో సంచలనం కలిగింది. గుసగుసలు లేచినాయి.

"ఎల్లా మాట్లాడుతున్నాడో చూశావూ?" అన్నాడు సిజావ్.

"ఆ"

"ఫెడ్యామ్యాజిన్! నువ్వు జవాబుచెప్పు."

"నేచెప్పదలచుకోలేదు" అని మ్యాజిన్ గభాలునలేచి చెప్పాడు. అతని ముఖం ఆవేశంచేత కందగడ్డలాగైంది. కళ్ళల్లోంచి నెరుసులు రాలాయి. ఎందు చేతో చేతులు వెనక్కిపెట్టుకున్నాడు.

సిజావ్ మెల్లగా మూలిగాడు. తల్లి తెల్లబోయి చూచింది.

"నేను ఈవిచారణలో పాల్గొనతలచుకోలేదు. మీకోర్టు సక్రమమైనదికాదు. మీరెవ్వరు? మమ్మల్ని విచారించడానికి మీకు ప్రజలు అధికారం యిచ్చారా? లేదు. ఇవ్వలేదు. మీరెవ్వరో నాకు తెలియనేతెలియదు" అని గభాలున ఫెడ్యా కూచున్నాడు. రోషపూరితమైన ముఖాన్ని ఆంద్రీ వెనుకచాటు పెట్టాడు.

లావుపాటి జడ్జీ ముసలి జడ్జీ చెవులో ఏమిటో గుసగుస లాడాడు. ముసలి జడ్జీ పాలిపోయిన ముఖాన్ని పైకెత్తి ఖైదీల కేసిచూసి పెన్సిలుతో బల్లమీద కాగితంమీద ఏదో గిలికాడు. తల కదలకుండా దేహం అంతా పక్కకొరగేసి ఎర్రమీసాల జడ్జి శ్రద్ధగా ఆలకిస్తున్నాడు. మార్షల్ ఆఫ్ ది నొబిలిటీ పబ్లిక్ ప్రాసిక్యూటరుతో ఏదో మాట్లాడుతున్నాడు. పురపాలక సంఘాధ్యక్షుడు నవ్వుతూ గడ్డం సవరించుకుంటూ వింటున్నాడు.

మళ్ళీ ముసలి జడ్జీ మాట్లాడడం ఆరంభించాడు. నలుగురు ప్లీడర్లు శ్రద్ధగా ఆలకించారు. ముద్దాయిలు తమలో తాము గుసగుస లాడుకుంటున్నారు. ఫెడ్యా ఖంగారుపడి ముఖం చాటేశాడు. "మాబాగా చెరిగేశాడు కదూ! బలేదెబ్బకొట్టాడు అందరికన్నా నయం. బలేవాడవురా అబ్బాయీ!" అంటూ సిజావ్ తన మేనల్లుడిని మెచ్చుకున్నాడు.

తల్లి కేమీతోచక నవ్వుకుంది. ఈ తంతంతా ముందువచ్చే ప్రమాదానికి సూచన కాబోలనుకొంది. కాని పావెల్ ఆంద్రీలు కోర్టులో మాట్లాడుతున్నట్లుకాక ఇంటిదగ్గరలాగే నిర్భయంగా చెప్పిన మాటలను గుర్తించింది. ఫెడ్యా యావనోద్రేకానికి చాలా సంతోషించింది. తనకే కాకుండా హాల్లోఉన్న జనానికందరికి ఏదో కొత్తధైర్యం ఉత్సాహం వచ్చినట్లు ఆమెకుతోచింది. ముసలిజడ్జి "నువ్వేమి

చెపుతావు ?" అన్నాడు. బట్టతల పబ్లిక్ ప్రాసిక్యూటరు లేచి చేతులు ఝాడించి బల్లమీద ఒక చెయ్యిమోపి గబగబా పాఠం వప్పచెప్పుతున్నట్లు ఏదో యేకరువు పెట్టాడు. అందులో ఏమీ భయంకరమైన సంగతేమీలేదు.

కాని అప్పుడే ఆమె హృదయంలో ఏదో బాధకలిగింది. ఏమీ బాహ్య చిహ్నాలులేకుండానే ఏదో పెద్ద ప్రమాదం వచ్చి మీదపడుతుందనే ఒక విధమైన అనుమాన మామెను బాధపెట్టడం ఆరంభించింది. జడ్జీల ముఖాలకేసి తేరిపార చూసింది. ఏమీ విశేషం కనుపడలేదు. పావెల్‌నుగాని ఆంద్రీనిగాని మరెవ్వరిని వాళ్ళు కోపపడడంలేదు. తానూహించుకున్నట్లు జడ్జీలు వాళ్ళనేమీ కేకలు వెయ్య డంలేదు. తిట్టడంలేదు. వేళాకోళం చెయ్యడంలేదు. తప్పనిసరి కనుక "ఏం ప్రయోజనం ?" అనుకుంటూనే ఏవో ప్రశ్నలు వేస్తున్నారు వాళ్ళేమి జవాబు చెప్పితే ఆ జవాబులు విధిలేక వింటున్నారు. ఇదివరకే వాళ్ళకన్ని సంగతులు తెలిసినట్లు స్పష్టంగా తెలుస్తోంది.

ఆమె ముందరగా ఒక పోలీసుఉద్యోగి నిలబడి సాక్ష్యం చెపుతున్నాడు

"పావెల్ వాసవ్ అందరికీ నాయకుడు"

"మరి ఆంద్రీ ?"

"అతనూను"

మొత్తంమీద జడ్జీలంతా తల్లికి జబ్బుపడిలేచినవాళ్ళులా కనిపించారు వాళ్ళు కూచునే పద్ధతి, మాట్లాడే మోస్తరుచూస్తే ఆమెకల్లాగే తోచింది. బిగ్రబిగుసుగా ఉండే ఆ చెమ్కీకోట్లు, ఆ కాలర్లు, ఆ పోలీసులు, ఆ ప్లీడర్లు, ఇవన్నీ వాళ్ళకు కూడా కష్టంగానేఉన్నట్లు తోచింది. ఆ కుర్చీల్లో విధో, కర్మమోఅని కూచుని తెలి సిన విషయాల్ని గురించే ప్రశ్నలువేస్తూ ఉండడం, వాళ్ళకీ ఇష్టంలేనట్లుగా వాళ్ళ మొగాలు చూస్తేనే తెలుస్తోంది. ఇదివరదాకా పరిపాలనాధికారులెల్లా ఉంటారో తల్లికంతగా తెలియదు. ఇప్పుడీ జడ్జీలముఖాలుచూస్తే భయపడడంకన్న వాళ్ళను గురించి జాలిపడడం అవసరంలా తోచింది

పసుపుపచ్చని ముఖంగల ఒక పోలీసు ఉద్యోగి సాక్ష్యం చెప్పడం ప్రారం భించాడు. అతన్ని ఇదివరకు తల్లి చాలాసార్లు చూచింది అతడు పావెల్‌ను గురించి, ఆంద్రీని గురించి చాల గట్టిగా చెప్పాడు. తల్లి అప్రయత్నంగా నవ్వు కుని 'ఓరి వెర్రిబాబూ ! నీకేంతెలియదోయ్' అనుకుంది తనలో తాను.

ఇప్పుడు ముద్దాయిలకేసి చూస్తుంటే తల్లికేమీ భయంగలుగలేదు. వాళ్ళను గురించి ఆత్రతగాని, జాలిగాని, పడవలసిన అగత్యమేమీ తోచలేదు. ఆమె హృద యంలో వాళ్ళందరియెడల పరిపూర్ణమైన ప్రేమ, గౌరవం, అభిమానం జనించాయి సంతోషం పైకి కనుపించింది ఆ యువకులంతా జమాజట్టీలులాగ అత్యుత్సా హంగా ఉన్నారు. ఈకోర్టులో సాక్షులు జడ్జీలు మాట్లాడుకునే మాటలతోగాని

పబ్లిక్ ప్రాసిక్యూటరు వకీళ్ళు పెట్టుకునే పేచీలతోగాని వాళ్ళకేమీ సంబంధం లేనట్టుగానే ప్రవర్తించారు. మధ్య మధ్య నవ్వుకుంటూ వేళాకోళాలు చేసుకుంటూ కోర్టంటే ఏమీ లక్ష్యం లేకుండా కూచున్నారు ఆంద్రీ- పావెల్ ఇద్దరూ విచారణ వున్నంతసేపూ, తమ వకీలుతో మాటాడుతూనే ఉన్నారు. ఆ క్రితంరోజున ఆ వకీలు నికోలే యింటికి వచ్చినప్పుడు తల్లి చూచింది అతనుకూడా ఈ బృందంలో వాడేనని నికోలే సంభాషణవల్ల ఆమె గ్రహించింది అందరిలోనూ యౌవనోత్సాహం వుట్టిపడుతోంది. తల్లి వాళ్ళందరినిచూస్తూ, పోలుస్తూ ఆలోచించుకుంటూ కూచుంది.

ఇంతలో సిజావ్ తల్లిని నెమ్మదిగా మోచేత్తో తట్టాడు. ఆమె ప్రక్కకు తిరిగిచూస్తే ఆతనిముఖంలో ఒకవిధమైన సంతృప్తి ఆమెకు కనబడింది.

"చూడుచూడు. ఎంత కట్టుబాటుగా నువ్వా నేనా అంటున్నారోచూడు! మంచి ఘట్టివాళ్ళు. ఆహా! మహారాజు బిడ్డలుకాదూ? ఏమైతేనేమి? అందరికి శిక్ష పడుతుంది" అన్నాడు సిజావ్.

తల్లి వినివిని 'ఎవరు శిక్షించేది?' అని తనలోతానే అనుకుంది.

విధో, కర్మమో అన్నట్లు త్వరత్వరగా సాక్షులు తమ సాక్ష్యాలు చెప్పేశారు. జడ్జీలుకూడా తప్పనిసరిగదాయని ఏదో మాట్లాడారు. ఈ విచారణతో తమకేమీ సంబంధం లేనట్లు జడ్జీలు చూస్తూవుండేవారు. అప్పుడప్పుడు లావుపాటిజడ్జీ ఆవులించేవాడు. నవ్వొస్తుంటే చెయ్యి అడ్డంపెట్టుకునేవాడు. ఎర్ర మీసాల జడ్జీముఖం మీద నెత్తురుచుక్క ఉండేదికాదు. తరుచు రెండుచేతుల్తోటి కణతలు నొక్కుకుంటూ సరంబీకేసి పెద్దగుడ్లుచేసి చూస్తూవుండేవాడు. పబ్లిక్ ప్రాసిక్యూటరు మధ్యమధ్య యేమిటో కాగితంమీద గిలికి పుస్పుస్‌మని, మార్షల్ ఆఫ్ ది నొబిలిటీతో మాట్లాడుతూ ఉండేవాడు. పురపాలకసంఘాధ్యక్షుడు కాలిమీద కాలేసుకు కూచుని మోకాలిమీద వేళ్ళతో లయవేస్తూ కూచునేవాడు ముసలిజడ్జీ కుర్చీలో కదలకుండానే కూర్చునే వుండేవాడు. ఇల్లాగే విచారణ చాలాకాలం ఈదురోమని నడిచింది. జనానికి ప్రాణం విసిగింది.

నిర్మొగమాటంగాను, నిష్పక్షపాతంగాను మనిషిని ఆమూలాగ్రంగా పరీక్ష చేసి, అతని ఆత్మనుపట్టిచూచి న్యాయవిమర్శచేసే ధర్మదేవత ఆ హాలులో తల్లికెక్కడా కనపడలేదు. అందుచేత హాలు ఆడంబరంకాని అధికారంకాని, దర్జాకాని ఆమెకేమీ భయం కలుగచేయలేదు.

"నేను కోర్టు నిలుపుచేస్తున్నా" అని ముసలి జడ్జి అస్పష్టంగా అంటూ లేచాడు. కోర్టువారు ఫలహారానికి లేచారు. హాలంతా 'అయ్యో కుయ్యో' ధ్వనులు, అడుగుల చప్పుళ్ళు, దగ్గులు, తుమ్ములతో నిండిపోయింది, ఖైదీలనుకూడా అవతలికి తీసుకువెళ్ళిపోయారు. వాళ్ల వెళ్ళిపోతున్నప్పుడు తమ బంధువులను

తల ఆడించో, కనుసైగచేసో, చిరునవ్వుతోటో హెచ్చరించారు. ఈగర్ "భయ పడకు" అని ఇవాన్ గాసెవ్ ఎవరినో కేకవేశాడు.

సిజావ్, తల్లి వసారాలోకి వచ్చారు "కాస్త టీ పుచ్చుకుందాం పద. ఇంకా గంటన్నర టైముంది" అన్నాడు సిజావ్.

"నాకు పుచ్చుకోవాలనిలేదు."

"సరే. అయితే నేనూ వెళ్ళను కాని మనవాళ్లెంత వాళ్ళయినారు? వాళ్ళ ధోరణిచూస్తే వాళ్ళు తప్ప ఇంకెవళ్ళు మనుష్యులు కానేకారనిపిస్తున్నారు. వాళ్ళంతా విడుదలవుతారు సందేహంలేదు ఫెద్యా సంగతిచూడు" శామొలో తండ్రి టోపీ చంకలో పెట్టుకొని రివ్వుమంటూ వాళ్ళిద్దరిదగ్గరకు వచ్చాడు.

"మా వాసిలీ ఎంతవాడయినాడు! వాదన ప్రతిపాదనే వద్దు పొమ్మన్నాడు ఊరికే నాన్చడం వాడికిష్టంలేదు. ఈ బుద్ధి మొదట మావాడికే పుట్టింది. నిలోనా! మీ వాడు ప్లీడర్లు కావాలన్నాడు. మావాడితోపాటు మరినలుగురుకూడా వద్దు పొమ్మన్నారు. ఉంహూం. బాగానేవుంది" అన్నాడు.

అతని పక్కనే అతనిభార్య తెల్లబోయిచూస్తూ జేబురుమాలుతో ముక్కు తుడుచుకుంటూ నిలబడింది. అతను తన గడ్డం సవరించుకుంటూ నేలకేసిచూస్తూ ఇలా అన్నాడు.

"దీనిలో తమాషా ఇది. మన కుర్రకుంకలు ఈ గడబిడంతా అనవసరంగా నెత్తినెట్టుకుని నాశనమైపోతున్నారేమో ననిపిస్తుంది. ఒక్కొక్కప్పుడు అట్టే ఆలోచిస్తే వాళ్ళు చేసేపనే సరియైనదేమోననిపిస్తోంది. ఫాక్టరీలో వీళ్ళలాంటి వాళ్ళు చాలామంది బయలుదేరడం చూస్తూనే వున్నాం దొరికిపోతూవుంటారు. కానీ వాళ్ళని పూర్తిగా నిర్మూలం చెయ్యడం అసంభవం. నదిలో ఎన్నివలలేసి పడితేమాత్రం చేపలు అసలు లేకుండా పోతాయి? అసంభవం. వాళ్ళలోకూడా గొప్ప శక్తివుంటే ఉండొచ్చుననిపిస్తుంటుంది ఒక్కొక్కప్పుడు."

"ఇదంతా మన కర్థంకావడం కష్టంసుమా" అన్నాడు సిజావ్,

"అవునవును. కష్టమే" అన్నాడు శామొలో. అతని భార్యబుర్రమని ముక్కుతో గాలెగబీల్చి "వాళ్ళంతా చాలాగట్టివాళ్ళే" అని చిరునవ్వు నవ్వుతూ "నిలోనా! ఇందాక మీవాడే మావాడిని పాడుచేశాడన్నందుకు కోపగించుకోకు. నిజం అందరికీ తెలుసు రహస్యపు పోలీసులు మావాడిని గురించి ఏంచెప్పారో చూశావా? తానుకూడా దిట్టమైన వాడినే అనిపించాడు మావాడు" అంది సగర్వం గాను. తల్లి ఆమెస్థితి నర్థంచేసుకుని మెల్లగా నవ్వుతూ "యువకులహృదయం ఎప్పుడూ సత్యానికి సమీపంగావుంటుంది" అంది. వసారాలో ప్రజలు గుంపులు గుంపులుగాచేరి గడబిడపడుతున్నారు. కొందరు గుసగుస లాడుతున్నారు. మరి కొందరు గంయిగంయిమని మాట్లాడుతున్నారు మొత్తంమీద అంతా ఏదో

మాటాడుతూనే ఉన్నారు. బూకిన్ పెద్దన్నగారుబాగా చెయ్యెత్తుమనిషి. కంద గడ్డలాంటి ముఖం, అతనూ ఇటూ అటూ మహాహడావిడిగా తిరుగుతున్నాడు.

"జిల్లా స్థానిక సంఘాధ్యక్షుడు క్లైపనాల్ కీకేసు విచారణ చేయడానికి ఏమి హక్కుందంట?" అని గట్టిగా అరిచాడు.

"ఊరుకోరా నాయనా!" అంటూ అతని ముసలితండ్రి బ్రతిమాలాడు.

"నేనూరుకోను. ఎందుకు నోరునొక్కుకోవాలి. వున్నసంగతంతా బట్ట బయలుచేస్తాను నిరుడు గుమాస్తా భార్యాకోసం గుమాస్తానే చంపేడని పుకారు పుట్టింది. ఇల్లాంటివాడేమి జడ్జి? నేనడుగుతానుండండి గుమాస్తా పెళ్ళాంతో కాపురం చేస్తున్నవాడేం పెద్దమనిషంట? ఏమంటారు? అంతేకాదు అతను పెద్ద దొంగనే సంగతి అందరికీ తెలుసు"

"ఊరుకోరా బాబూ! కాన్‌స్టాటిన్ ఊరుకో!"

"నిజమే ఈకోర్టుమాత్రం ఏమీ న్యాయమైనదికాదు" అన్నాడు శామొలో తండ్రి.

అతనిమాటవిని బూకిన్ సోదరుడు అతనిదగ్గరకువెళ్ళి గట్టిగా మాట్లాడడం ఆరంభించాడు. జనం కొందరతని వెనుకబడ్డారు.

"దొంగతనం, హత్య మొదలైన దారుణ నేరాలను విచారించడానికి *జ్యూరీ నేర్పాటుచేస్తారు. జ్యూరీలోవుండే వాళ్ళంతా సామాన్యప్రజలు రైతులు వర్తకులు. కాని అధికారులకు వ్యతిరేకమైనంత మాత్రాన్ని ఈకేసులో అధికారులే ఎందుకు విచారించాలి? జ్యూరీలెందుకు వెయ్యలేదు? ఇదేమి న్యాయం?"

"వాళ్ళు అధికారులమీద ఎందుకు తిరగబడాలి? నాయనా నువ్వూరుకోరా బాబూ!"

"నేనూరుకోను. నువ్వూరుకో. ఫెడ్సామాజిన్ చెప్పినమాట నిజమే. నువ్వు నన్ను అవమానిస్తే నేను నిన్నొక్క చెంపకాయ కొడతాను. చెంప కాయ కొట్టడం తప్పయితే కావచ్చును. కాని ముందు తప్పెవరిది? నీదే. సందేహమేమిటి? నీదే."

ఇంతలో కోర్టు ముసలిదఫేదారు వచ్చాడు. వస్తూనే జనాన్ని పక్కలకు తోసుకుంటూవచ్చి, బూకిన్‌తో "ఏయి! అరవకు! నువ్వెక్కడున్నావో తెలుసునా? ఇదేమైనా చేపల బజారనుకున్నావా?" అన్నాడు.

"ఏమయ్యోయి! దఫేదార్! నేనెక్కడుండేదీ నాకు తెలియకపోలేదు. నేచెప్పేమాటవిను. నేను నిన్నుకొట్టాను. నువ్వు మళ్ళీ నన్నుకొట్టావు. పైగా నేను నీమీద నేరంమోపి కోర్టులో విచారణపెట్టించడం ఏమి సబబు ఏమంటావు?

"ఇంక మరి నిన్నవతలికి గెంటేస్తాను."

---

* పెద్దమనుష్యుల విచారణ

"ఎక్కడికి ? ఎందుకు ?"

"వీధిలోకి. అప్తే కేకపెట్టకుండా వుండడానికి."

"అంతే వాళ్ళకు కావలసినది. ప్రజలు నోరు నొక్కుకుని పడుండాలి".

"ఏమిటి నీవుద్దేశ్యం ?" అని దఫేదారడిగాడు. గట్టిగా బూకిన్ చేతులా డించుకుంటూ జనాన్నంటి ఒక్కసారి కలయచూచి నెమ్మదిగా ఇల్లా అన్నాడు. "ఏమిటా ? ఇంకొక విషయం. బంధువులనుతప్ప ప్రజలందరిని విచారణ సమయంలో లోపలికి రానివ్వకపోవడమేమి ? నువ్వు న్యాయంగా విచారణ చేయ దలచుకుంటే బహిరంగంగా విచారణ జరిపించు. ఇంత దాపరికం ఎందుకూ ?"

"మొత్తంమీద ఈ విచారణ న్యాయమైనదికాదు. అంతవరకు నిశ్చయం. సందేహంలేదు" అన్నాడు శామొలో కొంచెం దృఢంగా.

ఈ కోర్టుయొక్క అన్యాయాన్ని గురించి తల్లికూడా తనకి నికోలే చెప్పిన సంగతులు చెప్పాలనుకుంది. కాని ఆమాటలు మరిచిపోయింది. జ్ఞాపకం చేసుకుందామని జనంలోనుంచి పక్కకు తప్పుకుంది. ఎవడో ఒక నూనూగుమీసాల యువకుడు ఆమెకేసి చూస్తున్నాడు. అతను తన కుడిచేతిని షరాయి జేబులోపెట్టుకున్నాడు. అందుచేతే కాబోలు అతని యెడంభుజం కుడిభుజంకన్న క్రిందుగా కనబడింది. ఈలాంటి చిత్రమైన తేడాగల మనిషినే ఇదివర కెక్కడో చూచినట్లు తల్లికి జ్ఞాపకం. ఎక్కడా అని జ్ఞాపకం చేసుకుంటూవుండే ప్రయత్నంలో ఉండగా యాదాలాపాన్ని మరచిపోయింది. ఇంతలో మెల్లగా ఈ సంభాషణ ఆమె చెవుల్లో పడింది.

"అదిగో ఆ యెడమవైపుననున్న స్త్రీ"

"ఓహో ! అవును"

తల్లి వెనక్కి తిరిగిచూచింది. భుజాలు తేడాగాఉన్న యువకుడు ఒక పక్కగా తిరిగి ఆమెకేసి చూస్తు తనప్రక్కనే నిలబడిన నల్లగడ్డం, చిన్న ఓవర్ కోటు, మోకాళ్ళదాకా బూట్సు కలిగిన ఒక మనిషితో ఏదో చెపుతున్నాడు. మళ్ళీ ఆమె జ్ఞాపకం చేసుకునేందుకు ప్రయత్నంచేసింది. కాని లాభంలేక పోయింది.

దఫేదారు తలుపుతీసాడు.

"బంధువులు ! లోపలికిరండి. టిక్కెట్లుచూపించండి" "టిక్కెట్లా ? సర్కసులాగ" అన్నాడెవరో దీర్ఘాలుతీస్తూ. ప్రజల్లో కొంచెం ఉద్రేకం పుట్టింది. మునుపటికన్న నిర్భయంగానూ ధారాళంగాను మాటాడుకోవడం ఆరంభించారు. దఫేదారునంతగా లక్ష్యపెట్టడంలేదు.

బెంచీమీద సిజావ్ తల్లితో ఏదో గొణుగుతున్నాడు తల్లి 'ఏమిటి' అని అడిగింది. సిజావ్ మెల్లగా "ఏమీలేదు. జనం వట్టిమూర్ఖులు. ఏమీ తెలియదు. గుడ్డెద్దు చేలో పడ్డట్లు అంధకారంలోపడి అఘోరిస్తూ ఉంటారు" అన్నాడు.

గంట గణ గణ మోగింది

"కోర్టు ప్రారంభమైంది." అని ఎవరో ప్రకటించేరు. మళ్ళీ మునుపటి లాగే అంతాలేచారు. ఇదివరకు మాదిరిగానే వరుసగా జడ్జీలంతా వచ్చికూచున్నారు. ముద్దాయిలుకూడా లోపలికివచ్చేరు "పబ్లిక్ ప్యాసిక్యూటరు వాదిస్తాడిప్పుడు. శ్రద్ధగా విను" అని సిజావ్ తల్లిని హెచ్చరించేడు. తల్లి మెడసాచి ముందుకు వంగింది వినడానికి. ఏదో భయంకరమైన సంగతి చెవులో పడుతుందనుకుంది

పబ్లిక్ ప్రాసిక్యూటరులేచేడు జడ్జీలకు పక్కగా నిలబడ్డాడు. ముఖం వాళ్ళ కేసి తిప్పి. ఎడంచెయ్యి బల్లమీద ఆన్చి. కుడిచెయ్యి ఝాడిస్తూ మాట్లాడేడు. తల్లికి మొట్టమొదట మాటలేమీ అర్థంకాలేదు. ప్రాసిక్యూటరు ధారాళంగా మాట్లాడేడు ఒక్కొకప్పుడు మెల్లగా మాట్లాడేడు. మరొకప్పుడు జోరీగల ధ్వనిలా ఉండేది. కాని అందులో ఏమీ భయంకరమైన విషయంమాత్రం తల్లికి అగుపడలేదు. ఎంతసేపు మాట్లాడినా అందులో సారంసున్న. జీవమసలే లేదు. మాటల ఆడంబరమేగాని భావం శూన్యమే. అందుచేతేకాబోలు. ఆ ఉపన్యాసాన్ని పావెల్ గాని అతని మిత్రులుగాని గమనిస్తున్నట్టేలేదు. అందరూ నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

"అన్నీ అబద్ధాలే చెపుతున్నాడు" అన్నాడు సిజావ్ తల్లిచెవులో.

ఆమెకల్లా తోచలేదు. ప్రాసిక్యూటరు ఎవ్వరినీ మినహాయించకుండా అందరిమీద నేరారోపణ చేస్తున్నట్లు ఆమెకర్థమైంది. ముందుగా పావెల్ సంగతి చెప్పి, తర్వాత ఫెద్యాసంగతి మధ్య మధ్య ఇతరులను గురించి చెపుతూవచ్చేడు. ఇదంతా చూస్తే వాళ్ళనందరినీ అతడు ఒకే గోనిసంచిలో పడేసి మడతొక్కి మూతి బిగిస్తున్నట్లు తల్లికితోచింది. ఇంతవరకు ప్రమాదకరమైన విషయం ఏమీ రాలేదు. ఇంకా అదెప్పుడో వస్తుందని కనిపెట్టుకుంది ప్రాసిక్యూటరు ముఖం కేసి తెగచూచింది. కాని ఏమీవిశేషం కనబడలేదు. అనుమానంమాత్రం తల్లికి వదలలేదు.

ఆమె జడ్జీలమొఖంకేసి చూసింది పబ్లిక్ ప్రాసిక్యూటరు ఉపన్యాసంతో వాళ్ళకు మొగం మొత్తినట్లు స్పష్టంగా కనుబడుతూనేఉంది. అంతకు మించి వాళ్ళ మొగాల్లో కళాకాంతిలేదు.

ప్రాసిక్యూటరు ఉపన్యాసం ఎప్పుడు మానేస్తాడా అని వాళ్ళు ఎంతోసేపటి నుంచి కనిపెట్టుకున్నారు. ఒక్క మోస్తరుగా కూచోలేక కొందరు అటూ ఇటూ కదులుతూవుంచేవారు. ఈ కదలిక వాళ్ళ దేహాలికేగాని ఆత్మలకిమాత్రం యేమీ లేదు. ముసలిజడ్జీకి అసలు ఏవిధమైన కదలికాలేదు కూచున్నవాడు కూచున్నట్లే ఉన్నాడు. ఒక్కొక్కప్పుడు కళ్ళు మూసుకునేవాడు. వీళ్ళ నిర్లక్ష్యంచూచి తల్లి తనలోతానే "వీళ్ళు న్యాయవిచారణ చేస్తున్నారా ?" అనుకుంది. ఈ ఆలోచనతో ఆమె హృదయంలోవున్న భయం పోయింది.

పబ్లిక్ ప్రాసిక్యూటరు ఉపన్యాసం హఠాత్తుగా ఆగిపోయింది. దడదడా ఏవో మాటలు దొర్లించేసి, జడ్జీలకు వంగి, సలాంచేసి చేతులు నలుపుకుంటూ కూచున్నాడు. మార్షల్ ఆఫ్ ది నొబిలిటీ అతనికేసిచూచి తల ఆడించాడు. పుర పాలక సంఘాధ్యక్షుడు అతనికి చెయ్యి అందిచ్చాడు. జిల్లాసంఘాధ్యక్షుడు నవ్వుతూ బొజ్జ సవరించుకున్నాడు. జడ్జీలకీ ఉపన్యాసం ఏమీ కదలిక పుట్టించలేదు కాబోలు వాళ్ళు యేమీ కదలనైనాలేదు.

"దరిద్రపు పిశాచం" అని మెల్లగా సిజావ్ తిట్టాడు.

"తరువాత........ముద్దాయిల వకీళ్ళు ఫెదోశేవ్, మార్కోవ్, జాగరోవ్" అన్నాడు ముసలిజడ్జీ మొగానికేదో కాగితం అడ్డుపెట్టుకుని.

నికోలే యింటిదగ్గర తల్లికి కనబడిన వకీలులేచాడు. అతని ముఖం చిరునవ్వుతో వికసించింది కండ్లల్లో కళాకాంతి ఉంది. అతడు తాపీగా, స్పష్టంగా మృదువైన కంఠంతో మాట్లాడాడు. కాని అతనిమాటలు తల్లికి వినబడలేదు. సిజావ్ మెల్లగా ఆమె చెవుల్లో యిల్లా అన్నాడు.

"ఏమమ్మోయి ! అతనేంచెప్పాడో తెలిసిందా ? ప్రజలు దరిద్రంవల్ల చాలా బాధపడుతూ మతిహీనులై క్రిందుమీదులు తెలియకుండా వున్నారంటున్నాడు. ఫీడర్ ! అంతేకాదూ ? అతడింకా యేమంటాడంటే, ప్రజలు కేవలం మూర్ఖులంటున్నాడు."

వకీలు చరచరా మాట్లాడుచున్నాడు.

"అధర్మం, అక్రమం, దురాశ మొదలైన దుర్గుణాలతో నిండివున్నటువంటి ప్రస్తుత జీవితవిధానాన్నిచూస్తే, మానవమాత్రుడైనవాడు, మంచిచెడ్డలను విచక్షణ చేయగలమనిషి, హృదయమంటూవున్న మానవుడు తప్పకుండా ఈ జీవితపద్ధతి నంతంచెయ్యడానికి శక్తివంచనలేకుండా ప్రయత్నిస్తాడు. తిరుగుబాటు చేసితీరుతాడు."

ఆకుపచ్చ ముఖంగలజడ్జి ముందుకువంగి ముసలిజడ్జి చెవులో ఏదోవూదాడు. జడ్జీ వకీలును "కొంచెం జాగ్రత్తగా మాట్లాడాలి" అని మందలించాడు.

"ఓహో !" అనుకున్నాడు సిజావ్ మెల్లగా.

"వాళ్ళు విచారణచేస్తున్నారా ? నిర్జీవప్రతిమల్లావున్నారే." అంది తల్లి.

"ఫరవాలేదు. ఉండు. ఇదిగో వాళ్ళకీ జీవంవస్తుంది"

తల్లి జడ్జీలకేసి చూచింది. వాళ్ళంతా యేమీతోచకుండా కొట్టుకుంటున్నట్లు వాళ్ళ ముఖాలే చెపుతున్నాయి. అప్పుడే ఒక పొట్టిప్లీడరులేచి చాలా గౌరవంగా మాట్లాడడం మొదలుపెట్టేడు.

"కోర్టువారి గౌరవాధికారాలను మన్నించి, గౌరవనీయుడగు ప్రోసిక్యూటింగు వకీలుయొక్క ప్రవర్తనను గురించిన్నీ, ప్రజారక్షకశాఖఅంటే సామాన్యంగా

గూఢచారులని పిలువబడుతూవుండేవాళ్ళ చర్యలను గురించిన్నీ, నేను కోర్టువారికి రెండుముక్కలు మనవి చేయదలుచుకున్నాను."

ఆకుపచ్చ ముఖం జడ్జి ప్రెసిడెంటుతో ఏమిటో చెవిలోచెప్పాడు. ప్రాసిక్యూటింగు వకీలు అదిరిపడిలేచేడు. పొట్టిప్లీడరు మాత్రం తొణుకూ బెణుకూ లేకుండా వాదన సాగనిచ్చాడు సాక్షులనుగురించి గూఢచారియైన గ్రైమన్ ఏమని చెప్పాడంటే 'నే నతన్ని భయపెట్టే' నన్నాడు. ప్రాసిక్యూటరుగారు కూడా సాక్షుల్ని భయపెట్టిన సంగతి కోర్టువారికి విశదమే. ఆయన సాక్షుల్ని దబాయించాడు. ఈ విషయం ముద్దాయిల తరపు వకీళ్ళు కోర్టువారికి విన్నవించుకోగా అధ్యక్షులు దయతో ప్రోసిక్యూటరుగారిని మందలించారుకూడాను." ప్రోసిక్యూటింగు వకీలు చిరచిరలాడుతూలేచి గబగబా ఏమిటో చెప్పుకున్నాడు. ముసలి జడ్జికూడా అలాగే ఏమిటో అన్నాడు పొట్టివకీలు తలఎత్తకుండానే వాళ్ళమాటలన్నీ విని ఇలా అన్నాడు. "నేను నివేదించిన విషయాని కిప్పుడు స్థానంలేదని ప్రాసిక్యూటరుగారభిప్రాయపడేటట్లయితే, నేను చెప్పినమాటల్ని మార్చుకుంటాను. అంతమాత్రాన్ని నా వాదన పంథా మాత్రం మారదు. ఈసంగతెలావున్నా ప్రాసిక్యూటరుగారికింత ఆగ్రహం, ఆవేశం ఎందుకొచ్చిందో మాత్రం నా కర్థమవడం లేదు."

"అదీవరుస! అలాగే కొట్టాలిదెబ్బ!" అన్నాడు సిజావ్.

హాలంతా ఒక్కసారి ఉత్సాహంతో జంయ్‌మంది వ్యవహారం కాస్త పటుపటాంగంగాఉంది. ముద్దాయిల వకీళ్ళు నలుగురూ నాలుగువైపులా నాలుగు విధాలుగా లంకించుకుని జడ్జీలను ఖంగారుపెట్టేశారు. జడ్జీల కంతవరకూ ఉన్న మాంద్యం వదలిపోయింది. వకీళ్ళ సూటీపోటీమాటలు వాళ్ళకి శూలాల్లానాటుతూ వచ్చాయి. వాళ్ళలోవాళ్ళు ముందుకీ వెనక్కీ జరుగుతూ ఏమిటో సంప్రదించుకొనే వాళ్ళు. వాళ్ళ వ్యవహారమంతా చూస్తే ఈ ప్లీడర్ల వాదనాశక్తివల్ల వాళ్ళు ఇదివరకే చేసుకున్ననిర్ణయం—అంటే వాళ్ళస్వంత నిర్ణయంకాదు. పైనుంచివచ్చిన తాఖీదన్నమాట - మార్చుకోవలసివస్తుందేమో నని భయపడుతున్నట్లుంది. వాళ్ళ శూన్యహృదయాల్లోకూడా ఆ వాదన ప్రతిధ్వనించి వాళ్ళను కలవరపరచేసింది. జడ్జీల అవస్థచూచి బెంచీలమీద జనంకూడా 'అమ్మయ్య' అనుకుంటూ గుసగుసలు ప్రారంభించారు.

ఇంతలో హఠాత్తుగా పావెల్ లేచాడు. హాలతా నిశ్శబ్దం. చీమైనా చిటుక్కుమనడం లేదు. తల్లి బాగా ముందుకు వంగి చెవులొగ్గింది.

"నేను నా పార్టీవారు నియమించిన కోర్టును తప్ప మరే న్యాయస్థానాన్ని గణించను. కనుక నే చెప్పబోయేదంతా నాకోసమైన ప్రతివాదనకాదు. నా సహచరుల కోరిక ప్రకారం నేను కూడా ఈ విచారణలో పాల్గొనుటకు నిరాకరించాను.

కాని మీకు అర్థంకాని కొన్నిసంగతులు తెలసేటట్లు చెప్పడానికి మాత్రం ప్రయత్ని స్తాను • ప్రాసిక్యూటింగు అటర్నీ మేము సోషలిస్టు ప్రజాస్వామిక పతాకా న్నెత్తడం, ప్రస్తుత ప్రభుత్వాన్ని బహిరంగంగా ధిక్కరించడమే ననిన్నీ, మేముజారు చక్రవర్తికి సాక్షాత్తు శత్రువులమేననిన్నీ వాదించాడు. నేను మీ ఎదుట ఘంటాపధంగా చెప్పే సంగతేమంటే మా లెక్కప్రకారం ఈ దేశాన్ని బంధిస్తున్న దొక్క జారుచక్రవర్తే కాదు. మా కందుబాటులో వున్న మొదటి సంకెళ్ళను ఛేదించుట మా విధి."

హాలంతా నిశ్శబ్దం. పావెల్ కంఠధ్వనితో హాలు మారుమ్రోగింది. ఆ శబ్దంతో హాలంతా పెద్దదైపోయినట్లు తోచింది. జనం దృష్టికి అతనెంతో ఉన్నత స్థానంలోనుంచి మాట్లాడుతున్నట్లు కనుపించింది. తల్లికి కూడా అతనొక గొప్ప వ్యక్తిగా కనబడ్డాడు. అచంచలమైన నిశ్చయం. శాంతం, గర్వం ముఖంమీద స్పష్టంగా కనబడుతున్నాయి. అతని నీలినేత్రాలు అతితేజోవంతంగా ప్రకాశించాయి.

జడ్జీల కేమీ తోచక ఆయాసపడుతూ అటూ ఇటూ కదలడం మొదలు పెట్టారు. జడ్జీలు వాళ్ళల్లో వాళ్ళు ఏదో చెవులు కొరుక్కున్నారు. తర్వాత ముసలి జడ్జీ పావెల్‌తో ఏదో చెప్పాడు కాని అతని వాగ్జాలంలో జడ్జీమాటలు వినబడేలేదు.

"మేము సామ్యవాదులం, (సోషలిష్టులు) అంటే "స్వంత ఆస్థి"కి శత్రువులం. ప్రజలను ఖండఖండాలుగా చీల్చేసి, ఒక్కళ్ళమీద కింకొక్కళ్ళని ఉసికొలిపేదీ 'స్వంత ఆస్థే'. సమాధానపరచడానికికూడా వీలులేని శత్రుత్వాన్ని కలిగించేదీ ఆస్థే ఈ విభాగాల్ని కప్పిపుచ్చడానికి, అసత్యం, అధర్మం, మోసం, ద్వేషం మొదలయిన కలుషాల్ని సృష్టించేదికూడా ఈసొంతాస్థే. మానవుడు ఎవరో కొందరి యొక్క సౌఖ్యంకోసం యేర్పాటుచేయబడ్డ పనిముట్టుగా భావించే సంఘం చాలా అమానుషమైన సంఘమని మా నమ్మకం. అది మాకు శత్రువు. దాని కుహనా నీతినీ, నటనను మేమంగీకరించం. ఇలాంటి సంఘానికిన్నీ వ్యక్తులకున్నూ వుండే ఈ దుర్మార్గపు సంబంధాన్ని మేమెంతో అసహ్యించుకుంటున్నాం. మానవుని భౌతికంగానూ, నైతికంగానూ, దాస్యకూపంలో పడేయడానికి ఈ సంఘంచేసే ప్రయత్నాలన్నిటిని మేము ప్రతిఘటిస్తాం, లాభంకోసం సంఘాన్ని చిందరవందర చేసే ప్రతి పనికి మేమడ్డొస్తాం. ఎవరియొక్క కాయకష్టంవల్ల ప్రపంచంలోవుండే బ్రహ్మాండమైన యంత్రం మొదలుకొని పిల్లలాడుకొనే వస్తువువరకూ తయారవుతున్నాయో' ఆకార్మికులం మేమే. మానవ మాత్రునికుండవలసిన పరువు ప్రతిష్టల కోసం పోరాడడానికి అశక్తులుగా చేయబడ్డ వాళ్ళం మేమే. అంతా మమ్మల్ని తమ స్వార్థంకోసం పనిముట్టుగా ఉపయోగించుకుంటున్నారు. ప్రస్తుతం ఉపయోగించు

• ప్రోసిక్యూటింగు వకీలును, ప్రభుత్వపక్ష న్యాయవాది లేక పబ్లిక్ ప్రాసిక్యూటర్.

కుంటే ఉపయోగించుకోవచ్చును. కాని క్రమంగా కాలానుగుణ్యంగా అధికారమంతా మా చేతుల్లోకి తెచ్చుకొనేటందుకు తగినంత స్వేచ్ఛ సంపాదించుకోవడం కోసం ఇప్పుడు ప్రయత్నిస్తున్నాం. మా ఆదర్శం అతి సూక్ష్మం. అధికారమంతా ప్రజలకే. ఉత్పత్తిసాధనాలన్నీ ప్రజలవే. అందరూ కష్టించి పనిచెయ్యాలి. స్వంత ఆస్థి అనేదుండకూడదు. ఇదే మామంత్రం. చూసేరా? మేము కేవలం తిరుగుబాటుదార్లంకాము" పావెల్ చిరునవ్వు నవ్వాడు. అతని నీలి నేత్రాల్లో దేదీప్యమానమైన వెలుగు కనబడింది.

ప్రధాన న్యాయాధిపతి "దయచేసి అసలు సంగతి చెప్పాలి. అని గట్టిగా మందలించే తరహాలో చెప్పాడు. ఆయన పావెల్‌కేసి తీక్షణంగా చూశాడు. ఆచూపు చూస్తే తల్లికి భయంవేసింది. అతని కళ్ళల్లో దురాశఅనే అగ్గిరగిలి పావెల్‌ను దహించివేస్తుందేమో ననిపించింది. జడ్జీలంతాకూడా పావెల్‌కేసి తీక్షణమైన చూపులు చూస్తుంటే తల్లికి యెంతో కష్టంగా ఉండేది. దృష్టిదోషం తగుల్తుందేమోననుకొనేది రెప్ప వాల్చకుండా వాళ్ళు పావెల్ దేహాన్నంతనూ చూస్తుంటే, రక్తహీనమైన తమ దేహాల్ని పావెల్ రక్తంతో పూరించుకోడానికి అతని రక్తాన్ని పీలుస్తున్నారా అనే భ్రమ కలిగేది. తల్లికి పావెల్ మాత్రం చెక్కుచెదరకుండా నిలబడి చేతులుసాచి గంభీరంగాను, విస్పష్టంగాను తన వాగ్ధోరణి సాగనిచ్చాడు.

"మేము విప్లవవాదులం. ఎంతవరకైతే "స్వంతఆస్థి" అనేదుంటుందో, ఎంతవరకైతే కొందరూరికే కర్రపెత్తనం చేస్తూంటే మరికొందరు చెమటోడ్చి పనిచేస్తూ ఉంటారో అంతవరకూ మేము విప్లవవాదులుగానే ఉంటాము. మీరు ఎవరిహక్కులను రక్షించడానికై నియమింపబడ్డారో వాళ్ళకు మేము సమాధానపరచుటకు వీలులేని శత్రువులం మేము విజయం పొందేవరకూ సమాధానమనేది అసంభవం. కార్మికుల మయిన మేము తప్పక జయిస్తాం. మీ సంఘానికి మీరనుకునేటంత శక్తిలేదు మీరు దేని ఉత్పత్తి రక్షణలకోసమైతే లక్షలకొద్దీ జనంయొక్క మానప్రాణాలను బలిస్తున్నారో, దేని ఆధిక్యతవల్ల మాపైన అధికారం చలాయిస్తున్నారో, ఆ స్వంతఆస్తే మీసంఘంలో కలతలు పుట్టించి మిమ్మల్ని భౌతికంగాను, నైతికంగానూకూడా నాశనంచేస్తుంది. ఈ 'ఆస్థి' అనేదాన్ని రక్షించడానికి చాలా బందోబస్తుకావాలి. నిజానికి మాకన్న మీరంతా అంటే అధికారం చలాయించే వాళ్ళంతా ఎక్కువ దాస్యంలో పడున్నారు. మేము భౌతికంగానే దాస్యం అనుభవిస్తున్నాం. మీరు ఆధ్యాత్మికంగాకూడా దాస్యమనుభవిస్తున్నారు. మిమ్మల్ని ఆధ్యాత్మికంగా నాశనం చేస్తున్న దురలవాట్లను, దురహంకారాన్ని మీరు వదులుకోలేరు. కాని మేమో—మాఆంతరంగిక స్వేచ్ఛను బంధించగలిగినదేదీలేదు. మీరు బుద్ధిపూర్వకంగా మాకెక్కించే విషంకన్న అప్రయత్నంగా మా అంతరాత్మలకు మీరిచ్చే విరుగుళ్ళు చాలా రసవంతమైనవి. అందుచేత మీవిషం మాకు శాశ్వతమైన నష్టం చేయలేదు. మీరిచ్చే యీవిరుగుడు మా కార్మికుల

రక్తంలో బాగా జీర్ణించింది. దీనిశక్తివల్ల కలిగే తేజస్సు విజృంభించి, మీలో వుండే ఆధ్యాత్మికశక్తిని, తదితర మంచితనాన్నికూడా ఆకర్షించేస్తుంది. ఒక్క సంగతి చూచుకోండి! మీలో ఒక్కడుకూడా ఇకముందు అధికారమే ఆదర్శంగా పెట్టుకొని. దానికోసం దెబ్బలాడలేరు. ప్రపంచన్యాయానికి విరుద్ధంగావున్న మీ ప్రవర్తనను సమర్థించుకోవడాని కిదివరకే మీరు చెప్పవలసిన మాటలన్నీ చెప్పే శారు. మీరిక నూతనమైన భావాన్ని సృష్టించలేరు. భావప్రపంచంలో మీపని సున్న. ఆధ్యాత్మికంగా మీరు గొడ్డుపోయినట్లే. కాని మాభావాలు దినదినాభివృద్ధి పొందుతున్నాయి. నానాటికి నూతనమైన తేజస్సు వృద్ధిపొంది కళ్ళు మిరుమిట్లు గొల్పుతాయి. ఈభావాలే సామాన్య ప్రజలనందరినీ ఆకర్షించి, స్వాతంత్ర్య సమరానికి పురిగొల్పుతాయి. ప్రపంచంలోవుండే కార్మికులంతా తాము చేయదలచుకున్న మహత్కార్యాన్ని గుర్తించి ఒక్కటైపోతారు. జీవితంలో కలుగబోయే ఈ నూతన పరిణామాన్ని అడ్డుపెట్టడానికి దుర్మార్గం మూర్ఖత్వం తప్ప మీకు వేరే సాధనాలులేవు. మీ మూర్ఖత్వం స్పష్టంగా కనుబడేపోతుంది ఇక మీ దుర్మార్గం మాత్రం యెంతకాలం సాగుతుంది? అప్పుడే తెల్లముగ్గం వేసింది. మీరు మిమ్మల్ని యీరోజున యెవరిసహాయంతో మాగొంతు పిసుగుతున్నారో వాళ్ళేమాకుసహచరులై మమ్మల్ని కౌగలించుకుంటారు. మీశక్తిఅంటే మీ వెండిబంగారాల శక్తిచాలా నిర్జీవమైనది. ఆ నిర్జీవశక్తే మీ సంఘాన్ని అనేక చీలికలుగా చేసేసి ఒకళ్ళ నొకళ్ళు పీక్కుతినేటట్లు చేస్తుంది. కాని మాది జీవశక్తి. దానికిమూలం కార్మికులలో నానాటికీ వృద్ధిపొందుతూవున్న ఐకమత్యం. మీరుచేసే ప్రతిపనీ ప్రజలను బంధించిదే కనుక మహానేరం చేస్తున్నారు. మీ దురాశవల్లా, మీద్వేషంవల్లా పుట్టి, జనాన్ని పీడిస్తున్న పిశాచాల్ని, భ్రమల్ని అంతంచేయడానికి మేం పనిచేస్తున్నాం, మీరు మనిషిని అతని సాధారణ జీవితంనుంచి ఎడబాటుచేసి, విచ్ఛిన్నంచేసి విరజల్లిన ప్రపంచాన్నంతటినీ ఈ సాంఘికవాదమే మళ్ళీ ఒక్క బ్రహ్మాండంగా కలుపుతుంది ఇది తప్పదు?" పావెల్ ఒక్కక్షణం ఆగి కాస్తమెల్లగా "ఇది తప్పదు!" అని రెట్టించాడు.

జడ్జీలంతా చిత్ర చిత్రంగా ఒకళ్ళ మొగాలకేసి ఒకళ్ళు చూచుకున్నారు. దురాశా పూరితమగువాళ్ళ దృష్టులు పావెల్‌మీదే కేంద్రీకృతమైనాయి. వాళ్ళ దృష్టి పడి నిగనిగలాడుతూఉండే అతని శరీరంమీద మచ్చుపడతాయేమో ననుకుంది తల్లి. వాళ్ళ చూపులధోరణిచూస్తే వాళ్ళు అతని శరీర సౌష్ఠవానికి, యౌవన శక్తికి ఈర్ష్యపడుతున్నట్లు కనుపించింది. తోడి ఖైదీలంతా పావెల్ ఉపన్యాసాన్ని శ్రద్ధగా విన్నారు వాళ్ళ ముఖాలమీద సంతోషం తాండవమాడింది తల్లి తన కొడుకు ఉపన్యాసామృతాన్ని తనివితీరా తాగింది. ఆమాటలామె మనస్సుకి బాగా పట్టేయి. ముసలి జడ్జీ తరచు పావెల్ మాట్లాడుతూఉండే మాటకడ్డొచ్చి ఏదో చెపుతూ ఉండేవాడు. అప్పుడప్పుడు చిరునవ్వునవ్వుతూ ఉండేవాడు

కూడాను. పావెల్ ముసలిజడ్జీ చెప్పేమాటలన్నీ నెమ్మదిగా విని, మళ్ళీ మెల్లని స్వరంతో తన ఉపన్యాసం సాగనిస్తూ ఉండేవాడు. తన వాగ్ధోరణి ప్రాశస్త్యం వల్ల జడ్జీల నిర్ణయాన్ని అతిక్రమించి తనమాట చెల్లించుకోగలిగేడు పావెల్. హాలులో జనమంతా శ్రద్ధగా వింటూవచ్చారు. ఇల్లా చాలాసేపు జరిగింది. ఆఖరుకి ముసలిజడ్జీ చెయ్యెత్తి కేకవేశాడు. పావెల్ ఆగకుండానే హేళన స్వరంతో ఇల్లా మాట్లాడేడు

"నేనింక ముగించేస్తున్నా. మిమ్మల్ని వ్యక్తిపరంగా అవమానించడం నా ఉద్దేశ్యంకాదు. నాకిష్టం లేకపోయినా "న్యాయవిచారణ" అనే ఈ నాటకం చూడడానికి నన్ను బలవంతంగా లాక్కొచ్చేరు. దీన్ని చూచిన తర్వాత మిమ్మల్ని చూస్తే నాకు చాలా జాలేస్తోంది. పాపం! ఎంతైనా మీరూ మనుష్యులే. మాకెంత శత్రువులయినా తోటిమానవులు సిగ్గు బిడియాలు వదిలేసి, తాముకూడా మానవులనే స్పృహలేకుండా వుండేటంత అధోగతిపాలై దౌర్జన్యాన్ని కొలుస్తుంటే చూడడానికి మాకెంతో విచారంగా వుంది.

జడ్జీలకేసి చూడకుండానే పావెల్ ఛటుక్కున కూచున్నాడు.

ఆండ్రీ, నకోడా సంతోషపరవశుడైపోయి పావెల్ చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు శామొలో మాజిన్ మొదలైన మిత్రులంతా అతనిచుట్టూ చేరారు. పావెల్ కొంచెం బిడియపడుతూ చిరునవ్వు నవ్వాడు. ఒక్కసారి తల్లి కేసి చూచి తల ఆడించాడు. ఆమె సంతోషపరవశంచేత వణికింది.

"ఇదిగో విచారణ ప్రారంభమైంది! ఎంత బాగావీకేదో చూశావూ నిలోనా?" అన్నాడు మెల్లగా సిజావ్ తల్లితో.

## ౧౬

తల్లి మాట్లాడకుండా చిరునవ్వు నవ్వుతూ తల ఆడించింది. తన కొడుకింత ధైర్యంగా మాట్లాడాడుకదా అని చాలా సంతృప్తి పొందింది. పావెల్ ఉపన్యాసం అతని కష్టాలనింకా ఎక్కువ చేస్తుందేమో అనే సంశయం పట్టింది. కాని సంశయం పోయి గర్వపడింది. అతని ధీరవచనాలు బాగా హృదయంలో నాటుకున్నాయి.

ఆండ్రీ నకోడా లేచాడు. శరీరమంతా ముందుకువంచి జడ్జీలకేసి ఓరచూపు చూసి "ముద్దాయిలయిన పెద్దమనుష్యుల్లారా.—" అని మాట్లాడడం ప్రారంభించాడు.

"నీ ఎదుట నున్నది కోర్టువారు కాని ముద్దాయిలు కారు తెలుసుకుని మాట్లాడు" అని ముసలి జడ్జీ గట్టిగా కోపంగా హుంకరించాడు. ఆండ్రీ ధోరణి

చూస్తే, అతను వాళ్ళని వేళాకోళంచేసి ఏడిపించాలనే ఉద్దేశ్యంలో ఉన్నట్లు తల్లికి తోచింది. ఆంద్రీ చేతుల్తో తల దులుపుకుని తల ఊపుతో పిల్చాడు. గట్టిగా శబ్దం చేస్తూ ఊపిరి పీల్చాడు "అల్లాగా నేనల్లా అనుకోవడం లేదు. మీరు జడ్జీలుకారనీ, మీరే ప్రతివాదులనీ నా...." అంటూ యేదో చెప్పబోయేడు.

"దయచేసి కేసుకు సంబంధించిన విషయాలు మాత్రమే మాట్లాడాలి" అన్నాడు ముసిలిజడ్జీ. "అల్లాగా! కేసుకి సంబంధించిన విషయమా? సరే. ఇప్పటికే ఒక్కవిషయం విధిలేక ఒప్పుకోవాలసొస్తుంది. మీరు నిజంగా స్వతంత్ర బుద్ధిగల జడ్జీలనీ, న్యాయపరులనీ, మర్యాదస్తులనీ అంగీకరించవలసొస్తోంది...."

"కోర్టువారిని గుణ విమర్శన చెయ్యకూడదు." "కోర్టువారిని విమర్శించ కూడదూ? ఓహో? అల్లాగా? సరే. ఏమైనాకాని నే చెప్పదలచుకొన్న సంగతి చెప్పకమానను. మీరు పక్షపాతంలేని పెద్దమనుష్యులనుకోండి. మీకు, మీవాళ్ళు, పరాయివాళ్ళు అనే భేదం లేదనుకుందాం. మీరు స్వతంత్రులే అనుకుందాం, ఇప్పుడు మీయెదుట రెండుపక్షాలవాళ్ళున్నారు. ఒక పక్షంవాళ్ళు, 'అయ్యా! వాళ్ళు ఆస్థంతా కొల్లగొట్టి మమ్మల్ని దిబ్బచేస్తారండీ' అని చెప్పుకుంటున్నారు. రెండో పక్షంవాళ్ళు 'అవును. మాదగ్గర కత్తికఠారు వగైరా ఆయుధాలున్నాయి కనుక మేము వాళ్ళని దిబ్బచెయ్యడానికి మాకు హక్కుంది' అంటున్నారు.

"దయచేసి ఇల్లాంటి పిట్టకథలు మానెయ్యాలి"

"అదేమిటి? ముసలివాళ్ళకిల్లాంటి పిట్టకథలు అందులోనూ కాస్తమోటుగా ఉండేవి చాలా ఇష్టమని విన్నానే."

"ఇక నిన్ను మాట్లాడనివ్వను. కేసుకు సంబంధించిన విషయం ఏమైనా ఉంటే మాట్లాడు. అనుచితమైనటువంటి సామెతలు చెప్పద్దు. ఈ వేళాకోళం పనికిరాదు" అని మందలించాడు.

ఆంద్రీ తలగోక్కుంటూ జడ్జీలకేసి చూశాడు.

"ఓహో! కేసుకు సంబంధించిన విషయమే మాట్లాడాలీ? ...... కేసుకు సంబంధించిన సంగతి నేను మీతో ఎందుకూ మాట్లాడడం? మీకు తెలియచేయ వలసినంతవరకూ ఆ విషయం నా మిత్రుడిదివరకే మీకు చెప్పాడు. మిగతా విష యాలు మీకు వేరే మనుష్యులు చెప్తారు.......... మీకు చెప్పవలసిన సమయం వస్తుందిలెండి........"

ముసలిజడ్జీ చటుక్కునలేచి ఇల్లా అన్నాడు.

"నువ్వింక మాట్లాడవద్దు. కూచో. తర్వాత.... వాసిలీ శామొలో........"

ఆంద్రీ మెల్లగా పెదిమలుకరుచుకుంటూ బెంచీమీద కూచున్నాడు. శామొలో జుట్టు సవరించుకుంటూ లేచాడు.

"ప్రాసిక్యూటింగు వకీలు, నేనూ నా మిత్రులూ అడివి మనుష్యులమనీ, నాగరిగతకు శత్రువులమనీ చెప్పాడు."

"కేసుకు సంబంధించిన విషయమే చెప్పుకోవాలి" అంటూ ముసలిజడ్జీ ముందే హెచ్చరించాడు.

"ఇది కేసుకు సంబంధించినదే. మర్యాదస్థుల కక్కరలేని దంటూలేదు. అన్నీ కావలసినవే. నామాటకడ్డురావద్దని మాత్రం మిమ్మల్ని కోరుతున్నాను. మీ నాగరికత ఎటువంటిదో తెలుసునా?"

"నీతో ఆవిషయం చర్చించడానికికాదు మేమిక్కడ. అసలుసంగతికిరా."

ఆంద్రీ వేళాకోళంతో జడ్జీలధోరణి మారిపోయింది. అతని సూటిపోటీ మాటలు వాళ్ళకి బాగా నొప్పికలిగించాయి. పావెల్ ఉపన్యాసం వాళ్ళకి కొంచెం ఉద్రేకం కలిగించింది; కాని మళ్ళీ శాంతపడ్డారు. అతని ఉపన్యాసం విన్నాక వాళ్ళ కొక విధమయిన గౌరవం ఏర్పడింది. అది కాస్త తీసివేసి అసలుస్థితికి తెచ్చాడు ఆంద్రీ. జడ్జీలంతా శామొలోకేసి చూస్తూ ఏమిటో వాళ్ళల్లోవాళ్ళు గుసగుసలాడారు. ఏదో హడావిడి పడ్డారు. వాళ్ళతీవ్రతచూస్తే అతన్ని నమిలిమింగేస్తారా అనే టట్టుంది. శామొలో అందుకున్నాడు.

"మీరు గూఢచారుల్ని పెంచుతున్నారు. మీరు స్త్రీలని, యువతుల్ని పాడు చేస్తున్నారు. ప్రజలు దొంగలుగానూ, హంతకులుగానూ తయారయ్యేటట్లు చేస్తు న్నారు. జనాన్ని సారా, విస్కీతోటీ, అసత్యంతోటీ మూర్ఖత్వంతోటీ ముంచెత్తు తున్నారు. యుద్ధాలపేరెట్టి ప్రజలకి గొంతుకలు కోసుకునే కటికితనం అలవాటు చేస్తున్నారు. జనాన్ని అన్నివిధాలా ధ్వంసంచేస్తున్నారు. ఇదేకాదూ మీనాగరికత? ఈలాంటి నాగరికతకు మేం శత్రువులమే. ఆహా! తప్పకుండా శత్రువులమే"

"దయచేసి........" అంటూ ఏదో గట్టిగా చెప్పాడు ముసలిజడ్జీ. శామొలో గుడ్లెర్రచేసి అంతకన్న గట్టిగా మాట్లాడడం మొదలుపెట్టాడు.

"కాని మేము ఇంకొక నాగరికతను గౌరవిస్తాం. ఆ నాగరికతను నిర్మిం చినవాళ్ళని మీరు నానాహింసలూ పెట్టి చీకటికొట్లల్లో నిర్బంధించారు. వాళ్ళకి పిచ్చెత్తేటట్లు.........."

ముసలిజడ్జీ గమ్మున చెయ్యెత్తి "ఆగు! నువ్వింక మాట్లాడకు.......... ఊహూం........తర్వాత ప్లీడర్ మాజిన్" అన్నాడు. మాజిన్ లేచాడు. నత్తితో ఇల్లా అన్నాడు.

"ఇదిగో నేను........నేను శపథంచేస్తున్నా. మీరు నన్ను శిక్షిస్తారు. నాకు తెలుసును. (ఆయాసంచేత కంగారుపడి ఒక్కక్షణం మాట్లాడలేకపోయాడు) నేను....ఇదిగో నిశ్చయంగా చెపుతున్నాను. మీరు నన్నెక్కడికి పంపినాసరే.... తప్పించుకొచ్చేస్తాను ........ వచ్చి మళ్ళీ ఎప్పట్లా పనిచేస్తూవుంటా ........ బ్రతి కున్నన్నాళ్ళూ పనిచేస్తూనే వుంటాను. ఇదే నా శపథం."

జనం అంతా గొల్లుమన్నారు. గుసగుసలు మొదలుపెట్టారు. ఒక స్త్రీ యేడిచింది. ఇంకెవ్వరో దగ్గారు. పోలీసులు యేమీతోచక ముద్దాయిలకేసి తెల్ల

బోయిచూచారు. ప్రజలకేసి కురకురలాడుతూ చూచారు. జడ్జీలలో చాలా కదలిక పుట్టింది.

"ఇవాన్ గాసెవ్!" అని ముసలి జడ్జీ పిలిచాడు.

"నేనేమీ చెప్పదలచుకోలేదు" అని జవాబు వచ్చింది.

"వాసిలీ గాసెవ్"

"నేనూ మాటాడదలుచుకోలేదు."

"ఫీడర్ బూకిన్"

పాలిపోయిఉన్న ఒకస్థూలకాయుడు అతికష్టంమీద లేచాడు. లేస్తూనే—

"మీకు సిగ్గులేదూ? నేనింత బరువైన మనిషిని. అయినా నాకూ న్యాయాన్యాయాలసంగతి తెలుసు." అని చెయ్యి పైకెత్తి కళ్ళుసగంమూసుకుని దేనికేసో చూడడం ప్రారంభించాడు.

"ఏమిటది?" అన్నాడు ముసలిజడ్జీ కుర్చీకి జేర్లబడి.

"ఓహో! సరి. ఏం ప్రయోజనం?" అంటూ బూకిన్ మెల్లగా బెంచీమీద కూచోబడ్డాడు అతని కండ్లవరసచూస్తే ఏదో ఆలోచిస్తున్నట్లు కనుపించింది. జనమంతా కిక్కురుమనకుండా కూచున్నారు. ఎవరో మెల్లగా ఏడుస్తున్నట్లు మాత్రముంది. ప్రాసిక్యూటింగు వకీలు లేచి, భుజాలెగరేసుకుంటూ పండ్లికిలించి జడ్జీలతో ఏదోచెప్పాడు. దానితో హాల్లోనించి గుసగుసలు బయలుదేరాయి.

తల్లికి ప్రాణంవిసిగి నీరసంతోచింది నుదిటిమీద ముత్యాల చెమటలు పోశాయి. ప్రక్కనకూచున్న శామొలో తల్లి, నిలోనాను చేత్తోపొడిచి ఆమె భర్తతో మాట్లాడడం మొదలు పెట్టింది.

"ఎలావుందిప్పుడు? అది సాధ్యమే?"

"నువ్వే చూస్తున్నావుగా? సాధ్యమే."

"అయితే వాసిలీ కేమవుతుంది?"

"ఊరుకో, కాస్త ఆగు."

జనమంతా యేమీ తెలియక తెల్లబోయి చూస్తున్నారు. బూకిన్ అన్నగారు పట్టలేక గట్టిగ గొణగొణలాడడం మొదలుపెట్టాడు.

"చెప్పండయ్యా చెప్పండి? వాళ్ళనెందుకు మాట్లాడనివ్వడంలేదు? ప్రాసిక్యూటరుగారు ఎంతసేపు పడితే అంతసేపు ఏసంగతిపడితే దాన్ని చెప్పవచ్చునా? ఏమిటీ అన్యాయం...."

కోర్టుడఫేదారు బల్లదగ్గర నిలబడి "నిశ్శబ్దం! నిశ్శబ్దం!" అని గట్టిగా ఒక్క కేకపెట్టాడు.

శామొలో తండ్రి బెంచికి జేర్లపడి భార్యచెవిలో మెల్లగా ఇల్లా అన్నాడు.

"అయితేఅవచ్చు. సరే వాళ్ళు నేరస్థులే అనుకుందాం. వాళ్ళు చెప్పదలచు కొన్నది చెప్పనివ్వండి....ఇంతకీ వాళ్ళుచేసిన అపరాధమేమిటి?

అంతా అపరాధమే? .... నాకూ తెలుసుకోవాలనే ఉంది....నాకూ మరి కొంతసంబంధం ఉందికాదూ?........ (కొంచెం బిగ్గరగా) పావెల్ చెప్పినదంతా నిజమే? ఆహా! అయితే నాకూ తెలుసుకోవాలనుంది. మాట్లాడనివ్వండి." డఫేదారు అతనికేసి వేలుచూపించి

"మాట్లాడకు! జాగ్రత్త!" అన్నాడు.

సిజావ్ మూతిబిగించి నిస్పృహసూచకంగా తలఆడించాడు?

తల్లిదృష్టి మాత్రం జడ్జీలమీదేఉంది. వాళ్ళందరూ చాలా ఉద్రేకంతో ఒక ళ్ళతోఒకళ్ళు సంప్రదించుకోవడం చూచింది. వాళ్ళు ఏం మాట్లాడుకున్నారో స్పష్టంగా వినబడలేదు. కాని ఏవో గుసగుసలామె చెవిలోపడి సూదుల్లా గుచ్చు కున్నాయి. సామాన్యంగా బీదలు శ్రీమంతుల సౌఖ్యాన్ని ఈర్ష్యతో చూచేటట్లుగా జడ్జీలు తన కొడుక్కేసి అతని మిత్రులకేసి చూస్తున్నట్లు ఆమెకు స్ఫురించింది. జబ్బుచేసి నీరసపడ్డవాళ్ళు మంచి ఆరోగ్యంతో పుష్టిగాఉన్న వాళ్ళకేసి ఆశతో చూచేటట్లు చూస్తున్నారనిపించింది. మంచిపసందైన వాళ్ళ శరీరాలుచూసి జడ్జీలు లొట్టలేస్తున్నారనుకుంది. ముసలితనంవచ్చి లేవలేని స్థితిలోఉన్న క్రూరజంతువులు తినడానికి మంచిరుచికరమైన చిన్నజంతువు లేమైనా కనుబడితే అశక్తతచేత మొరిగినట్లుగా జడ్జీలుకూడా గడబిడగా గొణుకుతున్నట్లు తోచింది నిలోనాకు.

ఈ ఆలోచనలతో తల్లిబుర్ర వేడెక్కిపోయింది. రెప్పవాల్చకుండా జడ్జీల ముఖాలకేసి చూచింది. ఎంతచెప్పినా బిడ్డలుగన్నతల్లికి తన కొడుకు లోపలవుండే ఆత్మకన్న పైశరీరమంటే ఎక్కువ మక్కువ, అభిమానం ఉండకతప్పదు. అందు చేత జడ్జీలు తన కొడుకుదేహాన్ని తమ దృష్టితో కమిలేటట్లు చేసేసి అతని రక్తాం న్నంతా పీలుస్తున్నటు తోచేసరికి చాలా కష్టంతోచింది.

పావెల్ చాలా అలసిపోయి, తల్లికేసిచూచేడు. ఆ చూపుల్లో శాంతం, దయ, ప్రేమ ఉట్టిపడుతున్నవి. మధ్య మధ్య ఆమెకేసిచూచి నవ్వుతూ హెచ్చ రిస్తూ ఉండేవాడు. ఇదంతా త్వరగా అయిపోతే బాగుంటుందనుకుంది తల్లి.

ముసలిజడ్జీ చెయ్యి బల్లమీద ఆన్చి, ఊతం చేసుకునిలేచాడు. కదలకుండా నిలబడి ఈడుస్తూ ఏదోకాగితం చదువడం మొదలెట్టేడు.

"శిక్ష చెపుతున్నాడు" అన్నాడు సిజావ్ తల్లితో.

మళ్ళీ హాలంతా నిశ్శబ్దం. జనమంతా ముసలిజడ్జీ ముఖంకేసి చూస్తు న్నారు. మిగతా జడ్జీలుకూడాలేచి నిలబడ్డారు. జిల్లా సంఘాధ్యక్షుడు సరంబీకేసి చూస్తున్నాడు నగరాధ్యక్షుడు చేతులుకట్టుకు నిలబడ్డాడు. రోగిష్టిజడ్జీ, ఏనుగు గున్న జడ్జీ, ప్రాసిక్యూటింగు అటర్నీ, ఖైదీలకేసి ఓరచూపులుచూస్తూ నిలబడ్డారు.

జడ్జీల వెనకాల ఎర్రని మిలిటరీకోటు, తెల్లటి ముఖంతో బొమ్మలోని జారు చక్రవర్తి వాళ్ళ నెత్తికేసి చూస్తున్నాడు. ఆబొమ్మ ముఖంమీద ఏదో పురుగో, సాలీడో పాకుతోంది.

"ప్రవాసం! అమ్మయ్య!" అని సిజావ్ బెంచీ వెనకాల జార్లపడ్డాడు.

"పోనీలే! దేవుడిపుణ్యాన్ని ఇంతవరకూ బాగానేవుంది. వాళ్ళందరికీ కఠిన నరకం పడుతుందని విన్నాను. ఇది ఫరవాలేదులే. మరేమంత హెచ్చు కాదు."

సిజావ్ సంతోషానికి కారణమేమిటో తల్లి గ్రహించింది. అందులో ఆమె కేమీ కొత్త కనుపించలేదు.

"ఈ సంగతి నా కిదివరకే తెలుసును" అంది.

"తెలిస్తే తెలియవచ్చును. కాని ఇప్పుడు నిశ్చయమైంది. అధికారులు చివరకేంచేస్తారో ఎవరుచెప్పగలరు? ఏమైతేనేం? మాఫెద్యా మంచి దిట్టమైన వాడు కాదూ? ఏమంటావ్?"

సిజావ్, తల్లీ ఖైదీలుండే బోనుదగ్గరకు వెళ్ళారు. పావెల్ చెయ్యిపట్టుకుని తల్లి కన్నీళ్ళువిడిచింది. సిజావ్ ఫెద్యాతో వేళాకోళాలాడుతూ కాస్సేపు కులాసాగా మాట్లాడాడు. అంతా ఉషారుగా కులాసాగా ఉన్నారు. ఆషామాషీ కబుర్లాడుకుంటున్నారు. ఆడవాళ్ళు యేడిచారు. ఎక్కువ అలవాటుచేతనే ఏదో పెద్ద ప్రమాదం నెత్తిమీద పడుతోందనే భయంకన్న బిడ్డలు దూరమైపోతున్నారనే బాధే వాళ్ళ కెక్కువైంది. ఈ విచారణ తంతంతాచూస్తే ఆబాధకొంత తగ్గింది. సహజంగా తమ బిడ్డలకన్న తాము తెలివైనవాళ్ళమనే అహంకారం ఒక వైపునా, తా మిదివరకు ఊహించుకోలేని నూతన జీవితాన్ని గురించి కుర్రాళ్ళు ఇంత ధైర్యంగా మాట్లాడినందుకు ఆశ్చర్య మింకొకవైపునా, పెద్దవాళ్ళని కలవర పరచింది. ఆ నూతన జీవితం ఫలప్రదమైనదనే నమ్మకం కూడా కలగడం మొదలుపెట్టింది. ఈ ద్వంద్వభావాల సమ్మేళనంవల్ల వాళ్ళు పైకేమీ చెప్పలేక పోయారు. ఏదో మాట్లాడారు. కాని అన్నీ మామూలు మాటలే. గుడ్డా, గుడుసూ సంగతీ, ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకోమనీ, అధికార్లతో ఊరికే అనవసరంగా పేచీలు పెట్టుకోవద్దనీ సలహాలిచ్చారు.

"అబ్బాయీ! ఇల్లాగైతే అందరికీ ప్రాణం విసుగుతుంది. మాకూ వాళ్ళకీ కూడాను" అన్నాడు శామొలో తండ్రి కొడుకుతో.

"న్యాయమే మనం కోరేది. ఇంకేమక్కరలేదు. ఆ మాత్రం కూడా ఒప్పుకోరు వాళ్ళు" అన్నాడు బూకిన్ సోదరుడు తమ్ముడితో.

"ఇదిగో! కుర్రాడ్ని జాగ్రత్తగా చూస్తావు కాదూ? వాడంటే నాకు చాలా ఇష్టం" అన్నాడు తమ్ముడు.

"నువ్వింటికొద్దూ. మళ్ళీ నువ్వొచ్చేసరికి వాడు నిక్షేపంగా ఉంటాడు."

"అల్లాగే. అక్కడ నాకేమీ పనిలేదు."

సిజావ్ మేనల్లుడి చెయ్యిపట్టుకుని "అయితే ఫీడర్ ! నువ్వుకూడా కత్తులో కలిసేవన్నమాట. ఏం" అన్నాడు మెల్లగా.

ఫేద్యా మాజిన్ వంగి తమాషాగా ఒక నవ్వు నవ్వి మామ చెవిలో ఏమిటో చెప్పాడు. కాపలాఉన్న సిపాయికూడా నవ్వాడు కాని వెంటనే అధికారపు ఫాయీ వహించి 'పోపో' అని కేకవేశాడు.

తల్లి కూడా అంద లాగే పావెల్‌తో బట్టల సంగతి ఆరోగ్యం సంగతి మాట్లాడింది. కాని ఆమె మనస్సులో మాత్రం తన్నుగురించి, శశాంకనుగురించి, అతన్ని గురించి అడగడానికి ఎన్నో ప్రశ్నలున్నాయి. కాని అవి బయటికి రాక ఉక్కిరి బిక్కిరి చేశాయి. అన్నింటికన్నా ముఖ్యంగా పుత్రప్రేమ. అంటే తన కొడుక్కి ఇష్టమైన పని చెయ్యాలని. అతని హృదయానికి సమీపంగా ఉండాలనే కోరిక మరీ హెచ్చిపోయింది. ఏదో గొప్ప ప్రమాదం వచ్చి మీదపడుతుందనే భయం పోయింది. జడ్జీలసంగతి తలచుకున్నప్పుడు మాత్రం కాస్త జ్ఞాపకానికి వచ్చేది ఆ భయం.

"యువకులను విచారించడానికి యువకులే జడ్జీలుగా ఉండాలి సుమా ?" అంది కొడుకుతో నిలోనా.

"ప్రజలసలు నేరాలుచేయకుండా ఉండే జీవితపద్ధతి నేర్పిస్తే మరీమంచిది" అని పావెల్ జవాబుచెప్పాడు.

ఆంద్రీ అందరితోటీ కులాసాగా మాట్లాడుతూ ఉండడం చూచింది తల్లి. పావెల్‌కన్నా పాపం తల్లిలేనివాడు గనుక అతనిమీద యెక్కువ దయచూపించాలనుకుని తల్లి అతనితో మాట్లాడింది. ఆంద్రీ యథాప్రకారంగా యెంతో ప్రేమతోనూ, వేళాకోళంగానూ నవ్వుతూ మాట్లాడాడు ఆమెచుట్టూ మనుష్యులు మాట్లాడుతున్నారు అన్నీ వింటోంది. అన్నీ ఆమె కర్థమవుతున్నాయి. ఇన్ని సంగతుల్ని ఒక విధమైన సంతోషంతో గ్రహిస్తున్న తన హృదయంయొక్క వైశాల్యాన్ని గురించి ఆమె లోపల లోపల ఆశ్చర్యపడింది.

ఆఖరుకి ఖైదీలను తీసుకువెళ్ళిపోయారు. అప్పుడే చీకటి పడిపోయింది. వీధుల్లో దీపాలు, ఆకాశంమీద నక్షత్రాలు, ప్రకాసిస్తున్నాయి. యువకులు గుంపులు గుంపులుగా కోర్టుదగ్గర మూగుతున్నారు. జనం నడుస్తుంటే అడుగుల తాకుడుకి మంచు విరిగి పటపటమంటోంది. మాటలేవో వినిపిస్తున్నాయి.

ఎవరో ఒక కోరాదుప్పటీ కప్పుకున్న మనిషి సిజావ్ ముఖంకేసిచూచి,

"శిక్షెంత ?" అని అడిగాడు.

"ప్రవాసం"

"అందరికీనా ?"

"ఆఁ, అందరికీ"

"సరి. సంతోషమే. పోతా" అంటూ ఆ మనిషి చక్కాపోయాడు.

"చూశావూ ? జనం సంగతి సందర్భాలు అడిగి తెలుసుకుంటున్నారు" అన్నాడు సిజావ్. ఇంతలో హఠాత్తుగా పదిమందీవచ్చి వాళ్ళని చుట్టేశారు. యువతులు యువకులూను. ప్రశ్నలు, సమాధానాలు చెలరేగాయి జనం బాగా మూగారు. శిక్షెంతనీ, ఖైదీలెల్లా ప్రవర్తించారనీ, ఎవరెవరుపన్యాసా లిచ్చారనీ, ఏమేమి సంగతులు మాట్లాడారనీ, ఈ మొదలైన ప్రశ్నలెన్నో వాళ్ళనడిగారు జనం. అంతా ఒకేసారి సద్భావంతోను, ఆదుర్దాతోను అడగడం మొదలుపెట్టారు.

"ఏమర్రోయి జనం! ఇదిగో ఈమె పావెల్ తల్లి" అని ఎవ్వడో కేక పెట్టాడు. అంతా నిశ్శబ్దం.

"అమ్మా! నీ చెయ్యి ఒక్కసారి ముట్టనివ్వు" అంటూ ఎవరో ఒక మనిషి ఆమె చేయినొక్కాడు. "మాకందరికీ నీ కొడుకు పౌరుషానికీ, ధైర్యానికీ ఆదర్శ ప్రాయుడుగా వుంటాడు" అన్నాడెవ్వడో చాలా ఉద్రేకంతో.

"రష్యాదేశపు కార్మికులు చిరంజీవులగుదురుగాక!" అనే నాదం బయలు దేరింది. "కూలి నాలి జనం సురక్షిత మగుదురుగాక!" "విప్లవము చిరస్థాయి యగుగాక!"

జయ జయ ధ్వానాలు నాలుగు మూలలా లేచాయి. జనం నాలుగు ప్రక్కల నుంచీ చొచ్చుకుంటూవచ్చి తల్లిని, సిజావ్‌ను ముట్టడించారు. పోలీసుల ఈలలు గుంయ్యిమన్నాయి. కాని ప్రజలకు వాటి స్పృహేలేదు. సిజావ్‌కు నవ్వువచ్చింది. తల్లికిదంతా సంతోషకరమైన స్వప్నంగాతోచింది. తన్ని పలకరించిన వాళ్ళంద రినీ సంతోషంతోటీ, కృతజ్ఞతతోటీ, ఆదరించింది ఆనందబాష్పాలు జలజల రాలేయి. అతిసంతోషంచేత నోటంబడి మాటరాలేదు. ఇంతలో ఆమెదగ్గరగానే ఎవరో లేచి మాట్లాడడం మొదలుపెట్టేడు.

"మిత్రులారా! రష్యాదేశపు ప్రజల్ని మింగే నిరంకుశత్వపు పిశాచం తన అగాధపు పొట్టలో ఇవ్వేళ మళ్ళీ కొందరిని పడేసుకుంది......... ..."

"ఏమమ్మోయి! ఎందుకైనా మంచిది. మనంపోదాం" అన్నాడు సిజావ్ తల్లితో. సరిగా అదే సమయానికి శశాంకవచ్చి తల్లి భుజాలకింద చెయివేసి గబ గబా వీధి అవతలిపక్కకి లాక్కొనివెళ్ళింది?

"రారా! వాళ్ళు అరెష్టులు చేయదలచుకున్నారు. శిక్షెంత ? ప్రవాసమేనా ? సైబీరియాకే కాదూ ?"

"అవునవును."

"అతనెల్లా మాట్లాడేడు? నువ్వు చెప్పకపోయినా నాకు తెలుసునులే. అందరికన్న చాలా అమాయకంగా కనపడినా మిగతావాళ్ళందరికన్న చాలా శక్తి సంపన్నుడు. అందరికన్న ఎక్కువ బింకంగలవాడనే సంగతి చెప్పనక్కరేలేదు కదా! అతని హృదయం చాలాకోమలం. కాని పదిమందిలో పడడానికి కొంచెం బిడియపడుతూ ఉంటాడు. సత్యమెల్లా ఉంటుందో అలాగే అతనూ సూటిగా, స్పష్టంగా, దృఢంగా ఉంటాడు అతనెక్కడ? చాలా గొప్పవాడు. ఉండవలసిన సుగుణాలన్నీ ఉన్నాయి. సుగుణాలన్నీని. కాని ఉద్యమాని కెక్కడభంగం వస్తుందో అని మాత్రం అనవసరంగా తనసౌఖ్యాన్ని త్యజించేస్తున్నాడు. నాకు తెలుసును" అంటూ ఉద్రేకంతో గబగబా మాట్లాడింది శశాంక. ప్రేమపూరిత మైన ఆమె మాటలు తల్లికెంతో ఉపశాంతి కలిగించేయి, అలసట తగ్గిపోయి బలంచేరింది. "నువ్వెప్పుడెడతా వతనిదగ్గరకి?" అని చెయ్యిపట్టుకుని అడిగింది.

"నాపని ఇంకొకళ్ళ కప్పచెప్పేయడంతోటే వెడతాను డబ్బు అప్పుడే సిద్ధంగానేవుంది. కాని నేను ఇటాపీమీదుగావెళ్ళాలి. నాకూ శిక్ష సిద్ధంగానే వుందనేసంగతి తెలుసునా నీకు? బహుశా నన్నూ సైబీరియాకే పంపుతారు. అప్పుడు నేనతనున్నచోటే వుంటానని చెప్తాను."

"సిజావ్ అడిగేడని చెప్పు అతనితో. నన్నెరుగునులే అతను. ఫెద్యా మాజిను నా మేనల్లుడే" అన్నాడు సిజావ్ వెనుక నుంచి.

శశా అతనికేసి తిరిగి చెయ్యి అందిచ్చింది.

"ఫెద్యాను నేనూ ఎరుగుదును. నాపేరు అలెగ్జాండ్రా"

"నీ తండ్రి పేరు?"

"నాకు తండ్రి లేదు."

"అంటే చచ్చిపోయాడా?"

"లేదు. బ్రతికే వున్నాడు అతనొక పెద్ద భూస్వామి. ఒకజిల్లా కధికారి. రైతుల్ని కొల్లగొట్టి వాళ్ళని హింసపెడుతూవుంటాడు. అల్లాంటివాడిని నా తండ్రి అని చెప్పుకోడం నా కిష్టం లేదు." శశాంక ఈ మాటలు చెపుతుంటే ఆమె స్వరంలో ఒకవిధమైన నిశ్చలత్వం, పట్టుదల కనుపించాయి.

"అల్లాగా ........ఆ.........ఆ........." అంటూ సిజావ్ తెల్లబోయాడు. ఒక్కక్షణం ఆగి శశాంకకేసి ఓరచూపు చూస్తూ యిల్లా అన్నాడు.

"నిలోనా! నే వెడుతున్నాను. సెలవిప్పించు."

"అప్పుడప్పుడు వచ్చి కాస్సేపు మాట్లాడి. కాస్త టీ తాగి వెడుతూ వుండు ....అమ్మాయీ! వెళ్ళొస్తా ... మొత్తానికి నీ తండ్రిమీద నువ్వు కొంచెం జోరు గానే పోనిస్తున్నావు! అవునులే. అది నీ పనే మరి."

"నీ కొడుకు అసహ్యంగా ప్రవర్తిస్తూ, జనానికి కంటకంగా వుండి నీ ప్రాణం విసిగిస్తుంటే నువ్వతన్ని గురించి అల్లాచెప్పవూ ?" అని గట్టిగా భయము వేసేటట్టు అడిగింది శశా.

"అవు....నల్లా....గే" అన్నాడు సిజావ్ తడబడుతూ.

"అంటే అర్థమేమిటి ? నీకు నీ కొడుకుకంటె న్యాయం యెక్కువ ప్రియమైనదన్నమాటేనా ? నాకూ అంతే. నాకు న్యాయం, నా తండ్రి కన్న యెక్కువది."

సిజావ్ చిరునవ్వు నవ్వాడు. ఒక్క నిట్టూర్పు విడిచి ఇల్లా అన్నాడు.

"సరి సరి. నువ్వుచాలా తెలివైనదానివి. నే వెళ్ళొస్తాను. నీకు పావెల్ కనుబడితే నే నతని ఉపన్యాసమంతా విన్నానని చెప్పు. నా కన్నివిషయాలూ తెలియలేదు. కొన్ని చాలా దారుణంగా కూడా తోచాయి కాని మొత్తంమీద అంతా నిజమేనని చెప్పు అతనితో. వాళ్ళు నిజం కనుక్కున్నారు. నిలోనా! సెలవిస్తావా ?" టోపీతీసి వందనం చేసి సిజావ్ ప్రక్క వీధిలోకి తప్పుకున్నాడు.

అతను వెడుతుంటే శశాంక వెనకాలేచూస్తూ చిరునవ్వు నవ్వి తల్లితో ఇలా చెప్పింది.

"ఇతను చాలా మంచివాడులాగున్నాడే. ఇల్లాంటివాళ్ళు మన ఉద్యమానికి బాగా పనికొస్తారు. కరపత్రాలు వగైరా కాగితాలు ఇల్లాంటివాళ్ళదగ్గర బాగా దాచవచ్చు ?"

తల్లికి రోజూకన్న ఇవ్వాళ ఆమెమొఖంలో సంతోషం ఎక్కువగా కనుబడింది. సిజావ్‌నుగురించి ఆమె చెప్పినమాటలు విని తనలోతానిల్లా అనుకుంది.

"ఎప్పుడూ వుద్యమాన్నిగురించే ఆలోచన. ఇవ్వేళకూడా అదే ఆలోచనా ? ఇది బాగా ఆమె హృదయంలో నాటుకుపోయింది."

## ౧౭

ఇంటికివచ్చి శశాంక, తల్లీ సోఫామీద దగ్గరగా కూచున్నారు. తల్లి, శశాంక పావెల్ దగ్గరకు వెళ్ళడాన్ని గురించి మాట్లాడడం ఆరంభించింది.ఏమిటో ఆలోచిస్తూ శశాంక ఆకాశంకేసి చూస్తూ వింటోంది

అప్పుడు మీకు పిల్లలుపుడితే నేనువచ్చి లాలిస్తాను. మనమంతా కలిస్తే ఇక్కడికన్న అక్కడే బాగా వుండవచ్చు. పాషాకు అక్కడా పని దొరుకుతుంది. అతనిచేతు ఎలాంటివి. నిక్షేపంలాంటి చేతులుకావూ ?" అంది తల్లి.

“అవును. అల్లాగే బాగానేవుంటుంది.....కాని....అక్కడతను అందరి లాగా కాపురం చేస్తాడని తోచదు. అక్కడనుంచి తప్పకుండా వచ్చేస్తాడు” అంది శశాంక హఠాత్తుగా

“అదెల్లాగ? పిల్లలుంటే వాళ్ళమాట?”

“నాకు తెలియదు. మనమక్కడి కెళ్ళినప్పుడు చూద్దాంలే. ఏమైనా అవకాశమున్నప్పుడు అతను నన్ను పట్టుకుని కూచో కూడదు. నేనతన్ని నిర్బంధ పెట్టనూ కూడదు. అతన్ని స్వేచ్ఛగా వదిలెయ్యాలి నేనతని సహచారిణి. భార్యనుకూడాను, సందేహం లేదు. కాని ఆతను చేస్తూవున్న పనినిబట్టి అందరి లాగా నేనతన్ని యేళ్ళతరబడి నిర్బంధించడానికి వీలులేదు. మాదాంపత్యం అలాంటిదే. అతన్ని విడిచిపెట్టి ఉండడం కష్టమని నాకూతెలుసును. కాని యేంచేస్తాం, యెలాగో అలాగ సర్దుకోవాలి. తప్పదు. అందరిలాగా. పురుషుడు యెల్లకాలం స్త్రీయొక్క స్వంత ఆస్తేఅనే భావం నాకు లేదని అతనికీ తెలుసును. నే నతని కేవిధంగానూ అభ్యంతరాలు పెట్టదలుచుకోలేదు.”

తల్లి ఈమాటల ఆంతర్యం గ్రహించింది. ఈ మాటలన్నీ మనస్ఫూర్తిగానే చెపుతోందనీ చెప్పినదంతా చేస్తుందనీ తల్లికితోచి చాలా విచారపడింది. అమాంతంగా శశాంకను కౌగిలించుకుంది.

“అమ్మాయీ! పాపం నీకు చాలాకష్టం!”

శశాంక మెల్లగా నవ్వింది. ముఖం ఎర్రాబారింది. మెల్లని స్వరంతో మాట్లాడడం ఆరంభించింది.

“అయినా అదెప్పుడో చాలాకాలంమాట నాకిప్పుడా విషయమై చాలా కష్టంగా వుందనుకోకు. నేనేమీ పెద్దత్యాగం చెయ్యడంలేదు. నేచేసే పనేమిటో నాకు తెలుసును. దాని ఫలితాలేమిటో కూడా తెలుసును. అతన్ని సుఖపెట్టకలిగితే నేను చాలా సుఖంగా వుంటాను. అతని జీవశక్తిని వృద్ధిచేయడం, అతనికి వీలయినంత సౌఖ్యం కలిగించడం, అతన్ని మనసారా ప్రేమించడం ఇదే నా ఆదర్శం. ఇదే నా కోరిక. నా సంతోషం. నే నతన్నెంతో ఎక్కువగా ప్రేమిస్తున్నాను. అతనికికూడా నామీద చాలా ప్రేమే ఆసంగతి నాకు తెలియకపోలేదు. నేనతని కేమిస్తున్నానో అదే నాకతనిస్తున్నాడు. మా శక్తివంచనలేకుండా ఒకరి సౌఖ్యాన్నింకొకరు వృద్ధిచేసుకుంటాం. అంతగా అవసరమైతే అత్యంత స్నేహంతోనే విడిబడతాము.”

శశాంక చాలాసేపటివరకు మాట్లాడకుండానే కూచుంది. గదిలో ఒకమూల ఆమెకు దగ్గరగానే కూచుంది తల్లి. ఇద్దరూ తాము ప్రేమిస్తున్న పావెల్‌ను గురించి ఆలోచించుకుంటున్నారు.

నికోలే అలసిపోయి హడావిడిగా వగర్చుకుంటూ లోపలికి వచ్చాడు.

"శశాంకా! మీరిక్కడనుంచి వెంటనే వెళ్ళిపోవాలి. ఇద్దరు సి. ఐ. డి. లు ప్రొద్దున్నుంచీ నావెంటబడ్డారు దాక్కునేందుకు ప్రయత్నం చేస్తే అరెస్టు నిశ్చయం మొత్తంమీద ఎక్కడో ఏదో జరిగినట్లుగా నాకు తోస్తోంది. అన్నట్లు మరిచిపోయాను. ఇదిగో పావెల్ ఉపన్యాసం నాదగ్గరుంది. దీనిని వెంటనే ప్రచురించడానికి నిశ్చయించాము. దీన్ని లూడ్మిలాకివ్వాలి. అమ్మా! నిలోనా! పావెల్ చాలా బాగా మాట్లాడాడు. అతని ఉపన్యాసంమూలంగా కొంత గ్రంధం నడుస్తుంది. శశా! గూఢచారుల సంగతి జాగ్రత్తగా చూసుకో, ఒక్కక్షణం ఆగు— ఇవిగో ఈకాగితాలు ఎక్కడయినాదాచు. వీలయితే ఇవాన్‌దగ్గరపెట్టు."

మాట్లాడుతూనే అతను కొంకర్లుపోయిన చేతులు నలుపుకుని డ్రాయరుతీసి కొన్ని కాగితాలు ఏవో పైకితీశాడు. కొన్ని పక్కనపెట్టాడు. మరికొన్ని చింపేశాడు. అతనిధోరణిచూస్తే మనిషి ఏదో తీవ్రమైన ఆలోచనలో నిమగ్నుడైనట్లు కనుబడ్డాడు. "ఇదంతా ఖాళీచేసి ఏన్నోరోజులు కానేలేదు. అప్పుడే మళ్ళీ ఎంత తుక్కుచేరిందోచూడు. అమ్మా! నువ్వుకూడా ఈరాత్రి ఇక్కడ పడుకోకుండా ఉంటే మంచిది. వాళ్ళు నిన్నుకూడా అరెస్టుచేస్తే చేస్తారు. అది చాలా కష్టంగా వుండేమాట. అంతేకాదు. పాషా ఉపన్యాసం నాలుగుమూలలా వెదజల్లడానికి నీపని చాలావుంది."

"ఆ! నేనెందుకు వాళ్ళకి? నన్నెందుకు పట్టుకుంటారు? నువ్వు పొరపాటుపడుతున్నావు" అంది తల్లి.

"కాదు కాదు. నేను కొంచెం పసికట్టేను. అదీకాకుండా నువ్వు లూడ్మిలాకు సాయంగావుంటావు. దుర్మార్గానికి దూరంగా వుండడం ఎందుకయినా మంచిది" అన్నాడు నికోలే.

తనకొడుకు ఉపన్యాసం అచ్చువేసి పంచిపెట్టడమంటే ఆమెకు పరమ సంతోషమైంది.

"అల్లాగైతే సరే వెడతాను. కాని నేను భయపడ్డాననిమాత్రం అనుకోవద్దు సుమా!"

"సరే. బాగానేవుంది. మరి నాసంచీ బట్టలూ ఎక్కడున్నాయో చెప్పి వెళ్ళు. ఇంతవరకూ ఇవన్నీ జాగ్రత్తగా నీచేతుల్లోపెట్టుకున్నావు. నాకుండే ఈ స్వంతఅస్థి కాస్తాకూడా నాయిష్టమొచ్చినట్లు పైసలా చెయ్యకుండా చేశావు. నేనీసారి అన్నీ సిద్ధంచేసుకుంటున్నాను."

శశ చప్పుడు చెయ్యకుండా కాగితాలు తగలేసి మసికుంపట్లో కలిపివేసింది. నికోలే ఆమె కరస్పర్శనంచేసి "శశా! నువ్వెళ్ళిపో. ఏదైనా కొత్తసంగతుంటే వదలిపెట్టకు. పుస్తకాలవిషయంలో అలక్ష్యంగా వుండకు జాగ్రత్తగా వుండాలి" అన్నాడు.

"ఏమిటీసారి చాలాకాలం వడ్డిస్తారంటావేమిటి ?"

"ఎవడికి తెలుసు ? ధోరణిమాత్రం అల్లాగే కనుబడుతోంది. నామీద ఏదో ఋజువు దొరికిందనుకుంటాను. నిలోనా ! నువ్వుకూడా ఈమెతో వెడుతున్నావుకాదూ ?" "ఆహా ! నేనూ వెడుతున్నాను." అంటూ బట్టలు మార్చుకొనేందుకు తల్లి లోపలికివెళ్ళింది. ప్రజల స్వేచ్ఛకోసం తంటాలుపడే నికోలే ప్రభృతులందరు తమ స్వేచ్ఛకోసం సౌఖ్యంకోసం ఏమీ లక్ష్యపెట్టకుండా ప్రవర్తించడం ఆమెకెంతో చిత్రంగా కనుపడింది. అరెష్టుకోసం తయారవుతున్న నికోలే నిర్విచారత్వం, వ్యవహారరీతి, అమాయికత్వం చూస్తే ఆమెకెంతో ఆశ్చర్యం ఆనందం కలిగింది. అతని ముఖంకేసి తేరిపారిచూచింది. మామూలుగా అతని నేత్రాల్లో ప్రస్ఫుటమయ్యే మృదుత్వానికి బదులు కొంచెం ఆలోచనాపరత్వం కనుబడింది. మనిషిలో ఏవిధమైన తొట్రుపాటుకాని కంగారుగానిలేదు. అతనికి అందరియందూప్రేమే అందరి యెడలా ఒకే ఆదరం. తన ఉద్యమానికి సంబంధించిన విషయాల్లోతప్ప ఇతర విషయాల్లో జోక్యం కలుగచేసుకొనే అలవాటతనికిలేదు. ఈ విషయంలో మిగతా వాళ్ళందరికన్న తన్ను పోలినవాడితనే అని తోచింది తల్లికి. అందుచేతనే అతన్ని చాలా ప్రేమిస్తూ జాగ్రత్తగా కనిపెట్టిఉండేది.

ఇప్పుడతన్ని చూస్తే ఆమెకెంతో విచారం కలిగింది. పైకి కనుపరిస్తే అతనికి కష్టంగా ఉంటుందేమోనని విచారమంతటినీ మింగింది. బట్టలు మార్చుకొని ఇవతలికి వచ్చేసరికి నికోలె శశాంక చెయ్యిపట్టుకొని ఇల్లా చెపుతున్నాడు

"చాలా బాగుంది. నాకునచ్చింది. నీకూ అతనికీకూడా మంచిదే. కొంచెం సుఖం అందరికీ మంచిదే. అందువల్ల మరేమీ ప్రమాదంలేదు. కాని బహూ కొంచెంసుమా ! అందువల్ల అతనివిలువ ఏమీ తగ్గకుండా ఉండాలి. నిలోనా. నువ్వు తయారుగా వున్నావా ? అని తల్లిదగ్గరకువచ్చి కళ్ళజోడు సర్దుకుంటూ ఇల్లా అన్నాడు. "సరి శుభం. నే ననుకోవడం మూడో నాలుగో. మహా అయితే ఆరుమాసాలు - ఆరుమాసాలంటే మాటలా ? మనిషి జీవితంలో ఆరుమాసాల్లో ఎంత పనైనాచెయ్యవచ్చు ఈ ఆరుమాసాలు నీజాగ్రత్త నీవేపడాలి. ఒక్కసారి కౌగిలించుకోనియ్యి. మళ్ళీ యెన్నాళ్ళకో" నికోలే తల్లిని కౌగిలించుకొని అమె కండ్లకేసి చూస్తూ చిరునవ్వునవ్వేడు. ఆమె అతని నుదుటిమీద ముద్దుపెట్టుకొని అతి ప్రేమతో బుగ్గలు నిమిరి లాలించింది. ఆమె చేతులుమాత్రం గడగడలాడేయి.

"సరి యిక వెళ్ళు రేపు జాగ్రత్తగా ఉండాలి. ఇదిగో యిలాచెయ్యి. కుర్రాడిని ప్రొద్దున్నే పంపు........ఈ పనికోసం లూడ్మిలా ఒక కుర్రాడిని కుదిర్చిందిలే............ఆ కుర్రాడిని యిక్కడికొచ్చి వాకట్లోవుండే కాపలామనిషిని లోపలున్నానేమో కనుక్కోమను. నేను కాపలామనిషితో ముందేచెప్పి ఉంచు

తాను. అతను మంచి నమ్మకస్తుడే. నాకు మంచిస్నేహం. యిక వెళ్లండి. శెలవు మీ కెప్పుడూ శుభమే కలగాలని కోరుకుంటూ ఉంటాను" అంటూ నికోలే సాగనంపాడు.

రోడ్డుమీద నడుస్తూ శశాంక, తల్లి ఇల్లా మాట్లాడుకున్నారు.

శ :—ఇతను మృత్యుదేవతనోట్లో కెళ్ళవలసివచ్చినా ఇంత అనాయాసంగానే వెడ తాడు. ఇల్లాగే అప్పుడుకూడా కాస్త గబగబా సర్దుకుని సిద్ధమవుతాడను కొంటాను. ఒకమూల మృత్యుదేవత మీదపడుతుంటే కూడా ఇల్లాగే కళ్ళ జోడు సర్దుకుంటూ బాగానేవుంది అని చచ్చిపోతాడు.

త :— (మెల్లగా) అవును. నా కతనంటే చాలా ప్రేమ సుమా ?

శ :— నా కతని సంగతి చూస్తే చాలా అద్భుతమవుతుంది. కాని ఒకందుకు మాత్రం నా కిష్టంలేదు. హృదయం మంచిదే. ఒకప్పుడు మెల్లగానూ మాట్లాడుతాడు. కాని సాధారణంగా చాలా కటువు మనిషి. మానవుని కుండవలసినంత సౌమ్యత్వం లేదు............ ఇదిగో గూఢచారులు మన వెంటపడ్డట్టుంది. మన మింక వేరుపడాలి. నీ వెనుక గూఢచారి ఉంటే లూడ్మిలా ఇంట్లో కెళ్ళకు సుమా !

త :—నాకు తెలుసును.

శ .— అయినా చెపుతున్నాను. లోపలికెళ్ళకు నా దగ్గరకురా,

మరి సెలవు............

శశాంక ఛటుక్కున వెనక్కి తిరిగి చక్కాపోయింది.

కాస్సేపట్లో తల్లి, చలిచేత ముద్దకట్టుకుపోయి లూడ్మిలా గదిలో పొయ్యి దగ్గిరకూచుని చలికాగుతోంది. లూడ్మిలా నల్లదుస్తులు ధరించి గదిలో మెల్లగా అటూ ఇటూ తిరుగుతూంది. పొయ్యి మండుతూ ఉండడంచేత గది వెచ్చగాఉంది. లూడ్మిలా తల్లితో ఇల్లా చెప్పడం ఆరంభించింది.

"ప్రజల్ని చెడ్డవాళ్ళనడంకన్న మూర్ఖులని చెప్పాలి. వీళ్ళు తమ కళ్ళ యెదుట నున్నదాన్నే చూడగలరు. అతి సమీపంలో ఉన్నదాన్నే అందుకోగలరు. కాని దగ్గరనున్న వస్తువులే అమూల్యమైనవి. నిజానికి జీవితమింకో మోస్తరుగా ఉండి, ఇంతకన్న సులభమై, ప్రజలింకాస్త వివేకవంతులైతే అందరికీ వీలుగాను, సౌకర్యంగానూ ఉండేది. దూరస్థమైయున్న దానిని అందుకోవాలంటే దగ్గరనున్న దానికోసమంతగా ఖంగారుపడకూడదు.

నిలోనా ఈమె అచ్చుపని ఎక్కడచేస్తుందో కనుక్కోవాలని ప్రయత్నిం చింది. నాలుగుమూలలా చూచింది. ఆగదికి వీధివైపున మూడు కిటికీలున్నాయి. గదిలో ఒకసోఫా, పుస్తకాల అర, చిన్నబల్ల, కుర్చీ, గోడదగ్గరగా ఒకమంచం ఉన్నాయి, మంచానికి దగ్గరగా ఒకమూల ముఖం కడుక్కునేతొట్టి, ఇంకొక

మూల పొయ్యిఉన్నాయి. గోడలమీద ఫొటోగ్రాపులు బొమ్మలు ఉన్నాయి గదంతా పరిశుభ్రంగావుంది. ఇల్లాంటి గదిమధ్య యజమానురాలు కూచుంది. దీని వాలకమంతా చూస్తే తల్లికి ఏదో రహస్యమున్నట్లు మాత్రం అనుమానంతోచింది. కాని ఎక్కడో ఏమిటో తెలుసుకోవడం మాత్రం సాధ్యంకాలేదు. ఆమె గుమ్మాలు కేసి చూడడం ఆరంభించింది. ఒకటి తాను ప్రవేశించింపే. పొయ్యికి దగ్గరగా ఒక మూలని ఇంకొక గుమ్మంవుంది. అది సన్నంగా ఎత్తుగావుంది. తల్లికేమీ తోచక "నేను నీదగ్గరకు పనిమీదొచ్చాను" అంది "నాకు తెలుసును. నాదగ్గరికెవ రొచ్చినా పనిమీదేకాని ఊరికేరారు" అంది లూడ్మిలా. ఆమె కంఠస్వరంలో ఏదో మార్పుతోచింది తల్లికి ఆమె లూడ్మిలా ముఖంకేసి చూచింది. లూడ్మిలా నవ్వింది, తల్లి పావెల్ ఉపన్యాసం అమె కందిచ్చి "ఇదిగో దీన్ని వెంటనే అచ్చువెయ్యమన్నాడు"అని నికోలే అరెస్టుకు సిద్ధమవుతున్న సంగతంతా చెప్పింది,

లూడ్మిలా ఆ కాగితాన్ని మొలలో దోపుకుని మాట్లాడకుండా కుర్చీమీద కూచుంది. కూచుని కూచుని ఎంతో నిశ్చయంతో ఇల్లాఅంది

"ఈసారి వాళ్లెవళ్ళయినా నా దగ్గరకొస్తే నేను వాళ్ళని పేల్చేస్తాను. ఎవ రయినా నామీదకొస్తే నన్ను రక్షించుకోడానికి నాకు హక్కుంది. అందరిని దెబ్బ లాడమని ప్రోత్సహించినప్పుడు, నేనూ దెబ్బలాడాలి. ఊరికే చేతులుకట్టుకు కూచోడం నాకేమీ అర్థమవడంలేదు. అల్లాంటిపని నాకేమీ నచ్చదు".

అమె ముఖం కోపంచేత ఎర్రబారింది

తల్లి "అయ్యోపాపం! నీబ్రతుకు చాలా కష్టమే" అంది. లూడ్మిలా పావెల్ ఉపన్యాసం చదవడం మొదలుపెట్టింది. మొదట అయిష్టంతోనే ప్రారం భించింది కాని పోనుపోను అతిశ్రద్ధగా గబాగబా చదివింది. పూర్తిచేసి తల్లిదగ్గ రకు వెళ్ళి ఇల్లా అంది.

"ఇదిగో ఇదిబాగుంది. నాకు నచ్చింది. ఇందులోకూడా శాంతం వున్న ప్పటికీ ఫరవాలేదు. నాకు నచ్చింది. ఈఉపన్యాసం ఢంకా మోగించినట్లుంది మోగించేవాడు చాలా గట్టిపనివాడు............(ఒక్కక్షణం ఆలోచించి)........ నీకొడుకును గురించి నీతో పొగడ్తగా మాట్లాడడం నాకిష్టంలేదు. నేనెప్పుడూ అతన్ని చూడలేదు. అదీకాకుండా విచారకరమైన సంగతులు మాట్లాడుకోవడం నాకొట్టే గిట్టదు. రక్తస్పర్శగల మనిషి ప్రవాసానికెళ్ళాడంటే ఎంత కష్టంగా ఉంటుందో నాకు తెలుసును. ఏమైనా నీ కొడుకు చాలా దివ్యమైన మనిషని నీ యెదుటే చెప్పదలచుకున్నాను. వయస్సులో చిన్నవాడని తెలుస్తూనేవుంది. కాని గొప్పవ్యక్తి. సందేహంలేదు. ఇల్లాంటివాడు కొడుకవడం ఒకందుకు మంచిదే. కాని ఇంకొకందుకు చాలా భయంకరమైన విషయం".

"అవును మంచిదే. కాని ఇప్పుడు భయంకరంగా లేదుఅంది" తల్లి.

లూడ్మిలా తలచేత్తో సవరించుకుంటూ నిట్టూర్పు విడిచింది చిన్న నవ్వు నవ్వింది.

"సరి దీన్ని అచ్చేస్తాం. కాస్త నాకు సాయంచేస్తావూ ?" అని తల్లినడిగింది.

"అభ్యంతర మేముంది ?"

"నేను ఇది గబగబా కూరుస్తాను. నువ్వు చాలా శ్రమపడ్డావు, కాని కాస్సేపు ఆ మంచంమీద పడుకో. నే నివ్వేళ నిద్రపోదలచుకోలేదు. రాత్రివేళ అవసరమైతే నాకు సాయం చెయ్యడానికి నిన్ను లేపుతాను."

"నువ్వు పడుకున్నాక దీపం ఆరిపెయ్యి"

ఇల్లా చెపుతూ లూడ్మిలా పొయ్యిలో రెండు కట్టెలు తగిలించింది, ఒక్కసారిలేచి ఒళ్ళు విరుచుకుని పొయ్యిదగ్గరనున్న సన్నతలుపు తోసుకుని లోపలికి వెళ్ళింది. మళ్ళీ లోపలనుంచి తలుపువేసింది. ఆమె వెడుతుంటే తల్లి చూచింది. తర్వాత బట్టలు సర్దుకుంటూ లూడ్మిలా సంగతే తనలోతాను ఆలోచించుకుంది. చాలా నిక్కచ్చిమనిషి, ఆమెకుకూడా హృదయం రగులుకు పోతోంది, పట్ట లేకుండా వుంది" అనుకుంది.

అలసటచేత తల్లికి తలతిరిగింది. మనస్సు పరిపరి విధాలయిపోయింది. ఆత్మమాత్రం ప్రశాంతంగానే ఉంది. ఏదో ఒక అచంచలమైన దీపం ఆమె హృదయంలో వెలుగుతున్నట్లు తోచింది. ఈ శాంతి ఆమె కొంతకాలంనుంచి అనుభవిస్తోంది. ఆందోళన పడగాపడగా ఈశాంతి సిద్ధించింది. ఆమె కళ్ళయెదుట పావెల్, ఆంద్రీ, నికోలే, శశాంక కనబడుతూ, మాయమవుతూ ఉండేవాళ్ళు. వాళ్ళనిచూస్తూ ఆనందించి, కాసేపయిన తర్వాత దీపం ఆర్పి దుప్పటి కప్పుకుని పడుకుంది. వెంటనే సుఖమైన నిద్రపట్టింది.

## ౧౮

తల్లికళ్ళు తెరిచి చూచేసరికి తెల్లవారింది. సీతాకాలపు సూర్యరశ్మి గదంతా ప్రసరించింది. లూడ్మిలా పుస్తక మొకటి చేత్తో పుచ్చుకొని సోఫామీద పడుకొని చిరునవ్వునవ్వుతూ తల్లిముఖంకేసి చూచింది.

"అయ్యో ! అయ్యో ! నా మతి మండిపోనూ, నేనుచాలా సేపు పడుకున్నానా యేమిటి ?" అని తల్లి ఖంగారుపడింది.

లూడ్మిలా ఆమెకు వందనంచేసి "పది గంటలు కావస్తోంది, లే. కొంచెం టీ తాగుదాం" అంది.

"నన్నెందుకు లేపలేదు ?"

"లేపుదామనే నీదగ్గర కొచ్చాను. కాని నువ్వుగాఢమైన నిద్రలో వుండి నవ్వుతున్నావు. అలాంటి నిద్రాభంగం చెయ్యడానికి మనసొప్పలేదు. బహుశా నువ్వేదో కలగన్నావనుకుంటాను" అంటూ లూడ్మిలా సోఫామీదనుంచి లేచి తల్లి మంచందగ్గరకు వచ్చింది.

"నాకేమీ కల రాలేదు" అందితల్లి.

"అయినాసరే. నవ్వు నవ్వుతుంటే నాకు చాలా ఆనందం కలిగింది. ఆనవ్వేమిటో చాలా బాగావుంది. నీసంగతంతా ఆలోచించాను. పాపం నీజీవితం మహకష్టంగా వుండాలి కాదూ ?"

తల్లి జవాబు చెప్పలేదు ఏదో ఆలోచిస్తూపడుకుంది.

"సందేహమేమిటి ? పాపం ? కష్టమే" అంది లూడ్మిలా.

"నాకేమీ తెలియదు. ఒక్కొక్కప్పుడు కొంచెం కష్టంగానే కనిపిస్తుంది. అనేక రకాలుగా వుంటుంది. ఒకప్పుడు అద్భుతంగానూ తీవ్రంగానూ వుంటుంది. రోజులు గబగబా పోతున్నాయి...." అంటూ తల్లిఏదో చెతుతూవుంటే ఉద్రేకం ఒక్కసారి పొర్లివచ్చింది. ఆమె హృదయంలో ఏవోభావాలు రేకెత్తేయి. వెంటనే లేచికూచుని పొర్లివస్తున్న భావాన్ని ప్రవహింపచేసింది.

"పోతోంది జీవితం. ఇల్లు కాలుతున్నప్పుడు మంటలన్నీ పైకిలేచినట్లే పోతోంది. కష్టం చాలావుంది. ప్రజలు బాధపడుతూనే వున్నారు. వాళ్ళను చావగొడుతున్నారు. మహాదుర్మార్గంగా హింసపెడుతున్నారు. వాళ్ళు భయపడి దాక్కుంటున్నారు. కొందరు సన్యాసుల్లా జీవనం చేస్తున్నారు. అనేక సుఖాల్ని వదలిపెట్టేశారు. ఇదంతా కష్టమే కాని యీ కష్టపడేవాళ్ళని చూస్తూ, వాళ్ళ కష్టాలన్నీ వాళ్ళచుట్టూ వున్నాయన్నమాటేకాని, అంతర్యంలో యేమీ లేనట్లుగా స్పష్టపడుతోంది."

లూడ్మిలా గభాలున తలెత్తి ఆమెకేసి ఒక క్షణం రెప్పవాల్చకుండా చూచింది. తల్లికింకా తనలోంచి యేవో భావాలు పుట్టుకొస్తూనే ఉన్నట్లు తోచింది.

"నీ సంగ తేమీ చెప్పవేం ?" అని లూడ్మిలా మెల్లగా జ్ఞాపకం చేసింది.

"తల్లి మంచంమీదనుంచి లేచి లూడ్మిలాకేసి చూసి బట్టలు వేసుకుంటూ ఇల్లా చెప్పింది."

"నా సంగతి కాదూ? ఇప్పుడు నేను జీవించే జీవితంలో నా స్వవిషయం, ఆలోచించుకోవడం అసంభవం, నువ్వు అందరిని ప్రేమిస్తూ అందరికోసం విచార పడుతూ, అందరిని గురించి భయపడుతూ ఉంటే. ఇక నీ స్వవిషయాన్ని గురించి ఆలోచించుకోవడానికి నీకు తీరుబడెక్కడుంటుంది ? అనేక ఆలోచనలు నీ హృదయాన్ని ఆవరించేసి ప్రజలవైపుకు లాగేస్తాయి. నువ్వు వాటిని కాదని పక్కకు తప్పుకోవడ మెల్లాగ ? అబ్బే ! అసంభవం."

"తప్పుకోవలసిన అవసరంకూడా లేదు" అంది ల్యూడ్మిలా మెల్లగా నవ్వుతూ.

"దాని అవసరానవసరాలు నాకు తెలియవు. ప్రజలు ఇదివరకు కన్న తెలివైన వాళ్ళూ, శక్తివంతులూ అవుతున్నారని మాత్రం నాకూ తెలుసును. నాకది ప్రత్యక్షంగా కనుపిస్తుంది."

తల్లి గది మధ్య నిలబడి బట్టలు కట్టుకుంటూ ఏదో ఆలోచించడం మొదలు పెట్టింది. ఇదివరకు మోస్తరుగా ఆమె ఆలోచన తన కొడుకు శరీర సౌఖ్యంమీదికి పోలేదు. ఆమెలో ఆమెకే గొప్ప మార్పు కనుపించింది. పూర్వపు నిలోనా కానే కాదు. ఆ నిలోనా చాలా దూరంలో ఉంది. బహుశా ఆందోళనాగ్నిలో హుత మారిపోయిందేమో కూడాను. తన హృదయాన్ని పరీక్షచేసుకుందామనే భావంతో ఆమె అల్లాగే ఆలోచిస్తూ నిలబడిపోయింది.

ల్యూడ్మిలాదగ్గరకువెళ్ళి "ఏమిటో ఆలోచిస్తున్నావు ?" అని అడిగింది.

"నాకూ తెలియదు."

ఇద్దరూ కాస్సేపు మాట్లాడకుండా ఒకరికేసి ఒకరు చూసుకున్నారు. ఇద్దరికీ చిరునవ్వు వచ్చింది. తర్వాత టీ నీళ్ళు కాగేయో లేదో చూడడానికి బయటకు వచ్చింది. ల్యూడ్మిలా తల్లి కిటికీలోనుంచి చూస్తూ నిలబడింది. వీధిలో ఎండ తీక్షణంగా కాస్తోంది. అల్లా చూస్తుంటే ఆమె మనస్సులో ఏదో సంతోషం కలిగింది. ఏమిటో మాట్లాడాలనిపించింది. హృదయం వికసిస్తున్నట్లయింది. ఈ వికాసానికంతా కారకులయిన వాళ్ళకి తాను కృతజ్ఞత తెలుపాలని తోచింది. కాని వాళ్లెవరో మాత్రం తెలియలేదు. ప్రార్థనచెయ్యాలని ఈమధ్య లేని కొత్తకోరిక కూడా కలిగింది. ఇంతలో పావెల్, రైబిన్, శశాంక, నికోలే మొదలయిన వాళ్ళంతా ఆమె కళ్ళయెదుట నిలబడి పలుకరిస్తున్నట్లయింది. ఒక్కసారి దీర్ఘమైన నిట్టూర్పువిడిచింది.

ల్యూడ్మిలా మళ్ళీ లోపలికివచ్చింది. "నికోలే చెప్పినమాట నిజమే. అతను తప్పక అరెస్టయివుండాలి. నువ్వు చెప్పిన ప్రకారం కుర్రాడిని పంపాను. పోలీసులు దొడ్లోదాక్కుని వున్నారట. కాపలామనిషెవ్వరూ కనబడలేదట. గేట్లువెన కాల పొంచికూచున్న పోలీసులనుమాత్రం చూచి వచ్చాడు గూఢచారులు గడ బిడపడుతున్నారట. మన కుర్రాడు వాళ్ళని బాగా యెరుగును."

"అయ్యో పాపం" అంటూ తల్లి తలూపింది.

"ఈమధ్య అతను పట్టణంలోవుండే కూలీలకు చాలా సంగతులు చదివి చెపుతూవచ్చాడు మొత్తంమీద అతనక్కడుండకుండా పోవలసిందే. ఆసంగతైతే చాలామంది మిత్రులతనితో చెప్పారు. కాని అతను వినిపించుకోలేదు. ఇల్లాంటి

సందర్భాల్లో మనుష్యులకి ఊరికే సలహాచెప్పిన లాభంలేదు. నిక్కచ్చిగా ఆజ్ఞాపించవలసిందే" అని లూడ్మిలా చిరచిరలాడుతూ చెప్పింది.

ఇంతలో తుమ్మెదరెక్కల్లాంటి తలవెంట్రుకలు కలిగిన ఒకకుర్రాడు తలుపు దగ్గరకువచ్చి "టీ తీసుకురానా ?" అని అడిగాడు.

"తీసుకురా. ఇదిగో ! ఇతనే నా శిష్యుడు. శిరోజా ! ఇదివరకెప్పుడూ చూడలేదూ ?" అంది లూడ్మిలా తల్లితో.

"లేదు"

"అప్పుడప్పుడు నికోలే యింటికివస్తూనే వుండేవాడే. నే పంపేదాన్ని.

ఆ రోజున లూడ్మిలా ధోరణిచూస్తే ఆమె చాలా మార్పుచెందినట్లు కనుపించింది. తల్లికి మునుపటికన్న ఆమె చాలా అప్యాయంగా కనుపించింది. స్వతహాగా లూడ్మిలా కొంచెం భారీమనిషి. ఆమె నడుస్తుంటే తల్లికి ఆమెయందొక శక్తి సౌందర్యం కనుపించింది. ఆమెలోవుండే పూర్వపు కరుకుదనంకూడా తగ్గినట్లు కనుబడింది.' మునుపటికన్న ఆమె చిక్కింది. కళ్ళు బాగా గుంటలుపడ్డాయి శక్తికిమించి కష్టపడుతున్నట్లు స్పష్టంగా తెలుస్తోంది. ఆమె హృదయంలో ఏదో ఒకవిధమైన అవేదనకూడా ఉన్నట్లు ముఖలక్షణాల్లో కనబడుతోంది

పిల్లవాడు టీ తీసుకువచ్చాడు. "సిరోజా ! ఇదిగో ఈమెవరో తెలుసునా నీకు ? నిన్న శిక్షవేశారే, ఆ కార్మికనాయకుని తల్లి. పేరు పిలోగీనిలోనా !"అని లూడ్మిలా అతనికి తెలియపరిచింది.

సిరోజా మాట్లాడకుండా తలవంచి ఆమెకు నమస్కారముచేశాడు. కొంచెం రొట్టె తీసుకువచ్చి బల్లమీదపెట్టి భోజనం దగ్గర కూచున్నాడు. పోలీసువాళ్ళు నికోలే ఇంటిదగ్గర ఎవరికోసం కాచుకున్నారో తేలేదాకా ఇంటికివెళ్ళద్దని లూడ్మిలా తల్లితో చాలా చాలా చెప్పింది,

"బహుశా వాళ్ళు నీ కోసమే కనిపెట్టుకున్నారేమో ? నిన్ను తప్పకుండా సోదా చేస్తారు."

"చెయ్యనియ్యి. నన్ను అరెస్టు చేస్తే మాత్రం ప్రమాద మేమొచ్చింది ? కాని పాషా వుపన్యాసం నాలుగు మూలలా వెదజల్లెయ్యాలనే కోరిక మాత్రం ఒక్కటుంది."

"అది కూర్పు అయిపోయింది. రేపు పట్టణంలోనూ చుట్టుప్రక్కల పేటల్లోనూ పంచిపెట్టొచ్చు. జిల్లా అంతటా గ్రామాల్లోకికూడా పంపుదాం. నటాషా నెరుగుదువా నువ్వు ?"

"సరి సరి, ఎరగనూ ?"

"అల్లాగైతే కొన్ని అమె కందియ్యి."

సిరోజా వార్తాపత్రిక చదువుతున్నాడు. వీళ్ళ సంభాషణ వింటున్నట్లు కన బడడం లేదు. కాని మధ్యమధ్య తల్లి ముఖంకేసి చూస్తువచ్చాడు తల్లి ఈ సంగతి కనిపెట్టి తనలో తానే నవ్వుకుంది. లూడ్మిలా మళ్ళీ నికోలే అరెస్టు సంగతి గూర్చి పిసరంత విచారం కనుబడకుండా మాట్లాడింది. ఆ రోజు నేమిటో కాలం మామూలుకన్నా గబగబా వెళ్ళిపోయినట్లనిపించింది తల్లికి వాళ్ళు టీ తాగేసరికి మధ్యాహ్నమైంది.

లూడ్మిలా ఏదో చెప్పడం మొదలుపెట్టింది. ఇంతలో తలుపుతట్టిన చప్పుడైంది. సిరోజా లేచాడు. లూడ్మిలాకేసి చూచాడు. లూడ్మిలా ఏదో సంజ్ఞచేసింది. "తలుపు తియ్యి. ఎవరై ఉంటారు?" అంది లూడ్మిలా అతనితో. తల్లి కేసి తిరిగి ఇల్లా చెప్పింది. "ఇదిగో ఆ వచ్చేది పోలీసులైతే నువ్వీమూల నుంచో. సిరోజా నువ్వో?"

"నాకు తెలుసు. ఆ చీకటికోణం ఎరుగుదును" అంటూ ఆ కుర్రాడు ఎక్కడికో వెళ్ళేడు. తల్లికి నవ్వువచ్చింది. ఈ ప్రయత్నములేమీ ఆమెను కంగారు పరచలేదు. ప్రమాదం వచ్చే సూచనలేమీ ఆమెకు కనబడలేదు.

ఇంతలో డాక్టర్ ఇవానిష్ లోపలికి వచ్చాడు. వస్తూనే గబగబా ఇల్లా అన్నాడు.

"మొట్ట మొదట సంగతి, నికోలే అరెష్టయినాడు. ఓహో: నిలోనా, నువ్విక్కడున్నావు? వాళ్ళు నీ విషయంలో కూడా చూస్తూనే వున్నారు. అతన్ని అరెస్టుచేసినప్పుడు నువ్వక్కడ లేవూ? "నన్నిక్కడికి పొమ్మని అతనేపంపేశాడు" ఓహో! అదేమీ లాభంలేదనుకుంటాను ఇక రెండవ సంగతి నిన్నరాత్రి చాలామంది కుర్రాళ్ళు పావెల్ ఉపన్యాసాన్ని 500 కాపీలు • లితో తీశారు. అవిఅంత బాగాలేవు, ఒకమాదిరిగా బాగానేవున్నాయి. వాళ్ళు ఈ రాత్రి వాటిని పట్టణమంతా పంచిపెడతా మంటున్నారు. కాని నే నొద్దంటున్నాను. పట్టణంలో అచ్చుకాగితాలు పంచిపెట్టడం మంచిది. లితోకాగితాలు పైవాళ్ళకి పంపవచ్చు."

"సరే. అలాగైతే నేనే వాటిని తీసుకెళ్ళి నటాషాకిచ్చి వస్తాను."

తల్లికి ఎంత త్వరలో వీలైతే అంతత్వరలో పాషా ఉపన్యాసాన్ని విరజల్లేయాలనే కోరికకూడా పుట్టింది. వీలైతే ప్రపంచమంతా తన కొడుకు మాటలతో ప్రతిధ్వనింప చేసి వెయ్యాలనిపించింది. డాక్టరేమంటాడో నని అతనికేసి దీనంగా చూచింది.

---

• సైక్లోస్టయిలు.

డాక్టరు గడియారంకేసిచూస్తూ ఇలా అన్నాడు "ఈ సమయంలో ఈపని చెయ్యడ మెంతవరకు మంచిదో తెలియడంలేదు... ....12 గంటలకి 12 నిముషా లుంది. రైలు రెండుగంటల అయిదునిముషాలకిక్కడ బయలుదేరి సాయంత్రం అయిదుగంటల పదిహేను నిముషాల కక్కడి కెడుతుంది. నువ్వు సాయంత్రానికే చేరుకుంటావు. అప్పటే చీకటిపడదు. కాని అసలు సంగతదికాదు."

"అదికాదూ అసలుసంగతి" అంది లూడ్మిలా విసుగుతో.

"మరేమిటి?" అంటూ తల్లి వాళ్ళదగ్గరకువెళ్ళి "పని జాగ్రత్తగా చేయ డమే అసలుసంగతి. ఆ విషయంలో సందేహమక్కరలేదు. నేనంతా సరిగానే చేస్తాను" అంది.

లూడ్మిలా ఆమెకేసి రెప్పవాల్చకుండా చూచి "నీకు చాలా ప్రమాదంసుమా!" అంది.

"ఏమి ప్రమాదం?"

"ఏమిటా? అదే." అంటూ వైద్యుడు గబగబా ఇలా అన్నాడు.

"నిన్న నికోలే ఒకగంట కరెష్టవుతాడనగా ఇంట్లోంచి మాయమైపోయావు. వెళ్ళివెళ్ళి మిల్లులో మేష్టరీచేసే ఆమె దగ్గరకెళ్ళావు. నువ్వు ఆమె పినతల్లివని అందరికీ తెలుసునాయె. నువ్వు మిల్లుకెళ్ళిన కాస్సేపటికి ఈ తుంటరి కాగితాలు బయటపడితే యేమనుకుంటారు? ఇదంతా కలిపిచూస్తే నీపీకె కురితప్పదు."

"వాళ్ళు నన్ను కనుక్కోలేరు. (ధీమాగా)............నేను తిరిగి వచ్చిన తర్వాత ఆరెస్టుచేసి యెక్కడున్నావని అడుగుతారు........ఏం చెప్పాలో నాకూ తెలుసును. నే నక్కడనుంచే తిన్నగా పేటలో కెడతాను. నా కక్కడ సిజావ్ అనే స్నేహితుడున్నాడు. కనుక విచారణయినప్పటినుంచీ అక్కడే వున్నానని చెపుతాను. నాకు విచారం యెక్కువైపోయిందనీ, అతని మేనల్లుడుకూడా శిక్ష పడడంచేత అతనుకూడా నాలాంటి అవస్థలోనే వున్నాడనీ, అందుచేత ఒకళ్ళ నొకళ్ళు ఓదార్చుకుంటూ అక్కడే వున్నామని చెప్తాను. అతనుకూడా ఇల్లాగే చెప్తాడు తెలిసిందా?"

ఆమె కోరికింత గాఢంగా ఉండడంచేత వాళ్ళు అంగీకరించక తప్పింది కాదు. తల్లి తనకు వెంటనే ఈ పని ఒప్పచెప్పమని యెంతో దీనంగా అడిగింది. చివరకి "సరే వెళ్ళు" అన్నాడు డాక్టరు అయిష్టంగా.

లూడ్మిలా యేదో ఆలోచిస్తూ గదిలో పచారు చేస్తోంది. ఆమె తలవంచుకుంది. తల్లి ఆమె ఆందోళనను గ్రహించింది డాక్టరు అయిష్టంగా యిచ్చిన అంగీకారా నికి ఆమె నిట్టూర్పు విడిచి ఇల్లా అంది నవ్వుతూ.

"మీరంతా నా విషయంలో ఇంత శ్రద్ధవహిస్తారు. కాని మీ సంగతేమీ చూసుకోరు."

"అది నిజంకాదు. మేము మా సంగతి చూచుకుంటూనే వుంటాం. తప్పకుండా చూసుకోవాలి కూడాను. వృధాగా తమ శక్తిని ఖర్చుపరచేవాళ్ళని మేము మందలిస్తూనే వుంటాం సరేకాని నువ్వు ఇప్పుడు చేయవలసిన పని ఇది. నీకు కాగితాలు రైలుస్టేషనుదగ్గర అందుతాయి" అంటూ నికోలే ఈ పనంతా యెల్లా యేర్పాటవుతుందో వివరంగా తెలియచేశాడు. తర్వాత ఆమె ముఖంకేసి చూసి "సరి. నీవు జయప్రదంగా చేసుకురావాలి. అదే నా కోరిక. నీకు సంతోషంగా వుందికాదూ?" అంటూ వెళ్ళిపోయాడు. లూడ్మిలా తలుపు గడియవేసి చిరునవ్వు నవ్వుకుంటూ తల్లి దగ్గరకు వచ్చింది.

"నువ్వు చాలా మంచిదానవమ్మా. నీసంగతి నాకు తెలుసును." అని తల్లి చెయ్యిపట్టుకుని పచారుచేస్తూ ఇల్లా చెప్పడం మొదలుపెట్టింది.

నాకూ ఒక కొడుకున్నాడు. వాడికిప్పుడు పదమూడేళ్ళుంటాయి. కాని తండ్రిదగ్గరున్నాడు. నా భర్త అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటరు. బహుశా ఈపాటికి పబ్లిక్ ప్రాసెక్యూటరుపనే అయివుండవచ్చు. పిల్లవాడు ఆయనదగ్గరున్నాడు. తరుచు వాడేమవుతాడో అని నాలో నేనే ఆలోచించుకుంటూవుంటాను..............

(ఈమాట చెపుతుంటే ఆమె కంఠస్వరం వణికింది) "నాకెంతో ఆప్తులైన ప్రజలకి గర్భశత్రువైన నాభర్తదగ్గర నాకొడుకు పెరుగుతున్నాడు. బహుశా వాడు కూడా నాకు శత్రువుగా తయారైతే కావచ్చు వాడు నాదగ్గరుండటానికి వీలు లేకుండా వచ్చింది. నేనేదో మారుపేరుతో కాలక్షేపం చేస్తున్నాను. ఎనిమిదేళ్ళయింది నాకొడుకును కళ్ళతోచూచి. అబ్బ! ఎనిమిదేళ్ళంటే మాటలా? ఎనిమిదేళ్ళు!"

లూడ్మిలా కిటికీదగ్గర నిలబడి వెలవెలలాడుతూఉండే ఆకాశంకేసి చూస్తూ మళ్ళీ ఇల్లాచెప్పింది:

"నాకొడుకే నాదగ్గరుంటే నాకింకా బలం. నిరంతరం నన్ను బాధపెట్టే ఈపుండు, నాహృదయంలో ఉండేదికాదు. వాడు చచ్చిపోయినా ఒక విధంగా నాకంత బాధలేకుండా వుండేది (ఒకక్షణం ఆగి ఊపిరిపీల్చుకొని దృఢంగా) అప్పుడూరికే చచ్చిపోయినవానిక్రిందే లెక్కవేసుకొనేదాన్ని. అంతేకాని నాకు గర్భవాస ప్రేమకన్నా, జీవితంకన్నాకూడా ప్రియతమమైనటువంటి ఈఉద్యమానికి నాకొడుకు శత్రువైనాడనే బాధ లేకుండా ఉండేది."

"అయ్యో, తల్లీ!" అంది తల్లి మెల్లగా నిట్టూర్పువిడుస్తూ.

"అవును ఈ విషయంలో నువ్వుచాలా అదృష్టవంతురాలవు. ఇది చాలా గొప్పవిషయం. తల్లీ, కొడుకూ ఒకరికొకరు ఆసరాఅవడం. నిజంగా అలాంటి భాగ్యం ఎక్కడో? ఎవరికో?" తల్లి అప్రయత్నంగానే "అవును అదిమంచి సంగతే" అంది మెల్లగా. "ఇదొక జీవితగాధ. మీరంతా నికోలే,ఇవానిష్ మొద లయినవాళ్ళు - ఒకళ్ళకొకళ్ళు ఆసరాగా దగ్గరగానే వున్నారు. మీరనుకునేమాటలు నాకర్థంకావు. కాని నాకు సంగతిమాత్రం తెలుస్తుంది. మీరంతా ఒక్కకుటుంబంలో వాళ్ళయిపోయారు."

"అవును. ఆ సంగతంతే" అంది లూడ్మిలా.

తల్లి ఆమె వీపు తట్టి ఎంతో ఆప్యాయంగా ఇలాచెప్పింది.

"యువజనులు ఎక్కడికో ప్రయాణమైనారు. జీవితాల్ని వాళ్ళెక్కడికో నడిపిస్తున్నారు. నాకు తెలుస్తున్న సంగతి దొక్కటే. ప్రపంచంలోవుండే యువకు లంతా ఒకే ఆదర్శానికి చేరుతున్నారు. సత్పురుషులూ, న్యాయపథం తప్పనివాళ్ళూ అంతా యేకమై దుర్మార్గాన్ని, అంధకారాన్ని నిర్భయంగా యెదుర్కొంటున్నారు. సంగతి సందర్భాలు తెలుసుకొని వాళ్ళు అసత్యాన్ని తలెత్తకుండా మట్టగించేస్తు న్నారు. అపారమైన తమ యౌవనశక్తినంతా న్యాయంకోసం ధారపోస్తున్నారు. మానవుల దౌర్భాగ్యాన్ని జయించడానికి పూనుకున్నారు. ప్రపంచంమీద దౌర్భాగ్య మనేదాన్ని లేకుండా చేయడానికే భయంకరమైన రాక్షసత్వాన్ని నిర్మూలం చేయ డానికే, సాయుధులై పోతున్నారు. తప్పకుండా, నిర్మూలం చేస్తారు కూడాను. ఒక కొత్తవెలుగును తెప్పిస్తామని యెవరో వాళ్ళు నాతో చెప్పారు సందేహం లేకుండా వాళ్ళు తెప్పించగలరు. జీవకోటి అంతటిలోనూ ఒకే హృదయాన్ని సృష్టిస్తామనీ, మానవహృదయాలన్నిటినీ సమ్మిళితం చేస్తామనీ, వాళ్ళు చెపు తున్నారు. జీవితాన్నంతటిని పరిశుభ్రం చేస్తామంటున్నారు నిస్సందేహంగా అంత పనీ వాళ్ళు చెయ్యగలరు. తల్లి ఇలా చెపుతూ "అదిగో సూర్యుడు పైన" అని వ్రేలుపెట్టి చూపించింది. లూడ్మిలా గుండెలమీద తట్టి చెప్పడం ఆరంభించింది.

"ఇదిగో ఇక్కడ మానవసౌఖ్యం అనే దివ్యమైన వెలుగు ఈ వెలుగే ప్రపంచంలోవుండే ప్రాణికోటినంతటినీ ప్రకాశింపచేసేస్తూంది. ఈ వెలుతురే ప్రేమ. ప్రతిమనిషీ ప్రతివస్తువుయెడలా ఈ ప్రేమను ప్రకాశింపచేస్తాడు."

తల్లికి మరచిపోయిన ప్రార్థనలు జ్ఞాపకానికి వచ్చాయి, ఆమె వాటిని తన హృదయంలో నుంచి అగ్నికణాల్లా బయటపడేసింది.

"యువజనులు న్యాయం, సత్యం అనే దారి వెంబడి నడుస్తూ అందరికీ ప్రేమసూత్రాన్ని ప్రచారం చేస్తున్నారు. హృదయాంతరాళాల్లోంచి పుట్టుకొచ్చే ఒక దివ్యమైన అగ్నిచేత సమస్త వస్తువుల్ని వాళ్ళు ప్రకాశింపచేస్తున్నారు. ఈ రీతిగా యువజనులు ప్రపంచమంతటిమీద చూపించే యీ ప్రేమలోనుంచే ఒక నూతన

మైన, సౌఖ్యావహమైన జీవితం బయలుదేరుతుంది. ఈ ప్రేమవాహిని నష్టగలవా రెవరు? దీనిని మించిన శక్తి యెవరికుంది? దీని నణచగలవా రెవరు? భూదేవే దాన్ని పుట్టించింది. ప్రాణికోటి అంతా కూడా దాని విజయాన్ని కోరేవాళ్ళే. రక్త ప్రవాహాలు కానియ్యండి. ఆఖరుకి రక్తసముద్రాలు కానియ్యండి దాన్ని ఆపలేరు."

తల్లికి ఆయాసం వచ్చింది. లూడ్మిలాను వదలిపెట్టి దూరంగా కూచుంది. లూడ్మిలాకూడా ఏదో భయపడినట్లుగా తెల్లబోయి చూచింది. గతంతా నిశ్శబ్దమై పోయింది. లూడ్మిలా ధోరణిచూచి తల్లి ఏదో తప్పుచేసినట్లు ఇలా అంది. "నేనేమీ తప్పుమాటలు మాట్లాడలేదు గదా? ఏమీలేదు నువ్వు చెప్పినదంతా నిజమే........ కాని ఇక మన మీ సంగతి మాట్లాడుకోవద్దు. దాని సంగతల్లా వుండనియ్యి........ మరి నీకు బయలుదేరడానికి వేళయింది" అంది లూడ్మిలా.

"అవును. ఇప్పుడే బయలుదేరుతున్నా. పరమ సంతోషం! ఆహా యేమి సౌఖ్య మనుకున్నావు! నీకీఆనందంసంగతి తెలిస్తేనా?........ నా గర్భవాసాన్ని జన్మించిన నాకొడుకు సందేశాన్ని నేనే మోసుకెడుతున్నాను కదా. ఒహో! మహ దానందం." అనితల్లి నవ్వింది చిరునవ్వు లూడ్మిలా మొగంలో ఆ చిరునవ్వు ప్రతిబింబించలేదు. లూడ్మిలా సంతోషాన్ని ఆపుకుందనుకుంది. తనఆనందాన్ని ఆమెకు కూడా ఇచ్చి తనతోపాటు ఆమెనుకూడా సంతోష సాగరంలో ఓలలాడించాలనే గట్టికోరిక కలిగింది తల్లికి. లూడ్మిలా చేతులు గట్టిగా తట్టుకుని ఇల్లాఅంది

"అమ్మాయీ! ప్రపంచంలో వుండే ప్రాణికోటులకందరికీ లభ్యమయ్యే వెలుగొకటివుందనీ, అందరూ దాన్ని చూడగలిగే రోజంటూ ఒకటి వస్తుందనీ, అందరి ఆత్మలు ఆ వెలుగులో ఓలలాడేకాలం వస్తుందనీ, తెలుసుకున్నట్లయితే యెంతహాయిగా వుంటుంది."

ఈ మాటలు చెపుతుంటే విశాలమైన తల్లిముఖం అదిరింది.' కళ్ళల్లో సంతోషపూరితమైన వెలుగు తళతళలాడింది. బ్రహ్మాండమైన ఊహలుపుట్టి ఆమెకు తన్మయత్వం కలిగించాయి వీటికితోడు తన జీవితంతో తనకు కలిగిన కష్టాల్ని అనుభవాన్ని మిళితంచేసి చక్కని చక్కెర కండల్లాటి మాటలు చేసింది

"ఏముంది? ఇదంతాచూస్తే ప్రజలపాలిటికి ఒకకొత్త దేవుడుపుట్టినట్లుంది. అంతా అందరికోసం అందిరూ అంతటికినీ జీవితమిల్లా ఏర్పాటయినట్లుంది. ప్రపంచంలో వుండేదాన్నంతటినీ అందరూ అనుభవించాలి. ఈ రూపకంగానే మిమ్మం దరినీ నేను భావించుకుంటున్నాను. ఇందుకే మీరీ ప్రపంచంలో ఉన్నట్లు నాకు కనబడుతోంది. మీరంతా నిజానికి స్నేహితులు. బంధువులు. సత్యదేవతయొక్క సంతానం. ఆ సత్యమే మిమ్మల్ని కడుపారా కన్నది. ఆమెచలువవల్లనే మీరు జీవిస్తారు."

ఉద్రేకంచేత తల్లి కొంచెంసేపు మాట్లాడలేక పోయింది. ఒక్కక్షణం ఆగింది. కౌగిలించుకొనేటట్లుగా చేతులుచాపి మళ్ళీ మాట్లాడడం ప్రారంభించింది.

• "కామ్రేడ్సు" అనేమాట నాలోనేను వుచ్చరించు కోవడంతోటే నా కేమో వాళ్ళంతా యెక్కడికో వెళ్ళిపోతున్నట్లు తోస్తుంది. అడుగులచప్పుడు వినబడు తోంది. ప్రపంచంలోవున్న చర్చీలలో గంటలన్నీ ఒక్కసారే మోగుతున్నట్లు జనం సంతోషంతో కేకలేసుకుంటూ పోతున్న శబ్దం నా చెవుల్లో గింగురుమం టోంది. పెద్ద తీర్థంలాగుంది."

తల్లికి తన కోరిక సిద్ధించింది. లూడ్మిలా ఆశ్చర్యచకితురాలైంది ఆమె పెదిమలు తడబడ్డాయి. కన్నీటిముత్యాలు జలజలరాలాయి.

తల్లి ఆమెనొక్కసారి గట్టిగా కౌగిలించుకొని నవ్వింది. లూడ్మిలా హృద యాన్ని జయించినందుకామెకు కొంచెం గర్వం కలిగింది. వాళ్ళిద్దరు విడిపోయే టప్పుడు లూడ్మిలా తల్లి ముఖంకేసి రెప్పవాల్చకుండా చూచి,

"నీకిదంతా బాగానేవుంది సుమా" అంది.

## ౧౯

తల్లి వీధికొకి వచ్చింది. చలిగాలి ముక్కుల్లోకి, నోట్లోకి, కొడుతోంది. ఆమెకు కొంచెంసేపు ఊపిరి సలుపలేదు. ఒకచోట నిలబడి నాలుగువైపులా చూచింది ఆమెకు దగ్గరగా ఖాళీగావున్న వీధిమొగలో ఒక బండివాడు చిరిగి పోయిన టోపీ పెట్టుకుని నిలబడ్డాడు. కొంచెందూరంలో యెవరో ఒకడు తల ఒరగేసుకుని నడుస్తున్నాడు. అతని ముందరగా ఒక సిపాయి చెవులు నలుపు కుంటూ పరుగెత్తుతున్నాడు

"సిపాయి బహుశా బజారు కెడుతున్నట్లున్నాడు" అనుకుంటూ మెల్లగా పెళపెళలాడే మంచుమీద అడుగు వేసుకుంటూ తల్లి ముందుకుసాగింది. రైలు స్టేషనుకు పెందలకాడే చేరింది. రైలింకా సిద్ధంకాలేదు. పొగబారిపోయి నల్లగా అసహ్యంగా ఉన్న మూడవతరగతి ప్రయాణీకు లుండేచోటుకి చేరుకుంది. అప్పటికే చాలామంది జనంచేరారు. కొంపాగోడీలేని కూలివాళ్ళు, బండివాళ్ళు ఇంకా నిర్భాగ్యు లనేకమంది చలిబాధ తీరుతుందికదా అని అక్కడికేచేరారు. కొందరు రైతులు. ఒక లావుపాటి వ్యాపారస్తుడు మతబోధకుడు. అతని కుమార్తె ఒక స్ఫోటకంమచ్చలపిల్ల ఐదారుగురు సిపాయిలు, ఇంకా అనేకరకాల ప్రయాణీకులంతా ఉన్నారు.

---

• సామ్యవాదులంతా ఒకళ్ళనొకళ్ళు ఆప్యాయంగా పిలుచుకునే పద్ధతి.

అందులో చుట్టలు తాగేవాళ్ళు కొందరు, సారా తాగేవాళ్ళు కొందరు. లొడలొడా మాట్లాడుకొనేవాళ్ళు కొందరు; వికవికా నవ్వేవాళ్ళు కొందరు; చుట్టలపొగతో ఒక పెద్దమేఘం ఆవరించింది. పొగాకు, క్రూడాయిలు, ఉప్పుచేపలు వీటికంపుతో ముక్కు బద్దలైపోతూంది.

తల్లి లోపలికివచ్చే గుమ్మందగ్గరే కూర్చుంది. లోపలికి రావడానికి ఎవరయినా తలుపుతెరిస్తే స్వచ్ఛమైన గాలి వచ్చేది. ఆ గాలి కాస్తపీలిస్తే ఆమె ప్రాణం లేచి వచ్చేది. పెద్దపెద్ద మూటలు భుజాన్ని పెటుకొని కొందరు వచ్చారు తిట్టుకుంటూ తిమ్ముకుంటూ, మూటలు బల్లమీదపారేసి మొగంమీద, చేతులమీద పడ్డమంచును తుడుచుకుంటున్నారు.

ఇంతలో పసుపుపచ్చని చిన్నతోలుసంచీ ఒకటి చేత్తోపుచ్చుకొని ఒక యువకుడు లోపలికివచ్చాడు. నాలుగుమూలలా చూచి తిన్నగా తల్లిదగ్గరకు వచ్చాడు.

"ఎక్కడికీ? మాస్కోకా? మేనగోడ లింటికేనా?" అని మెల్లగా అడిగాడు.

"అవును."

ఆ యువకుడు సంచిని ఆమెదగ్గరగా బల్లమీద పెట్టాడు. వెంటనే ఒక సిగరెట్టు తీసి ముట్టించి, టోపీసర్దుకొని మెల్లిగా తలుపుదగ్గరకువచ్చేశాడు. తల్లి ఆ తోలుసంచిని మెల్లగా ముట్టుకొని చూచింది దానిమీద మోచేతులాన్చి సంతుష్టి పొందింది. మళ్ళీ జనంకేసి నాలుగుమూలలా చూచింది. రెండు నిమిషాలయిన తర్వాత బెంచీమీదనుంచి లేచి సంచిచేత్తో పుచ్చుకొని ప్లాటుఫారంమీదకువెళ్ళే గుమ్మందగ్గరున్న బెంచీమీద కూచుందామని బయలుదేరింది. వెడుతూవెడుతూ తలెత్తి చుట్టుప్రక్కలనున్న మనుష్యుల మొగాలన్నీ పరీక్షగా చూచింది.

ఒకవైపున యెత్తుగావున్న మెడపట్టీగల చిన్న ఓవర్‌కోటును తొడుక్కొని ఎవరో ఒక మనిషి ఆమె కెదురువచ్చి గమ్మున వెనక్కి తగ్గాడు అతన్ని ఇది వరకెప్పుడో చూచిన జ్ఞాపకం వచ్చింది. ఆమె నాలుగుప్రక్కలా చూస్తూ ఉండే సరికి ఆ మనిషి ఏకాగ్రదృష్టితో తనకేసి చూస్తూన్నాడు. ఆచూపు ఆమెకు ముల్లు గుచ్చుకున్నట్లు చురుక్కుమంది. సంచినిపట్టుకున్నచెయ్యి గజగజలాడింది. భుజ మంతా లాక్కుపోయింది. సంచిహఠాత్తుగా బరువెక్కింది.

"ఇతన్నెక్కడ చూచానా? అనే ఆలోచనలోపడింది తల్లి. ఈ ఆలోచనతో కొంత ఖంగారు తగ్గింది. ఆమెకేదో అనుమానం తగిలి కొంత బాధపెట్టడం ప్రారంభించింది. ఈబాధతో నోరెండిపోయింది అదొక మోస్తరు వెగటు కలిగింది. ఏమీతోచక మళ్ళీ నాలుగుమూలలా చూచింది. అతనక్కడే

నిలబడి చూస్తున్నాడు. ఘోరణిచూస్తే అతని కేదో కావలసినట్లుంది. కాని అదేమిటో నిర్ణయించలేని స్థితిలో ఉన్నట్లున్నాడు. అతని కుడిచెయ్యి కోటు బొత్తాముల మధ్యవుంది ఎడమచెయ్యి జేబులోవుంది. అందుచేత కాబోలు కుడి భుజం ఎడమ భుజంకన్న కొంచెం ఎత్తుగా కనబడుతోంది.

తల్లి మరేమీ ఖంగారు పడకుండా బెంచీదగ్గరకువెళ్ళి జాగ్రత్తగా కూచుంది. ఏదో ప్రమాదం వస్తోందని ఆమె మనస్సుకి తట్టింది ఈ వ్యక్తిని రెండుసార్లు యిదివరలో చూచిన జ్ఞాపకం వచ్చింది మొదటిసారి రైబిన్ పారిపోయే సందర్భంలో పట్టణం వెలుపల పొలాల్లో చూచింది. రెండోసారి విచారణప్పుడు కోర్టులో చూచింది. ఆ మనిషి ప్రక్కనే యింకొక పోలీసు నిలబడ్డాడు. రైబిన్‌ను వెదకడానికి వచ్చినప్పుడు తల్లి తప్పుదారి చూపించిన దీ పోలీసుకానిస్టేబుల్ కే. ఇక సందేహ మేముంది? వాళ్ళు ఆమెను గుర్తుపట్టి ఆమెకోసమే వెతుకుతున్నట్లు స్పష్టంగా కనబడుతూనే ఉంది.

"దొరికిపోయానా మేమిటి?" అని తల్లి తనలో తానే ప్రశ్నించుకుంది. తక్షణమే "ఏమో యింకా......." అనుకుంది మళ్ళీ చటుక్కున "ఇక లాభం లేదు. దొరికిపోయాను" అని నిశ్చయించుకుంది.

అటూయిటూ చూచింది. ఆమె బుర్రలో అనేక ఆలోచనలు గబగబా పుట్టి మాయమైపోయాయి. సంచి వదిలేసి పోదామా' అనుకుంది. వెంటనే మళ్ళీ 'ఛాఛా! అదేంపని? ఇంత అమూల్యమైన వస్తువును వదిలెయ్యడమే? నా కొడుకు ఉపన్యాసాన్ని యిల్లాంటి దుర్మార్గులచేతుల్లో పడేస్తానా!' అనుకుంది.

వణకుతూ సంచిని ఒడిలో పెట్టుకుని గట్టిగా పట్టుకుంది. 'ఎక్కడికెళ్ళడం' 'సంచి పట్టుకుని పారిపోదామా?' అనే ఆలోచన పుట్టింది

ఈ ఆలోచనలన్నీ ఆమె మనస్సును పరిపరివిధాల పీడించి బాధపెట్టేస్తున్నాయి. పారిపోవడమనే యాలోచన ఆమె మాతృత్వానికి అమర్యాద. ఆ పని చేస్తే తన కొడుక్కీ తనకీ కూడా చాలా పరువుతక్కువైన సంగతేననుకుంది. ఏదో ఒక అదృశ్యమైన శక్తి మీదపడి భుజాలను రొమ్మును నొక్కేసి, తన్ని క్రుంగదీసేస్తున్నట్లు ఆమెకు తోచింది. అత్యంత భయంచేత కణతలు కొట్టుకున్నాయి. వెంట్రుకలు గగుర్పొడిచాయి.

హఠాత్తుగా ఒక్కసారి ఆమె హృదయాని కెక్కడలేని శక్తివచ్చింది. దానితో ఆమె శరీరమంతా పొంగిపోయింది. భయం, ఆందోళన మొదలైన అల్ప భావాలన్నీ ఒక్కసారి తుడిచిపెట్టుకుపోయినాయి. తనలో తానే అతి గంభీరంగా 'ఇక చాలు!' అనుకుంది. వెంటనే ఆమెకు చాలా సుఖవుగా వుంది. కొత్త బలం వచ్చింది. 'నీకొడుకున కమర్యాద తేవద్దుసుమా! ఎవరికీ భయంలేదు! అని ఆమె

అంతరాత్మ ప్రబోధించింది. మొదట్లోపడ్డ ఆందోళనంతా పోయింది. వాళ్ళేం చేస్తారో, ఏమిజరుగుతుందో చూద్దామని జాగ్రత్తగా వాళ్ళనికనిపెడుతూ కూచుంది.

గూఢచారి స్టేషనుగార్డు నొకనిపిలిచి, తల్లినిచూపిస్తూ అతని చెవిలో ఏమిటో చెప్పాడు. గార్డు అతనికేసి చూసి వెనక్కి వెళ్ళిపోయాడు. ఇంకొక గార్డు వచ్చి గూఢచారి చెప్పినమాటలు విని పళ్ళికిలించి బొమలు ముడిచాడు. అతను ముసలివాడు, మోటుమనిషి వెర్రిగడ్డం, గూఢచారితో ఏమిటోచెప్పి అతను కూచున్న బెంచీదగ్గరకు వచ్చాడు. గూఢచారి ఎక్కడికో గబగబా వెళ్ళి పోయాడు.

ఆ ముసలిగార్డు తల్లిముఖంకేసి తీక్షణంగాచూస్తూ దగ్గరకు వెళ్ళాడు. ఆమె గజగజలాడుతూ బెంచీచివర జరిగింది. లోపల లోపల "వాళ్లు కొట్టకుండా ఉంటే చాలు. అంతే కొట్టకుండా వుంటేనా ?" అనుకుంది.

ఆముసలి ఆమె పక్కకువచ్చి నిలబడ్డాడు. తల్లితలెత్తి అతనికేసిచూచింది.

"ఏమిటల్లా చూస్తున్నావు ?" అన్నాడు ఆ ముసలి.

"ఏమీలేదు"

"అమ్మదొంగా ! ఇంత ముసలిదానవయ్యావు. ఇంకా.........."అని ఏమో అనబోయాడు. ఈమాటలామెకు చెంపకాయలా తగిలేయి, శూలాల్లా గుచ్చు కున్నాయి. గుండ్లు తోడుకుపోతున్నంత బాధకలిగించాయి.

"నేను దొంగనుకాను, నువ్వబద్ధం ఆడుతున్నావు" అని తల్లి ఓపికున్నంత బిగ్గరగా అరిచింది. ఈ అవమానంతో ఆమె హృదయంలో తిరుగుబాటు బయలు దేరింది. అమెలో నిబిడీకృతమైఉండే సర్వశక్తులూ ఒక్కసారిపోయి విజృంభిం చాయి. చటుక్కున సంచి కదిలించేసరికి అది తెరుచుకుంది.

"చూడండి ! చూడండి నాయనా జూడండి" అని గట్టిగా అరుస్తూ లేచి నిలబడి సంచీలోంచి గుప్పెడు కాగితాలుతీసి పైకెత్తి గాలిలో ఆడించింది. జనం అహో ఓహూ ! అనుకుంటూ గబగబా అన్ని వైపులనుంచీ ఆమె దగ్గరకు చేరడం ఆరంభించారు. ఈ సంగతి తల్లి చూచింది.

"ఏమిటది ?"

"అక్కడొక గూఢచారి పోలీసున్నాడు."

"అసలు సంగతేమిటి ?"

"ఆమె దొంగట, వాళ్ళంటున్నారు."

"ఆవిడేనా దొంగ"

"దొంగయితే అల్లా అరుస్తుందా ?"

"అయ్యో ! అయ్యో ! అంతమర్యాదస్తురాలు దొంగా ?"

"వాళ్లెవరినీ పట్టుకుంట ?"

ఈ రీతిగా జనం యెవరికితోచినట్లు వాళ్ళనుకుంటూ దగ్గరకు వచ్చారు

"నేను దొంగను కాను" అని తల్లి నిర్భయంగా చెప్పడం ఆరంభించింది. జనం బాగా చేరుతూ వుండడం చూస్తే ఆమెకు చాలా వుత్సాహం కలిగింది.

"నాయనలారా ! నిన్నటిరోజున అధికారులు రాజకీయ ఖైదీలను విచారణ చేశారు. అందులో నా కొడుకు పావెల్‌కూడా ఒకడు అక్కడతనొక ఉపన్యాసం ఇచ్చాడు ఇదిగో యిదే ఆ ఉపన్యాసం. ప్రజలంతా దీన్ని చదువుకుని, ఇందులో వుండే నిజాన్ని తెలుసుకోవాలనే నేను స్వయంగా వీటిని అందరికి అందజేస్తున్నాను."

ఎవరో ఒకరు ఆమె చేతులోనుంచి ఒక్కకాగితం లాక్కున్నారు. ఆమె మిగిలిన కాగితా లన్నిటిని జనంలోకి విసిరేసింది. జనం వాటిని ఏరుకుని జేబుల్లోను, లోపలిచొక్కాల్లోను దాచుకోవడం చూచింది అందుచేత ఆమెకు మరింత ధైర్యం వచ్చింది. నిర్భయంగా నిలబడింది. హృదయంలో ఒకవిధమైన గర్వం కలిగింది. సంతోషం ఒక్కసారి పొంగివచ్చింది. మాట్లాడుతూనే సంచిలోంచి గుప్పెడు గుప్పెడు కాగితాలుతీసి నాలుగు మూలలా జనంలోకి విసిరేసింది. జనం అప్యాయంగా అందుకున్నారు.

"ఇదిగో ఈ ఉపన్యాసానికే నా కొడుకునీ, అతని సహచరుల్నీ ప్రవాసం పంపారు. ఆ సంగతి మీకు తెలుసునా ? నేను చెపుతున్నాను వినండి. బిడ్డలను కన్నతల్లి హృదయాన్ని నమ్మండి. ఇదిగో ముగ్గుబుట్టలా నెరిసిన నాతల, దీనిని చూచైనా నామాట నమ్మండి. నిన్న వాళ్ళందరినీ శిక్షించడానికి కారణ మేమిటో తెలుసునా ? మీకు అంటే జనసామాన్యాని కందరికి పవిత్రమైన సత్యాన్ని తెలియ పరచినందుకు. నిజానికి మీ బ్రతుకేం బ్రతుకు ?"

(జనంనిశ్శబ్దంగా చెవులు నిక్కబొడుచుకుని విన్నారు. గుంపు ఇసకేసినా రాలకుండా వుంది. జనమంతా ఆమెను ముట్టడించేశారు:)

దారిద్ర్యం, ఆకలి, రోగం యివే బీదలుపడే ప్రయాసకు ప్రతిఫలం. ఈలాంటి నిర్భాగ్యపు బ్రతుకే ప్రజలను దొంగతనానికి, అవినీతికి, పాల్పడేటట్లు చేస్తోంది. ధనికులు మననెత్తినెక్కి సుఖంగా, హాయిగా, తృప్తిగా అనుభవిస్తూ కాలక్షేపంచేస్తున్నారు. మనం యెప్పటికీ వాళ్ళ చేతిక్రిందపడుండి వాళ్లు చెప్పినట్లు నడుస్తూ వుండేటందుకే పోలీసులను, వుద్యోగస్తులను, సిపాయీలను వాళ్ళు

తమ చేతుల్లో పెట్టుకుంటారు. వీళ్ళంతా వాళ్ళ గుప్పెట్లోవాళ్ళే వీళ్ళందరూ మనకు వ్యతిరేకులే ఇదంతా మనకు వ్యతిరేకమే. బ్రతికున్నన్నాళ్ళూ మనం యమయాతన పడుతూ పని చేసి చేసి నశించిపోతున్నాం ఇతరులు మన కష్టం వల్ల ధనికులై సర్వసౌఖ్యాలనూ అనుభవిస్తున్నారు. పైగా వాళ్ళు మన కాళ్ళూ చేతులూ కట్టేసి కుక్కల్లా చూస్తున్నారు. అజ్ఞానంలోపడేసి వుంచుతున్నారు. మనకేమీ తెలియదు దేన్నిచూసినా భయంచేత గడగడలాడుతూ వుంటాము. మన జీవితాని కెప్పుడూ రాత్రే - అంధకారమే. జీవిత మెప్పుడూ మనకి భయంకరమైన స్వప్నమే. వాళ్ళు మైకం కలిగే విషాన్ని మన శరీరంలో కెక్కించి, మనం స్మృతి తప్పి పడుంటే వాళ్ళు మన రక్తం తాగుతున్నారు దురాశాపూరితులైన వాళ్ళ కోరికలకు అంతులేదు. నే చెప్పినదాల్లో ఏమైనా అబద్ధం వుందా?"

"లేదు, లేదు."

జనం వెనకాల గూఢచారిని, ఇద్దరు పోలీసుల్ని చూచింది తల్లి తన దగ్గరున్న ఆఖరు బొత్తికూడా ఇచ్చేద్దామని సంచిలో చెయ్యి పెట్టేసరికి అదివరకే ఎవ్వరిదో చెయ్యి అక్కడుంది. "నాయనా తీసుకో అంతా తీసుకో" అంది వంగి. అసహ్యమైన మొగంగల ఒకడు ఆమె దగ్గర కొచ్చి మెల్లగా "ఎవరితోచెప్పడం" అని అడిగాడు. ఆమె జవాబు చెప్పలేదు జనాన్ని హెచ్చరిస్తోంది. "ఈ అక్రమ జీవితాన్ని మార్చడానికీ, ప్రజల బంధనాలన్నిటినీ భేదించడానికీ, నిర్జీవులయిన ప్రజల నుద్ధరించడానికీ అప్పుడే కొందరు జనం బయలుదేరారు. జీవితంలో వుండే సత్యాన్ని వాళ్ళు రహస్యంగా చూచారు. రహస్యంగానని ఎందుకంటున్నానంటే ఈరోజుల్లో నిజం బహిరంగంగా చెప్పడానికి వీలులేదని మీకూ తెలుసు చెపితే జైళ్ళల్లో పారేస్తారు. నానాహింసాలూ పెడతారు. ధనం ఒక గొప్ప శక్తేకాని సత్యానికి ప్రబలమైన విరోధి. ధనికుల అధికారానికి సత్యమే గొప్ప శతృవు ధనానికీ సత్యానికీ రాజీ అన్నమాటే లేదు. మన పిల్లలు సత్యాన్ని ప్రపంచంలో ప్రచారం చేస్తున్నారు. స్వచ్ఛమైనవాళ్లు, తేజోవంతులు, సత్పురుషులు ఈ సత్యాన్ని మీ కందిస్తున్నారు. ఇంతవరకు వాళ్ళ సంఖ్య బహు స్వల్పం. వాళ్ళ కంత శక్తికూడా లేదు. కాని ఆ రోజు కా రోజు వాళ్ళ సంఖ్య వృద్ధి పొందుతోంది. వాళ్లు తమ పవిత్రమైన హృదయాలను సత్యంతో మిళితం చేసి నిర్జింపరాని గొప్ప శక్తిని సృష్టిస్తున్నారు. ఈ శక్తి మనకు కూడా ఉత్సాహాన్నిస్తుంది. ధనికులూ, వాళ్ళకి ఆత్మల నమ్ముకొన్న నిర్భాగ్యులూ మనలను పెట్టే బాధలనుండి తొలగించేదీ శక్తే. ఇది నిజం. నా మాట నమ్మండి."

"తప్పుకోండి! తప్పుకోండి" అంటూ పోలీసులు జనాన్నితోసుకుంటూ వచ్చారు. జనసమ్మర్దంలో పోలీసులు నలిగిపోయారు. ముగ్గుబుట్టలా తల, తామర పత్రాల్లాంటి విశాలమైనకళ్ళు, దయవుట్టిపడేముఖం కలిగిన తల్లిమూర్తి జనాన్నెంతో ఆకర్షించింది. జీవనభారంచేతా అవమాన పరంపరలచేత క్రుంగి

పోతూ వుండేవాళ్ళ హృదయాల కీలాంటిమాటలు వినడానికెంతో ఇంపుగా వున్నాయి. నిర్భయంగా ఆమె నోటివెంబడి వచ్చే పవిత్రమయిన మాటలు వాళ్ళలోని అంతఃకలహాలనూ, కృత్రిమభేదాలనూ పోగొట్టి వాళ్ళందరినీ ఒక్కటిగా చేశాయి. ఆమెకు దగ్గరగా ఉన్నవాళ్ళు ముగ్ధులై పోయారు. వాళ్ళముఖంమీద విచారం, కోపంకూడా ప్రత్యక్షంగా కనుపిస్తున్నాయి. దీర్ఘములయిన వాళ్ళ నిశ్వాసాలు ఆమె ముఖానికి కొట్టాయి.

"బెంచీమీదెక్కి నుంచో" అని జనంలోనుంచి ఎవ్వరో ఒక్కకేకపెట్టారు.

"అక్కరలేదు. నన్నిప్పుడే అరెసుచేస్తారు."

"త్వరగా మాటాడెయ్యి. ఇదిగో! వాళ్ళొస్తున్నారు."

"నాయనలారా! ధర్మపథమున నడిచే ఆ యువకులను మీరుకూడా కలుసుకోండి. బీదలకుసరియైన స్నేహితులెవరో తెలుసుకోండి! మిత్రులారా! సమాధానాలకూ రాజీనామాలకూ అంగీకరించకండి! అధికారుల జబర్దస్తీకి లొంగిపోకండి!. ఓకష్టజీవులారా! లేవండి! మీరే ప్రపంచకానికంతా యజమానులు. అందరూ మీకాయకష్టంవల్లనే బ్రతుకుతున్నారు. మీచేత చాకిరీ చేయించుకోవడానికి మాత్రమే మీచేతి కట్లు విప్పుతూ వుంటారు. మీరు బంధింపబడ్డారనేసంగతి మరచిపోకండి. వాళ్ళు మీ ఆత్మలను ధ్వంసంచేసేశారని తెలుసుకోండి! మీరంతా మీ హృదయాలను బుద్ధినీకూడా ఒక్కటిగాచేసి ఒక బ్రహ్మాండమైన శక్తిగా చేయండి. ఆ శక్తికి విజయం కలుగకమానదు. మీకు మీరేతప్ప వేరే స్నేహితులు లేరు. మీకు స్నేహితులైనవాళ్ళంతా జైళ్ళల్లోపడి మగ్గిపోతున్నారు. కూలినాలి జనానికి వాళ్ళు చెప్పేసంగతింతే. మిమ్మల్ని దగాచేసే ద్రోహులిలా చెప్పరు.

"తప్పుకోండి. తప్పుకోండి. దారి! దారి!" అంటూ పోలీసులు క్రమంగా దగ్గరకొస్తున్నారు.

అప్పుడే పోలీసులు చాలామందయ్యారు. జనాన్ని జోరుగా తోసేస్తున్నారు. జనం ఒకళ్ళనొకళ్ళు పట్టుకుని ముందుకీ వెనక్కి వూగులాడుతున్నారు.

"నీసంచిలోవున్న వింతేనా?" అని ఎవరో మెల్లగా అడిగారు.

"అన్నీ తీసుకోండి, అన్నీని" అంది తల్లి బిగ్గరగా. గొంతుక బొంగురుపోయి మాట వణుకుతూ వచ్చింది. మళ్ళీ ఆరంభించి ఇల్లా చెప్పింది.

"మిత్రులారా! నా కొడుకు చెప్పినమాట న్యాయమైన కార్మికుడు చెప్పే మాట. తన ఆత్మను నమ్ముకొని మనిషి చెప్పేమాట. ఆ మాటలో ఉంది ధైర్యమువల్లనే దానిలో ఏవిధమైన మకిలీ లేదని మీకు స్పష్టమవుతోంది. దే నిర్భయమైనది. మీరు దానిని నిష్కల్మషమైన హృదయాలతో స్వీకరించండి

దానినే బాగా మననం చేసుకోండి అదే మీకు సర్వవిషయాలనూ తెలుసుకునే శక్తినీ, సత్యంకోసం, మానవ స్వాతంత్ర్యంకోసం యెటువంటి ప్రబలమైన దానితోనైనా పోరాడేశక్తిని ప్రసాదిస్తుంది. దానిని అందుకోండి. నమ్మండి. దానిని శిరసావహించి సర్వజన సౌఖ్యావహమైన నూతన జీవితాన్ని పొంది సంతోషించండి.

తల్లి గుండెమీద ఫెడేలున ఒక దెబ్బ తగిలింది. దానితో ఆమె గిర్రున తిరిగి క్రిందపడింది. పోలీసులు జనంమీద పడ్డారు జనాన్ని మెడలట్టుకునీ, చొక్కాలు పట్టుకునీ, చేతులు పట్టుకునీ విసిరిపారేస్తున్నారు. టోపీలు మట్టగించేస్తున్నారు. తల్లికి కళ్ళు చీకట్లు కమ్మాయి. ప్రపంచమంతా గిర్రున తిరిగింది. ఈ అలసటను లక్ష్యంచేయక వంట్లో మిగిలున్న శక్తినంతాకూర్చుకుని మళ్ళీ మాట్లాడబోయింది. "మహాజనులారా! మీ సర్వశక్తుల్నీ ఒక్క శక్తిగా చేయండి."

ఒక బలమైన పోలీసు భటుడు ఆమె మెడపట్టీ పట్టుకుని 'నోరుముయ్యి' అని పళ్ళు కొరుకుతూ గజగజా ఊపాడు. ఆమె మెడా, తలా గోడకు కొట్టుకున్నాయి. ఒక్కసారి ఆమె హృదయాన్ని భయం అనే పొగ ఆవహించేసింది, కాని వెంటనే ఒక్కమంట లేచి ఆ పొగనంతా కొట్టేసింది. "పద" అన్నాడు పోలీసు.

మహాజనులారా! దేనికీ భయపడకండి మీ జీవితమంతా మీరు అనుభవించే కష్టాలకన్నా ఇప్పుడెక్కువ కష్టాలు రావు!"

"నోరుముయ్యి. చెప్పండేది నీకు కాదూ?" అని ఒక పోలీసు ఆమె చెయ్యిపట్టుకులాగాడు. ఇంకొకడు రెండోచెయ్యి పట్టుకున్నాడు. ఇద్దరూ గబ గబా ఆమె నవతలికి లాక్కెడుతున్నారు.

"రోజూ మీ హృదయాల్ని పీడిస్తూ, మీ శక్తినంతా లాగేస్తున్న హింసలకన్న బాధాకరమైన హింస వేరే ఎక్కడా లేదు."

గూఢచారి గబగబా పరుగెత్తుకుంటూ వచ్చి పిడికిలితో తల్లి మొగంమీద ఒక్కదెబ్బ కొట్టాడు. "నోరుముయ్ ముసలిపీనుగా!" అని అరిచాడు. ఆ దెబ్బతో ఆమె నేత్రాలు ఒక్కసారి చమక్‌మన్నాయి. దవడలు అదిరేయి. జారు జారుగావున్న నేలమీద నెమ్మదిగా కాళ్ళు నిలదొక్కుకుని తనలో మిగిలున్న శక్తితో ఒక్క కేకేసింది. "పునరుద్ధరింపబడిన ఆత్మను వీళ్ళు చంపలేరు."

"ఛీ కుక్కా!" అంటూ గూఢచారిచేతికి బాగా ఊతం తెచ్చుకుని తల్లి చెంపమీద ఒక్కపెట్టు పెట్టాడు.

ఆమె మొగంమీద రక్తం కాలువలుకట్టింది. రక్తం ఉప్పఉప్పగా ఆమె నోటికి తగిలింది.

జనంగోల యెక్కువైపోయింది. వాళ్ళనేకవిధాలుగా కేకలేస్తున్నారు.

"ఏయ్. జాగ్రత్త! ఆమె వంటిమీద చెయ్యి వెయ్యకండి."

"ఒరే! కుర్రాళ్ళూ!"

"ఏమిటదీ?"

"ఆరి భడవా!"

"అతనికియ్యి"

ఈకేక లామెకెంతో ఉత్సాహం కలిగించాయి.

"న్యాయాన్ని వీళ్ళురక్తప్రవాహాల్లో ముంచెయ్యలేరు. దాని సత్యాన్ని ఆర్పడం వీళ్ళతరంకాదు" అంది.

పోలీసులు తల్లిని మెడమీదా వీపుమీదా పొడిచారు. తలమీదా చేతులమీదా కాళ్ళమీదా గట్టిగా కొట్టారు. ఆమెకు కళ్ళుతిరిగాయి. అంధకారమైపోయింది. ప్రజలకేకలు, పోలీసులఈలలు, మాత్రం చెవుల్లో గింగురుమంటున్నాయి. గభాలున ఆమె గూబమీదేదో మోపైన దెబ్బతగిలింది. దానితో చెవు దిబ్బడేసిపోయింది. గొంతుకలో ఉక్కిరిబిక్కిరైంది. కాళ్ళు చచ్చుబడిపోయి నిలబడలేకపోయింది. శరీరమంతా బరువెక్కింది. అంగిడి మంటలెత్తాయి. ఒళ్ళంతా గడగడ వణికింది. కాని ఆమె కళ్ళల్లోవుండే కళమాత్రం చల్లారలేదు. ఆకళ్ళతోనే జనంయొక్క ఉత్సాహాన్ని ధైర్యాన్ని కనిపెడుతూంది.

తల్లిని ఒక తలుపు దగ్గరకు తోశారు. పోలీసులుపట్టుకున్న చేతిని గభాలున విడిపించుకుని తలుపు గడియను పట్టుకుని ఇల్లాఅంది "రక్త సముద్రాల్లో నయినా మీరు సత్యాన్ని ముంచలేరుసుమా..............."

గభాలున ఆమె చేతిమీద ఒక దెబ్బపడింది. "ఓరి మూర్ఖుల్లారా! మీరు అసత్యాన్నీ ద్వేషాన్నీ మూటకట్టు కుంటున్నారు. అంతే, ఇంత కింతా మీ కనుభవం కాకపోదు." ఎవడో ఆమె గొంతుకపట్టుకొని నొక్క నారంభించాడు. ఆమె ఉక్కిరిబిక్కిరయింది. ఆమె గొంతుకలో ఏదో గుటగుట లాడింది. "ఓ–రీ–దౌ–ర్భా–గ్యు–ల్లా–రా............"

---

సంపూర్ణము

# దేశీప్రచురణలు

# రాజకీయాలు

| | | |
|---|---|---|
| గాంధీ ప్రణాళిక | (అగర్‌వాలా) | 1–12–0 |
| గాంధీ రాజ్యాంగం | ( ,, ) | 1– 8–0 |
| విద్యార్థుల నిర్మాణ కార్యక్రమం | | 0– 8–0 |
| రైతులు కమ్యూనిస్టులు | (రంగా) | 1– 8–0 |
| జాతీయ విప్లవం పంథా | ,, | 1– 0–0 |
| పాకిస్తాన్ | ,, | 0– 8–0 |
| కాంగ్రెస్‌కే మీఓటు | (డా. పట్టాభి) | 0–10–0 |
| యుద్ధానంతర విప్లవం | (కామత్) | 0–12–0 |
| నిర్మాణ కార్యక్రమం | | 0– 8–0 |
| అరుణా అసఫాలీ | (ప. కామేశ్వరరావు) | 0–12–0 |
| ప్రజానాయకుడు ప్రకాశం. | | 0–12–0 |

ప్రజాశక్తి ప్రెస్, బెజవాడ. T/C 163 ది 28–10–46 కాపీలు 1500.



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRLA 10B182 |
| పుస్తకం పేరు | Good |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 325 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |